యుపాయము దెల్పియుండునుగాని పద్యగద్యరచన మాత్రముగావించి యుండఁడని తోఁచుచున్నది. ఈ యూహాయందలి యౌచిత్యమునకు విద్వల్లోకమే ప్రమాణము.

ఇట్లు నిరహంకారుఁడు నిత్య సత్య వచనుఁడునని తెలియుచున్న మనకవిబ్రహ్మయగు విపుల శబ్దశాసనుఁడు దానారంభించిన యుత్తమ గ్రంథము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తి నొందుటకై బ్రహ్మ విష్ణు మహేశ్వర స్మరణ పూర్వకముగా భారతకథా శ్రవణ పఠనతత్పరుల నాశీర్వదించుచు దేవభాష నిట్లు మంగళాచరణ గావించియున్నాఁడు.

శా॥ శ్రీవాణీ గిరిజా శ్చిరాయదధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంస యోగోద్భవాం
తే వేదత్రయ మూర్తయ స్త్రీ పురుషాస్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీకంధరా శ్శ్రేయసే ॥

అశీర్వాదముగాని దేవతా నమస్కారముగాని వస్తునిర్దేశము గాని కావ్యము మొదలనుండవలయు ననెడి లక్షణమున కనుగుణముగా నేదయిన నొకదానిని సంస్కృత కవులందఱు తమకృతుల మొదలఁ జేర్చుట యాచారమేకాని యాశీర్వాద రూపమయిన మంగళాచరణ మును వారయిన రూపకముల మొదలనేకాక యిట్లు శ్రావ్యపాఠ్య కావ్యంబుల యారంభంబునఁ గావించినట్లు గానరాదు. మఱియు దృశ్యకావ్యములయందలి నాంది కవివచనముగా నుండక సూత్ర ధారోక్తిగా నున్నట్లే యిందును బైశ్లోకము కృతినాయక కర్తృకము గానుండుటయు నూతనవిషయమే. కావున దీనింబట్టి నేనొక యంశము నీక్రిందివిధముగాఁ జమత్కృతికై యూహించుచున్నాను.

"అర్థతశ్శబ్దతశ్చాపి మనాక్కావ్యార్థసూచన" మ్మను లక్ష ణము ననుసరించి రూపకములయందలి నాందీశ్లోకము రచింపఁబోవు కావ్యార్థము నించుక సూచింపవలయునని యున్నది. దీనికిఁ దగినట్లుగా నిమ్మహాభారత నాందియందుఁగూడ నట్టిదియించుక గానవచ్చు

చున్నది. ఇది రాజనరేంద్రుని వచనముగదా ! ఆంధ్రలోకాభ్యుదయము నభిలషించు నమ్మహారాజు, వేదమూర్తులయి బ్రహ్మవిష్ణు మహేశ్వరులనెడి త్రిపురుషులు మీ శ్రేయస్సునకయ్యెదరుగాక యని యాశీర్వదించుటలో "ఓ యాంధ్రదేశీయులారా ! వేదమూర్తులయిన (నన్నయ తిక్కన యెఱ్ఱనార్యులనెడి) త్రిపురుషులు మీకు భారతాంధ్రీకరణరూపమైన శ్రేయంబు నొసంగెదరుగాక" యనెడి యర్థము దైవికముగా సూచింపఁబడినట్లున్నది.

ఇందులకు నాంధ్రసత్కవితా సృష్టికర్తయై వాగనుశాసనుఁడైన నన్నయార్యునందు బ్రహ్మాంశమును, కవిత్వస్థితిపరాయణుండై వైదికమార్గనిష్ఠుఁడై సోమయాజియైన తిక్కనార్యునందు విష్ణ్వంశమును, భారతసమాప్తికారుఁడై ప్రబంధపరమేశ్వరుఁడైన యెఱ్ఱనార్యునందు మహేశ్వరాంశమునుండుట యార్యసమ్మతమేకదా! కావునఁ బై శ్లోకమునం దాంధ్ర భారతరచన విషయకమయిన సూచ్యార్థమిట్లుండుటంబట్టియే కాఁబోలు భారతమును ముగ్వురు తెలిఁగింపవలసి వచ్చినది !

మఱియు నాంద్యన్తమున - అని... స్తుతియించి రాజనరేంద్రుండు... వేఁగీదేశంబునకు నాయకరత్నంబుంబోని రాజమహేంద్రపురంబునందు... విద్వజ్జనంబులుగొలువ... సుఖోపవిష్టుండై యొక్కనాఁడు... నన్నపార్యుఁజూచి... మహాభారతబద్ధ నిరూపితార్థమేర్పడఁ దెనుఁగున రచియింపుము... అని యానతిచ్చినవిని యక్కవివరుండు మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె... తత్కథా ప్రారంభం బెట్టిదనిన అనుచు గ్రంథావతారిక యే బెడదయులేక యత్యంత సహజముగా నుండుటయు నూతన విషయమే. ఇట్లు పూర్వంబు సాజంబు నగు పద్ధతిని గావ్యారంభము గావించిన యమ్మహానుభావు నన్నయార్యుని, త్రిలింగదేశమున నభీష్టార్థ కల్పలత యనఁదగిన యాంధ్రమహాభారత సంహితను నిలిపిన మహాయశస్సు నార్జించిన రాజరాజనరేంద్రుని మనసార ధ్యానించి యీ వ్యాసము ముగించుచున్నాఁడ.

——

# ఆంధ్ర మహాభారతావతారికా మీమాంస

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు.

ఆంధ్ర మహాభారతావతారికను జూడ సహజముగ నొక సందియము వొడమును. అది యవతారికా కర్తృత్వమును గుఱించినది. నన్నయ తానై యీ యవతారికను రచించెనా ? లేక తరువాతి కాలమున మఱొక రెవరేని రచియించిరా ?

నన్నయ స్వయముగ రచియించి యున్నచో నది ప్రథమ పురుషయందేల యుండవలయును ? అట్లు రచియించుటకు కారణమేమి? పూర్వకవి సంప్రదాయమా ? లేదే !

నన్నయ విరచిత మహాభారత భాగమునకు కృతిపతి రాజరాజ నరేంద్రుడనునది నిర్వివాదము. మరి యవతారికయందు కృతి సమర్పణ ముండి తీరవలయునుకదా! ఎందుచేత నన్నయ్య అట్లు గావింపలేదు ? ఈ విషయమున శ్రీయుతులు జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారి యభిప్రాయ మిది.

"రాజరాజు నన్నయతో 'మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్' అని మాత్రమే యనెను. కాని 'రచియించి దానిని నా కంకితమిమ్మ'ని యతఁడు నన్నయను అడిగినట్లులేదు. రాజరాజు తేలలేదు కాని యతనిలోఁ కృతిపతిత్వాకాంక్ష యుండి యుండదా ? రాజరాజున కంకిత మిచ్చితినని మెచ్చుటను నన్నయయుఁ బైకిఁ దేలలేదు. కాని కృతిపతికిఁ దక్కవలసిన మరియాదలన్నియు నతని కతఁడు గ్రంథమునఁ జెల్లింపనే చెల్లించెను ఆశ్వాసారంభములందును, నాశ్వాసాంతము

లందును, రాజరాజ ప్రశంసాస్పదములగు పద్యములను రచించియే యుండెను. కృతి రచనకుఁ గృతి స్వీకారమునకు నదియే మొదలుగదా! స్పష్టముగాఁ గృతి నిమ్మనుటయు, నిచ్చుటయుఁ దరువాతి కాలమున నేర్పడియుండునుగాని యా కాలమునఁ గృత్యభ్యర్థనా ప్రదానముల స్వరూపము యిటులే యుండెననుకొన వలయును."

మృత్యుంజయరావుగారు తమ యనుమానమునకు తగిన సమాధానము దొరుకనందున నట్లు తేల్చివైచితిరిగాని యట్లుకాదు. అవతారికయందలి ప్రథమ పురుషకు వారి యనుమానమునకు సంబంధము కలదు.

ఈ ప్రథమ పురుష ప్రయోగము మున్ను సంస్కృత సాహిత్యమున కాని, తరువాతి తెలుఁగు సాహిత్యమునందుకాని కానము. కవిజనాశ్రయమునందు కలదు. కాని దాని విషయము వేరు. దాని కర్తృత్వమును గూర్చి యనేక వివాదములున్నవి. ఆ విషయమును 'వేములవాడ భీమకవి' పూర్వాశ్రమములో మల్లియరేచనా!" అను నా వ్యాసమున విపులముగ చర్చించితిని. ఇరువురును నొకరేయని నా యభిప్రాయము. మల్లియరేచనకు సమకాలికుఁడైన నన్నెచోడుడు నన్నయ కొకింత పూర్వుడనియు నా యభిప్రాయము. నన్నెచోడుఁడసలు కుమారసంభవమును వ్రాయలేదనియును, అది మానవల్లి రామకృష్ణకవిగారి కల్పనమనియును, ప్రకటించిన డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారి యభిప్రాయముతో నే నేకీభవించను. వారు చూపిన యుపపత్తులన్నింటను అనుమాన ప్రమాణమే ఎక్కుడగుట అందుకు కారణము. అందువలన కృతి రచనకుఁ గృతి స్వీకారమునకు అదియే మొదలు గదాయను మృత్యుంజయరావుగారి సమాధానము స్వీకార యోగ్య మనిపించుటలేదు.

అవతారికను సూక్ష్మముగ పరిశీలించిన యెడల '(శ్రీ) వాణీ గిరిజాశ్చిరాయ...' అను మంగళశ్లోకానంతరం 'అని సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమా వాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్య ప్రవర్ధమాన మహామహీ రాజ్యవిభవుండును...' అని కృతికర్తయగు రాజరాజ నరేంద్రుని వర్ణనము నడచును. మంగళ శ్లోకమందలి విషయము వచనమున పునరావృత్తమైనది. అంతియేగాక త్రిమూర్తుల క్రమము మారినది, ఏ ప్రయోజనము నాశించి యట్లు మారియుండును ?

ఇటీవలి ఆచార్య పెన్మత్స వెంకట్రాజుగారి పరిశోధనమునుబట్టి పై మంగళ శ్లోకమున (శ్రీ) చక్రార్చనము గలదు. చాళుక్యులు (శ్రీ) విద్యోపాసకులు. అవసర మనుకొనినచో గుప్తముగానున్న ఆ శ్లోకార్థమును వచనమున స్పష్టము చేయవలయును కాని యట్లు జరుగ లేదు. తిక్కన గావించిన కృతి నిర్మాణ ప్రస్తావనము జూడుడు. '(శ్రీ)యనగౌరి నాఁ బరఁగు...'అను ప్రార్థనా పద్యానంతరము 'అని సకల బ్రహ్మప్రార్థనంబుసేసి...' అనుచు వెంటనే ప్రస్తావనా విషయమునకు సాగును.

అవతారికయందట్లుగాక ప్రారంభమందు నుతింపబడిన హరిహర హిరణ్య గర్భాదులు మరల ముగింపులో హరిహరాబ్జ గజాననాదులందు ప్రార్థింపఁబడిరి. ఆలోచింప నీ రెఁడు ప్రార్థనా భాగములకు నడుమనున్న భాగమంతయును ప్రక్షిప్తముగనే తోచుచున్నది. రాజరాజును గూర్చి యెడనెడ నన్నయచెప్పిన కొన్ని పద్యములందు పొదగబడి యుండవచ్చును గాక.

కాళిదాసు, భవభూతి, మాఘుఁడు మున్నగు సంస్కృత కవుల కొక యాచారమున్నది. మంగళశ్లోకానంతరమో, లేక తదర్థానంతరమో నేరుగా కథలోనికి వెళ్ళుదురు. కృతి సమర్పణాదులుండవు.

నన్నయగారి మంగళశ్లోకమును జూచినపుడట్లే యనిపించును. అతడా యవతారికను వ్రాసియుండలేదా? కాని ఆశ్వాసాది, ఆశ్వాసాంత పద్యములను జూడ తెలుగుకవి నన్నెచోడుడు అనుసరింపబడి యుండ వచ్చు ననిపించును.

నన్నెచోడుని యందొక విశేషముకలదు. కృతిపతి, కథానాయ కుల యభేదకత్వమువలన ఆశ్వాసాద్యంతముల యందలి పద్యములు ప్రత్యేకించి వ్రాయఁబడి నట్లుండవు. ప్రతి ఆశ్వాసమునకును మొదలు తుదలందు కథానాయకుడైన పరమశివుని ప్రస్తావనము వచ్చును. కథానాయకుఁడే కృతిపతి. కథానాయకుని వర్ణించుమైపమున కృతి పతిని వర్ణించి ఆశ్వాస సంధి పద్యములనేక విభక్తికముల గావించి ఒక విలక్షణమైన పద్ధతిని యనుసరించెను. పంపాది కన్నడ కవులీ విషయ మున నీతనికి మార్గదర్శకులై యుండవచ్చును. లేదా మతకలహము లందు నశించిన పూర్వాంధ్ర సాహిత్యమున నిది సామాన్యము కావచ్చును

ఏది యెటులున్నను నన్నయ తన గ్రంథమునందు ఆశ్వాసా ద్యంతముల కృతి పతిని పొగడి యున్నందున అవతారికను కూడ వ్రాసియే యుండనగును. కాని మన ముందున్న యవతారిక మాత్ర మతఁడు వ్రాసినదికాదు. అట్లనుటకు మరికొన్ని యాధారములను పరిశీలింతము.

ఆశ్వాసాద్యంతములందెక్కడను నన్నయ రాజరాజనరేంద్రుని రాజమహేంద్రవర పాలకునిగ పేర్కొనలేదు. ఆదిపర్వ ప్రథమా శ్వాసాంతమందు 'నిరవద్య నరేశ్వర' అనియు. ఆదిపర్వ పంచమా శ్వాసాంతమందు 'నిరవద్యయువతీ మదన' అనియు, ఆదిపర్వాంత మందు 'నిరవద్య రవిప్రభ' అనియు రాజరాజ నరేంద్రుడు వర్ణింపఁ

బడెను. ఆదిపర్వ ద్వితీయాశ్వాసాంతమందు మాత్రము 'రాజ మహేంద్ర కవీంద్ర సమాజ సురత్నాజ' అని కలదు. కాని రాజరాజ నరేంద్రుని 'రాజమహేంద్ర' యని సంబోధించుటకలదు. అట్టి సంబోధనము ఆదిపర్వ సప్తమాశ్వాసాంతమునందు కాననగును. కావున పై వర్ణనమును 'రాజమహేంద్ర! కవీంద్ర సమాజ సురత్నాజ'అని చదువనగును. అప్పుడు ఆశ్వాసాద్యంతము లందెచ్చటను రాజరాజ నరేంద్రుడు రాజమహేంద్రవర పాలకుడుగా పేర్కొనబడనటులే. అనగా నన్నయ తన ఆంధ్ర మహాభారతమును రచించు సమయము నకు రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును చేరియుండడు. బహుశః అప్పటికి వేంగీ రాజధాని బెజవాడనుండి నిరవద్యపురము (నిడదవోలు)నకు మారియుండును. నాటి చరిత్రమంతయు నేటి చరిత్ర కారుల యూహానిర్మితమే. గావున రాజరాజనరేంద్రుడు తన రాజ ధానిని రాజమహేంద్రవరమునకు మార్చుటకు ముందు కొన్ని సంవ త్సరములు నిరవద్యపురమునుండి యుండుననుకొన వచ్చును.

అతడు రాజమహేంద్రవరమును నిర్మించెనని కదా చరిత్ర కారుల అంచనా! కాని అది పూర్తిగా అబద్ధమని కొందరు పరిశీలకుల యభిప్రాయము. శ్రీ సారంగు లక్ష్మీ నరసింహారావు గారు తమ 'నన్నయ' అను గ్రంథమందు నన్నయ తణుకువాడనియు, నాటి చాళుక్య రాజధానీ నగరము నిరవద్యపురమనియు ధృవీకరించిరి. నిరవద్యపుర విషయమున వారిచ్చిన వివరణమును పరిశీలింపుడు.

"రాజనరేంద్రుని రాజధాని యిప్పుడు నిడదవోలు అనియున్న నిరవద్యపురము. అతని స్థిరనివాసము అక్కడనే. అతనికేగాదు, పూర్వచాళుక్యులలో మొదటి చాళుక్యభీముని నుండి వచ్చిన వార లందరును నిరవద్యపురముననే యుండుచున్నట్లు శాసననిదర్శనము లున్నవి. కాని వారికి అధికారిక రాజధాని వేంగియే! అక్కడనే,

చిత్రరథస్వామి సన్నిధినే పూర్వసాంప్రదాయానుసారము వారి పట్టాభిషేకములు జరుగుచుండెను. దక్షిణదేశపువారైన కులోత్తుంగుని కుమారులు తమ రాజధానిని జననాథపురమునకు మార్చువరకు వేంగియే వారి రాజధాని. నివాసము నిరవద్యపురము. జననాథపురమును నిరవద్యపురము దగ్గరనే యున్నది."

అందువలన రాజమహేంద్రవరమును నిర్మించినదెవరో ఖచ్చితముగ చెప్పుటకు వీలులేదు. ఇంతవరకు సరియైన నిర్ణయము జరుగలేదు. కీర్తిశేషులు కాశీభట్ల బ్రహ్మయ్యగారు తమ "నన్నయ భట్టారక చరిత్రము"నందు తొల్లి యాంధ్ర దేశాధీశుఁడగు గౌతమదేవుండు గోదావరీ తీరమందుగల భూమినంతను నాక్రమించెననియు, అతని పుత్రుఁడగు మహేంద్రదేవుఁడు రాజమహేంద్రవరమును కట్టించెననియు యీ దేశమున ప్రతీతికలదు' అని వ్రాసియుండెను. అదియే నిజమైనచో రాజరాజనరేంద్రునకు ఏడెనిమిది వందల సంవత్సరములకు పూర్వమే రాజమహేంద్రవరము నిర్మింపఁబడి యుండవలయును. అంతేగాక కనింగ్ హామ్‌గారు తమ భారత భౌగోళిక చరిత్రయందుదహరించిన 'దంతపురము' రాజమహేంద్రవరమేయని శ్రీ యాతగిరి రామనరసింహారావుగారి యభిప్రాయము మూఁడవ గోదావరి వంతెనకు దగ్గరలో గోదావరీ తీరమున కనిపించు పెద్ద దిబ్బను త్రవ్విన యీ విషయము బయటపడునని వారి నమ్మకము. అది బుద్ధుని దంతములను భద్రపరచిన బౌద్ధస్థూపమని అనుమానము. త్రవ్వకములు జరిగి పై విషయము తేలిన యెడల రాజమహేంద్రవర చరిత్ర యింకను ఆరేడు వందల సంవత్సరముల వెనుకకు నడచును. కాబట్టి రాజరాజనరేంద్రునకు, రాజమహేంద్రవరమునకు నెట్టి సంబంధమును లేనట్లు స్పష్టమగుచున్నది.

నిరవద్యపురమును కేంద్రముగ చేసికొని దక్షిణ వేంగీ

సామ్రాజ్యమును పరిపాలించుకొను నాటికి రాజరాజనరేంద్రుని యాస్థానమున సోమేశ్వరుని రాయబారి నారాయణభట్టు ప్రవేశించి యుండెను. అతడు కావించిన సంధిఫలితముగ పూర్వ చాళుక్య, పశ్చిమ చాళుక్య, చోళరాజ్యములమధ్య యుద్ధములు ముగిసి కొంత శాంతి నెలకొన్నది. అట్టి తరుణమున నన్నయ తణుకులో యజ్ఞము గావించి వైదికధర్మ ప్రబోధనా లక్ష్య లక్షితుడై రాజరాజనరేంద్రుని కోరికను పురస్కరించుకొని, నారాయణభట్టు అండనుంచుకొని ఆంధ్ర మహాభారత నిర్మాణమున కుద్యుక్తుడాయెను. కనుకనే నన్నయ రాజరాజనరేంద్రుని నిరవద్య పురాధీశ్వరుడుగా పేర్కొనెను.

వాస్తవిక మిట్లుండ నవతారికయందు నన్నయ మహాభారత రచనా కాలమునకు రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రవరమును పాలించుచుండిన యట్లు స్పష్టముగాకలదు. 'మను మార్గుండగు విష్ణు వర్ధనుండు అఖిల జలధి వేలా వలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేంగీదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్ర పురంబునందు మహేంద్ర మహిమతోఁ బరమానందంబున నవరత మహామహీరాజ్య సుఖంబు అనుభవించుచుండె'నని యవతారిక యందున్న విషయము. ఆశ్వాసాద్యంతముల పద్యముల బట్టి మన మూహించిన దానికివి పూర్తి వ్యతిరేకము. ఇందేదియో ఒకటి నన్నయ కృతము కానిదై యుండవలయును. అట్లుకానిది ఆశ్వాసత్రయము కాదు కదా!

దీనిని బట్టి అవతారిక నన్నయ కాలమునగాక ఆ తరువాత ఎప్పుడో వ్రాయబడి యుండవలయును.

"నానా రుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు..." అని తన్ను దాను పొగడుకొనిన నన్నయ తన వంశమును గురించి ప్రస్తావింపక పోవుటయు అతడా యవతారికను వ్రాయలేదనియే తెలియజెప్పు చున్నది. అంతియేగాక—

"ఆదరణీయ సార వివిధార్థ గతి స్ఫురణంబు గల్గియ
ష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు
దక్షతన్"

అను తిక్కన సోమయాజి రచనమును బట్టి నన్నయ మూఁడు పర్వములను పూర్తి చేసియే యుండును. ఏదియో అటుల చెప్పినాడని తీసివేయుట యొక సోమయాజి సత్యశీలతను, అవధానమును శంకించి నట్లె కాగలదు. అతని కాలమునకు పూర్తిగ లభించిన నన్నయకృత పర్వత్రయ గ్రంథము ముందు వెనుకలు కారణాంతరమున తదనంతర కాలమున కొంత శిథిలములై యుండవచ్చును. వెనుక భాగమును యెఱ్ఱాప్రెగ్గడ పూరించిన విషయ మెల్లరకును విదితమే. అందుల కాధారములు స్పష్టములు. కాని ముందుభాగమగు అవతారికా భాగము విషయము అస్పష్టము.

నన్నయ భారత భాగమట్లు శిథిలమగుటకు గల కారణములు కొంత చర్చింపవలసి యున్నది. వెనుక భాగము శిథిలమగుటకు కీటకములు కారణమని కొందరు విమర్శకుల యభిప్రాయము. అట్లు కాద నను కాని యెఱ్ఱన పద్యమందలి ధ్వనిని యాధారముగ జేసికొని యూహించిన పై కారణమున కంటె భిన్నమైన కారణమింకొకటి కలదు. నన్నయ గ్రంథ రచన మాగిపోవుటకును, వ్రాసినది శిథిల మగుటకును గల ముఖ్యకారణ మానాటి మతకలహములై యుండ వచ్చును.

గుణ కర్మలను కాలదన్ని కేవలము పుట్టుకను ఆధారముచేసి కొన్నందువలన నిర్వీర్యమైన వర్ణవ్యవస్థ, దానిపై నిర్మింపబడిన వైదిక సంప్రదాయములు పరిజాదరణమును గోల్పోవు సమయమున

బౌద్ధ మావిర్భవించినది. కాలగమనమున తిరిగి యందేర్పడిన కలహ ముల కారణమున జైనము విజృంభించినది. దక్షిణ భారతమున కది పరాయిదివలె కన్పించుట వలన యిచ్చటి వైదిక సంప్రదాయములకు వ్యతిరేకముగ శాక్తేయము, వీరశైవములలో తిరుగుబాటు ధోరణులు తలయెత్తినవి ఆంధ్రదేశమెప్పుడు పై మతముల సంఘర్షణములకు రంగ భూమియైనది. అట్టి సమయమున వైదిక మార్గానుయాయులైన చాళుక్య ప్రభువుల మిగిలిన మతములను అణచబూనిరి. వైదిక సంప్ర దాయ ప్రచారమునకై ఉత్తమ సాహిత్యమును సృష్టింపవలసినదిగ తమ యాస్థాన కవులగు నన్నయాదులను ప్రోత్సహించిరి. ప్రజలను తమకు వ్యతిరేకముగ తయారుచేయుచున్న యితర మతముల ప్రచా రకులను, వారి సాహిత్యమును నాశనము చేయించిరి. ఆనాటి పరిస్థితుల కటువంటి తీవ్రచర్యలు తప్పనిసరికానోపు. నూతన రాజ్య నిర్మాణ ములందును,ఉన్న వాటి నిర్మూలనము నందును మతాధిపతులు ప్రధాన భూమికలను నిర్వహించిన రోజులవి.

చాళుక్య ప్రభువుల పనుపున నన్నయ గావించిన పరమత దమన కాండలో అధికముగ నష్టపోయిన మతము జైనము. అప్పటికే వీరశైవులనుండి తీవ్ర ప్రతిఘటనము నెదుర్కొనుచున్న జైనము నన్నయాదులచేత పూర్తిగ దెబ్బతిన్నది. సామాన్యుల కొఱకు వారు నిర్మించిన తెలుగు సాహిత్యము తుడిచిపెట్టుకు పోయినది. వైదికాచా రములను హేతువాద దృష్టితో విమర్శించిన వీరశైవాదులకు సహి తము దాదాపు యిట్టి గతియే పట్టినది. అవి మొదట హేతువాద దృష్టితో బయలుదేరినప్పటికి రానురాను వానియందు మూర్ఖత్వము బలసినందున ప్రజలుకూడ ఆ మతములను ద్వేషించిరి. అందువలన నన్నయాదుల ప్రయత్నములు కొంతవరకు ఫలించినవి. ఇది యంతయు చరిత్ర చీకటి పుటలను తడవిన మనకు లభించు అస్పష్ట సమాచారము.

నన్నయ రచనమున కనిపించు బ్రాహ్మణోత్కర్షయే పై విషయము లను మనము నమ్మవలసి వచ్చుటకు గల పెద్ద యాధారము.

ఈ బ్రాహ్మణోత్కర్ష విషయమై రేగిన దుమారమునకు శ్రీయుతులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు సమాధాన మిచ్చుచు 'భూనుతకీర్తి! బ్రాహ్మణుఁడు పుట్టిన తోడనే పుట్టు నుత్తమ జ్ఞానము' అను అమూలకమైన నన్నయ బ్రాహ్మణ ప్రశంసకు అనుశాసనిక పర్వము నుండి ఆధారముచూపి సమర్థించిరి. మూరు మూలలనుండి తనయుద్దేశమున కనువగు విషయముల నేరుకొనిన నన్నయ అదే యనుశాసనిక పర్వమునుండి బ్రాహ్మణుని నిజతత్త్వమును వివరించు.

"స్వభావః కర్మచ శుభం, యత్ర శూద్రేఽపి తిష్ఠతి ।
విశిష్టస్స ద్విజాత్ర్వై విజ్ఞేయ ఇతిమే మతిః ॥
నయోని ర్నాఽపి సంస్కారో నశ్రుతం నచసన్తతిః ।
కారణాని ద్విజత్త్వస్య వృత్తమేవతు కారణమ్ ॥
సర్వోఽయం బ్రాహ్మణో లోకే, వృత్తేన తు విధీయతే !
వృత్తే స్థితస్తు శూద్రోఽపి బ్రాహ్మణత్వం నియచ్ఛతి ॥
బ్రహ్మః స్వభావః సుశ్రోణి సమః సర్వత్ర మే మతిః ।
నిర్గుణం నిర్మలం బ్రహ్మ యత్ర తిష్ఠతి సద్విజః ॥

మున్నగు వివరణములను యెందులకు స్పృశింపనట్లు ?

నన్నయ జన్మను ఆధారముగ చేసికొనిన వర్ణవ్యవస్థను సమ ర్థించుచు వ్రాసిన కావ్యములు అందుకు వ్యతిరేకించు యితర మతములు వారికి బాధాకరములైనవి. అంతియగాక వారిపైనను, వారి వారి సాహిత్యముపైనను నన్నయ గావించిన దౌర్జన్యకాండ సహింపలేని నది. అప్పటి జైనులయు, వీరశైవులయు ప్రతాపములందరెరిగి నవియే కదా! శాపానుగ్రహ సమర్థులగు కొందరి చేతిలో నన్నయ భట్టు కాయువు చెల్లియుండుననినను ఆశ్చర్యపడ నవసరములేదు.

అంతియే కాదు. వారు జరిపిన ప్రతిక్రియలో నన్నయాదులు నిర్మించిన సాహిత్యమంతయు నశించి యుండును. రాజరక్షణ ముండుట వలన, ఆంధ్ర మహాభారత భాగమైనను ఒక ప్రతి మిగిలినది. అదియైనను పై ఘర్షణముల ఫలితముగ భద్రముగ నుండుటకు వీలులేదు. శత్రువులచేత గావచ్చును, శత్రువులనుండి రక్షించు ప్రయత్నములందు అతి భద్రముగ దాచుట వలన కొన్ని సంవత్సరముల తరబడి కదప కుండ యుంచినందున పురుగుల ప్రభావము కావచ్చును – మొత్తము మీద ఆద్యంతములు దెబ్బతిన్నవి. రాజాదరణము బ్రాహ్మణ పక్ష మందుండుట వలన జీర్ణవైదిక ధర్మరక్షా దీక్షితులగు బ్రాహ్మణులు తమ సాహిత్యము కొంత శిథిలమైనను పునర్నిర్మించుకొన గలిగిరి. నష్ట సాహిత్యులగు యితర మతములవారు కొందఱు కాలగమనమున తెరమరుగైరి. కొలదిమంది ప్రజలమధ్య కొంతకాలము జీవించియున్న ప్పటికి చరిత్ర వారిని గమనింపలేదు. క్రమక్రమాభివృద్ధి నందిన బ్రాహ్మణ పక్షపాత ఫలితముగ జీర్ణమైన నన్నయ కృత మహాభారత భాగము పునరుద్ధరింపబడినది. బ్రాహ్మణేతరుల గ్రంథములణగ ద్రొక్కబడినవి. నన్నయ ఆదికవియైనాడు.

చరిత్రమున కందినంతవరకు నన్నయకు ముందున్న కవి నన్నెచోడుడు. కాగా అతడు, ఆతని గ్రంథము కుమారసంభవము మొన్న మొన్నటి వరకును వెలుగు చూడలేక పోయినది అందుకు కారణము అతడు బ్రాహ్మణేతరుడగుటయే. మల్లియరేచన బ్రాహ్మ ణావతారమెత్తినందున కొంతవఱకు నిలబడ గలిగినాడు. కుమ్మరి మొల్ల: చామకూర వెంకటకవి మున్నగు బ్రాహ్మణేతరు లెంతటి గడ్డు పరిస్థితుల నెదుర్కొనిరో మనకు తెలిసిన విషయమే.

శ్రీశ్రీకి ముందున్న దంతయు అంధకారమేనని ఒక మహానీ యుడు నుడివినట్లు నన్నయకు పూర్వమసలు తెలుగున సాహిత్యమే

లేదని వాకుచ్చు ప్రబుద్ధులు కలరు. కాని విజ్ఞులట్లు భావింపరు. ప్రముఖ భాషాశాస్త్రజ్ఞులు, చరిత్రకారులునైన ఎస్. కె. ఛటర్జీగారు యీ విషయమును ప్రస్తావించుచూ సింధులోయ నాగరికతకు సరిసమానమైన తుంగభద్రలోయ నాగరికతను కలిగిన తెలుగుజాతి నిన్న మొన్నటి నన్నయ తెలుగున దేవభాషను మేళవించి కవిత్వము చెప్పు వఱకును తన స్వంత సాహిత్యమును నిర్మించుకొనలేదనుట హాస్యాస్పదమనిరి. తెలుగు సాహిత్య చరిత్రమును రచించిన జి. వి. సీతాపతిగారు సహితము తెలుగుదేశమున నన్నయకు ముందు జైనులు కొన్ని గ్రంథములు రచించిరనియును, వారితోపాటు వారిగ్రంథములు నాశనము చేయబడిన వనియును, వాటి సహాయసంపత్తులు లేనిదే నన్నయ ఒక్కసారిగ అంతటిమహాకవి కాగలిగెడివాడు కాదనియును వ్రాసియుండిరి. ఎఱ్ఱన తన నృసింహపురాణమున నన్నయకుముందున్న సాహిత్యమును సూచనప్రాయముగ తెలియజేసెను. నన్నెచోడుడు తనకు ముందుగల సాహిత్యమును మిక్కిలి దక్షతతో విమర్శించి యుండెను.

కాబట్టి నన్నయను ఆదికవిని చేయుట, బ్రాహ్మణాధిక్యమును కాపాడుట, జీర్ణభాగమును పూరించుట యను నీమూడు ముఖ్య ప్రయోజనముల నాశించియే భారతావతారిక మార్చబడినదని నా యభిప్రాయము.

ఇంతటి వివాదాస్పదమైన ఆంధ్ర మహా భారతావతారికను మార్చి, లేక కల్పించి వ్రాసిన వారెవ్వరై యుందురనునది కూడ పరిశీలింప వలసిన విషయమే. తద్రచనయకా వర్ణించు నెఱిగినవాడు కనుక యెఱ్ఱన మొదటిముద్దాయి. అవతారికయందు కాన్పించు నన్నయశైలి యీ యనుమానమునకు బలము నిచ్చుచున్నది. కాని పూరణమునకు వెనుకనున్న యెఱ్ఱాప్రెగ్గడను గుఱించిన వర్ణనము

కూడా ప్రథమపురుషయందే కలదు. ఇది యొక విధముగ పై విషయ మును బలపరచుచున్నది. నా యుద్దేశమున పూరించినకవి తనను గుఱించి చెప్పుకొనుటకు యిష్టపడక మిన్నకుండ వ్రాయనవాడో, లేక యీ విషయ మెఱింగిన తరువాతివారో యెఱ్ఱనను వర్ణించి తద్విషయ మును చెప్పియుండవచ్చును. అతడే అవతారిక విషయమున కూడ కొంత పరిశ్రమించి యుండనగును. కాని, అవతారికయందు విష్ణు పరమేశ్వరులను వర్ణించవలసినయెడల యుపయోగింపఁబడిన 'హరిహర' శబ్దము తిక్కనను జ్ఞప్తికి తెచ్చుచున్నది. ఏదియేమైనను యీ విష యము యిదమిత్థమని తేల్చ వీలుగానిది. అందుకు ప్రత్యేక పరిశోధన మవసరము.

ఇక పోగా యెంతటి మహాకవియైనను, అందులో అతడాదికవి యైనచో తన నూతన ప్రయోగము విషయమున తీవ్ర ప్రతిజ్ఞలు చేయడు. అది వాచాలత్వమగును. కాళిదాసంతటివాడు విజ్ఞులగు పాఠకులు మెచ్చునంతవరకు తన ప్రయోగము సాధువని భావింపనను అభిప్రాయమును వెలిబుచ్చియున్నాడు. అట్టియెడ ఆంధ్ర మహాభార తావతారికను నన్నయ స్వయముగ వ్రాసియుండెనని నమ్మవచ్చునా? అట్లు నమ్మినచో నందలి నన్నయను గుఱించిన విశేషణములు రాజరాజనరేంద్రున కుపయోగింపబడిన విశేషణములతో కలిసిపోవునే!

కృతిభర్త యెడల యవతారిక యందుపయోగింప బడిన విశేష ణము లెంతవరకు సమర్థనీయములో రాజరాజ నరేంద్రుని చరిత్రము జూడ తెలియుచున్నది. అఖిల జలధి వేలా వలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబా వేంగీదేశము! నిజభుజ విక్రమ విరాజితారాతి రాజనివహుండా రాజరాజ నరేంద్రుడు! నానా రుచిరార్థ సూక్తి నిధి యనునదియు నిట్టిదేనా ? నిత్య సత్య వచను డిట్టి యుద్ధములను వర్ణింప గలడా ?

కాబట్టి మంగళ శ్లోకము, మరికొన్ని నన్నయభట్టు యభిప్రాయములు వ్యక్తములగు కొన్ని పద్యములు మినహాయించి మిగిలిన యవతారిక యంతయును నన్నయకు తరువాయి వ్రాయసగాండ్రో, లేక మరెవరో వ్రాసి యుండవలయును, ఇంకను యీ విషయమై విజ్ఞులగు విమర్శకులు నన్నయ మీద తమకున్న భక్తిని కొంత ప్రక్కకు నెట్టి చారిత్రక, హేతువాద దృష్టులతో పరామర్శింతురుగాక !

చూచిన గ్రంథములు —

1. వ్యాస భారతము నన్నయ పరిష్కారము – డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు
2. నన్నయ – శ్రీ సారంగు లక్ష్మీనరసింహారావు
3 నన్నయ భట్టారక చరిత్రము – శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య
4. నన్నచోడుని కుమారసంభవము ప్రాచీన కావ్యము – డా. కొర్లపాటి శ్రీరామమూర్తి
5. హిస్టరీ ఆఫ్ తెలుగు లిటరేచర్ – శ్రీ జి. వి. సీతాపతి
6. ద్వితీయ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక.



# ఆంధ్రవాఙ్మయ వికాస తత్త్వము - ఆంధ్రభారత కావ్యోత్పత్తి

శ్రీ కందుకూరి ఈశ్వరదత్తు

ఏ మానవుఁడైనను దన స్వీయ చరిత్రను వ్రాయబూనుకొనినచోఁ దన కష్టసుఖముల, కలిమిలేముల, గుణావగుణముల నెట్లు పూసఁ గ్రుచ్చినట్లు వక్కాణించునో, యారీతినే సారస్వతమును ఆయాయుగముల రాజకీయ పరిస్థితుల, మతావలంబనముల, సాంఘికాచారముల, మానవ మనోవృత్తుల నన్నింటిని బరిస్ఫుటము గావించును. ఆ యా కాలముల సారస్వతము ఆయా కాలముల స్వీయ చరిత్రియని మా మనవి.

ఒక జాతి వాఙ్మయ స్వరూప పరిణామ తత్త్వనిరూపమున కా దేశజుల రాజకీయమత సాంఘికార్థిక పరిస్థితులను నాగరికాభివృద్ధిని, కావ్యనిర్మాణ సమయములను జక్కగా పరిశీలింపవలెను. అట్టి స్థితిగతు లెప్పు డొకరీతిగా నుండనేరవు.

## కృతికి విచ్ఛేదములేదు

సామ్రాజ్యములు సమసిపోవచ్చును. మత నిర్మూలనము సంస్కర్తలు గావింపవచ్చును. సాంఘిక విప్లవములు సంభవింపవచ్చును. కాని కవి లేఖినికడ్డులేదు. కవియుఁ గృతియుఁ గల్పాంతము వఱకు నివసించువారె. ఈ విషయమై పిన వీరభద్రకవి జైమినీ భారతము ప్రథమాశ్వాసములో మనోహరముగా నిట్లభివర్ణించెను.

ఉ "ఆదట సప్త సంతతులయందును నొక్కొక కాలమందు వి
చ్ఛేదము గల్గు నాఁటికిఁ జెప్ప విపర్యయ మేయుగంబున
న్లేదు కవిత్వసంతతికి నిక్కము తత్కవితా విలాసముల్
జాదులు నిష్టదైవము ప్రసాదము నొ హరికీర్తనంబునన్"

ఇంకొక విశేషము: ఒక మానవుని రూపశీలములు తన జాతి కులమతముల ననుసరించియు, విద్యను బట్టియునుగాక, అన్యజాతి మత కుల సంపర్కముల వల్లను, మనము నిర్ణయింపవలసియున్నది.

అట్లే దేశము యొక్క సారస్వతము ఆ దేశ చరిత్ర ననుస రించియేగాక, విషయాంతర దేశ సంపర్కముచేఁ గల్గిన మంచిచెడ్డల నాశ్రయించి యుండును.

పై కారణముల నాదర్శముగ నుంచుకొని ప్రథమకావ్యమైన భారతోత్పత్తికిఁ గారణములైన పరిస్థితులను సమగ్రముగా బరిశీలిం తము. ఆ కాలము నాఁటి రాజకీయ మత సాంఘిక పరిస్థితులేమి ?

కృతికర్త నన్నయ, కృతిభర్త చాళుక్య భూపాలుఁడైన రాజ రాజు. ఆంధ్ర రాజ్యలక్ష్మి పూర్వ చాళుక్య రాజేంద్రుల భుజముల నాశ్రయించి యుండెను. క్రీ. శ. 973 సంవత్సర ప్రాంతముల రెండవ అమ్మరాజ విజయాదిత్యుని ద్రోసిరాజని, బాదప మహారాజు వేంగీ రాజ్యము నాక్రమించుకొని, యిరువది రెండేండ్లు పరిపాలించెను. అమ్మరాజ సోదరుడైన దానార్ణవుఁడు బాదపుని కడనుండి వేంగీ రాజ్యముఁ గైవసము జేసికొనఁ బ్రయత్నించెను. గాని విఫల మనో రథుఁడయ్యెను. దానార్ణవున కిరువురు నందనులు. అందు ప్రథముఁడు మొదటి శక్తివర్మ, రెండవవాఁడు విమలాదిత్యుఁడు. శక్తివర్మ పశ్చిమ చాళుక్య నృపాలుఁడైన తైలపదేవుని కుమారుఁడగు సత్యాశ్రయుని సహాయముతో నిజదేశముపై క్రీ.శ. 999 సంవత్సర ప్రాంతముల దండు వెడలి, బాదపుని సంహరించి స్వారాజ్యమును దన భుజబలదర్పముచే సంపాదించుకొనెను. కాని శక్తి వర్మ(కు) కష్ట పరంపరకోర్చి సంపాదించుకొనిన పై తృక రాజ్యమును నిలువఁ బెట్టుకొనుటకుఁ దలప్రాణము తోఁకకు వచ్చెను. సామంత నాయకులు రాజ ద్రోహులై చెలరేఁగుటచే శక్తివర్మ తన దండనాయకుఁడైన దాడి

భీముని సహాయముతో విప్లవకారుల నణఁచివైచి దేశ మరాజకము గాకుండఁగ నిలిపెను. శక్తివర్మ పుత్రహీనుఁడై క్రీ. శ. 1011 సంవత్సర ప్రాంతముల స్వర్గస్థుఁడు కాఁగా నతని సోదరుఁడైన విమలాదిత్యుఁడు రాజ్యారూఢుఁడయ్యెను.

ఈ విమలాదిత్యుఁడె భారత కృతిపతియైన రాజరాజు తండ్రి. ఇతఁడు తన మంత్రి శిఖామణియైన వజ్రిప్రెగ్గడ సహాయముతో రాజ్యమునందు శాంతి నెలకొల్పి దేశమును బదునొకండేండ్లు పరిపాలించెను. ఇతఁడు ముమ్మడి భీను బిరుదాంకుఁడు. మొదట శైవమతావలంబకుఁడు. తర్వాత జైనమతమును స్వీకరించెను. ఈతని భార్య చామెకాంబ జైనమతస్థురాలు. ఆ కాలమున విశాఖపట్టణములోని రామతీర్థము జైనమత నిలయము. ఇచట విమలాదిత్యుని జైన గురువైన త్రైలోక్య యోగి సిద్ధాంతదేవుఁ డధివసించుచుండెను. ఆ జైన మతమునకు మహారాజు యాత్రగావించి, ఆ మతమునకు భూరిదానములఁ జేసెను. విమలాదిత్యుఁడు రాజరాజచోడుని కుమార్తెయైన కుందమాంబను బెండ్లాడెను. విమలాదిత్యుఁడు క్రీ. శ. 1022 సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యెను.

తండ్రి మరణానంతరము రాజరాజు సింహాసనస్థుఁ డయ్యెను. ఇతఁడు విమలాదిత్యునకు కుందమాంబ యందు జనించిన సుతుఁడు. విమలాదిత్యుని రాజ్యారంభముననె పూర్వచాళుక్యుల కష్టములు గట్టెక్కెను. చోళులతో సంబంధ బాంధవ్యములు గలసెను. రాజ్యమునందు శాంతి నెలకొల్పుటచే బడుటచే ప్రజల సౌఖ్యమును గాంచుచుండిరి. రాజరాజు తన మేనమామయగు రాజేంద్రచోడుని కుమార్తెయగు అమ్మంగదేవిని వివాహమాడెను. చోళ చాళుక్య బాంధవ్యము వలన పూర్వ చాళుక్య రాజ్యమునకు దక్షిణదిశ నుండి యే మాత్రము నొత్తిడి లేకపోవుటయేగాక చోళమైత్రి పూర్వచాళుక్య రాజ్య

ప్రశాంతికి కారణభూత మగుచుండెను. ఆ కాలముననే తూర్పు గాంగవంశజుఁడగు వజ్రహస్తుఁడు పూర్వచాళుక్య రాజ్యమున కుత్తరమున నున్న కళింగరాజ్యమును బహుసమర్థుఁడై పాలించుచుండెను.

## బ్రాహ్మణ మతోద్ధారణము

రాజరాజు పూర్వచాళుక్య నృపశిఖామణి. ఈ పూర్వ చాళుక్యుల మతమేది? ఆ కాలమున నాంధ్రదేశమునఁ బ్రబలియుండిన మతమేది? ఆంధ్రదేశము జైన బౌద్ధముల కాలవాలమై, బౌద్ధమతాలయములతోను, జైన మఠములతోను నిండి యుండెను. ఆంధ్రదేశమున అమరావతి, విజయవాటిక, రామతీర్థము, ఈ మతములకు కేంద్రస్థానములు. పూర్వచాళుక్య నృపాలురు జైన మతావలంబులై, జైన గురువుల నాదరించి, జైన మఠములకు దానముల గావించి జైన మతోద్ధారకులైరి. విమలాదిత్యుని జైనమతాభిమాన మిదివఱకె తెలిపియుంటిమి. పూర్వ చాళుక్య రాజ్యారంభమున బౌద్ధ జైన మత ప్రాబల్యముచే నార్యమతము క్షీణించి, వైదికమతము ఆంధ్ర భూమండలమున నంతరించిపోవు స్థితికి వచ్చెను. అట్టితఱి కుమారిలభట్టు జైనమత విజృంభణము నణచివేసి వైదికమతోద్ధరణమును గావించెను. రాజరాజు కాలము నాఁటికి తెలుఁగుదేశమున వైదికమతము వ్యాప్తిచెందెను. చాళుక్యులు మొదటి నుండియు బ్రాహ్మణ భక్తులుగ నుండిరి. వీరి శాసనములలో పరమ మహేశ్వరుల మనియు, పరమ భట్టారకుల మనియు, బ్రహ్మణ్యుల మనియు వీరు చెప్పుకొనిరి. ఈ పరమ బ్రహ్మణ్య బిరుదము పూర్వచాళుక్య నృపాలురగు విష్ణువర్ధన విజయాదిత్య శక్తివర్మ విమలాదిత్య రాజరాజులకుఁ గలదు.

### — రాజరాజు బ్రాహ్మణ మతాభిమానము —

నన్నయభట్టు రాజరాజునుగూర్చి యొనర్చిన సంబోధనబిరుదావళిలో నీ రాజన్యుని బ్రాహ్మణ మతాభిమానము నెఱుంగనగును.

క. విమలాదిత్య తనూజుఁడు
విమల విచారుఁడుఁ గుమార విద్యాధరుఁడు
_త్తమ చాళుక్యుఁడు వివిధా
గమ విహిత శ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్

సీ. ... ... ... ... ... ... ...
బలిమినీయని భూమివలయ పతుల
నుక్కడఁగించుచు దిక్కుల దనయాజ్ఞ
వెలిగించుచు విప్రకులము నెల్ల
బ్రోచుచు శరణన్న : గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమున

ఆ. జారు తరాగ్రహారము లిచ్చుచు
దేవభోగముల మహా విభూతిఁ
దనరఁజేయు చిట్టు మను మార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశ వర్ధనుఁడు.

మ. "ఇవియేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ భారతీపతి పదాబ్జ ధ్యాన పూజా మహో
త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్"

క. ఆది క్షత్రచరిత్ర ధ
రా దేవాశీః పరంపరా వర్ధిత ని
త్యోదయ సత్యోదిత విమ
లాదిత్య తనూజ విక్రమాదిత నిభా !

క. శ్రీనాథమూర్తి విబుధ ని
ధాన మహాదాన తర్పిత ద్విజవర వేఁ
గీ నాథ పార్థ నిభ యభి
మాన మహార్ణవ, మహేంద్ర మహిమాతి శయా !

## వర్ణాశ్రమోద్ధరణము.

అట్టి బ్రాహ్మణప్రియుఁడును, బ్రాహ్మణ మతాభిమానియు, వర్ణాశ్రమోద్ధారణ తత్పరుఁడౌటకు లేశమైనను సందేహము లేదు గదా? అందువల్లనే రాజరాజిట్లభివర్ణింపఁబడెను.

ఉ. ఆశ్రిత పోషణంబున ననంత విలాసమునన్ మనీషివి
ద్యాశ్రమ తత్త్వ విత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁడాది రాజనిభుఁ డత్యకలంక చరిత్ర సంపదన్.

## భారత కావ్యోత్పత్తి క్రమము

వైదిక మతోద్ధరణమును, వర్ణాశ్రమ ధర్మపరిరక్షణము కెట్లు ప్రవర్ధమానములగును? జైనమత ప్రవిష్టులగు ప్రజలకు ప్రబోధ మెట్లుదయించును? ఆ కాలమున జైనమతాచార్యులు ప్రాకృత భాషలో ప్రజలకు మతమును బోధించుచుండిరి. అన్యమత మన్యభాష యందు బోధించినచో మతవ్యాప్తి కొనసాగుటెట్లు? ఈ మత ప్రచారము నరికట్టు, ప్రతిఘటించు మార్గము రాజరాజు గ్రహించెను. స్వమతమును స్వభాషయందే బోధింపవలెను. రాజరాజు అభిమతము భారతాంధ్రీకరణ మూలముననే యగును. ఏలనన - భారతప్రశస్తి నన్నయభట్టు వర్ణించిన విధమును జూడుడు.

"వేదవ్యాసుండు నిజతపోమహత్త్వంబునంజేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై, యష్టాదశపురాణంబులను, జతుర్వేద వేదాంతాభిప్రాయంబులును, జతుర్వర్గానుబంధ బంధుర కథేతిహాసంబులును, జతుర్వర్గ మహార్షి రాజవంశచరితంబులును,జతుర్వర్ణాశ్రిమ ధర్మక్రిమంబులును, జతుర్ముఖ ప్రముఖ నిఖిల సుర ముని గణ పూజితుండైన శ్రీకృష్ణుని మహత్త్వంబును, పాండవాది భారతవీరుల మహాగుణంబులును, దన విమలజ్ఞాన మయంబైన వాగ్దర్పణంబునందేర్పడ వెలుఁగుచుండ,

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సము
చ్చయంబని మహిఁ గొనియాడుచుండ

ఆ. వివిధ వేద తత్త్వవేది, వేద వ్యాసుఁ
డాది ముని, పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁజేసె భారతంబు॥

అట్టి భారతాంధ్రీకరణమె రాజరాజు మనోభీష్ట మీడేర్చెను. అదియునుఁగాక భారతశ్రవణాసక్తి విలాసుఁడు మన రాజరాజు.

చ. "విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెఱంగెఱింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమముల పెక్కు చూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్"

వ. అయినను నాకు ననవరతంబును శ్రీ మహాభారతము నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై యుండు.

మ. ఇవియేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ, బా
యవు భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీ పదాబ్జధ్యానపూజ మహో
త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్.

చ. అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబు ను
త్తమ బహువేద విప్రులకు దానముచేసినఁ దత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథా శ్రవణాభిరతిన్ మదీయ చి
త్తము ననిశంబు భారత కథా శ్రవణ ప్రవణంబు గావునన్.

## వంశకర్తల మహిమాతిశయము

రాజరాజనరేంద్రుని తండ్రియగు విమలాదిత్యునకుఁ బూర్వులు వేంగీ మండలమును బాలించిన ప్రాక్చాళుక్య ప్రభువు లెవ్వరును దాము శీతాంశు వంశీయులమని పేర్కొనకున్నను, విమలాదిత్యుని నుండి పూర్వ చాళుక్య నరపతులు తమ శాసనములందు చంద్రవంశ జులమని వ్రాయించుకొనిరి. "మధ్యవైష్ణవునకు నామములుపెద్ద" యను నట్లు ఈనూతన సాంప్రదాయమును నిలువఁ బెట్టుకొనఁ దలచిన వీరికి తద్వంశకర్తలును, చంద్రవంశోద్భవులునగు పాండుభూపతుల యుదంతము నెఱిగించు భారతము గౌరవ భాజనమయ్యెను. అందుచేఁ గాబోలుఁ రాజరాజు నన్నయభట్టు నుద్దేశించి యిట్లుపలికెను.

చ. హిమకరుఁదొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

అట్టి భారతాంధ్రీకరణము శుభ్రాంశు వంశోద్గత చాళుక్యకుల సంజాతుఁడైన నరపతికి హర్ష దాయకముగదా!

## ఆకాలమున భారతపురాణ ప్రశస్తి

శ్వశురగృహాభిమాన మాదిమూర్తులగు త్రిమూర్తులకే యుండె ననఁగా సామాన్యులగు మానవుల కుండె నన్నచో నబ్బురమేల? శంకరుఁడు హిమాలయమున వసించెను. విష్ణుమూర్తి పాలసముద్రమున నిల్లు కట్టుకొనెను. చాళుక్యనరేంద్రులు చోళభూపాలురతో బాంధవ్యమును గల్పుకొన్న తర్వాత చాళుక్యులకు అత్తయింటి వారనిన గౌరవము మెండయ్యెను. విమలాదిత్యుఁడు కుండవాంబను

వివాహమాడి, తన కుమారుఁడును, భారత కృతిపతియునైన రాజ రాజునకు మామగారైన రాజరాజు పేరిడెను. రాజరాజు తన మేన మామయైన రాజేంద్రచోడుని కుమార్తెను పరిణయమై, తన కుమారు నకు మాతామహుఁడైన రాజేంద్రచోడుని నామమిడెను. రాజరాజు నకు మేనమామల సాంప్రదాయమబ్బెను. అతని కాలమున చోళ మండలమున నుండెడి వేదపాఠశాలలో మహాభారతమొక పఠనీయ గ్రంథముగ నుండెడిదట. అదియుఁగాక చాళుక్యాన్వయులె మహా భారత, గ్రంథమునం దధికాదరణము కలవారైనట్లు చరిత్రవల్ల తెలియుచున్నది. తల్లియగు అమ్మంగదేవికి భారతకథా శ్రవణమనిన నిష్టమై యుండనోపు. అపై పుట్టినింటివారి రాజ్యమున నభిమానింప బడిన గ్రంథరాజమగుటచే - అరవ సంపర్కమువల్ల రాజరాజు మాతృభాషను మఱచిపోక మాతృదేశోద్ధారకుఁడై, ఆంధ్ర సారస్వతా భ్యుదయమునకుఁ గారణభూతుఁడయ్యెను. మన మెల్లరము ధన్యులము ఎందులకా ? ద్రావిడ సంపర్కముచే వెతనొందుచున్న యిప్పటి తెలుఁగువారికి తెలియదా ?

## ప్రజల మనోభీష్టము

సంస్కృత మహాభారతమును జదివి బోధపఱచు కొనలేని సామాన్య జనులకు మాతృభాషయైన యాంధ్రము నందా మహా కావ్యము నన్నయ తిక్కనలు తెనుఁగుజేసి, ప్రజలను కృతార్థులఁ గావించిరని మడికి సింగన్నయు, నెట్టాప్రెగ్గడయు వ్రాసిరి.

ఉ. భారతవేదవాక్యరసభారము లజ్ఞు లెఱుంగలేక ని
స్సార మనస్కులై తిరుగుచందముఁ జూచి తెనుఁగుబాస బెం
పార రచించి యందఱఁ గృతార్థులఁజేసిన పుణ్యమూర్తులన్
సారమతిన్ భజింతు ననిశంబును నన్నయ తిక్కనాదులన్.

ఉ. భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథల త్రిప్పు తెనుంగు వారికిన్

వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లఁగ జేసినట్టి య
బ్జాసన కల్పులన్ దలఁతు నార్యుల నన్నయ తిక్కనార్యులన్.

## చాళుక్య నృపాలుర కావ్యగీతి ప్రియత్వము

రాజరాజునకుఁ బూర్వము వేంగీ దేశమును బాలించిన చాళుక్య మను జాధీశుల తమ శాసనములందు విద్యా కల్పతరులనియు, కవి గాయక కల్పతరులనియు వక్కాణింపఁబడిరి. నన్నయభట్టు రాజనరేంద్రుని విద్యాపోషకత్వమును, వైశద్యమును వివిధరీతుల వర్ణించెను.

క. "శ్రీ వనితా వల్లభ వేఁ
గీ విషయాధీశ కావ్య గీతి ప్రియ నా
నా వని నాథ కిరీట త
టీ విలస ద్రత్న సంఘటిత పద కమలా!"

క. "రాజమహేంద్ర కవీంద్ర స
మాజ సురక్ష్మోజ రాజమార్తాండ ధరి
త్రీ జననుత చారిత్ర వి
రాజిత గుణ రత్న రాజరాజనరేంద్రా!"

## అన్య భాషలలో భారతానువాదము

సంస్కృత భారతము ఇది వఱకె కన్నడభాషలో భాషాంతరీక రింపబడెను. రాజనరేంద్రునకుఁ బూర్వము వేంగీమండల నాయకుఁడగు అరికేసరినృపాలుఁడు విక్రమార్జున విజయమనుపేర కన్నడ భారత గ్రంథమును గృతి నందెను. తత్కృతి కర్త యరికేసరి సేనానియగు పంపాక యనువాఁడు ఈ విషయమెఱింగిన వాఁడగుటచే గాఁబోలు.

క. "బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగంబుల ఫలంబు పరమార్థ మగున్"

అని రాజరాజు మహాభారతమున వక్కాణించెను.

పైని వివరింపఁబడిన కారణముల ననుసరించి ఆంధ్రమహాజనులకు ప్రథమాంధ్ర కావ్యమైన మహాభారతము లభించెను.

# నన్నయ అవతారిక

శ్రీ నండూరి బంగారయ్య

భారతమను దివ్యనదిని ఆంధ్రభూమిని ప్రవహింపజేయుటకు సంకల్పించి తపించిన భగీరథుడు రాజరాజు. దానిని జటాజూటము నందు దాల్చిన కవిధూర్జటి నన్నయ. భారతముఖమున కస్తూరి తిలక మువలెనలరు నతని యవతారిక గంగావతరణమువలె నతి పవిత్రమయి నది. మనోహర మయినది. ఎన్నిసారులు చదివినను ఇంకను చదువ వలెననియే యుండును. నైసర్గికములయిన గమన భంగిమములతో చదువరుల హృదయములలో నమృతబిందువులుచిందు నన్నయ కవితామతల్లి ప్రథమమూర్తి యిందు ప్రత్యక్షమగుచున్నది.

రాజరాజును గూర్చియు ఇతర సమకాలికకవులను గూర్చియు ఆనాటి సాంస్కృతిక జీవనముగూర్చియు తన్ను గూర్చియు భారతాంధ్రీకరణమున తానుచేసికొన్న ప్రతిజ్ఞనుగూర్చియు నన్నయ రచించిన ధ్వనిప్రధానములగు చిత్రణములీ యవతారికయందున్నవి. పై విషయములన్నియు మనకు మిక్కిలి యభిమానాస్పదములగుటచే వానిని గూర్చి ఎంత తెలిసికొన్నను తనివిదీరని యాసక్తి మనకుండుట సహజము. కాని మనయాసక్తి పూర్ణముగ కృతార్థమగు భాగ్యము చరిత్ర పరిశోధకు లెంతకృషిచేసినను నేటికిగూడ పట్టలేదు. అయితే మన నోరూరింపజాలిన గోరుముద్దలు కొన్ని యిందుండుటచే నవికూడ ఈ యవతారికయందము నినుమడింప జేయుచున్నవి.

నన్నయకవితాకుమారిచే స్వయంవరమున పూదండ వేయించుకొన్న రాజరాజు ఎంతటి లోకోత్తరపురుషుడో ఈనాడు నిర్ణయించుకొనుట కష్టసాధ్యము; కాని ఒక్కటిమాత్రము స్పష్టముగా

గోచరించుచున్నది. శరీరలావణ్యము భుజవిక్రమము మున్నగు స్థూల గుణములు మాత్రమేగాక ఆత్మనలరింపజాలిన శీలసౌందర్యముకూడ ఆతని నాశ్రయించెననుటకు నిత్యసత్యవచనుడగు నన్నయ వర్ణనములే ప్రధాన సాక్ష్యములు.

ఆశ్రితపోషణంబున ననంతవిలాసమునన్ మనీషి వి
ద్యాశ్రమ తత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణ మహామహిమన్ మహినొప్పు సర్వ లో
కాశ్రియు డాదిరాజనిభు డత్యకలంక చరిత్రసంపదన్

మంగళశ్లోకము ముగిసినవెంటనే రాజరాజు గుణవర్ణనమునే ప్రారంభించుటలో తను పోషించుప్రభువు మనస్సు సంతోషపెట్టవలె నను నాశ్రితలక్షణమే ప్రత్యక్షమగుటలేదు. భారత 'పాండవోత్తముల చరిత్ర' గావున దానికి తిలకాయమానముగ వారివంశమునకే చెందిన రాజరాజును వర్ణించుటలో నన్నయ యౌచిత్యమును నిర్వహించుకొను కొన్నాడు. రాజరాజు నిజముగ పాండవ వంశాంకుర మగునా కదా యను ప్రశ్నతో మనకిచ్చటపనిలేదు. అట్టి విశ్వాసము రాజరాజుకు నన్నయకుగూడ నున్నదనుసంతవఱకే ప్రసక్తి.

ఒకవిధముగ జూచినచో నన్నయకంటెను రాజరాజే మనకారాధ్యుడేమో యనిపించును. ఆనాడు రాజరాజునాస్థానమున మహాకవులకు కొదువలేదు. అతనిసభను వర్ణించుచు నవతారికలో "మృదు మధుర రసభావభాసుర నవార్థవచనరచనా విశారదులయిన" మహాకవులుండిరని పేర్కొనుటయేగాక రాజరాజును సంబోధించు పద్యములో నొకదానిలో "రాజమహేంద్రి కవీంద్రసమాజ సురత్న్రాజ" యను విశేషణమును నన్నయ యుపయోగించినాడు. ఇట్లే తన గద్యలో "శ్రీ సకల సుకవిజనవినుత" యను విశేషణము నుపయోగించుకొన్నాడు. వీనినన్నిటినిబట్టి ఆనాడు మహాకవులెందరో యుండి

రనుట స్పష్టము. శాసనములనుబట్టికూడ భీమనభట్టు వేతనభట్టు నారాయణభట్టు మున్నగు మహాకవులకు రాజరాజు నాస్థానము రత్నాకరమువలె నలరారుచుండెనని తెలియుచున్నది. ఆనాటి విద్వత్సభలను గూడ నన్నయవర్ణించినవాడు. సభలనుకొనియాడు నాచారము తెలుగు కావ్యముల యవతారికలలో నన్నయ అవతారికయందే గానవచ్చుచున్నది

పరమవివేకసౌరభవిభాసిత సద్గుణపుంజ వారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములై సత్సభాం
తర శరసీవనంబుల ముదం బొనరం గొనియాడి వేడుకన్.

ఈ సభలలోగూడిన విద్వజ్జనులకు వివేకము ముఖ్యగుణమట. కావ్య ప్రాశస్త్యమును నిర్ణయించుటకు వివేకమెంతటి యమూల్య సాధనమో వేరుగ వివరింపవలసిన పనిలేదు. అయితే వివేకమున్నను అసూయమున్నగు దుర్గుణములున్నచో నావివేకము ప్రయోజనకారి కానేరదు. అందుచే నా సభలు 'సద్గుణపుంజవారిజోత్కరరుచిరము' లని 'మహామనోహర సుచరిత్ర పావనపయః పూరితము'లని నన్నయ వర్ణించుచున్నాడు, ఇంకొక విశేషము. అవి సకలగమ్యములట! ఎవ్వరుపోయినను పోయి అందు పాల్గొనవచ్చునట. సభలింతమంచి స్థితిలో నుండుటకు రాజరాజే ప్రశంసా పాత్రుడు 'యథారాజా తథా ప్రజా' యనిగదా! అతడు 'వివేకచతురాననుఁ' డగుటచే ఉత్తమ విద్వాంసులను ఆహ్వానించి తనయాస్థానమున సుస్థిరముగ నిలుచునట్లు వారిని సవినయముగ నాదరించి యారాధించుచుండు నా డనుట నిర్వివాదము. ఇందఱు మహాకవులాతని యాస్థానము నలంకరించుచుండగ నందఱిలోను నన్నయనే భారతరచనమునకయి ప్రార్థించుట ఆతని వివేక గుణమునకు మరింత నిదర్శనముగ నెన్నదగియున్నది. ఏవ్యక్తిచే

నెట్టిపని చేయించుకొనవలెనో తెలియవలయుటయే పాలకుల ముఖ్య ధర్మము. అట్టిధర్మము పాలకులలో లుప్తమయినచో నెన్ని వైపరీత్యములు తటస్థించునో వేరుగ వివరింపవలెనా ? అందుచే నన్నయ ప్రాగల్భ్యమును గ్రహించి ఆతనిచే నొక యత్యుత్తమ రచన చేయించి ఆంధ్రజగత్తునకు ప్రసాదించిన రసజ్ఞశేఖరుడగు రాజరాజు లేకున్న నన్నయ ఏ మసిపాతలో నడగియుండవలసినదో ! నన్నయ భారతము నారంభించినాడు కావున తిక్కనాదులు పూరించినారుగాని లేకున్న వారికి భారతరచనా సంకల్పమే కలిగియుండకపోవునేమో ఎవరు చెప్పగలరు ? ఇవన్నియుచూడగ భారత మాంధ్రజాతికి రాజరాజు పెట్టిన భిక్షమే యనిపించును.*

ఈ యవతారికమూలమున తనకాలమునాటి విద్యావిలాసగోష్ఠులును సాహిత్య వ్యాసంగములును సాంస్కృతికజీవనమును నన్నయ ఎంతో చక్కగ చిత్రించినాడు. ఈనాడు మనలో నన్నయ అసూయాగ్రస్తుడని కొన్ని కట్టుకథలు వ్యాపించియున్నవి. నన్నయయెడ మనము చేయదగిన ఘోరమైన యపచారము ఇంతకంటె మరేముండును ? నిజముగ నసూయాగ్రస్తుడే యైనచో నాతడు "సకల సుకవి జన వినుతు" డగుట కవకాశముండునా ? తనకు భారతరచనమున దోడ్పడిన తనతోబాటు ఏకరాజాశ్రితుడగు నారాయణభట్టును తన కంటె గొప్పవానిగ కొనియాడినాడే !

పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వాణసధరామరవంశ విభూషణుండు నా

* "నన్నయ చిత్రించిన రాజరాజు" అను శీర్షికతో నింకొక వ్యాసము సంకల్పించుటచే నీ యంశము నింతతో విరమించుచున్నాము.

రాయణభట్టు వాఙ్మయదురంధురుడున్ దనకిష్టుడున్ సహో
ధ్యాయుడునై నవా డభిమతంబుగ దోడయినిర్వహింపగన్.
ఇది యసూయాగ్రస్తుడు చేయజాలిన పనియేనా ?

నారాయణభట్టును గూర్చిన ఈ స్తుతి స్థూలదృష్టికి అతిశయోక్తిగ గానిపించును. కాని నందమపూడి శాసనము తిలకించిన వెనుక నిదియెంతటి స్వభావోక్తియో స్పష్టమగును.

యఃసంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు
కవిరాజశేఖర ఇతిప్రథితః సుకవిత్వవిభవేన
కవేర్మనీషాలవదుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజసూక్తిభిర్యః
కుర్వన్నగర్వపటుభిర్బిభర్తి కవిభవజ్రాంకుశనామసార్థం
తస్మై సకలజగదభినుతకీర్తిశాలినే సరస్వతీకర్ణావతంసా యా
ష్టాదశావధారణ చక్రవర్తినే ...

శతావధానము లప్పుడున్నవో లేవో కాని అష్టావధానములు దశావధానములు నున్నవట !

ఈ యవతారికయందు నన్నయ యాత్మమూర్తి కొంత గోచరించుచున్నది. భారతమును లెస్సగ బఠించినవారికి వ్యక్తిగతముగ నన్నయ పొడుగువాడా? పొట్టివాడా? ఎఱ్రగనుండునా? నల్లగనుండునా? ఆతని కన్ను ముక్కు నుదురు ఎట్లుండును? మున్నగు ప్రశ్నలకు సమాధానము బడయవలెనను కుతూహలము సాంద్రముగ నుండును. ఈయంశమును గూర్చి తెలిసికొనుటకు ఆనాడు ఫొటోలు లేకపోయెను. చిత్రలేఖనమున్నను నన్నయ చిత్రమెవ్వరును వ్రాసినట్లులేదు. సమకాలికుల వర్ణనలుగూడ లభ్యములగుటలేదు. ఇక నీ యవతారికలో నయినను ఆతని స్థూలవిగ్రహచిత్రణము లేదు. కాని అజరామరమయిన ఆత్మమాత్రము సువర్ణచిత్రణమునుగాంచినది. దాని పవిత్రస్వరూపమునకు నాటికిని నేటికిని ఆంధ్రులు జోహారు లర్పింపవలసినదే.

తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్రజాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్య రచనాభిశోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్యసత్యవచను మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యు

ఇంత స్వల్పగ్రంథమున నెట్టియుజ్జ్వల చిత్రము లభించు చున్నది! కొందరు విమర్శకులు దీనిని స్వస్తోత్ర పరాయణతగా లెక్కవేసినారు! అట్లయినచో ప్రపంచముననున్న మహాకవులలో నించుమించుగ నెవ్వరును ఈ నిందకు గురిగానివారుండరే? ప్రత్యక్షముగనో పరోక్షముగనో తినవిశిష్టతను బ్రకటించుకొనిన మహాకవి లేనేలేడే! ఎవరినిగూర్చి వారు తెలుపుకొనకున్నచో ఇతరుల కాంతరంగికవిశేషములు తెలియుట కవకాశమెట్లుండును? తన్ను గూర్చితాను చెప్పుకొన్నచో దానిని స్వస్తోత్రపరాయణతగా నిరసింతుమా? ఏమియు చెప్పుకొనని కవులను బేర్కొని "అయ్యో వీరిని గూర్చి వీరి గ్రంథములలోనైన ఏమియు తెలియరాకుండ నున్నదే!" అని పరితపింపమా? ఇంతకంటె విపరీత విమర్శన మేమియుండును?

నన్నయవంటి వినయపరులు ఆంధ్రవాఙ్మయమున నరుదుగా గన వచ్చుచున్నారు. ఆతని భారతభాగమే ఇదులకు ప్రబలనిదర్శనము. భారతఫలశ్రుతిని విపులీకరించుచు "వినయార్థులకు మహావినయమతియు" అని వినయమును ప్రత్యేకముగ కొనియాడుటయేగాక ఆ వినయగుణమును తనరచనలో నంతర్వాహినిగా జేసికొనియున్నాడు. ఈ యవతారికను ప్రథమపురుషలో వ్రాయుట కూడ ఆతని వినయగుణమునే నిరూపించుచున్నది. "అమలిన తారకాసముదయంబుల నెన్నను..." అను పద్యముగూడ ఆతని నిరహంభావత్వమునకు

సాక్ష్యము. తనకుతాను సాక్షీభూతుడయి తన విశిష్టతను వక్కాణిం చుట ఆంధ్రలోకమునెడ ననుగ్రహమునకే నిదర్శనమగుచున్నదిగాని యాత్మస్తోత్రపరాయణతకు గానేరదు.

ఇక నీ విశేషణములలో గొన్నిటిని సవిమర్శనముగ బరిశీలింప వలసియున్నది ఇందు "కులబ్రాహ్మణ" పదమున కర్థనిర్ణయము సుక రముగాదు కొందరు పురోహితుడని చెప్పినారు గాని "మంత్రి పురోహిత సేనాపతి దండనాయక..." అని పురోహితుని వేరుగ బేర్కొనుటచే నది సరిపడకున్నది. అంతమాత్రముచే నాతనికి పద్ధతి నియోగమిప్పింప జూచుటకూడ సాహసమే. వ్యాసంగములను బట్టి చారిత్రమును బట్టి ఆతడు వైదికశిఖామణియనుట స్పష్టము. బ్రహ్మాం డాది నానాపురాణ నిరతుడును సంహితాభ్యాసుడును అవిరళజపహోమ తత్పరుడును అగు ఋషికల్పుని వేరొకవిధమున గ్రహించుట యసంగతము.

ఇవి యదనుగా దీసికొని ఆతనికి లోకజ్ఞానము పూజ్యమనియు నాతని కావ్యమున ఛాందసము రసహీనత ప్రబలముగ గనవచ్చు చున్నవనియు కొందరు వాదింపజూతురు. "లోకజ్ఞు" అను విశేషణము ఈ వాదమున కీశ్వరవేరు. కవిగానో కులబ్రాహ్మణుడుగానో రాజ సభలలో మెలగిన వాడగుటచే నాతని ప్రాపంచిక జ్ఞానము ఏయితర మహాకవి ప్రాపంచిక జ్ఞానమునకును దీసిపోవుట లేదు సరిగదా అసదృశముగ బ్రకాశించుచున్నది. అదిగాక అంతర్నేత్రము వికసించిన మహాకవికి లోకజ్ఞతలోపించునా ?

ఆంధ్ర వాఙ్మయము పుట్టినది మొదలు నేటివరకు "నే నెన్నడు నబద్ధమాడి యెరుగను" అని గుండెమీద చేయివైచికొని చెప్పగల— చెప్పిన— మహామహుడు ఒక్క— నన్నయ్యయే కనవచ్చుచున్నాడు.

పెద్దలు కలియుగమున సత్యవ్రతమునే మహాతపస్సుగా బేర్కొను చున్నారు. అయినచో నన్నయ్య ఎంతటి దుర్భరతపోవిభవాధికుడో!

"సత్ప్రతిభాభి యోగ్య మత్యమరాధిపాచార్య" అను విశేషణములను ప్రత్యేకముగ గమనింపవలసి యున్నది. అగాధమయిన నన్నయమతి విభవమునకు ఆతని భారత భాగమే లక్ష్యము. ఎంతటి ప్రతిభాశాలిగాకున్న విద్యాదయితుండని కవిస్వయంభువు స్తుతించునా?

నన్నయకు సంస్కృత కవులయం దెవరియెడ మిక్కిలి పూజ్యభావమో నిర్ణయించుకొనుటకుగూడ ఈ యవతారిక తోడ్పడు చున్నది. ఆతడు పూరించు పూర్వకవులను బట్టి ఆతని కవితాదర్శములను నిర్ణయించుకొనుట సుకరముగదా! కాళిదాసాదులను ఆతడు లెస్సగ బఠించెననుటకు ఆతని భారతభాగమున నిదర్శనములున్నను వ్యాస వాల్మీకులను మాత్రమే ఇచ్చట నారాధించుచున్నాడు. భారతము నాంధ్రీకరించు సందర్భమున వ్యాసస్తుతికి వింతపడనక్కర లేదు. కాని వాల్మీకినిగూడ స్తుతించుట ప్రత్యేకవిశేషము. ఇటీవలి వరకు సంస్కృతములో వాల్మీకివలెనే తెనుగులో నన్నయకూడ "గురుపద్య విద్యకు" నాద్యుడనుకొనుచుండిరిగాని ఇప్పుడా మతము నిలువజాలదు. ఆద్యతలోని పోలికమాట యెట్లున్నను తత్త్వతః వాల్మీకికి నన్నయకు కొంత సన్నిహిత బాంధవ్యమున్నది. ఆర్ష తేజము వాల్మీకి కవితకు వ్యాసుని కవితకు సమానలక్షణమే యనుకొనుడు. అది వారిరువురిలో నున్నంత సాంద్రముగ లేకున్నను నన్నయలో గూడ కొంతవరకు గనవచ్చు చున్నది. అదిగాక మార్దవము మాధుర్యము సారళ్యము అనుగుణములలో నన్నయ వాల్మీకికి మానసిక పుత్రుడగుచున్నాడు. ఈ గుణములలో నాతడు వాల్మీకితో సమానుడని వాదించుట కెవ్వరును సాహసింపరు. కాని నన్నయను పఠించు చున్నపుడు వాల్మీకి జ్ఞప్తికి వచ్చితీరును.

ఇక వ్యాసునిగూర్చి ముచ్చటింప వలసి వచ్చినపుడు కవిత్రయమువారి యుత్సాహమునకు మేరలేదు. అవతారికయందేగాక గ్రంథమున నాయాసందర్భములలోగూడ నతిమనోజ్ఞములయిన వ్యాసస్తవములు గానవచ్చుచున్నవి. నన్నయాదులు వ్యాసుని ఇష్టదైవముగ నారాధించిరా యనిపించును.

నీలగిరీంద్ర శృంగమున నిర్మలమైన సువర్ణ వల్లరీ
జాలమువోని పింగళ విశాలజటాచయ మొప్పగా వచ
శ్శ్రీలలితుండు వచ్చినిలిచెన్ హరినీలవినీల విగ్రహో
ద్యాళరుచుల్ వెలుంగక పరాశరసూనుడు తల్లి ముందటన్.

ఇట్లేనో్న పద్యముల నుదాహరింపవచ్చును. ఈ యవతారికయందలి పద్యముకూడ మిక్కిలి మనోహరమైనది,

భారతభారతీశుభగభస్తి చయంబులజేసి ఘోరసం
సారవికారసంతమనజాల విజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుడగు దివ్యపరాశరాత్మజాం
భోరుహమిత్రు గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

ఈ భక్తి కేవలము స్తవములతో నాగక క్రియారూపమును దాల్చుచున్నది. వ్యాసుని గాంభీర్యము పాత్రీకరణము లోకజ్ఞత రుచిరార్థసూక్తిత్వము మున్నగు మహాగుణములు నన్నయలో ప్రతిబింబించుచున్నవి. ఆంధ్రవాఙ్మయమున వ్యాసవాల్మీకుల దివ్యాంశములను రెండింటిని సమన్వయించుకొనజాలిన మహాకవి భారతమునకు శ్రీకారము చుట్టుటలో నాంధ్రుల భాగ్యాతిశయము ప్రత్యక్షమగుచున్నది.

ఇక భారతాంధ్రీకరణమున నన్నయ చేసికొన్న ప్రతిజ్ఞకు వత్తము.

సారమతిన్ గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారతసంహితారచనబంధురు డయ్యె జగద్ధితంబుగన్.

'జగద్ధితంబుగన్' అనుటవలన ఇది నిష్కామకర్మమని తేలుచున్నది. ప్రోత్సహించినవాడు రాజరాజే యైనను కృతియిచ్చుచున్నది రాజరాజునకే యైనను నన్నయ లోకహితమునే దృష్టిలో నుంచుకొన్నాడుగాని మరియొక ప్రయోజనము నాశించినట్లు కనబడదు. ఒక్కొక్క ఘట్టమును జదువుచున్నప్పుడు రాజరాజు దీనికి సమ్మతించియుండునా యనిపింపకమానదు. నన్నయ మిక్కిలి స్వాతంత్ర్య ప్రియుడయినట్లుగ భారతములోని కొన్నిఘట్టములు ఘోషించుచున్నవి. "నిండుమనంబు నవ్యనవనీతసమానము" ఇత్యాది పద్యములలో రాజులను నన్నయ నిర్భయముగ నిరసించినాడు. రాజాశ్రయ మాతని స్వాతంత్ర్యము నెక్కడను అరికట్టుచున్నట్లు కానరాదు. ఇది మనస్సులో నుంచుకొనియే ఎఱ్ఱాప్రెగడ నన్నయ "నిరంకుశోక్తిగతి"ని ప్రశంసించినాడు. నిరంకుశోక్తిగతి యనుటలో నవ్యాహతమైన ధారమాత్రమేగాక భావస్వాతంత్ర్యముకూడ నూహించుకొనవలసియున్నది భారతమును సంహితయని పేర్కొనుటచే తాను నిర్వహింపవలసిన యుద్యమమెంత బాధ్యతాయుతమైనదియు నాతడు గుర్తించినాడనుట స్పష్టము.

ఇక విశిష్టములుగా జెప్పుకొన్న కవితాగుణములగూర్చి కొంత విపులీకరింపవలసియున్నది. 'రుచిరార్థసూక్తినిధి' యను విశేషణము వలన మానవస్వభావ మథనమునదేలిన యపూర్వ రహస్యములను ప్రకటించుచు వినినంతనే హృదయమున బట్టుకొను నీతిపద్యము లుద్దిష్టములయిన వనుకొనవచ్చును.

ఎఱుకగలవారి చరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు నెఱిగిన దానిని
మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్.

ఇట్టి పద్యములకు నన్నయ నిధి. వాని సర్వజనసుబోధకత్త్వము జాతీయత అర్థపుష్టి మున్నగు గుణములు "విదురనీతి" మున్నగు ఘట్టములలో తిక్కనకుగూడ నుపాస్యము లయినట్లు కనబడుచున్నది.

'అక్షర రమ్యత' యనగా శబ్దస్వారస్యమనియే చెప్పుకొనవలెను. దీనికిని ప్రసన్నకథా కలితార్థయుక్తికిని వ్యత్యాసముచెప్పి ప్రసన్నకథా కలితార్థయుక్తిని సారమతులైన కవీంద్రులుగాని ఆస్వాదింపజాలరనియు దీనినెవ్వరయినను ఆస్వాదించుట కధికారులనియు నుండుటబట్టి అట్లర్థముచెప్పుకొనుట సమంజసమని తోచుచున్నది. తెనుగు సహజముగ మధురమైనభాష. దీనికితోడు తెనుగుకవులలో నెవ్వరో యొకరిద్దరుతప్ప తక్కినవారందరు నాపాతమాధుర్యమునే దృష్టిలో నుంచుకొని కవిత్వము చెప్పుచు వచ్చిరి. అయినను ఎవ్వరును ఈ గుణమున నన్నయతో సరిపోల్చదగినవారు నాటికిని నేటికిని గానరారు. నన్నయ అక్షరరమ్యతలోనున్న రహస్యములను విశదీకరించుచు వేరుగ చర్చించు కొనవలసి యున్నది. ప్రకృత మొకటి రెండు సూచనలుమాత్రి మావశ్యకము.

జలధివిలోలవీచి విలసత్కలకాంచి సమంచితావ,
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునన్ దదున్నమ
ద్గళ దురుఘర్మవారికణక్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడ కోమలిన్ దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్

ఈ పద్యమున 'ల' యను నక్షరమువలన సిద్ధించినరమ్యతను గూడ గుర్తించునది. ఇట్లే,

క్వణదణు కింకిణీ కలిత కాంచన కాంచికలాపమున్ రణ
న్మణికలనూపురంబులు సమధ్వని నొప్పఁగ భక్తి బాదచా
రిణియయి కన్యకాపరీత సుభద్ర తదద్రి పూజన
ప్రణతులుసేసె...

అనుపద్యమున 'ణ' వలన సిద్ధించిన రమ్యతయు గ్రాహ్యము.

రాజకులైక భూషణుడు రాజమనోహరు డన్య రాజతే
జోజయశాలి శౌర్యుడు విశుద్ధయశశ్శర దిందు చంద్రికా
రాజితసర్వలోకు డపరాజిత భూరిభుజాకృపాణధా
రాజలశాంత శాత్రవ పరాగుడు రాజమహేంద్రు డున్నతిన్.

అనుపద్యములో రాజశబ్దము పునఃపునఃప్రయోగించి ఎంత మాధుర్యమును సంపాదించుకొనుచున్నాడో చూచుకొనవచ్చును. ప్రాకృతకవుల అక్షర రమ్యతవలె నిది కేవలము చెవుపండువుగ నుండుటయేగాక భావానుగుణ్యముగను సన్నివేశానుగుణ్యముగను కూడ ఉండుట నిది హృదయము నలరింపజాలిన ఉత్తమసిద్ధిగ గణింప దగియున్నది. అక్షరానుప్రాసము లుపయోగింపకుండ కూడ నన్నయ దీనిని సాధించుట గాననగును. ఆమూలాగ్రముగ దీని మర్మము లభ్యసించిన ఆ మహాకవిత్వములో శారదాదేవి నృత్యముచేయు నప్పటి కింకణీధ్వనులు శ్రుతిగోచరమగుచున్నవి.

ఇక "ప్రసన్నకథాకలితార్థయుక్తి" అనగానేమి? ఇది కవీం ద్రులేగాని ఆ కవీంద్రు లయినను సారమతినుపయోగించిగాని మెచ్చు కొనలేనంతటి మహాగుణముగ నన్నయ పేర్కొనుచున్నాడు. ఇక్కడ "నర్థ" శబ్దమునకు "శబ్దార్థము" లను నప్పటి యర్థము చెప్పకొనుట పొసగదు. నన్నయ తిక్కనలయెడ నపారభక్తిగలిగిన ఎఱ్ఱన.

భాసుర భారతార్థముల భంగుల నిక్కమెఱుంగ నేరమిన్
గాసట బీసటే చదివి గాథల ద్రవ్వ తెనుంగువారికిన్

వ్యాసముని ప్రణీతపరమార్థము తెల్లముజేసినట్టి య
భ్యాసనకల్పులన్ దలతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.

అనుటలో భారతము నందలి పరమార్థమును బ్రకటించుట లోనే నన్నయతిక్కనల ప్రత్యేక వైశిష్ట్యమున్నదని ఘోషించు చున్నాడు. ప్రకృతము విచారించు "నర్థ" శబ్దమునకు పరమార్థ మనియే అర్థము చెప్పుకొనవలసియున్నది.

సంస్కృతము సుహృత్సమ్మితము. దానిలో హృద్యమయిన కథాభాగ మెంత యున్నదో పరమార్థమును ప్రత్యక్షముగ బోధించు శాస్త్రభాగము కూడ అంతయున్నది. అంతకంటె నెక్కుడుగ నున్న దనినను అనవచ్చును. సనత్సుజాతీయము భగవద్గీత ఉత్తరగీత మున్నగు పరమ ప్రామాణికములయిన శాస్త్రములు మూలమున భారతమునిండ విచ్చలవిడిగ పెచ్చు పెరిగిపోయినవి. ఇవి ప్రక్షిప్తము లుగ గణింతమన్నను కవిత్రయమువారి కాలమునకు పూర్వమే ప్రక్షిప్తములయినవిగాని తరువాత నయినవిగావు. నవీనులవలె దీనిని ప్రక్షిప్తముగ గణించి కవిత్రయము నిరాకరించియుండదు. కాని వారు "కవిత్వతత్త్వ నిరతిశయానుభావానంద భరితాంతః కరణు" లగుటచే కావ్యప్రపంచమున నొక యద్భుతమును దలపెట్టిరి. మూలములో తీర్థమునకు తీర్థము ప్రసాదమునకు ప్రసాదముగ నున్నకథను పరమార్థమును సమన్వయించి కథలోనే పరమార్థము నిబిడీక రించి తెనుగు భారతమున కొంత సమ్మితత్త్వమును సంస్కృత భారతము నందుకంటె వేయిరెట్లధికముగ ప్రతిపాదించిరి. ఇది వారి స్వతంత్రప్రతిభకు తార్కాణము. ఈ ప్రతిభకు ప్రథమాచార్యుడు నన్నయ మహాకవియే. తిక్కనాదు లాతడుచూపిన మార్గమునే య నుసరించిరి.

నన్నయ యవతారికను సూక్ష్మముగ బరిశీలించినచో పై యంశము స్పష్ట మగుచున్నది. రాజరాజు నన్నయను కోరినదేమి అనినపుడు

"నా హృదయంబున ననవరతంబును శ్రీ మహాభారతమునందలి
యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు" ననుటలోను
జననుతకృష్ణ ద్వైపాయనమునివృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థమేర్పడఁ దెనుఁగునరచియింపు మధికధీయుక్తి మెయిన్

అనుటలోను భారత తాత్పర్యము (అదే భారతము నందలి రసధ్వని) ప్రత్యక్ష మగునట్లుగ ననగా భారతమునందలి పరమార్థము ప్రకటమగునట్లుగ వ్రాయవలసినదని కోరినాడనుట సువిదితము. ఇక నన్నయ దీనికి సమాధానము చెప్పుటలోగూడ

అమలినతారరా సముదయంబులలెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముదంబునబొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవ భారతభారతీ సము
ద్రము దరియంగనీదను విధాతృనకైనను నేరబోలునే

అని అర్థశబ్దమును వాడిన సందర్భమునుబట్టి 'ప్రసన్నకథాకలితార్థయుక్తి' లోని అర్థశబ్దమునకు పరమార్థమని చెప్పుకొనుటయే సమంజసముగ గనవచ్చుచున్నది. "నేను కథను పరమార్థమును భిన్నముచేసి ప్రతిపాదింపక రెంటింటికి "యుక్తి" అనగా పొత్తుకుదిర్చి వ్రాయుదును. ఇది సారమతితో పరీక్షించి కవీంద్రులు మెచ్చుకొందురుగాక" యని నన్నయ ప్రతిజ్ఞ చేయుచున్నాడు. ఇది యిక్కడి కథాకలితార్థయుక్తి కర్థము.

సన్నివేశమును శైలిలో ప్రతిబింబింపజేయుట నన్నయ కాచారము. ఇందులకొక్క యుదాహృతి.

ఒకే యుపఖ్యానములోని

అతతపక్షమారుతరయ ప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాతమహార్ణవుండు బలవన్నిజదేహ సముజ్జ్వల ప్రభా
ధూతపతంగ తేజు డుదితుండయి తార్క్ష్యుడు తల్లికిన్ మనః
ప్రీతియొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీధికిన్

అను నప్పటిశైలికిని

కద్రువ కొడుకులకడకేగి యేను మిమ్మందర వేడెద నన్నలార
నాపంపుసేయుండు నన్ను రక్షింపుడు కామచారులకు దుష్క-
రముగలదె
యుల్ల తెల్లనితురగోత్తము వాలంబు నల్లసేసితిరేని నాకు దాసి
యగు మన వినత మీరట్లుసేయనినాడు దానికి మఱి యేను
దాసినగుదు.

అనునప్పటి శైలికిని భేదము జూచికొననగును. రెండవ పద్య భాగమున వినత బ్రతిమాలు కొనుచున్నది. ఈ బ్రతిమాలుకొనుట అర్థమును బట్టియేగాక తదనుగుణమైన శయ్యనుబట్టికూడ నిరూపిత మగుచున్నది. వాక్యములు కుఱుచగా నుండుట శబ్దములు సుబోధక ముగను సరళముగను నుండుట దీనిలక్షణము. ఇక మొదటిపద్యములో గరుత్మంతుని యుదయము వర్ణితమగుచున్నది. ఆ సన్నివేశ గౌరవము నకు తగినట్లుగనే సమాసకల్పనము మున్నగు శయ్యాప్రక్రియలున్నవి. ఇట్టి ప్రక్రియనే ఆతడు ప్రసన్న కథకత్వముగ బేర్కొనుచున్నాడు. నిర్మలమైన నదీతోయములలో నడుగున నేమున్నదియు ప్రత్యక్షమగు నట్లు శయ్యలో సన్నివేశము ప్రతిబింబించునట్లు కథ చెప్పుట ప్రసన్న కథకత్వ మగుచున్నది. అట్టికథకును పరమార్థమునకును సంయోగము సాధించుట "ప్రసన్న కథాకలితార్థయుక్తి" యగుచున్నది.

నన్నయ్యను వ్యాకరణాచార్యునిగనే భావించుట ఇటీవల నొక యాచారమయినది. అతడు శబ్దశాస్త్రమునం దపార ప్రజ్ఞాధురీణు

డనుటకు సందేహములేదు. కాని ఆతని కవితావిభూతిని కళాగాంభీర్యమును ద్వితీయపక్షముచేసి ఇతర గుణముల నెంతకొనియాడినను అది యాతని పట్ల ఘోరమైన యపరాధమె యగుచున్నది. ప్రసన్న కథా కలితార్థయుక్తి పాత్రీకరణప్రాగల్భ్యము సన్నివేశానుగుణమయిన శయ్య మున్నగు నద్భుతగుణములలో నాతని భారతభాగము కవి బ్రహ్మకు సైతము వరవడియైనదనుటకు జంకవలసిన పనిలేదు.

కావ్యశిల్పదృష్టిమై జూచినచో ఆంధ్రమహాభారతము మూలము కంటెను మహోజ్జ్వలముగ ప్రకాశించుచున్నదని కొందరు రసజ్ఞశేఖరుల మతము. ఇదియెంతవరకు సత్యసమ్మతమో నిర్ణయించుటకు ఇప్పటి వరకు జరిగినకృషి చాలదు. కథాఘట్టములు వేదాంతసత్యములు పాత్రీకరణ రహస్యములు మున్నగు నమూల్యనిధులను స్వీకరించుట వలననేగాక అలంకారము శైలి మున్నగు స్థూలగుణములలోగూడ మహోపకృతినందుటచే కవిత్రయమువారు మూలమునకగాధముగా ఋణగ్రస్తులగుచున్నారు. ఆర్షతేజము మూలములో నున్నంత సాంద్రముగ తెనుగులో నున్నట్లు కనబడదు.

కావ్యవిమర్శనమున నభిమానములకు తావులేదుకాని ఎంత నిష్పాక్షికముగ జూచినను స్వతంత్రచైతన్యముతో నలరారుచుండుటచే కవిత్రయ కృతభారతమును స్వతంత్రకావ్యముగనే గణుతింప వలసియుండును. అదిగాక ఔచిత్యపోషణమునను స్వరూపసౌష్ఠవమునను పాత్రీకరణగాంభీర్యమునను కవిత్రయమువారు మూలమునకు చేసినసేవ యపారము. ఇట్టి యనవద్యసుందరమందిర నిర్మాణమునకు పునాదివైచుటతో నాగక కొంతవరకు సాగించిన దివ్యశిల్పి నన్నయ మహాకవియే.

జక్కన రచించిన యీ క్రింది పద్యము ఇతర మహాకవులను న్యూనతపరుపకుండ నన్నయ యాధిక్యమును ప్రకటించుచుండుటయే గాక నన్నయ వ్యాకరణ పాండిత్యముకంటె కవితా సౌందర్యమే ప్రధానస్థానము నాక్రమింపదగియున్నదని ధ్వనింపజేయుచున్నది.

వేయివిధంబులందు పదివేవురు పెద్దలు సుప్రబంధముల్
పాయక చెప్పిరట్లు రసబంధుర భావభవాభిరామ ధా
రేయులు శబ్దశాసన వరేణ్యులు నాగ బ్రశస్తికెక్కరే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర నట్టిమహాత్ము గొల్చెదన్ ?

నన్నయ కవితాకళకు స్వాగతమిచ్చిన సహృదయులలో నగ్రేసరుడు తిక్కనయే. ఉభయ కవిత్వ తత్త్వవిభవోజ్జ్వలుడగు నీతడు ఎంతో ప్రస్తుతముగ నన్నయను ఆంధ్రకవిత్వవిశారదు డనుట యొక విశేషము. ఇటీవలి వారు నన్నయకు తెలుగుకవిత్వ సంప్రదాయములు తెలియవని వాదించుట సత్యమున కెంతదూరమో ఈ విశేషమును బట్టి నిర్ణయింపనగును. 'మహితాత్ము' డనుటలో నిత్య సత్యవచనుడు సంతతస్వాధ్యాయపరుడు అవిరళ జపహోమతత్పరుడు ననుట ధ్వని ప్రధానముగ జిత్రితము. "విద్యాదయితు" డనినప్పుడు విద్యాశబ్దమునకు సరస్వతియని యర్థము చెప్పుకొనవలెను. వ్యాసవాల్మీకులను బ్రహ్మశబ్దముచే నన్నయ పూజించినట్టే నన్నయను విద్యాదయితుండని తిక్కన కొనియాడుచున్నాడు. తానేగాక తన కాశ్రితులును శిష్యులును అయిన కేతన మారనాదులచే నన్నయ యశోగానమును ఆతడు చేయించినాడు. మారనరచించిన ఈ క్రిందిపద్యము "విద్యారమణీయు" ననుటలో తిక్కన ననుసరించుటయేగాక "సారకథాసుధారస" మనుటలో నన్నయ ప్రసన్నకథాకలితార్థ యుక్తికి ప్రాముఖ్య మిచ్చుచున్నది. అన్నిటికంటెను ముఖ్యమయినది ''ఆంధ్ర కవితాగురు'' డని నన్నయకు సార్థకమయిన శాశ్వతబిరుద మిందు ప్రతిపాదితమైనది.

సారకథాసుధారస మజస్రము నాగళపూరితంబుగా
నారగ గ్రోలుచున్ జనులు హర్షరసాంబుధిఁ దేలునట్లుగా
భారతసంహితన్ మును ద్రిపర్వము లెవ్వడొనర్చె నట్టి వి
ద్యారమణీయు నంధ్ర కవితాగురు నన్నయభట్టు గొల్చెదన్.

———

# నన్నయ అవతారిక

శ్రీ దివాకర్ల వేంకటావధాని.

పూర్వలాక్షణికు లాశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాపి తన్ముఖమ్మని కావ్యారంభమున నాశీర్వాదముకాని నమస్కారముకాని వస్తునిర్దేశముకాని యుండవలెనని శాసించియుండిరి. సంస్కృత కావ్యములలోఁ బెక్కింట నీ మూఁడింటిలో నేదో యొక ప్రక్రియ కానవచ్చుచునే యుండును. కొందఱు కవులు పై యాశీరాదులలో నొకదానిని సూచించుటతో మాత్ర మూరకుండక కావ్యరచనా ప్రేరకములైన సందర్భములను, తద్రచనముఁ దమకుఁగల యర్హతానర్హతలనుకూడ కావ్యారంభములం దించుక సూచించుచుందురు. కాళిదాసుని రఘువంశ మహాకావ్యముఁగల యారంభశ్లోకము లిందు కుదాహరణము. సంస్కృత కావ్యకర్తలకుఁ బూర్వులైన వ్యాస వాల్మీకులు రచించిన భారత రామాయణములలోఁ గూడ నారంభములం దిట్టి యవతారికలున్నవి. ఈ సంస్కృత మహాకవుల నొజ్జబంతులుగ గైకొని నన్నయ భారతేతిహాసము నాంధ్రీకరింపఁబూని తదారంభమున నొక యవతారిక రచించినాడు. నన్నయను గురించికాని యాతఁడు భారతమును రచింపఁబూనిన పరిస్థితులను గుఱించికాని యత్కించిత్తయిన నెఱుంగుట కీ యవతారికయే ప్రధానమైన యాధారము.

నన్నయకు పూర్వ మాంధ్రదేశముఁ గవిత్వమున్నను ఆతని కాదర్శము కాదగిన కావ్యమేదియు లేకుండెను. అందుచే నాతనికి సంస్కృత కావ్య నాటకాదులును బ్రతి వేళ దేశమునం దంతకుముందే రచింపఁబడిన కన్నడ కావ్యములును గొంతవఱకు మేలు బంతులయ్యెను సంస్కృత నాటకముల యారంభములందు నాందీ ప్రస్తావనలను ప్రక్రియలు కానవచ్చును. అందు నాంది పూర్వరంగము నందలి

భాగము. ఇది యాశీర్వాదముతోడనో, నమస్కారముతోడనో కూడి యుండి శబ్దముచేతనో యర్థముచేతనో కావ్యవస్తువులను సూచించుచుం జంద్ర నామాంకితమై యుండవలెనను నియమమున్నది. అందలి పదముల సంఖ్యను గూర్చి కూడ లాక్షణికులు కొంత నియమము నేర్పరచిరి. కాని సంస్కృత నాటకములందే యది పెక్కుచోట్ల పాటింపబడి యుండలేదు. నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి నటీవిదూషక పారి పార్శ్వకులతో నొక్కరితోఁ జిత్రమైన సంభాషణ కావించును. దీనికిఁ బ్రస్తావన యనిపేరు. ఇందుఁ గవి గోత్ర నామాది కథనము, ప్రరోచన మనఁబడు నున్ముఖీకరణము, ఋతువర్ణనము, కావ్యార్థ సూచనము, పాత్రప్రవేశ సూచనము అనఁబడు నైదంగములుండును. ఈ ప్రస్తావన పరివర్తింపఁజేసి సూత్రధారుఁడు నిష్క్రమించిన పిమ్మట నాటక మారంభింపఁబడును.

భారతారంభమున నన్నయ రచించిన యవతారిక యొక విధముగా సంస్కృత నాటకముల మొదలనుండు నాందీ ప్రస్తావనలను బోలియున్నది. ఇందలి యారంభ మంగళ శ్లోకము సరిగా నాందీ శ్లోకమును దలపించుచున్నది. పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులు మీకు శ్రేయోదాయకులగుదురుగాక యను నాశీర్వాద మిందున్నది. దీనినిఁ గావించిన వాఁడు భారతాంధ్రీకరణ నాటక సూత్రధారుఁ డనఁదగు రాజరాజనరేంద్రుఁడు. ఇందుఁ గావ్యార్థ సూచనాదులైన యితర నాందీలక్షణము లేవియు లేవు గాని ఋషితుల్యుఁడైన నన్నయ నోట నాంధ్రవాఙ్మయ ప్రపంచమునకుఁ ద్రిమూర్తులనఁదగు ముగ్గురు కవిపుంగవులీ భారతాంధ్రీకరణమును పూర్తిచేయుదురను సూచన యప్రయత్నముగా వెలవడి యుండెనని చెప్పుదురు. నన్నయ శబ్దము నారాయణ శబ్ద భవ మనుటకు వీలుండుటయుఁ, తిక్కన ఎఱ్ఱాప్రెగడలకుఁ గవిబ్రహ్మ యనియు, శంభుదాసుఁడనియు బిరుదములుండు

టయు నీ యూహాకవకాశ మొసంగుచున్నవి. ప్రకృతి స్వరూపిణు లగు శ్రీ వాణీ గిరిజలను వక్షోముఖాంగములందు ధరించి పురుషోత్త మాంబుజ భవ శ్రీకంధరులు స్త్రీ పుంసయోగోద్భవమైన లోకముల స్థితి నా వహించునట్లు త్రిమూర్తి స్వరూపులగు నారాయణ (నన్నయ) కవి బ్రహ్మ శంభుదాసు లాంధ్ర భారతమను ప్రపంచముయొక్క స్థితిని నిర్వహింతురను భావము నారంభ మంగళశ్లోకము నుండి తీయ వచ్చును. నన్నయ యిందు సాధారణముగా లోకమున వాడుకలో నున్న బ్రహ్మ విష్ణు మహేశ్వరులను క్రమమును జెప్పక పురుషోత్త మాంబుజ భవ శ్రీకంధరులను క్రమమును సూచించెను. దీనికి నన్నయ నారాయణ శబ్దమునకుఁగల సన్నిహిత సంబంధమే కారణమై యుండ వచ్చును. తొలుత భారతాంధ్రీకరణమను సృష్టి కారంభించినవాఁడు నన్నయ యగుటచే నాతనియందు మహిమన్ వాగనుశాసనుండు అను పద్యమున భట్టుమూర్తివలె బ్రహ్మత్వమునుగూడ నారోపింపవచ్చును గాని అప్పుడు తిక్కనయందు విష్ణుత్వ కల్పనమునకుఁ గొంత దూరా న్వేయమైన పద్ధతి నవలంబింపవలసి వచ్చును. అందుచేతనే నన్నయ నోట లోకవ్యవహారమున కించుక విరుద్ధమే యైనను బురుషోత్త మాంబుజ భవ శ్రీకంధరులను క్రమమే వెల్వడి యుండును.

కాలమును బట్టి నన్నయ మొదటివాఁడు; తిక్కన ద్వితీయుఁడు; ఎఱ్ఱన తృతీయుఁడు. పై సమాసమునందలి వరుసగూడ దీని కనుగుణ ముగనే యున్నది. కవిత్రయమువారు నివసించిన కాలమును బట్టియు నీ క్రమ ముచితముగానే యున్నది. కాని భారత గ్రంథభాగముల యానుపూర్విని బట్టి చూచినచో నది యించుక విరుద్ధముగాఁ గాని పించును. ఏలయిన నాది సభాపర్వములను నారణ్య పూర్వభాగము నైన పిమ్మట ద్వితీయుఁడైన తిక్కన రచించిన భాగముకాక తృతీయుఁ డైన యెఱ్ఱన రచించిన యారణ్యపర్వశేష మున్నది. ఈ గ్రంథ

భాగక్రమమునుబట్టి చూచినచో ముందు నన్నయను దరువాత నెఱ్ఱ నను బిమ్మటఁ దిక్కనను జెప్పవలసి యుండును. ఈలోపమును బరిహ రించుటకే మంగళశ్లోకమునకు వెంటనే వ్రాయఁబడిన వచనమున నన్నయ పై శ్లోకము నందలి క్రమమును విడిచి "అని సకల భువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మోమా వాణీ పతుల స్తుతియించి" యనుచోట హరిహర హిరణ్యగర్భులను క్రమమునుఁ జెప్పినాఁడనియు లేనిచో నాతఁడు వెనువెంటనే యా త్రిమూర్తుల క్రమమును మార్చి చెప్పవలసిన యక్కఱలేదనియు శ్రీమాన్ వేదాల తిరువెంగళాచార్యుల వారొక యుపన్యాసమున వక్కాణించియున్నారు. కాలరచనాక్రమములను బట్టి చూచినచో మొదటిదియు గ్రంథభాగక్రమమునుబట్టి చూచినచో రెండవదియు సమంజసములుగా నుండును. అందుచే రెండు విధములుగాఁ జెప్పి నన్నయ క్రమవైరుధ్యమును బరిహరించుటకు యత్నించినాఁడు.

పై శ్లోకమున నన్నయ యయత్నముగనైన భారతాంధ్రీకర ణమును ముగ్వురు కవులు పూర్తిచేయుదురని సూచించుట యథా ర్థమా లేక యది విమర్శకుల బుద్ధి చాతుర్యమా యను సందేహ ముదయింపవచ్చును. కాని పై శ్లోకము నందలి క్రమమును పై యూహకుఁ దావీయక పోవుటలేదు. అదియుఁగాక మహాకవియు నవిరళ జపహోమ తత్పరుఁడును ఋషికల్పుఁడునగు నన్నయనోట నట్టి సూచన వచ్చుటయు నసహజము కానేరదు.

కావ్యాదిమైన శ్లోకమునో పద్యమునో శ్రీకారముతో నారం భించుట మంగళ సూచకము. ఈ యాదిమ పద్యమున శబ్దార్థములం దెచ్చటను నమంగళస్ఫూర్తి కలుగకుండఁ జూచుట మంచిది. అట్టి యెడ నన్నయ శివునకు మాంగళ్య సూచకములైన నామములనే కములుండగా విషము కంఠమునఁ గలవాఁడను శ్రీకంధర శబ్దము

నేల వాడవలయునని శంక కలుగ వచ్చును. విషము భయంకర మును విధ్వంసకరమునైన వస్తువేమైనను శివుఁడు శ్రీకంఠరుఁ డైన పరిస్థితి మాత్రము జగద్ధిత ప్రయోజనమైనట్టిదే. అమృత మథన సమయమున హాలాహల ముదయించి సర్వజగదుపద్రవము కలిగింపఁ బోగా రుద్రుఁడు దానిని మ్రింగి కంఠమున నిల్పి దివిజ మనుజ లోకములకెట్టి యిక్కట్టును గలుగకుండఁ గాపాడెను. దీనిని బట్టి శివుని శ్రీకంఠరత్వమతని లోకరక్షణ పరాయణతకు ఫలిత మైనదే కాని యమంగళ స్ఫోరకమైనది కాదు. అందుచేతనే నన్నయ నిశ్శంకముగా మొదటిశ్లోకమున నా శబ్దమును వాడియుండును.

తనకుల బ్రాహ్మణు నిత్యాది పద్యము నన్నయ కులగోత్ర సూత్రాదికమును, విద్యా విజ్ఞాన విశేషములను, ఆచార స్వభావము లను సూచించుచున్నది. నన్నయ విషయమును గొంచెముగనో గొప్పదిగనో మనకుఁ దెల్పు నాధార మీపద్యమొక్కటే. ఇందు గానవచ్చు విశేషణములను పరికరములనే యొండొంటితోఁగూర్చి మనము నన్నయ జీవితచరిత్ర యను సౌధమును నిర్మించుకొనవల యును. అతఁడు రాజరాజు కుల బ్రాహ్మణుఁడు. అతని కనురక్తుఁడు. నిరంతర జపహోమ పరాయణుఁడు. విపుల శబ్దశాసనుఁడు. వేదసంహి తల నభ్యసించినవాఁడు. బ్రహ్మాండపురాణము మున్నగాఁగల వివిధ పురాణములఁ బఠించి యందలి విజ్ఞానమును జూఱగొన్నవాఁడు, పాత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు, ముద్గలగోత్రుఁడు, సజ్జన స్తోత్ర పాత్రమును స్వచ్ఛమునైన చరిత్ర సంపద కలవాఁడు, లోకజ్ఞుఁడు, సంస్కృతాంధ్ర భాషలు రెండింటఁ గావ్యరచన చేయఁగలవాఁడు. సత్ప్రతిభాభియోగ్యుఁడు. సత్యవచనుఁడు. సుజనుఁడు, బుద్ధి బృహ స్పతి, ఇందుఁ గులబ్రాహ్మణుఁడు, అనురక్తుఁడు అనునవి రాజరాజు నకును నన్నయకునుగల సంబంధమును దెలుపు విశేషణములు.ఆపస్తంబ

సూతుఁడు, ముద్గల గోత్రుఁడు అనునది నన్నయ సూత్రమును గోత్రమును సూచించుచున్నవి. సద్విసుతావదాత చరితుఁడు, పాత్రుఁడు, నిత్యసత్య వచనుఁడు, సుజనుఁడు అను విశేషణము లాతని స్వభావమును బ్రవృత్తిని సూచించుచున్నవి. సంహితాభ్యాసుఁడనునది యతని వైదిక విద్యా నిష్ణాతృత్వమునకు, అవిరళ జపహోమ తత్పరుఁడనునది యతని నైష్ఠికతకును సూచకములుగా నున్నవి. మిగిలిన విశేషణము లాతని పాండిత్య ప్రతిభలను, కవితా కళా దక్షతను వెల్లడించుచున్నవి.

పై విశేషణములను బట్టి చూడ నన్నయ పరస్పర విరుద్ధ గుణ స్వభావములొక్కచోఁ గలసిన సమగ్రమూర్తిగాఁ గానవచ్చుచున్నాఁడు. వైదికులకు ఛాందసులను పేరున్నది. బ్రహ్మదేవుని వేదాభ్యాస జడుఁడని కొందరు కవు లాక్షేపించియున్నారు. అల్లసాని పెద్దన "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని శ్రోత్రియత్వమునకు బుద్ధిజాడ్యమును సహచారి గుణముగాఁ బేర్కొనుట ఎల్లరెఱింగినదే. నన్నయ వైదికుఁడయ్యును బుద్ధి జాడ్యముతోఁ గూడినవాఁడు కాఁడు. లోకజ్ఞుఁడు, మత్యమరాధిపాచార్యుఁడు, కవితా కళా పారగులైనవారు కర్మఠులై యుండుట యరుదు. తిరుపతి వెంకట కవులు శ్రవణానందములోఁ గవిత్వమును సంధ్యావందనమునకు బావగారని వర్ణించియున్నారు. కాని ఈ విషయమున కపవాదమ్మలైన వారు కొందఱు లేకపోలేదు. నన్నయ తిక్కనలందుఁ బ్రథమగణ్యులు. నన్నయ యవిరళ జపహోమ తత్పరుఁడు; తిక్కన వైదికమార్గ నిష్ఠమగు వర్తనమును నిర్వహించి సోమయాజియైనవాఁడు. నన్నయకూడఁ దనుకునకుఁ దూర్పున నొక్కచో యజ్ఞ మొనరించెనని తెల్పు పద్య మొక్కటున్నది. కాని యది యెంతవరకు యథార్థమో తెలియరాదు. లోకమున కవితా కర్మిష్ఠతలకును శ్రోత్రియతాసుధీ సంపదలకును

వైరుధ్యము చెప్పఁ బడుచున్నను, గవి కన్నియు నుండవలెనని లాక్ష ణికులు చెప్పుచున్నారు.

అప్పకవి యప్పకవీయ ప్రథమాశ్వాసమున సత్కవి లక్షణము లను జెప్పెను;

"ఇమ్మహిని మునులచే వెల
సెమ్మను కావ్యములు వాన్ృషిః కురుతే కా
వ్యమ్మను వచనార్థంబే
సమ్మతి గలివేళ సుకవి జనులే మౌనుల్" -43-

"ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁ గల్పకుఁడు పూర్వకవీ
శ్వర వాక్ప్రయోగ దక్షుఁడు
గరుణామతి యెవ్వఁ డతఁడు కవియనఁ బరగున్" -44-

"శృతి శాస్త్రాంగ పురాణ
ప్రతతియు నితిహాస కావ్య భారతాగమముల్
స్మృతి సంగీత రతికళా
గతుల నలంకృతుల నెఱుఁగఁగాఁదగుఁ గవికిన్" -45-

అని చెప్పియున్నాఁడు. ఈతఁడు చెప్పిన లక్షణములన్నిఁటికి గుదురైన కవులు నన్నయ వంటివారే యొక్క రిద్దరో తప్ప నెందఱో యుండరు.

"కుల పవిత్రః పురోహితః" అని వాచస్పత్యమునందలి నిర్వచ నము నూతఁగాని, విప్ర బ్రాహ్మణ శబ్దములు రెండును బర్యాయపద ములగుటచేఁగుఁల బ్రాహ్మణుఁడనఁగాఁ బురోహితుఁడనియు, నందుచే నన్నయ రాజరాజునకుఁ బురోహితుఁడుగా నుండెననియు, బురోహి తులు సాధారణముగా వైదిక బ్రాహ్మణులే యగుటచే నన్నయకూడ

వైదిక బ్రాహ్మణ శాఖకే చెందియుండుననియుఁ జెప్పువారు పలువు రున్నారు. కాని యీ యభిప్రాయము భ్రాంతి మూలకము. కుల బ్రాహ్మణుఁడవఁగాఁ బురోహితుఁడు కాదనుటకు కొన్ని నిదర్శనము లున్నవి. చాళుక్య రాజ్యాంగమున మంత్రి పురోహిత సేనాపతి యువ రాజుల పంచప్రధాను లనఁబడుచుండిరి. ఈ పంచ ప్రధానులలో రెండవవాఁడు పురోహితుఁడు. కావున బురోహితత్వముకూడ నప్పుడు న్యూనతావహమైనది కాదు. అవతారికయందలి 8వ వచనమున రాజరాజు మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహా ప్రధాన సామంత విలాసినీ పరివృతుండై యుండెనని వర్ణింపఁబడి యున్నది. వెనువెంటనే నన్నయను వర్ణించు సీసపద్యమున గుల బ్రాహ్మణ శబ్దము వాడఁబడినది. రెండు శబ్దములు నొక్కే స్థలమున వేఱువేఱుగా బ్రయోగింపఁబడి యుండుటచే వీని యర్థమునఁగూడ సార్థక్యమున్నదని యూహించుట కవకాశమున్నది. "కుల బ్రాహ్మణ పదమునకుఁ బురోహిత పదము పర్యాయముగాఁ జాళుక్య శాసనము లలోఁగాని, కర్ణాటరాజ శాసనములలోఁగాని యెచ్చటను వ్యవహరింపఁ బడి యుండలేదనియుఁ బంచప్రధానులను జెప్పుచోటఁ జాళుక్యశాసన ములలోఁ బురోహితశబ్దమే వినవచ్చును గాని కులబ్రాహ్మణశబ్దము వినరాదనియు" సాహిత్య పత్రికలో కీ. శే. బుర్రా శేషగిరిరావుగారు వ్రాసియున్నారు. అదిగాక నన్నయయే వ్రాసిన నందమపూడి శాసనములోను తత్పూర్వ శాసనములందును జాళుక్యులకు మూల పురుషుడైన విజయాదిత్యుఁడు జిగీషచే దక్షిణాపథమున కరుదెంచి త్రిలోచన పల్లవునితోడి యుద్ధమున దివంగతుడైన పిమ్మట నాతని మహాదేవి, యంతర్వత్నియైనది. పురోహితునితోగూడ (పురోహి తేన సార్థం) ముడివేము నామకమైన అగ్రహారమున కరిగి తద్వాస్తవ్యు డైన విష్ణుభట్ట సోమయాజిచే దుహితృ నిర్విశేషముగా నభిరక్షింపబడి విష్ణువర్ధనుని ప్రసవించెనని చెప్పబడి యున్నది. ఈ సందర్భమున గుల

బ్రాహ్మణేనసహ యనక నన్నయాదులు పురోహితేన సార్థమని వ్రాయుట గమనింపదగి యున్నది. దీనినిబట్టి నన్నయ యుద్దేశమున బురోహిత కులబ్రాహ్మణ పదములు పర్యాయరూపములు కావనినట్లు తోచును. కాని కులబ్రాహ్మణుడును బురోహితుడును గూడ నాకాలమున నతి గౌరవార్హులయిన రాజోద్యోగులే యనుటలో సందేహము లేదు. ఇప్పటి పురోహితులకు సంఘమునందున్న గౌరవమునుబట్టి యప్పటి పురోహితులుకూడా నిట్టివారే యైయుందురని యనుకొనుట పొరపాటు.

రాజరాజనరేంద్రుని తాతయైన రెండవ అమ్మరాజు రాజమహేంద్రుని శాసనమున నొక్కచో "......ర్మణః పుత్రాయ, కౌండిన్య గోత్రాయ,.....ర్మాభిధానాయ మత్కుల బ్రాహ్మణాయ" యను భాగము కానవచ్చుచున్నది ఈ శాసనము చాలవరకు శిథిలమై పోయినది. కాని యర్థసందర్భమునుబట్టి యెవ్వరోయొక శర్మ కుమారుడు, కౌండిన్యగోత్రుడు మరియొక శర్మ యీ మహారాజునకుగల బ్రాహ్మణుడై యుండినట్లు స్పష్టమగుచున్నది. ఈ శాసనము శిథిలము కాకుండ నుండినచో బంచప్రధానుల పేర్కొనుచోట బురోహిత శబ్దమును గనబఱచి నన్నయ వర్ణనమును దృఢపఱచి యుండుననియు, బురోహిత కులబ్రాహ్మణ శబ్దముల రెండింటిని జూపిన భారతవచనమీ శాసనము ననుసరించి వ్రాయబడి యుండుననియు శ్రీ శేషగిరిరావు పంతులుగారు చెప్పియున్నారు. (రా. సంచిక. పుట 92)

రాజరాజనరేంద్రుని కాలమున నన్నయ శాసన కావ్యకర్తగా నుండెననుటకు నందమపూడి మండ తామ్రశాసనములు తార్కాణములు. సాధారణముగా శాసన లేఖాధికారములు, సంధివిగ్రహులు రహస్యకులు, మహామంత్రులు అనువారి కొసంగబడుచుండెను. కుల బ్రాహ్మణులుకూడ వీరితో సమాన ప్రతిపత్తి కలవారై యుందురు.

ఇంతవఱకు లభ్యమైన శాసనములలో బురోహితుడను నుద్యోగి వ్రాసిన శాసన మొక్కటియు గానరాదు. సంధివిగ్రహు లొక్కొక్కప్పుడు తమకు సన్నిహితులైనవారిచే శాసనములు వ్రాయించు నాచార ముండెను. క్రీ. శ. 1084వ సంవత్సరమున రాజరాజు జ్ఞాతి యగు పాశ్చాత్య త్రిభువనమల్ల దేవుని యాజ్ఞాపత్రము నాతని సంధి విగ్రహ యల్లుడు వ్రాసినట్లు తెలియుచున్నది. కాని పురోహిత రచన మైన శాసన మెచ్చటను గానవచ్చుటలేదు. ఇదికూడ బురోహిత కులబ్రాహ్మణులను నుద్యోగులు భిన్నబిన్న ధర్మనిర్వాహకులుగా నుండిరని యూహించుటకు తోడ్పడుచున్నది.

కులబ్రాహ్మణులనగా క్షత్త్రోపేత బ్రాహ్మణులనియు వారు రాజాస్థానములందు బలుకుబడి కల్గి తమవారి కుపాధులు కల్పించిరనుట కనేక దృష్టాంతము లున్నవనియు శ్రీ శేషగిరిరావు పంతులుగారు వ్రాసియున్నారు. (పుట. 92) కులపుత్రికులవలె కులబ్రాహ్మణులు కూడ రాజాంతఃపురములలో యుందురని వారూహించి యుండిరి. రాజరాజనరేంద్రుడను గ్రంథము నందలి సప్తమ ప్రకరణమున (పుట 144) శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు పంతులుగారు "రాజ రాజచాళుక్య కులమున నరపాలురకు కులబ్రాహ్మణులుండుట చాళుక్య వంశాచారము. ఇమ్మడి అమ్మరాజ విజయాదిత్యునికి తాడిపట్టు వాస్తవ్యుడును, అపస్తంబ సూత్రుడును, కౌండిన్యగోత్రుడునగు కుల బ్రాహ్మణుడొకడుండెను. వంశమవిచ్ఛిన్నముగ వర్ధిల్లుటకు క్షత్రధర్మ మొకటి భారతకాలమునాటినుండి ఆచరణలోనుండెను. అన్వయాభి వృద్ధికి భూసురోత్తములు రాజపుత్రికలందు ధర్మనిధి సంతతి నిలుపు చుండిరి. అట్టి భూసురోత్తములు... కులబ్రాహ్మణుల నియమించి వారికి ఆడుబిడ్డలనిచ్చి వివాహముచేయు నాచారము కాకతీయ యుగాంతము వఱకు ఆంధ్రదేశమున వర్ధిల్లెను. కులబ్రాహ్మణులు

క్షత్రియ పత్నులతోపాటు స్వకులాంగనలనుగూడ పెండ్లియాడిరి. కులబ్రాహ్మణులు సాధారణముగా నున్నత రాజకీయ పదవులందుండిరి. అట్టి కులబ్రాహ్మణులు వైదికులు కారు. లోకజ్ఞులు, కవులు. అప్పు డప్పుడు కార్యఖడ్గముల నడిపిన దక్షులు." అని కులబ్రాహ్మణులను గూర్చి వివరించియున్నారు. పరశురాముడు సర్వక్షత్రి సంహారము కావించిన పిమ్మటను, జిత్రాంగద విచిత్రవీర్యుల మరణానంతరమును భారతమున బ్రాహ్మణులు క్షత్రియకాంతలందు సంతానమును బడసిన వృత్తాంతములు చెప్పబడినమాట సత్యమే. అట్టిది సాధారణముగా సంతాన రాహిత్యముచే వంశవిచ్ఛేదము చేకూరు నుపద్రవము కలిగి నప్పుడే జరుగుచుండెను. చాళుక్యవంశమున నిట్టి యుపద్రవ మెప్పు డైన సంభవించినట్లుగాని, కులబ్రాహ్మణులు దయతలచి యావంశము నవిచ్ఛిన్న మొనరించినట్లు కాని తెల్పు సందర్భ మొక్కటియు గాన రావు. కావున పై చారిత్రకులు రాజులు కులబ్రాహ్మణు నుంచుకొను టకు చెప్పిన ప్రయోజనము సందేహాస్పదమై యున్నది. వారు రాజులకడ నుద్యోగులుగ నుండి శాసనలేఖనాద్యన్య కార్యముల నొనరించుచుండిరనుటలో నాక్షేపము లేదు.

భారత సభాపర్వమున నారదుడు ధర్మజ్ఞునికడ కరుదెంచి యాతని రాజ్యపరిపాలన పరిస్థితులను గురించి యనేక ప్రశ్నలు వేసి యుండెను. అందులో;

"కచ్చిదాత్మ సమాబుద్ధ్యా శుచయో జీవితక్షమాః
కులీనాశ్చానురక్తాశ్చ కృతాస్తే వీర మంత్రిణః"

(సభా. 2-5-16 : **Bhandarkar oriental reserch Institute Edition)**

అనునదొకటి "కులీనాశ్చాను రక్తాశ్చ" అనుపదములకు తన కులబ్రాహ్మణు ననురక్త ననుపదములు సరియైన యనువాదములని

(శ్రీ) శేషగిరిరావు పంతులుగా రభిప్రాయపడి యుండిరి. "దీనినిఁబట్టి నన్నయనుగూర్చిన కుల బ్రాహ్మణ ప్రయోగము వీరమంత్రికిఁ దగి యున్నదనియు, బురోహితుని గూర్చినది కాదనియు నూహింప" వలెనని వారు సిద్ధాంతీకరించి యుండిరి, పై శ్లోకమునందలి కులీన శబ్ద మునకును గులబ్రాహ్మణ శబ్దమునకును సంబంధమున్నట్లు గోచరిం పదు. పైఁగా నందలి "వీర" శబ్దము ధర్మజునికి సంబోధనము. పంతులు గారు దానిని మంత్రికి విశేషణముగాఁజేసి వీరమంత్రియని వ్రాసి యుండిరి. అందుచే నా శ్లోకమునకును నన్నయను వర్ణించు పద్యము నందలి పదములకును ముడిపెట్టుట యంతసమంజసముగాదు. అనురక్త పదమున్నది గదా యని పంతులుగారు కులబ్రాహ్మణ శబ్దమును కులీన శబ్దమునఁ బర్యాయముగా గ్రహించి యుందురు. కులీన తత్వా నురక్తత్వము లొక్క కులబ్రాహ్మణులకే కాక రాజోద్యోగు లంద ఱికిని నుండవలసిన లక్షణములు. నారదుఁడు సేనాపతిని గూర్చి యడుగు సందర్భమునఁగూడ "కులీనాశ్చానురక్తశ్చ దక్షస్సేనా పతిస్తవ" యనుట యిందుకు దృష్టాంతము. సాధారణముగా నారోజు లలో విప్రులే మంత్రిత్వాదులకు నున్నతోద్యోగములందు నియమింప బడుచుండిరి. ఆముక్తమాల్యదలో రాయలు చెప్పిన రాజనీతిని బఠించి నచో నిది వ్యక్తమగును. పై సభాపర్వమునందలి శ్లోకము ననువ దించుచు నన్నయ,

"అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తులఁ బితృ పితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులఁగా
నొనరించితె కార్యసంప్రయోగము పొంటెన్" (సభా. 1-26)

అని వ్రాసియుండెను. ఇందు ననురక్త పదము తప్ప మిగిలిన వన్నియు నన్నయ కల్పించినవే. "పితృపితామహాన్" అని మఱి

యెక్కడ నెచ్చటనో యున్న విశేషణమును దీసికొనివచ్చి యాతఁ డిక్కడ నిమిడించెను. దీనినిఁబట్టి నన్నయ యుద్దేశమున మంత్రాలకు ననురక్తతతోపాటు అనఘత్వము, శాస్త్రవిధిజ్ఞత్వము, పితృపితా మహక్రమమున రాక యను లక్షణములుకూడ నుండవలెనన్నట్లు వ్యక్తమగుచున్నది. కులబ్రాహ్మణుఁడనగా బితృపితామహ క్రమ మున వచ్చిన విప్రుడైన మంత్రియని యర్థము చెప్పవచ్చును. రాజు తండ్రి తాతలు రాజ్యము పాలించుచుండగా, మంత్రి తండ్రి తాతలు మంత్రి పదవి నధిష్టించి యుండవలయును. అట్టి మంత్రులు రాజున కితర మంత్రులకంటె సన్నిహితులు ననురక్తులునై కులబ్రాహ్మణులనఁ బడుచుండిరని నిశ్చయింపవచ్చును. నన్నయ తండ్రి తాతలెవ్వరో మనకు తెలియదు కావున నీ విషయమును దృష్టాంత పూర్వకముగా నిరూపించుటకు వీలులేకున్నది. ఆంధ్రకవి తరంగిణీకారులు చేతన భీమన భట్టులను నన్నయ తండ్రి తాతలుగా నిర్ధారణ చేసియున్నారు. ఇది సత్యమేయైనచోఁ బై యభిప్రాయము మఱింత బలవంతమగు చున్నది. ఏలయన చేతన భీమన భట్టులు రాజరాజ విమలాదిత్యుల యాస్థానముల నుండి సంధివిగ్రహులై శాసనములను రచించియుండిరి. (కోరుమిల్లి రణస్థిపూడి)

కులబ్రాహ్మణుఁడనఁగాఁ బురోహితుఁడను నర్థము నిరస్తమగు చున్నది. కావున దీనినిబట్టి నన్నయ వైదికశాఖకుఁ జెందిన బ్రాహ్మ ణుఁడే యనుటకూడ నిరస్తమై పోవుచున్నది. ఆ కాలమున బ్రాహ్మణ వర్ణమున నియోగి వైదిక శాఖలు విస్పష్టముగా నేర్పడెనని చెప్పుట కాధారములులేవు. అందుచేత నన్నయ వేదవేదాంగ విదుఁడైన బ్రాహ్మణుఁడనియే తప్ప నాతని బ్రాహ్మణత్వమును గూర్చిన యితర వివరములను దెలుపుట యశక్యము.

శాతవాహనుల కాలమున నాంధ్రదేశమున బౌద్ధమతము

మూఁడుపూవు లాఱుకాయలుగా విరాజిల్లెను. తరువాత దానితోపాటు జైన వైదిక మతములుకూడ నించుక తలయెత్తసాగెను. పూర్వాచార్యుల కాలమున వైదికమతమున కధిక ప్రాపు చేకూరెను. కుమారిల భట్టు బౌద్ధ జైన మత సిద్ధాంతములను తీవ్రముగా ఖండించి పూర్వమీమాంసా పద్ధతిని బ్రతిష్ఠాపించెను వేదాభ్యాసమును, వైదిక కర్మాచరణమును ఆ పద్ధతికి జీవాతువులు, ఆ మతము నవలంబించి యాదరించెడివారి సమగ్రస్వరూపము మనకు నన్నయలోఁ బ్రత్యక్షమగు చుండును. అతని సంహితాభ్యాసతయు, నవిరళ జపహోమ తత్పరత్వమును నిందుకుఁ దార్కాణములు.

సంస్కృతమున నష్టాదశపురాణము లున్నవి. వానిలో బ్రహ్మాండ పురాణ మొకటి. పురాణము నందుండవలసిన పంచలక్షణము లన్ని పురాణములందు గోచరించుమాట నిజమేయైనను బ్రహ్మాండ పురాణమున నవి మఱింత విపులముగా నుండును. సర్గ ప్రతిసర్గ మన్వంతరముల వృత్తాంతము నెఱుంగుటకది చాలఁ దోడ్పడును. మఱియుఁ బురాణముల పౌర్వాపర్యము నిర్ణయించుట కష్టమే యయ్యుఁ బెద్దలు బ్రహ్మాండపురాణమునకుఁ బ్రాచీనత చెప్పుచుందురు. అందుచే బురాణములలో దానికొక విశిష్టత యున్నది. నన్నయ "బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుఁ"డని బ్రహ్మాండమునే పేరుపెట్టి పేర్కొనుట యీ కారణముచేతనే. శ్రీనాథుఁడు కూడ గాశీఖండమున బ్రహ్మదత్త వరప్రసాదుఁడ నిత్యాది పద్యమందభ్యర్హిత బ్రహ్మాండాది పురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత బ్రహ్మజ్ఞాన కళానిధానమవని యీ పురాణమునే ప్రథమముగాఁ జేర్కొనుటకూడ నిదియే కారణమైయుండును.

కళింగదేశమందలి భారత ప్రతులలో నొండు రెండుచోట్లఁ బాత్రినను మాటకుఁ భ్రాతు (తృ) అను పాఠాంతముండిన కారణ

మున నదియే సరియైన పాఠమై యుండుననియుఁ, దిక్కన మనుమ సిద్ధి మామా యని పిలుచుచుండినట్లే రాజరాజు నన్నయను అన్నా (భ్రాత) యని పిల్చి యట్లే భావించుచుండ వచ్చుననియుఁ, గౌరవడి వ్రటునుడుఁకు వేయఁబడిన ప్రాసయతిని సాధించుటకు భారతమునసే ప్రయోగమున్న దనియుఁ బై సాహిత్య పత్రికలోనే శేషగిరిరావు పంతులుగారు వ్రాసియుండిరి. భ్రాతృ శబ్దమునకు దెనుఁగున ద్వితీయైకవచనాంతము భ్రాతను అనియేయుండునుగాని భ్రాతుక(భ్రాతృన్) అని యుండదు ఈ రూపము వ్యాకరణసాధ్యముకాదు. అందుచేఁ బై కళింగదేశ భారత ప్రతులందలి పాఠము లేఖక ప్రమాద జనిత మైనదే కాని సరియైనదికాదు. ఒకవేళ పాత్రి శబ్దమే సరియైనదగుచో నది నాయకత్వము (Leader Ship) ను సూచించుననివారే అభిప్రాయ పడి యయాతి చరిత్రము: బ్రజలు యదుని వర్ణించు సందర్భముఁ బ్రజలు యదుని వర్ణించు సందర్భము నందలి బద్యమును * దానికి నిదర్శనముగాఁ జూపిరి. నిఘంటువులలోఁ బాత్రి శబ్దమునకు యోగ్యుఁడు దాన గ్రహణార్హుఁడు అను నర్థములున్నవి. కాని నాయకుఁడను నర్థము లేదు. ఆ యోగ్యత సందర్భమును బట్టి పలువిధ ముల వ్యక్తము కావచ్చును. యదుని వర్ణించు సందర్భమున దానికి నాయకత్వ స్ఫూర్తి కలుగుట కవకాశమున్నది. కాని నన్నయ విషయ మున నట్టి యవకాశము లేదు దానికిచ్చుట గుణపాండిత్యాభి జాత్య బుద్ధి వైభవములచే సర్వథా యోగ్యుఁడనునదే యర్థము కాఁదగి యున్నది.

---

* "అవిచారంబని పల్క నోడెదము ధర్మాభిజ్ఞ నీ యగ్రి సం
భవుఁడత్యున్నత శక్తియుక్తుఁడు మహీభార ప్రగల్భుఁడు భా
రవ దాహిత్రుఁడు పాత్రుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ
... ... ... ... ... ... ... ..."

(ఆది. 3-196)

ఈ పద్యమున నన్నయ యుభయ భాషాకావ్య రచనాభి శోభితుఁడని వర్ణింపఁబడి యున్నాఁడు. ఉభయభాషలనఁగా సంస్కృతాంధ్రములు. ఆ రెండింట నన్నయ కపారమైన పాండిత్యముతోపాటు కావ్యరచనా దక్షతయు నున్నట్టి విశేషణము సూచించుచున్నది. నన్నయ యాంధ్రమున భారతము కాక మఱి యే కృతులైన రచించినేమో చెప్పుటకు బలమైన యాధారములు లేవు. భారతమొక్కటే చాలు నాతని యాంధ్ర భాషా కావ్యరచనాభి శోభితత్వమును చాటుటకు. సంస్కృతమున నాతఁడు రచించిన కావ్యము లేవియు లభ్యములు కాలేదు. కాని భారతాదినిగల మంగళశ్లోకమును నంద.పూడి శాసనము నందలి శ్లోకములును సంస్కృత భాషయం దాతనికిఁగల కావ్య రచనా పాటవమును వేయినోళ్ళ వక్కాణించుచున్నవి.

ఈ విధముగా సీసపద్యమేక మేయయ్యు నిష్ఠాగరిష్ఠుఁడును పాండిత్య పాథోధియు గుణరత్నాకరుఁడును గవితా కళానిధియు ధీరధిషణావధీరిత దివిజాచార్యుఁడు నగు నన్నయను గూర్చి యెన్నో విషయములను వ్యక్తము చేయుచు నాతని పవిత్రమూర్తిని మనకనుల యెదుట సాక్షాత్కరింప జేయుచున్నది. ఇందలి విషయము లాక్షణికులు ప్రస్తావనలో నుండవలెనని చెప్పు కవిగోత్ర నామాది కథనమను నంగమును స్ఫురింపఁ జేయుచున్నది.

కావ్యార్థ సూచనము ప్రస్తావనయందలి మరియొక యంగము అదియు నీ యవతారికలో సూచ్య మాత్రముగఁ గానవచ్చుచున్నది. రాజరాజు నన్నయతో "నే ననేక పురాణములు వింటిని, అర్థ ధర్మ శాస్త్రముల క్రమమెఱింగితిని. ఉదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు చూచితిని. జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములందు భక్తితో హృదయము నిల్పితి" నని చెప్పిన పిమ్మట "అయినను నాకు ననవతరంబును శ్రీ మహా భారతము నందలి యభిప్రాయంబువినన నభిలాష పెద్దయై యుండు"నని ఆ మహాభారతోదంత

మును వచించెను. తరువాతఁదనకు మిక్కిలి యిష్టములైయుండు నైదు విషయములలో మహాభారత శ్రవణాసక్తి యొక్కటని స్పష్ట పఱిచెను. అనంతరము చంద్రుఁదొట్టిపూరు భారతదేశ కురుప్రభు పాండు భూపతులు క్రమముగా వంశకర్తలై యొప్పిన తన వంశమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్రవినుట తనకెంతో యభీష్టమని వ్యక్తీకరించెను. భారతేతిహాసము నందలి ప్రధాన వస్తువు పాండవోత్తముల చరిత్రయేకదా! అందుచే నీపై విషయములు సూక్ష్మముగనైనను జక్కఁగాఁ గథాంశ సూచనము నొనరించుచున్నవి.

దశరూపకాదులు రత్నావళి నాటకమునందలి "శ్రీహర్షో నిపుణః కవిః" ఇత్యాది శ్లోక మున్మిఖీకరణమను ప్రస్తావనాంగమునకు నుదాహరణముగా సూచించియున్నవి. ఇందుఁ గవికావ్య వస్తు నట సభ్యాదుల గుణ విశేషములు వర్ణితములైనవి. ఇట్టి సూచన సభ్యులను నాటక దర్శనమున నత్యంతోన్ముఖముగా నొనరించుట సహజమే. ఇట్లే నన్నయయు నీ యవతారికలో భారత మహాత్త్వము నించుక ప్రశంసించినాఁడు. అది జననుతుఁడైన కృష్ణద్వైపాయన మునివృషభుఁడు సంస్కృతమున రచించినట్టిది. భారతకథా శ్రవణాభిరతిచే నుత్తమములును సువర్ణ శృంగ ఖురములును నగు కపిలగోవుల నూటిని సర్వథా పాత్రులైన యుత్తమ వేదవిప్రులకు దాన మొనరించిన మహాఫలము చేకూరును. మఱియు భారతమును బహుభాషలలో బహువిధములుగా బహుజనులవలన వినుచు దానియెడ బద్ధాదరులై యుండువారికి బహుయాగముల ఫలము లభించును. బహువిధములనఁగా శ్రవ్యకావ్యముఁగాని, దృశ్యకావ్యముఁగాని యని యర్థము. సంస్కృతము ఆంధ్ర కర్ణాట తమిళములు మున్నగునవి బహుభాషలు. బహుజనములను శబ్దము వ్యాఖ్యానముతులను, గావ్యముగాఁజెప్పు కవులను, బురాణముగా నుడువు పౌరాణిచేయు పండితులను దృశ్య

కావ్యములుగా నభినయించు నటకులను గేయముగా బాడు గాయకు లను సూచించుచున్నది. ఈ పై పద్యము లోకవిధమైన ఫలశ్రుతి పద్యములుగా గోచరించినను గవి చెప్పఁబోవు భారత మహాకావ్యము యొక్క మహనీయతను బ్రకటించుచుఁ బఠితలను దచ్ఛ్రవణ పఠనాదు లందున్ముఖులనుగా నొనరించుచున్నవి.

ఈ యవతారికలో బ్రత్యక్షమైన ఋతువర్ణన మేదియు లేదను మాట సత్యమే. కాని "ఘన దురితానుబంధేత్యాది పద్యమున వసంత ర్తు వర్ణనము సూచ్యమాన మగుచున్నది. వసంతము తుషార సంహతిని దవ్వుగఁ జోపి పుష్పపల్లవ విభూతితో విరాజిల్లును. అప్పుడు మన్మథుఁడు "ధర్మ" నిబద్ధ బుద్ధియై విజృంభించును. ఈ పద్యమునఁ గవి యలంకార మిషచే ఋతువర్ణనమును నంగమును గూడఁ జొనిపి నట్లు కానఁబడు చున్నది

ఇంకఁ బ్రస్తావనలోఁ జివరనుండు నంగము పాత్రి ప్రవేశ సూచన. భారతాంధ్రీకరణము నొక నాటకముతోఁ బోల్చినచో దానికి సూత్రధారుఁడు రాజరాజు. నన్నయ యందలి ప్రధాన పాత్ర. నారాయణ భట్టాతనికి సహాయుఁడు. అవతారికయందలి తుది రెండు పద్యములలోఁ బ్రధానపాత్రి సూచింపఁబడుచున్నది. "నన్నయ భట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబు గన్" అను వాక్యములో నా సూచన స్పష్టముగా గోచరించుచునే యున్నది. ఈ విధమునా నీ యవతారిక లక్షణ సామ్యముచే సంస్కృతము నందలి నాందీ ప్రస్తావనల దృష్టియం దిడుకొని రచింపఁ బడిన దేమోయను నభిప్రాయమునకు దోహదము చేకూర్చుచున్నది.

---

# నన్నయకుం బూర్వము పద్యములు కలవా?

శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి

శ్రీ లక్ష్మణరావుగారు నన్నయంగూర్చి యొక యుపన్యాసము వ్రాసి యందు నన్నయయే యాదికవి యగుచో నంతకు పూర్వము తెనుగున సుబంత తిజంతాదులు లేవాయని ప్రశ్నించిరి. నన్నయ భట్టోపాధ్యాయుం డాంధ్ర కవితాజనకుడన నాంధ్ర భాష యందలి శబ్దముల బుట్టించినవాడని యర్థము కాగలదా? కవిత్వమన శబ్దముల బుట్టించుట యగునా? కవిలోకమునందు వాడుకలో నున్న శబ్దముల దీసికొని వానితో గవిత్వమల్లును. అంతియేకాని శబ్దముల నాతడు పుట్టింపడు. ఆదికవి యగుచో వానిని సంస్కరించి వాడకొనును. భాష యదివరకే సంస్కరింపబడి యున్నయెడల సంస్కరింపబడిన భాషను వాడును.

## శాసన విమర్శనము

కవితా చరిత్రాదుల దెల్పునది సారస్వతము. దానిని పరిశీలింపగ నన్నయయే ఆదికవియని తేలుచున్నది. మన సారస్వతమాతడు త్రిలింగ భాషా కవితాజనకుడని కంఠోక్తిగా నొక్కి వక్కాణించుచున్నది. అయినను మన శ్రీ లక్ష్మణరావుగారు దాని నింతయు పాటింపక యంతకు పూర్వపు కవిత్వమునుగూర్చి తెలిసికొనుటకై శిలాశాసనముల బరిశీలింప మొదలిడిరి. శిలాశాసనము లనునవి సారస్వత ప్రక్రియ దెల్పునవి కావు. కేవల లోకవ్యవహారబోధకై బుట్టినవి. కాన కవితా చరిత్రముం దెలుపుటకు నయ్యవి సారస్వతమును మించిన ప్రమాణములు కానేరవు. శాసనములంగూర్చి శ్రీ లక్ష్మణరావుగారే తమ యధ్యక్షోపన్యాసములోనే యిట్లు వ్రాసిరి.

"పూర్వకాలము నందును శాసనములను, సనదులను జాగ్రత్త చేసియుండిరి. కాని వారి యుద్దేశము వేరు. తమ తమ హక్కులను, ఈనాములను, అగ్రహారములను కాపాడుట వారి యుద్దేశము."

పూర్వులయుద్దేశ మటుండుటకుం గారణము శాసనాదులు హక్కులు మున్నగువానిని స్థిరపచుటకే పుట్టియుండుట.

అయినను సారస్వత బోధితమైన విషయమును ద్రోసివేయుటకుఁ దగినంత ప్రమాణశాసనము వలన లభించుచో నద్దానిని మహాభాగ్యముగ మనము దీసికొనవలసి యుండుననుటకు సందియ మావంతయు లేదు. కాని ఈ శిలాశాసన ప్రమాణముల నిచ్చుటలో గూడ మన శ్రీ లక్ష్మణరావుగారు మున్నగువారు దమ వాదములను నిలువఁ బెట్టుకొనఁ బ్రయత్నించుచున్నారు.

మన శ్రీ లక్ష్మణరావుగారు ప్రప్రథమమున బ్రమాణముగఁ దీసికొనివచ్చినది శ్రీ రామయ్యపంతులవారిచేఁ బ్రచురింపబడిన యుద్ధమల్లశాసన నామక శిలాశాసన రాజము. న్యాయముచే సత్యరతులెవరును నీ శాసనమును బ్రమాణముగఁ దీసికొన వలసినది కాదు. ఏమన,

## యుద్ధమల్ల శాసన ప్రశంస

ఈ శాసనము వ్రాయబడిన సంవత్సరాదిక మిందు నీఁబడియుండ లేదు. అది యసంపూర్ణము. ఈ శాసనకర్త యెవ్వరో నిశ్శంకముగ దెలియవచ్చుట లేదు. శాసనములో నుండు "రాజసల్కి" భూవల్లభుండనునది రాజుపేరనియు, యుద్ధమల్లుడనది విశేషణమనియు శ్రీనడింపల్లి జగన్నాథరావుగారు మున్నగువారు చెప్పుచున్నారు. ఇది ప్రతివాదులకు లాభించు వాదముకాదు. మన లక్ష్మణరావుగారు మున్నగువారు, 'యుద్ధమల్లు' డనునది రాజుపేరనియు, రాజసల్కి భూవల్లభుండనునది విశేషమనియు నుడువుచున్నారు. కాని ఈ వాద మంగీకరించినను నీ యుద్ధమల్లు డెవరో తెలియవచ్చుట లేదు. ఏమన

## యుద్ధమల్లుడు — మల్లపరాజు

ఇందు గుడికట్టించినరాజు వేఱనియు, మొగమాడువు కట్టించిన రాజు వేఱనియుఁ గొందఱి తలంపు. శ్రీ రామయ్యపంతుల వారి తలంపువారే. వీరు గుడికట్టించినవారు రాజనరేంద్రుని పూర్వులలోని మొదటి యుద్ధమల్లుడేమో యనియుఁ బ్రథమమున నూహించి మొదటి యుద్ధమల్లుఁడు రాజ్యముచేసినట్లు కాన్పించుటలేదు గావునను శాసనస్థ రాజు రాజ్యము చేసినట్లు తెలియవచ్చు చున్నదిగాఁ బట్టియును మొదటియూహ సరిపడకుండిన రెండవ యుద్ధమల్లుఁడే గుడి కట్టించిన వాఁడనియును వాని మనుమఁడగు మఱియొక యుద్ధమల్లుడు మొగ మాడువు కట్టించినవాడేమో యనియు శ్రీ రామయ్య పంతులువారు వ్రాసిరి. అన్నియును వారి యిష్టానుసారమగు నూహల మీదనే యాధారపడి యుండినవి. శ్రీ లక్ష్మణరావు పంతులవారు గుడి కట్టించినవాడును మొగమాడువు కట్టించినవాడును నొక్కఁడే యనియు నాతడు రెండవ యుద్ధమల్లుఁడనియు నూహించుచున్నారు. వాదము నిమిత్తము వీనిని గట్టించిన వాఁడొక్క యుద్ధమల్లుఁడేయని తలంతము. అయినను నిది సరిపడుటలేదు. ఏమన శాసన యుద్ధమల్లుడు మల్లపరాజు మనుమడని తెల్పఁబడియున్నది. కాని యుద్ధమల్లునికి మనుమడని తెల్ప బడి యుండ లేదు. రాజరాజనరేంద్రుని పూర్వులలో మల్లపరాజుమనుమ డగు యుద్ధమల్లుడెవ్వఁడును కానరాడు. ప్రథమ యుద్ధమల్లుని తాత విజయాదిత్యుఁడు. రెండవయుద్ధమల్లుని తాత యుద్ధమల్లుడు. అంతియే కాని మల్లపరాజు కాఁడు. ఈ ప్రథమయుద్ధ మల్లునకే మల్లపరాజను మాఱుపేరు గలదేమోయని యూహింతుమని శ్రీ రామయ్యపంతుల వారు సెలవిచ్చిరి. ఇట్లన్నియును మన యిష్టానుసార మూహింప వచ్చునా ? ప్రథమ యుద్ధమల్లునకు మల్లపరాజను మారుపేరు గల దనుటకు దగిన యాధార ముండవలదా ? తప్పక యుండవలెను. నామైకదేశే నామగ్రహణ మను న్యాయముచే యుద్ధమల్లునే మొదట

మల్లయ్య యని అయ్య, అప్ప అనునవి సమానార్థకములుగాన మల్లయ్యను మల్లప్ప యని యాపైన కులక్రమముగబట్టి రాజను శబ్దమును చేర్చి మల్లపరాజందుమని (శ్రీ) లక్ష్మణరావుగారు సెలవిచ్చిరి. సమానార్థమిచ్చు పదములు లోకములో రెండుండినను వానిని మన యిచ్చవచ్చినట్లంతటను వాడరాదు. ఆహవ మనినను యుద్ధమనినను నొక్కటియె యర్థము. అందు మూలముచే యుద్ధమల్లునే యాహవమల్లుడనవచ్చునా ? (శ్రీ) లక్ష్మణరావుగారు భీమసల్కి యన చాళుక్య భీముడనిరి. అట్లయిన నత్తిలి తామ్ర శాసనము వేయించిన ప్రథమ చాళుక్య భీముని భీమసల్కి యనవచ్చునా ? అత్తిలి తామ్రశాసనములో భీమసల్కి వేరుగను చాళుక్య భీముడు వేరుగను దెల్పబడిరి. మరి యెచటనుగూడ నీ చాళుక్య భీమసల్కి యనుపేరు వాడుట కానము. ఏ శాసనము చెప్పినను గాంగుల పక్షపువానికే భీమసల్కి నామము కాన్పించుచున్నది. వ్యవహారములో రెండు పేళ్ళుండు నెడల రెండును స్పష్టముగా పేర్కొనబడును. మల్లప్పయని మల్లయ్య యని పత్రములు మున్నగువానిలో వ్రాయుదురు యెందులకు ? ముందు సందేహము కలుగకుండుటకు వీరేశలింగము పంతుల వారు నామాది సామ్యముంబట్టి చేయు నూహాల సందేహములో బెట్టిరి కనుడు—

"అయినను కాల సామ్యమును, నామ సామ్యమును బట్టి చూడగా నా త్రిభువన బల్లి చోడమహారాజును నీ త్రిభువన మల్ల చోడ మహారాజును నొక్కరే యై యుండవచ్చునేమోయని సందేహము కలుగుచున్నది."

వీరేశలింగము గారిట్లు సందేహించుచుండగా మన శ్రీ లక్ష్మణ రావుగారిట్టి దుర్బలాధారములతోనే విషయ నిర్ధారణము చేయబోవుచున్నారు. మరియును వీరేశలింగముగారు "ఒక్క యక్షరమైనను హెచ్చుతగ్గులేక మూడు శాసనములలోను బిరుదాళి యొక్కటిగానే యున్నది." గాన నట్లు సందేహించుటమైన నొనర్తుమనగా మన

లక్ష్మణరావు గారుభయుల బిరుదావళులలోను నొక్క యక్కరమైన సరిపోకయుండినను నాతడే యీతడని సిద్ధాంతీకరింతుమనిరి.

## ఈ శాసన ప్రభు వంశము

ఈ శాసన ప్రభు వంశమైన సరిగ దెలియవచ్చినదేమోయన నదియు సందిగ్ధమే యైనది. చాళుక్య వంశజులు వ్రాయించిన శాసనము లందెల్లఁ దరచుగ వాడఁబడుచు వచ్చిన చాళుక్యకుల (చాళుక్యానాం కు ం) పదమిందు గానరాదు. వంశ విషయమై మే మనేకాంశముల చర్చించి యీతడు పూర్వ చాళుక్యరాజు కాడని తెల్పియున్నాము. మేము చేసిన ప్రధాన శంకలకు వేనికిని సమాధాన మీయకయె ఒక యల్పాంశమగు సల్కి శబ్దవిచారము మాత్రము బహ్వాడంబరముతో గావించి దానితో మావాద మంతయు నెగిరి పోయినట్లుగ (శ్రీ) లక్ష్మణరావుగారు విజయధ్వజమెత్తిరి. సల్కిశబ్దము చాళుక్య శబ్దమగుట యసంభమని నేను వ్రాసియుండలేదు. అయిన గావచ్చునని యే వ్రాసితిని. కావున గొన్ని తావుల నెచ్చటనో సల్కి శబ్దము చాళుక్య వంశజులతో సంబంధించి యుండినను మన శాసనము లందలి సల్కియను నక్షరములు చాళుక్య వంశముల దెల్పునని తలచుట కవకాశము కాన్పించుట లేదని నేను వ్రాసితిని. ఏలయన మన శాసనమున కులప్రశంసార్థకమై సల్కి శబ్దము వాడఁబడి యుండలేమ. రాజసల్కి భూవల్లభుండను సమస్తపదములో సల్కియను నక్కరములు కాన్పించుచున్నవి. ఈ సల్కి పదము ప్రతివాదులు చెప్పునట్లుగా చాళుక్యపద వికారమేయై యాసమస్త పదము చాళుక్య రాజను నర్థమిచ్చుటకై వాడఁబడిన దగుచో రాజసల్కి భూవల్లభుండని యెన్నడును వ్రాయబడి యుండలేదు. సమానార్థకములగు రాజశబ్ద భూవల్లభ శబ్దములను దెచ్చి వాని నడుమ సల్కి శబ్దమును బిగించి యొక సమస్తపదమే కవియును జేయడు. రాజసల్కి యని

యైన వ్రాయును. సల్కి భూవల్లభుండని వ్రాయునుగాని మూటికి ముడివెట్టడు. రాజసల్కి భూవల్లభుండను నర్థము వ్యర్థము. రాజరాజ నరేంద్ర శబ్దములో మూఁడేకార్థక పదములు (1. రాజ, 2. రాజ, 3. నరేంద్ర) లేవాయని (శ్రీ) లక్ష్మణరావుగారు శంకించిరి. ఇది సరి కాదు. రాజరాజనరేంద్ర శబ్దమందలి రాజరాజ శబ్దమొక పురుషుని పేరు. కావున రాజరాజనరేంద్రుడన వచ్చును. రాజరాజను పేరు గల నరేంద్రుడని యర్థము. రాజసల్కి భూవల్లంభుడనునది కూడా నట్టిది, యగుచో రాజసల్కియను పేరుగల భూవల్లభుండని యర్థ మగును. అంతియెకాని, చాళుక్యవంశజుఁడగు ప్రభువను నర్థమీయఁ జాలదు. రాజసల్కి యనునది పేరగుచో నీరాజసల్కి యెవరో తెలియవచ్చుట లేదు. పూర్వ చాళుక్యులలో రాజను పేరుగల నరేంద్రుడొకఁడు కలఁడు. భీమసల్కి యనినట్లే యతనిని రాజసల్కి యనవచ్చును. కాని యారాజసల్కి భూవల్లభుండు భారత కృతిపతి యగు రాజరాజనరేంద్రుడే. ఆ శబ్ద మాతనినే తెల్పును. కాని యితరాంశము లేవియు సంబంధించుటలేదు కాన నీశాసనము రాజ నరేంద్రుని దనుటకును నవకాశమంతగాఁ గాన్పించుటలేదు. ఒక్క రాజనరేంద్రుడననేల పూర్వ చాళుక్య శాసనమనుటకే, వలనుపడుట లేదు. అందులకీ క్రింది యంశములు ప్రధానములు బాగుగ చర్చించి సంశయ నివారణము చేయవలసినవియు నివియె.

## బిరుదములు

ఈ యుద్ధమల్ల శాసనములోఁ బూర్వచాళుక్యుల బిరుదము లేవియు గానరావు. చాళుక్య శాసనములలో నెంత చిన్న శాసనము నందైన వారి ప్రధాన బిరుదము లొకటి రెండయినఁ గాన్పించు చున్నవి. అవి యిందొక్కటియైనఁ గానరావు. ఈ శాసనములలో బిరుదములు వాడలేదనుకొందుమని యనునదియును సరికాదు. ఇంద

నేకములగు బిరుదులు వాడబడియున్నవి. అవియేవియుఁ బూర్వచాళు క్యులు బిరుదములు తెలియుటకు మన కనేకాధారములు కలవు. 1. శాసనములు, 2. శ్రీమదాంధ్రభారతము, 3. కావ్యాలంకార చూడామణి మున్నగునవి. ఇవి తెల్పు బిరుదములేవియు నీ శాసనమున గానరావు చదువరుల యుపయోగార్థమై శాసనస్థ బిరుదములను, బూర్వ చాళుక్య బిరుదములను నీక్రింద వేఱువేఱుగ నిచ్చుచున్నాను.

— యుద్ధమల్లి శాసనస్థ బిరుదములు —

1. నృపాంకుశుఁడు
2. సత్య త్రినేత్రుఁడు
3. రాజాశ్రయుఁడు
4. త్రిభువనాభరణుఁడు

... పూర్వచాళుక్య శాసనస్థ బిరుదములు ...

1. విష్ణువర్ధనుఁడు
2. త్రిభువనాంకుశుఁడు
3. సర్వలోకాశ్రయుఁడు. సర్వసిద్ధి
4. విషమసిద్ధి
5. విజయసిద్ధి
6. విక్రమరాముఁడు
7. నరేంద్ర మృగరాజు
8. సమస్త భువనాశ్రయుఁడు
9. చాళుక్యార్జునుఁడు
10. రాజమార్తాండుఁడు
11. పండరంగ భైరవుఁడు
12. సత్యాశ్రయుఁడు

చాళుక్యులు సర్వసాధారణముగా వాడుకొను బిరుదములు కూడ యుద్ధమల్ల శాసనములో లేవు. యుద్ధమల్ల శాసనములో నున్న వేవియును చాళుక్య బిరుదములలో కానరావు.

## 4. ఇందలి రాజులు

ఇందలి రాజు రాజసల్కి భూవల్లభుండని యిందుఁ దెల్పఁబడి యున్నది. ఈ రాజసల్కి యెవ్వరో తెలియవచ్చుట లేదు. యుద్ధ మల్లుడను పేరొకటి పూర్వ చాళుక్య నామములలోని యొకదాని వంటిది కలదు. కాని ఇతని తాత మల్లపరాజని తెల్పబడినది. ద్వితీయ యుద్ధమల్లుని తాతయగు యుద్ధమల్లునకు మల్లపరాజను పేరున్నదనుట కాధారము మృగ్యము. కావున నిందున్న రాజనామములు నసందిగ్ధ ముగ పూర్వచాళుక్యుల పూర్వుల నామములతో సరిగ సరిపోలేదు.

## 5. దీని కాలము

కాలవిషయములో మాకేకాక (శ్రీ) రామయ్య పంతులుగారికి కూడ సందేహము కలదని వారు వ్రాసిన వ్రాత తెల్పుచున్నది. శాసనము నందలి విషయముంబట్టి చూడ చేబ్రోలను గ్రామమునందలి కుమారస్వామి బెజవాడరాగా నచట నీ శాసనస్థ భూవల్లభుండు గుడి కట్టించెననియు ననఁగా చేబ్రోలు నందలి కుమారస్వామ్యాల యము పడిపోయి యందలి కుమారస్వామి విగ్రహము పూజా పుర స్కారములు లేక పడియుండగా దాని నీశాసనము వేయించిన యాతడు బెజవాడ తీసికొనివచ్చి యచ్చట గుడి కట్టించి యందు స్థాపించెనని భావమనియు (శ్రీ) జయంతి రామయ్య పంతులువారు వ్రాసిన దానివల్ల తెలియవచ్చుచున్నయది. కావున యుద్ధమల్ల శాసనము రాజన రేంద్రుని పూర్వులగు పూర్వచాళుక్యులు వ్రాయించిన దనుట కవకాశము గానరాదు.

## 6. శాసనస్థ రాజ మతము.

యుద్ధమల్ల శాసనము వేయించిన రాజు వీరశైవుఁడు. తాను కట్టించిన మఠములో శైవులు మాత్రమే బసచేయవలెననియు శైవేతరులు బసచేసికొనిన కాశిలో విశ్వేశ్వరుని లింగము పగులగొట్టినంత పాపము పొందుదురనియు నొట్టు పెట్టినాడు. ఎంత వీరావేశమీ రాజునకు గలదో బోధపడగలదు. రాజనరేంద్రుని పూర్వులు వీరశైవులు కారు. నారాయణ వరప్రసాద లబ్ధరాజ్యులు. వరాహలాంఛనులు కాన యొట్టు పెట్టినవారు వీరుకారు. శైవము రామానుజుని వైష్ణవము వచ్చిన తరువాత ముదిరి వీరశైవమైనది.

## 7. శాసన క్రమము

శాసనము పూర్వచాళుక్యులు చెక్కించు క్రమమున లేదు. ఈ యుద్ధమల్ల శాసనము 46 పంక్తులు గలిగి రాతికి నించుమించుగ నాల్గువైపుల వ్రాయబడియున్న పెద్ద శాసనమైనను చాళుక్యుల మానవ్యస గోత్రము కాని, మాతృగణ ప్రశంసకాని హారియిత కౌశికాది ప్రశంసగాని యిందులేదు. కావున ఇది పూర్వచాళుక్య శాసనమగునా కాదా! యను శంకకు లోనైరి. కాకతి గణపతిదేవుని కాలములో 1135వ శక సంవత్సరమందు చేబ్రోలునందు కార్తికేయాలయ మున్నట్లు శాసనముల వలన దెలియవచ్చు చున్నదనికూడ వారు వ్రాసిరి. దీనింబట్టి శాలివాహన శకము 1135 తరువాత గుడి కట్టించుట రాజనరేంద్రునకు తరువాతనైనది కాని పూర్వమైనది కానేరదు. శ్రీ రామయ్య పంతులుగారు యుద్ధమల్లుని కాలమునందె చేబ్రోలు నందలి కుమారస్వామి విగ్రహము బెజవాడ తీసుకొనిపోబడి యుండుచో కాకతి గణపతిదేవుని కాలములో మరల చేబ్రోలులో నెట్లుండ కలిగినదని శంకించుకొని పిచ్చి సమాధానముల నేమేమో చెప్పిరి. వానిం జూచినంత యవి యసంగతములని చదు

వరులకు బోధపడగలదు. ఈ కారణములచే నస్మదాదులము యుద్ధ మల్ల శాసన మనఁబడునది చాళుక్య శాసనము కాజాలదనియు రాజ నరేంద్రునకు పూర్వము పుట్టిన దనరానిదనియు వ్రాసియున్నాము.

ఈ శంకలకు వేనికిని శ్రీ లక్ష్మణరావుగారు సమాధాన మిచ్చి యుండలేదు ఈ శాసనము పదియవ శతాబ్దమునకు పూర్వము పుట్టి నిదని తెల్పుట కభ్యంతర మింకొకటి గలదు. బహుశాసన పరిశోధకు లగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రాజ రాజ నరేంద్ర పట్టాభి షేక సంచికయందు ప్రాచీనాంధ్ర భాషాస్వరూపమను తమ వ్యాస ములో నిట్లు వ్రాసిరి

"వారణాసిన్దచ్చువారు" "గంగ కలుత" - వీనిలోని "వార ణాసి" "గంగ కలుత" ఇయ్యవి క్రీస్తుశకము పదునొకండవ శతాబ్ది నుండి శాసనములందు గాన వచ్చునన్న పదములు." వీరు శాసనముల నన్నిటిని బాగుగ పరిశీలించి ఈ వాక్యరత్నముల వ్రాసిరి. ఇది సత్య మగు చో మన శాసనము పదునొకండవ శతాబ్దికి పూర్వము పుట్టినది గాఁజాలదు. ఏమన నిందు "నబ్బారణాసి వచ్చిన పాపంబు గొండ్రు అని వారణాసి యుదాహరింపబడి యున్నది. మరియు నిది బ్రాహ్మణ మతౌన్నత్యమును బోధించుచున్నది.

యుద్ధమల్ల శాసనము నందలి యుద్ధమల్ల శబ్దము దప్ప తక్కిన వేవియు ప్రతివాదుల కనుకూలించినవిగా లేవు. నామ సాదృశ్య మున్నంత మాత్రమున దక్కిన యంశములు ప్రతికూలముగా నుండి ననూ దీనిని రాజనరేంద్రుని పూర్వుడగు యుద్ధమల్లుని శాసనముగా గ్రహించుట మహా సాహసమగును. కవుల చరిత్రములు వ్రాయు టలో మనవారు నామ సాదృశ్యము నాధారముగా తీసికొని బహు స్థలములందు స్ఖాలిత్యములకు లోనగుచున్నారు. (1) కొమ్మన శివ లీలా విలాస మొనరించి నట్లుండగా నామ సాదృశ్యముం బట్టి తిక్కన

సోమయాజి తండ్రియగు కొమ్మన్నయే శివలీలా విలాసము వ్రాసినట్లు వీరేశలింగముగారు లిఖించిరి. శివలీలా విలాసము వ్రాసిన కొమ్మన్న వేరు. అది రచించిన కొమ్మన్న శ్రీనాథుని కాలములో నుండిన నిశ్శంక కొమ్మన్న. (2) భాస్కరనామ సాదృశ్యముం బట్టి భాస్కర రామాయణము రచియించిన కవి తిక్కన తాతయగు మంత్రి భాస్కరుడని వీరేశలింగంగారు వ్రాసివేసిరి. ఆ గ్రంథము వ్రాసినవాడు తిక్కన శిష్యుని కాలములోనున్న హుళక్కి భాస్కరుడు. కాని మంత్రి భాస్కరుడు కాడు. నామ సాదృశ్యముం బట్టి బాలచిత్తానురంజని యను కావ్యప్రకాశ వ్యాఖ్యను విరచించిన నరసింహశాస్త్రి తండ్రియగు మల్లినాథునకు పంచకావ్యవ్యాఖ్యాతృత్వమును గట్టిపెట్టిరి. పంచకావ్యములకు వ్యాఖ్యలు వ్రాసిన మల్లినాథుడు వేఱు. అతడి గోత్రము వేఱు. ఇంచుక నామసాదృశ్యముంగని వీన్నకోట పెద్దన్న ప్రద్యుమ్న చరిత్రమును విరచించెనని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసిరి. ఆ గ్రంథము వ్రాసినవాడు పొన్నాడ పెద్దిరాజుగాని విన్నకోట పెద్దన్న కాడు. నామ సాదృశ్యముం బట్టియే ప్రౌఢకవి మల్లన్నను బమ్మెర పోతన పుత్రుడని మనవారు భ్రమపడుచున్నారు. అతని తండ్రియగు పోతన వేఱు. గోత్రాదులందే భేదము కలదు. మల్లన్ననే తీసికొందము. నామ సాదృశ్యముచే భ్రిమపడి గణితము వ్రాసిన పావులూరి మల్లనయే భద్రాద్రి రామశతకమును విరచించినట్లు మనవారు తలంచిరి. గణితకర్తయగు మల్లన తండ్రిపేరు శివన్న. శతకకర్త తండ్రిపేరు రామన్న. ఇద్దరును వేఱు. నామ సాదృశ్యముం బట్టి చిత్రాంగి వలచిన సారంగధరుని జపించినవాడు భారతకృతిపతియని రాజనరేంద్రుడని మనవారు సాహసించి వ్రాయుచున్నారు. ఆ పని యొనరించినవాడు మాళవదేశాధీశుడగు మఱియొక రాజనరేంద్రుడు. ఇట్టి వనేకములు గలవు. అట్లే యుద్ధమల్ల నామ సాదృశ్యముం దీసికొని ఈశాసనము వేయించినవాడు రాజనరేంద్రుని

పూర్వుడగు యుద్ధమల్లు డనుట తగదు. అందులో ననేక ప్రధానాంశ ములు వ్యతిరేకముగా నుండగాకూడ నీ వాదము నల్పుట మహా సాహసము. శాసనములో నిద్దఱు యుద్ధమల్లులు వేరు. శ్రీరామయ్య పంతులుగారు మున్నగువారిద్దరు కలరని భ్రమపడిరి. శాసనమందలి యుద్ధమల్ల శబ్దము బిరుదమై విశేషణమై యుండవచ్చును.

## — శాసన లిపి —

శాసనము నందలి లిపినిబట్టి యయ్యాది రాజనరేంద్రుని కంటె ప్రాచీనమని వ్రాయఁ బ్రతివాదులు సాహసించిరి. ఇదియును దగదు. ఏమన నీ యుద్ధమల్లుని శాసనమునందు గల లిపి రాజనరేంద్రుని శాసనము లందుగూడ గాన్పించుచున్నది. అదిగాక యుద్ధమల్ల శాస నము నందలి పూర్వలిపికి గల హద్దేదో యెవ్వరును జెప్పలేకున్నారు. ఈ లిపిగల శాసనము లనేకముల కాలము మనకు తెలియవచ్చుట లేదు. అవి రాజనరేంద్రునికి దరువాతి వేమో? కావనుట కెవరి కధి కారము గలదు? యుద్ధమల్ల శాసనలిపి పూర్వలిపి పూర్వలిపి యని ఘోషించి మనవారు కొంత లోక ప్రతారణము చేయుచున్నారు. ఈ పూర్వ లిపికిని దాని తరువాత లిపియనబడు దానికిని వీరు చెప్పు నంతరము సత్యమే యగునెడల నది యెంత సూక్ష్మముగ నున్నదో కనుగొనుడు. రాజనరేంద్రుని పెద్ద తండ్రియగు శక్తివర్మ కాలములో యుద్ధమల్ల శాసనలిపియే వాడుకలో నుండెడిదని ప్రతిపక్షులే యంగీక రించి యున్నారు. అనగా రాజనరేంద్రుని కాలము వఱకు నదియే వాడుకలో నున్నది. ఇక రాజనరేంద్రుని కాలములో నన్ననో రాజ నరేంద్రుడు వ్రాయించిన నందంపూడి శాసనముం బట్టిచూడ నాతని కాలములో గూడ నీ లిపి వాడుకలో నున్నట్లు సుస్పష్టమగుచున్నది. మనవారు తెచ్చిన ముషాయిదావాదము మృషావాదమైనది. రాజ నరేంద్రుని కాలమునే మఱియొక లిపి ప్రారంభమైన దనుకొందము.

ఐనను నయ్యది ప్రారంభమైనది నాడు మొదలు లేఖకులెల్లరు రెండవ కత్తునే వ్రాయ మొదలిడిరనుట యసంభవము. కొందఱు క్రొత్త కత్తు వ్రాయుచుండ వచ్చును. మఱికొందఱు ప్రాతకత్తు వ్రాయు చుండవచ్చును. కొంతకాలమిట్లు నడచిన తరువాత ప్రాతకత్తుపోయి క్రొత్తకత్తు వాడుకలోబడి యుండవచ్చును. రాజనరేంద్రుని తరువాత గూడ గొంతకాలము వఱకు గొన్నిట ప్రాతకత్తే నిలిచియుండుట యసంభవము గానేరదు. కాన లిపినిబట్టి యుద్ధమల్ల శాసనము నన్న యకు పూర్వమని చెప్పబోవుట యనుచితము. కావున లిపి నాధా రము చేసికొని యీ శాసనము రాజనరేంద్రునికి పూర్వమే పుట్టిన దనుటకు వలనుపడుటలేదు.

మఱియును నీశాసనము నందలి కథనుబట్టి చూచినను నియ్యది ప్రాచీనమనుటకు సందర్భపడుటలేదు. ఏమన శ్రీ రామయ్యపంతుల వారు చేబ్రోలు నందలి కుమారస్వామి యాలయము పాడుబడిపోగా నందలి స్వామి విగ్రహము బెజవాడ దెచ్చి యచట నాలయముకట్టి యందు దానిని స్థాపించుటను గూర్చి శాసనము ముచ్చటించు చున్న దని తెల్చిరి. ఇంకను చేబ్రోలునందలి యాలయము కాకతీయ గణ పతిరాజు కాలములో ననగా 1135 వ శక సంవత్సరమున బాగుగనే యున్నట్లు తేల్చిరి. అటుపిమ్మట కుమారస్వామి విగ్రహము బెజవాడ వచ్చినది. కావున బెజవాడ యందలి కుమారస్వామ్యాలయము రాజ నరేంద్రుని తరువాత వెలసినదిగాని పూర్వము వెలసినది గాదు.

ఇట్లు ప్రధానాంశము లన్నియు యుద్ధమల్ల శాసనము రాజ నరేంద్రునికి బూర్వులగు యుద్ధమల్లులతో సంబంధములేనివగుచున్నవి. మన ప్రతివాదులు తమ సాహసాతిశయము నాధారముగా గొసికొని యీ నిరర్థక శాసనము నందలి పద్యముల నన్నయకు బూర్వపు వానినిగా జేయ విచిత్ర ప్రయత్నములు చేయుచున్నారు. ఈ శాసన

మెప్పుడు వ్రాయబడినది. యెవ్వరు వ్రాయించినది యను నంశములు సందేహములో బడినవి. పలువురు పండితులిది చాళుక్య శాసనము కాదనియు, నన్నయకు పూర్వము వ్రాయబడినది కాదనియు వాదించుచున్నారు. నేనును నీ విషయమై యొక వ్యాసమును వ్రాసి ఇవి యన్నియు బరిషత్పత్రిక, యాంధ్రపత్రిక, బాలభారతి, యార్యప్రభ లోనగు పత్రికలలో ప్రచురింపబడుచున్నది. శ్రీ నడింపల్లి జగనాథ రావుగారు, కార్చర్ల శ్రీనివాసరావుగారు, చిలకమర్తి నరసింహాచార్యులుగారు బి.ఏ., చంద్రాభట్ల రామమూర్తిగారు మున్నగు పండితులీ విషయమై విశేషచర్చ గావించి లక్ష్మణరావుగారి యభిప్రాయమును ఖండించి వేయుచున్నారు. ఇంతకు పూర్వమే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మున్నగువారు యుద్ధమల్ల శాసన పరిశోధనము గావించి దాని నన్నయ కీవల బెట్టియుండిరి♦ వీరికి సరి యగు సమాధానముల శ్రీ లక్ష్మణరావుగారీయలేదు. మఱియును నింత వివాదములోనున్న నిర్జీవ శాసనమునకు జీవము పోయనెంచి శ్రీ లక్ష్మణరావుగారు రెండు సంజీవనీ గుళికలను సిద్ధముచేసిరి. అవి యేవయన బై శాసనమందలి యక్కరమొక్కండు వింతవిలువతో నొప్పారి శాసనము నన్నయకంటె బూర్వము పడునట్లు చేసిన దనుట మొదటి గుళిక. ఆ యక్షర రాజమే దన నరవమునందు వింత యక్కరమై విరాజిల్లుచున్న నొక నొకనక్కరమంట. దీనింబట్టి వీరు శాసనము ప్రాచీనమని రూఢిచేయుదురట. మన పూర్వులకు శబ్దశాస్త్రజ్ఞత విశేషముగ గలదు. వారాంధ్రమునంగల యక్షరముల నన్నిటిని బాగుగ పరిశీలించి వానిలో సంస్కృతాక్షరములేవో, దేశభాషాక్షరములేవో విభజించి చూపి యున్నారు. మన లక్షణకారులు ఎ, ఒ, చ, జ ఱ, ౘ, యను నీ యారక్షరములును దేశీయాక్షరములని నుడివి యుండిరి కాని (♦) యను వింత యక్కరమును, దదుచ్చారణమును మన భాషలో నుండినట్లు తెల్పలేదు. అప్పటివారికి దెలియనిది నేటి

వారికి దెలియుననుటలో సందర్భములేదు. అయినను శ్రీ లక్ష్మణ రావుగారు తామీ వింతయక్కరమును గ్రొత్తగ గనిపెట్టితిమని యిదివర కెవరును గనిపెట్టలేదనియు వ్రాసిరి. వీరి వ్రాతపై నేనార్చిన పెద్ద విమర్శనమును బరిషత్పత్రికలో ప్రచురించితిని. దానికి శ్రీ లక్ష్మణ రావుగారు మరల సమాధానమీయలేదు. సమాధానమీయదగిన వ్యాసముకాదు కాన సమాధాన మీయలేదని ప్రచురింపించిరి. అంత టితో నూరకుండక మరల తమ యింటిలోఁగూడు గుడిచి విద్యగరచు చున్న మహారాజ రాజశ్రీ శ్రీ కానూరి వీరభద్రేశ్వరరావుగారి ద్వారమున నొక క్రోధసంజనిత బహువిధదూషణాంచిత సమాధాన మిప్పించిరి. దానికి నేను ప్రతి సమాధానము వ్రాయుచున్నాను. అదియంతయు నిచట నెత్తదగినది కాదు. అట్లు చేసినచో గ్రంథ విస్తరమగును కాన శ్రీ లక్ష్మణరావుగారి వాదవైఖరి బోధపడుటకై యొక్కయంశము దెల్పెదను.

శ్రీ జయంతి రామయ్యపంతులవారు యద్ధమల్ల శాసనములో నెచ్చటను నరవము నందలి వింతయక్కరమును కనిపెట్టియుండలేదు. వారు "డ"గా జదివిన వానిలో నివికొన్ని వింతయక్కరములని శ్రీ లక్ష్మణరావుగారు సెలవిచ్చిరి. ఆ వింత యక్కరముయొక్క రూపము శకట రేఫమునందలి అడ్డగీటును దీసివేయగా మిగిలిన రూపము వంటిది. (♦) ఈరూపము గలవానిని "డ"లుగ శ్రీరామయ్య పంతులవారు చదివిరి. శ్రీ రామయ్య పంతులవారు "డ"లుగ జదివిన చోటు లన్నిటిని శ్రీ లక్ష్మణరావుగారు బహు వివరముగా బరిశీలించిరి కాని యొక్కదానిని మాత్రమే విడిచిపెట్టిరి. అది యేఁడయన 'బెడగు' అనుపదము. ఇందలి 'డ' శాసనమందు శ్రీ లక్ష్మణరావుగారు చెప్పిన యడ్డగీటులేని శకటరేఫముగ (♦) నీబడియున్నది. కావున శ్రీలక్ష్మణ రావుగారు దీని నరవమునందలి వింతధ్వనితో "బె*గు" అని చదువ

వేసినది. అట్లు చదువలేము. (ఁ) అదియేమి చిత్రమో గాని దీని నొకదానిని మాత్రము చల్లగ జారవిడిచిరి. నేను నా వ్యాసములో నీ పదముపైకి శ్రీ లక్ష్మణరావుగారి దృష్టి పోలేదనియు దానికి కారణ మేమనియు నడిగితిని. అయినను శ్రీ వీరభద్రేశ్వరరావుగారి ద్వార ముగా నిప్పించిన విపుల సమాధాన రాజములో గూడ నిదిమెల్లగ జారవిడువబడినది. ఇది యట్లేల శ్రీ లక్ష్మణరావుగారి కటాక్షమునకు పాత్రము కాలేదనని బెడంగు శబ్దము కన్నడమునందును నరవము నందును "డ" కార యుతముగనే యున్నది. కాని "ఁ" కార యుతముగ లేదు. అనగ శ్రీ లక్ష్మణరావుగారి వాదమునకు భంగ కరముగ నున్నది. దీని మూలముగ శ్రీ లక్ష్మణరావుగారి వాద మంతయు బడిపోయినది. శ్రీ లక్ష్మణరావుగారు కాని వారి వీరభద్రే శ్వరరావుగారు గాని సమాధానమీయలేని స్థితిలోకి వచ్చిరి. ఇది (ఁ) కారవాదఫలము

ఇక రెండవ గుళికం గూర్చి ముచ్చటించుకొందము. మనవారు శాసనము నందలి తెనుగునలేని వింతయక్కర యొకండు తమకుశాసన కాలము దెలియజేయునని తలంచిన దాని కంటెను మిగుల వింతను బుట్టించు మరియొక యాధారాభాసమును వీరు 1922 సంవత్సరపు టుగాది సంచికలో ప్రచురించిరి. వీరికి నీసారి శాసన శిలయే యా శాసనము రాజరాజనరేంద్రునికంటె ప్రాచీనమని తెల్పుచున్నదంట. ఈ శాసనస్థ శబ్దార్థములు చెప్పనట్టియు నందలి రాజుల నామములు చెప్పనట్టియు వారి వంశమును జెప్పనట్టియు శాసనకథ చెప్పనట్టియు విశేషమును శాసనమేజాతిపై జెక్కబడియున్నదో యాజాయి వారికి తెల్పజొచ్చినదట. ఇది వింతకాదా !? అయినను ఆ శిల తెల్పిన క్రమమునుకూడ బరిశీలింతము. "శాసనపు జాతిని అడుగుడు" అని శ్రీ లక్ష్మణరావుగారు వ్రాయించిరి. యేమి సమాధానము చెప్పినది.

ఇట్లు దెల్పినది. దీనికి నాలుగు పలకలు గలవు. ఎదుటి పలకపై శాసనము ప్రారంభింపబడినది. దానికి నెడమవైపునున్న పలకపై గూడ శాసనము క్రిందనుండి మీదకు జెక్కబడినది. మిగిలిన శాసన భాగము కుడిప్రక్కనున్న పలకపై 9 పంక్తులుగా జెక్కబడి యున్నట్లు (శ్రీ) లక్ష్మణరావుగారే యంగీకరించిరి. మూడవ పలకైననగా గుడివైపు పలకపై దొమ్మిది పంక్తులను బదియవ పంక్తిలో మూడక్షరములను జెక్కబడినవి. ఇంకను రాయి విశేషముగ మిగిలి యున్నది. ఆ మిగిలినభాగ మలిఖితముగుచో దానిమీదనే మిగిలిన శాసనభాగము వ్రాయక 4వ ప్రక్క గొన్ని యక్షరములను వ్రాయుటకు గారణమేమి? కారణమిదియై యుండును. ఎదుటివైపు అంతయు వ్రాయుటయైన తరువాత దాని ఎడమప్రక్క నంతటను వ్రాసి లిపికారుండు కుడివ్రక్క శాసనము వ్రాయుచుండగా నీశ్వరభట్టు శాసన మడ్డువచ్చినది. ఆ హేతువుచే మిగిలిన పంక్తులకై లిపికారుడు 4వ వైపునకు బోయినాడు. ఈశ్వరభట్టు శాసనమంతకు బూర్వమే వ్రాయబడియున్నది. పిమ్మట యుద్ధమల్ల శాసనము లిఖింపబడినది. ఆ హేతువుచే లిపికారుడు మన కెదుటిప్రక్క నంతటను, దానియెడమ ప్రక్కనంతటను, గుడివైపున నుపరిభాగమున నీశ్వరభట్ట శాసన మడ్డు వచ్చు వఱకును శాసనము వ్రాసి తరువాత నీశ్వరభట్ట శాసన మడ్డు వచ్చుటచే శేషించిన భాగమును లిఖించుటకై నావలవైపుకుబోయెను ఇది రాయి తెల్పుచున్న రహస్యము నాల్గువైపుల జెక్కినను శాసన మసంపూర్ణమైనదని తెల్పుచున్నది. బిరుదావళులు మున్నగునవి చాళుక్య బిరుదావళులకంటె భిన్నములని ఘోషించు చున్నవి. ఈ శాసనము వ్రాయునప్పుడు కొంతభాగము వ్రాసిన తరువాత నీశ్వర భట్టు శాసనమడ్డురాగా నాల్గవ ప్రక్కకు మరల్పవలసి వచ్చినదని తెల్పుచున్నది. అనగా నన్నయకు దరువాత నీ శాసనము వ్రాయ

బడెనని తెల్పుచున్నది. చదువరులకీ విశేషములు విశదమగుటకై శాసనక్రమము దెల్పెడు పటము నిందిచ్చియున్నాను. తాయి చెప్ప దానిని శ్రీ లక్ష్మణరావు గారావేశపూరితులై యుండుటచే సరిగ తెలిసికొనలేకపోయిరి. శాసనములో గాలము లేకయుండగా, శాసనస్థ పురుషులేవంశస్థులో తెలుపుటకు సరియగునవకాశము లేకయుండ,నందలి

యుద్ధమల్ల శాసన పటము,

తాతియొక్క నాల్గుప్రక్కలలోను మొదటి ప్రక్కకుఁ గుడి యెడమలనున్న ప్రక్కలుచీల్చి మొదటి ప్రక్కయున్న వైపుకు మడిచి పెట్టబడినవనియనుకొనుడు. మొదటి ప్రక్కకు వెనుకవైపునున్న నాల్గవప్రక్కను చీల్చి మొదటి ప్రక్కమీదికి మడచితి మనుకొనుడు. ఈ విధముగా తాతియొక్క నాల్గు ప్రక్కలును చదువరుల యెదుట పెట్టబడినవని యనుకొని శాసన రహస్యము గ్రహించుకొనవలయును.

## రాజేంద్రచోడ దేవుని శాసనము

### యుద్ధమల్ల శాసనము.

(మొదటిప్రక్క అనగా శాసనము ప్రారంభమైన ప్రక్క)

1 స్వస్తి శ్రీ శాంక శాత్యాన్తవత్స
2 ల సత్యత్రినేత్ర। వి స్తర శ్రీయుద్ధ
3 మల్లుణ్డ నవద్య విఖ్యాతకీర్తి
4 ప్రస్తుత రాజాశ్రయుణ్డు ప్రభు
5 ధనాభర నుణ్డు సికల। వస్సుస
6 మే తుణ్డు రాజసల్కి భూవల్లభు
7 ణ్డత్తిఁ। పరగంగ బెజవాడం గొమ
8 రస్వామికి భక్తుణ్డై గుడియు। ని
9 రుపమ మతి నృపధా ముణ్డైత్తిచ్చె

10 నెగి దచ్చెఁ మఠంబు। గొఱ [గ] ల్గా
11 లిన్దు విడిసి బృన్దంబు గొనియు
12 ణ్డు వారు। (ఎ) రిగాక యబ్బార
13 నాసి వచ్చిన పాపంబు గొ
14 ణ్ట్రు। వెలయంగ నియ్యెట్టుడస్ని
15 షులిన్నరై విడిసిన బో్రి
16 ల। గల తాను పతులనురా
17 జు పట్టంబు గట్టిన పతి

యుద్ధమల్ల శాసనము

(రెండవప్రక్క అనగా ఱాతియొక్క యెడమప్రక్క క్రిందినుండి మీదికి జదువనో)

36 బుగాఁగ
35 త్రిదప్ని యడి వుటవా
34 రదీని న్దారు ఁల్పినవారు
33 యిస్తి సేకొణి కాచు
32 ను బెట్టి వేరుగనుజ
31 ఱాణ్డు పోటి గోరగ
30 లుయే వెఙు రత్రిర బేలు
29 నుంగార్తి కేయునకు
28 ర్తించె గుడియు మఠంబు
27 బయన్న నిచ్చ। గని మల్లణ్ణె
26 ణ్డుసేకొని యిన్దు ప్రిత్యక్షు
25 చ్చక తివిజెయిన్నెలవ। యనఘు
24 యనుసుతణ్డ్రొణ్డు పోటు మె
23 వాడ జాత్రికువచ్చి। త్రిణ

22 (న) నుతచే బ్బోలనుణ్డి బెజ
2i డిసిన పాపంబు దమకు । జ
20 ఫలంబు పేక్షించి నాలింగ బ
19 వెల్వాటించిన నశ్వమేధంబు
18 యు । నవియం బయ్యారల

యుద్ధమల్ల శాసనము

(మూడవప్రక్క అనగా తాతిరొక్క కుడిప్రక్క)

37 రమనతో బెజవాడ కెల్ల
38 బెడుంగున రక్షయుంగాను
38 న్దమతత మల్లపరాజువే (౧)
40 రడుదానుం గట్టించె । ం గ్రమ
41 ంబున దానిక కలశబిడ్డ
42 ల్లునాగ మొగమూడు । వమ
43 రంగ(శ్రీ)యుద్ధ మల్లుణ్డొత్తి
-4 ంచె నమిత తేజుండ్డు । తన
45 ధమ్మర్మ వొడంబడి కాచునృపు
46 లకున్ద

(ఈశ్వరభట్టు శాసనము)

యుద్ధమల్ల శాసనము

(నాల్గవప్రక్క అనగా మొదటిప్రక్కకు వెనుకవైపునున్న ప్రక్క)

47 బుణ్డు

'రాజసల్కి భూవల్లభుండ' ను పదము కొరకకాన్నిదై యుండ జాళుక్యుల బిరుదములందు లేక యన్యుల బిరుదములందుండ నీ ప్రధానాంశమున కన్నిటికి సమాధానము చెప్పకయే శాసన శిలయే సమాధాన మీయ

గలదనియు, నొక్క యక్కరమే కాలము దెల్పగలదని వ్రాయుట సాహస యుక్తమైన దుర్బలపువ్రాత కాదా? ఇట్టి దుర్బలపువ్రాత వ్రాసి బహుపండితులచే శంకింపబడిన తమ దుర్బలవాదమును నిలుపుకొన విశ్వప్రయత్నముచేసిన శ్రీవేంకట లక్ష్మణరావు పంతులువారు తమ యధ్యక్షోపన్యాసములో యుద్ధమల్ల శాసన వాదముల గూర్చి యేమి వ్రాసిరో గనుడు.

"నన్నయభట్టునకు బూర్వము తెలుఁగునఁ బద్యరచన లేనే లేదనియు, నది నన్నయచే నూతనముగఁ బుట్టింపఁ బడెననియుఁ దలఁచెడు పండితులు కొందఱు మన దేశమునందుఁ గలరని మీరెఱుంగుదురు పూర్వ లిపి శోధన శాఖ వారికి బెజవాడలో యుద్ధమల్లుని శాసనము దొరకినప్పటి నుండియు నీ వాదము పూర్తిగ ఖండితమైనది."

"అయినను నిందుకు నొప్పుకొనని వారు గొందరు కలరు. ఇంగ్లండులో నింకను భూమి గుండ్రముగ లేదు. బల్ల పరుపవలెనే యున్నదని వాదించువారు కూడ గలరు. వారికి సమాధానము చెప్పుట యెవరి తరము?"

శ్రీలక్ష్మణరావుగారి ధైర్యము కొనియాడ దగినదియే. ఏమన యుద్ధమల్ల శాసనము సందేహములమూట. శాసన మొకటా, రెండా, మూఁడా యను సందేహము పండితులకు గలదు. 1) శాసనకాల మేది యనునది సంశయాస్పదము. 2) శాసనము వ్రాయించిన రాజెవరనునది సందేహాస్పదము. వాని వంశ మేదనునది శంకనీయము. వాని బిరుదు లేవనునది చింత్యము, వాని పూర్వులెవరనునది తర్క్యము. ఇది యేల యసంపూర్ణమనునది యాలోచనీయము. శాసన లిపియొక్క ప్రాచీనత పరిశోధనీయము. ఇందు '◆' అను వింత ద్రావిడాక్షర మున్నదా లేదా యనునది పరిశీలనీయము. ఇందలి కొన్ని ప్రధాన

వాక్యముల యర్థము దుస్సూహ్యము. ఇట్టి శాసన రాజము ప్రాచీన మగునా గాదాయని శంకించుట భూమి గుడ్రముగా నున్నదా బల్ల పరుపుగానున్నదా యని శంకించుట వంటిదని మన లక్ష్మణరావుగారు శెలవిచ్చిరి ఇది పెద్దవింత. ఇట్టి ధైర్యోక్తులు పలికిన లక్ష్మణరావుగారు కూడ మొదట నీ శాసము ప్రాచీనమగునో కాదోయని భయంపడి తమవాదమును నిల్పుకొనుట కయి శాసనాంతర సాహాయ్యముంగోన విశ్వమునంతను గాలించిచూచి, రెండు శాసనరాజముల సంపాదించి తమ యధ్యక్షోపన్యాసములో వానిని నేర్పుమీర నెక్కించిరి. మొదట నీ నూతన శాసన రాజములఁ బీఠికాపురములో జరిగిన యాంధ్ర సాహిత్య పరిషత్సభలో జదువుటకు నిశ్చయించిరిగాని యే హేతువు చేతనో యట్లు చేయలేదు. అయినను చిరకాలములోనే జరిగిన చిత్రాడ సభలో వానిని బ్రకటించి నందులకు వారలకు మనమెల్లరము కృతజ్ఞులమై యుండవలసియున్నది. కాని వీని ప్రకటనమైనను ధారాళముగ జరిగియుండిన బాగుగ నుండి యుండును కానిండు. ఆశాసనములఁ గ్రమముగాఁ బరిశీలించి చూచుకొందము.

వీరు మొదట నిచ్చిన శాసనము నెల్లూరు ఇన్‌స్క్రిప్షన్ అను గ్రంథముయొక్క రెండవ సంపుటములో 544 వ పుటలో నీయఁబడినదఁట. ఈ శాసనమున సీసపద్యము కలదట. దీనిని మన లక్ష్మణరావుగారు ప్రకటించుటలోగూడ గొంత చమత్కృతి గలదు. నెల్లూరి శాసనములను గ్రంథములను బ్రచురించిన శాసన పరిశోధకాగ్రగణ్యులా శాసనము పద్యమయమని వ్రాయలేదు. వారిచ్చిన పాఠమునకును నాగ్రంథములోనిదని మన లక్ష్మణరావు గారిచ్చిన దానికి భేదము కలదు. ఆగ్రంథములో నున్న దానిని దాము తమ యిచ్ఛ వచ్చినట్లు దిద్ది తామట్లు దిద్దిన రూపముతోనే గ్రంథస్థ పాఠముగా మనవారిచ్చిరి. దానిని సీసపద్యము చేయుటకై మఱల మఱలఁ దమ

దమ యిచ్చవచ్చినట్లు దిద్ది మూడవ రూపమును ప్రకటించిరి. తాము సంస్కరించి సంస్కరించి ప్రచురించిన యీ మూడవ రూపము సీస పద్యముగా నున్నదట. ఇట్లు రెండు బట్టీలు పెట్టి తుదకు సీసపద్య సారమును మనవారు దింపిరి. చదువరుల యుపయోగార్థమై యీ మూడు రూపముల నీక్రింది నిచ్చుచున్నాను.

నెల్లూరు శాసనముల గ్రంథములో నున్న రూపము

మొదటివైపు (I st side)

1. (శ్రీ) నిర వద్యుణ్డు
2. సిత్త... సముణ్డు శివ
3. పదవర పవిత్రుణ్డ
4. ఖిలుణ్డా నృత రిపు బ
5. లుణ్డా హ వరాద్యుణ్డ (రామణ్డ)
6. యోధ్యా సింహాసనుఙ
7. గణిత దాన మాన్యుణ్డు గజ

రెండవవైపు (2nd side)

1. లయుణ్డ... త్యసణ్డ
2. నపణ్డరగుం వ్వ చ్ఛణీయుగాని
3. కోలడివేని కోట్ట బుం ల్వోడి (చి)
4. గోణ కేనల్లా తని పక్షపాత
5. సలవిత... పదగ
6. ... ... ...న

మూడవవైపు (3rd side)

తాకాన్ను విధభ గోకవ

గ్రంథస్థ రూపమని శ్రీలక్ష్మణరావుగారు తమ యధ్యక్షోప న్యాసములో నిచ్చినదీ క్రిందిది.

మొదటి ప్రక్క

1. శ్రీనిరవద్యుణ్డు
2. సి త్త... సముణ్డు శివ
3. పదవరా... సేవితుణ్డు
4. ఖిలుణ్డు నృతరిపుబ
5. లుణ్డా హావ రావ రావ రణ్డ
6. యోధ్యా సిఘాస నుణ్డ
7, గణిత దాన మాన్యుణ్డ గజ ( ? )

రెండవ ప్రక్క

8. లయుణ్డ ..హావణ్డ
9. నపణ్డరంగు, ద్వి...చ్ఛణి యుగాన్ధి
10. కోలడిలేని కొట్టంబు గ్వాడిచి
11. గోణకెనల్లా తని పక్షపాతి
12. నబలిత...పగద
13. ... ... ... ...న

మూడవ ప్రక్క

14. తాకాన్ను విభ గౌరవెన్ద్రి

దీనిని లక్ష్మణరావుగారు సీస పద్యముచేసి యిచ్చిన రూప మీ క్రిందిది.

"సీస పద్యము"

సీ॥ శ్రీనిరవద్యుణ్డు। సిత్త జాత సముణ్డు
శివపద వ (ర) రాజ్య। సేవితుణ్డు
2. ఖిలుడు నన్నృత రిపు। బలుడు నాహా వరావ
రణ్డ యోధ్య సిఘాస। నుణ్డగణిత
3. దానమాన్యుణ్డు (దయాని) లయుణ్డు (మ)
(భణ్డన) సణ్డన రణ్డ రంగు

4\. ... ... ... కొలడి లేని

కొట్టము రొబ్బడచి । గోణకనల్ల

5\. తని పక్షపాతి

6\.

7\.

8\. ... ... ... విభవ । గౌరవేంద్ర.

ఈ విధముగ మన లక్ష్మణరావుగారు రెండు బట్టీలపెట్టి సారమును దింపి తుదకు శాసన వాక్యముల నొక సీసపద్యాభాసము గావించిరి. మొదటి రూపమును దిద్దిన క్రమము.

మొదటి పాఠములో మొదటి పంక్తిలో శ్రీనిరవద్యుణ్డు అను పదము తరువాత రెండు చుక్కలు శాసన లిపిజ్ఞులచే పెట్టబడియున్నవి. అచట రెండక్షరములు లోపించినవని భావము. నెల్లూరు శాసనములను గ్రంథములో నీబడిన శాసనపటముంజూడ నచట రెండక్షరములు పట్టగలిగినంత చోటుల యలిఖితమగు భాగమున్నట్లు గాన్పించుచున్నది. రెండక్షరములు లోపించి యుండునని లిపిశాస్త్రజ్ఞులు తలంచినది సరిగనేయున్నదీ. అయినను మన శ్రీ లక్ష్మణరావుగారు దానిని బాటింపక "శ్రీ నిరవద్యుణ్డు సిత్తజాతసముణ్డు" అని వ్రాసివేపిరి. అట్లు వ్రాయకున్న పద్యము కుదరదు. లిపి శాస్త్రజ్ఞులు తలంచినట్లుగా శ్రీనిరవద్యుణ్డు సిత్త జాతసముణ్డు అను పదములకు నడుమనున్న రెండక్షరములు పట్టతగిన యెడమును బూర్తిచేసి "శ్రీనిరవద్యుణ్డు ద్యుతి సిత్త జాత సముణ్డు అని లిఖించిన సీసపద్యము చెడును. పద్యము చెడినను శాసనములో 'శ్రీనిరవద్యుణ్డు' అనుదానికిని 'సిత్తజాత సముణ్డు' అను దానికిని నడుమ రెండక్షరములు పట్టదగిన యెడమున్న మాట సత్యము. దొరతనము వారిచే నెన్నికగన్న పూర్వలిపిజ్ఞులచట రెండక్షరములో లోపించి యున్నవని వ్రాసిరి. ఈ లిపి శాస్త్ర

జ్ఞులు చాల ప్రౌఢులని మన లక్ష్మణరావుగారి వీరభద్రేశ్వరరావుగారు వ్రాసియుండిరి. ఇట్టి ప్రౌఢులగు పండితశిరోమణులు వ్రాసిన దానిని శాసనమును స్పష్టముగా నవకాశము కలిగియున్నదానిని మనవారు పాటింపక యెట్లో మొదటి పంక్తుల నొక సీసపద్యపాదార్థము చేయ ప్రయత్నించిరి. అది యసంగతము. నడుమద్యుతి (న్) అనియో మఱి యేదియో రెండక్షరములమాట యుండవలయును. అది యుండిన సీసపద్యము యొక్క మొదటి యర్ధభాగము కానేరదు.

## —రెండవ యర్ధభాగమును గూర్చి—

మొదటి పాదము యొక్క రెండవ యర్థభాగమని మన లక్ష్మణరావుగారు తలంచినది, శాసనముల గ్రంథములో శివపదవర-పవిత్రుణ్డ అని యున్నది. ఈ రెండవ యర్ధము పూర్తిచేయుటలో శాసనములో నెడములేకున్నను 'రా' యను క్రొత్తయక్కరము నొక దానిని వారలనవసరముగా వ్రాసియుండిరి. ప్రౌఢులగు దొరతనమువారి లిపి శాస్త్రజ్ఞులు వ్రాసిన 'పవిత్రుణ్డో' అను పదమును దీసివేసి, 'సేవితుణ్డో' అని పెట్టిరి. న్యాయముచే శాసనములో నొక్క యక్కరము లోపించినట్లున్నది. దానిని (శ్రీ)పవిత్రుణ్డు అనిన మంచి యర్థము కలిగియుండును. అయినను మన లక్ష్మణరావుగారు దానిని సీసపాదోత్తరభాగము చేయుటకై 'శివపద వరరాజ్య సేవితుణ్డు' అని వ్రాసివేసిరి.

ఇక రెండవ పాదమును గూర్చి విచారించికొందము. మూలములో దరువాతి పంక్తులిట్లున్నవి.

'ఖలుణ్డా నృతరిపు బలుణ్డా హావరాద్యుణ్డ (రామణ్డ) యోధ్యా సింహాసనుణ్టటిత వీనిని బద్యముచేయుటకై వారలిచ్చిన మొదటి పాఠముం గనుడు.

"ఖలుండనృత రిపుబలుండా హావరావణ్డ" దీనిని సీసపాదము చేయుటలో.

"ఖిలుడు వనృత రిపుబలుడు నాహవరావరణ్ణ యోధ్యసిఘూ సరుణ్ణ గణిత"

అని దిద్దిరి. ఈ దిద్దుటలో ఖిలుణ్ణు మున్నగు వానిని ఖిలుఁడులో నగు రీతిగా దిద్దుట నందరుఁ జేయుచున్నదే యనుకొన్నను ఆహావ రావ రావ వరణ్ణ యను దానిని యాహవరావ వరణ్ణాయని దిద్దుటలో స్వారస్యము కాన్పించుటలేదు. ఆహావరా వరుంఢనినను అర్థములేదు. ఆహావరా వరా వరుండనినను నర్థములేదు. అట్టి స్థితిలో మూలములో నున్న యక్షరములు తీసివేయుట యెందులకు? పనిపట్టి పద్యముచేయు టకై చేసిన దిద్దుపాటు అర్థ శూన్యము. శాసన గ్రంథములో ఆహావ రాముఁడని యున్నది. అందర్థము కలదు. కాని పద్యపాదముచెడును.

మరియును మూలములో ఖిలుండా నృతరిపు బలుఁడని యున్న దానిని ఖిలుడు వనృత రిపుబలుడని వీరు దిద్దిరి. శాసనలేఖకునిచే నడా గమము చేయవలసినచోట నుత్వ సంధి చేయబడినదని వారలు శెల విచ్చిరి. ఇచ్చట నడాగమమేల యుండవలయునో తెలియుటలేదు. ఖిలుడు ననృత రిపుబలుఁడునను దానిలో నున్న 'న' (ను) సము చ్చయ మగును. గాని యాగమ 'నట్టు' గాదు. ఖిలుడును అనృతరిపు బలుడునని పదవిభాగమువారి మూలములోని ఖిలు డనృత రిపు బలు డనునది న్యాయమగు రూపమే. నడాగమ మిట నవసరములేదు. అది యటుండ మూలములో అనృత రిపుబలుండని యుండగా వీర నృత రిపు బలుడని దిద్దిరి. అర్థమేమో. ఇదియు వ్యర్థమగు దిద్దుబాటే. రెండు పదములకు నడుమ సముచ్చయమగును. ఉండుచో నచట మూలములో నుత్వసంధి లేకయే యుండియుండును. పద్యముచేయు టకై మనవారు నడాగమమును దెచ్చిపెట్టిరి.

మూడవ పాద విచారము.

ఇది మూలములో "దాన మాన్యణ్ణుగ జలయుణ్ణ త్వేషణ్ణ నషణ్ణ రగుం" దీనినిఁ దాము మొదట దిద్దిన పాఠములో నిట్లు వ్రాసిరి.

"దాన మాన్యోణ్ణుగ జలయణ్ణ... హావణ్ణ నపణ్ణు రంగు"

దీనిని సీసపద్యపాదముల చేయుటలో విశేషములగు మార్పులు చేసిరి. ఉన్నపదములతీసి పారవైచిరి. లేనిపదముల స్వేచ్ఛగా దెచ్చి పెట్టిరి. మూలములో గజ, అని యుండగా దానిని తీసి పారవైచిరి. ఎందులకు తీసి పారవేయవలసి వచ్చెనో తెలియ వచ్చుటలేదు. మూలములో గజలయుణ్ణు అని యున్నదానిని గజాలయుణ్ణు అని దిద్దిన నర్థవంతమై యుండును. అట్టి దానిలోని గజయను రెండక్షరములను తీసి పారవైచి యాతావున దయాని యని మూడక్షరములఁ బెట్టిరి. ఇట్లు పెట్టుటకుగల కారణము యతిని గల్పించుటకు గాక మరెందునకును గాదు. అదిగాక సణ్ణనయను నొక యద్భుతపదమును మూలములో లేనిదానిని తెచ్చియతికిరి. ఇట్టి పెద్దమార్పులచేయగా నది యర్థము లేని సీసపాదమైనది.

నాల్గవ పాద విచారము

మూలములో నాల్గవ పాదము క్రింద రాఁదగినవి క్రింది పదజాలములై యున్నవి.

వ్వచ్ఛణీ యుగాన్ధి కోలడిలేవి కొట్టం బుల్వోడిచి గొణకెనల్లా.

వీరు మొదట నిచ్చిన పాఠము.

వ్వి...చ్ఛణి యుగాన్ధి కోలడిలేవి కొట్టంబుల్వోడిచి గొణకెనల్లా.

ఇవి నాల్గవ పాదము కాఁదగిన పంక్తులు. మన శ్రీలక్ష్మణరావు గారు పద్యముచేయుటలోఁ వ్వచ్ఛణీ యుగాన్ధి (వ్విచ్ఛణి యుగాన్ధి) అను పదములను లాగి పారవైచి పాదములోఁ గొంతభాగమే పద్యరూపములో నిచ్చిరి. దీనిని సీస పాదము చేయవలయునన్న నవకాశము చిక్కినది కాదుఁకాబోలు. పోనిండు యీ పాదములో మొదటి యర్థభాగము కుదిరినదికాదు. ద్వితీయార్థభాగమైనను శాసనములో

నున్నట్లు తామిచ్చిన రూపముం బట్టి చూచిన లక్షణయుక్తముగా లేదు. శాసనస్థ రూపమని వీరిచ్చిన దీ క్రిందిది.

"కొట్టంబు ల్వోడిచి గొణకే నల్లా"

సున్నను దీసి వేసిన "కొట్ట ము ల్వోడి చి గొణకె నల్లా" ఇట్లు సరిగ నుంచినఁ బాదము చెడినది. ఆ హేతువు చేసి చే, వల్లాను, నల్ల చేసి యీ యర్థభాగము కుదిరినట్లు సంతసించిరి. ఏమయిన నాల్గవ పాదము కుదరలేదు.

శ్రీ లక్ష్మణరావుగారీ యర్థము నీ క్రింది రీతి నిచ్చిరి

"కొట్టుము ల్వోడిచి గొణకె నల్ల"

ఇది యర్థశూన్యము. కొట్టుము ల్వోడిచి అని మొదటున్న రూపమే అర్థవంతముగా నున్నది. కాని ఛందస్సు చెడినది. ఆహేతువుచే వోడుచు ధాతువుయొక్క క్త్వార్థక రూపమై యర్థవంతమైయుండు వోడిచి యను దానిని బోడిచి అను నర్థశూన్యమగు నక్షరపంక్తిగా నొనర్చి ఛందస్సును సరిపెట్టిరి. ఇట్లెన్ని చిక్కులు వచ్చిపడినను దుదకు పాదములో నొక కొంత భాగమే కుదిరినదిగాని యంతయును గుదిరినదికాదు.

శ్రీ లక్ష్మణరావుగారు మూడవ పాదమును నాల్గవ పాదమును గుదురలేదనియు మొదటి రెండు పాదములు మాత్రమే కుదిరినవనియు విస్పష్టముగా నంగీకరించి యీ క్రింది వాక్యములను వ్రాసియున్నారు.

"ఈ పద్యమందలి రెండు చరణములు స్పష్టముగ నున్నవి. అందుపోయిన మూడు నాల్గక్షరములును మన యూహచే బూర్తిచేసి రెండుతావుల ఉత్వసంధిని విడదీసిన యెడల యతులతో గూడ సీస పాదము లేర్పడుచున్నవి. మూడవపాదములో సగమును నాల్గవ పాదమున నుత్తరార్థమును యిట్లే స్పష్టపడుచున్నవి.

దీనిం బట్టి ఎన్నిమార్పులుచేసి పద్యమొనరింప నెన్ని ప్రయత్న

"దాన మాన్యోణ్ణుగ జలయణ్ణ... హావణ్ణ సపణ్ణు రంగు"

దీనిని సీసపద్యపాదముల చేయుటలో విశేషములగు మార్పులు చేసిరి. ఉన్న పదములతీసి పారవైచిరి. లేనిపదముల స్వేచ్ఛగా దెచ్చి పెట్టిరి. మూలములో గజ, అని యుండగా దానిని తీసి పారవైచిరి. ఎందులకు తీసి పారవేయవలసి వచ్చెనో తెలియ వచ్చుటలేదు. మూలములో గజలయుణ్ణు అని యున్నదానిని గజాలయుణ్ణు అని దిద్దిన నర్థవంతమై యుండును. అట్టి దానిలోని గజయను రెండక్షరములను తీసి పారవైచి యాతావున దయాని యని మూడక్షరములఁ బెట్టిరి. ఇట్లు పెట్టుటకుగల కారణము యతిని గల్పించుటకు గాక మరెందునకును గాదు. అదిగాక సణ్ణనయను నొక యద్భుతపదమును మూలములో లేనిదానిని తెచ్చియతికిరి. ఇట్టి పెద్దమార్పులచేయగా నది యర్థము లేని సీసపాదమైనది.

నాల్గవ పాద విచారము

మూలములో నాల్గవ పాదముక్రింద రాఁదగినవి క్రింది పదజాలములై యున్నవి.

వ్వచ్ఛణీ యుగాన్ధి కోలడిలేవి కొట్టం బుల్వోడిచి గొణకెనల్లా.

వీరు మొదట నిచ్చిన పాఠము.

వ్వి...చ్ఛణి యుగాన్ధి కోలడిలేవి కొట్టంబుల్వోడిచి గొణకెనల్లా.

ఇవి నాల్గవ పాదము కాఁదగిన పంక్తులు. మన శ్రీలక్ష్మణరావు గారు పద్యముచేయుటలోఁ వ్వచ్ఛణీ యుగాన్ధి (వ్విచ్ఛణి యుగాన్ధి) అను పదములను లాగి పారవైచి పాదములోఁ గొంతభాగమే పద్యరూపములో నిచ్చిరి. దీనిని సీస పాదము చేయవలయునన్న నవకాశము చిక్కినది కాదుఁకాబోలు. పోనిండు యీ పాదములో మొదటి యర్థభాగము కుదిరినదికాదు. ద్వితీయార్థభాగమైనను శాసనములో

ముల దిద్ది యర్థశూన్యములగు రెండు సీసపాదాభాసముల నొనరించి శాసనము సీసపద్యమయమనుట ధర్మమెన్నటికిని కానేరదు. వీరు దిద్దిన రీతిగా దిద్దిన వచనములనన్నిటిని వీరుచేసినరీతి సీసపద్యముల గావింపవచ్చును.

## ఇందలి యతి ప్రాసములు

వీరు శాసన వాక్యముల నిచ్చవచ్చినట్లు దిద్ది బలవంతముగా నొక కొన్నిచోట్ల యతిప్రాసముల గల్పించి యిందు నయ్యవి పొడగట్టుచున్నవని వ్రాసిరి. బలవంతముగ నిచ్చవచ్చినట్లు దిద్దిన యెడల యతిప్రాసము లెచ్చట నుండవు? అయినను వీరు కల్పించిన సీసము నందయినను నున్నవఙ్కైనను యథాన్యాయముగాలేదు. నన్నయ నాటి సీసములను కన్నడ సీసములను గన నాదికాలపు సీసములు యతి ప్రాసనియముల హెచ్చుగా గలిగియున్నట్లు స్పష్టముగా తెలియ వచ్చుచున్నది. ప్రస్తుత సీసపద్యాభాసమట్టి కట్టునకు లోనై యతి ప్రాసముల హద్దు పూర్వపు రీతి నందియున్నట్లు కాన్పించుటలేదు. కాన నీయది ప్రాచీన కాలపు సీసపద్యాభాసమైనను కానేరదు.

మఱియును శ్రీలక్ష్మణరావుగారు మూలమునందలి యక్షరములను, పదములను, వాక్యములను, పద్య పాదములను, దమ యిచ్చ వచ్చినట్లు పూర్తిగ తీసియు లేనివి వేసియు పెద్దపెద్ద మార్పులు పెట్టి యుండిన వారయ్యును దామతి స్వల్పమైన మార్పులు చేసినట్లుగా సాహసించి లిఖించిరి. వీరి సాహసము మొదటినుండి తుదివరకు నొక్క విధముగ నడచుచున్నది. ఇంక వీరు దిద్దిన పద్యభాగమును గూర్చి యొకింత ముచ్చటించుకొందము. ఈ శాసనము వ్రాయించి నతడు - అనగా పాండురంగడు - శివపద వరరాజ్యసేవితుండు, అని వీరు క్రొత్తగ జేసిన సీసపాదము తెలియజేయుచున్నది. శివపద వర రాజ్య సేవితుండన కైలాసమందున్న వాడని యర్థము. అనగా కీర్తి శేషుడని

భావము. ఎప్పుడో కీర్తి శేషుడై యున్న పాండురంగుని గూర్చి తరువాతి వారు వ్రాసిన శాసనములివి. ఇట్టి శాసనమును నన్నయకుఁ బూర్వము పుట్టిన దానినిగా దలంచుటెట్లు ?

## నవశాసన విచారము

శాసనమునందలి లిపిని బరిశీలించి చూచిన సత్యరతులు నమ్మ రాని యలీక శాసనమని తేలగలదు. ఈ శాసన లిపిం గూర్చి దొర తనము వారి శాసన లిపిజ్ఞుల బటర్ వర్త్, వేణుగోపాలచెట్టి గార్లచే నెల్లూరు శాసనములను గ్రంథమునందే యిట్లు వ్రాయబడి యున్నది. **"The inscription is on three sides of the stone. The inscription is in the eastern chalukya charecter. On the other side the style of writing resembles that of the fifih century The inscriptions on the other two sides are of another style and of later date "** శాసనపు లిపి మొదటివైపునను మూడవ వైపున నున్నది, యొకవిధము. రెండవ వైపున నున్నది మఱియొక విధమును నవీనమునునై యున్నది. ఇది యొక కాలమందు వ్రాయబడిన సత్య మగు శాసనమెట్లు కాగలదు. ఈ శాసనమును అసంపూర్ణ మే. దీనిం గూర్చి గూడ బై శాసన పరిశోధకు లిట్లు వ్రాసిరి.

**"It has not been found possible to translate the inscription as is incomplete."**

మనవారి కెక్కడ దొరికినను నిట్టి యసంపూర్ణ సంధిగ్ధ శాసన ములే లభించుచున్నవి. ఇట్టి శాసన లేశములు ప్రమాణము లెట్లు కాగలవు. ఇవి నమ్మదగిన శాసనములుకావు. ఇంక శ్రీలక్ష్మణరావు గారు తమ యధ్యక్షోపన్యాసములో నన్నయకు బూర్వపు పద్యముల జూపుటకై యిచ్చిన తృతీయ శాసనముల గూర్చి ముచ్చటించు కొందము. ఈ శాసనముం గూర్చి యిదివరకే శ్రీ చిలుకూరి వీరభద్ర

రావుగారు, (శ్రీ) వంగూరి సుబ్బారావుగారు, (శ్రీ)మానవిల్లి రామకృష్ణ కవిగారును, గొంత వ్రాసియున్నారు దానినేపీరు మజుల నెత్తుకొనిరి గాని వీరు క్రొత్తగ దెల్పిన దెద్దియులేదు. ఇది తరువోజయని గూడ నిదివఱకే వ్రాయబడియున్నది. ఈ శాసనము చచ్చి స్వర్గములో నన్నట్లు తెల్పబడిన పాండురంగునిది గాన నిటీవల వ్రాయబడినదై యుండవచ్చును. ఇందులకొక పెద్ద నిదర్శనము గూడ కలదు. (శ్రీ) లక్ష్మణరావు పంతులుగారు శ్రీ కానూరి వీరభద్రేశ్వరరావుగారి ద్వార మున వ్రాయించిన (ఢ) యను వింత ద్రావిడాక్షముం గూర్చిన వింత వ్యాసము (డ) పదనొకండవ శతాబ్దము మొదలుకొని మాత్రమే డకారోచ్చారణము దెల్పునదియై శాసనముల (డ) నున్నట్లు వ్రా యించి యున్నారు. ఆ వ్యాస మాంధ్రి సాహిత్య పరిషత్పత్రికయందు ముద్రింపబడియున్నది. మన లక్ష్మణరావుగా రుదహరించిన యీ తరువోజ (ఢ) నీ డకారధ్వనిని దెల్పునీ డ కలదు. శాసనము నందలి యైదవ పంక్తి (డ) "కొండల్లము" అను పదమున నీ యక్షరము కలదు దీనిని డ యనియే శ్రీ లక్ష్మణరావుగారు చదివి యుండిరి. ఇట్టి (డ) కారమిా శాసనమందు గలదు. కావున శ్రీ లక్ష్మణరావు గారి వాదముం బట్టియే యీ శాసనము తప్పక నన్నయ్య తెరువాతి దగుచున్నది. అంతియకాక శ్రీ లక్ష్మణరావుగారు పూర్వము కన్న డము నందువలెనే తెలుగునను ప్రాసము మాత్రమే యుండెడిదిగాని యతి యుండెడిదిగాదని కనుగొనిరి. ఇందు యతి ప్రాసములు రెండునుగూడ గలవు గాన నిది నన్నయకుం బూర్వము పుట్టినది కాజాలదు. ఇంకను విమర్శనాంశము లనేకములున్నను గ్రంథ విస్తర భీతిచే ఈ పద్య విమర్శనము నింతటితో గట్టిపెట్టుచున్నాను. నీ శాసనమునను నసంపూర్ణ శాసనమేయని లిపి శాస్త్రజ్ఞులు తెలుపు చున్నారు.

## — సీసాదులు కేవలాంధ్ర పద్యములా —

సీసము కేవలాంధ్రపద్యమని మన లక్ష్మణరావుగారు వ్రాసిరి. ఇది సరిగాదు. కన్నడములో సీసపద్యము కలదని ప్రతివారును నంగీకరించుచునే యున్నారు. ఏమన నీ సీసలక్షణము నాగవర్మ వ్రాసిన ఛందోంబుధియను కర్ణాటక ఛందశ్శాస్త్రములో కలవని ప్రతిపక్షులే యంగీకరించుచున్నారు గదా! నాగవర్మ యాంధ్రుడు కాన నాంధ్ర ఛందస్సులోని యాంధ్ర పద్యలక్షణమును గర్ణాటక ఛంధశ్శాస్త్ర ములో జెప్పినాడనుట యుచితముగాదు. కర్ణాటకములోని పద్యలక్ష ణమును నాగవర్మ కర్ణాటక చ్ఛందస్సులోఁ జెప్పుటకు సిగ్గుపడడా? తాను చెప్పినది యాంధ్రపద్య లక్షణము కాదే! కర్ణాటక పద్యలక్ష ణమే. అట్టి నియమము కలవాడు కర్ణాటకములోని యాంధ్ర పద్య లక్షణమును గేవల కర్ణాటక ఛందస్సులో నేలయిచ్చెను. ఆంధ్రుల కాన నిచ్చెనందురా? అట్లయిన గేవలాంధ్ర పద్యమని శ్రీ లక్ష్మణ రావుగారు. జెప్పెడు తరువోజయొక్క లక్షణమునుగూడ ఛందోం బుధిలో నేల వ్రాయలేదు. దీనికి సరియగు నుత్తరము రాజాలదు గాన సీసము కేవలాంధ్ర వృత్తమనుట యసంగతము. తెలుగు లక్షణ మునే నాగవర్మ కర్ణాటక ఛందస్సులో జెప్పెననుట కిక నొక యభ్యం తరము గలదు. నాగవర్మ వ్రాసిన సీసపద్య లక్షణము తెలుగు సీస పద్యముల కంటె కొంత భిన్నముగా నున్నది. అందున్న గణములు సంస్కృత గణములు గావు. తెలుగు సీసము నందున్నవి సంస్కృత గణములు కావున కర్ణాటక దేశీయ సీసమును నాంధ్రులు సాంస్కృ తిక గణబద్ధము జేసిరి. కావున కర్ణాటకములోనిది మొదటి దనియు దానిని సాంస్కృతిక మిటీపల చేయగానైనది తెలుగు సీసమనియుఁ దలంచుట యుచితము. ఆర్యావృత్తముఁ గందముచేసినట్లే. ద్విపదలు సంస్కృతమునను గన్నడమునను గూడ గలవని యొప్పుకొనియు నివి

కేవలాంధ్ర) పద్యములనుటయు సాహసమే. భరతలు కేవల సంస్కృత గణములే కదా. నలము నగణము లఘువువికలది (నలఘు) నగణము గురువు గలది నగము, ఇవియు సంస్కృత ఫక్కికి సంబంధించినవియే.

## — కన్నడములో సీసములు లేవా —

నాగవర్మ వ్రాసిన ఛందోంబుధిలో సీసపద్యమొకటి యుదహరింపబడియున్నది. ఆ పద్యము నాగవర్మచే విరచింపబడినదిగా గాన్పింపదు. అందు స్త్రీ సంబోధనములు గానరావు. ఆ పద్యమెవరో పూర్వకవి చేసినదై యుండవలయును. దాని నీక్రింద నిచ్చుచున్నాను.

## కన్నడ సీసపద్యము

సీ॥ తింగళంత ళిదిత్తరంగ మంగళ కత్తతుంగ
  సూర్య సుభర్తత మ సనాశ
మంగళం మనవాంత మధురతా కరుణాత్మ
  భంగనిగ్రహి వాతభీతిహరణ
సంగిత రసలోల సాహిత్యదానం పొంగువర్కగె
  పోలెపమల కిరణ
కంగళం ముగియద కరంగళుం దిగువిడద పింగ
  దె సహాయమంపడి పశరణ

ఆ.గీ. విగత దుష్కృతాంగ విమల సుస్థిరచిత్త
గగన పీతవాస సమ్రపీత
నగ కులాధి ధాతముని సురాసుర వంద్య
జగపరి నుతరాజ కేవల దాత॥

ఈ సీస పద్యము నాల్గవ చరణముసను గీతముయొక్క తుది భాగము నందును మన లక్షణముతో సరిపోవు గణములు లేవు. కన్నడములోని యితర వృత్తమునందు వలెనే యీ సీస పాదము లందును ప్రాసములు గాన్పించుచున్నవి. మన తెలుగు లక్షణమెన్న

డును నీ విధముగ లేదు. కన్నడ సీసములం జూచి మన కవితాగురుడు నడకను సరిగ సవరించుకొని ప్రాస సీసాదులు వ్రాసియుండును.

## అక్కరలు.

అక్కరలు కన్నడము నుండి తెలుగులోనికి దీసికొనబడిన వను మాట స్పష్టము. వాని కారయా భాషలందీబడిన నామములే దీనిని స్పష్టము చేయుచున్నవి. కన్నడములో దేశీయ పదములతోనున్న నడువ నక్కర, కిరియక్కర మున్నగునవి తెనుగులో సంస్కృతపద ఘటితములై మధ్యాక్కర, అల్పాక్కర మున్నగు నామముల నొందు చున్నవి. కావున నీయవి కన్నడములో సహజముగా బుట్టినవనియు తెలుగులోనికి బైనుండి తెచ్చిపెట్టుకొనిన వనియునై యున్నవి.

## ద్వి ప ద లు.

వీనిని మన దేశపుటాది కవులు నన్నయభట్టు, నన్నిచోడుడు, తిక్కన సోమయాజి మున్నగువారు వాడియుండలేదు. తరువోజనుం బట్టి పుట్టినవేమో? చతుష్పాత్తులనుండి ద్విపాత్తులు పుట్టుట శాస్త్ర సిద్ధమే. వింతకాదు. ద్విపదులు వ్రాయవలయునను నూహ సంస్కృతము నుండియు గన్నడము నుండియు దీసికొనబడినదే. ఈషద్భేద ముండినను ద్విపదలా రెండు భాషలందును గూడ గలవు. (కన్నడ ములో దువయి) ఏవిధమున జూచినను దెలుగులో నున్న ఛందస్సం తయును నితరసారస్వతములనుండి తీసికొనబడినదిగా గాన్పించుచున్నది.

మొత్తముమీద వాదమంతయు దుర్బలమై సత్యరతులు గ్రహింపరానిదై యున్నది. వీరు నన్నయకు బూర్వపు పద్యముల సత్యములగు వానిని జూపలేకపోయిరి.

ఇప్పట్టున శ్రీ లక్ష్మణరావుగారే గాక గట్టిపట్టులో దిట్టలగు పండితరాట్టులు పల్వురు నన్నయభట్టునకు పూర్వము పుట్టిన సారస్వత ముంగనుగొన ప్రయత్నించు చున్నారని చెప్పుట కెంతయు సంతో

షముగా నున్నది. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు గూడ నీ విష యమై చాల కృషిసల్పిరి. వీరు తమ పరిశోధన ఫలమును రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచికలో నన్నయకు పూర్వపు ఛందస్సులను శీర్షికక్రింద వెలువరించిరి. అందు నన్నయకుఁ బూర్వపు ఛందస్సా కటియు జూపఁబడి యుండలేదు. నన్నయకుఁ బూర్వపు వేమోయని కొన్ని యనుమానములను మాత్రము గావించిరి. ఇట్టి యనుమాన ములు ఋజువు లగునా? అగునేమో యనుదానికి, గాదేమోయనునది సరియగు సమాధానము గాకపోదు. (1) పాల్కురికి సోమనాథుఁడ "అనియతగణై" "ప్రాసోవా" "యతిర్వా" అని వాడియున్నాడట. ఈ సంస్కృత పదములు నన్నయకు బూర్వపు ఛందస్సులోవేమో యని మన శాస్త్రిగారు సందేహించుచున్నారు. సోమనాథుడు నన్న యకు దరువాతవాడు. ఉభయులకు గల యంతరము 150 ఏండ్లకు తక్కువలేదు. కావున నీ ఛందోనియమము నన్నయ తరువాత నా 150 ఏండ్లలో నెప్పుడు పుట్టినదైనను గావచ్చును. యతిప్రాసలైచ్ఛి కముగా సంస్కృతాదులందును గలవు. కావున నిది కేవలాంధ్రమును జతగూర్చినదే యన నవసరములేదు. "ఆ సంస్కృత గ్రంథము నన్నయకు నంతగా నర్వాచీనము గాకూడదు. ప్రాచీనమేమో" అని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. కొంతయైనను నర్వాచీనము గావచ్చును గదా? గాన మావాదమునకు హాని యేమున్నది? పూర్వమనుటకు నాధారమేమున్నది. (2) ద్రావిడ భాషలో "యాప్పిరంగలమ్" అను ద్రావిడ చ్ఛందోగ్రంథము కలదట. ఈ గ్రంథములో తెనుఁగు ఛంద స్సులమాట కలదఁట. తెనుఁగు ఛందస్సును వ్రాసినవాడు "వాంచి యార్" అనువాడట. ఈ గ్రంథము నన్నయకుఁ బూర్వమేమోయని శ్రీ శాస్త్రిగా రనుమానించుచున్నారు. ఏల యట్లనుమానింపవలెను? ఆ యరవ గ్రంథకర్త నన్నయకు దరువాతివాడు కాకూడదా? సమ కాలికుఁడైనను హానిలేదే? నన్నయ ఛందస్సును వ్రాయుటగని

పిమ్మట వాంచియార్ దానొక ఛందస్సు వ్రాయకూడదా? శ్రీ శాస్త్రి గారు "ఆ ద్రవిడ గ్రంథరచనా కాలము పూర్వమో పరమో నాకు దెలియరాలేదు. అతడు నన్నయకంటె ప్రాచీనుడగునేమో" యని వ్రాసిరి. అట్లననేల? నవీనుడనుకొనరాదా? వాంచియారే రేచన యగునట. అట్లయిన దర్వాతి వాడగును. రేచన పేరనున్న ఛందస్సు కవిజనాశ్రయము. అది రేచనపేరుపెట్టి భీమకవి వ్రాసినట్లు వాడుక గలదు. వాడుకయేగాదు కొన్ని కవిజనాశ్రయ ప్రతులలో నిట్టి భావ మిచ్చు పద్యములే గలవు. రేచనకృత కవిజనాశ్రయములో కావ్యా లంకారచూడామణి ప్రశంసకలదు. కావున నయ్యది నన్నయకు దరు వాతిది యనక తప్పదు. (3) ము, విభక్తి యతింబట్టి నన్నయకుం బూర్వమున ఛందస్సులు కలవని మన ప్రభాకరశాస్త్రిగారు తలంతు రట. ము కారమునకు పు, ఫు, బు, భు లకును యతిమైత్రి యుండు టయు నయ్యది ము విభక్తి యతి యని పేరుతో నుండుటయుఁగల దనియుఁ, బూర్వము ము వర్ణకస్థానమున 'బు' యుండెడిదనియు, నా హేతువుచే నీ యతి వచ్చినదనియు, నన్నయ నాటికున్న వర్ణకము 'ము' కాని 'బు' కాదనియుఁగాని యీయతింగూర్చిన విధులు నన్న యకుఁ బూర్వమే యుండి యుండవలయుననియు, మన ప్రభాకరశాస్త్రి గారూహాల నల్లుచున్నారు. ఇది సరికాదు. 'ము' 'బు' లకు యతి మైత్రి మువిభక్తి మాత్రముచేతనే కలుగలేదు.

"ముత్తైపు ఝుల్లరులతోడి బుజ్జుట కొమ్ముల్" ముందు మీరెటేఁగిన భూతలాధీశు" మున్నగు ప్రయోగములు ధారాళముగఁ గలవు. 'ము' 'బు' అగుచుండును ముంబాయి-బొంబాయి, పాంబు- పాము మున్నగు రూపములు చూచుకొనవలసినది. "పుణ్యుండు రాఘవుండు ముని ముఖ్యులతో నవరాదని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. అట్లు నిరాక్షేపముగా ననవచ్చును. ము, బు లకు ధ్వనియందు విశేష సంబంధ ముండుటచేతనే లోకములో బు, ముగ మారుట భాషా వైచిత్ర్యమైయున్నది.

"The Sonant of P. Sometimes changes into M" అని కాల్డువెల్ దొరవారు వ్రాసిరి. అది యటులుండ 'ము' విభక్తిపూర్వము 'బు' గా నుండెడిదనుటయు నసంగతమే. శ్రీ లక్ష్మణరావుగా రుదహరించిన తరువోజలో 'కొట్టముల్'అని 'ము' గాన్పించుచున్నది. 'పట్టంబు' అని 'ంబు' కాన్పించుచున్నది, ఫలమ్ అను సంస్కృత పదము 'ఫలము' అగుట యెక్కువ సహజమా? 'ఫలబు' అగుట యెక్కువ సహజమా? మన నవ నాగరికులు 'ఫలంబు' అనుటయే మొదటి రూపమనియు, 'ఫలము' రెండవ రూపమనియు దలంచుట వింత. అది యటులుండనిండు. విభక్తి ప్రత్యయమగు 'బు' తరువాత 'ము' అయిన దనుకొందము. అట్లయిన తర్వాతగదా యతి పుట్టవలయును. తొల్లింటి 'బు' రూపకాలములో నీయతి కవకాశమే లేదు. కావున పు, ఫు, బు, భులకును ము వర్ణమునకును యతి యటీవలిది కాని మనవారు తలంచు ప్రాచీనకాలము నాఁటిది కాదు. ము, బు లకుచ్చారణయందు సంబంధమే లేకున్న 'బు' స్థానమున వచ్చిన 'ము' కును 'బు' యతిసంబంధ మెవ్వరతుకుదురు? యతి మైత్రికి ధ్వని సాదృశ్యమా ముఖ్యము విభక్తి ప్రత్యయత్వాదికమా? ప్రథమా విభక్తి ప్రత్యయములకు "వు, డు" లకు యతి మైత్రికలదా? 2. రెండవది, సందర్భశూన్యము. ము, బు లకు ధ్వనియందు విశేష సాజాత్యము కలదు. కావున యతిమైత్రి పాటింపబడుచున్నది. ము, విభక్తియతి యను విధాన మిటీవలి వారిచే జేయబడినదిగాని ప్రాచీనులచే చేయబడలేదు. సులక్షణసారకారుడు ముకారయతిని, పోలికయతిని వ్రాసెనే కాని 'ము' విభక్తి యతి యనలేదు. అనంతుని ఛందము నందును నిట్లేకలదు. కాని ము విభక్తియతియని లేదు. పోలికయతి యని ఈక్రింద రీతిని దెల్పఁబడియున్నది. కవిజనాశ్రయ మందును నిట్లే పోలికయతియని దెల్పఁబడియున్నది.

కం॥ పోలున్ పు, ఫు, బు, భు లకు మఱి
పోలిక యతి, శీలముల్లు । మున కెనయనఁగా
శీలం బుల్లం బనగా
భూలోకం బమరలోక । మున కెనయనఁగన్ ॥

కాన శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినదాని యందును సత్యముకంటె సాహసమే హెచ్చుగు నాధారముగా నున్నది. అయినను నుభయుల మతమునకును భేదము చాల గలదు. ప్రభాకరశాస్త్రి గారు పూర్వుల వ్రాతలయందుఁగొంత ప్రమాణబుద్ధి కలవారు. పూర్వులెల్లరు నన్నయ్యయే యాంధ్రకవిత్వముల బుట్టించినట్లు వ్రాసిరనియు నాహేతువుచే నాంధ్రకవిత్వముం గనిపెట్టుటలో నన్నయ్యకు గొంతయైన భాగమీయ వలయునని దలంచి మాత్రాగణములచే నయిన సీసాదులు పూర్వందే గలవనియు నక్షర గణములచేనయినఁ జంపకాదులు నన్నయ్య నుండియే యాంధ్రమున వెలసినవనియు వీరు తలంచుచున్నారు. శ్రీ లక్ష్మణరావుగారన్ననో యేదియు నన్నయ్య కల్పింపలేదని వ్రాయనిచ్చకలవారు. కావుననే వీరు సంస్కృత భాషలో నున్నయొక చంపకముంగని దానింబట్టి యాంధ్రమున జంపకము లదివరకే కలవని యూహించు నంతటి సాహసమునకు బాల్పడిరి.

శ్రీ కొమర్రాజ వెంకట లక్ష్మణరావు పంతులుగారు తమ జీవితమునంతను నాంధ్రసారస్వతము నిమిత్తమై ధారపోసిరి. వీరు పరిశోధనములకై విశేషముగా శ్రమ తీసికొనిరి. శ్రీయుతులగు జయంతి రామయ్య పంతులుగారు, పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, వి.వి. సుబ్బారావుగారు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు, నడింపల్లి జగన్నాథరావు పంతులుగారు, చంద్రాభొట్ల రామమూర్తిగారు, కార్వేర్ల శ్రీనివాసరావుగారు, వంగూరి సుబ్బారావుగారు, మానవల్లి రామ

కృష్ణకవిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, కానూరి వీరభద్రేశ్వరరావుగారు మున్నగు మహావీరులు చేయుచున్న వాఙ్మయ పరిశోధనము మిక్కిలి వర్ణనీయముగను సారస్వతోపకారకముగ నున్నది. సత్యములగు నూతనాంశములు బయల్పడు గాక, సత్యమునకు జయము గలుగుగాక.

---

♦ ఇది సంధికాలమని పల్వురు వ్రాయుచున్నారు. రాజరాజ పట్టాభిషేక సంచిక కూడా నిది సంధికాలమని వాకొనుచున్నది సంధికాలములో ధర్మములు కూడ పూర్వపువియే వాడుకలో నుండునని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టి స్థితిలో సంధికాలములోనే పూర్వలిపి దేశమునందుండుటను నొక్కసారిగ లోపించుననుట యుచితముగాదు.

♦ ఇట్టి చోటుల నొకవింత యక్కరము బహుశః అరవమనుకొనెదము వ్రాతప్రతిలో శ్రీశాస్త్రిలవారు యిచ్చి యున్నారు. దానిని ముద్రించుటకు వీలుగామిచే విడువబడినది.

1) శాసన మొక్కటియని గురజాడ అప్పారావు పంతులుగారును, రెండని శ్రీజయంతి రామయ్యపంతులుగారును, మూడని దొరతనమువారి శాసనలిపిజ్ఞులగు కృష్ణశాస్త్రిలు వారును వ్రాసి యుండిరి.

2) అది పదియవ క్రీస్తుశతాబ్దములో 927 మొదలు 934 వఱకుఁ గలకాలములో వ్రాయబడినదని శ్రీజయంతి రామయ్యపంతులు వారు వ్రాసియుండఁగా, పదునొకండవ శతాబ్దాంతమున ననగా (1080) ప్రాంతమున వ్రాయఁబడినదని శ్రీ నడింపల్లి జగన్నాథరావుగారు లిఖించిరి. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 13వ శతాబ్దములో నీ శాసనము పుట్టినట్లు లిఖించి యుండిరి.

# నన్నయకు పూర్వము పద్యములు కలవా?

చిలుకూరి నారాయణరావుగారు.

'శారద' డిసెంబరు సంచికలో బ్రహ్మయ్య శాస్త్రిలుగారు లక్ష్మణరావుగారి వ్రాతను ఖండించుచు పై శీర్షిక క్రింద నొక ఖండనమును వ్రాసిరి. అందు (1) లక్ష్మణరావుగారు వీరేశలింగముగారి పక్షమువారు. పక్షపాతముతో విపరీత సిద్ధాంతములను చేసిరి. అనియు, (2) ప్రస్తుత విషయమగు నన్నయకు పూర్వము పద్యములుకలవు. అని చెప్పుటలో పొరపడిరనియు, రెండాక్షేపణలు కనబడుచున్నవి.

మొదటి ఆక్షేపణకు సమాధానము చెప్పుట కష్టము. "మాకు పక్షపాతము లేదు. సత్యాన్వేషణమే మాకు ముఖ్యము. ఊహాలతో మాకు పనిలేదు. ఎదురుగా కనబడు విషయములే మాకాధారములు." అని లక్ష్మణరావుగారు పలుసార్లు చెప్పియుండిరి. వారి వ్రాతలు నట్లే పలువురకు గోచరించినవి. మాబోటివారికి శాస్త్రిలవారి వ్రాతలే పక్షపాతములుగా కాన్పించినవి. గనుక ఒకరినొకరు పక్షపాతులనియు ఆవేశము కలవారనియు నిందించుకొనుట వలన లాభము లేదు. ఇక రెండవ యాక్షేపణను విచారించవలెను

శాస్త్రులవారి వాదపద్ధతిని గూర్చి లక్ష్మణరావుగారు ఒక్క ప్రాస చంపకమాలా వృత్తము మాత్ర ముదాహరించి యూరుకొనలేదు. ఆ యొక్క వృత్తమును బట్టియే వారు తమ పక్షమును సమర్థింప నెంచిన యెడల వారివాదము దుర్బలమైయే యుండును, వారా వృత్తమును తమ వాదమునకు ప్రధానాధారముగా నైనను చూపి యుండలేదు. దానిని వారు ఉపబలముగా మాత్రము స్వీకరించి యుండిరి. దానిని పడగొట్టుటకే శాస్త్రులవారి ప్రయత్నము. వారి వాదము నందెంత బలమున్నదో తొలుత కనుగొందము.

(1) సంస్కృతమున చంపకమాలకు ప్రాచుర్యము కలదు. ఇందుకు సాక్షులు మోరేశ్వర పండితుడు, ఒక నిఘంటుకారుడు, ఆప్టే. వీరు సంస్కృత వృత్తములతో చంపకమాల ప్రధానమైనదనిరి. అందు చేత దానికి సంస్కృతమున ప్రాచుర్యము కలదు. ఇచ్చట ప్రశ్న- గ్రంథము లేమని చెప్పుచున్నవి? వానియందు చంపకమాలా వృత్తము ధారాళముగా కనబడుచున్నదా?— అని తమ వాదమును వదలజాలని పండితులకు తప్ప సంస్కృత వాఙ్మయమును పరిశీలించినవారికి చంపక మాల విశేష ప్రచారము గలదిగా కన్పట్టజాలదు.

(2) "సంస్కృతములోని చంపకమాలల కుదాహరణముల నిచ్చుచున్నాము. ఇవి ప్రాచీనములు. మాఘములో కూడ నుదా హరణములు కలవు." ప్రశ్న – ఇవి ఎక్కడివి? ఎంతటి ప్రాచీనములు? కేవలము ప్రాచీనములనినంత మాత్రమున లాభము లేదు. గుణగ విజయాదిత్యునికి పూర్వపు సంస్కృత కావ్యములనుండి శాస్త్రిల వారు నుదాహరణముల నీయగలరా? మాఘకవి మనకు ప్రాచీనుడు. కాని ఆ కాలమునకు ప్రాచీనుడు కాడని చరిత్రవలన తెలియనగును. శిశుపాల వధలో చంపకమాల లెన్నియున్నవి. ఒక్క సర్గలో మాత్రమే కాదా మాఘుడు వివిధ వృత్తముల నుపయోగించి యుండుట? అందు చంపకమాల నుపయోగించెను. గాని అంతమాత్ర మున దానికి విశేష ప్రచారమున్నదని చెప్ప వీలులేదు.

(3) "సంస్కృతమున గూడ ప్రాసము కలదు" కాని అది ఆంధ్ర కర్ణాటాది భాషలకు విశిష్టమైన ప్రాసయేనా? అది కేవలము అలంకారము కొరకు వాడబడిన అనుప్రాస ప్రాయము కాదా? శాస్త్రిలవారు చూపిన యుదాహరణము లన్నియు అనుప్రాసమునకు గాని లక్ష్మణరావుగారు చూపినట్టి ప్రాసమునకు కావు. వారు శాస నమునుండి యెత్తిచూపిన చంపకమాలయందలి ప్రాస అనుప్రాసము

కొలఁకు గాక ఆంధ్రాది భాషా సంప్రదాయము ననుసరించినదని తజ్ఞు లకు గోచరింపకపోదు. శాస్త్రిలవారు సంస్కృతమున యతియు, ప్రాసయతియు, యతి ప్రాసలునుగల శ్లోకములుగూడ నున్నవని చూప నుదాహరించిన శ్లోకములును కేవల శబ్దాలంకార విశిష్టములే.

(4) "నన్నయ్య, మల్లన, తిక్కన, విన్నకోట పెద్దన్నలు తమ గ్రంథముల మొదట వ్రాసిన శ్లోకములందు ప్రాసలేదే. అంతకు పూర్వపు శాసనము నందలి చంపకమాలలోని ప్రాసమును జూచి, తెలుగునుండి సంస్కృత కవులు ప్రాసమును వాడుచుండిరని చెప్పుట యెట్లు?" సమాధానము లక్ష్మణరావుగారట్లు చెప్పుటలేదు. ఒక శాసనములో సంస్కృత భాషయందు ప్రాసయుక్తమగు చంపక మాలా వృత్తమున్న ఆ ప్రాసము ఆంధ్రా కర్ణాట సంప్రదాయము ననుసరించి యున్నది. ఆ కాలమునందు తెనుగు కవులను జూచి సంస్కృత కవులును ప్రాసము నుపయోగించి యుందురు, అని మాత్రము వారిభావము. తక్కిన సంస్కృత కవులమాట యెట్లు న్నను, లక్ష్మణరావుగారు చూపిన వృత్తమును రచియించిన కవి ఆంధ్ర కర్ణాట సంప్రదాయము ననుసరించి యుండెనని చెప్పకతప్పదు. అంతమాత్రముచేత తక్కిన కవులును నామార్గము ననుసరించి యుండి రనిగాని అనుసరించి యుండవలెనని గాని లక్ష్మణరావుగారు చెప్పి నట్లూహింప వీలులేదు.

(5) శాస్త్రిలవారు వ్రాసిన అప్రస్తుతాంశము గూర్చి యొక్కమాట శుక్రునకు కవియను పేరున్నదని లక్ష్మణరావు గారనిరి. 'కవి' యనిన పండితుఁడు, విద్వాంసుఁడు అనియే యర్థముకాని, కావ్య కర్తయని కాదని శాస్త్రిలవారు. వీరికి సాక్షులు ఆపట్టు దొరగారు. ఆ దొరగారైనను శుక్రనీతి సారమునుగూర్చి ముచ్చటించిరి గాని శుక్ర నీతిని గూర్చికాదే. రామాయణమునకు పూర్వము కవులు

లేరని శాస్త్రిలవారి యాశయము. కాబట్టివారు దానినిగూర్చి యింతగా ముచ్చటించిరేగాని మరియొకటి గాదు. శుక్రుడు కవియా కాదా యను వివాదము వ్యర్థము. లక్ష్మణరావుగారు చెప్పినదియొక వాగ్విశేషముకాని వేరుకాదని గ్రహింపనగును.

ఇంతవరకును లక్ష్మణరావుగారు చెప్పినదేమి? నన్నయకు పూర్వము తెనుగు పద్యములున్నవని గదా! దానికి వారు చూపిన ప్రధానాధారములు నన్నయకు పూర్వముండిన శాసనములలోని తెనుగు పద్యములు గదా! అందుచేత లక్ష్మణరావుగారి వాదమును పడగొట్టుటకు [1] ఆ శాసనములో ఆ పద్యములు లేవనిగాని [2] ఆ శాసనములు నన్నయకు పూర్వమందలివి కావనిగాని సిద్ధాంతము చేయవలసియున్నది. అట్లు చేయక పట్టుదలకొరకు అముఖ్య విషయములను చర్చించుటవలన లాభముండదు.

నన్నయకు పూర్వము పద్యములు గలవా?

శాస్త్రిలుగారు తుదకు అనుకున్నంత మాటయు అనివేసినారు. రామయ్య పంతులుగారు ప్రకటించిన యుద్ధమల్లుని శాసనము నన్నయకు తరువాతది. లక్ష్మణరావుగారు చూపిన సీసపద్యమును, తరువోజయు పద్యములు కావు, అని వీరు చూప ప్రయత్నించిరి. ఈ వాదమునకు ఇంతకు పూర్వమే సమాధానములు చెప్పబడినవి. ప్రస్తుత వ్యాసమున కుత్తరముగా కొంచెము చెప్పవలసియున్నది. మొదట శాస్త్రిలవారి యాక్షేపణము, తరువాత దానికి సమాధానము వరుసగ వ్రాయుచున్నాను.

## యుద్ధమల్ల శాసనము.

శాస్త్రిలువారు రామయ్య పంతులుగారు వ్రాసిన దానిని బాగుగ చదివినట్లు కనబడదు. రామయ్య పంతులుగారు "శాసన

మెప్పుడు పుట్టినదియు నిర్ణయించుటకు ముఖ్యాధారములు రెండు గలవు. అక్షరముల పోలిక యొకటి. శాసనము నందు పేర్కొనబడిన యుద్ధమల్లు లెవ్వరైనదియు నిరూపించుట యొకటి. ముందుగా నీయుద్ధ మల్లు లెవ్వరో చూతము. మొదటి శాసనములోని యుద్ధమల్లుడు చాళుక్యరాజని ["రాజసలిక్-భూవల్లభుండు"] చెప్పబడినది. చాళుక్య రాజైన యెడల పూర్వచాళుక్య రాజవంశములోని వాడు కావల యును. ఈ వంశములో నిద్దరు యుద్ధమల్లులున్నట్లు పూర్వ శాసన ముల వలన గనపట్టుచున్నది. 766 శక సంవత్సరము మొదలు 810వ సంవత్సరము వరకు రాజ్యము చేసిన గుణగ విజయాదిత్యుని తమ్ము డగు యుద్ధమల్లు డొకడు కలడు. ఈతని కొడుకు తాడరాజు. ఈ తాడరాజు కొడుకు యుద్ధమల్లుడు. చాళుక్య వంశములో భ్రాత మనుమలిద్దఱు యుద్ధమల్లులు వీరగపడుచున్నారు. వీరే శాసనములో జెప్పబడిన యుద్ధమల్లులని నామతము" అని చెప్పి కొన్ని యూహాక్షేపణ లను కల్పించికొని "కావున మొదటి శాసనము ప్రథమ యుద్ధమల్లుని కాలము నందును [గుణగ విజయాదిత్యుని తమ్ముడు] రెండవది [అతని మనుమడగు] ద్వితీయ యుద్ధమల్లుని కాలము నందును బుట్టియుండు ననుటయే సిద్ధాంతముగా గనపడుచున్నది." అని వ్రాసిరి. ఇట్లుండగా శాస్త్రులువారు రామయ్య పంతులుగారు చేసికొనిన ఆ శంకయే వారి సిద్ధాంతమయినట్లుగా సెలవిచ్చి యేమేమో పెంచి వ్రాసిరి. యుద్ధమల్లునకు మల్లపరాజను పేరుండుట కాధారమేమి? అని వీరి ప్రశ్న. దీనికి సమాధానము శాసనమునందే యున్నది. యుద్ధమల్లుడు, మల్లడు, మల్లపరాజు అను పేళ్ళు సమానార్థకములుగా ఏక పురుష వాచకములుగా నందే వాడబడియున్నవి, శాసనములు రెండని రామయ్య పంతులుగారు శంకించినది తప్పనియు నొక్కడు (మనుమ డైన యుద్ధమల్లుడు) వ్రాయించినదే యనియు లక్ష్మణరావుగారు

చెప్పిరిగాని శాస్త్రిలుగారు చెప్పినట్లు గుడి కట్టించినవాడును మొగ మాడువు కట్టించినవాడును ఒక్కడేయని వ్రాయలేదు. న్యాయముగ జూచిన యెడల శాసనము జెక్కించిన వాడొక్కడే యని తెలియక పోదు.

సల్కి శబ్దము చాళుక్య శబ్దభవమగునని శాస్త్రిలవారే యొప్పుకొనిరి. కాని, 'రాజసల్కి భూవల్లభుండు' అను సమాసము నకు తప్పుపట్టిరి. సల్కియనునది రూఢిపదమనియు, తరువాతి కాలము నందుడి చాళుక్య శబ్దమును పుట్టించిరనియు అంగీకరించినచో ఈ యాక్షేపముండి యుండకపోవచ్చును. 'సల్కి' పూర్వరూపము కాదను భ్రమకు లోనిగుట చేతనే శాస్త్రిలవారింకను పెనగులాడుచున్నారు. (యుద్ధమల్లుడనునది బిరుదమై 'రాజసల్కి' యనునది పేరై యుండు నని యూహించి, ఆయూహ సరికాకపోవుటచే, యుద్ధమల్లుడు అనునది బిరుదనామమేయని నిర్ణయించుట వింతగ దోపకపోదు.

చాళుక్యుల ఇతర శాసనములలోని బిరుదములకును ఈ శాసన నములోని బిరుదములకును సరిపో లేదట కాని మఱియే రెండు చాళుక్య శాసనములలోని బిరుదములైనను సరిగ సరిపోవుచున్నవాయని యడుగవలసి యున్నది. ఒక శాసనము నందలి దానికిని మఱియొక్క దానికిని భేదము కాన్పించుచునే యున్నది. శాస్త్రిల వారిచ్చిన పండ్రెండు బిరుదములును వేర్వేరు శాసనములలోని గుత్తడము కాని మఱియొకటి కాదు. ప్రస్తుత యుద్ధమల్లుని శాసనములలోని బిరుదము లను పైవానికి కలిపి యవి యన్నియును చాళుక్యుల బిరుదము లనుటయే యుచితము. శాసనములో చాళుక్య శబ్దమునకు ప్రకృతి యైన సల్కిశబ్దము ప్రయోగింపబడినది. చాళుక్యుల లోనివారగు నిద్దఱు యుద్ధమల్లులుదాహరింపఁబడియున్నారు. అట్టియెడ నీశాసనము లోని బిరుదములును చాళుక్యులవేయని యొప్పుకొనక తప్పదు.

"చేబ్రోలులోని విగ్రహమునె యుద్ధమల్లుడు బెజవాడలో ప్రతిష్ఠించె ననియు చేబ్రోలు నివాసులు దానిని మఱికొంతకాలమున కు దిరిగి తమ గ్రామమునకు గొనిపోయిరనియు జెప్పవచ్చును. లేదా యుద్ధమల్లుడు ప్రతిష్ఠించినది నూతన విగ్రహమనియు దానియందు జనులకు భక్తి హెచ్చుటకై సుప్రసిద్ధమైన చేబ్రోలు దేవుని సత్వమే యీ నూతన విగ్రహమందు ప్రవేశించెనని చెప్పుటయే శాసనోద్దేశమనియుఁ జెప్పవచ్చును. ఇదియే సత్యమని తోఁచుచున్నది. "తిరుపతి వేంకటేశ్వరస్వామిని బట్టి యనేకులు వేంకటేశ్వరులు దేశమందు వెలసినారు." అని రామయ్య పంతులుగారు వ్రాయగా రెండవ భాగమున చల్లగ విడిచిపెట్టి మన శాస్త్రిలవారు శాసనము నందలి విషయముంబట్టి చూడ చేబ్రోలను గ్రామమునందలి కుమారస్వామి బెజవాడరాగా నచట నీ శాసనస్థ భూవల్లభుండు గుడి కట్టించెననియు ననగా చేబ్రోలు నందలి కుమార స్వామ్యాలయము పడిపోయియందలి కుమారస్వామి విగ్రహము పూజా పురస్కారములు లేక పడియుండగా దాని నీ శాసనము చేయించిన యాతడు బెజవాడ తీసుకుని వచ్చి యిచ్చట గుడి కట్టించి యందు స్థాపించెనని భావమనియు శ్రీ జయంతి రామయ్య పంతులుగారు వ్రాసినదానివల్ల తెలియవచ్చుచున్నది." అని వ్రాసిరి.

శాసనస్థ రాజమతము వీరశైవమనియు, ఈ వీరశైవము రామానుజుని తరువాతిదనియు, చాళుక్యులు వైష్ణవులనియు అందుచేత చాళుక్యరాజు వీరశైవులకు మఠము కట్టించి యుండడనియు, శాస్త్రిలవారి మతము. శైవము రామానుజుని తరువాతి దనుటకు శాస్త్రిలవారి కాధారమేమో? నన్నయకు పూర్వపువాడగు కర్ణాటక నాగవర్మ శైవ బ్రాహ్మణుడు. తరువాతి చాళుక్య రాజులు వైష్ణవులయిన యెడఁ నీ యుద్ధమల్లుడు శైవుడనుటకు వారికేమి యాక్షేపమో? రాజు వైష్ణవుడైనను శైవులకు మఠము కట్టించకూడదను

వీరి నిషేధమెందుకో. కొందరు పూర్వరాజులు మతద్వేషము కలిగి పరిపాలించక అన్ని మతముల యెడలను సమానాదరము కలిగియుండిరి. యుద్ధమల్లు డట్టివాడని చెప్పిన నేమిదోషము?

శాసనక్రమమును గూర్చి దీనియందు తరువాతి చాళుక్యుల గోత్రాదులు వివరింపఁబడలేదని యాక్షేపము. తప్పక యుండవలెనను నియమ మెక్కడ నున్నదో? గోత్రాదికములు వివరింపబడిన చాళుక్య శాసనములు సంస్కృతమునందున్నవి. ఈ శాసనము తెలుగునందున్నది. గోత్రాదికము సంస్కృతమున గద్యలో చెప్పబడియున్నది. ఈ శాసనము పద్యమయము. పద్యములో గోత్రాదిక మిముడనప్పుడు దానిని వదలిపెట్టుట యుచితము కానేరదు. ఇక కార్తికేయాలయముఁ గూర్చి యింతకు పూర్వమే ముచ్చటించి యుంటిమి. వారణాసిద్దచ్చు వారు, 'గంగకరుత' అను మాటలు క్రీ.శ. 11వ శతాబ్దమునుండియు వచ్చుచున్న పదములని సోమశేఖరశర్మగారన్నారట. అవి ఈ శాసనములో నున్నవి గనుక ఈ శాసనమును తరువాతిదేనట. సోమశేఖర శర్మగారు బెజవాడ యుద్ధమల్లుని శాసనము నన్నయకు పూర్వపుదన్న వాదమునకు చేరినవారు. ఈ సంగతి వారి వ్యాసమువలననే తెలియ గలదు. అందుచేత పై పదములు నన్నయకు పూర్వముకూడ నున్నవనియే వ్రాయవలెనని శర్మగారి నాక్షేపింపవలసియుండగా, వారన్న యీ మాటను పట్టుకొని తమ వాదమునకు సరిపోయినదిగదా యని యుదాహరించి యుండఁగూడదు. ఇతరులెవ్వరో యితర విషయముల గూర్చి భ్రమపడిరని ప్రస్తుత శాసనము విషయమునగూడ భ్రమ కవకాశము వలదని చెప్పుట తగదు.

(1) యుద్ధమల్ల శాసన లిపియు, నందంపూడి శాసన లిపియు, నొక్క తీరుగా నున్నవి. ప్రత్యుత్తరము. లేవు వేర్వేరుగా నున్నవి. శాసనములఁ జూచిన తెలియగలదు,

(2) రాజరాజనరేంద్రుని తరువాతకూడ వ్రాతకత్తె నిలిచి యుండుట సంభవము కానేరదు. ప్రత్యుత్తరము. రాజరాజు కాలము నకే కత్తు మారినది, తరువాత నది నిలిచియుండుట యసంభవము. సంభవమే యని చెప్పుటకు శాస్త్రిలవారొక్క శాసనమును తరువాత దానిని చూపవలసి యుండును.

(3) రెండమృత గుళికలు : (i) 'టి'కారము. ఈ యక్షరమును లక్ష్మణరావుగారు పరిషత్పత్త్రికలో వ్రాయుటకు పూర్వము 'డ'కా రముగనే శాసన లిపిజ్ఞులు చదువుచుండిరి. కాని 'టి'కారమును 'డ'కారము రెండక్షరములను శాసనములం దగపడుచునే యున్నవి. రెండు వేఱక్షరము లుండుటవలన నీ రెంటింటికిని వేర్వేరుగ నుచ్చారణ యుండి యుండవలెను. యుద్ధమల్ల శాసనములో నట్టి యుచ్చారణభేద ముండెనని లక్ష్మణరావుగారి తలంపు. భేదము లేదని చెప్పుట కెవరి కధికారమున్నది. *అన్నిచోట్లను 'టి'ను చదివి 'బెడగు' అను దాని లోని 'డ'కారమును 'టి'గా నెందుకు చదువలేదని శాస్త్రిగారా రాక్షేపించి, విస్తరించి వ్రాసిరి. శాస్త్రిగారు సెలవిచ్చినట్లు శాసన ములో బెడగులో 'డ' యున్నదిగాని 'టి' లేదు. శాసనము చూడక వ్రాసిన శాస్త్రిలవారి నెవరేమనగలరు ?

(ii) శాసనశిల : వీరు చూపిన శాసన శిలాక్రమము తాము కల్పించినది. అసలు శిలను చూడక వ్రాసినది. ఈ కల్పితశిలపై యుద్ధ మల్ల శాసనము నాలుగు ప్రక్కలను వ్రాయబడియున్నది. కాని, రామయ్యపంతులుగారు శిలను స్వయముగా చూచి యేమి వ్రాసిరో చూడుడు. "ఇటీవల నేను శాసనస్తంభమును బ్రత్యక్షముగాఁ జూచి నాడను. శాసనస్తంభముయొక్క యెదుటిప్రక్కను ఎడమప్రక్కను, కుడిప్రక్కను గొంతవరకును జెక్కబడియున్నది" అనగా శాసనము మూడు ప్రక్కలనే యున్నదిగాని, నాలుగు ప్రక్కల లేదు. నేనును శాసనస్తంభమును చూచితిని. మూడు ప్రక్కలనే కనబడినది.

(4) రెండు బట్టీల సారము :- లక్ష్మణరావుగారు బట్టీలు పెట్టి సారము దింపలేదు. వేణుగోపాలశెట్టి, బటర్వర్తుగార్లు నిపుణులే యైనను, సీసపద్యమున్న శాసనమును సరిగ చదువజాలకపోయిరి. లక్ష్మణరావుగారా శాసనమును తిరిగి సరిగా చదివికొనిరి. అందు సీస పద్యము కనబడుచున్నది. అసంపూర్ణమైన నగుగాక. అది సీసపద్యము కాదనుటకు వీలులేదు. నెల్లూరు శాసనములలోని ఈ శాసనప్రతిని నేనును చూచితిని. లక్ష్మణరావుగారు చదివినది సరియైన సారము. అందుచేత ఈ విషయమై శాస్త్రిలవారు వ్రాసినదంతయు కేవల శ్రమ కాని వేరు కాదు. ఇక నన్నయ్యభట్టు సీసపద్యములోని యతిప్రాస నియమము లిందులో లేవట. అందుచేత నది నన్నయ్యకు తరువాతిదట కాని తత్త్వము నాలోచింపగా నీ సీసపద్యము లొక్క నన్నయయందే కాన్పించునుగాని, అంతకు పూర్వముగాని, తరువాతగాని కాన్పించవు. దీర్ఘాసి శాసనములో నొక సీసపద్యమున్నది. అది నన్నయకాలము నాటిది. దానిలో నన్నయ నియమములు లేవు

[5] సీసపద్యమును. తరువోజయు గల గుణగ విజయాదిత్యుని గూర్చిన శాసనము లారాజునకు సంబంధించినవి కావనియు, అతడు చనిపోయిన తరువాత నెవ్వరో వాని నాతని పేర వ్రాయించి యుందు రనియు శాస్త్రిలుగారు వ్రాసిరి. శాసన మసంపూర్ణముగ నుండుట చేత నిట్టి సందేహమున కవకాశము లేకపోలేదు. అట్లాతని యనంతరమే యవి పుట్టి యుండునని యొప్పుకొన్నను, నన్నయ్యకు తరువాతివని చెప్పుట నిట్టి సందేహమున కవకాశము లేకపోలేదు. అట్లాతని యనంత రమే యవి పుట్టి యుండునని యొప్పుకొన్నను, నన్నయ్యకు తరువాతి వని చెప్పుట యొప్పదు, గుణగ విజయాదిత్యునికిని నన్నయ్యకును షుమారు రెండువందల యేండ్ల యెడమున్నది. గుణగ విజయాదిత్యుని తరువాత నెంతయో కాలముస కెవ్వడును నిట్టి శాసనమును వ్రాయించి

యుండదు. అట్లు వ్రాయించుట కవసరముండదు. ఎట్లయినను ఈ శాసనములు నన్నయ్యకు పూర్వపువే యని యూహింపవలసియున్నది.

సీసము కేవల మాంధ్ర పద్యమని లక్ష్మణరావుగారన్నారని శాస్త్రిలుగారు వ్రాసిరి. లక్ష్మణరావుగారట్లనలేదు. వారన్నది సీసమునకు తెలుఁగునం దెక్కువ ప్రచారమున్నదని, ఇట్లే చంపకమాలకు సంస్కృతములో నెక్కువ ప్రచారము లేదనియు, తెనుఁగు కన్నడములలో నున్నదనియు వారు వ్రాసిరి: ఇది కాదని యెవరందురు. శాస్త్రిలవారనినట్లు తెనుఁగువారు సీసమును కన్నడమునుండియే యెరువు తెచ్చుకొని యుందురనియు, మాత్రాగణబద్ధమై యున్నదానిని సంస్కృత గణబద్ధముగా చేసుకొని యుందురనియు వ్రాసిరి. కానిండు, దానివలన బాధ యేమున్నది. అంతమాత్రముచేత నన్నయ్యయే అట్లు సంస్కరించినవాడని సిద్ధాంత మెట్లు చేయఁగలము.

—[ 0 ]—

* కాని, ఈ 'టి' అను నక్షరము ప్రత్యేకముగా 14 శతాబ్దము వఱకును కాన్పించుచున్నది. దాని యుచ్చారణము 'డ'కారోచ్చారణముగ నెప్పుడు మారిపోయెనో తెలియరాదు.

# నన్నయ చిత్రించిన రాజరాజు

శ్రీ నండూరి బంగారయ్య

అదిగో ! రాజరాజు కొలువుకూటము. వసుమతీ వనితకు విభూషణము వేంగీదేశము. వేంగీదేశమునకు నాయకరత్నము రాజమహేంద్రము. రాజమహేంద్రిమున నొక రమ్య భర్మ హర్మ్యతలము. దానిని సకలభువన లక్ష్మీవిలాసం బని పేర్కొన దగును. అందు బరమానందమున మహేంద్ర మహిమతో కొలువుదీర్చి యున్నాడు చాళుక్య మన్మథుడయిన రాజరాజు. మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానులు ప్రక్కనే యుచితాసనముల నలంకరించినారు. వారికి తరువాత ననంతమయిన సామంతగణము. ఇంచుక తొలగి రాజాజ్ఞకయి ఎదురుచూచుచు నిలుచున్న వారవిలాసినులు. ఇక విద్వాంసులు క్రిక్కిఱిసిపోయి యున్నారు. ఏలన నది రాజకార్య నిర్వహణమున కేర్పడిన సభ కాదు. విద్యావిలాసగోష్ఠి. అపారశబ్ద శాస్త్రపారగులయిన వైయాకరణులు ! భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులయిన పౌరాణికులు ! మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు! వివిధతర్క విగాహిత సమస్త శాస్త్రసాగర సారగరీయః ప్రతిభులయిన తార్కికులు వైణిక గాయకాది విద్వజ్జంబులు! ఈ విద్వద్గణమున సూర్యచంద్రుల వలె— నన్నయభట్టు! నారాయణభట్టు!

సంజీవకరణి నొక్కదానిని దెచ్చుటకు మారుగ పర్వతమునంతను పెకలించుకొని వచ్చిన మారుతివలె నన్నయ రాజరాజు నొక్కనినేగాక ఆనాటి రాజమహేంద్రవర సాహిత్యజీవితమునంతను భారత ముఖమున ప్రత్యక్షపరచినాడు. ఇదిగాక ఆతని భారత భాగములో ప్రత్యాశ్వాసమున నాద్యంతములలోను, నన్నయయే రచించిన నందమ

పూండి శాసనము మున్నగు శాసనములలోను రాజరాజు పదేపదే ప్రత్యక్షమగుచున్నాడు. ఇట్టి వర్ణనములలో పునరుక్తు లనివార్యములు గదా! ఇవిగాక అత్యుక్తులుగూడ పుష్కలముగ గనవచ్చుచున్నవి. ఏ కవిగాని తన్ను పోషించు ప్రభువునుగూర్చి అత్యుక్తి వాడకుండ నుండగలడా? అయితే నిత్యసత్య వచనుడగు నన్నయ కూడ ఒక మానవమాత్రుని "విష్ణుమూర్తి" యనియు 'నారాయణమూర్తి' యనియు సంబోధింపవలసినదేనా? ఇందులకు 'నా విష్ణుః పృథివీపతిః' యను నమ్మక మొక్కటేగాక ఆనాటి పరిస్థితులును 'బహవో దుర్లభాశ్చైవ' యను సూక్తికి లక్ష్యము కాదగిన రాజరాజు గుణగణమును గూడ కారణమై యుండవలెను ఈనాటి మనము ఆనాటి పరిస్థితులను పూర్ణముగ నర్థముచేసికొనుట దుష్కరము. ధర్మగ్లాని నుండి దేశము నుద్ధరించుటకయి కంకణము గట్టుకొనిన మహాపురుషుని అవతారమూర్తిగ సంబోధించుటలో నాశ్చర్య మేమున్నది? ఈనాడు గాంధీని మనము పురుషోత్తమునిగ నెంచి పూజించుటలేదా? కేవలమా తన్ను పోషించు ప్రభువుపట్ల చూపదగిన కృతజ్ఞతమాత్రమే గాక ఆర్షధర్మములు సమూలములుగ నశించిపోవునేమో యని సనాతన ధర్మప్రియులు గజగజ లాడుచున్న యా కాలమున జైన బౌద్ధమతముల బారిన బడకుండ వైదికమతము నుద్ధరించుటకయి యుదయించిన కారణ జన్మునివలె గనవచ్చిన రాజరాజు మహోజ్జ్వలశీలముపట్లనున్న గౌరవముకూడ గుణలుబ్ధుడగు నన్నయ వర్ణనములలో నత్యుక్తిని ప్రవేశపెట్టి యుండవచ్చును.

ఈ అత్యుక్తులును పునరుక్తులును పూర్ణముగ పరిహరించి చూచినను స్ఫుటమయిన విగ్రహము మనకు లభ్యమగుచున్నది. నన్నయవర్ణనలలోనున్న చైతన్య సంపద అద్భుతావహము. రాజరాజు పవిత్రశీలమునకు శాశ్వతమైన మందిరము నిర్మింపవలెనని ఆతని సంక

ల్పము. ఈ సంకల్పము పూర్ణముగ గృతార్థమయినది. కృతిపతుల గుణగణమును వర్ణించిన కవులెందరో యున్నారు. కాని నన్నయ లేఖిని సాధించిన వాక్సిద్ధి అనన్యసాధ్య మనియే చెప్పవలసియున్నది. అతని సమాస కల్పనములోనున్న మార్దవము, మాధుర్యము నపురూప ములు. ప్రతి సంబోధకమునను సంబోధితుని ప్రత్యక్షపరుపగల శక్తి చదువరిని చకితుని చేయజాలియున్నది.

స్థూలమునుండి సూక్ష్మమునకు బోవుట యొక క్రమముగ నేర్పరచుకొన్నచో నన్నయ చిత్రణమున రాజరాజు శరీర సౌష్ఠవము మొదట విచారణకు వచ్చుచున్నది. ఆకార పరిమాణముగాని దేహ చ్ఛాయగాని అవయవముల ప్రత్యేకలక్షణములు గాని నిర్ణయించు కొనుటకు తగిన సామగ్రి నన్నయవర్ణనలో లభ్యము కాకపోయినను మొత్తముమీద రాజరాజు సుందర విగ్రహుడై యుండవలెననుట నిశ్చయము. కేవలము కురూపిని దీకొనిపోయి "రాజమనోహరుడు" "చాళుక్య మన్మథుడు" అను నిట్టి విశేషణములకు గురిచేసినచో నవి యపహాస్యమునకు తావలములగును. రాజునకు కోపకారణములగును గాని ప్రసాద భాజనము లెన్నడును కాజాలవు గదా! రాజరాజు శరీర మున రూపసంపద మాత్రమే గాక లావణ్యసంపద కూడ అమరి యుండెననుటకు "తుహినకరుడురు కాంతిన్" అను నిట్టి వర్ణనము లాధారములు.

పరాక్రమము, దయ, వితరణమునను మూడు గుణములును రాజరాజుశీలము నలంకరించుచుండెననుట స్పష్టము. దయయున్న చోట వితరణముండుట యాశ్చర్యజనకము గానేరదు గాని పరాక్రమము దయయు నొక్కచోట నుండుట అరుదు. 'అన్యరాజ్య తేజోజయశాలి' 'అపరాజిత భూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుడు' ఇత్యాది విశేషణములును "కోదండపార్థ!" "విక్రమాదిత్య!" "మృగ

రాజ పరాక్రమ!" ఇత్యాది సంబోధనములును పరాక్రమమును వర్ణించుచు గానవచ్చుచున్నవి. దేశ మల్లకల్లోలముగ నున్న యా కాలమున ప్రభువులు పరిపాలనాదక్షులయి యుండిన జాలదు. పరాక్రమవంతులు సాధారణముగ క్రూరులయి యుందురు. రాజరాజట్లుగాక 'దయార్ద్రబుద్ధి' యట. అందుచేతనే యాతని పాలనము 'జగజ్జనానురంజనముగ' నుండెడిది. "ఆశ్రితపోషణము" అతనికి నైజవిలాసము. ఈ యాశ్రితులలో బాంధవులు మిత్రులు విద్వాంసులు ముఖ్యులు. "బాంధవాంభోజమణీ""మిత్రవిద్వదంభోజవన పయోజ మిత్ర"ఇత్యాదిసంబోధనము లీ యంశమును స్థాపించుచున్నవి. దానమనునది ఆతనికొక వినోదము, ఆతని దానశాసనములు ఇప్పటికిని గనవచ్చుచున్నవి. కోరుమిల్లి శాసనము, కలిదిండి శాసనము, నందమపూండి శాశనము మండశాసనము మున్నగువాని నుదాహరింప వచ్చును. ఇవిగాక కాలగర్భమున లీనమైపోయిన వెన్నో యెవరు చెప్పగలరు? ఈ దానములలో పెక్కులు కవులకు విద్వాంసులకు చేసినవే. ఇవి వ్యక్తులకుచేసిన దానములుగ నెంచుటకు వీలులేదు. ఆనాటి విద్వాంసులు వేనకువేల విద్యార్థుల కాశ్రయ మొసంగి వేదాదివిద్యలను వారి కుచితముగ బోధించుటయే గాక వారి కన్నపానాది సౌకర్యములనుగూడ ఉచితముగ నేర్పరచెడివారు. రాజరాజు కోరుమిల్లి శాసనము తిలకించినచో ఈ యంశము స్పష్టమగును. చీదమార్యుడను మహావిద్వాంసునకు కోరుమిల్లి దానముచేయుచు జన్మప్రభృతిగ గీతవేదార్థ తత్త్వవేత్త యగు నా మహామహుని పాండిత్యమును మాత్రమే గాక ఇతరపండితులకు ఛాత్రులకు కల్పద్రుమముగ నుండిన యాతని ప్రవచనౌదార్యమును గూడ రాజరాజుగ్గడించినాడు. అందుచే నా కాలమున నొక్కొక్క విద్వాంసు డొక్కొక్క విద్యాపీఠము (యూనివర్సిటీ) గ నెన్నదగి యున్నాడు.రాజరాజు పండితప్రకాండుడనుట కూడ నన్నయ రచనల బ్రస్ఫుట మగుచున్నది,

విమలమతిన్ బురాణములు
వింటి ననేకము లర్థధర్మశా
స్త్రముల తెఱం గెఱింగితి
నుదాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు చూచితి
జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి
ప్రకాశముగా హృదయంబు భక్తితోన్.

ఈ పద్యమేగాక 'వివిధాగమ విహితశ్రముడు' 'నిఖిలరాజ విద్యానిధి' ఇత్యాది విశేషణములున్నవి. కావ్యనాటకములనుగూర్చి చెప్పునప్పుడు అవియుదాత్త రసాన్వితములుగా నున్నప్పుడే అతనికి రుచించుననుట అతని సహృదయత యెంత నిశితమైనదో వెల్లడించు చున్నది. ఇదిగాక 'మనీషి విద్యాశ్రమ తత్త్వవేత్త' యని నన్నయ శ్లోకచో వాడిన విశేషణమును బరిశీలించినచో రాజరాజు పాండిత్య మెంత గంభీరమైనదో సువ్యక్తమగును. మహాపండితులు చేసిన విద్యా శ్రమమునందలి తత్త్వమును మథించుటకు మంథరనగము గావలెనన్న రాజరాజు పాండిత్యమెంత కూలంకషమయినది గావలయును ?

తక్కిన గ్రంథములపైనున్న గౌరవమంతయు నొక యెత్తు. ప్రత్యేకము భారతముపై రాజరాజునకున్న భక్తి ఒకయెత్తు. 'భారత శ్రవణాసక్తి' నాతని శీలములో నొక విశిష్టలక్షణముగ నన్నయ నిరూపించుచున్నాడు.

ఇవి యేనున్ సతతంబు నాయెడ
గరం బిష్టంబులై యుండు బా
యవు భూదేవకులాభి తర్పణ
మహీయః ప్రీతియున్ భారత

శ్రవణాసక్తియు పార్వతీపతి
పదాబ్జధ్యాన పూజామహో
త్సవమున్ సంతత దానశీలతయు
శశ్వత్సాధు సాంగత్యమున్.

ఈ యాసక్తికి పెక్కు కారణములను నన్నయ పేర్కొన్నాడు. కేవల కథాశ్రవణ కుతూహల మొకటి. తన వంశకర్తల చరిత్ర మను నభిమానము రెండు. గోశతదాన ఫలప్రదమను నాముష్మిక చింత మూడు. కాని, అన్నిటికంటెను ప్రధానమయినది భారత పరమార్థము ననుసంధింపవలెనను కుతూహల మతిసాంద్రముగ నుండుటయే. పండిత చక్రవర్తుల ముఖమున మూలము నాత డెన్ని పర్యాయములు విని యుండునో! ఎంత గాఢమయిన కృషి లేకున్న 'భారతబద్ధ నిరూపితార్థ మేర్పడ' తెనుగు గావింపుమని నన్నయ మహాకవి కాతడు సూచింప గలడు?

తెనుగున నన్నయ రచించిన భారత భాగమునందలి ప్రాశస్త్య మునకు నన్నయ నారాయణభట్టుల కవితావైభవము మాత్రమేగాక రాజరాజు రసజ్ఞతకూడ మూలకారణము. భారతమునందు పరమాసక్తి యున్న రాజరాజు ఎప్పటికప్పుడు నన్నయ రచించిన భాగములను వినుచు దానిపయి తన విమర్శనమును బ్రకటించుచుండునేగాని యూర కుండడుగదా! భారత శ్రవణాసక్తిని రాజరాజు శీలసంపదలో నొక విశిష్టలక్షణముగ బేర్కొనుటలోని రహస్యమును గొంత విపులీకరింప వలసియున్నది. "రాజరాజు నంతటి వివేకచూడామణిని మెప్పించ గలనా? లేదా" యనిన సంశయము నన్నయను బాధించె ననుట భారతావతారికలోనే వ్యక్తమగుచున్నది.

అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషపారము ముఖంబున బొందను బుద్ధిబాహు వి

క్రమమున దుర్గమార్థజల గౌరవభారత భారతీ సము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేరబోలునే?

అను నన్నయ సమాధానములో వినయము మాత్రమే గాక వివేకముకూడ నిబిడముగ నున్నది. భారతవర్షమునందలి విజ్ఞానరాసుల కెల్ల భారతము ఖజానా. యుగయుగములుగ నుపనిషన్మంత్ర ద్రష్టలార్జించిన వేదాంత సత్యములును అధ్యాత్మ విద్యలును రాజర్షులు సేకరించిన లోకానుభవమును అర్థ ధర్మ నీతిశాస్త్రముల పారమును కవి వృషభులు ప్రదర్శించిన అద్భుతావహమైన కలావైదగ్ధ్యమును ఈ భారతమున నేకీభవించి కొలువు దీర్చినవి. ఇందులో ప్రజాహిత నిర్మాణము ప్రపంచముననే యితర వాఙ్మయమునం దయిన దుర్లభమేమో యని సంశయింపదగిన అద్వితీయ గ్రంథరాజ మది. ప్రజాబాహుళ్యమును దృష్టిలో నుంచుకొని చూచినచో వేదములకంటెను భారతీయ వాఙ్మయమున భారతమే ప్రాముఖ్యమును బడయదగి యున్నది. అట్టి మహావాఙ్మయమునందున్న పరమాసక్తి రాజరాజు రసజ్ఞతా పరిణతికిని వివేచనా గాంభీర్యమునకును నిదర్శనము గాదగి యున్నదేగాని రుచిభేదమువలన నుదయించు పక్షపాతమును నిరూపించుట లేదు. అంతటి భావుకుడు భారత రచనమునకు మార్గదర్శకుడుగ నుండుట ఆంధ్రులు చేసికొన్న సుకృతఫలితము.

భారతాసక్తితోబాటు మరి నాలుగు గుణములు రాజరాజుకు నిత్యసహచరములు : [1] విప్రభక్తి [2] సంతత దానశీలత [3] సాధు సాంగత్యము [4] పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము. ఇందు విప్రభక్తినిగూర్చి శివభక్తినిగూర్చి కొంత విశదీకరింపవలసి యున్నది. ఈనాటి యాశయములనుబట్టి ఆనాటి యాశయములను విమర్శించుట యసంగతము. ఈనాడు ఎవ్వరును "నేను బ్రాహ్మణ భక్తుడను" అని యొక విశేషముగ జెప్పుకొనువారే యుండరు. ఉండి

నను ఇతరులు దాని నొక ఘనతగ భావింపరు. వర్ణాశ్రమ ధర్మమునకు ప్రాబల్యమున్న ఆ కాలమున నది యొక గొప్పగ నుండెడిది. బహుశః ఆనాటి విప్రులలో పెక్కండ్రు అవిరళ జప హోమ తత్పరులును నిత్య సత్య వచనులును త్యాగశీలురును అయియుండిరేమో! ఉద్యోగ స్వీకరణమునకు పూర్వము కాంగ్రెసు నాయకులలో పెక్కండ్రు త్యాగ శీలురయి దేశమునకు ఖ్యాతిని సంపాదింపలేదా? అట్టి వెనుకటి త్యాగ మునుబట్టి ఇప్పటికిని ప్రజలు వారిని గౌరవించుచుండుటలేదా. ఇట్లే ఆనాటి రాజరాజు బ్రాహ్మణభక్తిని కూడ సమర్థింపవచ్చునేమో! "భీమేశ్వర కృతకృత్యప్రసాద" అను సంబోధనమును జూచినచో ఆతని యిష్టదైవము శివు డనుటతో నాగక భీమేశ్వరుడనికూడ ప్రత్యే కముగ నిరూపితమగుచున్నది. అప్పు డాంధ్ర దేశమున రెండుమూడు స్థలములలో భీమేశ్వరాలయము లున్నవి. అన్నిటికంటెను ప్రాముఖ్యము వహించి చిరకాలము ప్రసిద్ధిగన్నది దాక్షారామ భీమేశ్వరుడు. ఈ దాక్షారామమునందలి భీమేశ్వరుడుగాని ప్రకృతము సామర్లకోటకు సమీపమునందలి భీమేశ్వరస్వామిగాని ఆతని యిష్టదైవమై యుండ వలెను. భీమేశ్వరమునుగూర్చి అమూలకముగ నన్నయ భారతకథలో గూడ బ్రసక్తి తెచ్చినాడు. అర్జునుని తీర్థయాత్రలను వర్ణించుచు

"దక్షిణ గంగనా దద్దయు నొప్పిన గోదావరియు జగదాదియైన భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీ సురోత్తమా ధ్వరవిధాన పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ విభవంబు జూచుచు"

అని అర్జునుని నాటికున్నను లేకున్నను భీమేశ్వరమునకును వేంగీ దేశమునకును మూలకథతో నవినాభావ సంబంధము గల్పించి తన దేశాభిమానమును బ్రకటించుకొన్నాడు. ఇందు శ్రీపర్వతముతో భీమేశ్వరమును జోడించుటచే సుప్రసిద్ధ త్రిలింగక్షేత్రములలో నొక్క

టగు దాక్షారామమునందలి భీమేశ్వరుడే రాజరాజు నిష్టదైవమని నిర్ధారణ చేయుట—దీనికి విరుద్ధముగ ప్రబలాధారములు లేనంతవరకు సాహసము గానేరదు.

పైని పేర్కొన్న మహా గుణములేగాక మరికొన్ని సూక్ష్మ గుణములు కూడ నన్నయ చిత్రణమున ప్రత్యక్షమగు చున్నవి. 'అభిమాన మహార్ణవ' అని యొకచో సంబోధనమున్నది. దీనినిబట్టి రాజరాజు హృదయము మిక్కిలి కోమలమయినదని చెప్పవచ్చును. అయితే ఈ యభిమానము కొందరు ప్రజా పాలకులలోవలె దురభిమానముగ ప్రకోపించి చీటికి మాటికి కోపము తెచ్చుకొను స్వభావముగలదై యుండదు. అట్లయినచో నాతనిని 'సంతతక్షమాభరణు' డనుటకు వీలు లేదుకదా. పైగ 'నిరంతరానందమతీ' యను సంబోధన మొకటి మఱియొకచో గనవచ్చుచున్నది. ఎప్పుడును సుప్రసన్న మనస్కు (Cheerful mind) డనుట నీ సంబోధనమున కర్థముగ జెప్పుకొనవచ్చును. చీటికి మాటికి గోపము వచ్చువారికి నిరంతరానంద మనస్కత యసాధ్యము గదా. ఇంక మన 'అనంత విలాస' మను గుణమొకటి విచార్యము. ఈ విలాసమున కిప్పటి భాషలో 'దర్జా' యని అర్థము చెప్పుకొనవచ్చునేమో. రాజులకు కొంత భోగము కూడ వలయునుగదా ధరించు దుస్తులయందు, భవనాలంకరణమునందు, మాట్లాడు ఫక్కియందు, వితరణమునందు ఒక విధమయిన (grace) సరసత ప్రత్యక్షమగుటచే దాని ననంత విలాసముగ నన్నయ వర్ణించి యుండవచ్చును.

నన్నయ భారతమునందు శాసనములందు కూడ రాజరాజు పవిత్రతను పదేపదే ప్రశంసించును. 'వ్యసన వివర్జిత' అని సంబోధించుటచే నైశ్వర్యవంతులకు సాధారణముగ సహజములగు స్త్రీ ద్యూతములు పరిహృతములని యూహింపవచ్చును.

ఘన దురితానుబంధ కలికాలజ దోషతుషార సంహతిన్
దనయుదయ ప్రభావమున దవ్వగజోపి...
అని భారతమునందు మాత్రమేగాక

సంరక్షతి క్షితితలం క్షపితారివర్గే
మార్గేణ యత్ర నయశాలిని మానవేన
ప్రీతాః ప్రజా నిజపవిత్ర చరిత్రతోయైః
ప్రక్షాలయంతి కలికాల కలంక పంకం.

అని నందమపూండి శాసనములో గూడ రాజరాజు పవిత్రత ప్రాముఖ్యమును బడయుచున్నది. 'ఆదిరాజవిభు'డని 'మనుమార్గు'డని మాటిమాటికి గీర్తించుట చూడగ "ఎంత గాఢముగ హృదయమున కెక్కియున్న నన్నయ పవిత్రతయను నీ సమష్టి భావమున కింత నిరతిశయ ప్రాధాన్య మిచ్చియుండును?" అను ప్రశ్నయు రాకమానదు.

రాజరాజును నన్నయయు అన్యోన్యాశ్రయులు. రాజరాజు పోషణము ప్రేరణము లేకున్న నన్నయ భారతమే లేదు. భారతమే లేకున్న నానాటి 'ఎందరో మహానుభావుల'వలె నన్నయకూడ కాల గర్భమున జీర్ణించిపోయి యుండును. ఇంక తన పవిత్రవాణిచే నన్నయ రాజరాజునకు నిర్మించిన యశోభవనము అజరామరమయినది. రాజరాజు కట్టుకొన్న రమ్యభర్మహర్మ్యము లన్నియు ఊరును పేరును లేకుండ ఏనాడో శిథిలమయిపోయినవి. కాని మహాకవి నిర్మించిన యీ మందిరము మాత్రము నేటికిని రాజరాజును మనకు కన్నుల కరవు దీరునట్లు బ్రత్యక్షపరచుచు నిత్యనూతన శోభతో జోహారు లందుకొనుచున్నది!

—0—

# నన్నయ చిత్రించిన రాజరాజు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

రాజరాజు నలువది సంవత్సరములకుఁ బైగా జాళుక్య సామ్రాజ్యమును పరిపాలించి యుండెను. ఆ పరిపాలన కాలమున జగద్ధితమునకై యాతఁడొనరించిన మహాకార్యములెన్నో యుండవచ్చును. కాని యవి యన్నియు నొక యెత్తు. ఆంధ్రవాఙ్మయమున కాతఁడుఁ గావించిన సేవా విశేష మొక యెత్తు. కావ్యగీత ప్రియుఁడైన యా మహారాజు ప్రేరణ ప్రోత్సాహములే లేకుండినచో నా కాలమున నాంధ్ర భారతమవతరించుట కవకాశమే లేకయుండును. ఈ విధముగ నాతఁడాంధ్రులకు, నాంధ్రభాషకు, నాంధ్రదేశమునకుఁ గలిగించిన మేలింతింతనరానిది. స్వార్థరహితమైన యీసేవ కారణముగా నాతఁడు గావించిన ఫలితమును నపారమైనదే. ఏలయన నాంధ్రభారత రచనారంభ మాతని కీర్తిచంద్రిక కనవరత శరత్కాలమై యపరిమితౌజ్జ్వల్యము నావహించుచున్నది.

రాజరాజు నన్నయ నాంధ్రమున భారతము రచియింపుమని కోరెనేగాని దానిని తన కంకితము చేయుమని కోరియుండలేదు. నన్నయయు నా మహాకావ్యము నతని కంకితము చేసినను జేయకపోయినను, అవతారికారంభమున నతని గుణగణములను వర్ణించుటే గాక యాశ్వాసాదంతములం దర్థవంతములైన యనేక విశేషణములచే నతని సంబోధించి శౌర్యత్యాగ నయక్షమా వివేకాదులగు నతని గుణములకును, నిర్మలమైన కీర్తికిని అక్షరరూపమైన మూర్తి తీర్చిదిద్దినాడు. ఆ త్రిలింగభాష నా దివ్యమూర్తి యాంధ్రజనుల మ్రోల సాక్షాత్కరించుచునే యుండును.

శాసన కావ్యకర్తలు శాసనములలో నా యా రాజేంద్రులను గూర్చి పలు విధములుగాఁ బ్రశస్తి వాక్యములను రచించుచుందురు. ఈ ప్రశస్తులతో సాధారణముగాఁ గులాచార్య యశః శౌర్య త్యాగ శీలాదుల వర్ణనమును "కీర్తిప్రజారాగ, ప్రతాపాజ్ఞా, నయ, క్షమా,

వివేకారిపువిదాహ, ధర్మసంగ్రామ" ప్రభృతులగు విశేషగుణముల ప్రశంసయుఁ గనవచ్చుచుండును. ఒక్కొక్కప్పు డందా రాజునకు విరుద్ధులైన శత్రువుల గుణగణములను విస్తరించి, యట్టివారి నవలీలగా జయించుటచే నతనికిఁ గలుగు నుత్కర్షను సైతము ప్రదర్శింపవచ్చును[1] రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి దాన తామ్రశాసన మిందుకు దృష్టాంతము. భారతమున నన్నయ కావించిన రాజరాజ వర్ణనముకూడఁ బయి విధముల శాసనములందలి ప్రశస్తి వర్ణనమును దలపించుచున్నది ఇందు యథార్థ గుణగణ వర్ణనముతో పాటను స్వాతముగాఁ దద్వంశీయులు వహించుచు వచ్చిన బిరుదులును, లాక్షణికులు నాయకుని కుండవలెనని చెప్పిన సాంప్రదాయిక లక్షణములును, గొన్ని గోచరింపవచ్చును. కవితావశమున నిందచ్చటచ్చట నతిశయోక్తులు చొచ్చుటకును నవకాశము లేకపోలేదు. ఇట్లని యందలి విషయమంతయు నభూత కల్పనగాఁ బరిగణించుట మాత్రి ముచితము కాదు. అలంకారాసక్తిచే నరుదెంచునట్టి యతిశయోక్తుల నెఱుంగుటకంత కష్టపడ నవసరము లేదు. అట్టివానిని గొన్నిటిని దొలఁగించి చూచినచో నన్నయ నిర్మించిన రాజరాజు నిర్మలమూర్తి మనకు సుస్పష్ట రేఖలతో సాక్షాత్కరించి తీఱను. నన్నయ నిత్య సత్యవచనుఁడునుఁ మితభాషియు నగుటచే నాతని వర్ణనము లందట్లు వర్ణనీయులైన విషయములంతగా గోచరింపవు.

నన్నయ వర్ణించిన రాజరాజు గుణగణములలో నెల్లఁ బ్రముఖములైన నాతని తేజఃశౌర్య ప్రతాపములు. అతఁడు విక్రమాదిత్య విభుఁడు. విభాకర తేజుఁడు. వీరావతారుఁడు. మృగరాజ పరాక్రముఁడు. అన్యరాజ తేజో జయశాలియైన యాతని శౌర్య మప్రతిమానమైనది. నిజభుజ విక్రమముచే నాతఁడరాతి రాజ నివహముల నోడించి యపరాజిత భూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుఁడై యొప్పారెను. "నిస్తేజితవైరివీర, దండితాహిత వీర, పరంతప, రిపు ప్రలయ ప్రతాప, విక్రమోద్వేజితాహిత, జితారి, విరోధి ప్రళయాం

తిక, భూరిప్రతాప పరిభూత విరోధివర్గా” మున్నగు సంబోధన లాతఁడు, వైరివీరుల నిర్జించుటయందుఁ జూపిన సామర్థ్యమును వేయి విధముల వక్కాణించుచున్నవి. నన్నయ రాజరాజు శౌర్యపరాక్రమముల నింత యధికముగా వర్ణించుట కేవల స్తోత్రప్రియత్వము చేఁగాదు. ఆ మహారాజు తాను రాజ్యమును బరిపాలించిన నాల్గు దశాబ్దుల కాలములో మూఁడు నాలుగు సారులైన వైరి వీరుల నిర్జించి నష్టప్రాయమైన సింహాసనమును మరల సంపాదించుకోవలసి వచ్చెను. విమలాదిత్యుఁడు క్రీ. శ. 1019లో మరణింపఁగా వెనువెంటనే రాజరాజు చాళుక్య సింహాసనము నధిష్టింపవలసియుండెను. కాని యాతఁడు తరువాత మూఁడేడ్ల వఱకును దాయాదులయు శత్రువులయు విరోధముచేఁ బట్టాభిషేకము నిర్వర్తించుకొనఁ జాలకపోయెను. ఈదాయాదు లెవ్వరను విషయమున భిన్నాభిప్రాయము లున్నవి. రాజరాజు సవతి తమ్ముఁడైన విజయాదిత్యుఁడే తండ్రి మరణానంతరము చాళుక్య సింహాసనము నాక్రమించి రాజరాజున కాటంకము కల్గించెనని శ్రీనేలటూరి వేంకట రమణయ్యగా రభిప్రాయ పడుచున్నారు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావు గారప్పటికి విజయాదిత్యుఁడు బాలుఁడై యుండెననియు, శైశవము నందే యాతని హృదయ క్షేత్రమున రాజ్యకాంక్ష మొలకెత్తెనని తరువాతి కాలపు శాసనము లేవియు సూచించుట లేదనియుఁ దెల్పి, యిమ్మడి చాళుక్య భీముని దాయాదులైన రాజమార్తాండ కంఠిక విజయాదిత్యుల సంతతివారైన నిరవద్యపుర పిఠాపుర చాళుక్యులే కాక కళింగములోని సర్వసిద్ధి చాళుక్యులు గూడ వేంగీ సామ్రాజ్యమునకై రాజరాజుతోఁ బోరాడి యుందురనియు,నాయదను చూచుకొని కళింగరాజైన మధుకామార్ణవుఁడు నైతము రాజరాజు నెదిరించి యుండుననియును రచించియున్నారు.[2] వీరిలో నెవ్వరు విరోధించినను వారి నోడించి పాఱఁదోలు వఱకు రాజరాజు పట్టాభిషిక్తుఁడగుట కానుకూల్య మొదవియుండలేదు. అతఁడు “వైరి వేదండ

గండ విదారి ఘోర తరాసి భాసి భుజార్గళుఁడై" ఘోరాజి ముఖమున విజయ ప్రమదా సమాలింగన సౌఖ్యము ననుభవించుటకు మూఁడేండ్లు పట్టెను.[3] ఈ విషయమునే కోరుమిల్లి తామ్రశాసనమున బేతనభట్టు "రాజన్యరాజన్య[4] సేవ్యమైన పృథివీ రాజ్యలక్ష్మిని రాజరాజు భుజబలముచే భరించె"నని చెప్పియున్నాఁడు. కోదండ పార్థుఁడును, బరాక్రమ ప్రియధాముఁడును నగుటచేతనే రాజరాజు సింహాసనమునకు వచ్చియు రాకముందే సంఘటిల్లిన యీ వైరి విరోధమును నిరసించి జగద్వ్యాయ భాసుర సముద్యత్తేజుఁడును, వీర శ్రీ వనితాశ్రిత భూరి స్థిర బాహుదండుఁడునై విజయవైభవము నొందఁజాలెను.

ఇట్లాతఁడు "నిత్యలక్ష్మీ జయాభిరాముఁడై" క్రీ. శ. 1022వ సంవత్సరమున బట్టాభిషేక మహోత్సవమును నిర్వర్తించుకొనఁజాలెను. తరువాత నాతఁడు సుమారెనిమిది సంవత్సరముల కాలము" నానావని నాథ కిరీట తటీ విల సద్రత్న సంఘటిత పదకమలుఁడై" సామ్రాజ్యమును సర్వజనాను రంజనముగాఁ బరిపాలించెను. ఇంతలో నాతని యదృష్ట చక్రము నేమి మఱల నధోగామి కావలసి వచ్చెను. చాళుక్య సింహాసనా క్రమణమునకుఁదగిన సమయ మెప్పుడరుదెంచునా యని యెదురు చూచుచున్న విజయాదిత్యుఁ డొక విప్లవమును లేవదీసి, రాజరాజును సింహాసన భ్రష్టు నొనరించి, 1031 జూన్ 27వ తేదీన విష్ణువర్ధన విజయాదిత్యుఁడను పేరఁ బట్టాభిషిక్తుడయ్యెను. ఈ సందర్భమున నాతనికిఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియైన రెండవ జయసింహుని సాహాయ్య సంపద చేకూరియుండును. కొంచె మించు మించుగా నీ కాలమునకే చెందియుండు కలిదిండి తామ్రశాసనము పశ్చిమ చాళుక్యులు వేంగిపైఁ గావించిన దండయాత్రను సూచించుచుండుట యిందుకుఁ దార్కాణముగా నున్నది. రాజరాజు ధైర్యామర ధరణీధరుఁడయ్యును. బ్రబలమైన శత్రుధాటి కాగలేక సాయమర్థించుటకై చోళ రాజధానియైన గంగాపురి కరిగెను. రాజేంద్ర చోళుఁడాతని

ప్రార్థన నంగీకరించి రాజరాజ బ్రహ్మ మహారాజు, ఉత్తమ చోడ చోడకోన్, ఉత్తమ చోడ మిలాండ్, ఉడై ఎలాన్ అను ముప్వురు సేనానాయకుల యాధిపత్యమున బెద్ద సైన్యమును వేంగీదేశమునకుఁ బంపెను. ఆ సేన వచ్చి పశ్చిమ చాళుక్య సైన్యమును కలిదిండియొద్దఁ దాకెను. ఈ యుద్ధమున నేపక్షమునకు విజయము చేకూరెనో చెప్పఁ జాలము. ఏలయన నందిరుపక్షములందలి సేనానాయకులును వీరస్వర్గమునలంకరించిరి. కాని తరువాత రాజరాజు యుద్ధ నిహతులైన యా చోళ సేనాపతుల ముప్వురికిని స్మారక చిహ్నములుగా మూఁడు దేవాలయములు నిర్మించి యుండుటచేఁ జోళుల తోడ్పాటుచే నాతఁడు సింహాసనమున బునఃప్రతిష్ఠాపితుఁడైన ట్లూహించుట కవకాశము కలుగుచున్నది. ఇట్లు వీరో(గ్రాజి విజయుఁడై యాతఁడు పోయిన సింహాసనమును మరల సంపాదించి యేడెనిమిదేండ్ల కాలము రాజ్య మొనరింపఁ జాలెను. ఈ సమయమునఁగూడ నాతని కప్పుడప్పుడు పశ్చిమ చాళుక్యుల వలన నలజడి కలుగుచునే యుండెను.

క్రీ. శ. 1042లో రెండవ జయసింహుడును దరువాత రెండేండ్లకు రాజేంద్ర చోళుఁడును దివంగతు లగుటచే త్రైలోక్యమల్ల ఆహవమల్ల సోమేశ్వరుఁడును రాజాధిరాజును గ్రమముగాఁ బశ్చిమ చాళుక్యచోళ సింహాసనముల నధిష్ఠించిరి. వేంగీవిషయము కారణముగా వారిరువురికిని మరల యుద్ధ మారంభమాయెను. ఈ సారి చోళులు నిర్విరామముగా దండయాత్రలు సల్పుచుండినను లెక్కచేయక పశ్చిమ చాళుక్యులు వేంగీ రాజ్యమునందలి చాల భాగము నాక్రమింపఁ జాలిరి. రాజరాజు పూర్తిగ రాజ్య భ్రష్టుఁడు కాక స్వల్ప భాగమును మాత్రమే యేలుచుండినట్లు క్రీ. శ. 1047 లో వేయఁబడిన దాక్షారామ భీమేశ్వరాలయము నందలి యొక శాసనమువలనఁ దెలియుచున్నది. **(ARE 183 to 1893)** వేంగీదేశ మట్లు పరాధీనమై పోవుటకు సహింపఁజాలక చోళచక్రవర్తియైన రాజాధిరాజు పశ్చిమ

చాళుక్యుల నెదిరించుటకై నాలుగైదుసార్లు పెద్దసేనలను బంపెను ఆసేనలు పశ్చిమ చాళుక్యసేనల నోడింపజాలినను వేంగీదేశమును మాత్రము వారి బారి నుండి తప్పింపలేక పోయెను. చోళసేనలు కూడఁ దన కేవిధముగను దోడ్పడలేకపోవుట చూచి పశ్చిమ చాళుక్యులతో నింకనుఁ బోరు సల్పుచుండుచో నున్న రాజ్యము కూడఁ బోవునేమో యను భయముచే రాజరాజు క్రీ.శ. 1051 లో వారితో సంధిచేసికొనెను. ఈ సంధి వలన రాజరాజు తన రాజ్యము దాను సంపాదించినను బశ్చిమ చాళుక్య చక్రవర్తి సార్వభౌమత్వము నంగీకరింపవలసి వచ్చెను. ఈ సందర్భముననే యాహవమల్ల సోమేశ్వరుని ప్రధానులలో నొకఁడును, నన్నయ భట్టారకుని సహాధ్యాయుఁడునైన నారాయణభట్టు,పశ్చిమ చాళుక్యుల ప్రతినిధిగా రాజరాజు కొలువున కరుదెంచుట సంభవించెను. క్రీ. శ. 1051–52లో రాజరాజాతనికి నందమపూడి గ్రామము నగ్రహారముగా నొసంగెను. అతఁడు భారతరచనమున నన్నయకు వలెనే రాజకీయ వ్యవహారములలో రాజరాజునకు గొంత తోడ్పడి యుండవచ్చును.

వేంగీ దేశమును పశ్చిమ చాళుక్యుల బారినుండి కాపాడుటకై చోళ చక్రవర్తి ప్రయత్నము లొనరించుచునే యుండెను. ఆ ప్రయత్నము వలన నేమియు లాభము కలుగకుండుటయే కాక కొప్పం యుద్ధరంగమునఁ గలిగిన పరాజయమునకు ఫలముగాఁ జోళులు గంగ వాడి రాష్ట్రమును గూడ గోల్పోవలసి వచ్చెను. దానితో రాజ రాజునకుఁ జోళుల సాయముపై నాశ సన్నగిల్లెను. అందుచే నాతఁడు క్రీ.శ. 1051 లో మరణించు వఱకును పశ్చిమ చాళుక్యుల సామ్రాజ్యములకు లోబడియే యుండవలసి వచ్చెను. అతని మరణానంతరము విజయాదిత్యుఁడు బలవంతముగా నాక్రమించి తన కుమారుఁడైన శక్తి వర్మనందు ప్రతిష్ఠించెను. పశ్చిమ చాళుక్యులతో సంధికావించుకొన్న

పిమ్మటనే రాజరాజు కొంత ప్రశాంతముగా రాజ్యమేలఁ జాలుటయు నాతని ప్రేరణమున నన్నయ భారతాంధ్రీకరణమునకుఁ బూనుటయు సంభవించి యుండును.

ఈ విధముగా రాజరాజు పరిపాలించిన కాలమంతయు యుద్ధములతోనే కడచిపోయెను. అతఁడు చోళుల సాహాయ్యమర్థించినమాట నిజమేయైనను దాను కేవలము వారిపై నాధారపడి యూరకుండలేదు. సమయము చిక్కినపుడెల్ల నాతఁ డరాతుల నపారధైర్య సాహసములతో నెదిరించి పోరాడుచునే యుండెను. ఆయుద్ధములో నాతఁడు ప్రదర్శించిన ధైర్య శౌర్య పరాక్రమముల నెఱింగినవాఁడు కావుననే నన్నయ వాని నాశ్వాసాంత పద్యములలో నంత విస్తృతముగ విసుగులేక వర్ణించియున్నాడు. రాజరాజు రణరంగముల వీర రసావతారమో యన విహరించి "పరమండలంబుల ధరణిపతుల నదిమి కప్పంబుల ముదముతోఁగొనుచును, బలిమినీయని భూమివలయ పతుల నుక్కడించుచు, దిక్కులఁ దనయాజ్ఞ వెలిగించుచు, భీతులశరణన్నఁగాచుచుఁ బలరిపు లలనాసన కమల హారిలాంఛనమూర్తియై నిర్వక్ర పరాక్రమమున" వర్తిల్లిన వాఁడే కాని సామాన్యుఁడు కాఁడు. అతని పరాక్రమమును వర్ణించుచు నన్నయవాడిన విశేషణము లన్నియు నీ విషయమునకు సాక్ష్యములై యున్నవి. నందమపూడి శాసనమున నన్నయ రచించిన—

"యస్యస్ఫాద భుజాకృపాణ దళి తారతీభ కుంభస్థల
ప్రోన్ముక్తామల సృత్తమౌక్తికచయ స్సంగ్రామ రంగాంతరే
ధత్తే వీరరస క్రియాభి నయన ప్రస్తావనా లక్ష్మీతాం
వీర శ్రీ రచితాంజలి ప్రవిసర పుష్పోపహార శ్రియః"

అను శ్లోకము కూడ నాలంకారికమైన యతిశయోక్తితోఁగూడి యున్నను నన్నయకు రాజరాజు భుజబలమునఁగల ప్రత్యయమును జక్కఁగాఁ బ్రతిపాదించుచున్నది.

రాజరాజు వీర్య విక్రమాది తీవ్రగుణములకే కాక దాన దయా సౌజన్యాది మృదు గుణములకు కూడఁ గూడలియై వ్యసన వివర్జితమైన యకలంక చరిత్ర సంపదచే నఖిల జగత్స్తేయమానుఁడై విరాజిల్లు చుండెను. "అఖిల జగజ్జేగీయమాన నానాగుణరత్న రత్నాకరుఁడు, గుణధాముఁడు, బుధనుత సుగుణధారుఁడు, గుణరాజితుఁడు, భూరిగుణ రత్నభూష(తుఁడు)ణుడు, రాజనారి సభాంతర భ్రాజిత సద్గుణుడు" మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు. అతనికిఁ గరం బిష్టంబులై యుండు నను వస్తువులలో సంతత దాన శీలతయు, శశ్వ త్సాధు సాంగత్యమును చేర్కొనబడి యున్నవి. "అగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర మహాగ్రహారంబు లిచ్చుచు, దేవభోగ ముల మహావిభూతిఁ దనరజేయుచు" నాతఁడు దాన వినోదియై తన రారుచుండెను. అతఁడు కరుణారసపూర్ణుఁడు, కృపారస బంధురుఁడు, దయాలాప చతురాస్యుఁడు, ధర్మదయార్ద్ర నిబద్ధబుద్ధి, అతని సౌజన్య మింతింతనరానిది. సంతతమైన క్షమయు, సకల జనానందకరమైన సౌజన్యమును నాతనికి బెట్టని యాభరణములు. వినయ మాతనికి వెన్నతో బెట్టిన విద్య. సత్యధర్మము లాతనికి సతతారాధ్యములు. నిత్య సత్యధన ధనుఁడనియు, వినయ సత్య నిత్యోదయుఁడనియు, సత్యోదితుఁడినియు, నిత్యనిరంతర ధర్మమతియనియు, నన్నయ యాతనిఁ బలుసార్లు వర్ణించియున్నాఁడు. నిరవద్యుఁడై విమల విచార ములకునికిపట్టై, జగత్పావన శుభచరితచే నిఖిల ధరాదేవస్తుత్యుఁడై యాతఁడు ధరణీ తలమున కపూర్వమండనమై భాసిల్లెను. ఇన్ని గుణ ముల కాలవాలమై యుండిన కతముననే నన్నయ యాతని నాదిరాజ విభుఁడని ప్రశంసించియుండెను.

వైదికధర్మము నెడను దదను బంధులగు యజ్ఞయాగాదుల యెడను రాజరాజునకుఁగల ప్రీతియపారమైనది. "పరమ ధర్మవిదుఁడు,

ధర్మవిశారదుఁడు, ధర్మనిత్యప్రారంభ విభాసి, ధర్మవిచారోద్దాముఁడు మున్నగు విశేషణములందు నన్నయవాడిన ధర్మపదమునకుఁ బ్రధానముగా వైదికధర్మమనియే యభిప్రాయము. వేదప్రోక్తములగు ధర్మములలో వర్ణాశ్రమ ధర్మానుసరణమును, యాగాదికర్మాచరణమును ప్రధానములైనవి. రాజరాజు సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ నొప్పారి, నలనృగ భగీరథ, రామచరిత్రాభిరాముఁడను ప్రశస్తి వహించిమించెను. ఆదిక్షత్రచరిత్రుఁడను విశేషణము కూడ నీ యర్థమునే సూచించుచున్నది. "బహుభాషల బహువిధముల బహుజనముల వలన వినుచు భారతబద్ధస్పృహుఁగువారికి బహుయాగ ఫలంబు పరమార్థ"మగునని యాతఁడు చెప్పుటలో నాతనికి యాగాది ధర్మాచరణమునెడ యభినివేశము తేటతెల్లమగుచున్నది. యాగాచరణమున కగ్రజన్ముల తోడ్పాటవసరము. వేదసంరక్షణము వారి యధీనమైయున్నది. అందుచేతనే "బ్రాహ్మణా వేదపాలకాః" అను నానుడి యేర్పడినది. వేదరక్షణ వైదిక కర్మాచరణములతో విప్రవరేణ్యులకున్న సంబంధమును బురస్కరించుకొని రాజరాజు వారియెడ భక్తిప్రపత్తులు కలిగి మెలఁగుచుండెను. ధరణీసురవర సురభూజరాజమై విప్రకులము నెల్లఁ బ్రోచుచు వారొసంగు నాశీఃపరంపరలు నిత్యవివృద్ధి చేకూర్చుచుండ (ధరాదేవాశీః పరంపరా వర్థిత నిత్యోదయుఁడు) నాతఁడు సంతతాభ్యుదయుఁడై చెన్నారుచుండెనో. వేదముల తరువాతి ప్రమాణభూతములైనవి స్మృతులు. శ్రుతిచోదితములైన ధర్మములనే స్మృతులు స్పష్టముగా బోధించుచుండును. అట్టి స్మృతికర్తలలో మనువు ప్రధానుఁడు. అతఁడు వైదిక ధర్మములను స్మృతిరూపమున నిబంధించుటయేకాక యట్లాచరించి తరువాతి రాజుల కందఱికి నాదర్శప్రాయుఁడై వర్తిల్లెను. రాజరాజు మనుమార్గుఁడై మనునిభశుభ చరితుఁడై యొప్పారెననుట యాతని వైదిక మార్గానుసరణ తత్పరతకే దృష్టాంతము చతుర్యుగములందును ధర్మముత్తరోత్తర పరి

హీణమై సన్నగిల్లుచుండును. హనుమంతుఁడు భీమునకుఁ జతుర్యుగాచార వర్తనములఁజెప్పు సందర్భమున "కలియుగంబునందు ధర్మము బలమఱి వర్తిలు నేకపాదంబున" నని కలియుగ స్వరూపమును దెల్పియుండెను. కలియుగము దురితముల కాలవాలము చాళుక్య మన్మథుడైన రాజరాజు "ఘన దురితానుబంధ కలికాలజదోష తుషార సంహతిం దన యుదయ ప్రభావమున దవ్వుగఁ జోపి, జగజ్జనానురంజన మగు రాజ్యసంతతి నితాంత విభూతి"తో ధర్మదయార్ద్రి నిబద్ధబుద్ధియయి వర్తిల్లెను. నన్నయ యాతని "కలికాలభరత" యని సంబోధించెను. దుష్యంత కుమారుఁడైన భరతుఁడు ద్వాపర యుగమునం దుండినవాఁడు. నన్నయ యాదిపర్వచతుర్థాశ్వాసమున (109) నాతని-

"భరతుఁడశేష భూ భువన భార దురంధరుఁడై వసుంధరం
బరఁగి యనేక యాగముల బాయక భాస్కర జహ్నుకన్యకా
సురుచిర తీరదేశముల సువ్రతుఁడై యొనరించి భూరి భూ
సురులకు నిచ్చెదక్షిణలు భూరి సువర్ణ గవాశ్వహస్తులన్"

అని వర్ణించియుండెను. ఈ పద్యమాతని వైదిక ధర్మాచరణ ప్రవణత్వమును బహువిధముల వ్యక్తము చేయుచున్నది. రాజరాజు కలికాల భరతుఁడనుటలో యుగభేదమున్నను అతఁడు యాగాది వైదిక కర్మాచరణ తత్పరుఁడై భరతునివలె వర్తించెనను నర్థము స్ఫురించుచున్నది. నందమపూడి శాసనములో నన్నయ నయశాలియైన రాజరాజు మను మార్గమున క్షితితలమును సంరక్షించుచుండఁ బ్రీతులై ప్రజలు నిజచరిత్ర పవిత్ర తోయములచేఁ గలికాల కలంక పంకమును బ్రక్షాళించుచుండిరని వ్రాసియుండెను. దీనివలన రాజరాజు కలియుగమున వర్తించినను అప్రతిమానమైన ధర్మాభిలాషచే లోకమున యుగాంతధర్మములఁ బ్రతిష్ఠించి కృతకృత్యుఁడయ్యెనని తెలియుచున్నది.

రాజరాజు విద్యావివేకములకు నిధానము. వివేక విభ్రాజిత, వివేక చతురానన, విద్యావిలాస మున్నగు విశేషణము లిందుకు నిదర్శనములు. విమలధీరమణీయుఁడైన యీ మహారాజు సాహిత్యము నందేకాక శాస్త్రములందును నిష్ణాతుఁడై వాణీలీలాస్పదుఁడు సరస్వతీ విలసన్ముఖాంభోజుఁడు నని ప్రశస్తి కెక్కియుండెను. అతఁ డనేక పురాణముల వినెను. ఉదాత్తరసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు చూచెను. అర్థ ధర్మ శాస్త్రముల తెలిసెను. జగత్పరి పూజ్యములైన యీశ్వరాగమములందు భక్తిమై హృదయము నిల్పెను. మహాభారత శ్రవణమన్న నాతని కెంతో యాసక్తి. ఇట్లు శాస్త్రసాహిత్యములం దాటితేటి కావ్యగీతప్రియుఁడై యలరారుటయే కాక యీ రాజేంద్రుడు రాజనీతియందును, నిఖిల రాజవిద్యలయం దును, నిపుణుఁడై గంధసింధుర హయశిక్షారోహదక్షుఁడై, రాజలోక మున కొజ్జబంతియై రాజిల్లుచుండెను. నయబంధుర, నిఖిల రాజవిద్యా నిధి, నృపవిద్యాపాలక, పార్థివ విద్యాధరా మున్నగు విశేషణము లీ విషయమును వెల్లడించుచున్నవి.

రాజరాజు స్వయముగా విద్వాంసుఁడై యుండుటచే మనీషి విద్యాశ్రమ తత్త్వవిత్తమున నేర్పరియై కవిపండితుల నుచితవిధమున సత్కరించుచుండెను. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమ'మ్మను నానుడి యున్నదియే కదా! శిష్టజన బృందమును, కవిపండిత సమాజ మును, బంధుమిత్రవర్గమును నాతనిచే బహువిధములైన మన్ననల బడసి యాతని సౌజన్యమును రసజ్ఞతను గొనియాడుచుండిరి. కవీంద్ర సమాజ సురభూజ, సూరినిధాన, బుధజన చింతామణి, శిష్టపరిపాలన సక్త, విశిష్టాంభోజమిత్ర, సుహృన్నిధాన, మిత్ర విద్వదంభోజ వన పయోజమిత్ర, బాంధవాంభోజవనద్యుమణి యను విశేషణము లాతని విద్వత్కవిపోషణమును, బంధుప్రీతిని విశదము చేయుచున్నవి.

విద్యావివేకములకు నిధియై యాంతర సౌందర్యమున నలరారు చుండెనని గాక, రాజరాజు కాంతిదీప్తులకు నిధానమై యా పూర్వదేహ సౌందర్య విశేషముచే నపరమన్మథుండన నొప్పారుచుండెను. "రాజ మనోహరుఁడు, తుహినకరుఁడు కాంతిని" అను విశేషణము లాతని సౌమ్యమైన యాకృతిని, కాంతినిధి, దీప్తినిధి యను సంబోధన లాతని శరీరకాంతి సంపదను వెల్లడించుచున్నవి. యువతీ మదనుఁడు, భువనైక సుందరుఁడు, భావ భవ నిభ శుభాంగుఁడు, మన్మథాకారుఁడు, తరుణావ తారుఁడు మున్నగు విశేషము లనన్యసామాన్యమైన యాతని రూప వైభవమును జెప్పక చెప్పుచున్నవి. ఇట్లు రూపగుణోపేతుఁడైన యా చాళుక్య మన్మథుఁడు "భూరిసంపదఁ దలపూవు వాడని భోగియై, నిరంతరానందమునఁ గాలము బుచ్చుచుండెను. "పూర్వదిక్పతిభువిలాస, వాసవమూర్తి, హరినిభ విభవ విభాసమాన, నిరంతరానందమతీ" యను విశేషణము లీ విషయమును వ్యక్తము చేయుచున్నవి. రాజ రాజు పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవమునం దధికమైన ప్రీతికలవాఁడు. "మృడప్రియుఁడు, మఖారి దయాబ్ధి సుస్థిరైశ్వర్యుఁడు" మున్నగు విశేషణము లీ విషయమును స్థిరపరచుచున్నవి. వేంగీ చాళుక్యు లందఱికివలె నాతనికిని దక్షవాటీ భీమేశ్వర దేవుఁడు కుల దైవము. భీమేశ్వరకృత నిత్యప్రసాదుఁడని నన్నయ యాతని వర్ణించి యుండెను. "జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములం దాలిఁడు భక్తిమై హృదయము నిలిపి "పురారాతి పూజనాసక్తమతియై కాలము పుచ్చియుండెను. ఇట్లని యాతఁడు వీరశైవుఁడని మనము భావింపనక్కఱ లేదు. వైదికధర్మమన్నను, వర్ణాశ్రమాచారములన్నను, వైదిక కర్మా చరణ మన్నను అతని కింతింతనరాని ప్రీతి. వేదవిప్రు లతనికిఁ బరమ పూజ్యులు. వేదశాస్త్రముల యభివృద్ధికై యీతఁ డనేక దానము లొసఁగి యుండెను. వేంగీ సింహాసన మధిష్ఠించిన రాజు లందఱును బరమ బ్రాహ్మణులు, పరమ భట్టారకులు, పరమ మహేశ్వరులు;

"కుబ్జ విష్ణువర్ధనాదులు కొందఱు పరమ భాగవతులౌదురుగాక" అంత మాత్రమున వారు వైదికాచారపరాయణులు కాకపోలేదు. అది చాళుక్యవంశ మర్యాద. "వేంగీశ్వరులు బౌద్ధ ధర్మోపాసకులపై, జైనమునులపై, శ్రావకులపై ఆదరాభిమానములు చూపి యా యా ధర్మములను బోషింతురుగాక. దానధర్మములను జేయుదురుగాక, పరమ బ్రాహ్మణ్యులును, బరమ మాహేశ్వరులును నై తీరవలయును. బ్రాహ్మణధర్మ మవలంబించి పరమ బ్రహ్మణ్యుఁడు కానివాఁడు ఈశ్వరాగమములందు మనసు నిలిపి పరమ మాహేశ్వరాచారపరుఁడు కానివాఁడు, రాజచాళుక్య వంశజుఁడు వేంగిసింహాసనముపైఁ గూర్చుండరాదు. అనర్హుడతఁడు. (రాజరాజనరేంద్రుడు. పుట. 92)

ధరణీ రక్షణమున రాజరాజు కడుంగడు దక్షుఁడు. రత్నాకర పరివృత సకల ధరాకాంతుఁడైన యాతఁడు నిఖిల మహీవలయోద్వహ బాహుమండలుఁడును, నిఖిలమహీ రక్షామణియునై నిజవంశ లాంఛనము నందలి వరాహమూర్తివలె భువనోద్ధరణ మొనర్చుచుండెను. నన్నయయు విష్ణుమూర్తి, విష్ణుసన్నిభ, నారాయణమూర్తి, నారాయణాఖ్య యని సంబోధించి యాతని భువనోద్ధరణ దక్షతను విష్ణ్వంశ సంభూతత్వమును ధ్వనింపఁజేసి యుండెను.

రాజరాజనరేంద్రుఁడు "విలసచ్చాళుక్యాన్వయ పయోధి శశి" ఉత్తమ చాళుక్యుఁడు, వరచాళుక్యాన్వయాభరణుఁడు, శ్రీమచ్చళుక్య వంశ శిఖామణి, విలసచ్చళుక్యవంశ తిలకుఁడు, చళుక్యమన్మథుఁడు" అని నన్నయ పలుచోట్ల నాతని వర్ణించియున్నాఁడు. ఈ చాళుక్యులు శైవులయిన బ్రాహ్మణోపేత క్షత్రియులని కీ.శే. చిలుకూరి వీరభద్రరావుగారు రాజరాజనరేంద్ర సంచికలో నిరూపించియున్నారు. (పుట 77) వీరు మానవ్యస గోత్రీయులని, హారీతీ పుత్రులనియు, మాతృగణ పరిపాలితులనియు, స్వామి మహాసేన పాదానుధ్యాతులనియు, శాసన

ములు వర్ణించుచున్నవి. నన్నయకూడ రాజరాజనరేంద్రు నొక్కచో మానవ్యస గోత్ర పవిత్ర యని సంబోధించియున్నాడు. విమలాదిత్యుని రణస్థిపూడి శాసనమునందును, దరువాతి రాజరాజనరేంద్రుని శాసనములందును విజయాదిత్యుఁడు త్రిలోచనపల్లవునితోడి యుద్ధమున మరణించిన పిమ్మట నంతర్వత్ని యైన యాతని మహాదేవి పురోహితునితోఁ గూడ ముడివేము నామకాగ్రహారమున కరిగి దద్వాస్తవ్యుఁడైన విష్ణుభట్ట సోమయాజిచే దుహితృనిర్విశేషముగా నభిరక్షితయై విష్ణువర్ధనుని గనెననియు, నామె యా కుమారునికి మానవ్యసగోత్ర, హారీతిపుత్రాది ద్విపక్షగోత్ర క్రమోచితములైన కర్మలు చేయించి యాతని పెంచి పెద్దఁ గావించెననియుఁ జెప్పఁబడియున్నది. విష్ణువర్ధనుని కాపేరును హారీతిపుత్రగోత్రి సంజ్ఞయు, మాతామహసమానుఁడైన విష్ణుభట్ట సోమయాజివలనఁ గలిగెనని యూహింపదగియున్న"దని కీ. శే. జయంతి రామయ్యపంతులుగారు వ్రాసియున్నారు. (రాజ.న.సం. 76) దీనినిబట్టి చాళుక్యులు పితృపరంపరను బట్టి మానవ్యసగోత్రమునకును, మాతామహకల్పుడైన విష్ణుభట్టసోమయాజినిబట్టి హారీతీపుత్రగోత్రమునకు జెందినవారని తెలియుచున్నది. కాని యిట్లనుకొనుట కొక యాటంకము గోచరించుచున్నది. చాళుక్యులకుఁ బూర్వులైన కదంబుల శాసనములలోఁగూడ వారు మానవ్యసగోత్రులనియు హారీతీపుత్రులనియు స్వామి మహాసేన మాతృగణాధ్యాతాభిషిక్తులనియు వ్రాయఁబడి యున్నది. (మృగేశ్వరవర్మ కదంబకళని తామ్రశాసనము) అందుచే కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు "బహుశః చాళుక్యులు మానవ్యస గోత్రులును హారీతీపుత్రులు నైన కదంబులను జయించుటచేత వారివలెనే వీరును మానవ్యస గోత్రుల మనియు, హారీతీ పుత్రుల మనియుఁ జెప్పుకొనియుండిరేమో" యని సంశయమును వెలిబుచ్చియున్నారు. (రాజ. న. సం. 76) వారికా గోత్రసంజ్ఞ కలిగిన తెఱఁగున కీ యూహ తక్క వేఱాధారములు కానవచ్చుటలేదు. చాళుక్య

రాజులలోఁ బలువురికి విష్ణువర్ధన బిరుద నామము కలదు. నన్నయయు రాజరాజును విష్ణువర్ధన నృపతి, విష్ణువర్ధన భూపతి యని రెండు మూడు చోట్ల సంబోధించి యున్నాఁడు. విష్ణుభట్ట సోమయాజిచే వర్ధితుఁడై చాళుక్యవంశ వర్ధనుఁడై విష్ణువర్ధనుని బట్టి యీ వంశమువారీ నామ మును దాల్చియుందురు.

రాజరాజు నన్నయను భారతము నాంధ్రీకరింపుమని కోరు సందర్భమున "హిమకరుఁ దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండు భూపతుల్ క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వంశ" మని చెప్పి తమది చంద్రవంశమని సూచించియున్నాఁడు. విమలాదిత్యుని రణస్థిపూడి శాసనమున భీమనభట్టు చాళుక్యవంశ క్రమ మును జందునిని నుండియు వర్ణించియుండెను దానినిఁబట్టి బేతన నన్నయభట్టులుకూడ చాళుక్యులను చంద్రవంశ సంభూతులుగానే పేర్కొని యుండిరి. రాజరాజనరేంద్రుని మనుమఁడగు వీరచోఁడుని చెల్లూరి శాసనమునఁగూడ నట్లే వ్రాయబడియున్నది. "కానీ వేంగీ దేశమును పాలించిన కుబ్జవిష్ణువర్ధనుఁడు మొదలు విమలాదిత్యుని వఱకును 26 చాళు(క్యులు)క్యరాజులు పరిపాలనము చేసి, శాసనములు వ్రాయించినను, వానియందెచ్చటను చాళుక్యవంశము చంద్రవంశాం తర్గతమని చెప్పబడియుండలేదు. పశ్చిమ చాళుక్యుల శాసనములలోఁ గూడ నీరీతి వంశవర్ణనము కానరాదు. పదునొకండవ శతాబ్దిలో విమలాదిత్యుఁడు సూర్యవంశీయుఁడని వ్యవహరింపఁబడెడి రాజరాజ చోడమహీపతి కూతురగు కుందవాంబాదేవిని వివాహమాడిన పిమ్మటఁ చాళుక్యవంశము చంద్రవంశాంతర్గతమైనదిగ భీమనభట్టుచేఁ దొలు దొల్తఁ వర్ణింపఁబడె" నని వ్రాసి (రాజ. న. సం. 75) కీ. శే. వీరభద్ర రావుగారు "ఈ రాజవంశములవారును వారి బంధువులును బ్రాహ్మణు లలోఁ గలసిపోయిన పిమ్మట వారికడ భృత్యులుగా నుండువారు తమ

తమ పుత్రులకు కాపేరును- అనఁగా చోడరాజు, చాళుక్యరాజు, వల్లభరాజు, గంగరాజు మొదలగు నామములను బెట్టుటచే వారి సంతతివారు దానిం దెలిసికొనక వారిని సూర్యవంశపు రాజులని, చంద్రవంశపు రాజులని వ్యవహరింప నారంభించిరి. కొంతకాలమునకు వీర లున్నత పదవులను బొందినతోడనే యిటీవలి కవివర్యులు కొందఱు వీరినిగూడ సూర్యవంశపు రాజులని, చంద్రవంశపు రాజులని తమ కృతులలో స్తోత్రపాఠములు వినిపించిరి. వీనిని సత్యమని తత్సంతతులవారును అజ్ఞానులైన ప్రజలును విశ్వసింప నారంభించి" రని తెలిపియుండిరి. (పుట 103) దీనినిబట్టి చాళుక్యులు చంద్రవంశాంతర్గతులగుట బేతన భట్టాదులచేఁ గల్పితమైన కథయేకాని సత్యము కాదని వారు తలంచి నట్లవగతమగుచున్నది. ఇందలి యాదార్థ్యమును నిరూపించి తెలుపుట కవకాశము లేదు. కాని యొక్క విషయము మాత్రము వారి యూహను బలపఱచునట్లుగాఁ గానఁబడుచున్నది. నన్నయ పెక్కు చోట్ల రాజరాజు కులమును గూర్చి ప్రస్తావించియున్నాఁడు. అది పర్వ షష్ఠాశ్వాసాంతమున నొక్కచోట మాత్ర మాతఁడు "శీతాంశు వంశ ప్రకాశ" అను సంబోధనము వాడి, తక్కినచోట్లనెల్లఁ జంద్రపర్యాయ మైన రాజశబ్దమునే ప్రయోగించియున్నాఁడు. "రాజకులైక భూష ణుఁడు, రాజకులాగ్రగణ్యుఁడు, రాజకులశేఖరుఁడు, రాజాన్వయతిల కుఁడు, రాజకులోత్తముఁడు, రాజవంశవార్ధి చంద్రుఁడు, రాజవంశ రత్నము మున్నగు విశేషణము లిందుకుఁ దార్కాణములు. స్పష్ట ముగాఁ జంద్రశబ్దమునో తత్పర్యాయమైన మఱే శబ్దమునో వాడక నిన్నిచోట్ల నాతఁడు రెండవ యర్థమునకు గూడఁ దావిచ్చు రాజశబ్ద మునే వాడియుండుట కీ. శే. వీరభద్రరావుగారి యూహ సత్యమేమో యను సందేహమును కలిగించుచున్నది.

చాళుక్యులసలు క్షత్రియులగుదురా కాదా యను విషయము కూడా సందేహాస్పదముగనే యున్నది. బిల్హణకవి విక్రమాంకదేవ

చరిత్రమున నొక్కచోటఁ జాళుక్య వంశమును విష్ణుపాద సంజాతయైన సురాపగతోఁ బోల్చియుండుటచే నందుఁ జాళుక్యులు పాదజులనెడి విషయము ధ్వనించుచున్నదని కొందఱభిప్రాయ పడుచున్నారు.[6] బిల్హణుఁడీ యుపమానమున నింత యంతరార్థము నిమిడ్చెనో లేదో చెప్పఁజాలము. అదీకాక క్రీ. శ. 7వ శతాబ్దికి పూర్వమే చాళుక్యులు క్షత్రియులై యుండి రనుటకు విశ్వసనీయములైన నిదర్శనములు లభించుచున్నవి. క్రీ. శ. 543 నాఁటి బాదామిదుర్గ శాసనములోఁ జాళుక్య వల్లభేశ్వరుఁడు (పులకేశి 1) తాను శ్రౌత విధానముచే నశ్వమేధాది యజ్ఞముల నాచరించి యున్నట్లు చెప్పుకొని యున్నాఁడు.[7] నేరూరు తామ్రశాసనమున నాతని కుమారుఁడైన మంగళేశుఁడా తఁడశ్వమేధము నేగాక యగ్నిష్టోమ, వాజపేయ, పౌండరీక బహు సువర్ణ యాగములను గూడ నిర్వర్తించినట్లు వ్రాయించియున్నారు.[8] ఈ యాగములను, ద్విజులు - అందును బ్రాహ్మణ, క్షత్రియులు తప్ప నితరు లాచరించుటకు వీలులేదు. ఇది యిట్లుండ క్రీ. శ. 7వ శతాబ్ది పూర్వార్ధమున మన దేశమున కరుదెంచిన చైనాయాత్రికుఁడైన హ్యూయన్‌త్సాంగ్ రెండవ పులకేశి క్షత్రియుఁడని స్పష్టముగాఁ దెల్పి యున్నాఁడు

**(Huien Tsang's Travels walter vol. II page 239, He was kshatria by birth and his name was pu-lo-ki-she)** దీనిని బట్టి క్రీ. శ. 7వ శతాబ్దిలోఁ జాళుక్యులు క్షత్రియులుగా బరిగణింపఁ బడుచుండిరని నిశ్చితముగాఁ దెలియుచున్నది.

రాజరాజు విమలాదిత్య తనూజుఁ డనియు, విమలాదిత్యాగ్ర తనూజుఁడనియు, కులదీపకుఁ డనియు, వంశవర్ధనుఁడనియు నన్నయ రెండుమూఁడుచోట్ల వర్ణించి యున్నాఁడు. విమలాదిత్యుని కుమారులైన రాజరాజ విజయాదిత్యులలో రాజరాజే జ్యేష్ఠుడనుట నిర్వివాదమే

యైనను సోదరులకు వయోభేదమంతగా లేకపోవుటచేతను, విజయాదిత్యుఁడు కూడ తండ్రి యనంతరము రాజగుటకు యత్నించుట సహజమగుటచేతను అగ్రతనూజుడగుటచే సర్వథా రాజరాజే రాజ్యార్హుఁడని చెప్పుటకో యన విమలాదిత్య యగ్రతనూజయను సంబోధనము నుద్దేశపూర్వకముగా వాడినట్లు తోచుచున్నది. చతుర్థాశ్వాసాంత పద్యములలో రాజరాజును "సమస్త భువనాశ్రయ సత్యాశ్రయ కులశేఖర" యని సంబోధించియున్నాఁడు. సమస్త భువనాశ్రయ బిరుదము మండ దానశాసనమునఁ బ్రతిగ్రహీత యైన అంకయకుఁ గూడ వాడబడియున్నది.(సమస్త భువనాశ్రయ బ్రహ్మమహారాజ ఇతి ప్రసిద్ధాయ). అంక యను బ్రహ్మమహారాజ పదవీ భ్రాజితు నొనర్చునప్పుడే రాజరాజతనికి సమస్త భువనాశ్రయ బిరుదమును గూడ నొసంగియుండును. సమస్త భువనాశ్రయ బిరుదము కళ్యాణీ చాళుక్యుల శాసనములలోనే కాని, తూర్పు చాళుక్యుల శాసనములలోఁ దఱచుగాఁగానరాదు. అది వారు సాధారణముగా వహించు బిరుద పరంపర లోనిదిగాదు. రెండవ అమ్మరాజ విజయాదిత్యుఁడొక శాసనములో (J A.H.R. S-ii 24 ) ((శ్రీ) సమస్త భువనాశ్రయ (శ్రీ) విజయాదిత్య మహారాజ పరమేశ్వరః) అని యీ బిరుదమును వాడుకొని యుండెను. అతని తరువాత మరల నెవ్వరు నా బిరుదమును ధరించి యుండలేదు. సత్యాశ్రయ కులశేఖర బిరుదము కూడ నిట్టిదే. అది కళ్యాణి చాళుక్యులు తఱచుగా ధరించుచుండు సత్యాశ్రయ కులతిలక బిరుదమునకు రూపాంతరము. ఈ బిరుదమును ధరించుటకు గళ్యాణీ చాళుక్యుల కెంత యధికారము గలదో రాజరాజునకుగూడ నంతే యధికారమున్నది. ఏలయన వారివలె నీతఁడునుగూడ బాదామిచాళుక్యరాజ్య స్థాపకుఁడైన ప్రథమ సత్యాశ్రయ పులకేశి సంతతిలోనివాఁడే. కాని యీ పై రెండుబిరుదములను గలిపి వాడుకొన్నవారు తూర్పుచాళుక్యరాజులలో నొక్క రాజరాజు తక్క నింకెవ్వరును గానరారు. క్రీ.శ. 1052 వఱకు నాతఁడు చోళు

లతోఁ గలసి పశ్చిమ చాళుక్యులతో బోరాడుచుండినను దరువాత తన రాజ్యమునందలి చాల భాగమును వారాక్రమించుకొనుటచే నింక లాభము లేదని నిశ్చయించి పశ్చిమచాళుక్యరాజు సార్వభౌమత్వము నంగీకరించుచు నాతనితో సంధి గావించుకొనెను. నూత్నసిద్ధమైన ఈ స్నేహమునకు దార్కాణముగా నతఁడు పశ్చిమ చాళుక్యులకు సర్వ సామాన్యమైన యీ పై రెండు బిరుదములను ధరించియుండును. దీనిని బట్టి భారత రచనము క్రీ. శ. 1053 తరువాతనే జరిగియుండునని భావింపవచ్చును. నిజవంశీయులెవ్వరును ధరింపని యీ బిరుదముల నాతఁ డట్లు వాడుకొనుటకుఁ గారణాంతరము కానఁబడదు.

ఈ విధముగా నన్నయ రాజరాజు పితృవంశమును సూచించు బిరుదముల భారతాశ్వాసాద్యంత పద్యములతో నెడనెడ వాడియుండి నను మాతృవంశమునకు సంబంధించిన దొక్కటియును నెచ్చటను వాడి యుండలేదు. అతని మాతామహునిఁగాని, మేనమామనుగాని, తల్లిని గాని, భార్యనుగాని యాతఁడెచ్చటను పేర్కొనక పోవుటకుఁ గారణము తెలియదు. "కుందవాంబాకుమార ! అమ్మాంగ దేవీప్రియ!" మొదలుగాఁ గొన్ని సంబోధనల నాతఁడు వాడుట కవకాశము లేకపోలేదు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు సూచించినట్లు" ఆ చివరి రోజులలో చోళభూపతుల రాజనీతి చాళుక్య చూడామణికి హితవు గాకుండెఁ గాబోలును." ప్రభుచిత్తవృత్తి కనుగుణముగా నన్నయయు నందుచేతనే యాశ్వాసాద్యంత పద్యములలో నెచ్చటను వారి ప్రసక్తి తెచ్చినవాఁడు కాఁడు.

నన్నయ రాజరాజునకు వాడిన సంబుద్ధ్యంతములోఁ గొన్ని సర్వరాజ సామాన్యములైనవి కలవు. "రాజమార్తాండ! రాజకంఠీరవ! పరగండభైరవ! వైరివీర రసవైద్య! త్రిభువనాంకుశ! రాజనారాయణ! పరగండ భేరుండక! బిరుదాంకభీమ! రాజసర్వజ్ఞ! మున్నగునవిట్టివే.

నన్నయ తనకు పూర్వము చాళుక్యరాజులచే వేయింపఁబడిన శాస నము లన్నిటితో బరిచయముఁ గలవాఁడగుటచే నందలి కొన్ని విశేష ణములను రాజరాజునకు గూడ వాడియుండెను. మొదటి విజయా దిత్యుండు దాల్చిన బిరుదములతో "పరాక్రమరామ!" యను నదొకటి. దానిని ననుసరించియే నన్నయ రాజరాజును "బరాక్రమ రాఘవ"యని సంబోధించెను, అయిదవ విజయాదిత్యుఁడు వహించిన "నిరవద్య" యను బిరుదము రాజరాజునకుఁగూడ వాఁడబడినది. శక్తివర్మ చాళుక్య చంద్రుఁడను బిరుదము వహింపఁగా నన్నయ దానినించుక పొడిగించి రాజరాజును "విలసచ్చాళుక్యాన్వయాంబోధి సంపూర్ణశశీ" యని సంబోధించెను. రాజనారాయణ, నారాయణాఖ్యయను బిరుదములు రెండవయమ్మరాజు దాల్చిన రాజనారాయణ బిరుదమునకును, రాజసర్వజ్ఞబిరుదము పాశ్చాత్య చాళుక్య చక్రవర్తియైన యాఱవ విక్రమాదిత్యుఁడు వహించిన రాయసర్వజ్ఞ బిరుదమునకును రూపాంత రములే. ఇట్లే బిరుదంకభీమ, త్రిభువనాంకుశ బిరుదములుకూడ రాజ రాజు క్రొత్తగా ధరించునవి కావు. విమలాదిత్యుఁడు సైతము వానిని వహించి యుండెననుటకు శాసన నిదర్శనములున్నవి. (రణస్థిపూడి 14) కలిదిండి శాసనమున రాజరాజు "పరగండ భైరవ విభుఁడ"ని కీర్తింపఁ బడినాఁడు. నన్నయ భారతమున దానినేకాక దానితో సమానార్థక మైన పరగండభేరుండక బిరుదమునుగూడ రాజరాజునకు వాడి యున్నాఁడు. ఈ బిరుదులన్నియు రాజరాజు పరాక్రమమును, ఆభి జాత్యమును, అరినిరసన దక్షతను వెల్లడి చేయుచున్నవి.

నన్నయ వాడిన విశేషణమువలన రాజరాజు శరీరసౌష్ఠవమును, బరాక్రమస్ఫూర్తియు, హృదయ సంపదయు, జక్కఁగా వ్యక్తము చేయఁబడుచున్నవి. ఉత్తముఁడైన భూపతికుండవలసిన గుణవిశేషము లన్నియు నాతనియందుఁ బుంజీకృతములై యున్నవి. అందుచేతనే

యాతని పాలనమునఁ బ్రజ లత్యంత ప్రీతులై యతనికి నిరంతర మహాభ్యుదయమును వాంఛించుచుండిరి. "భువినుత పుణ్యావరేణ్య! సప్త సముద్ర ముద్రితాఖిల వసుధాజన గతకీర్తి! భూజన పూజ్యమాన! లోకజనస్తుత్య! ధరిత్రీ జనమతచారిత్ర! మున్నగు విశేషణములు జనులకు రాజరాజునెడ గల భక్తిప్రీతులను సూచించుచున్నవి చోడేశుఁడైన మధురాంతకుఁడు కూడ నాతని గుణగణములను వంశగౌరవమును విని సంతోషించి తన కూఁతురైన యమ్మంగదేవి నతని కగ్ర మహిషిగా నొసంగెనని కలిదిండి తామ్రశాసనము చెప్పుచున్నది.

"సశ్రుత్వా పరితుష్యవంశ వినయ త్యాగాభిమానోన్నతిం
ప్రజ్ఞావిక్రమ సత్యశౌచ పటుతా సూర్యక్షమాదీన్య సౌ
చోడేశో మధురాంతకస్య తనయా మమ్మంగనామాం సతీం
చాళుక్యాభరణస్య చాగ్రమహిషీం స్నేహేన యస్యాకరోత్"

దీనినిబట్టి యా చోడరాజు మేనల్లునికిఁ గూఁతు నిచ్చుట కేవల బంధు ప్రీతిచేఁగాక గుణగౌరవముచేతనే యని తెలియుచున్నది. అతఁ డెంత గొప్పవాఁడైనను ఆత్మగౌరవమునకు హానికరమని తోఁచినచో రాజరాజా సంబంధము నంగీకరించియే యుండకపోవును. ఆతఁ డభిమాన మహార్ణవుఁడు. నన్నయ వాడిన విశేషణములలోనెల్ల నిది రాజరాజు వ్యక్తిత్వ మెంతో సూటిగా విశదముగాఁ బ్రకటము చేయుచున్నది.

రాజరాజు గుణసంపద కలరి, త్యాగగరిమకు మెచ్చి పండితులును, కవులును నతని బహువిధములఁ బ్రస్తుతించుచుండిరి. అందుచేఁ దుషార సుధాహారహీర సన్నిభమైన యాతని నిర్మలకీర్తి సర్వజగత్పరిపూరితమై జననేత్రచకోరములకు శారద చంద్రికవలె సమానప్రీతి సంధించుచుండెను. నన్నయ యాతని కీర్తిని బలుచోట్ల మహోత్సాహముతో వర్ణించియున్నాఁడు. విశుద్ధ యశశ్శరదిందు చంద్రికా రాజిత సర్వలోక! విభ్రాజిత శుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ! శుభ

యశః పరిశోభిత ! శతద్యుతి విశదయశః ప్రసరజ్యోతిత సర్వలోక ! మహా యశో రాజహంస పయోజనీవనరమ్య దిఙ్ముఖ ! శారద నీరద నీహార హార నిభ శుభకీర్తి ! హారాహి రాజవరహంస తుషారకుంద స్ఫారయశః ప్రసర పాండురిత త్రిలోక !" యను శ్రుతిశుభములైన సమాసములలో రాజరాజు కీర్తివలె నన్నయ యుత్సాహమును ద్యోతితమగుచున్నది.

తమ ప్రభువులను గావ్యనాయకులతో నభేదాధ్యవసాయము కల్పించి వర్ణించు నాచారము కన్నడ కవులలో విరివిగా నున్నది. పంపడు విక్రమార్జున విజయములోఁ బెక్కుచోట్ల నరికేసరిని అర్జునకును నభేదము పాటించియుండెను. తెలుఁగు కవులలో నన్నెచోడుఁడు, కన్నడ కావ్యమునందలి పెక్కితర సంప్రదాయములవలెనే యీ సంప్రదాయమునుకూడ ననుకరించియుండెను. కుమారసంభవమున నాతఁడు శివునకు మల్లికార్జునకును నభేదము కల్పించిన చాల నున్నవి. నన్నయ యట్లభేద కల్పనము చేసిన చోట్లు లేవుకాని యుత్తములైన చంద్ర వంశపు రాజుల వర్ణించుపట్ల నాతఁడు రాజరాజును దృష్టియందిడుకొని వర్ణించెనేమో యని సందేహింపఁజేయు పద్యము లనేకములున్నవి. భరతునిఁగూర్చి యాతఁడు వర్ణించిన పద్య మింతకుముందే యుదాహరింపఁబడినది. జనమేజయుఁడు శ్రుతశ్రవసు ననుమతంబున సోమశ్రవసుఁ దనకుఁ బురోహితుని గావించుకొని, వాని నభీష్ట సత్కారంబుల సంతుష్టునిఁ జేసి, తదుపదేశమున యాగము లొనరించుచు రాజ్యము చేయుచుండెను. అను సందర్భమున నన్నయ వ్రాసిన పద్యము సరిగా రాజరాజును వర్ణించుచున్నట్లున్నది. దీనికి సంస్కృత భారతమున నాధారము లేకుండుట యీ విషయమును మఱింత బలపఱచుచున్నది. పరీక్షితుఁడు తక్షక విషాగ్నిదగ్ధుఁడై పరలోకగతుఁడైన పిమ్మట బురోహిత పురస్సరానేక భూసురవరులు యథావిధిఁ బరలోక క్రియలు నిర్వర్తించిరని చెప్పి మంత్రులు జనమేజయునితో

"ఆయుష్మం తు డవై ల
క్ష్మీయుత బాల్యంబునంద మీ యన్వయ రా
జ్యాయ త్త మహీభారం
బాయత భుజ నీవు దాల్చి తభిషిక్తుడవై" (ఆది. 2ఆ. 201)

"పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీ ప్రజన్
మంచి తనేక యాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
నించితి సజ్జన స్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచిత పుణ్య సర్వగుణ సంపద నెవ్వరు నీ సమానులే"
(ఆది. 2ఆ. 202)

యని పలికిరి. ఈ పద్యము లర్థభావముల పరిపాటి ననుసరించి చూడ నన్నయ రాజరాజుతోఁ జెప్పుచున్నట్లున్నవి. సర్పయాగమును నివారించు నుద్దేశముతో నాస్తీకుఁడు జనమేజేయ సర్పసదనమున కరిగి యాతని స్తుతించిన యీ క్రింది పద్యములు విమలాదిత్యుని మరణానంతరము తన సింహాసనాధిరోహణమున కాటంకము కలిగించిన దాయాదులను శత్రువులను నిర్జించి, వైభవమున పట్టాభిషిక్తుడైన రాజరాజును గూర్చి నన్నయ పలికి నట్లున్నవి.

రజనీనాథ కులైక భూషణుఁడవై రాజర్షివై ధారుణీ
ప్రజనెల్లన్ దయతోడ ధర్మచరితం బాలించుచుం దొంటి ధ
ర్మజు నాభాగు భగీరథున్ దశరథున్ మాంధాతృ రామున్ రఘున్
విజయుం బోలితి సద్గుణంబుల జగద్విఖ్యాత పారీక్షితా!
(ఆది. ప. 2 ఆ. 224)

"కువల యంబునవారి కోరిన కోర్కికిం దగ నీవు పాం
డవ కులంబు వెలుంగఁ బుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో
నతని రాజ్య భరంబు దాల్చిన యంత నుండి మఖంబులన్
దివిరి యిష్టధనంబు లిచ్చుటఁ దృప్తులైరి మహాద్విజుల్" (224)

"నల నృగ భగీరథ రామచరిత్రాభిరామా!" అని నన్నయ రాజరాజు నరణ్యపర్వ తృతీయాశ్వాసాదిని సంబోధించిన విశేషణముతో నిందలి మొదటి పద్యమును బోల్చి చూచినచోఁ బైని చెప్పఁబడిన విషయము నందలి యాథార్థ్యము తేటతెల్లమగును. ఇట్లే నన్నయ దుష్యంతుని, నహుషుని వర్ణించిన ( ఆది. 3–93, ఆది. 4–8) పద్యములు కూడ రాజరాజును స్ఫురణకు దెచ్చుచున్నవి.

నన్నయ యాశ్వాసాంత పద్యములలో వాడిన విశేషణ పరంపరచే రాజరాజు రూప గుణ విక్రమాదుల కతుకరమైన రమ్యమూర్తి తీర్చి దిద్దినాఁడు. వాని నన్నిటిని కలిపి చదివినచో నిరవద్యమైన, సర్వరాజ లోకాదర్శమైన, రాజరాజు పవిత్ర చరిత్రయు, రూప సౌష్ఠవమును, బరాక్రమాది గుణసంపదయుఁ బ్రత్యక్షములై తీరును. ఆంధ్రభారతరచనకు నన్నయను బ్రేరేచి యా రాజచంద్రుఁడు కాంచిన మహాఫలమిదియే. ఆంధ్రవాణి దాల్చిన యాద్యకావ్యమూర్తితో నాతని యుజ్జ్వల కీర్తి మూర్తియు నాంధ్రలోకమున నజరామరమై నిలిచిపోయినది.

---

1. అథవా తద్విరుద్ధస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్
   తజ్జయా నాయకోత్కర్ష చ వర్ణనం మతం క్వచిత్
2. The Eastern Chalukyas of Vengi (p. 218, 219)
3. రాజరాజనరేంద్రుడు. పు. 100
4. రాజద్రాజన్య సేవ్యా మభృత భుజబలాద్రా జస్య లక్ష్మీం పృథివ్యాః
5. పిత్రో ర్వంశగురూ బభూవు రతులౌ యస్య స్ఫురత్తేజసౌ సూర్యా చంద్రమసౌ నిరస్తతమసీ...జగచ్చక్షుసీ—కోరుమిల్లి శాసనము. యస్సోమవంశ తిలకః శకవత్స రేషు—నందమపూడి శాసనము.

6. **Eastern Chalukyas of Vengi (page. 9)**

7. అశ్వమేధాది యజ్ఞానాం యజ్వా శ్రౌత విధానతః

8. **I A VI page 161.** అగ్నిష్టోమ వాజపేయ పౌండరీక బహు సువర్ణాశ్వమేధావభృథస్నాన పవిత్రీకృత శరీరః వల్లభో వల్లభః.

9. ఆయతకీర్తితో వివిధయాగములన్ సురధారుణీ సురా
మ్నాయము నాహి తాహుతి సమంచిత దక్షిణలిచ్చి తన్పుచుం
జేయుచు నుండె రాజ్యము విశిష్ట జనస్తుత వర్ధమాన ల
క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁడాది నరేంద్ర మార్గుఁడై
(ఆది. 1-89)



# నన్నయ దృష్టిలో రాజరాజనరేంద్రుఁడు

## శ్రీ గురజాల హనుమంతరావు

తూర్పు చాళుక్యులలో విఖ్యాత పురుషుఁడు రాజరాజనరేంద్రుఁడు. ఈతడు క్రీ.శ. 1022 సం॥న పట్టాభిషిక్తుఁడై రాజమహేంద్రమున నుండి పాలించెననియు, ఈయన ఆ స్థానమున నన్నయ భట్టారకులు ప్రముఖవిద్వత్కవి తల్లజులే కాక, రాజునకు కులవిప్రులైరన్న సత్యమును, నందఱెఱిగినదే. ఇమ్మహా ప్రభువు ప్రేరణచేతనే యాంధ్రులకు భారతము స్వభాషలోఁ జదువుకొను భాగ్య మబ్బినది.

నన్నయ నిత్యసత్య వచను డనియు, ఋషితుల్యుఁ డనియు విమర్శకు లంగీకరించిన సత్యమే. అట్టి యామహామహుని వాక్కునవ్యాజము నమ్మితీరవలయును. భారతావతారిక యందును, పిమ్మట ఆశ్వాసాంతపద్యగద్యాదులందును, తత్ర తత్ర వర్ణించిన రాజరాజనరేంద్రుని శౌర్యధైర్యపరాక్రమ సౌందర్యములను పరిశీలించినయెడల నా రాజశేఖరుని యూహామూర్తి నొకింత ప్రస్ఫుటముగా మనము దర్శింపగలము.

పీఠిక యందలి ఈ పద్యమును గమనింపుడు.

రాజకులైక భూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలిశౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజిత సర్వలోకు డపరాజిత భూరిభుజాకృపాణధా
రాజల శాంతశాత్రవ పరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్
(ఆది 1-3)

ఈ పద్యమున రాజరాజ నరేంద్రుని ఆభిజాత్యమును, (రాజకులైక భూషణుఁడు అనగా చంద్రవంశశ్రేష్ఠుఁడు రాజమనో

హారుఁడు (చంద్రునివలె మనస్సునకాహ్లాదము గొల్పువాఁడు) రాజు లందఱిలో సుందరుడు) అనుమాటచే అభిరూప్యమును అన్యరాజతేజో జయశాలి (పరరాజుల పరాక్రమమును జయించుటచే ప్రకాశించు వాడు) అను వాక్యముచేత పరాక్రమమును స్వచ్ఛమైన కీర్తియను వెన్నెలచే ప్రకాశింపఁజేయఁబడిన సర్వప్రపంచము గలవాఁడనుటచే అఖండ కీర్తియును, కృపాణాధార యనెడు జలధారచేత శత్రువు లనెడి పరాగమును శమింపఁజేయు వాడనుటచే నీరాజు వీర్యమును చెప్పఁ బడినవి. కావున ఈ వర్ణనమును బట్టి ఉత్తమ క్షత్రియున కుండవల సిన లక్షణము లన్నియు ఆ ప్రభువున కున్న వన్నమాట. అంతియే కాదు ఆదిరాజవిభుఁడు, మనుమార్గుఁడు. 'రాజరాజ నరేంద్ర శబ్దము సంబోధనగా గాని, విడిగాగాని విన్నప్పుడు అది యొకవింత తీరుగా నుండును. వరుసగా రెండు రాజ శబ్దములున్నవి.

పోనిం డిందొకటి శ్రేష్ఠ వాచకమను కొందమన్న 'నరేంద్ర' శబ్దముకూడ 'రాజు' అను అర్థము నిచ్చునదే కదా!!, లేదా 'ఇంద్రా' శబ్దమును శ్రేష్ఠ వాచకముగా గొన్నయెడల 'నరులలో శ్రేష్ఠుఁడు' అనునర్థము లభించును. రాజ శబ్దము ద్విరావృత్తమను కొనుచుండగా 'నరేంద్ర' శబ్దముకూడ 'రాజ' శబ్దమేయయి వరుసగా మూడు రాజ శబ్దములగు చున్నవి.

ఇట్లు పునరావృత్తము గావింపవలసి వచ్చునవియో కాఁబోలు నన్నపార్యులు 'రాజమహేంద్ర శబ్దమును గూడ వాడిరి. రాజులకు మహేంద్రుఁడు. రాజులలో మహేంద్రుఁడు ఇత్యాదిగాఁ జెప్పనగు. కాని యిట్లు సరిపెట్టుకొనుటకు వీలు అంతగా లేదు. ఏలన...

'రాజితగుణరత్న రాజరాజ నరేంద్రా (ఆది 2-236) అట్లే... 'రాజాన్వయ తిలక రాజరాజనరేంద్రా!... (1-6-1) ఇంకను 'రాజ రాజనృప' అనియు వేఱొకచోట వాడినారు. అసలు నామధేయము

'రాజరాజు' అయి యుండనోపు. ప్రభువునకు చివర రాజశబ్దమును గాని, తత్పర్యాయ శబ్దమును గాని, ఘటించుట పునరుక్తికాదనియే భట్టారకాదులు భావించిరి.

నన్నపార్యుడు ఈయనను పరమ సుందరమూర్తిగా చిత్రించెను. మొదటి పద్యముననే 'రాజమనోహరుఁడు' అను విశేషణము గలదు. ...'తుహినకరుఁ డురుకాంతిన్ (ఆది-14) ఇత్యాదులచే కేవలము వంశము చేతనేకాదు వపుశ్శోభచేఁగూడ ఈ రాజు అమృతాంశు తుల్యుడే.

శ్రీజయవిభాసి వినమ, ద్రాజన్య, కిరీట మణివిరాజిత పాదాం
భోజ 'భువనైకసుందర', రాజాన్వయతిలక రాజరాజనరేంద్రా.
(ఆది-6-1)

శ్రీరమణీ ప్రియ ధర్మవి, శారద వీరావతార, సౌజన్యగుణా
ధార, భువనైక సుందర, వీర శ్రీరమ్య బుధవివేకనిధానా,
(సభా. 2-1)

నన్నయ కంఠోక్తిగా భువనైక సుందరుఁడని పల్కుచుండ నెట్టి శంకకును తావులేదు గదా !!

భువనైక సుందరుఁడనగా ఈ భువనమందు ముఖ్యమైన (గణనీయమైన) సుందరుడని చెప్పుకొనవలెను. భువనమంతటికిని ఏకైక సుందరుడని చెప్పిన అతిశయోక్తి యగును. ఇంకను పలుతావులందు సౌందర్యద్యోతక మగు పద్యములు రచించెను. నన్నయభట్టు వ్రాసిన భారత భాగమందలి కథానాయకులందును, ధీరోదాత్తనాయకులగు రాజర్షు లందునుగల యుత్తమగుణములు రాజరాజ నరేంద్రునియందు ధ్వనించునట్లు వర్ణించెను.

తొల్లిటి రాజర్షులు, మహాపురుషుల యట్టి తత్తదుత్తమ గుణ భూషితులై ప్రవర్తిల్లిననే కాని ధర్మము కాపాడబడదనియ కాంతా

సమ్మిత్రోప దేశముకూడ గావించుచున్నట్లును నన్నపార్యుని కథనము కొనసాగుచుండును. ఏదియేమైనను రాజరాజ నరేంద్రుఁడు నిరుపమాన సుందరుఁడనుటలో విప్రతిపత్తి యుండఁబని లేదు. అవిరళజపహోమతత్పరుఁడును, నిత్యసత్యవచనుడును, సంహితాభ్యాసుఁడునగు నన్నయ యిన్నిచోట్ల లేని యాభిరూప్యమును దెచ్చిపెట్టినాడా? కేవల ముఖస్తుతికి మృషావాక్యములు వ్రాయునా? ఉన్నవిషయమును అతిశయోక్తిగా జెప్పుట మన కవిపండిత సంప్రదాయముగాని, బొత్తిగా లేని విషయమును దెచ్చిపెట్టుట యగాదు. రాజరాజును మన్మథవిభుఁడన్నది, యొక్కచోటనా? రెండుచోట్లనా?'

'వేంగీ...భూవల్లభనిఖిల జగత్పావన శుభచరిత భావ భవ నిభసుభగా!! (ఆది-8-1) భావభవుఁడు మన్మథుఁడు. వానితో సాటి వచ్చు సుందరతరమూర్తి రాజరాజు, అంతియేకాదు, అవధరింపుడు

'ఘనదురితాను బంధ కలికాలజదోషతుషార సంహతిం
దనయుదయ ప్రభావమున దవ్వుగఁ జోపిజగజ్జనానురం
జనమగు రాజ్యసంతత వసంతనితాంత విభూతి నెంతయుం'
దనరుఁ జళుక్య మన్మథుఁడు ధర్మనిబద్ధదయార్ద్రబుద్ధియై
(ఆది 1-5)

ఎంత పవిత్ర సుందర భావ మాకవీశ్వరునకు అధీశ్వరుని మీాద! ఇంతకు ముందు చూపబడిన 'భువనైక సుందర' అనుదానికంటె 'చళుక్య మన్మథ' పదము విలక్షణమైనది. ఈరాజు చాళుక్యవంశ మంతటిలోను చకచ్చకాయ మానమగు నందము గలవాడు కాబోలు. రాజరాజ నరేంద్రుని యంతటి సౌందర్య నిధులు చాళుక్యవంశమున నరుదని కాని, లేరనికాని యీ మాటలకర్థము. దీనితోఁపాటు రాజరాజు పవిత్రమూర్తిగా గొనియాడబడినాడు. ఇది కలికాలము. సర్వత్రి దోషబాహుళ్యము సహజము. అది మంచువంటిది. కప్పివేయ గలదు.

పాపము వంటిదే. సూర్యోదయముచే నా మంచు తెరలు మటుమాయ మగును. రాజరాజు జన్మించుటచే కలిప్రభావము తగ్గినది. కారణము వేదమతము నుద్ధరించెను. ధర్మము నిలిచినది. అనగా ఆయన అంతటి ధర్మబద్ధమైన పరిపాలన చేయువాడు. ఉపరి దయార్ద్రహృదయుఁడు, రాజమనోజతుల్యుఁడు, రాజమనోహరుఁడు. యువతీజన మదనుఁడు. ఇట్టి వాక్యములు విని రాజరాజ నరేంద్రుని కొందఱు ప్రబుద్ధులు భోగి యనుకొందురేమో! అట్టి వారికొక నమస్కారము.

'యత్రాకృతి స్తత్రగుణాః' అన్నది ఈ ప్రభువు నెడల మిక్కిలి సార్థకమైనది.

గుణగణములు :

రాజులకు ముఖ్యాతిముఖ్యమగు గుణము శౌర్యము. ఈ శౌర్యమునకు జీవనాడి ధైర్యము. ఇవి యుండిన రెండు నుండవలెను. లేనిచో నేదియు లేనట్లే. మొదటి పద్యమందే 'శౌర్యుఁడు'... అనియున్న దానిని కనబఱచితిమి. భూరి భుజాకృపాణధారాజల శాంతశాత్రవ పరాగుడు రాజమహేంద్రుడున్నతిన్ ఈ పద్యపాదము 'రాజరాజు సత్త్వానంతను పట్టి యిచ్చుచున్నట్లు కన్పట్టును. తమ గొప్ప బాహువు నందున్న ఖడ్గధార యనెడు జలధారచేత శత్రుసైన్యమందు లేచిన పరాగమంతయు శమించును. అనగా అప్రమేయ ఖడ్గవిద్యావిశారదుఁ డన్నమాట!

> 'శ్రీరమ్య ధర్మనిత్య, ప్రారంభ విభాసిరాజపరమేశ్వర ఘోర
> రారిమదకుంభి కుంభవి, దారణ దారుణ కృపాణ దక్షిణహస్తా
> (అరణ్యా–2–1)

శత్రుసైన్యమందలి మదగజ కుంభస్థలములను చీల్చెడు భయప్రద మగు ఖడ్గమును దక్షిణహస్తమందుఁ గలవాడు, రణరంగమున వైరి వీరులను- వారి గజ బలాదులను మిక్కిలి చెండాడఁగలడు.

'బిరుదాంక భీమ భీమే, శ్వరకృత కృత్యప్రసాదసౌజన్యగుణా
భరణ పరగండ భైరవ, పరనృపమణి మకుట ఘటితపద బుధ
వినుతా!'

పై పద్యము చివరి పాదమును బట్టి ఈయన సామంతరాజులు మిక్కిలి అణకువ గల్గి ప్రభుభక్తి పరాయణులై యుండెడివారని తెలియుచున్నది. 'బుధవినుతా' అనుటను బట్టి కవిపండితులు రాజరాజ నరేంద్రునిస్తుతించుచుండెడివారని తెలియుచున్నది. పండితులు ఉత్తములనే కదా కొనియాడునది!

ఇంక 'పరగండభైరవ' 'రాజపరమేశ్వర' 'రాజనారాయణ' మొదలగునవి రాజరాజనరేంద్రుని బిరుదము లని తెలియుచున్నది.

మలహారినాథ విలస, చ్చళుక్య కులతిలక రాజసర్వజ్ఞరిపు
ప్రలయ ప్రతాప పర నృప, లలనాననకమల హరిణలాంఛన
మూర్తీ. (ఆది–6–321)

ఈ పద్యమును బట్టికూడ శత్రురాజులను హడల, గొట్టగల శౌర్య శోభితుఁడని తెలియుచున్నది. 'హరిణలాంఛనమూర్తి' అనగా చంద్రుఁడు. చంద్రుడు ప్రకాశించు రాత్రిసమయమున పద్మములు ముకుళించుకొనును. కావున పద్మములకు చంద్రుని శత్రువుగాఁజెప్పుట కవిసమయము. శత్రువుల భార్యల ముఖపద్మములకు చంద్రునివంటి వాడట రాజరాజు. అనగా తమ భర్తలు పరాజితులగుటచే తత్ప్రాభవమును గోల్పడిన యా యంగనలకు రాజరాజు విప్రియకరుడై కన్పట్టుట సహజమే కదా! "గంధసింధుర హయ శిబారూఢి దక్ష...! అని మఱొకచోట సంబోధించెను.

పరమండలంబుల ధరణిపతుల నదిమికప్పంబుల ముదముతోఁగొనుచును
బలిమినీయని భూమివలయపతుల నుక్కడఁగించుచు దిక్కులఁదన
యాజ్ఞ వెలుఁగించుచును...

ఇట్లు మనుమార్గుఁడగు విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు. (ఆది–1–7) దీనినిబట్టి ఈయనకు పెక్కుఁరు సామంత రాజులు కప్పము గట్టెడివారని తెలియుచున్నది. '...ఘోరాజి ముఖోపలబ్ధ విజయ ప్రమదాశ్రిత బాహుదండ–' విక్రమాదిత్యనిభా! మొదలగు మాటలుగూడ నీతని విక్రమ ద్యోతకములే, కాని వీనిని విన్న చరిత్రకారులు ముఖము చిట్లించుచున్నారు.

కారణమేమన రాజరాజనరేంద్రుడు శత్రుజేతయని కాని, చక్రవర్తియనికాని వీరంగీకరింపరు. అట్లాడంబడందగిన ఆధారములు లేవనివారి వక్కణ. నన్నపార్యులవాక్కుఁ వారి దృష్టిలో ముఖస్తుతి, వీరి విషయ మటుండని త్తము.

అన్నిటికన్న ఈ రాజు మహా శివభక్తుఁడు. వేదపోషకుడు. బ్రాహ్మణులను, విద్యావంతులను, ఆదరించి పోషించెడివాడు. అష్టాదశ పురాణములు, ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు, తెలిసినవాడు. అంతియేకాక రాజులకు వలసిన అర్థ, ధర్మ, రాజనీతి, శాస్త్రములన్నియు నీయన యెఱుగును. ఈశ్వరాగమము లెన్నియో యెఱుగును. అయినను 'అనవరతంబును శ్రీ మహాభారతంబునందున యభిప్రాయంబు పెద్దయైయుండు.

నన్నయభట్టుతో రాజరాజనరేంద్రుఁడు స్వయముగాఁ బల్కిన మాటలివి.

'ఇవి యేనున్ సతతంబు నాయెడఁగరం బిష్టంబులై యుండుఁ బా
యువుభూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీ పతి పదాబ్జధ్యాన పూజా మహో
త్సవమున్ సంతతి దానశీలతయు శశ్వత్సాధు సాంగత్యమున్–
మహేశ్వరభక్తి– బ్రాహ్మణ భక్తి– భారతాసక్తి– సాధుజనయుక్తి– దానరక్తి– ఇవియైదును రాజరాజ నరేంద్రుని కిష్టవిషయములు. వీనినే

ఉత్తమ గుణములుగా కవిపండితులు సన్నుతించిరి. మితహిత సత్య వాక్కు.

'రాజభూషణ నిత్య సత్య సరస్వతీ విలసన్ముఖాం
భోజ రాజమనోజ భూజన పూజ్య మాన మహాయశో
రాజహంస పయోజనీవన రమ్య దిఙ్ముఖ విక్రమో
ర్వీజితాహిత విష్ణు సన్నిభ విష్ణు వర్ధన భూపతీ'

ఈ పద్యము పూర్వము చెప్పిన రాజరాజ గుణము లన్నిటిని వ్యక్తము సేయునదిగా నున్నది. ఈయన రాజభూషణుడే కాదు, రాజర్షి, విష్ణు సన్నిభుడు, 'నాఽవిష్ణుః పృథ్వీపతిః' అనుసూక్తికి పట్టుఁగొమ్మ.

ఏమి జరిగెనో యేమో నన్నయ్య ఘంటము హఠాత్తుగా, అర్ధాంతరముగా నిలిచి పోయినది. ఈ ప్రభువున కేమి విపత్తువచ్చినదో, నన్నపార్యున కేమి సంకటముగల్గినదో తెలియరాదు చరిత్రలు సణుగుచున్నవి, కాని జవాబు చెప్పవు.

రాజరాజ నరేంద్రునికి మహాభారతమునందున్న భక్తి గౌరవములును, ఆంధ్ర భాషయందున్న మమకారమును పెట్టిన భిక్షయే మనకు భారతము లభించుటకు కారణములు. కౌరవ పాండవులు నిజ వంశీయులగుటయు రాజరాజ నరేంద్రుని భారత శ్రవణాసక్తికి కారణము.

శాసనములలో నున్నను వారు ముఖతః పల్కినట్లు భారతమున గన్పట్టుచున్నను అప్పటి మహావిద్వాంసుడగు నన్నపార్యుడామోదించి తత్ప్రచన కుపక్రమించినను మన చరిత్రకారులకీ వార్తలెక్కడలేని కలవరము తెచ్చును. ఈ కాలమున రాజులందఱు, సూర్యవంశమునో చంద్రవంశమునో గొప్ప కాపాదించుకొనిరని చరిత్రకారుల దృఢ నిశ్చయము. వీరికి శాసనములును పూర్తిగా ప్రమాణములు గాక పోయె. కవిత్వము నసలే గణింపరు. కాని చరిత్ర వ్రాయుదురు.

చరిత్రయను పేరున వ్రాయబడినదంతయు చరిత్రకాదని విజ్ఞులకు వేఱుగాఁ జెప్పఁబనిలేదు. మన చరిత్ర అసలే అతుకుల బొంత ! ఇది వారి మాటయే. **(Indian history has many missing links)** చారిత్రకులకేమిగాని, ఈ ప్రభువునకు కవికి అనిర్వచనీయమైన మృదు సౌహార్ద బంధమున్నది. అట్లని విష్ణ్వంశ సంభూతునిగ భావించి నన్న పార్యులు ప్రభువునకు నమస్కరింపక మానడు. ఆ రాజశేఖరుడే బ్రాహ్మణశ్రేష్ఠుడు వచ్చిన ఆసనముడిగి యభివాద మొనర్పకయు ఉండడు. అట్టివారి మృదు మధుర స్నేహానుబంధము నుండి వెల్వడిన వాక్కులు సత్యదూరములు కావనియు, సాహితీ పాఠకులు మగు మనము మనస్ఫూర్తిగా భావించి అమ్మహానుభావు లిరువురకు సదా జోహారు లర్పింతుము గాక !!

— * —

# నన్నయనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం

**కావ్యములు తాము పుట్టిన కాలము యొక్క పరిస్థితుల ననుసరించును :**

ప్రథమాంధ్ర కావ్యమని ప్రసిద్ధికెక్కిన ఆంధ్రమహాభారతమును విమర్శించుటలో తదితర పురాణవిమర్శనాపద్ధతినే యవలంబింపవలసి యుండును. మహాపురుషులు తరచు గొప్ప వ్యక్తులయ్యు సమకాలీనులగు సోదరమానవు లెట్టి యభిప్రాయములు, రుచులు గల్గియుందురో అట్టి రుచులును, అభిప్రాయములును గల్గియుందురు. అట్లే కావ్యములు గూడ తాము పుట్టిన దేశకాల పరిస్థితుల బురస్కరించుకొనియుండును. వ్యాసప్రోక్తములని చెప్పబడు పురాణము లాయుగమునాటి సాంఘిక రాజకీయ వాతావరణమునందుద్భవించినవేగదా! పురాణములన్నియు మన వారనుకొన్నట్లు ఒక మహనీయునిచే సంగ్రహింపబడినచో వాటిలో పరస్పర విరుద్ధములైన సాంఘిక రాజకీయాభిప్రాయములు, సందర్భశుద్ధికూడ లేకుండ ఏల గుదిగుచ్చబడును ? వేదకాలములో నార్యులలోగల సాంఘిక వ్యవస్థలు త్రేతాయుగములో లేవు. త్రేత యుగములోనున్న యభిప్రాయములు, విశాలదృష్టియు తరువాత యుగములలో సంకుచితములై పోవుట చూచినాము. పురాణయుగమని చెప్పబడు క్రీస్తు తరువాత శకములలో హైందవుల సాంఘిక రాజకీయాభిప్రాయములు మఱియు బిఱ్ఱబిగిసిపోయి దారుయుగమని చెప్పదగిన స్థితికివచ్చి ఇప్పటికిని మన మీదారుయుగములోనే ఉన్నాము.

**ఆంధ్రమహాభారతము స్వతంత్ర గ్రంథము గాదు :**

ఆంధ్రమహాభారతమును రచియింపించు కాలమునాటి పరిస్థితు లెవ్వి ? నాటి రాజకీయాభిప్రాయము లెట్టివి ? సాంఘికాదర్శము లెవ్వి ?

మతాభినివేశము లెట్లుండెను? ప్రజాబాహుళ్యముయొక్క దృష్టి ఏ యుద్యమములపై కేంద్రీకరించియుండెను? అను ప్రశ్నలకు మన కుత్తరములు భారతములోనుండియే దొరకవలెను. ఆంధ్రమహాభారతము స్వతంత్ర గ్రంథముగాక ఆంధ్రీకరణమగుటచే నన్నయనాటి సమస్యలన్నియు నిందు ప్రతిబింబించుట కవకాశము లెక్కుడు లేవు. కాని అదృష్టవశమున భారతకర్తలు "తు" "చ" తప్పకుండ ఆంధ్రీకరింపవలెనను సంకెలలో దగుల్కొనక చాలవరకు స్వతంత్రమార్గమున పోవుటచే ఆంధ్రమహాభారతము మూలముకన్న రసవత్తరమైన కావ్యమగుటయేగాక అక్కడక్కడ మనకు గావలసిన విషయములను గల్గియున్నది. నన్నయమాత్రము తన కాలమునాటివారి యభిప్రాయానుసారముగా నాంధ్రీకరించినాడనుటలో అసత్యముండదు.

ఆంధ్రభారతకాలమునాటి శాంతి :

నన్నయనాటికి తూర్పుచాళుక్యుల యాధిపత్యము సుస్థిరమై పరరాజుల దాడులను తుపానులనుండి విముక్తి గాంచెను. రాజరాజనరేంద్రుడు అంతఃకలహములుగాని, పెరవారి భయముగాని లేక నలుబది సంవత్సరములు శాంతముగ రాజ్యమేలెను. ఆంధ్రదేశ కాసారముపై ప్రశాంతత రాజిల్లుచుండుటచేతనే ప్రత్యేకాంధ్ర సారస్వతమును సృష్టించవలెనను కోరిక ప్రజలలోను, రాజులలోనుగూడ జనించెను. అన్యభాషాచరిత్రలను దిలకించినచో మన కిట్టిపరిస్థితులే గోచరించును. ఆంగ్లసారస్వతము ఎలిజబెత్తురాణికాలములో దేశము స్వాస్థ్యమొందిన తరువాత వికసించెను. విజయనగరసామ్రాజ్యము శత్రుదుర్జయమై శాంతి నెలకొన్నప్పుడే ఆంధ్రప్రబంధసారస్వతము కుసుమించెను. అట్లే చాళుక్యుల యధికారము ప్రేళ్లుబారి దేశము శాంతముగానున్న దినములలో నన్నయ తన యద్వితీయారంభమునకు దొరకొనెను. అంతవరకు నాంధ్రులు రాజరాజనరేంద్రుడు చెప్పినట్లు భారతమును

బహుభాషల, బహువిధముల, బహుజనముల వలన వినుచు తృప్తి నందకపోయిరి. కావుననే 'తెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్' అన్నాడు.

ఆంధ్రదేశ భాషాభిమానము :

అప్పుడే ఆంధ్రులకు నాంధ్రభాషయందును, ఆంధ్రభూమి యందును నూతనాభిమానము పుట్టుచుండెను. నన్నయ ఉభయభాషా కావ్యరచనాభిశోభితు డయ్యు సంస్కృతమును గాదని తెనుగులో రచియించుట ఆతని యాంధ్రభాషాభిమానమునకు తార్కాణము. అట్లే ఆంధ్రదేశము అందలి పర్వతములు, నదులు నన్నయభట్టారకునకును, ఆతని సమకాలీనులకును అత్యంతప్రియదర్శనములై

"ఆంధ్రదేశపుమట్టి అది మహత్కానకము ।
ఆంధ్రదేశపునీరు అది మాకు నమృతము"

అని పాడుచుండిరి. నన్నయ తన శ్రోతలహృదయమును జూరగొనుటకే మూలములో లేకున్నను అర్జునతీర్థయాత్రా ఘట్టమునందు వేగి దేశ ప్రశంసను జొప్పించినాడు. అర్జునుడు పూర్వసముద్రతీరంబున మహేంద్రపర్వతంబు చూచుచు

సీ॥ "దక్షిణగంగ దద్దయునొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడగగుచున్న శ్రీ
పర్వతంబునుజూచి యుర్విలోన
ననఘుమై శిష్టాగ్రహారభూయిష్టమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేగీదేశ
విభవంబు జూచుచు..."

దక్షిణమునకు బోయెనని వర్ణించినాడు.

హిందూమత పునరుద్ధరణము :

ఆంధ్రభారత రచనముం బ్రేరేపించిన నిగూఢకారణ మింకొకటి కలదు. అదియే ముఖ్యముగ మనము గమనింపదగినది. పదునొకండవ శతాబ్దములో వైదికమతమును పునరుద్ధరించుటకు చేయబడిన యత్నములలో సారస్వత సహాయము బాగుగా గుర్తింపబడెను. శంకరుని యనంతరము బౌద్ధజైనమతములు నిస్తేజస్కములై ప్రజాభిమానమును గోల్పోయెను. ప్రజాసామాన్యములో మతవ్యాప్తికై వ్యావహారిక భాషల యుపయోగమును మొదట గుర్తించినవాడు బుద్ధుడు. బౌద్ధులును జైనులును ఆకాలపు ప్రాకృత భాషలలో ప్రచార మొనరించి మతగ్రంథములను వ్రాసి వైదికమతావలంబులను పెక్కండ్రను తమ తమ మతములలో గలుపుకొనుచుండగా ఈ రహస్యమును గుర్తెరుంగని వైదికమతాచార్యులు ఊరికే దిక్కులు చూచుచుండిరి. తమ కాలి క్రిందనున్న మెట్లు బౌద్ధాదులు త్రవ్విరో తెలుసుకోలేక మిన్నకుండిరి. తత్కారణమున ఉన్నతజాతులలో బ్రాహ్మణమతావలంబులు పెక్కురున్నను పామరజనులు సామాన్యముగ బౌద్ధజైన సంప్రదాయాభిమానులుగ నుండిరి. ఆంధ్రదేశములో వైదికమతము నామమాత్రావశిష్టమై యుండెను. మొదట బౌద్ధులు తరువాత జైనులును ఆంధ్రదేశమును తమతమ మతగ్రంథములతోను, సంస్థలతోను, శిల్పనైపుణ్యము జూపించు కట్టడములతోను నింపివేసిరి. చాళుక్యులకుముందు ఆంధ్రదేశమును పాలించిన రాజవంశములలో పెక్కురు బౌద్ధ జైన మతావలంబకులు. ఆంధ్రదేశమన్నమాటేమి! దక్షిణహిందూస్థానములో గొప్ప భాగమునందు బౌద్ధ జైనమతములు పాతుకొనియుండగా కుమారిలభట్టు, శంకరుడు మున్నగువారు తమ నిశితపాండిత్యముచే బౌద్ధ జైన సిద్ధాంతములను నిరంతరాయముగ ఖండించుటచే ప్రజాభిప్రాయము తిరిగి వైదికమతమువంకకు మరలెను. కాని శంకరుడుకూడ

దేశభాషామూలముగ ప్రచార మొనర్చుటచే వైదిక మతవ్యాపనము కుంటువడి మెల్లగ జరిగెను

బౌద్ధ, జైన వినాశము—దాని నష్టములు :

వ్యావహారిక భాషామూలమున వైదికమతమును ప్రజాంగీకార మును పొందించిన మహానుభావుడు నన్నయ. ఆంధ్ర మహాభారతము రచియింపబడిన తోడనే ఆర్యధర్మ సాంప్రదాయములు ప్రజలకు సులభ ముగ నర్థముకాజొచ్చెను. ఆంధ్ర మహాభారత మారంభింపబడిన తోడనే బౌద్ధ, జైన సాంప్రదాయములు ఆంధ్రభూమినుండి పారిపో వలసి వచ్చెను. నన్నయ మహాభారతమువలన నాంధ్రదేశమునుండి తరిమి వేయబడిన బౌద్ధజైన మతములు కొంత వెలితిని గల్గించకపోలేదు బౌద్ధ జైన మతముల నిర్యాసమువలన సాంఘికముగ గొప్ప నష్టము గల్గెను బౌద్ధులు, జైనులు కూడ సర్వజన సమత్వము, విశ్వసౌభ్రాతృ త్వమును ఆదర్శములుగ గల్గియుండిరి. వారిలో రాజునకు, భిక్షుకునకు భేదము లేదు. వర్ణాశ్రమధర్మములను వారు పాటించరు. వారు క్షాత్ర మును మహాదర్శముగ జేకొనలేదు. శాంతిప్రియులు. రాజులు కేవ లము నిరంకుశులుగ నుండక ప్రజాభిప్రాయ బలీయముగ నుండెను. కాని హిందూమత పునరుద్ధారణముతో ఈ సంస్థలన్నియు తలక్రిందైన నవి. వర్ణాశ్రమధర్మములు బహుసంకుచితదృక్పథముతో నవలంబింప బడెను. మూర్ధాభిషిక్తుల యందనుగాని నూత్నహిందూమతము సత్వర వ్యాప్తి నొందదని గుర్తించుటచే విద్యాధికులైన బ్రాహ్మణులు క్షత్రియకులమున కెక్కువ ప్రాముఖ్యత నిచ్చి వారిద్వారా వర్ణాశ్ర మములు సంరక్షింపజేయుచుండిరి. నన్నయ రాజరాజనరేంద్రుని ప్రశంసించుచు "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమన్ మహి నొప్పు" అన్నాడు. ఉత్తమ క్షత్రియ ధర్మమని తలంపబడిన తిరిగి తలయెత్తెను.

సీ. "... ... ... ... ... ...
పరమండలంబుల ధరణీపతుల
నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును
బలిమి నీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు..............."

క్షత్రియులు కాలముం బుచ్చుచుండిరి.

బ్రాహ్మణులు క్షత్రియుల కెక్కువ ప్రాముఖ్యమిచ్చినట్లే రాజన్యులు బ్రాహ్మణులకు సర్వస్వాతంత్రత నిచ్చి ప్రత్యేక సౌకర్యములు కల్గించుచుండిరి. రాజాధికారమును పొగడి 'నా విష్ణుః పృథ్వీపతేః' అను సూత్రమును గల్పించినందులకై కృతజ్ఞులైనరాజులు, విప్రకులమునెల్ల బ్రోచుచు అగ్రజన్ములకు ననుగ్రహమున జారుతర మహాగ్రహారంబులిచ్చుచు పోషించిరి. రాజరాజనరేంద్రుడు మున్నగు చాళుక్యులట్టివారు. రాజరాజనరేంద్రుడు 'ఇవియేనున్ సతతంబు నాయెడగరం బిష్టంబులై యుండు బాయవు భూదేవకులాభితర్పణ మహీయః ప్రీతియున్' అని చెప్పినాడు. ఇట్లు బ్రాహ్మణ క్షత్రియులొండొరుల సన్మానములో ప్రజాబాహుళ్యమును గుర్తించలేదు. వారి మాటయే వినబడదు. వారిభావములేమో, వారి యభిప్రాయము లేమో వర్ణించుట కవుల పనిగాదు.

హిందూమత పునరుద్ధారణమున లాభములు :

ఇట్లు బౌద్ధజైన మతవినాశనము ప్రజల నధోగతి పాలుజేసినను ఆంధ్రభారతముచే ప్రేరేపింపబడిన క్షాత్రతేజము వ్యర్థముగా పోలేదు. మొదట ఈ క్షాత్రము ఆంధ్రదేశము నన్యోన్యకలహములలో ముంచివైచినది. ఏవో కొన్ని తాలూకాలకు ఒక్క యుద్ధప్రియుడు రాజై పొరుగురాజులకుగాని, తనకుగాని శాంతిలేకుండ కలహప్రియుడై నిత్య జైత్రయాత్రలకు సిద్ధమగుచుండెడివాడు.

ఓరుగల్లున కాకతీయులు తమ సామ్రాజ్యమును స్థాపించువరకు దేశ మిట్లే యుండెడిది. నన్నయ కాలము నుండి తిక్కనవరకు నాంధ్ర భారతమును పూర్తిచేయు ప్రయత్నములు చేయబడకుండుటకు దేశ మందలి యశాంతియే కారణ మనవలెను. దేశమునందిట్లు రగులు చున్న శౌర్యాగ్నియే హిందూమతమును, హిందూజాతిని సంరక్షింప గల్గెను. నూతన హిందూమతము వ్యాపించుచుండగనే మహమ్మదీ దీయుల దండు దేశముపై నశనిఘాతమువలె పడెను. శూరులైన మహమ్మదీయులను మించిన యుద్ధప్రియులును, శౌర్యవంతులునైన క్షత్రియ వంశస్థులే వారి నెదుర్కొనుటకు సమర్థులు. ఆంధ్రమహాభారతము కారణముగ 'ఓరుగల్లున రాజవీరలాంఛనముగ పలుశస్త్రశాలలు' నిల్చినవి. కనుకనే హిందూమతముద్ధరింపబడెను. ఈ హిందూ మతాభినివేశమే యాంధ్రులను మరియొక సామ్రాజ్యస్థాపనమునకు ప్రేరేపించెను. సామ్రాజ్య నిర్మాణము ఆంధ్రులకు ఉగ్గుపాలతో వచ్చినవిద్య. ఆంధ్రజాతి తొలుదొల్తనే గొప్ప సామ్రాజ్యమును నిర్మించి క్రీస్తు తరువాత నాల్గు శతాబ్దములు జగద్విఖ్యాతి నొందినది. తరువాత కాకతీయ సామ్రాజ్యము ఆంధ్రుల రెండవ మహాప్రయత్నము. మూడవదగు విజయనగర సామ్రాజ్యమును సృజించిన యాంధ్రులు తమ సామ్రాజ్య నిర్మాణశక్తిని తామే మించిపోయిరి. నన్నయ ఆంధ్రత్వము, ఆంధ్రభాష, ఆంధ్రశౌర్యము అను త్రేతాగ్నుల కుల బ్రాహ్మణుడై నిత్యము ప్రేల్చినాడు గావుననే "విద్యానగర రాజ వీథుల కవితకు పెళ్ళి పందిళ్ళు కప్పించు" సమయము సిద్ధించినది.

జైన బౌద్ధ వాఙ్మయ నాశనమునకు తెలుగు భారతముయొక్క ప్రాశస్త్యమే కారణము :

ఆంధ్ర మహాభారతమును నన్నయ తెలుగువారికి ప్రసాదించిన తోడనే దాని 'ప్రసన్న కథా కవితార్థయుక్తియు' 'అక్షరరమ్యతయు'

ప్రజలను ముగ్ధుల జేసినవై చుటచే నితరభారతముల జెండా పడిపోయెను. అధర్వణునిచే వ్రాయబడినవని చెప్పబడు జైన భారతాదులు ప్రజా దరణము లేకపోవుటచే నశించినవి. నన్నయకు కొంచెము ముందుగను తరువాత కొన్ని శతాబ్దములవరకు ఆంధ్రదేశములో రేగిన జైన హైందవప్రతిస్పర్థలలో ఆంధ్రబౌద్ధ జైన వాఙ్మయము నశించియుం డును. ఈ వివాదములతో నిండియుండుటచే నాంధ్రదేశమునందు నన్నయ తరువాత రెండు శతాబ్ధములవరకు గొప్ప సారస్వతాభివృద్ధి కాని, శిల్పప్రాగల్భ్యముగాని కనబడదు. బౌద్ధజైనులు ముఖ్యముగ శిల్పప్రియులుగను, సారస్వతాభిమానులుగను. శాస్త్రవిమర్శకులు గను పేరుగాంచిరి. "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయ ములు" స్థాపించిన స్థలములు బీడులై పోయెను. బౌద్ధులు విద్యాభి వృద్ధికై మహాప్రయత్నము లొనర్చిరనుటకు "నలందా" విశ్వవిద్యా లయము మరువరాని చిహ్నము ప్రజాసామాన్యములో విద్యా గంధము వ్యాపింప జేయుటకై బౌద్ధజైన బిక్షువులు పాటుపడెడివార నియు, ప్రాథమిక విద్యకై వారు చేసిన యత్నములు ప్రశంసార్హము లన్నియు పండితు లభిప్రాయపడుచున్నారు. నూతన హిందూ మత ప్రాబల్యమున బ్రాహ్మణ క్షత్రియులకు ప్రాముఖ్యమును, తదితర జనసామాన్యమున కప్రాముఖ్యతయును గల్గుటచే ప్రాథమికవిద్య నశించెనని గూడ చెప్పెదరు.

వేద వాఙ్మయము తెనిగించినచో :

నూతన హిందూమతోద్ధారకులగు నన్నయ, రాజరాజ నరేం ద్రుడు మున్నగువారు పురాణముల నాంధ్రీకరించుటతో నారంభింపక వేదవాఙ్మయమునే పరిశోధించి తెనిగించినచో దేశచరిత్ర కేవలము మారిపోయి యుండును. రాజరాజనరేంద్రుడు స్వయముగ 'వివిధా గమవిహితశ్రము' డట! నన్నయ 'సంహితాభ్యాసుడు' ఇట్టి వీరు

ప్రాచీన వేదవాఙ్మయము నాంధ్రభాషలోనికి దీసికొనవచ్చి, నెన్ని యోమడుగు లధికోప కారము చేసినవారయి యుందురు. వేదవాఙ్మయము నాటికి ఆర్యులలో గన్పట్టు సాంఘిక రాజకీయసంస్థలు విశాలములై ప్రజాస్వామ్యసంబంధములై యుండెను. చాతుర్వర్ణ్య విభాగము నాడు నేటివలె సంకుచితమై ఉన్నత వర్ణముల యాధిక్యమునే బోధించునదిగ లేకుండెను. అట్లే స్త్రీల కెక్కువ స్వాతంత్ర్యమును గౌరవమును, వేదము లొసంగినవి. పురాణకాలమునాటికి బ్రాహ్మణాదుల యాధిక్యత నిరూఢముగ పాతుకొనిపోయెను. స్త్రీలయొక్క హక్కులును, ధర్మములును ప్రాతమాటలై పోయెను. విజయనగర నిర్మాతలు వైదికవాఙ్మయమును పునరుద్ధరింపగోరి మాధవ విద్యారణ్యులచే వేదభాష్యమును వ్రాయించిరిగాని అప్పటికి వైదిక వాఙ్మయము నందలి రాజకీయ సంస్థలు భాష్యకారులకే యర్థమయి యుండవు. ఏలన చిరకాలమునుండి నిరంకుశపాలన కలవాటుపడిన ప్రజలకు ప్రజాస్వామిక సంస్థలు రుచించవు; అర్థమును కావు.

సంస్కృత భారతమునకును, ఆంధ్రభారతమునకును దల్లి పిల్లల సంబంధమున్నను మూలగ్రంథము రచించునాటికిగల యభిప్రాయములును, సంస్థలును ఆంధ్రమునందు మరియు సంకుచితములై పోయినవి. ఇది నన్నయభట్టు లేఖినియొక్క పొరపాటుకాదు. నన్నయ తనకాలములో ప్రజలయందును. విద్యాధికులయందును గల యభిప్రాయముల ప్రకారము ఆయాఘట్టములందు వ్రాసినాడు. ఇట్టి మార్పులను మనము జాగ్రత్తతో పరిశీలించిన మనకు నన్నయనాటి సాంఘిక రాజకీయాభిప్రాయములు వెల్లడియగును. ఆంధ్రభారతము భాషాంతరీకరణ మగుటచే నిందులో గ్రంథకర్త యభిప్రాయము లెవ్వియో తెలిసికొనుట కొంత కష్టసాధ్యము. అయినను నివి గమనింపదగినవి.

రాజకీయాభిప్రాయములు-ప్రజల ప్రాముఖ్యత :

ఆంధ్రమహాభారత కాలమునాటికి ప్రజాభిప్రాయము ప్రాముఖ్య

మున గోల్పోయి రాజుల యాధిక్యత సుస్థాపిత మయ్యెను. సంస్కృత భారతములో రాజుల వంశనామములుగాని, వారి పేర్లుగాని తరచు పేర్కొనబడవు. తరచుగా ప్రజానామములు వినబడుచుండును. కురువులు, పాంచాలురు, మాగధులు, యదువృష్టిభోజులు; వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజ, గౌడాంధ్రులు. ఇట్లు రాజులు తాము పాలించు ప్రజానామములచే పేర్కొనబడుచుండిరి. రాజరాజనరేంద్రుని ఉత్తమ చాళుక్యుడు, విమలాదిత్య తనూజుడు రాజమహేంద్రుడు అని నన్నయ సంబోధించునేగాని ఆంధ్రుల పేరుతో పిలువడు. రాజసూయాధ్వర మప్పుడు ధర్మరాజునకు కానుకలు చెల్లించినారని చెప్పిన వారిలో పెక్కురు రాజులు లేనివారుగా ఉన్నారు.

'ద్వ్యక్షాన్ త్ర్యక్షాన్ లలాటాక్షాన్ నానాదిగ్భ్యః సమాగతాన్
ఔష్ణీకానంతవాసాంశ్చ రోమకాన్ పురుషాదకాన్
ఏకపాదాంశ్చ తత్రాహ మవశ్యం ద్వారి వారితాన్
చీనాన్ శకాంస్తథా చోఢ్రాన్ బర్బరాన్ వనవాసినః
వార్ష్ణేయాన్ హారహూణాంశ్చ కృష్ణాన్ హైమవతాంస్తథా.'

నన్నయ వీరంద రముఖ్యులనియైన విడిచియుండవలెను. లేదా వీరు రాజాధికారములో లేనివారగుటచేతను ఆతని కాలమునాటికి రాజులేని ప్రజాసమూహములు లేకపోవుటనే నతనికి వింతగా కన్పడి విడిచియుండవలెను.

నన్నయ మూలములో పౌరులకియ్యబడిన ప్రాముఖ్యత నియ్యకుండుట జూడ నాతనికాలములో ప్రజాభిప్రాయమున కెంత విలువయుండెడిదిదో మనమెరుంగగలము.

'సమానీయబహూన్ విప్రాన్ భీష్మం విదురమేవ చ
అన్యాంశ్చ సుహృదో రాజన్ కురూన్ సర్వాంస్తథైవ చ.'

నన్నయ పౌరులకు ప్రాముఖ్యత నివ్వడు:

అనుదానిని నన్నయ ఇట్లు వ్రాసినాడు. "ఇట్లేకోత్తర శత పుత్రులం బడసియున్న ధృతరాష్ట్రుకడకు భీష్మవిదురాది బంధుజనులను, పురోహిత ప్రముఖ బ్రాహ్మణవరులును వచ్చి" ప్రజలమాట యెత్తనే లేదు. ఇంకొక విశేషము, మూలములో ధృతరాష్ట్రుడందర నాహ్వానించెనని యుండ రాజతీవికి లోపమని భీష్మాదులు రాజుకడకు స్వయముగ వెళ్ళినారని చెప్పినాడు.

పాండురాజు మునిశాపమున నరణ్యములో నుండ నిశ్చయించి, తన నిశ్చయమును ధృతరాష్ట్రాదులకు వార్త నంపుచు ఇట్లుచెప్పినాడు.

'కౌసల్యా విదురఃక్షత్తా రాజా చ సహబంధుభిః
పౌరవృద్ధాశ్చయే తత్ర నివసంత్య స్మదాశ్రయా॥'

నన్నయ "హస్తిపురంబునకుం జని నా తపోవృత్తినునికి రాజునకు, సత్యవతీదేవికి, భీష్మునకు, విదురునకు. వృద్ధపురోహిత బ్రాహ్మణులకుం జెప్పి" అని రచించెను.

పౌరవృద్ధులకును, భృత్యులకును రాజు కబురుపెట్టుట రాజగౌరవమునకు విరుద్ధమనియే నన్నయ వారిని విడిచిపెట్టెను.

ధర్మరాజును యువరాజుగా చేయగోరి ధృతరాష్ట్రుడు ప్రజల యొక్క కోర్కెలుగూడ మనంబునం దుంచుకొనెను. ధర్మరాజు సద్గుణములను బట్టియే యాతని యువరాజును చేసెను.

"ధృతి స్థైర్యసహిష్ణుత్వా దానృశం స్యాత్తథార్జవాత్
భృత్యానా మనుకంపార్థం.'

నన్నయ ధృతరాష్ట్రుడు యుధిష్ఠురు రాజ్యభార ధురంధరునిగా నెఱింగి భీష్మవిదురులతో నాలోచించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన."

సద్గుణములు గలవాడనిగాని, ప్రజలను సంతోషపెట్టుటకై చేసెననిగాని చెప్పకపోవుటచే నన్నయ యౌవరాజ్యమునకు వయస్సొకటియే ప్రధానమైనట్లు సూచించినాడు. అతని కాలములో యువరాజును జేయుటకు ప్రజాభిప్రాయ మక్కర లేదు. రాజకుమారుడైనంత

మాత్రముచేత యువరాజగుట సహజమని యాతని యభిప్రాయము. మరియు

'విదితం మే మహాప్రాజ్ఞ భోజేష్వేవ సమంజసమ్
పుత్రం సంత్యక్తవాన్పూర్వం పౌరాణాం హితకామ్యయా.'

ఇట్టి శ్లోకమును నన్నయ పూర్తిగా విడిచిపెట్టినాడు పౌరులను సంతోషపెట్టుటకై రాజకుమారుని విడిచిపెట్టుట తత్కాలాభిప్రాయములకు కేవలము విరుద్ధము. ఇట్టి భావము లాంధ్రభారతములో నున్న ప్రజాసామాన్యమని చదివి రాజాధికారమును బ్రశ్నింతురని భయపడియుండవలెను.

పౌరుల హక్కులు :

పౌరులు, సంస్కృతభారతము వ్రాయబడ్డ దినములలో తమ యధికారమును గుర్తెరిగి సభలలోను, చతుష్పథములందును తమ యభిప్రాయములను నిస్సందేహముగ వెలిబుచ్చుచుండిరి. రాజులను చేయుటకును, వారిని సింహాసనభ్రష్టుల చేయుటకును వారి కధికారము కలదని వారెరుగుదురు. రాజు ధృతరాష్ట్రుడైనను ఆతని కుమారుడైన దుర్యోధనుని గాదని యుధిష్ఠిరుని రాజుగా చేయగోరుచున్నారు.

'గుణైస్సముదితాన్ దృష్ట్వా పౌరాః పాండుసుతాం స్తథా
కథయాం చక్రిరే తేషాం గుణాన్ సంసత్సు భారత
రాజ్యప్రాప్తిం చ సంప్రాప్తం జ్యేష్ఠం పాండుసుతం తథా
కథయంతి స్మ సంభూయ చత్వరేషు సభాసు చ
తే వయం పాండవ జ్యేష్ఠం తరుణం యుద్ధశీలినమ్
అభిషించామ సాధ్వద్య సత్యకారుణ్య వేదనమ్.'

మూలములో నింత విస్పష్టంగా నున్నను, నన్నయ పౌరసభలను గురించియు, చత్వరముల గురించియు నేమియు చెప్పడు. ఆ సభలెట్టివో ప్రజలే మరచిపోయిరి. నన్నయ కాలమునాడు ప్రజలు కేవలము ధనకనక వస్తువాహనములవలె ఒక రాజునుండి మరియొక

రాజున కివ్వబడునా రేకాని వారు రాజుల సింహాసన మెక్కించుట, పద భ్రష్టుం చేయుట తమ హక్కులని యెరుగరు. పౌరానురాగము లేని రాజ్యము సాగదని తెలిసియే దుర్యోధనుడు లోలోపల ప్రజలదిట్టుచు దాన సన్మానంబుల బ్రకృతి జనంబులకు సంతోషము సేయుచుండు

'శృత్వా తాని వాక్యాని

యుధిష్ఠి రానురక్తానాం పర్యతప్యత దుర్మతిః'

'పౌరానురాగసంతప్తః' అని ఉన్నది సంస్కృతభారతములో.

ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగాపోవుట ఆ దినముఃలో మహాపద యని రాజు లెరుంగుదురు. దుర్యోధను డిట్లు బీరములు చెప్పగా "ఈ రాజ్యంబు మొదలింటగోలె భవదీయం బయినం, బ్రకృతి జనులు వశ్యలు గాకున్నను, క్రమాగతంబయి మాకు నప్రయత్న లభ్యంబగు", ధృతరాష్ట్రుడు వృద్ధుడగుటచే తన యనుభవము నిట్లు తెల్పుచున్నాడు.

'తే పురా సత్కృతా స్తాత పాండునా నాగరా జనాః
కథం యుధిష్ఠిరస్యార్థేననో హన్యు స్సబాంధవాన్.'

ప్రజలను దిరస్కరించినచో వారు మనలను బంధుమిత్రులతో సహా చంపకుందురా అని అడుగుచున్నాడు. ఈ యభిప్రాయము నన్నయ బొత్తిగా విడిచిపెట్టుటచే ప్రజలు రాజును సంహరించు టాతడు నోటగూడ ఉచ్చరించడని మనమనుకొనవలసి వచ్చుచున్నది. నన్నయ మూలములో లేని కొన్ని అర్థవంతమగు పదములు దుర్యోధనుని కొసంగి తనకాలపు యభిప్రాయమును వెల్వరించుచున్నాడు. 'క్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యంబగు' నిజముగా కురు పాండవుల కాలములో రాజ్యము క్రమాగతమైనంతమాత్రమున నప్రయత్నముగా దొరకక ప్రజాభిప్రాయముపై నాధారపడి గుణ వంతునకు మాత్రము దొరకుచుండెను. ప్రకృతి జనులు వశ్యులు గాకున్న నేమియని ఆకాలపురాజు లనలేరు. వారు ప్రజాభిప్రాయము

నకు విరుద్ధముగా జేసిన కంసునివలె దుర్మరణము నొందుచుండిరి. దుష్టులగు రాజులను చంపుటకు దారిజూపినవాడు మహాత్ముడగు శ్రీకృష్ణభగవానుడే.

**ప్రజలు ప్రభువుల విమర్శించుచుండిరి :**

రాజులను ప్రతిష్ఠించి తీసివేయు శక్తిగలవారు గనుకనే ఆకాలపు ప్రజలు రాజులను తీవ్రముగ విమర్శించుచుండిరి. ఏకచక్రపురవాసి యగు నొక పేదబ్రాహ్మణుడు బకాసురునికి ఆహారము పంపుటకు తన వంతు వచ్చినప్పుడు శోకించుచు రాజును యిట్లు నిందించినాడు.

'వేత్రకీయే గృహే రాజా నాయం నయమిహాస్థితః
ఉపాయం తం న కురుతే యత్నాదపి స మందధీః ।
అనామయం జనస్యాస్య యేన స్యాదద్య శాశ్వతమ్ ।
ఏతదర్హా వయం నూనం వసామో దుర్బలస్య యే'

కావుననే

'రాజానం ప్రథమం విందేత్' అనుచున్నాడు.

రాజు తన యింట గూర్చుని ఇవి జూడడు. ఆ మందబుద్ధి యుపాయాంతరమునైన నాలోచింపడు. ఈ జనపద మిట్లు విజనమై పోవుచున్నది. దుర్బలుడైన రాజు క్రింద నున్న మేము ఇట్టి వనుభవించుట సహజమే. కావున మొదట రాజును ఎన్నుకోవలెను.

ఆంధ్రీకరణములో నింతియే ఉన్నది. "ఈనాటి రాజును దలప డసుర నోర్వ బలిమిలేమి !"

రాజు ఉపేక్షాపరుడైనను ప్రజలకాతని విమర్శించు నధికారము లేదని తలచియే నన్నయ ఇంత సంక్షేపముగ నాయంశమును ముగించెను. ఏకచక్రపురవాసియైన బ్రాహ్మణుడట్లు నోరు కట్టివేయతగ్గ వాడుకాడు. దుర్బలుడైనందుకు రాజును నిందించుటయే గాక తమ తప్పుకూడ లేకపోలేదని యెరుంగును. దుర్భలుడును, ఉపేక్షాపరుడు

నైన రాజును రాజ్యముసేయ నిచ్చుట వారిది తప్పే. కావుననే 'ఏత దర్థావయం నూనం' ఇవి యన్నియు మేము అనుభవింపతగినవే అను చున్నాడు. ఆకాలములో పౌరుల మొదటి కర్తవ్యము 'రాజానం ప్రథమం విందేత్' యోగ్యుడైన రాజు నభిషిక్తుం జేయుటయే. 'తతో భార్యాం తతో ధనమ్' తరువాత వివాహము చేసుకొని ధన మార్జింప వలెను.

## 2. సాంఘికాచార భేదములు

నన్నయ కాలములో వర్ణాశ్రమ ధర్మములు పూర్తిగా నెల కొల్పబడి యీ సంస్థయందు వైదిక పౌరాణిక కాలములందున్న విశా లత్వము చెడి చాతుర్వర్ణ్యముల నడుమ విభాగములు పెరిగిపోయి పెద్దగోడలు పెట్టినట్లుండెనని చెప్పియున్నాను. ఈ కాలములో ప్రాముఖ్యత నందినది ముఖ్యముగ బ్రాహ్మణ క్షత్రియులు. క్షాత్ర వంశములను ఏ సూర్య చంద్రులకో కలిపి వంశావళులు నిర్మించిన యుత్తమ సేవకై మెచ్చి రాజులు బ్రాహ్మణుల నితర వర్ణములకన్న మర్యాదతో జూచుచుండిరి. వారిపై గల పన్నులభారమును తీసివేసిరి. బకాసురవధ ఘట్టములో మూలమందు లేని పద్యమొండు జొప్పించి నన్నయ నాడు బ్రాహ్మణులనుండి పన్నులు గొనుట లేదని చెప్పు చున్నాడు.

'అరియని విప్రులచేతను
ధరణీశులు రూకయును మొదలుగా గొన రె
వ్వరు నిప్పుడు మానిసి
నరి గొనియెడు భక్షణార్థియై విప్రులచేన్.'

కాని కురుపాండవుల కాలములో బ్రాహ్మణులుకూడ రాజులకు కప్పములు, కానుకలు నిచ్చుచుండిరనుటకు ఈ క్రింది శ్లోకములు తార్కాణము.

"గోవాసనా బ్రాహ్మణాశ్చ దాసనీయాశ్చ సర్వశః
త్రిఖర్వం బలి మాదాయ ద్వారి తిష్ఠంతి వారితాః
బ్రాహ్మణా వాటధానాశ్చ గోమంత శ్శతసంఘశః
కమండలూ నుపాదాయ జాతరూపమయాన్ శుభాన్
ఏవం బలిం సమాదాయ ప్రవేశం లేభిరే న చ"

యుధిష్ఠిరుని రాజసూయయాగ సందర్భమున గోవాసనులను బ్రాహ్మణులు మూడుగాడి దెల బరువు బంగారము కానుకగా తెచ్చియు ద్వారమువద్ద నాపివేయబడిరి. అట్లే వాటధానులను బ్రాహ్మణులు బంగారుమయమైన రమ్యములగు కమండలువులం దెచ్చి లోపలికి పోజాలకపోయిరి అని దుర్యోధనుడు తండ్రితో చెప్పుచున్నాడు. నన్నయకాలపు రాజులు విశేషాగ్రహారములు బ్రాహ్మణుల కిచ్చి, బ్రాహ్మణ మానములపై ఒక్కరూక నేనియు పన్ను గొనకున్నచో వారి బొక్కసములెట్లు నిండియుండెను? తదితర వర్ణములపై నంతకు రెండు రెట్లు పన్ను విధించినగాని రాజ్యములెట్లు సాగుచుండెడివి? కాన పన్నులభారము ప్రజావళిపై మిక్కుటముగ నుండెనని మన మూహింపవలెను. క్రైస్తవ దేశములలో కూడ నిట్లే రాజులు పురోహితు (Clergy) లనబడు వారి మాన్యములపై పన్నులు వేయక ప్రజలను పీడించుచుండుట చేతనే ఫ్రెంచి విప్లవము గల్గెనని చరిత్రకారులు చెప్పుదురు. మన దేశములోకూడ నిట్టి విప్లవములు రావలసినదే కాని ప్రజలు తమ హక్కుల నెరుంగకుండుట చేతను, విద్యావంతులు గాకుండుటచేతను రాలేదు.

మరియు నారాజసూయంబు చూచుటకై యుధిష్ఠిరుడు చాతుర్వర్ణ్యముల వారిని పిలువనంపెనని మూలములో నుండగా తానేమి చెప్పెనో చూపుదము.

సహదేవుడు :-

"ఉపశ్రుత్య వచో రాజ్ఞ స్సదూతాన్ ప్రాహిణో త్తదా
ఆమంత్రయధ్వం రాష్ట్రేషు బ్రాహ్మణాన్ భూమిపా నథ
విశశ్చ మాన్యాన్ శూద్రాంశ్చ సర్వా నానయ తేతి చ"

నన్నయ యిట్లు వ్రాయుచున్నాడు! "నిఖిలమహీతలంబునం గల బ్రాహ్మణ క్షత్రియాదుల నెల్ల రాబనుపు మనిపంచిన" వైశ్య శూద్రుల నెన్నుట అనావశ్యకమనియే విడిచెను.

ఆ యుధిష్ఠిరుని యజ్ఞశాలయందు అన్ని జాతులును, అన్ని వర్ణములవారు నుండిరట.

"ప్రీత్యర్థ్యం బ్రాహ్మణాశ్చైవ క్షత్రియాశ్చ వినిర్జితాః
ఉపాజహ్రు ర్విశశ్చైవ శూద్రాః శుశ్రూషవ స్తథా।
బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రు లెల్ల కానుక లిచ్చిరి.

"ప్రీత్యాచ బహుమానా చ్చాప్యు పాగచ్ఛన్ యుధిష్ఠిరం
సర్వేమ్లేచ్ఛా సర్వవర్ణా ఆదిమధ్యాంతజా స్తథా"

మ్లేచ్ఛులందరును ఉత్తమమధ్యమాధమ జాతులలో బుట్టిన సకల జనులును ప్రీతితో గానుకలు తెచ్చిరి.

"నానాదేశసముత్థైశ్చ నానాజాతిభి రేవచ
పర్యస్త ఇవ లోకోఽయం యుధిష్ఠిరనివేశనే"

ఆ యుధిష్ఠిరుని యజ్ఞశాలలో సకల దేశములవారును, సర్వ వర్ణములు నిండియుండుటచే ప్రపంచమెల్ల నచ్చట నున్నట్లుండె.

రాజాశ్రయము, బ్రాహ్మణుల వ్యక్తిత్వ లోపము :

ఇట్లు రాజాశ్రయమునే నమ్ముకొని జీవించువారుగనుకనే నన్నయ నాటికి బ్రాహ్మణులు తమ శౌర్యాదిగుణముల చాలవరకు గోల్పోయిరి. కృపద్రోణాశ్వత్థామలవలె వారు యుద్ధ విశారదులై యుండలేదు. రాజులు వారిని రక్షింపగలరు; లేకున్న నాత్మరక్షణో

పాయము లేదు వారికి. ద్రౌపదీ స్వయంవర సందర్భమున నా కాలపు బ్రాహ్మణుల యుద్ధాభినివేశము స్వాతంత్ర్యభావము గోచరించును. రాజు లందరు కోపగించి బ్రాహ్మణున కేమి? రాజకన్య నిచ్చుటేమి? ద్రుపదుడు వృథావమానంబు గల్పించెనని నాతని జంప నుద్యుక్తులు కాగా "శరణాగతుండయిన ద్రుపదు నోడకుండుమని బ్రాహ్మణులు దమ తమ దండాజినము లెత్తికొని ప్రతిబలంబులపై వీచి" రట. ఆ కాలమున బ్రాహ్మణ వీరులు క్షత్రియ వీరులకు వెనుదీసెడివారుగారని దీన మనకు దెలియును.

స్త్రీలకు సమాన హక్కులు :

స్త్రీలు, వారి స్వాతంత్ర్యయము ;- కురుపాండవులవాడు సంఘములో స్త్రీల కెక్కువ ప్రాముఖ్యతయు వ్యక్తిత్వము నుండెను. వారలించుమించు పురుషులకు గల హక్కులను గల్గియుండిరి. స్త్రీల పునర్వివాహ ప్రశంస నాటివారికి వింతగా గన్పించుటలేదు. అది యప్పటికింకను ఆచరణలోనున్న విషయమే. స్త్రీ లెప్పుడును పతి కన్న న్యూనలై యాతని పంపు సేయుటయే ఆదర్శముగా గలవారు కారు. సంతానవృద్ధి ఆ కాలములో నొక గొప్ప యాదర్శముగ నుండెను. సంతానార్థమై వారు అన్యపతుల గొనుటగలదు. ధృతరాష్ట్ర పాండురాజుల జననము, పాండవుల జన్మము దీనికి దృష్టాంతములు. నన్నయ నాటికి సంఘమునందు స్త్రీల యెడగల భావము లెట్లుమారెనో గమనించదగినది. మూలములో స్త్రీల ప్రశంస వచ్చిన చోట నన్నయ ఊరకుండును. పాండురాజు మరణానంతరము పాండవులు హాస్తినాపురమునకు వచ్చిన సందర్భమున కవి యిట్లు వర్ణించినాడు:

> "స్త్రీ సంఘాః క్షత్రసంఘా శ్చ యానసంఘసమాస్థితాః
> బ్రాహ్మణైస్సహ నిర్జగ్ముర్బ్రాహ్మణానాం చ యోషితః."

నన్నయ యిట్లు వ్రాసినాడు. "సురలవరప్రసాదమున జూవె సుపుత్రుల బాండురాజు భాసురముగ గాంచె తత్సుతుల జూతము రండని పౌరులెల్ల" స్త్రీలిట్టి ఉత్సవముల జూచుటకై సంఘములుగ బయటికిపోవుట అందులో బ్రాహ్మణ స్త్రీలుపోవుట విరుద్ధమనియే నన్నయ వారిమాట నెత్తలేదు.

స్త్రీలు అనావృతలు :

పాండురాజు కుంతిని సంతానప్రాప్తికై నియోగించినప్పుడు పూర్వకాలమునందు స్త్రీ వివాహ విషయమయి ఎట్టి యాచారము లుండెనో సూచించుచు శ్వేతకేతువు అతని తల్లి కథను చెప్పినాడు. స్త్రీలు ఆ కాలములో అనావృతలై నియతా నియత పురుషులయి ప్రవర్తిల్లుచుండిరి. ఇట్లుండ ఉద్దాలకుని భార్యను అతిథియైవచ్చిన విప్రుండొకడు పుత్రార్థంబు కామించెనట. అంత నా మునికుమారుడైన శ్వేతకేతు డలిగి యాధర్మము పనికిరాదని శాసించెనట. నన్నయ యీ విషయమయి ఇట్లు నిస్సందేహముగ వ్రాయుచున్నాడు.

సీ॥ ..................అన్యపురుష

........................

సంగమంబునఁ జేసి సకలపాతకములు
నగు బరిగ్రహభూతలయినసతుల
కిట్టిది మర్యాద యిమ్మనుష్యుల కెల్లఁ
జేసితి లోకప్రసిద్ధిగాగ
నని ధర్మ్యమైన మర్యాద మానవులకు
దద్దయు హితముగా ధర్మమూర్తి

ఆ. వె. యజ్ఞభవసమానుఁడగు శ్వేతకేతుండు
నిలిపె నదియు ధారుణీజనంబు

నందు లోకపూజ్యమై ప్రవర్తిల్లుచు
నుండె శిష్టసంప్రయుక్తిఁ జేసి'
మూలములో పాండురాజు ఇట్లు చెప్పుచున్నాడు.

"అస్మింస్తు లోకేన చిరాన్మర్యాదేయం శుచిస్మితే"
"ఇతి తేన పురా భీరు మర్యాదా స్థాపితా బలాత్."

బలవంతముగ మునికుమారుడీ మర్యాద చేసెనని కురుపాండవులనాడను కొనుచుండగా నన్నయ ఈ మర్యాద బ్రహ్మతో సమానుడైన శ్వేతకేతు లోకహితార్థము చేసెనని రూఢిగా చెప్పుచున్నాడు. ఆ సందర్భములోనే పతి నతిక్రమించిన సతికి మహాపాతకమగు నని చెప్పుచు సతి నతిక్రమించిన పతికినట్టి పాతకమే కల్గునను దానిని చెప్పక విడచినాడు.

"వ్యుచ్చరంత్యాః పతిః నార్యా అద్య ప్రభృతి పాతకమ్
భార్యాం తథావ్యుచ్చరతః కౌమారబ్రహ్మచారిణీమ్
పతివ్రతా మేతదేవ భవితా పాతకం భువి"

పురుషులయెడ స్త్రీల కెట్టి బాధ్యత లుండెనో స్త్రీలయెడ పురుషునకట్టి బాధ్యతలున్నవని నన్నయకాలపువారు గుర్తించరు. ప్రజాభిప్రాయమునందిట్టి మార్పులు గల్గుట యాశ్చర్యము.

ఇట్లే బకాసురవధ ఘట్టమునందు ఏకచక్రపురవాసియైన బ్రాహ్మణునకు నాతని భార్యకును గల్గిన వివాదమును బట్టి స్త్రీ పురుషుల సంబంధము లాదినంబులలో ఎట్లుండెనో విమర్శించుట లాభజనకము. బ్రాహ్మణి బకాసురునికి తానాహారముగ నేగెదనని చెప్పి, అందులకు ముఖ్య కారణము నిట్లు చెప్పెను. "నేను నీపుత్రుని పుత్రికను నీవులేక పోషింపజాలను. నీవు పోయినతర్వాత అనాథనైన నన్ను జనులు బలవంతము చేసి పెండ్లికి ప్రోత్సహింతురు."

నన్నయ భాగవత ప్రకారము ఆమెకు దోచిన ముఖ్యకారణ మిది.

"పురుషుకంటె మున్న పరలోక మేఁగిన
సతియ నోఁచినదియు సతులలోనఁ
బురుషహీనయైన బరమపతివ్రత
యయ్యు జగముచేతఁ బ్రయ్యఁబడదె"

మూలములో ఇట్లున్నది

"వ్యుష్టి రేషా పరా స్త్రీణాం పూర్వం భర్తుః పరాంగతిమ్
గంతుం బ్రహ్మ న్సపుత్రాణా మితి ధర్మవిదో విదుః"

సంతానవతులైన స్త్రీలు పతికన్న ముందు మరణించుట మహా భాగ్యమని ధర్మవిదులు చెప్పుదురు.

స్త్రీల శూరత్వము :

నన్నయ వ్రాసినట్లు సంతానము ఉన్నా లేకున్నా స్త్రీలు పతికన్న ముందు జనిపోవుటయే మహాదాదర్శమని యాకాలపు జను లనుకోలేదు. పతిహీనయైనంత మాత్రమున బతివ్రతమునుగూడ చుల్కనగా జూచు దౌర్భాగ్యము పూర్వకాలములో లేదు. నన్నయ నాటి కట్టి యభిప్రాయములు బలకరములై వ్రేళ్ళు పాదుకొనిపోయెను. పతివిహీనయైన సతిని లోకులు పునర్దారగా స్వీకరించుట కాకాల ములో సందేహము లేదు.

"ఉత్సృష్టమామిషం భూమౌ ప్రార్థయంతి యథా ఖగాః
ప్రార్థయంతి జనా స్సర్వే పతిహీనాం తథా స్త్రియమ్"

నన్నయ ఇట్లాంధ్రీకరించినాడు.

"పడినయామిషంబు పక్షులపేక్షించు
నట్లు పురుషహీనయయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతు
రిదియు బాపమనక హీనమతులు."

సంస్కృత భారతమునాటికి పతిహీనయైన స్త్రీని భార్యగా గోరుట జనసామాన్యమునకు తప్పుగా దోచలేదు. కాని నన్నయ కాలములో హీనమతులు మాత్రము పాపమనక యట్టికోరిక గోరుచున్నారని వ్రాయబడుటచే స్త్రీ పునర్వివాహ విషయములో నెట్టి తీవ్రాభిప్రాయ భేదము గల్గెనో గమనించ దగినది.

స్త్రీ పునర్వివాహము :

కురుపాంచాలుర కాలములో స్త్రీలు యుద్ధశీలురుగ కూడ నుండిరని మనకు దెలియవచున్నది. శ్రీకృష్ణుడు ద్వారవతిలో నిర్మించిన దుర్గమందు.

'స్త్రియోఽపి యస్యాం యుధ్యేయుః కిము వృష్ణి మహారథాః'

స్త్రీలే యుద్ధము జేయగలరు. వృష్ణియోధులమాట చెప్పనేల అని అన్నాడు. నన్నయ యీ విషయము నాంధ్రీకరించక పోవుటకు కారణము. అతని నాటికి స్త్రీలు తమ వ్యక్తిత్వమును గోల్పోయి పురుషాధీనులగుటయే యని గుర్తించదగినది.

## ఆంధ్రభారతము రసవత్తరమైన కావ్యము

ఇట్లు ఆంధ్రమహాభారతము సాంఘిక రాజకీయాభిప్రాయములలో మూలముకన్న సంకుచితముగనున్నను కావ్యదృష్టితో చూచినచో సంస్కృత భారతముకన్న మిక్కిలి రసవత్తరమయినదని తెలుగు భారతములోని ప్రతి పుటయు తెల్పుచుండును. భారతమును బలువురు బలుదృష్టులతో చూచిరట.

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని"

నన్నయ కవివృషభుడు గాన నీతడు భారతమును మహా కావ్యమువలె సృష్టింపగల్గెను.

"ఆంధ్ర మహాభారతము సంస్కృత మహాభారతమునుండి కథ మాత్రము గ్రహించి దానికంటె వేయిరెట్లు అధిక మనోహరముగ రచియించిన స్వతంత్ర మహాకావ్యమని చెప్పకతప్పదు. మూలములో లేని అర్థాలంకారములు రసభావములును మానవస్వభావ వర్ణనలును దెలుగు భారతమునం దెచ్చట జూచినను విచ్చలవిడిగా గానవచ్చును. మూలములోని విసుగు పుట్టించెడి యనేక దీర్ఘకథానకములును, వర్ణనలును, వేదాంతఘట్టములును తెలుగునందు లేనేలేవు. ఇట్లు చేయక సంస్కృతములోని 'చ'కు దెనుగునం 'ను' పడ్డదా లేదా యని ఇప్పటి కొందరు కవులవలె జూచుకొనుచు తెనిగించినచో తిక్కన కావ్యము పృథివిలోని యుత్తమకావ్యములలో నొక్కటియైయుండదు."

అని లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిరి. నన్నయకూడ ఈ యుత్తమ పద్ధతినే యవలంబించెను.

పాండురాజు అరణ్యములో తపోవృత్తినుండ నిశ్చయించి కుంతీమాద్రుల హస్తినాపురమునకు పొమ్మనగా వారు ఒడంబడక నీతోనే యుండెదమని చెప్పిరి. ఈ సందర్భములో మూలమందు లేని కొన్ని మాటలు మాత్రము జేర్చి రసవిహీనమై మనుష్య స్వభావమును పూర్తిగా వెల్లడించని వర్ణనమును నన్నయ రసవంతముగ చేసినాడు.

"హస్తిపురంబునకుం జని యందుండుం డనిన వారలు బాష్ప పూరిత నయనలై."

బాష్పపూరిత నయనలైరను రవంత జేర్చుటతో నావర్ణనకు జీవము కల్గినది.

ఇట్లే పాండురాజు మృగమిథునమును జంపుఘట్టములో పాండునకు మృగమునకును జంతువుల జంపవచ్చునా లేదా యని దీర్ఘమును,

నిస్సారమును నైన వివాదము జరుగుచుండ నన్నయ ఈ ఘట్టమును ఎట్లు సొంపుగ జేసినాడో చూడుడు.

"పఱవనోపకయున్న మైమఱచి పెంటి
బెనఁగియున్నను బ్రసవింప మొనసియున్నఁ
దెవులుకొనియున్న మృగముల దివిరి యేయ
రెఱచి యాహారముగ మను నెఱుకులయిన"

ఇట్లు తన దయార్ద్రతను చూపినాడు.

రాజసూయవర్ణన సందర్భమున మూలమునందు రసవంతమైన కవిత్వము బొత్తిగా లేదు. కవి ఎంతసేపును రాజసూయమును జూడ వచ్చిన రాజులు, వారు తెచ్చిన కానుకలమొక్కయు జాబితాలనిచ్చు టతో తృప్తిబొందెను. నన్నయ ఈ జాబితా లన్నిటిని ఓరకుపెట్టి ఏడెనిమిది రసము చిప్పిలు పద్యములతో అదే విషయమును పూర్తి చేసి తన కవిత్వ మహిమను జూపినాడు.

ఉ॥ సాగరసారవారిరుహశౌక్తిక మౌక్తిక విద్రుమద్రుమై
లాగురుచందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణయుక్తిమై బరగు సింహళ కేరళచోళపాండ్యదే
శాగతరాజపుత్రులు మహాగుణశాలి కజాతవైరికిన్.

ఉ॥ మందితసూర్యరశ్మిరుచిమన్మణిహార చయంబుతో గట
స్యందిసుగంధిదానజలసంపద నొప్పెడువాని దేవకీ
నందను డిచ్చెఁ బ్రీతి బదునాలుగువేలు గజంబులన్ జనా
నందనకీర్తియైన యమనాథతనూజున కిష్టమిత్రుఁడై."

ఔచిత్యపోషణము :

ఔచిత్యము ననుసరించి ఆయా పాత్రులచేత మాట్లాడించుటలో నన్నయ తన నేర్పు నెట్లు చూపెనో గనుడు. హిడింబి భీముని పై

తనకుగల మోహమును యుధిష్ఠిరుని సమక్షమున కుంతితో చెప్పెనని మూలములో నున్నది. ఎంత రాక్షసస్త్రీ యయ్యును తన మనోవికార మును పరపురుషుని యెదుట చెప్పనంత సిగ్గులేకుండ నుండునా? కావు ననే యిది యనుచితమని యెంచి కుంతీదేవితో రహస్యమందు తన మనోవికారమును తెల్పెనని నన్నయ వ్రాసినాడు. మూలములో యుధిష్ఠిరుడే హిడింబిని శుభ్రవస్త్రధారివై, భూషణాలంకృతవై భీముని సేవింపుమని చెప్పెనని వ్రాయగా, ఇది చాల మోటుగా నున్న దని అవే మాటలు కుంతినోట నుంచెను. నన్నయ వర్ణననుబట్టి హిడింబి రాక్షసివలె కనబడనే కనబడదు. కేవలము సౌందర్యవతియైన మానవాంగనగా నున్నది.

"వితత బహురత్నరుచి, శోభితభూషణంబులు వెలుంగ బెడగగు నవపుష్పిత జంగమలతక్రియ" ఉన్నదట హిడింబి.

పాత్రపోషణము :

పాత్రపోషణమందు నన్నయచేసిన మార్పులు చాల ప్రశంసార్హములు. ముఖ్యముగ ధృతరాష్ట్ర దుర్యోధనుల పాత్రముల నెట్లు నిర్వహించెనో చూతము. మూలమునందు ధృతరాష్ట్రుడు కూడ దుర్యోధనుని వలెనే దుర్వ్యవసాయచిత్తుడై యుండెను. కొన్నిచోట్ల దుర్జనుడగు దుర్యోధనుడుకూడ ప్రశంసార్హముగ మాట్లాడినాడు. నన్నయ వీరిద్దరిని ఒకే రంగుతో చిత్రింపక ధృతరాష్ట్రుని కొంత సౌమ్యునిగను, దుర్యోధనుడే దుష్టచింతనలకెల్ల నిలయుమనియు దోచునట్లు వ్రాసెను. ధృతరాష్ట్రుని వీలైనంతవరకు దోషరహితునిగా చేయుట కదా నన్నయయొక్క అభిప్రాయము. అందుకొరకై మొదటనే మూలములో లేని పద్యము వ్రాసినాడు. పాండుపుత్రులు తండ్రి మరణానంతరము హస్తినకు రాగా—

ధృతరాష్ట్రుడును

క॥ తనసుతులు పాండుసుతులని
మనమున భేదింప కతిసమంజసభావం
బున నొక్కరూపకాఁ జే
కొనియుండె పాండురాజుకొడుకులఁ బ్రీతిన్."

యుధిష్ఠిరుడు ప్రాప్తయౌవను డైనంతమాత్రమున యౌవ రాజ్యాభిషిక్తుని జేసెనని వ్రాయుటలో నన్నయ అభిప్రాయమేమి? ధృతరాష్ట్రుడు కేవలము నిష్పక్షపాతబుద్ధి యని సూచించుటయే. నిజముగా ప్రజలకు వెరచియు, పాండురాజుయొక్క ప్రజారంజకత్వము తను కెట్టి యపాయము గల్గించునో యని భయపడియు, ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరునకు యౌవరాజ్యమిచ్చెను. యౌవరాజ్యప్రాప్తి చేతను, తమ్ముల బలదర్పముచేతను శోభించు ధర్మరాజును జూచి దుర్యోధనుడు మత్సరగ్రస్తుడయ్యెనని నన్నయ వ్రాసినాడు. కాని మూలమునుబట్టి చూడ ఈ దుశ్చింత మొదట ధృతరాష్ట్రునకే కల్గెను.

"దూషితస్సహసా భావో ధృతరాష్ట్రస్య పాండుషు
స చింతాపరమో రాజా న నిద్రామలభ న్నిశి."

పాండవులయెడ ధృతరాష్ట్రుని యనుబంధము విరిగిపోయెను. అతడు చింతాపరు డగుటచే నిద్ర నెరుంగడు.

ఈ విచారముతోనే యతడు కణికు డనువానిని బిలిపించి కర్తవ్య మేమని యడుగగా నాతడు చాణక్యనీతివంటి నీతిని ధృత రాష్ట్రున కుపదేశించెనని మూలములో కలదు. నన్నయ ఇది మార్చి వేసె కణికుడు తన దుష్టనీతిని దుర్యోధనునకు చెప్పినట్లు వ్రాయుటచే చదువరులకు ధృతరాష్ట్రునందు సద్భావమును, దుర్యోధనునియందు అసహ్యమును కల్గుచున్నవి.

తరువాత తండ్రికుమారు లిరువురును సంప్రదించుకొనిన మీదట ధృతరాష్ట్రుడు పాండవుల నిర్వాసితుల జేయుట కొప్పుకొని మంత్రుల

పిలిపించి వారణావతమును పాండవుల యెదుట పొగడుడని బంచెను. నన్నయ ఈ కార్యము దుర్యోధనునిచే జేయించి ధృతరాష్ట్రుని నిందా రహితునిగ జేసెను. దుర్యోధనుం డప్పుడు

క॥ వలనుగల మంత్రివరులం
బిలిచి పృథానందనులకుఁ బ్రియముగ మీరి
మ్ముల వారణావతంబును
వెలయఁగ బొగడుండు వారు విని తగుల నెడన్."

అప్పుడు ధృతరాష్ట్రుడు పాండవుల రావించి వారణావతంబునకు బోయి కొన్ని దివసంబులుండి రండని ఋజువుగ శాసించినట్లు నన్నయ వ్రాసినాడు. కాని మూలములో నట్లులేదు. ధృతరాష్ట్రుడుకూడ వృద్ధ జంబుకమువంటి మాయగలవాడుగా గన్పట్టును. ధృతరాష్ట్రు డిట్లు చెప్పెను.

"వాతావరణము చాల సుందరమని ప్రజలు పొగడుచున్నారు. మీరును దానినిజూడ కుతూహలపడుచున్నారని విందును. కాని మీకు నిష్టమైనచో కొన్ని దినంబు లందుండి రావచ్చును"

అని వారి కోరికలను ఎదురేగి పూర్తిచేయునట్లు నటించినాడు. కావుననే మూలములో ఈ శ్లోక మున్నది.

"ధృతరాష్ట్రస్య తం కామ మనుబుద్ధ్వా యుధిష్ఠిరః
ఆత్మన శ్చాసహాయత్వాత్ తథేతి ప్రత్యువాచతమ్"

వారణావతమందు పాండవులు లక్కయింట దహింపబడినవారని విని ధృతరాష్ట్రుడు—

"వినాశం పాండుపుత్రాణాం విలలాప సుదుఃఖితః"

మిక్కిలి విచారించెను. నన్నయ అంతటతో తృప్తినొందక
"...దుఃఖితాత్ముఁడై యాధృతరాష్ట్రుఁడా వఱచినట్లఱచెన్
వివిధ ప్రలాపుఁడై"

అని వ్రాసెను. దుర్యోధనుని చిత్తవృత్తిని గూర్చి మూలములో ఏమియు చెప్పబడకున్నను నన్నయ ఇట్లు వ్రాసినాడు.

'క॥ మతిఁ బాండుకుమారుల పం
చత విని దుర్యోధనుండు సంతసపడియెన్
హితుఁడైన పురోచనుపం
చత కెంతయు జాతదుఃఖచంచలుఁ డయ్యెన్.'

ద్యూతఘట్టమునందు ధృతరాష్ట్రుని మాయాశీలత్వ మింకను కనబడును. ద్యూతమువలన మహానష్టము గల్గునని యెరిగియు విదురునితో నిట్లనుచున్నాడు.

"దైవమేవం పరం మన్యే యే నై తదుపపద్యతే."

ఏది రాగలదో అది రాకమానదు. ఎందుచేతనంటే దైవమే బలవత్తరము. కాన నాయాజ్ఞ కొనసాగించి ధర్మజుని జూదమునకై తీసికొనిరమ్ము.

నన్నయ తన భారతములో ధృతరాష్ట్రుడు రానున్న ముప్పును పూర్తిగా నెఱుగనట్లు వర్ణించెను.

'ఉ॥ పుత్రుల కేల భేదమగు భూనుత యేనును నీవు జాహ్నవీ
పుత్త్రుఁడు నుండగా నహితమున్ భయమున్ దొరకొన్నె?'

జూదము జరుగుచుండగా విదురుడు ధృతరాష్ట్రునితో నిట్లనుచున్నాడు.

'దుర్యోధనో గ్లహతే పాండవేన
ప్రియాయసే త్వం జయతీతి తం చ'

జూదమున దుర్యోధనుడు పాండవుల ధన మపహరింపగోరుచున్నాడు. నీవును దానికి సంతసించుచున్నావు.

నన్నయ ధృతరాష్ట్రునికి విరుద్ధమైనట్టి ఇట్టి శ్లోకముల విడిచిపెట్టెను. మఱియు మూలములో

"ధృతరాష్ట్రస్తు సంహృష్టః పర్యపృచ్ఛత్పునఃపునః
కిం జితం కిం జితమితి ?"

'ధృతరాష్ట్రుడు సంతసించి ఇంకేమి జయించినారు, ఇంకేమి జయించినారని అడుగుచున్నాడు.'

నన్నయ ధృతరాష్ట్రుఁ డేమియు నెరుగనట్లు వర్ణించెను: ధృతరాష్ట్రుఁడు "నిదియేమి సభాక్షోభం బెవ్వ రెవ్వ రేవస్తువు లోడ్డి" రని విదురు నడుగుచుండె.

మూలములో దుర్యోధనుడు నన్నయభారతములో గనబడునంత దుర్మార్గుడుగా లేడు. అతడు మత్సరాన్వితు డనుట నిశ్చయము. అయినను క్షత్రియులు పరసంపద సహింపజాలరను నాకాలపుధర్మముల కనుగుణముగ నడుచుకొన్నట్టు మూలములో చెప్పబడినది.

"క్షత్రియస్య మహారాజ జయే వృత్తి స్సమాహితా
పూర్వావా ప్తం హరంత్యన్యే రాజధర్మం హితం విదుః."

తంత్రముచేనేమి తదితరోపాయముచేతనేమి యాతడు పరసంపద హరించదలచినాడు

"నా ప్రాప్య పాండవైశ్వర్యం సంశయో మే భవిష్యతి
అవాప్స్యే వా శ్రియం తాం హి శేష్యే వా నిహతో యుధి"

పాండవుల సంపద జేకొనవలె లేదా యుద్ధమందు చావవలెనన్నాడు.

నన్నయ దుర్యోధనుడు పిరికిపందయైనట్లును, అతనికి హీనపద్ధతులు తప్ప గొప్ప తలంపులు లేనట్లును చిత్రించినాడు.

'క॥ పరమసుఖోపాయంబున
పరసంపద సేకొనంగఁ బడెనేని నరే
శ్వర యంతకంటె మిక్కిలి
పురుషార్థం బెద్దియొండు భూనాథులకున్.'

ఇందులో క్షాత్రభావములు లేవు.

దుర్యోధనుడు కూడ యుధిష్ఠిరునివలె వేదశాస్త్రవిహితక్రమము లైనను నన్నయ పాండవుల యుపనయనాదుల గురించియు వేదాభ్యాసముం గూర్చియు పలుమారు చెప్పియు దుర్యోధనుని గూర్చి చెప్పడు.

ధృతరాష్ట్రు డిట్లనుచున్నాడు.
"అధీతవాన్ కృతీ శాస్త్రే."

నన్నయ పాండవపక్షపాతి యగుటచే కౌరవుల దోషమును తగ్గించు ఘట్టముల వర్ణించడు. వికర్ణుడు ధార్తరాష్ట్రీయుడట. అట్లే సోమదత్త బాహ్లీక వికర్ణులు పునర్ద్యూతము వలదని వారించిరట. గాంధారి దుష్టుడైన దుర్యోధనుని త్యజింపుమని చెప్పినదట.

## శకుని పాత్ర

సంస్కృత భారతములో శకునికూడ దుర్యోధనుని కపటద్యూత విముఖుని గావింప ప్రయత్నించునట్లు గలదు. కాని నన్నయ దానిని మార్చివేసెను. శకునియే దుర్యోధనుని ద్యూతముద్వారా ధర్మరాజు సంపత్తిని కొల్లగొన ప్రేరేపించునట్లు వ్రాసి శకునిని సకల దుర్గుణములకు గనిగా చిత్రించెను. ఎట్టి దుర్మార్గులలోకూడ కొన్ని సద్గుణములుండవచ్చునని చెప్పిన సంస్కృతభారత కృతికర్త పద్ధతికి నన్నయ మెరుగు పెట్టెనో లేదో సహృదయులు నిర్ణయింతురుగాక !

—( * )—

# నన్నయభట్టు—ఆంధ్ర భారత రచన

## రాజరాజు ఆనతికి నన్నయ రంగమును సిద్ధము చేసిన వైనము

శ్రీ కే. యస్. కోదండరామయ్య

తొమ్మిది శతాబ్దాలకు పూర్వము అనగా ఆ యారంభ దినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింత యనరానిదని, ఆచార్య శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు చెప్పియుండునది అక్షరశః సత్యము.

నన్నయసారమతి. విపుల శబ్దశాసనుడు. సంహితాభ్యాసుడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుడు. ఉభయభాషా కావ్య రచనాభిశోభితుడు. లోకజ్ఞుడు. ఇట్టి సర్వతోముఖమైన పాండిత్యముండినవాడై నందుననే రాజరాజు తెనుగులో భారత రచనా కార్యము నతనికే యొప్పగించెను. ఆ మహాకార్యమున కతడన్నివిధముల సమర్థుడు.

ఆ కాలమున తెలుగు భాషలో నెవ్వరును మహాభారతమును వ్రాసియుండలేదు. అందువలన సంస్కృతభాష తెలియని తెనుగువారికి భారతకథ సమగ్రముగా దెలిసియుండలేదు. అంతా గాసట బీసట చదువులే. ఆ గ్రంథము తెలుగులో కావలయునను ఆశ సర్వత్రా ప్రజలలో గాఢముగా నుండెను. ఈ విషయము నన్నయకు బాగుగా దెలియును. రాజరాజునకీ విషయము దెలియు నట్లాతడు జేసెను. ఈ యిరువురి అభిప్రాయముయొక్క ఫలితమే తెనుగులో భారతము.

ఇంతేకాక, అప్పటికీ భారతకథ అరవములోను, కన్నడములోను వ్రాయబడి ఆయా దేశములలో మంచి ప్రచారమందుండెను. అరవభాషలో భారతమున్నదనుట నన్నయకు దెలియును. కాని, ఆ

భాషాపరిచయ మతనికుండెనో లేదో తెలియదు. లేదనియే జెప్ప వచ్చును. కన్నడభాష అతనికి బాగుగా దెలియును. ఆ కన్నడ భారతమునతడు చదివియుండెను. ఆతడు మైసూరు ప్రాంతమున, బాల్యమందు వేదపాఠశాలలో విద్యాభ్యాసము గావించెను. ఆ సమయమున నా ప్రాంతమువాడే యయిన నారాయణభట్టు అనునతడు నన్నయ శిష్యుడై సహాధ్యాయుడుగ నుండెను. ఆ సమయమున వారిరువురు పంప మహాకవి కన్నడములో వ్రాసియుండిన భారతమును జదివియుండిరి. ఆంధ్ర భాషలోగూడ నట్టి గ్రంథముండవలయునను ఆలోచన నన్నయ కానాడే యేర్పడెను. ఆ సంకల్ప మాతని హృదయములో గాఢముగా నెలకొనెను. నారాయణభట్టాతని ఆశయమును బలపరచెను.

పంపమహాకవి ఆంధ్రుడు. అతని జన్మభూమి వేగి మండలము. కాని, అతడు జైనమతము నవలంబించి యుండెను. ఆంధ్ర దేశమున నా కాలమున జైనమతమున కంత ప్రచారము, ప్రోత్సాహముండ లేదు. అందువల్లనే యాతడు జైనుడయిన వేములవాడ చాళుక్య రాజును అరికేసరిని ఆశ్రయించి, ఆతని యాస్థానకవి యయ్యెను. ఆ నృపాలుని కోరిక ననుసరించి కన్నడములో భారతము వ్రాసెను. ఆ గ్రంథము కన్నడ భాషలో నున్నను, సూక్ష్మముగ నా గ్రంథమును పరిశీలించిన పంపకవి తెలుగు హృదయము గోచరించును. పంపకవి తనకు ముందున్న కన్నడ కవులను స్మరించలేదు.

పంపడు తన పోషకుడైన అరికేసరిని భారత మహావీరుడగు అర్జునునితో బోల్చి ఆతని పరాక్రమమును గొప్పగా వర్ణించి యున్నాడు. తెనుగు కవియైనను, కారణాంతరము వలన పంపకవి భారతమును కన్నడములో వ్రాయవలసి వచ్చెను. పంప కవి తన భారతములో సృష్టించిన పాత్రములు మూలగ్రంథమునకు విరుద్ధముగ

నున్నవి. మరియు నాతని భారతములో గాఢమైన జనముద్ర యున్నది. ఇది నన్నయకు సరిపడలేదు. అతడు వ్యాస భారతమున కనుగుణముగ దెనుగున భారతమును వ్రాయదలచెను. ఈ విషయమును గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారిట్లు చెప్పియున్నారు. "పంపడు పరిహారము చేసినది జనధర్మం. వ్యాసభారతముపై పంపడు వేసిన జినముద్ర భట్టారకుని మనస్సునకు శూలమై బాధించినది...

(చూ. కిన్నెర. 1953 పు. 395)

నన్నయగారికి తెలుగుభాషమీద మక్కువ యెక్కువ. తెలుగులో భారతమును వ్రాసి, ఆ పుణ్యకథను తెనుగు ప్రజలకు దెలియ జేయవలయునను సంకల్పము యాతనికి గాఢముగా నుండెను. సంకల్పము మాత్రమే కాదు. అందుల కవసరమైన పాండిత్యము,ఆవేశము మరియు పట్టుదల కూడ నాతనికుండెను. కావున భారత రచనకు పంప మహాకవి రాజానుమతిని బొందినట్లే తెనుగులో వ్రాయుటకు తాను గూడ రాజానుమతిని బొందవలయునను కోరిక నన్నయగారి కుండెను. అందువల్లనే అట్టి మంచి అవకాశమునకై ఓపికతో వేచియుండెను.

ఆ కాలమున గ్రంథరచనకు రాజాశ్రయము, రాజానుమతి మిక్కిలి ఆవశ్యకముగ నుండెను. రాజానుమతి లేక వ్రాయబడిన గ్రంథములకంత గుర్తింపు, ప్రాశస్త్యము మరియు పరిహారము గలుగ కుండెను. రాజపోషణమే కదా అనాడు సకల కళాభివృద్ధికి మూల కారణముగ నుండెను. అందువల్లనే ఆనాటి కవులు రాజాశ్రయమును చేరుచుండిరి. అదృష్టవశమున నన్నయ వేంగి చాళుక్య రాజులకు కులబ్రాహ్మణుడు కాగల మంచి అవకాశము లభించెను. అ కాలమున కర్ణాటాంధ్ర దేశములమధ్య నికట సంబంధ ముండెను. పెక్కు వృత్తుల వారు, కవులు, పండితులు, కళాకారులు, వీరులు మొదలగువారు కర్ణాటక దేశమునుండి ఆంధ్రదేశమునకు వచ్చుచుండిరి. ఇట్లు శ్రీరంగ

పట్టణ ప్రాంతమునుండి వేంగి దేశమునకు వచ్చిన వైదిక బ్రాహ్మణుడు నన్నయభట్టు. ఇతడు రాజరాజు తండ్రియైన విమలాదిత్యుని కాలమందో, లేక అతని అన్నయైన శక్తివర్మ కాలమందో ఆ రాజుల ఆశ్రియమును సంపాదించి, వారికి కులబ్రాహ్మణుడాయెనని చెప్ప వచ్చును. ఉదాహరణమునకు భీమనభట్టు అనునతడు విమలాదిత్యుని ఆస్థాన కవిగ నుండెను. రణస్తిపూడి శాసనము నతడే రచియించెను. అథముగనే నన్నయభట్టు కూడ ఆ రాజునొద్ద కుల బ్రాహ్మణుడుగ నుండెను. ఈ విషయమును గురించి శ్రీ వేంకటావధానిగారిట్లు వ్రాసి యున్నారు 66 కులబ్రాహ్మణ విశేషణమునుబట్టి నన్నయ రాజరాజునకు బితృపితామహ క్రమమున వచ్చిన బ్రాహ్మణుడైన మంత్రి యనియు, వేద వేదాంగవిదుడైన విప్రోత్తముడనియు మాత్రము చెప్పవచ్చును."

విమలాదిత్యుడు పెద్దకాలము రాజ్యమును పాలించలేదు. ఆ కాలమున వేంగి దేశమందుండిన రాజకీయ కల్లోలము కారణముగా నాతడు పెక్కేండ్లు తంజాపురములో నుండవలసి వచ్చెను. చోళచక్ర వర్తియైన మొదటి రాజరాజు కుమార్తెయైన కుందవాంబను పెండ్లి యాడవలసి వచ్చెను. ఆ తమిళరాజుల సహాయమున నాతడు క్రీ. శ. 1011వ సంవత్సరమున వేంగి దేశమునకు పాలకుడాయెను. అయినను, ఆతనికి చిత్తశాంతి యుండలేదు. ఆతడంత సమర్థుడగు రాజు కూడ కాడు. సుమారేడెనిమిది సంవత్సరములెట్లో పాలించి, క్రీ.శ. 1018లో రాజ్యమును కుమారుడైన రాజరాజునకు అప్పగించి తాను తప్పు కొనెను. విమలాదిత్యుడు మొదట శైవుడు. కాని, కడపటి సంవత్సర ములలో జైనదీక్షను బుచ్చుకొని రాజ్యమును త్యాగము చేసెను.

విమలాదిత్యుడు రాజకీయ కారణముల వలన నపుడపుడు చోళదేశమున నుండవలసి వచ్చెను. పెద్దకాలము తమిళ వాతావరణ

మందే యుండెను. గృహములో భార్య తమిళ స్త్రీ. అందువలన నతడు తన మాతృభాషమీద అంతగ శ్రద్ధ గనబరచలేదు. నిలకడగ రాజ్యభారము చేయలేదు. అందువలన నన్నయ, విమలాదిత్యునకు కుల బ్రాహ్మణుడేయయ్యును, భారతమును వ్రాయవలయునను తీవ్రమైన ఆకాంక్ష గలవాడై యుండినను పైన చెప్పియుండు అననుకూల పరిస్థితులలో తన సంకల్పమును నెరవేర్చుకొనలేకపోయెను. అందును, విమలాదిత్యుడు జైన మతము నవలంబించి, విరక్తుడై జైనగురువుల ప్రభావమునకు లోనైనందున, తన హృదయములో భారత రచనా సంకల్పము పరవళ్ళు ద్రొక్కుచుండినను. కాల మనుకూలించనందున తన కోరికను మనస్సులోనే యణచుకొని, మరికొంతకాలము మిన్నకుండవలసి వచ్చెను తండ్రి రాజ్యమేలుచుండినపుడు పసివాడైనను రాజరాజు యువరాజుగ నుండెను. తండ్రియైన విమలాదిత్యుడు జైన మత మవలంబించినను తల్లి కుందవాంబ జైన మతమును చేరక, తన పుట్టింటివారి మతమైన స్మార్తశైవమందే యుండెను. ఇది రాజరాజు జైనమతము నవలంబించుటకు అవకాశము లేక చేసెను. ఈ పరిస్థితి నన్నయ భట్టారకునకెంతో మేలు చేసెను.

క్రీ. శ. 1018-19వ సంవత్సరమున రాజరాజు చాళుక్య రాజ్యాధికారమును జేపట్టెను. మధ్య మధ్య యెన్ని రాజకీయములగు ఆటంకములు వచ్చినను తుదకాతడు క్రీ. శ. 1050వ సంవత్సరమునుండి స్థిరముగా రాజ్యమును పాలించసాగెను. ఆనాటినుండి నన్నయగారి చిరకాల సంకల్పము కార్యరూపమునకు రాదొడగెను. పెక్కేండ్లనుండి మ్రోడుపడియున్న అతని ఆశాలత పసిగా పెరుగజొచ్చెను. ఆంధ్ర భారత రచనకు మంచి యవకాశము లభించెను.

భారత రచనకు నన్నయ రెండు విధములగు రంగములను సిద్ధపరచుకొనవలసి వచ్చెను.

భారత రచనకు రాజానుమతము మిక్కిలి ఆవశ్యకము. ఆ యనుమతి ఎక్కడనో అంతఃపురమున కాదు. ఆ రాజేంద్రుని నిండు కొలువున. ఆ కొలువు కూటమును నన్నయ యిట్లు వర్ణించి యున్నాడు అది సాధారణమైన సభ కాదు. "......అపార శబ్దశాస్త్ర పారగు లైన వైయాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణు లైన పౌరాణికులును, మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులైన మహాకవులును నుండినట్టి మహావిద్వత్సభ. ఇట్టి సభలో విద్వజ్జనుల సమక్షమున, ఆ చాళుక్యరాజు భారత గ్రంథ మును "తెనుగులో రచియింపు మధికధీయుక్తి మెయిన్" అని తనకు ప్రత్యేకముగా నానతీయ వలయును. అట్లు కవిపండిత సభలో ఆజ్ఞలేక తాను వ్రాసుకొన్న యెడల ఆ గ్రంథమునకు గుర్తింపు రాదు. ప్రాముఖ్యముండదు. ప్రచారమునకు రాదు. పండితులట్టి గ్రంథమును పురస్కరించరు. మీదు మిక్కిలి తిరస్కరింతురు. బోద్ధారులు మత్సర గ్రస్తులు కదా? ఆ కాలమున పండితులకు సంస్కృతముపై నుండిన గౌరవము, మోజు తెనుగుమీద నుండలేదు. ఈ కారణములనుబట్టి తెనుగులో గ్రంథరచన జరుగలేదు. అందుచే మహాభారతము వంటి పవిత్రము, మహాయు పంచమవేదమని పరిగణింపబడియున్న గ్రంథము తెనుగులో వ్రాసినయెడల విద్వజ్జనుల యాక్షేపణములకు, హేళనము లకు మేరయుండదు. అందువల్లనే లోకజ్ఞుడైన నన్నయ, రాజరాజు నిండుకొలువులో పండితుల యెదుట రాజాజ్ఞను గడింపవలయునని నిశ్చయించుకొనెను.

నన్నయ భారత రచనకు దనకుగల అర్హతను, పాండిత్యమును గురించి చెప్పుకొనియున్నాడు. ఆతడు తన పాండిత్యమును గొప్పగా జెప్పుకొనక సామాన్యముగనే జెప్పియున్నాడు. ఈ విషయమును కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారిట్లు చక్కగ జెప్పియున్నారు.

"నేను, నేను" అని ఉత్తమపురుషగా ఆత్మవర్ణనము చేసికొనక, ప్రథమ పురుషగా నెవ్వడో త్రోవలో బోవువానిని గురించి చెప్పినట్లు వ్రాసి యున్నాడు..."

(చూ. పట్టాభిషేక సంచిక. పుట. 214)

ఎంత వినయముగ, యెంత అడరువగ దన్నుగురించి జెప్పికొని యున్నాడు.

అట్లుకాక, నన్నయ తన్నుగురించి డంబముగ జెప్పికొని యుండిన యెడల, పండితుల కాతనియెడ అసూయ గలిగియుండును. అసూయ క్రోధమునకు దారితీయును. దానినుండి కష్టములు గలిగి యుండును. వారు కుతంత్రములు పన్ని రాజు ఆనతి కాకుండునట్లు గూడ జేసియుందురేమో ? అందువలన రాజు విద్వత్సభలో కవిపండితుల అనుగ్రహము కూడ అవసరమైయుండెను. అందువల్లనే మానవ స్వభావము నెఱిగియుండిన నన్నయ భట్టారకుడు యెట్టి అననుకూల పరిస్థితుల కెడమీయక "దేవా ! నీ యనుమతంబున విద్వజ్జనుల యను గ్రహంబునంజేసి నానేర్చు విధంబున నీకాచవ్యంబు రచియించెద"నని చెప్పి ఒకవైపు రాజును మరియొకవైపు పండిత బృందమును దృప్తి పరచెను.

తన వంశమున బ్రసిద్ధులై, విమల సద్గుణ శోభితులైన పాండవోత్తముల చరిత్రను, తెలుగున వినవలయునను అభీష్టము రాజ రాజునకు మిక్కుటముగ నుండెను. తానేకాక, తన ప్రజలు సయితమా భారతకథను స్వయముగ జదువుకొనవలయునను ఆకాంక్ష గూడ యాతనికుండెను. తెనుగులో వ్రాసిన తన ప్రజలెల్లరు సంతోషింతురు. ప్రజల తృప్తి, మరియు సంతోషము పాలకులకు మంచి వరమువంటివి. అట్టి భారతమును మహా విద్వాంసుడు, తనయందపార మైన అనురక్తి గలవాడు, అభిమానము గలవాడు, మరియు దన

కులబ్రాహ్మణుడైన నన్నయ వ్రాసినయెడల ఆ రాజునకెంతో ఆనందము. నన్నయకూడ సామాన్యుడుకాడు. చాల చతురుడు. దూరదృష్టిగలవాడు. రాజుకోరినట్లు "కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ దెనుగున" రచియించుటకు సంస్కృతమునందును, తెనుగుభాషయందును మంచి పాండిత్యముండవలయును. ఆ భాషలోనుండిన చాలదు. ఆ రాజసభలో నుండిన దక్కిన పండితులెవ్వరికిని, యీ రెండు భాషలలో సమానమైన పాండిత్యము న్నట్లు దెలియదు. ఆ పండితుల మరియు ఆ కవుల పాండిత్య కవితాశక్తిని మాత్రము వర్ణించెనే కాని, వారికి యుభయ భాషలయందును సమమగు పాండిత్య ముండెనని చెప్పలేదు. కాని, తన్ను గురించి చెప్పునపుడు మాత్రము తాను "ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడ"ని చెప్పుకొనియున్నాడు. తమకెవ్వరికిని తెనుగులో వ్రాయు శక్తి లేనందున, ఇష్టము లేనందున ఆ పండితులకు నన్నయపట్ల అసూయ గలుగలేదు. ఈ కారణమునుబట్టి ఆ చాళుక్య నరపాలుడు భారత రచనాకార్యమునకు నన్నయగారినే నియోగించెనని చెప్ప వచ్చును. దీనినుండి నన్నయభట్టారకుని లోకజ్ఞత, మరియు రాజు యొక్క విచక్షణ చక్కగా దెలియుచున్నది.

భారతమును దెనుగులో వ్రాయుమని నన్నయ భట్టారకునకు చెప్పుటకు రాజరాజునకు గల్గిన సంకల్పము ఆనాటి నిండుసభలో హఠాత్తుగ గల్గినదని చెప్పుటకు వీలుగాదు. ఆ కొలువుకూటమునాటికా సంకల్పము ఆతని మనస్సులో బరిపక్వదశ నందుకొని యుండెనని జెప్ప వచ్చును. ఆ సంకల్పము, ఆ యాసక్తి గలుగుటకు వెనుక నెంతో ప్రయత్నము, ప్రోత్సాహము, కృషి జరిగియుండెననుట నిజము.

తండ్రియైన విమలాదిత్యుడు జైనమతము నవలంబించినను రాజరాజా మతముజోలికి పోక, శైవమతము నవలంబించెను. ఇందులకు

ప్రబలమైన కారణము లేకపోలేదు. ఆతని మాతామహుడు, మేన మామ మరియు తక్కిన తల్లివైపు బంధువు లందరూ శైవులు. తాత యైన మొదటి రాజరాజు పరమశివ భక్తుడేకాక తన రాజధాని నగర మగు తంజాపురములో బ్రహ్మాండమైన శివాలయమును గట్టించెను. ఆ దేవాలయమూ రాజ్యములో ముఖ్యమగు శివభక్తిని ప్రజలలో రేకెత్తించెను.

"రాజరాజా హాడ్ సిన్సియర్ అండ్ డీప్ రూటెడ్ డీవియేషన్ ఇన్ శైవా ఫైత్. ది గ్రేటెస్ట్ మూవ్‌మెంట్ ఆఫ్ హిజ్ రీన్ వాజ్ ది బ్యూటిఫుల్ టెంపుల్ ఆఫ్ రాజరాజేశ్వర; హి కాస్ట్ టు బ్యుల్ట్ అట్ టాంజూర్. దిస్ గ్రాండ్ అండర్ టేకింగ్ మస్ట్ హావ్ క్రియేటెడ్ యాన్ అడ్మిరేషన్ ఫార్ హిమ్ ఇన్ ది మైండ్స్ ఆఫ్ హిజ్ సబ్జెక్ట్స్..."

(వైడ్ మైసూర్ గెజటియర్, వాల్యూం 2. పి.వి. 1971.)

చోళ చక్రవర్తుల ప్రభావ మెక్కువగ నుండినందుననే; రాజ రాజునకు బాల్యమునుండియే శివభక్తి యలవడినదని చెప్పవచ్చును. దీనిని తల్లి శైవమతాభిమానము ధృవపరచినది. రాజరాజు యీ శైవమతాభిమానమునే నన్నయ "జగత్పరి పూజ్యములైన ఈశ్వరా గమములయందు నిల్పితి ప్రకాశముగా హృదయంబు భక్తితోన్" అని చెప్పెను. ఈ శైవము వీరశైవము కాదు. వైదికశైవము. రాజనరేంద్రుని యీ వైదిక శైవ మనస్తత్వము నన్నయగారి కెంతో తోడ్పడెను.

రాజరాజ నరేంద్రునకు భారత శ్రవణాసక్తి భారతమును తెనుగులో వ్రాయించవలయునను గాఢమైన యభిలాష, మనుమార్గ ప్రవర్తనము మొదలగు గుణములెట్లు గలిగెనో, యెవరాతని హృద యమున నీ బీజములునాటి, పెంచి, పరిపక్వ దశకు దెచ్చిరో తెలిసి

కొనవలసియున్నది. దీనికి రాజరాజు జీవిత చరిత్రమును సంగ్రహముగా నైనను దెలిసికొనవలయును.

రాజరాజు జన్మకాలము :

రాజరాజు క్రీ.శ. 1006వ సంవత్సరమున జన్మించియుండెననియు, నిట్లు చెప్పుటకు కారణములు పెక్కుగలవనియు కీ. శే. (శ్రీ) భావరాజు వేంకట కృష్ణారావుగారు వ్రాసియున్నారు.

(చూ. రాజరాజ నరేంద్రుడు. పుట. 94)

కాని, (శ్రీ) నేలటూరి వేంకటరమణయ్యగారు, ఆతడు క్రీ.శ. 995వ సంవత్సరమున బుట్టియుండవలయుననియు, విమలాదిత్యుని పట్టాభిషేకము క్రీ.శ. 1011లో జరిగెననియు, రాజరాజ యువరాజ్యాభిషేకము, ఆతని తండ్రి పట్టాభిషేకముతోబాటు క్రీ.శ. 1011లో నడిచెననియు నప్పటికి రాజనరేంద్రుడు పదునారేండ్ల ప్రాయము గలవాడై యుండెననియు వ్రాసియున్నారు. [చూ. చాళుక్యులు-చోళులు పు. 361]

ఇట్లే యిరువురు సుప్రసిద్ధ చరిత్రకారుల అభిప్రాయములు భిన్నముగ నున్నవి. కావున, వీనిలో దేనిని సమంజస మనవచ్చునో, మఱియు నమ్మవచ్చునో కనుగొనవలయును. మొదట (శ్రీ) రమణయ్యగారి అభిప్రాయమును గురించి ఆలోచింతము. వీరి వ్రాతప్రకారము రాజరాజు తంజాపురమునువీడి తల్లితో రాజమహేంద్రవరము వచ్చునప్పటికి నతడు నవయౌవనమున నడుగిడియుండెను. దీనికితోడుగ నతడు యువరాజుగ చేయబడెను. ఇంతేకాక, ఆతని తండ్రియైన విమలాదిత్యుడు రాజ్యపాలనా కార్యములందంత శ్రద్ధ గలిగియుండలేదని తెలియుచున్నది. ఆతని యీ గుణమును గురించి (శ్రీ) వేంకటరమణయ్యగారిట్లు వ్రాసియున్నారు. "విమలాదిత్య అప్పియర్ టు హావ్ బీన్ ఎ కలర్ లెస్ ప్రిన్స్, శాటిస్ఫైడ్ విత్ ది కండిషన్స్ ఆఫ్ లైఫ్ హీ ఫౌండ్ దెమ్..."

[వైడ్ ది ఈస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి.పు. 216]

ఒకవైపు తండ్రి యీ అనాసక్తి స్వభావ మిట్లుండ మరియొక వైపు దాయాదులు రాజ్యదాహముతో అలజడులు గలిగించుచుండిరి. కావున యువకుడైన రాజరాజు, రాజకీయ వ్యవహారములలో గూడ దగినంత జోక్యము కలిగించుకొనుచుండెనని తెలియుచున్నది. ఆ పిదప కొన్ని సంవత్సరములలోనే మేనమామ కుమార్తెతో వివాహ మాయెను. తల్లి తమిళాంగన. భార్య అంతకంటె తమిళాంగన. ఆమె వెంట వచ్చియుండిన పరివారమంతా తమిళులే. రాణివాసమున చోళ రాజ్య కన్యకలదే ప్రాముఖ్యము. మరియు ప్రాబల్యము. విమలాదిత్యుని కాలమునుండి, రాజాంతఃపురమంతా తమిళమయ మగుచున్నది.

ఇట్టి పరిస్థితిలో యౌవనమందు విషయాసక్తుడుగ, రాజకార్య మగ్నుడుగనుండిన రాజరాజెప్పుడు తెలుగును అభ్యసించుట, సంస్కృతమును నేర్చుకొనుట, సంస్కృతములో నుండిన పురాణములను, ఆగమములను జదువుట. ఆ కాలములో తెలుగులో భారతము లేనందున, సంస్కృతములో రచించిన భారతమునే చదువవలసియుండెను. బాల్యమంతయు తమిళదేశమందే గడచిపోయెను తమిళమునే నేర్చెను. ఆ భాషాగ్రంథములనే చదివెను. దానికి తోడుగ ఆ తమిళ చక్రవర్తుల అంతఃపురములో సుఖభోగాలమధ్య అల్లారుముద్దుగ పెరిగి పెద్దవాడాయెను. కావున, రాజరాజుకు మాతృభాషమీద అంతగా అభిమాన మేర్పడియుండదు. భారతమును తెనుగులో వ్రాయించవలయునను అభిలాష ఆతనికి గలిగియుండదు ఉదాహరణమునకు రాజరాజు కుమారుడైన మొదటి కులోత్తుంగుని విషయమును జెప్పవచ్చును.

కులోత్తుంగుడు మాతామహుని యింట (తంజాపురములో) బుట్టెను అచ్చటనే పెరిగెను. పెద్దవాడాయెను. తమిళభాషనే యభ్య

సించెను. పెద్దవాడైన పిదపగూడ అతనికి తెలుగుభాషమీద, తెలుగు దేశముమీద, తెలుగు ప్రజలమీద అభిమానము గలుగలేదు. తుదకతడు తన స్వంతరాజ్యమును వీడి, అలక్ష్యపరచి, చోళరాజ్యమునకే పాలకుడై తంజావూరియందే యుండెను. తుదకు వేంగిరాజ్యము నశించిపోవుటకు గారణభూతుడాయెను. ఈ చాళుక్య చోళసమ్మేళనమును గురించి శ్రీ భావరాజుగారిట్లు విశదపరచియున్నారు. "...రాజేంద్ర చోడుడు చోళలాంఛనములతో సింహాసనము నధిష్టించి, కులోత్తుంగ చోళదేవుడను నూతన నామమును గైకొనెను. తాను చాళుక్యవంశ సంజాతుడని, సత్యాశ్రయ కులజుడని మఱచెను. తాను చోళుడ నయితినని గర్వించెను... ఆంధ్రదేశ చరిత్రయందు కుబ్జ విష్ణువర్ధనునితో ప్రారంభమైన వేంగి చాళుక్యయుగము రాజరాజుతో పరిసమాప్తి నొందెను. చాళుక్యయుగ మంతరించెను."

[చూ. రాజరాజనరేంద్రుడు. పుట. 184]

శ్రీ భావరాజుగారే మరియొకచోట నీ విషయమును గురించి యిట్లు వ్రాసియున్నారు. రాజరాజు కుమారుడు రాజేంద్ర చోళుడు ఆంధ్రుడేయయినను మాతృభాషను, మాతృభూమిని విడనాడి ఆంధ్ర దేశముపై అభిమానములేక తమిళదేశమునకు రాజ్యకాంక్షచే వలసపోయినాడు... ఈ చాళుక్య చోళసమ్మేళనము చోళుల కత్యంతోపకారియు, వేంగీశులు అనతికాలమున క్షీణించుటకు కారణమునై పరిణమించెను రాజరాజు మరణానంతరము క్రమముగా వేంగిదేశమున చాళుక్యుల ప్రాభవము సన్నగిలిపోయెను.

[చూ. భారతి 1931 సం. 8 పు. 464-465]

ఈ కులోత్తుంగచోళుని గురించి, కీ. శే. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఇలా చెప్పియున్నారు. "...చాళుక్యరాజరాజు కుమారుడగు రాజేంద్రచోళుడు మాత్రము తమిళమునకు బూర్తిగ లొంగిపోయెను.

మేనమామల పలుకుబడి యాతనిపై చెలాయించెను. అతడు తెలుగు వారినుండి వేఱయి తమిళుడయ్యెను. చోళవంశము నుద్ధరించువాడని పేరు వచ్చు కులోత్తుంగచోళ బిరుదమును వహించెను...... కులోత్తుంగచోళుడు తమిళభాష నాదరించి, తమిళ కవులను పోషించి యుండెను..." [చూ. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక పుట.20] శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిట్లు చెప్పియున్నారు. "రాజరాజనరేంద్రుడు చోళుల యల్లుడు. అతని యంతఃపురము అరవ సంప్రదాయము..." [భారతి 1949 నవంబరు.]

ఈ విషయమును గురించి కీ.శే. శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారిట్లు వ్రాసియున్నారు. "...రాజరాజనరేంద్రుని నిర్యాణాంతర వేంగీరాజ్యము చోళరాజ్యమున లయమై ప్రత్యేకతను గోల్పోయినది. రాజరాజనరేంద్రుని పుత్రుడైన కులోత్తుంగచోళదేవుడు ఉభయ రాజ్యములకధిపతియైనను నతడరవలలో గలసిపోయెను. ఆతని అవ్వయు, తల్లియుఁ జోళుల యింటి యాడబడుచులు, చాళుక్యరక్తముకంటె చోళరక్తమే యాతని దేహమున నెక్కువగ బ్రవహించుచుండినది. అతడు పెరిగి పెద్దవాడై విద్యాబుద్ధులు గఱచినది చోళచక్రవర్తి యాస్థానముననే పెండ్లాడినది మేనమామయగు చోళచక్రవర్తి ఇమ్మడి రాజేంద్రదేవుని పుత్రికయగు మధురాంతకదేవినే. కావున నతడు చాళుక్యవంశమునకును, రాజేంద్రదేవుడను జన్మనామమునకును స్వస్తి చెప్పి యరవల గలిసి కులోత్తుంగుడను నామమును ధరించుట సహజమే. ఇతని వంశీయులు సంపూర్ణ ద్రావిడులగుటలో వింతలేదు..." [చూ. పల్లవులు, చాళుక్యులు. పుట 30]

ఈ విషయమునే కీ.శే. శ్రీ కె. నీలకంఠశాస్త్రిగారిట్లు చెప్పియున్నారు. "యాజ్ ఎ రిజల్టాఫ్ సెవరల్ ఇంటర్ మేరేజస్, ఫర్ సమ్ టైమ్ ది మెంబర్స్ ఆఫ్ ది ఈస్టరన్ చాళుక్యా డైనాస్టీ హాజ్

బికమ్ చోళాస్ యట్ హార్ట్ ఫార్ మోర్ దాన్ చాళుక్యాస్."

[వైడ్ ది చోళాస్. పు. 285]

అదృష్టవశమున రాజరాజున కిట్టి దుర్గతి పట్టలేదు. తల్లివంక వారి తమిళభాష రాజరాజు చిత్తమును గరగింపదయ్యె. (మల్లంపల్లి సోమశేఖరశర్మగారు] ఇట్టి విషయములనుబట్టి యాలోచించినయెడల యువరాజు పట్టాభిషేకమునాటికి అతడు యౌవనదశయందుండ లేదని చెప్పవలసియున్నది. అందువలన శ్రీ వేంకట రమణయ్యగారి అభిప్రాయము సరిగాదని చెప్పవలసియున్నది. శ్రీ భావరాజువారే యీ విషయమును చర్చించి, యువరాజుగా పట్టాభిషిక్తుడగునాటికి రాజరాజునకు సుమారు ఆరు సంవత్సరములని తేల్చియున్నారు. అతడు శక 928 కి సరియైన (క్రీ.శ. 1006)వ సంవత్సరమున జన్మించియుండునని చెప్పియున్నారు. [చూ. రాజరాజనరేంద్రుడు. పుట 94] క్రీ.శ. 1011వ సంవత్సరమున నతడు బాలుడుగ నుండెను. భావరాజుగారి అభిప్రాయము సమంజసముగను, నమ్మదగినదిగను నున్నదని చెప్పవచ్చును.

బాల్యమందే రాజరాజు తన నిజరాజ్యమునకు వచ్చి, రాజమహేంద్రవరములో నివసించసాగెను. అందువలన తమిళ వాతావరణమదృశ్యమాయెను. తెలుగుదేశములో, తెలుగురాజధానిలో తెలుగు ప్రజలమధ్య పెరిగి పెద్దవాడగుటకు మంచి యవకాశమేర్పడెను. పసితనమున నాతడు తెలుగుపిల్లలతో ఆటలాడుకొనగలిగెను. నోరారా తెలుగును మాట్లాడగలిగెను.

క్రీ.శ. 1011 నుండి 1019 వరకు ఆతడు రాజమహేంద్రవరములో నుండియే విద్యాభ్యాసము గావించెనని చెప్పవచ్చును. ఆతని విద్యాగురువెవ్వరో మనకు దెలియదు. నన్నయగారు చెప్పలేదు. కాని ఆ విషయమును గురించి ఊహించుటకు అవకాశమున్నదని

నానమ్మకము. ఈ విషయమును ఊహించుటకు నన్నయభారతమున చెప్పియుండు అవతారిక, ఆశ్వాసాది, ఆశ్వాసాంత పద్య గద్యములను పరిశీలించవలసియున్నది. రాజరాజు విద్యావిషయమును గురించి నన్నయ, ఆతడు కుమారవిద్యాధరుడనియు, వివిధాగమ విహిత కర్మ డనియు, విద్యాశ్రీమతత్త్వవిదుడనియు, కావ్యశ్రీతప్రియుడనియు, విద్యావిలాస పార్థివుడనియు సరస్వతీ విలసన్ముఖాంభోజుడనియు వర్ణించియున్నాడు. ఇక యతని వైదికమతాసక్తిని గురించి, యతడు దేవాశీః పరంపరావర్ధితుడనియు, మనుమార్గప్రవర్తకుడనియు, వర్ణాశ్రమధర్మ రక్షకుడనియు వర్ణించియున్నాడు. రాజరాజుకు భారతము పట్ల నుండిన శ్రద్ధను, గౌరవమును, శ్రవణాసక్తిని పలుమార్లు వర్ణించి యున్నాడు. రాజరాజు సద్గుణ గణముల నెన్నిసార్లు వర్ణించినను నన్నయకు దృప్తియుండదు.

రాజరాజు తన విద్యావిషయమును గురించి యిట్లు చెప్పుకొని యున్నాడు.

చం॥ విమల మతింబురాణముల-వింటి ననేకము లర్థ ధర్మ శా
స్త్రముల తెఱంగెఱింగితి ను-దాత్త రసాన్విత కావ్య నాటక
క్రమములు పెక్కు సూచితి జ-గత్పరి పూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి బ్రి-కాశముగా హృదయంబు భక్తితోన్

[చూ. ఆంధ్ర మహాభారతము. ఆ.1. ప.10]

రాజరాజు పురాణములు వినెను. అర్థ ధర్మశాస్త్రముల తెఱంగెఱింగెను. ఉదాత్త రసాన్విత కావ్యనాటకములు పెక్కు చదివెను. ఈశ్వరాగమములయందు భక్తి గలిగియుండెను.

ఈ ప్రసిద్ధ విద్యావిధానము, గుణములు, ఆదర్శపాలకుడు,

ప్రజాహితచింతకుడు, విద్యాపోషకుడు, భగవద్భక్తుడగు రాజరాజునకు యవసరమై యుండెను.

విమలాదిత్యుడు తన కుమారుని విద్యాభ్యాస విషయమును తన కులబ్రాహ్మణుడైన నన్నయగారికి అప్పగించియుండెను. అతడు మరణించిన పిదప, తల్లి కుందవాంబ వైదిక శైవమతావలంబి కావున ఆ యేర్పాటు నట్లే కొనసాగించెనని దృఢముగ జెప్పవచ్చును. కుల బ్రాహ్మణుడు రాచనగరిలో మతకార్యములనే కాక, రాచకుమారుల విద్యాభ్యాసము మొదలగు కార్యములనుకూడ జేయించవలసి యుండెను. రాజరాజు సహజముగ మంచి సంస్కారము, సూక్ష్మబుద్ధి, సౌజన్యము గలవాడు. అందువలన నన్నయగారా బాలుని తన పర్యవేక్షణక్రింద నుంచుకొని, ఆతని విద్యాభ్యాసమునకు దగిన యేర్పాట్లను గావించియుండెను. సూక్ష్మముగా బరిశీలించిన పక్షమున రాజరాజు విద్యాభ్యాసము, నన్నపార్యుని పర్యవేక్షణక్రిందనే జరిగినదని ధైర్యముగా జెప్పవచ్చును. ఆ బాలునకు దగిన విద్యాభ్యాసమును జేయించుటయేకాక, ఆతడు తన తండ్రి మార్గము ననుసరించి జైన మతావలంబికాక, వైదికమతాభిమానిగ జేసెను. ఇంతేకాక, నన్నయ రాజరాజును తన ఆశయమునకు ఆలోచనకు అనుగుణముగా నుండు నట్లు తీర్చిదిద్ది సిద్ధపరచుకొనియుండెనని చెప్పవచ్చును.

నన్నయభట్టారకుడు రాజరాజును సంస్కృతాంధ్రములందు బండితునిగా జేసెను. ఆతనిని "సరస్వతీ విలసన్ముఖాంభోజుడు"గా తీర్చిదిద్దెను.

రాజరాజు విద్యాభ్యాసము రాజమహేంద్రవరమునందే జరిగినదనుటకు మరియొక నిదర్శనము :

రాజరాజనరేంద్రుడు బాల్యమునుండియు తన రాజధానీనగర మందే యుండి, నన్నయగారి పర్యవేక్షణక్రిందనే విద్యాభ్యాసము

గావించెనని వెనుకటి పుటలలో జెప్పియున్నాను. ఇది యదార్థమనుటకీ క్రింది శాసనస్థ విషయము తోడ్పడుచున్నది. ఇది రాజరాజు వేయించిన కలిదిండి తామ్రశాసనము. ఈ శాసనము క్రీ.శ. 1045వ సంవత్సరమున వేయబడినవని చరిత్ర పరిశోధకులు నిశ్చయించియున్నారు.

తండ్రియైన విమలాదిత్యుడు క్రీ.శ. 1011వ సంవత్సరమున వేంగి సింహాసనము నధిష్టించెను. బాలుడుగ నుండిన రాజరాజు వెనువెంటనే తల్లితో రాజమహేంద్రవరమునకు వచ్చెను. ఆనాటినుండి క్రీ శ.1018వ సంవత్సరమున దండ్రి మరణించువరకు యువరాజుగ గూడ నుండెను. తండ్రి మరణానంతరము క్రీ.శ. 1018-19లో నాతడు రాజ్యపాలనమును జేపట్టెను. కాని పట్టాభిషేకము చేసికొనలేకపోయెను. కొంత కాలము మాత్రమే పాలించెను. కాని, బలవంతుడైన ఆతని పినతండ్రి విజయాదిత్యుడు ఆతనిని వెడలగొట్టి రాజ్యము నాక్రమించెను. పశ్చిమ చాళుక్య చక్రవర్తి విజయాదిత్యునకు దోడ్పాటుగా నుండెనని దెలియుచున్నది. వీరు చోళులకు పరమ శత్రువులు. నిజరాజ్యము చేజారిపోయినందున మార్గాంతరములేక రాజరాజు తనకు సహాయము చేయుమని తన మేనమామయైన రాజేంద్రచోళునకు వర్తమానమంపెను. ఆతడును వెంటనే తన సేనాధిపతులైన చోడియవరను మొదలగువారిని సైన్యయుక్తముగా ఆంధ్రదేశమున కంపినట్లు శాసన పరిశోధకులు నిర్ణయించినారు. చోళసైన్యముల సహాయముతో, రాజరాజు విజయాదిత్యుని, మరియు నతనికి సహాయము చేయటకై యేతెంచియుండిన శత్రురాజులను నిర్జించి జయము గాంచెననియు తెలియుచున్నది. విజయాదిత్యుడు ప్రాణభయముతో రణరంగమునుండి పాఱిపోయెనని కూడ తెలియుచున్నది. ఇట్లని శాసనాధారములనుండి తెలియుచున్నది. "అనెదర్ అన్‌డేటెడ్ ఇన్స్క్రిప్షన్ రికార్డ్స్ ది ఫ్లైట్ ఆఫ్ ది వేంగి కింగ్, వెన్ హి హెర్డ్ ది అడ్వాన్స్ అఫ్ దిస్ జనరల్ ఆర్డర్

బై ది చోళా మోనార్క్ ది కింగ్ హు షైడ్ మస్ట్ హావ్ బీన్ విజయాదిత్య..."

[వైడ్. ది చోళాస్. బై. కె.ఎ. నీలకంఠశాస్త్రి, పుట.203]

రాజరాజు దాయాది వర్గమును నిశ్శేషముగా జయించగల్గెనని ఆతని కోరుమిల్లి శాసనమునుండి తెలియుచున్నది. రాజరాజుపై దండెత్తి వచ్చియుండిన శత్రువులు గజసైన్యముతో గూడ వచ్చియుండిరని కలిదిండి శాసనమునుండి తెలియుచున్నది. రాజరాజుతో బోలిన ముఖ్యశత్రువులలో కళింగరాజైన మధుకామార్ణవుడొకడని తెలియుచున్నది. కళింగదేశము యేనుగులకు ప్రసిద్ధి. కళింగరాజులయొద్ద గొప్ప గజసైన్యముండెను. అందువల్లనే వారికి గజపతులను పేరు గలిగినది. రాజరాజు గజసైన్యములనుగూడ జీల్చిచెండాడెనని తెలియుచున్నది

కలిదిండి తామ్రశాసనమును వ్రాసిన పెతనభట్టు, రాజరాజు సైన్యమును వర్ణించుచు, "యస్యాపరగణ్డ భైరవ విభో..."యని చెప్పియున్నాడు. [చూ. పంక్తి 68]

నన్నయ భట్టారకుడు, పై పదమునే తన భారతమున పేర్కొని, రాజరాజును పొగడియున్నాడు.

పరగండ భైరవ వైరి వేదండ గండ విదారి ఘోర తరాసి భాసి భుజార్గళా" [చూ. ఆ. పర్వము-ఆశ్వాసము 2-ప. 208.]

నన్నయగారు పైపద్యమును చెప్పుటయే కాదు. రాజరాజు విరోధుల గజసైన్యమునుగూడ ధ్వంస మొనర్చెనని చెప్పి కలిదిండి యుద్ధమును, రాజరాజు విజయమును గడుచాతుర్యముగ ధ్వనింపజేసి యున్నాడని చెప్పవచ్చును. చోళ దండాధిపతియగు చాళుక్యవరసు వేంగిరాజ్యమును మరల రాజరాజు వశమొనర్చెను. అవల నాతడు విజయాదిత్యునకు సహాయము చేయుటకై వచ్చియుండిన రాజులను

శిక్షించుటకై ఉత్తరమువైపు దండయాత్ర సాగించి, గంగాతీరము వరకు బోయి, ఆ నదీజలములతో వెనుదిరిగి గోదావరిగట్టు చేరెనట. ఈ సమయముననే చోళచక్రవర్తి తన రాజధానినుండి బయలుదేరి గోదావరీతీరమును జేరి, తన దండనాయకుని గలిసికొనెను.

పశ్చిమ చాళుక్యులు చోళులకు ప్రబల శత్రువులు. వారు వేంగిని వశమొనర్చుకొనుటకై నిరంతరము ప్రయత్నించుచుండినందున, రాజరాజు పట్టాభిషేకమింకను జరుగకుండిన దువల్లను, రాజేంద్రచోళు డాలస్యమొనర్చక తన మేనల్లునకు పట్టాభిషేక మొనర్చెను. "రాజేంద్ర చోళా, ఆఫ్టర్ హి మెట్ హిస్ విక్టరీస్ జెనరల్ అన్ హిస్ రిటర్న్ ఫ్రమ్ ది గేన్జ్స ఎనేబుల్డ్ హిస్ నెఫ్యూ రాజరాజనరేంద్ర టు ఫర్ఫార్మ్ హిస్ లాంగ్ డిలేయ్డ్ కారొనేషన్ ఆన్ సిక్స్టీన్త్ ఆగస్టు 1022 అండ్ పర్హాప్స ఆల్సో గేవ్ హిమ్ హిస్ డాటర్ అమ్మంగా ఇన్ మేరేజ్ అట్ ది సేమ్టైమ్..."

[శ్రైడ్. ది చోళాస్. పుట. 210]

రాజరాజు పట్టాభిషేకము క్రీ.శ. 1022వ సంవత్సరము ఆగస్టు నెల 16వ తేదీ గురువారమునాడు జరిగినదని కలిదిండి శాసనమునుండి తెలియుచున్నది. అప్పటికతడు యుక్తవయస్సులో నుండెను. పట్టాభిషేకము జరిగిన వెనుక రాజేంద్రచోళుడు రాజమహేంద్రవరములో కొన్ని దినములుండెనట. అపుడు తన మేనల్లుని సద్గుణ గణములను కీర్తిని విని, సంతసించి, తన కుమార్తెఅయిన అమ్మంగదేవిని ఇయ్యకొని పెండ్లి గావించెనని తెలియుచున్నది. ఈ విషయమును కీ. శే. (శ్రీ) నేలటూరి వేంకటరమణయ్యగారిట్లు చెప్పియున్నారు. "రాజరాజ నరేంద్రుని సుగుణసంపత్తిని విని, సంతసించి రాజేంద్రచోళుడు తన కుమారిక నిచ్చి యాతని కుద్వాహము జేసినట్లే శాసనమున చెప్పబడియున్నది. [చూ. భారతి. 1943. మే. పుట 431]

ఇందు ఇంకను యిట్లు చెప్పబడియున్నది.

"హేవింగ్ హర్డ్ ఆఫ ది గ్రేట్‌నెస్ ఆఫ హిస్ ఫామిలీ, కోర్టసీ, లిబరలిటీ అండ్ ఆనర్ ఆఫ్ రాజరాజా అండ్ బీయింగ్ కంప్లీటీ సాటిస్ఫైడ్ దిస్ కింగ్ ఆఫ చోళాస్, మధురాంతక మేడ్ విత్ అఫక్టస్ హిస్ చేస్ట్ డాటర్ నేమ్డ్ అమ్మాంగ. ది చీఫ క్వీన్ ఆఫ్ ది చాళుక్య ఫేమిలీ." [వైడ్. ది ఈస్టర్న చాళుక్యాస్ ఆఫ వేంగి. పుట. 38.] కలిదిండి శాసనమున నీవిషయ మిట్లు చెప్పబడియున్నది. పంక్తి. 62. "...నశుభ్రిత్వా పరితుష్యవంశ వినయ."

63 త్యాగాభి మానోన్నతిం ప్రజ్ఞా విక్రమ సత్యశౌచ సటుతా శౌయన్ క్షమా ధీన్యసాచాడేశో మధురాన్త.

64 కశ్వతనయా మమ్మంగనామ్నాం సతీం చాలుక్యాభరణస్య చాగ్ర మహిషీం స్నేహేన యస్యాకరోత్."

రాజరాజు పట్టాభిషేకమును, మరియు వివాహమును గురించి కీ. శే. శ్రీ భావరాజుగారిట్లు చెప్పియున్నారు. "అట్టి శత్రువులు దాయాదులను జయించిన పిమ్మటగాని రాజరాజు పట్టాభిషేకమును జేసికొనలేదు. పట్టాభిషేకమునాటికి రాజరాజనరేంద్రుడు పదునారేండ్ల వాడు. పట్టాభిషేకానంతరమే రాజరాజు అమ్మంగదేవి నుద్వాహమయ్యెను. ఆమె మధురాంతక దేవుడని ప్రసిద్ధనామముగల రాజేంద్రచోళదేవుని ప్రియతనయ..." [చూ. రాజరాజనరేంద్రుడు. పు. 103.]

చేతనభట్టు కలిదిండి శాసనములో రాజరాజు గుణములను వర్ణించియుండునట్లే నన్నయభట్టుకూడ నతనిని, "వీరావతారా" నిస్తేజిత వైరివీరా, వీరోగ్రాజి విజయ, చాళుక్య కులతిలక, విమలమతీ, కృపారసబంధుర" అని యెంతో చక్కగ తనివితీర రాజరాజు గుణగణములను భారతమున వర్ణించియున్నాడు. ఆలోచించి చూచిన పక్షమున నతని కట్టి గుణము లుండెననియు, అందువల్లనే ఆకవి ప్రముఖు

అంతగా వర్ణించియున్నాడనియు, ఆ రాజన్యునకు లేని గుణములను నన్నయ చెప్పలేదనియు తలంచవలసియున్నది.

ఇచ్చట ముఖ్యముగ గమనింపవలసినదియు, ప్రస్తుత కథనమున కుపకరించునదియునగు నొక విషయమున్నది. అది కలిదిండి శాసనము లోని పైన పేర్కొనబడిన "నశ్రుత్వా" అనగా 'విని' అను పదము, అనగా రాజేంద్రుడు రాజరాజనరేంద్రుని గుణములను విని తృప్తి జెంది తన కుమార్తె నతని కొసగి పెండ్లి గావించెనని యర్థము. ఇట్లాతడు విన్నది రాజరాజుకు పట్టాభిషేకమయిన పిదప అనగా క్రీ.శ. 1022 ఆగస్టు 16వ తేదీకి పిదపనే యనియు, అంతకుముందా రాజరాజు గుణసంపత్తి యతనికి దెలియదనియు విశదమగుచున్నది. తల్లి అక్క గారైన కుందవాంబకు మగపిల్లవాడు జన్మించినను యాతనికి దెలియును. ఆతడు తంజాపురమందే జన్మించెను. ఆ బాలుడు సుమారైదారేండ్లు వయస్సుగలవాడుగ నుండినపుడే చోళదేశమును వదలి రాజమహేంద్ర వరము జేరెను. ఆవల నాతని విషయమును గురించి రాజేంద్రచోళునకు దెలియలేదు. అందువల్లనే పట్టాభిషేకమును గురించి రాజమహేంద్ర వరములో గొన్ని దినములుండినపుడా చోళరాజా రాకుమారుని సుగుణ సంపత్తిని వినెను. బేతనభట్టు, నన్నయభట్టు మొదలగువారు యువకుని గురించి చెప్పియుంటారు. ఇంతేకాక కుందవాంబ పాత చుట్టరికమును వదలవద్దని చెప్పియుంటుంది. రాజరాజును గురించి యితరులనుండి వినుటయే కాక, రాజేంద్రుడు స్వయముగ నవయౌవన విలసితుడు, సుగుణాభిరాముడు నగు తన మేనల్లుని కనులార గాంచెను. కావున, తన కుమార్తె నొసంగి వివాహ మొనర్చెను. రాజేంద్రుడీ వివాహ మును నిశ్చయించుటకు మరియొక ప్రబలమైన కారణముగూడ గలదు. ఈ విషయమును కీ. శే. శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారిట్లు విశదపరచియున్నారు. అన్నిటికంటెను ముఖ్యమైన కారణము రాజేంద్ర

చోళుని సామ్రాజ్యకాంక్ష. పూర్వచాళుక్యులను, పాశ్చాత్య చాళుక్యులవంకకు మొగ్గనీయక దన పక్షముననే నిల్పుకొనుట..." [చూ. భారతి. పై సంచిక. ఇదియొక రాజకీయ వివాహము. పు. 332.]

కారణ మేదియైనప్పటికిని, రాజేంద్రచోళుడు తన మేనల్లుని గుణసంపత్తిని విన్నది, మరియు నాతని కన్నది రాజమహేంద్రవరమునకు వచ్చిన పిదపనే. ఈ చోళచక్రవర్తి క్రీ.శ. 1012వ సంవత్సరము జూలై ఏడవ తేది చోళసింహాసనమునకు వచ్చెను. ఆవల మొట్టమొదట సారిగ క్రీ.శ. 1022వ సంవత్సరము ఆగస్టు 16వ తేదీన రాజమహేంద్రవరమునకు వచ్చి తన మేనల్లుని గురించి వినెను. చూచెను. దీనినిబట్టి రాజేంద్రచోళుడు సుమారు 10–11 సంవత్సరముల కాలములో తన మేనల్లుని చూడలేదని తెలియుచున్నది. ఈ పదునొకండు సంవత్సరముల కాలములో రాజరాజు తెలుగు రాజధానియందే యుండి విద్యనేర్చెనని స్పష్టముగా తెలియుచున్నది. ఒకవేళ రాజరాజనరేంద్రుడు తన మేనమామయింటికి మధ్యకాలములో నొకటి లేక రెండుసారులు పోయి వచ్చియుండిన పక్షమున కలిదిండి శాసనకర్త "నశ్రుత్వా" యని క్రీ.శ. 1022వ సంవత్సరమున చెప్పవలసియున్నది.

**రాజేంద్రచోళుడు రాజరాజును చూడకుండుటకు కారణము :**

రాజేంద్రచోళుడు సింహాసనమునకు వచ్చినప్పటినుండి యెడతెగని యుద్ధకార్యములందే నిమగ్నుడై యుండెనని తెలియుచున్నది ఈ విషయమును కీ. శే. (శ్రీ) కే. ఏ. నీలకంఠశాస్త్రిగారిట్లు విశదపరచియున్నారు.

"విలెర్లి అప్ టు ది థర్డ్ ఇయర్ ఆఫ్ హిజ్ రీయిన్ హి హేడ్ కాంక్వర్డ్ ఇడితురైనాడు, బనవాసె (వనవాసి)...కొత్తిప్పాక్కై అండ్ మన్నైక్కడక్కన్. ది కాన్క్వెస్ట్ ఆఫ్ ది హోల్ ఆఫ్ ఇలమండేమ్ (సిలోన్) ఈజ్ ది నెక్ట్స్ అచీవ్‌మెంట్... వి మే బి. ష్యూర్ దెట్ ది వార్. అగెన్స్ట్ ది సిలోన్ వాజ్ అండర్‌టేకన్ ఇన్

ది ఫిఫ్త్ ఇయర్ ఏ. డి. 1017-18... ఇది సిక్స్త్ ఇయర్ ఏ.డి. 1018, రాజేంద్ర సీజ్డ్ ది హేర్‌లూమ్ ఆఫ్ ది కేరళా మానార్క్.

[వైడ్. ది చోళాస్. పి.పి. 199, 200]

ఇట్లు రాజేంద్రచోళుడు సింహాసనమునకు వచ్చినప్పటినుండి 1018-19 వరకు యుద్ధములు చేయుటయందే గడిపెను. క్రీ.శ. 1920లో రాజరాజు రాజ్యమును పోగొట్టుకొని తన్ను సహాయము వేడగా, తన దండనాథుడైన చోళయవఅనును వేంగిరాజ్యమునకు బంపెను. పిదప క్రీ.శ. 1022వ సంవత్సరమున రాజరాజు స్వయముగా రాజమహేంద్ర వరమునకు వచ్చి అల్లునకు పట్టాభిషేకము చేయుటయేకాక పిల్లనిచ్చి పెండ్లిచేసెను. ఇట్లు రాజేంద్రుడు యీ పెద్దకాలము తన యల్లుని చూడలేదని తెలియుచున్నది.

కావున రాజరాజనరేంద్రుడు క్రీ.శ. 1011వ సంసత్సరమునుండి 1022 వరకు తన తెలుగు రాజధానియందే యుండి, నన్నయగారి పర్య వేక్షణక్రింద విద్యాబుద్ధులు నేర్చెనని దృఢముగా జెప్పవచ్చును, మరియు నమ్మవచ్చును.

రాజరాజు పట్టాభిషేకము శ 944 సింహ భాద్రపద 2 గురు వారము (క్రీ.శ. 16-8-1022) నాడు రాజమహేంద్రవరములో చోళ సామ్రాజ్య చక్రవర్తి సమక్షమున నెంతో వైభవముగ జరిగెను. రాజురాజు పట్టాభిషేకము సంప్రదాయానుసారముగ జరుగవలసిన వైదిక క్రియలన్నింటిని బేతనభట్టు సహాయముతో నన్నయభట్టార కుడు కులబ్రాహ్మణుడు గావున శాస్త్రోక్తముగాను, జక్కగాను వైభ వముగాను జరిపించెనని చెప్పవచ్చును. చోళ దండనాథుడు దెచ్చి యుండిన పవిత్ర గంగాసలిలముతోను, గోదావరి తెలుగు జలముల తోను నన్నయ రాజరాజును అభిషేకించి, రత్నాభరణభూషితుని జేసి ప్రాజ్య వేంగీ చాళుక్య భవ్య సింహాసనముపై గూర్చుండబెట్టి చోళ

సార్వభౌముడు రాజరాజు మస్తకమున కిరీటమునలంకరించగా నన్నయ పట్టాభిషేకోత్సవమును విజృంభణముగా జరిపించెనని చెప్పవచ్చును. తన ప్రియశిష్యుడు, తనయందనన్యమైన భక్తితాత్పరములు గలవాడు, చాళుక్యవంశ శిఖామణి, రాజమనోహరుడు, సరస్వతీ విలసన్ముఖాంభోజుడు, నవయౌవన విలసితుడగు రాజరాజు సింహాసనము నలంకరించియుండగా జూచి, నన్నయ యెనలేని సంతోషమును బొంది యుంటాడు. ఇట్లు నన్నయ రాజరాజును విద్యావినయ సంపన్నునిగను జేయుటయేకాక పట్టాభిషిక్తునిగగూడ జేసెను.

రాజరాజు కడు బాల్యమునుండియు తెలుగుదేశమున తెలుగు రాజధానిలో, తెలుగు పిల్లవాండ్రతో నాటలాడి పెరిగి పెద్దవాడై తెలుగు పెద్దల పరిచయమును గడించి, తెలుగు మరియు సంస్కృత పండితుల, కవుల మధ్య మెలగి, తెలుగు సాహిత్యపు లోతుపాతులను గ్రహించి, తెలుగు పలుకుల నిసర్గ మాధుర్యమును గ్రోలి ఆనందించి నందునే, తన కొఱకు, తన ప్రజలకొరకు పంచమ వేదమనబడిన వ్యాస భారతమును, నన్నయగారిచే దెనుగున వ్రాయించెను. నన్నయవంటి రసజ్ఞుడు, సమయజ్ఞుడగు మహాకవి రాజరాజునకు గురువుగా, రక్షకుడుగా లభించుట, మహాసంస్కారవంతుడు, గుణవంతుడు, చతురుడు నగు రాజరాజువంటి రాకుమారుడు శిష్యుడుగా నన్నయగారికి లభించుట దైవవిలాసము, తెలుగు ప్రజల తరతరాల పుణ్యముల పంట.

ఇచ్చట ఒక ముఖ్యవిషయమును గురించి చెప్పవలసియున్నది. అది రాజరాజు పట్టాభిషేకమును గురించినది. ఆ పట్టాభిషేక మెవ్వరు చేసిరను విషయమున చరిత్రకారులలో అభిప్రాయభేదము లున్నవి. కీ. శే. శ్రీ నీలకంఠశాస్త్రిగారు రాజేంద్రచోళుడు స్వయముగా రాజమహేంద్రవరమందుండి పట్టాభిషేకము జేయించెనని చెప్పియున్నారు. ఈ విషయము నిదివరకే వెనుకటి పుటలలో చెప్పియున్నాను. కీ. శ. శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగారు సయితమీ యభిప్రాయమునే

గలిగియున్నారు. వీరిట్లు చెప్పియున్నారు. "విమలాదిత్యుని మరణానంతరము రాజరాజనరేంద్రుని వశ్యమైన సింహాసనము నధిష్ఠింపనీయక నడ్డుపడిన ప్రతిపక్షి యెవ్వడో రాజ్యము నాక్రమించుకొన్నది నిశ్చయము. చోళసైన్యములు వచ్చి వాని నోడించి తఱుమువరకు రాజరాజనరేంద్రునకు రాజ్యము స్వాధీనము గాదాయెను...చోళియ వరసు దేశమును వశపరచుకొనిన పిమ్మట రాజేంద్రచోళ చక్రవర్తి స్వయముగ రాజమహేంద్రవరము ననుసరించి శ. 944. సింహ. బ. 2 గురువారమునాడు రాజరాజనరేంద్రుని పట్టాభిషేక మహోత్సవమును గావించెను. రాజరాజు సుగుణసంపత్తిని విని, సంతసించి రాజేంద్రచోళుడు, తన కుమారితని నిచ్చి, యాతని కుద్వాహము జేసెను...

[చూ. పల్లవులు-చాళుక్యులు. పు. 381.]

ఇంత వ్రాసి, శ్రీ రమణయ్యగారు తమ పైయభిప్రాయమును మరల నిట్లు చెప్పియున్నారు. "తమ మేనల్లుడగు రాజరాజనరేంద్రుని వేంగీ రాజ్యమున బునఃప్రతిష్ఠ సేయుటకు రాజేంద్రచోళుడు 943 లో నొక సైన్యమును చోళియవరసుని యాధిపత్యము క్రింద పంపియుండుట చేతను, రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము రాజేంద్రచోళుని గోదావర్యాగమన కాలమున నడచియుండుటచేతను, రాజేంద్రచోళుడు రాజరాజును వేంగీరాజ్యమున కభిషిక్తునిగ జేయుటకే గోదావరీతీరమునకు, అనగా రాజమహేంద్రపురమునకు బయనము జేసెననుట యొప్పను..."

[చూ. పై గ్రంథము-అధోజ్ఞప్తిక]

కాని, శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారీ విషయము భిన్నాభిప్రాయమును గలిగియున్నారు. వారు రెండు అభిప్రాయములను వ్యక్తపరచియున్నారు. 1) రాజరాజు శత్రువులను తానొక్కడే జయించెననియు బిమ్మట పట్టాభిషేకము జేసికొనెననియు, రాజేంద్రచోళుడు వచ్చి పట్టాభిషేకము చేయలేదనియు 2) పట్టాభిషేకము

జరిగిన పిదప రాజరాజు సుగుణసంపత్తిని 'విని' రాజేంద్రచోళుడు అతనికి కుమార్తెనిచ్చి పెండ్లి గావించెను. వారిట్లు చెప్పియున్నారు. "దాయాదులను జయించిన పిమ్మటగాని, రాజరాజు పట్టాభిషేకమును చేసికొనలేదు... పట్టాభిషేకానంతరమే రాజరాజు అమ్మంగదేవి నుద్వాహ మయ్యెను. ఆమె మధురాంతకదేవుడని ప్రసిద్ధనామముగల రాజేంద్రచోళదేవుని ప్రియతనయ ఆ వివాహము క్రీ.శ. 944వ సంవత్సర మాఘఫాల్గుణములందు [క్రీ.శ. 1023 ఫిబ్రవరి] జగిరినట్లూహింపవచ్చును. పేతనభట్టు తన యేలిక వివాహమును అర్థగాంభీర్యము గల మాటలతో తెలిపియున్నాడు. రాజరాజు రాజ్యాభిషిక్తుడయినాడని 'విని' యాతని ఉన్నతవంశ వినయ త్యాగాది గుణములను గాంచి, సుహృష్టుడయి, స్నేహముతో నా చాళుక్యాభరణునకు తన కుమార్తె అమ్మంగదేవి నిచ్చి పెండ్లిజేసి, అగ్రమహిషిని జేసెనని పేతనభట్టు వ్రాసిన దానియందు, రాజేంద్రచోళుడు స్వయముగా నేతెంచి, తన మేనల్లుని దుర్బలునొకనిని, నిస్సహాయుని వేంగీ సింహాసనముపై గూర్చుండబెట్టినట్లు స్ఫురించుటలేదు. రాజేంద్రచోళుడు రాజరాజు సహాయముకొఱకు సేనలు పంపినట్లు చోళశాసనములందు ధ్వనిగూడ లేదు. కాని, సేనాసహాయము జేసియుండుననుట సంశయింపనక్కఱలేదు. కాని, వేంగి సామ్రాజ్యమును సమరాంగణమున రాజరాజు పలు విక్రమ శౌర్య సహాయములతో, స్వబలముతో జయించికొనినాడనుట నిస్సంశయము... రాజేంద్రచోళుడు అమ్మంగదేవి నుద్వాహము గావించు తలంపుతో రాజమహేంద్రవరమున నిలిచియుండును. ఆ వివాహము జరుగునాటికి చోళదండనాథులు కులూతొట్టల కళింగాధిపతులను జయించి భాగీరథీ జలములను గొని వచ్చిరి...

[చూ. రాజరాజనరేంద్రుడు. పు. ]

శ్రీ భావరాజుగారి యీ రెండు యభిప్రాయములను గురించి

కొంత బరిశీలించవలసియున్నది. ముందు మొదటి యభిప్రాయమును బరిశీలింతము. రాజరాజను సింహాసనమునుండి వెడలుగొట్టి దాని నాక్రమించు కొన్నవాడాతని దాయాదియైన విజయాదిత్యుడు. ఇతనికి బశ్చిమ చాళుక్యులు, ఉత్కల మరియు కళింగదేశపు రాజులు దమ దమ సైన్యములతో దోడ్పడిరి. అంతటి గొప్ప శత్రుసైన్యములను యువకుడైన రాజరాజొక్కడే యెదిరించి ఓడించె ననుట యెంత మాత్రము విశ్వాసార్హమైనది కాదు. అంతటి బలపరాక్రమములే రాజరాజున కుండినయెడల నాతడు చోళుల సహాయమును కోరవలసిన అవసర మేర్పడియుండదు

కావున, చోళసైన్యముల సహాయముతోనే యాతడు శత్రువులను నిర్జించెననుటను అంగీకరింపక తప్పదు. తమ కెంత యిష్టము లేకున్నను. శ్రీ భావరాజుగారే తుదకు "రాజేంద్రచోళుడు రాజరాజు సహాయముకొఱకు సేనలనంపినట్లు చోళశాసనములందు ధ్వని గూడ లేదు. కాని, సేనాసహాయము జేసియుండె ననుటను సంశయింప బనిలేదు" అని చెప్పియున్నారు. కావున బ్రహ్మాండమైన చోళసైన్యముల సహాయముతో రాజరాజు శత్రువులను జయించినది నిజమనుట ఋజువగుచున్నది.

ఈ విషయమును గురించి కీ.శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారిట్లు వ్రాసియున్నారు. "రాజరాజు పట్టాభిషేకమునకు బూర్వము పెక్కు వైరులతో యుద్ధములు జేసినట్లును, ఆ యుద్ధములందు రాజరాజే జయమొందినట్లు భారతము నధ్యయనము జేసిన గాననగును.

ఏలయన నన్నయభట్లు బ్రయోగించిన సంబోధనముల వలన దెలియగలదు. వీనినిబట్టి రాజరాజునకు విరోధులైన భూనాథులు పెక్కుమంది యుండిరనియు, వారినెల్లర నీతడు జయించెననియు దేటపడగలదు కాని, ఇందులకు శాసన ప్రమాణము గానరాదు."

[చూ. పట్టాభిషేక సంచిక. పుట. 21]

కావున, రాజరాజు చోళసైన్యముల దోడ్పాటుతోనే శత్రువులను జయించెనని స్పష్టముగా దేలినది. చోళసైన్యాధిపతియైన చోటియ వరను తోడ్పాటుతో రాజరాజు పట్టాభిషేకము గావించుకొనెనని నిస్సందేహముగా జెప్పవచ్చును. ఇట్లు మొదటి విషయము తెలిసినది.

ఇక భావరాజుగారి రెండవ యభిప్రాయమును బరిశీలింతము. రాజేంద్రచోళుడు దానే స్వయముగా రాజమహేంద్రవరమునకు వచ్చి రాజరాజునకు పట్టాభిషేకము చేసినది నిజము కాదనుట. ఇంతవరకు పైపంక్తులలో విశదపఱచిన అంశములనుండి, చోళదండనాయకుని సహాయముతోనే రాజరాజు పట్టాభిషేకము జరిగినదని తేలినందున, అది రాజేంద్రచోళుడు వచ్చి స్వయముగా జేసినది కాదని విశదమైనది. ఆ సమయమున నాతడు తన రాజధానియైన తంజాపురమునందే యుండెను. ఈ విషయమును గురించి శ్రీ భావరాజుగారు మరియొకసారి యిటనిట్లు జెప్పినారు. "తిరువాలంగాడు, తిరుమల శాసనముల నెంత పరిశీలించినను, రాజేంద్రచోళుడు తన మేనల్లునకు, రాజమహేంద్రవరమున స్వయముగా పట్టాభిషేకము జరిపించుటకు బోయియుండినట్లూహించుటకు యవకాశము గానిపింపదు. తన దండనాయకుని వీరకృత్యమును రాజేంద్రచోళుడు తన కృత్యములుగా బ్రకటించుకొని యుండును. అందసంగతమేమియును లేదు.

[చూ. భారతి. 1949 అక్టోబరు]

కావున కీ. శే. శ్రీ నీలకంఠశాస్త్రిగారు మరియు శ్రీ నేలటూరి వేంకట రమణయ్యగార్ల యభిప్రాయములకంటెను, భావరాజుగారి యభిప్రాయమే సమంజసముగాను, విశ్వాసార్హముగాను నున్నదని జెప్పవచ్చును.

రాజరాజనరేంద్రుని పట్టాభిషేకము ముగిసిన బిదప చోటియ వరను తంజాపురమునకే మరలిపోయెను. ఆ నగరమున జేరిన పిదప

రాజేంద్రచోళ చక్రవర్తిని సందర్శించి, రాజరాజు పట్టాభిషేకమును గురించియు, ఆతని సద్గుణగణములను గురించియు జెప్పియుంటాడు. అతడు చెప్పగా 'విని' ఆ చోళచక్రవర్తి సంతసించి, రాజరాజునకు కుమార్తె నిచ్చుటకు నిశ్చయించుకొనియుంటాడు. అది యిట్లు జరిగి యుండుటయే సమంజసముగ నున్నది. అట్లుకాక, రాజేంద్రచోళుడు స్వయముగా రాజమహేంద్రవరమునకు వచ్చి రాజరాజునకు బట్టాభిషేకము జేసియుండిన పక్షమున, రాజరాజును గురించి చోళియవరసు చెప్పవలసిన యవసర ముండియుండదు. సమస్తమును నాతడు స్వయముగా గాంచి తెలిసికొని యుంటాడు. ఇట్లయియుండిన యెడల కలిదిండి శాసన రచయిత "సశృత్వా"యని చెప్పియుండడు. చెప్పియుండినను నది యర్థరహితమై, చారిత్రక సంభవమునకు విరుద్ధముగా నుండును. కాని, ఆ పండితుడు రాజరాజు పట్టాభిషేకమును, ఆనాటి పరిస్థితులను స్వయముగా జూచినవాడు గావున, యున్నదున్నట్లు జెప్పియున్నాడు. దీనినుండి రాజరాజుయొక్క ముఖ్య జీవిత ఘట్టమును దెలిసి కొనుటకు వీలైనది. ఇట్లు యదార్థ విషయమును జెప్పి చేతనభట్టు మనకు మహోపకార మొనర్చినాడు.

చోళియవరసు రాజమహేంద్రవరము నుండి తంజాపురమును జేరుటకు, చోళ చక్రవర్తి పెండ్లిని నిశ్చయించుకొనుటకు, తన కుటుంబముతోనూ, పరివారముతోనూ, తగిన వస్తు వాహనములతోనూ తన రాజధాని నుండి బయలుదేరి రాజమహేంద్రవరమును జేరుటకు రాజేంద్రునకు కొన్ని నెలలు పట్టియుంటుంది. (శ్రీ) భావరాజుగారు అమ్మంగదేవి వివాహము శ. 944వ సంవత్సరము మాఘ ఫాల్గుణములందు (క్రీ. శ. 1023, ఫిబ్రవరి యందు) జరిగియుండునని చెప్పియున్నారు. క్రీ.శ. 1022 ఆగస్టు 16వ తేదీ రాజరాజు పట్టాభిషేకము జరిగినది. ఆవల యించుమించుగ ఆరు నెలలకు అమ్మంగదేవి వివాహము జరిగినది. ఇట్లు జరిగియుండుట సమంజసముగానే యున్నది.

పై కలిదిండి శాసనములోని 'సశ్రుత్వా' అను పదము నుండి రాజేంద్రచోళుడు సింహాసనాసీనుడైన క్రీ. శ. 1012వ సంవత్సరము నుండి క్రీ.శ. 1022 వరకు తన మేనల్లుని చూడలేదనియు, నాతడును తన మేనమామను జూచియుండలేదనియు స్పష్టముగా నిరూపితమైనది. ఈ 10-11 సంవత్సరముల కాలములో, రాజరాజ నరేంద్రుడు తన రాజధానియందే యుండి నన్నయగారి పర్యవేక్షణ క్రింద విద్యాభ్యాసము గావించి, తెలుగు రాజుగా రూపొందెననుట నిక్కము.

ఇది యొక కడు సూక్ష్మమైన విషయము. పాఠక మహాశయులు కొంత ఓపికతోనూ, భావనా బలముతోనూ జదివిన పక్షమున విషయము బాగుగా గ్రాహ్యమగును. మరియు నెంతో సంతోషము గూడ గలుగును.

రాజరాజు పట్టభద్రుడైనను, నెమ్మదిగా నుండుటకు వీలుగాదు. దాయాదియగు విజయాదిత్యుడు బశ్చిమ చాళుక్యులు, కళింగరాజులు మొదలగువారి తోడ్పాటుతో తఱచుగా అలజడులు గలిగించుచుండెను. అందువలన రాజ్యాధికార మెప్పుడు చేజారిపోవునో యను భీతి యాతని మనస్సును కలవర బెట్టుచుండెను. మాటమాటికిని చోళుల తోడ్పాటును గోరుచుండుట, వారిపై యాధారపడి యుండుట మొదలగు కారణముల వలన నాతడు నిర్భయముగ, రాజధానిలో నుండి పరిపాలనా కార్యములను నిర్వహించుటకును, తనకతి ప్రియమైన విద్వత్సభా కార్యములందు ప్రొద్దుపుచ్చుటకును యవకాశము లభించ లేదు. రాజరాజు పట్టాభిషేకానంతర పరిస్థితిని శ్రీ నీలకంఠశాస్త్రి గారిట్లు చెప్పియున్నారు.

"బట్ రాజరాజా వాజ్ సెల్‌దమ్ ఫ్రీ ఫ్రమ్ ట్రబుల్... హౌస్ హిజ్ బ్రదర్ విజయాదిత్య దో వాంక్విష్డ్ ఇన్ ఫైట్, నెవర్ గేవ్ అండ్ హిజ్ డిజైన్స్ అపాన్ ది త్రోన్ అండ్ వాజ్ అన్-

సీజింగ్ ఇన్ హిస్ ఎఫర్ట్స్ టు బ్రింగ్ అబౌట్ హిజ్ డౌన్ ఫాల్ విల్ ది ఎయిడ్ ఆఫ్ ది వెస్టర్న్ చాళుక్యాస్...

(వైడ్. ది చోళాస్, పుట 210)

రాజరాజట్టి దుర్భర పరిస్థితులలో నుండినందున, నన్నయభట్టు మరికొంత కాలము మిన్నకుండవలసి వచ్చెను. దేనికిని కాలము కలసి రావలయును గదా!

తుదకు రాజరాజు చోళులతోడి రాజకీయ సంబంధమును వీడి పశ్చిమ చాళుక్యుల నాశ్రయించి, వారికి సామంతుడుగ నేర్పడెను. ఆ చక్రవర్తుల కొన్ని బిరుదములను గూడ తానుంచుకొనెను. ఆ సమయమున చాళుక్యులు చోళులకంటెను బలశాలురగను, ప్రతాపవంతులుగను నుండిరని ఆనాటి శాసనముల నుండి తెలియుచున్నది. ఈ విషయము చోళుల చరిత్రము నుండి కూడ తెలియుచున్నవి.

"...ఇన్ ఫ్యాక్ట్ ఇట్ వుడ్ సీమ్ దెట్ వెరిషూన్ రాజరాజ హాడ్ టు గివ్ అఫ్ హిజ్ డిపెండెన్స్ ఆన్ చోళా సపోర్ట్ అండ్ రీచ్ యాన్ అండర్‌స్టాండింగ్ విత్ సోమేశ్వర..."

(వైడ్. ఇబిడ్. )

ఈ విషయమును శ్రీమాన్ ఎన్. వేంకటరమణయ్యగారిట్లు విశదపరచియున్నారు. "ది రిపీటెడ్ ఫైల్యూర్స్ ఆఫ్ ది చోళా ఎంపరర్ టు ఫ్రీ వేంగీ ఫ్రమ్ ది వెస్టరన్ చాళుక్యన్ యోక్స్ సీమ్స్ టు హావ్ దిస్ ఇల్యూషన్డ్ రాజరాజ, హిజ్ ఓన్ హెల్ప్‌లెస్ నెస్ అండ్ ది ఇన్ ఎబిలిటీ ఆఫ్ ది చోళా ఎంపరర్ టు ఓవర్ త్రో హిస్ ఎనిమీస్ సీమ్ టు హావ్ బ్రాట్ అబౌట్ ఎ చేంజ్ ఇన్‌హిజ్ ఆటిట్యూడ్. హీ సా క్లియర్లీ దెడ్ అండర్ ది సర్కమ్‌స్టెన్సెస్ ఇట్ వాజ్ ఫ్యూటైల్ టు ఫెర్‌సిస్ట్ ఇన్ హిస్ అపోజిషన్ టు ది వేస్టర్న్ చాళుక్యాస్. హీ మైట్ బై హిస్ పెర్‌సిస్టెంట్ హాస్టలిటీ లూస్

హిజ్ కింగ్‌డమ్ కంప్లీట్లీ అండ్ ది చాన్సస్ ఆఫ్ రీగైనింగ్ ఇట్ వాజ్ వెరి రిమోట్ ఇన్‌డీడ్. హి కన్‌సిడర్డ్ ఇట్ ఎక్స్‌పీడియంట్ టు కన్సిలియేట్ ది ఎనిమి అండ్ అబైడ్ హిజ్ టైమ్ అంటిల్ సర్కమ్‌స్టెన్సస్ బికేమ్ ఫేవరబుల్ టు త్రో ఔట్. రాజరాజా దేర్‌ఫోర్ ఓపన్డ్ నెగోషియన్స్ విత్ సోమేశ్వర ఐ అండ్ కన్‌క్లూడెడ్ విత్ హిమ్ ఎ ట్రీటి, అకార్డింగ్ టు విచ్ హి వాజ్ అలోడ్ టు రూల్ హిస్ కింగ్‌డమ్ ఆన్ ఎ కండిషన్ గెట్ హి అక్నాలెజ్‌డ్ విత్ రాస్ సుప్రీమసీ అండ్ ఆక్సెప్టెడ్ హిమ్ యాజ్ హిజ్ ఓవరాల్డ్ రాజరాజా అష్యూమ్డ్ సమ్ ఆఫ్ ది క్యారెక్టరెస్టిక్ వెస్టర్న చాళుక్యా టైటిల్స టు బీ టేకన్ హిస్ ఫ్రెండ్‌షిప్.

(వైడ్, ది ఈస్టర్న చాళుక్యాన్, పుట 236)

పశ్చిమ చాళుక్యులతోడి సమాధానము రాజరాజునకు బెక్కుమేళ్ళను సమకూర్చెను. అతనికి అరవలతోటి రాజకీయ సంబధ మంతరించెను. రాజ్యములో శాంతిభద్రతలు స్థిరముగా నెలకొనెను. పెద్ద కాలము నుండి రాజకీయ కల్లోలాలలో సతమతమై యుండిన అతని మనస్సుకు ధైర్యము, నెమ్మది మరియు నిలకడ గలిగెను. అందువలన నతడు తన మనస్సును యుద్ధ కార్యములనుండి సాహిత్యరంగము వైపు మరల్చెను.

ఈ విషయమును పూజ్యులు శ్రీ దివాకర్ల వేంకటావధాని గారిట్లు విశదపరచియున్నారు. "అతడు ప్రశాంతముగా రాజ్యపాలనము కావించినప్పటి నుండియే ఈ సమయముననే యతడు స్వస్థచిత్తముతో కావ్యగీత ప్రియుడై యానందమున కాలము బుచ్చుచూ నన్నయచే భారతాంధ్రీకరణ చేయించియుండెనని బలుపుగు విమర్శకుల అభిప్రాయము."

(చూ, వికాస లహరి,)

ఈకారణమువలన ఆనాటినుండి రాజరాజు జీవితము తేజోవంతము కాజొచ్చెను. నన్నయగారికి కాలము కలిసి రాసాగెను. ఆంధ్ర-కర్ణాటకముల పరస్పర సంబంధము బలపడ సాగెను. తెలుగు సాహిత్య నందనోద్యానవనమున మధుమాసము ఆసన్నము కాజొచ్చెను. తెనుగులో భారతమును వ్రాయవలసియుండు యవసరమును, ఆవశ్యకతను నన్నయ రాజరాజునకు చక్కగా విశదపఱచియుండెను. ఆతడును నా విషయమును గ్రహించియుండెను. భారతకథ ఆతని వంశకర్తలైన పాండుభూపతులది. దానిని వినుటయన్న యాతనికెంతో యాశక్తి. ఆకథను, జదివినను విన్నను బుణ్యము గలుగును. అప్పటికే అది యరవభాషలోనూ, కన్నడమందును వ్రాయబడి ఆయా దేశములందు వ్యాప్తి జెందియుండెను. కాని, ఆ మహాగ్రంథము తన మాతృభాష, మరియు తనదేశభాషయగు దెనుగున వ్రాయబడియుండలేదు. భారత కథ విశదముగ దెనుగు బ్రజలకు దెలియదు. అంతా గాసట, బీసటగా గల్గిన విషయ పరిచయ మే. తన ప్రజలకు భారతకథ దెలియవలయును. అది వేదవ్యాస మునీంద్రుడు రచించియుండిన భారతమున కనుగుణముగ నుండవలయును.

ఇంతేగాక, ఇమ్మడి యరికేసరి బంప మహాకవిచేత కన్నడమున భారతమును రచింపజేసియుండెను. అందువలననతనికి మంచి కీర్తి ప్రతిష్టలు గలిగియుండెను. అరికేసరి వేములవాడ చాళుక్య వంశమునకు జెందినవాడు, రాజరాజువలెనే ఆతడును చాళుక్యుడే. కాన యా వంశమునకు జెందిన తాను గూడ భారతమును తెనుగున వ్రాయించి, ఆ రాజుకంటె ఎక్కువ కీర్తిని గడించవలయునను యాకాంక్ష యాతని కుండెను. అందుల కవసరమైన పట్టుదల గూడ రాజరాజు మనస్సున స్థిరముగా నెలకొనియుండెను.

ఈ విషయమును గురించి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారిట్లు చెప్పియున్నారు. రాజరాజనరేంద్రుడు శైవుడు. భారత శ్రవ

ణాసక్తి యెంత యున్నను, పంపభారతమందు పార్వతీపతి పదాబ్జధ్యానము" లేదేయన్న కొఱత రాజరాజునకు దప్పకయుండును. కావున భారతమును వ్రాయించి తన కీర్తికి ఆయువు బోసికొనెను. మరియు "దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సముద్రము"ను మథించి కీర్త్యమృత కలశమును బొందవలెనను దాయాదులకు సహజమగు భావము గూడ యాతనికుండ లేదనుకొందుము గదా! దీనితో రాజరాజ నరేంద్రుడు భట్టారకుని భారత రచనకు బురికొల్పెను..."

(చూ. కిన్నెర, 1953. పుట. 395)

నన్నయ భట్టే ఈ విషయముల నన్నిటిని ఆయా సందర్భము లందతనికి జెప్పి, యాతని మనస్సును సిద్ధపరచి యుండవచ్చును. ఈ మహాకార్యము రాజరాజున కత్యంత ప్రియమైనది. ఆ గ్రంథరచన కన్ని విధములందును నన్నయభట్టారకుడే దగినవాడని ఆ రాజు తేల్చుకొనియుండును.

ఇట్లుండగా నారాజొక్కనాడు నిండుకొలువు దీర్చి, విద్వజ్జనులం బరివేష్టించియుండ, విద్యా విలాసగోష్టిలో సుఖోప విష్టుడై, ఇష్టకథా వినోదంబులనుండి, తన కరుణారసపూరిత చూడ్కులను నన్నయగారి వైపు ప్రసరింపజేసి, యాతనితో

"కం॥ జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడ
దెనుగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

అని యానతిచ్చెను.

దీనినిబట్టి సంస్కృత భారతమును తెనుగులో నెట్లు వ్రాయవల యుననుటను వారిరువురు ముందే చక్కగా యాలోచించుకొనియుండి

రనియు, ఒకనాటి నిండుసభలో రాజరాజు నన్నయగారికిచ్చిన యను మతి యాతని తుది యనుమతి యని జెప్పవచ్చును.

(ఇట్ వాజ్ ది ఫైనల్ పర్మిషన్ గివెన్ ఇన్ ది ఓపన్ లిటరరీ కోర్ట్) అని అర్థము.

వీరిరువురు అసాధ్యులే. గురువును మించిన శిష్యుడు శిష్యుని మించిన గురువు.

నన్నయ రాజరాజునకు తన యంగీకారమును చెప్పుచు "విద్వజ్జనంబుల యనుగ్రహంబున" అని కూడ చెప్పినాడు. అనగా రాజానుమతితోను, విద్వజ్జనుల దయతోను నేను వ్రాసెదనని చెప్పెను. "విద్వజ్జనుల యనుగ్రహమున" అనుమాట ఆ సాహిత్య సభలోని పండితులను సంతోషపెట్టుటకు చెప్పిన మాటే కాని, వేరొ కటి కాదు. తన కులబ్రాహ్మణుడు, గురువు. ఉభయభాషా కావ్యరచ నాభి శోభితుడగు నన్నయకు చాళుక్య కులాభరణుండు సరస్వతీ విలస న్ముఖాంభోజుడునగు రాజు భారతమున దెనుగున వ్రాయుమని ఆజ్ఞ యిచ్చుచుండగా, సభలోని పండితులెట్లు యాక్షేపింపగలుగుదురు. రాజాజ్ఞను గాదనునంతటి ధైర్యము రాజాశ్రితులైన యా పండితుల కెట్లుండును. ఆసమయమున నారాయణభట్టింకను రాజమహేంద్రవరము నకు వచ్చి యుండలేదు.

ఇట్లు నన్నయ తుట్టతుదకు భారతరచనకు రాజానుమతిని సంపా దించెను. ఆతడు సిద్ధపరచియుండవలసిన రెండు రంగములలో ముఖ్య మైన మొదటి రంగము చక్కగా కుదిరినది.

ఇచ్చట నొక విషయమును చెప్పవలసియున్నది. భారతమును తెనుగున వ్రాసెదనని నన్నయ అంగీకరించిన సమయమున ఆ సభ యందుండిన బండితులు కొందఱాతనిని తీవ్రముగా నాక్షేపించియుండు రనియు, నాసమయమున నారాయణభట్టు నన్నయ తోడ్పడి వారిని

సమాధానపరచి, ప్రసన్నుల గావించి, వారి యామోదముద్రను గడించి యిచ్చెనని కొందరు పండితులు తలంచియున్నారు. కాని యిది విశ్వసింపదగినది కాదు. ఏలయన, భారతమును తెనుగున వ్రాయుమని చెప్పినది రాజు. కావున దానిని యాక్షేపించుటకు పండితులకు సాధ్యము కాదు. అంతేకాక, నిండుకొలువులో రాజరాజు, పండితులను, కవులను నుద్దేశించి చెప్పక, ఒక్క నన్నయ్యగారినే చూచి, ఆతనితోనే తన విద్యావిషయములను, తన సాహిత్యాభిరుచులను చెప్పెను. తక్కిన పండితులందరూరక వినుచుండిరి. రాజరాజు, నన్నపార్యుని జూచి యిట్లు చెప్పెను.

చం॥ విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థ ధర్మ శా
స్త్రముల తెఱంగెఱింగితి నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి బ్రకాశంబుగా హృదయంబు భక్తితోన్.

ఈ పద్యమునందును, ఆ పిదపగల గొన్ని పద్యములందును రాజరాజు తన గుణగణములను గొప్పగా జెప్పుకొనియున్నాడు. నన్నయగారితో కాక, ఆతడు సభాసదులను జూచి చెప్పియుండినయెడల అంత గొప్పగా జెప్పియుండుట చాలా సమంజసముగా నుండెడిదని తోచుచున్నది. వారికి తన విషయములను చెప్పినట్లుండును. ఇట్లు చెప్పి తుదకు భారత రచనకు నన్నయకు యానతి నిచ్చెనని చెప్పియుండిన పక్షమున నింకను చక్కగా నుండెడిది. కాని అట్లు జరుగలేదు. ఆతడు నన్నపార్యుని తోనే తన్ను గురించి, అన్ని విషయములను చెప్పియుండుటను గురించి యాలోచించిన పక్షమున రాజరాజు డంబముగ నాత్మస్తుతి చేసుకొనె నను భావము స్ఫురించుచున్నది. ఈ విషయమున నాకొకటి దోచు చున్నది. నన్నయ భట్టారకుడు, విద్యావిషయమున తనకు సల్పిన సహాయమునకు కృతజ్ఞతలు దెలియజేసి, కడపట భారతమును దెని

గింపుడని చెప్పియుండిన మాటలుగా గ్రహించుట సమంజసముగా నుండు నని నాకు దోచుచున్నది. అప్పుడిట్లుండును. ఓ మహనీయమూర్తీ! మీ దయవలన బురాణములు వింటిని. అర్థ ధర్మశాస్త్రముల తెఱంగెఱింగితిని... నాకు భారతమునందలి అభిప్రాయము విన అభిలాష యున్నది. కాన భారతమును దెనుగున రచియింపుడని చెప్పియుండు నని వినయముతో చెప్పిన మాటలని దలంచుట సమంజసముగా నుండు నని జెప్పవచ్చును గదా! ఇట్లు రాజరాజు వాక్యములను కృతజ్ఞతా సూచకములని దలంచకపోతే సమంజసముకాని యొక విషయము స్ఫురించును. నన్నయగారికా నిండుకొలువు నాటివరకు రాజరాజు యొక్క పై గుణము లొక్కటియు దెలియవనియు, ఆనాడే రాజు చెప్పగా వినెననియు దెలియుచున్నది. ఇది నిజమని నమ్మినయెడల నన్నపార్యుడా రాజు కులబ్రాహ్మణుడనియు మరియు ననురక్తుడనియు చెప్ప మాటల కర్థము లేకపోవును. అనురక్తుడైన కులబ్రాహ్మణునకు రాజరాజు గుణగణాలు, ఆతని విద్యాభ్యాసము, ఆతని సాహిత్యాభిరుచి మొదలగు విషయములు తెలియకపోవునా! తెలిసియుండిన పక్షమున రాజరాజాతనికి దన్నుగూర్చి యంత గొప్పగా చెప్పవలసినది. యేల? పొగడకొనవలసినది యేల? కాన, రాజరాజు తన్నుగూర్చి చెప్పిన వాక్యములన్నియు నతడు నన్నయకు దెలియజేసిన కృతజ్ఞతా సూచకములే కాని, వేరుగావని చెప్పవలసియున్నది. ఇంతేకాక నన్నయగారి విద్యావిషయములు, ఆతని ఉన్నత గుణములు. ఉభయ భాషా కావ్యరచనాశక్తి మొదలగునవి రాజరాజునకు దెలిసియుండె నని భారతమునుండి తెలియుచున్నది. నన్నయను గురించి యిన్ని విషయములు రాజరాజునకు దెలిసియున్నపుడు రాజరాజు విద్యావివేకాది గుణములు నన్నయభట్టునకు దెలియకుండునా? కావున రాజరాజు తన్నుగురించి చెప్పిన గుణములను, కృతజ్ఞతను తెలియజేయునవిగా గ్రహించుట లెస్స. భారత రచనావిధానమును గురించి నన్న

పార్థుడు ముందే యాలోచించి తేల్చుకొనియుండెనని పెక్కుమంది పండితులు సూచించియున్నారు. కీ. శే. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిట్లు చెప్పియున్నారు.

"ఇక్కావ్యంబు రచియించెదనని రాజరాజుతో నాత్మ నిశ్చయంబు జెప్పి భారతాంధ్రీకరణమును దొడంగె..."

[చూ. పట్టాభిషేక సంచిక. పు. 35]

ఆచార్య శ్రీ దివాకర్ల వారిట్లు చెప్పియున్నారు."ఇక్కావ్యంబు ననుటనుబట్టి తాను సంస్కృతములోనున్న దానిని దెనుగున కావ్యముగా సంతరించెనను భావము వ్యక్తమగుచున్నది."

[చూ. వికాసలహరి]

శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు కూడ యిట్లే చెప్పియున్నారు.

"అతడు ప్రదర్శించిన యనువాద స్వాతంత్ర్యమును, వినిపించిన సొంత గొంతును బరిశీలించినచో నాతడొక మహాకావ్యమును సృష్టి జేయుటకు సమగ్రమగు సామగ్రి గలవాడనుట తెల్లము."

[చూ. వ్యాసభారతము–నన్నయ పరిష్కారము[

ఇట్లు భారతము నొక రమణీయమైన కావ్యముగ వ్రాయుట కతడు సంసిద్ధుడుగ నుండెను.

నన్నయభట్టు భారతమును దెనుగున వ్రాయుటకుముందు చాముండికావిలాసము, చౌడేశ్వరీవిలాసము, ఇంద్రవిజయము, మరియు రాఘవాభ్యుదయమను గ్రంథములను దెనుగున వ్రాసియుండెనని తెలియుచున్నది. "ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడ"నని యాతడు చెప్పియుండుటనుబట్టి నన్నయ సంస్కృతభాషయందుగూడ నొకటి, రెండు గ్రంథములు వ్రాసియుండెనని తోచుచున్నది. రాజరాజు నన్నయగారి తెనుగు గ్రంథములనుగూడ చదివి, యవి హృదయ

రంజకములై యుండినందుననే, యాతని తెనుగుకవితా సామర్థ్యమును గ్రహించియుండును. అందువల్లనే ఆతడు తెనుగున భారతమును వ్రాయుటకు నన్నయ తగినవాడని నిశ్చయించుకొని యుండెనని చెప్ప వచ్చును. ఈ కారణమునుబట్టియే రాజరాజు విద్వత్సభలో నన్నయ గారికి తన కృతజ్ఞతను చెప్పుచు తెనుగున భారతమును వ్రాయుడని ప్రార్థించెను.

సాహితీసమరాంగణ సార్వభౌముడైన కృష్ణరాయలుగూడ,

కం॥ భువన విజయాఖ్య సంస
ద్భవన స్థితసింహ పీఠిప్రాజ్ఞుల గోష్ఠిన్,
గవితా మధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయతన్ ననుబల్కెన్.

హితుడవు, చతుర వచోనిధివి, అతుల పురాణాగమేతిహాస కథార్థ స్మృతియుతుడవు. కావున భవచ్చతుర రచన కనుకూలంబుగ స్వారోచి షమను సంభవమరయ సమంచితముగ వినిపింపుమని చెప్పెను. సంస్కృత మార్కండేయ పురాణములోని కథను యథాతథముగ తెనుగున వ్రాయుమని రాయలు పెద్దనకు చెప్పలేదు. స్వారోచిషమను సంభవకథ వినుట కింపుగా నుండును. సరసమగు నీకావ్యరచన కను కూలముగ నుండును. కావున నట్టి రసవంతమైన కథను రచియింపుమని ఆంధ్ర కవితాపితామహుడు అల్లసాని పెద్దనకు, కవితాస్త్రీలోలుడైన ఆ రాయ లానతిచ్చెను. ఆ కవియు శిరీష కుసుమ పేశల సుధామయోక్తు లతో మనుచరిత్రమును రచించెను. ఇచ్చటగూడ మనుచరిత్రము వ్రాయవలసిన విధానమును గురించి వారిరువురు అంతకుముందే చర్చించి నిశ్చయించుకొని యుండిరనియు, తుది యనుమతిని రాయలు భువనవిజయ సభాభవనమున పండితుల సమక్షమున పెద్దన కొసనాగె ననియు దెలియుచున్నది,

రాజరాజనరేంద్రుడు కూడ భారత రచనను గురించి నన్నయ గారితో ముందే యాలోచించుకొనియుండి ఒకనాటి విద్వత్సభలో యా కవీంద్రున కానతి యొసంగెను. నన్నపార్యుడు భారతమును రచించి పద్యవిద్య కాద్యుడయ్యెను. ఆ యిరువురు రాజులు మరియు నా యిరువురు కవులు మనకు జిరస్మరణీయులే.

ఆ కాలమున కృతులను రచియింపజేసి అంకితముగొని యానందించదలచిన రసజ్ఞులగు రాజులు తమకు నచ్చిన కవులు నిట్లే తమ యాస్థానములలో కవిపండితుల సమక్షమున ప్రార్థించి వారికి గర్పూర తాంబూలంబుల నొసగి గౌరవించుటయు పెద్దన మనుచరిత్రమును రచించి ప్రబంధవిద్య కాద్యుడయ్యెను. ఆ మహాకవులుగూడ మహా ప్రసాదంబని సంతోషముతో నంగీకరించి కావ్యరచన సల్పుటయు జరుగుచుండెను.

భారత రచనావిధానము గురించి వారిరువురు మొదటనే చర్చించి తీర్మానించుకొనకయుండిన పక్షమున రాజరాజు తన సభలోని కవి, పండితుల నందరిని యుద్దేశించి, తన కోరికను జెప్పియుండును. వారును తమతమ యభిప్రాయములను జెప్పియుందురు. తుదకా కార్యమున కర్హుడెవ్వడనుట నిర్ణయమై యుండును. కాని, అట్టిదేదియు జరుగలేదు. తన యాస్థానమందుండిన కవులు, పండితులు మొదలగు వారి సమక్షమున భారతమును తెనుగున రచియింపుమని నన్నయగారి తోనే చెప్పవలయునని రాజరాజు నిశ్చయించుకొనియుండెను అటులే చేసెను.

రాజానుమతి లభించిన పిదప నన్నయ తన శిష్యుడును, సహాధ్యాయుడునై యుండిన నారాయణభట్టు సహాయముతో భారతమును రచించెనని తెలియుచున్నది. ఈ నారాయణభట్టును గురించి యింకను బరిశోధించవలసియున్నది. కావున, నావిషయమును "నన్నయభట్టు-నారాయణభట్టు" యను వేరొక వ్యాసమున వ్రాయగలను.

బాల్యమునందు విద్యాభ్యాస కాలమునందే తెనుగున భారతమును వ్రాయవలయునను సంకల్పము నన్నయగారికి తోచినది. అది క్రమముగా వృద్ధిగాంచి తుదకు స్థిరరూపమును గాంచెను. వ్రాయవలయునను కుతూహలము క్రమక్రమముగా వృద్ధిగాంచుచూ వచ్చెను. ఎంత గాఢమైన యభిలాష యున్నను, కాలము కలిసిరావలయును గదా ? కలసిరానందున నతడు ఓపికతో తగిన సమయమునకై వేచియుండి పట్టుదలతో కృషిచేసి, ఆ రోజుననే తన సంకల్పమును కనుకూలునిగా దిద్దితీర్చియుంచుకొని కార్యసిద్ధి గాంచెను. తెనుగులో భారత రచన యాతని ఏకైక లక్ష్యము. ఆ లక్ష్యము నాతడు సాగించుకొనెను. నన్నయభట్టు రాజరాజును తెనుగురాజుగా రూపొందించి, ప్రాచీనమైన, భవ్యమైన, వేంగీ చాళుక్య రాజ్యమునకు క్రొత్త ఊపిరి పోసి, అది మరల సుమారేబది యేళ్ళపాటు స్వతంత్ర తెలుగు రాజ్యముగా మనగలుగునట్లు చేసెను. మరియు క్షీణమైపోవుచుండిన తెలుగు భాషకు గట్టి పునాదులు వైచి తిక్కనాది మహాకవులకు మార్గదర్శకుడాయెను.

నన్నయగారి వ్యక్తిత్వము అద్భుతము. నిరుపమానము. ఆతడాంధ్రభాష కొనర్చిన మహత్తరమైన యుపకారమును గురించి, కీ. శే. శతఘంటము వేంకటరంగ శాస్త్రిగారిట్లు చెప్పియున్నారు. "నన్నయభట్టు లాక్షణికమై, రసవంతమై, భావానుగమమై, యర్థగంభీరమై, శ్రవణమధురమై, సమస్త విద్వదాదరణీయమై యొప్పు గవిత్వంబు రచియించి, యాంధ్రలోకమునకు మహోపకారమును గావించెను. ఆతడెంతటి పొగడ్తకైన యర్హుడే. అట్టి యనర్ఘళ కవిత్వరచన యాతనికే జెల్లు."

[మూ. ఉగాది సంచిక. 1951 - పుట. 39]

కీ. శే. కట్టమంచి రామలింగారెడ్డిగారిట్లు చెప్పి యున్నారు. నన్నయగారి ప్రతిభ యసాధారణము. దానివంటి మూర్తిని సృష్టింప

నేరికిని తరముగాదు. ఆతని శైలి మిక్కిలి మనోహరము. అనన్య తుల్యము. దానివంటిది వేరొండులేదు. (చూ. పట్టాభిషేక సంచిక)

కీ॥ శే॥ నండూరి బంగారయ్యగారిట్లు చెప్పియున్నారు. కొందరు మహాకవులు శబ్దసిద్ధులు. మరికొందరు అర్థసిద్ధులు, ఉభయసిద్ధులు యత్యల్ప సంఖ్యాకులు. అందులో నన్నయ యొకడు. ప్రసన్నకథా కవితార్థయుక్తిలో అర్థసిద్ధిని, అక్షర రమ్యతలో శబ్దసిద్ధిని ప్రతిజ్ఞ చేసుకొని ఉత్తీర్ణుడైనాడు. నాద మాధుర్యమును సిద్ధించుటలో నాతనిది నిరంకుశ ప్రజ్ఞ.

(చూ. భారతి, 1953 జూలై)

కీ॥ శే॥ శ్రీ గడియారము వేంకట శేషశాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు.

"భారతమువంటి ఉత్తమమైన సాహిత్యమును నా తెలుగు వారికి తంగేటిజున్ను చేసి, బంతివిందుయి బెట్టెదనని నడుము గట్టిన ఆ వాగనుశాసనుడు మనకు ప్రథమారాధ్యుడు. ఆ మహాభాగుని శుభారంభముచేతనే తెనుగునకు భారతవర్షీయ భాషలలో భారతమును ప్రథమముగా నవతరింపజేసుకొన్న గౌరవము దక్కినది. భారతమును కావ్యముగా జదువు భాగ్యము తెనుగునాడు నోచినది.

[చూ. భారతి, 1947. సంపుటి. 24, సంచిక 4)

కీ॥ శే॥ ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు ఈ విధముగా జెప్పియున్నారు.

"నన్నయభట్టారకుడు వాగనుశాసనుడే కాక ఆంధ్రుల యావన్మహోదయమునకు స్థాపనాచార్యుడు. వేంగిదేశమున బుట్టిన పంపనివంటి మహాకవులు కన్నడములో తమ ప్రతిభను దాచుకోవలసి వచ్చెను. బౌద్ధులయిన ఆంధ్రులెందరో తమ విజ్ఞాన దీపములను ఏ ప్రాత విద్యాలయములలోనో వెలిగించియుందురు. ఈ జాతీయ

విపత్తు నడికట్టిన దిట్ట నన్నయ భట్టారకుడు. ఆంధ్రుల జాతీయ సౌభాగ్యమును నిలువరించుటకు ఆదియందు సువర్ణపు ఖజానాను గట్టిన అక్షర రమ్యశిల్పి నన్నయ భట్టారకుడు. సూక్ష్మముగా బరిశీలించిన ఈ ప్రసన్న ధారాజీవమే ఆంధ్ర కవుల రచనలయందెల్ల ద్యోతకమగును." (మూ. భారతి, 1934. సంపుటి-11. సంచిక-2)

కీ॥ శే॥ శ్రీ హయతదన రావుగారిట్లు చెప్పియున్నారు.

"నన్నయభట్టు రెస్క్యూడ్ అండ్ రిస్టొరేటెడ్ ది ఏన్షియంట్ తెలుగు లాంగ్వేజ్ అండ్ లిటరేచర్ ఫ్రమ్ ది డెప్త్స్ ఆఫ్ ఒబిలివియన్ అండ్ గేవ్ ఇట్ ఎలాస్టింగ్ అండ్ కలర్ ఫుల్ లైఫ్."

మహాకవి తిక్కననుండి చిన్నయసూరి వరకు, ఆ పిదప ఆంధ్ర సాహిత్యరంగములో మహా కీర్తిప్రతిష్టలు గడించిన మహాకవులు మరియు పండితులు అందరు నన్నయగారి రమణీయమైన కవితాశక్తిని హృదయపూర్వకముగా తనివితీరక స్తుతించి యున్నారు. పూజ్యులు డా॥ దివాకర్ల వారొక్క మాటలో "ఆయా శుభదినములలో నన్నయ ఆంధ్రభాష కొనరించిన సేవ యింతింతనరానిది. అని యెంతో సముచితముగా జెప్పి యున్నారు."

## నన్నయగారిని గురించిన కొందఱు పండితుల విడ్డూరపు వ్రాతలు :

నన్నపార్యుడు తెనుగుభాషకు చేసిన మహోపకారమును స్మరించి, సంతసించి, తమ కృతజ్ఞతలను స్తుతులద్వారా, ప్రశంసల ద్వారా యెందరో మహాకవులు, పండితులు, తరతరాలనుండి తెలియ జేసియుండగా నొకరిద్దరా మహాకవిపట్ల పరమ కాఠిన్యమును వహించి, ద్వేషించి దూషించియుండుట యాతడు తెలుగువాడు కాడని హేళన చేసియుండుట, ఆతని కవిత్వమును హీనపరచి చెప్పియుండుట శోచనీయమేకాక దురదృష్టకరము.

అట్టివారిలో కీ. శే. శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు ముఖ్యులు. నన్నయగురించి యెందుకంత హీనముగా వారు వ్రాసిరో ఆశ్చర్యముగ నున్నది. ఇందుకు కారణము వారు నన్నయ అరవవాడై యుండునని అనుకొనుట. పెక్కుచోట్ల నన్నయ అరవవాడని చెప్పినను, ఒకచోట నన్నయ కల్యాణనగర ప్రాంతాలనుండి వచ్చిన కర్ణాటుడై యుంటాడని చెప్పియున్నారు. (శ్రీనాథభట్టుకృత పల్నాటి వీరచరిత్రకు వ్రాసిన విపులమైన పీఠికలో వీరు నన్నయను పెక్కుచోట్ల పెక్కువిధములుగా దూషించియున్నారు.

నన్నయ యరవవాడను యభిప్రాయమెపుడీ పండితునకు గలిగెనో, అపుడే యాతనిపై అసూయ జనించినది. అసూయ ద్వేషానికి దారితీసినది. ద్వేషము దూషణకు కారణభూతమైనది. నన్నయపట్ల అసహ్యము, ఆతని సంస్కృతాంధ్ర పాండిత్యముపట్ల సందేహము, అసంతృప్తి, ఆతనికి తెలుగు కవిత్వము రాదను మనస్తత్వము, ఆతని పదప్రయోగముః మీద, వాక్యరచన మీద తీవ్రమగునట్టి ఖండనము వీరుచేశారు. నన్నయ భారత రచన అనుచితానువాదమని, వికారాలతో కలుషితముగా నున్నదని, ఆతని భారతము అధములైన యధికారులకు మాత్రమే యుపయుక్తమని, ఆతని పద్యములు నుఱికిలతుకులాలు గలిగియున్నవని యింకా యేమేమో చెప్పియున్నారు.

ఈ దోషములు మహాకవి తిక్కనకు, ప్రబంధ పరమేశ్వరునకు గనబడలేదా ? నన్నయగారిని, ఆతని ఆంధ్రభారతమును గురించి తిక్కనగారు,

ఉ॥ ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
దాది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్.

అని యెంతో చక్కగా పొగడియున్నారు. ఈ మహాకవులకు నన్నయ భారతములో మంచి గుణములు గనబడెనే తప్ప దుర్గుణములు గనబడ లేదు. ఈ యిరువురు కవులే కాక కేతన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, సూరన మొదలగు కవులందరు నన్నయను తమ కృతులందు స్తుతించియేయున్నారు. వీరందరు తెలివితేటలు, విద్యావివేకములు, భాషా పాండిత్యము లేనివారని చెప్పనగునా? కాని, ఉమాకాంతముగారి అభిప్రాయములు విజయమని నమ్మినయెడల పై కవులందరు తెలివి లేనివారని, విద్యాపరిణితి లేనివారని చెప్పవలసివచ్చును. ఈ పండితుడు తుదకు తిక్కనను శ్రీనాథకవిని, కృష్ణరాయలను కూడ వదల లేదు. వారినికూడ నిర్దయగ విమర్శించియున్నారు. వీరు నన్నయ గారిని గురించి చెప్పియుండు విషయములకు పరిశీలించి చూతము.

1) నన్నయ అరవవాడై తంజాపూరియందో లేక కాంచీపురమందో యుండిన పక్షమున ఆతనికి నన్నయ యనుపేరు గలుగుటకు వీలులేదు. ఈ పేరు గలవారా యరవదేశమున యే కాలమందుండ లేదు. ఈ కాలమందు కూడ అరవవారు తమ పిల్లలకా పేరు పెట్టరు. నన్నయ యనునది కర్ణాటక దేశమునకు సంబంధించినది. కాన, విద్యాశేఖరుల పై యభిప్రాయము సరిగాదని తెలియుచున్నది.

2. నన్నయ అరవవాడై కాంచీపురమందుండిన యెడల నారాయణభట్టు ఆతనికి సహాధ్యాయుడు మరియు నిష్టుడునగుటకు సాధ్యము గాదు. అట్లు కావలసిన పక్షమున నారాయణభట్టును గూడ అరవవాడని చెప్పవలసి వచ్చును. కర్ణాటక దేశమందు కూడ అక్కడక్కడ వేదపాఠశాలలు, పెద్ద పెద్ద ఘటికాస్థానము లుండినవి. నారాయణభట్టు విద్యాభ్యాసమున కంతదూరము పోవలసిన యవసరముండలేదు. కావున నతడు అరవవాడు కాడు.

3) నారాయణభట్టు అరవవాడు కాడని తేలినందున యాతడు

రాజమహేంద్రవరమునకు వచ్చి, భారత రచనయందు అరవవాడైన నన్నయకు దోడ్పడియుండడు.

4) నారాయణభట్టు యరవవాడని యనుటను వాదముకొఱకు యంగీకరించిన పక్షమున, ఆతడు పశ్చిమ చాళుక్యరాజుల ప్రతినిధిగ రాజమహేంద్రివరమున నుండుటకు వీలుండదు. ఇందులకు గారణము పశ్చిమ చాళుక్యులు చోళులకు ప్రబల విరోధులు, కావున కర్ణాటక చక్రవర్తి ఒక అరవ బ్రాహ్మణుని తన ప్రతినిధిగ రాజరాజు నాస్థానమునకు బంపియుండడు. పంపడు కూడ.

5) నన్నయ అరవవాడైయుండిన పక్షమున రాజరాజు చోళుల తోడి రాజకీయ సంబంధమును విడనాడి, వారి శత్రువులతో రాజీ చేసుకొనుటయు, వారికి సామంతుడుగ నుండుటయు, వారి బిరుదములను తాను వహించుటయు జరిగియుండదు.

6) నన్నయ అరవవాడై యుండినయెడల రాజరాజు తెలుగు రాజుగ రూపొందియుండడు. ఆతనికి తెలుగుపై మక్కువ యేర్పడి యుండదు. మరియు నాతడు తెనుగున భారతమును నన్నయచే వ్రాయించి, ఆ భాషను పోషించియుండడు.

7) ఇట్లే విధముగ జూచినను, నన్నయ అరవ వాడనుటకు వీలుకాదు కాని నన్నయ ముమ్మాటికి తెనుగువాడే.

ఇక, శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు విషయముల సరిగా గ్రహించక నన్నయ అరవవాడని భ్రమించి తూలనాడియుండుట శోచనీయమేకాక తెలుగువారి దురదృష్టమని చెప్పవలసియున్నది. ఇది అతని యొకవిధమగు బుద్ధిజాడ్యజనితోన్మాదమే.

ఇంతేకాక ఒక తమిళ విద్యావంతుడు శ్రీ ఉమాకాంతముగారి అభిప్రాయము నాధారముగా కొని కాబోలు నన్నయ అరవ కవి యనియు, నతనికి తెలుగులో గూడ పాండిత్యముండినదనియు, నతడు

చోళ రాజాంతఃపురమునుండి అమ్మంగదేవితో రాజమహేంద్రవరము నకు అరణపు కవిగా వచ్చెననియు వ్రాసినట్లు తెలియుచున్నది. ఇది వేలు చూపిన హస్తము మ్రింగెనను సామెతవలె నున్నది. ఉమాకాంతముగారు నన్నయ అరవవాడుగ నుండునని మాత్రమే చెప్పగా, పై పండితుడు మరియొక మెట్టు పైకెక్కి అతడు అరవ యరణపు కవి యనుచు నుడివెను

నన్నయ పేరే యాతడరవవాడు కాడని సూచించుచుండగా, నతనిని యరవవాడని గట్టిగా జెప్పుటయు, నతనిని చోళరాజుల యాస్థానకవి యనుటయును, ఆతనిని అరణపు కవిగా రాజమహేంద్ర వరమునకు వచ్చెననుటయు వింత. విద్యాశేఖరులు చెప్పినది మొదటి వింతయగుచుండగా, నీ రెండవవారు చెప్పియుండునది రెండవ వింత యగును.

ఇంతేకాక, తంజావూరునుండి వచ్చిన కవిని, తెలుగు సరిగా రాని కవిని, రాజరాజు తెనుగున భారతమును వ్రాయుమని యెట్లు చెప్పును. మరియు ఆ నన్నయ రాజరాజు కులబ్రాహ్మణు డెట్లగును? తాను ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడని యెట్లు జెప్పుకొనును? అట్లయిన, ఆ యరవకవి వ్రాసిన తెనుగు గ్రంథము లేవేవి? ఒకవేళ ఆ కవి తాను అంతటి గొప్పవాడని ప్రగల్భములు చెప్పుకొనియున్నను, తాను తెనుగున భారతము రచించెదనని రాజుతో చెప్పియున్నను, ఆ యాస్థానములోని కవులు, పండితులు సమ్మతించియుందురా? ఆక్షేపించియే యుందురు.

నన్నయ తెనుగు కవిత్వము దెలిసిన అరవకవియై యుండిన పక్షమున రెండు పర్వములను, అరణ్యపర్వములో కొంత భాగమును మాత్రమే వ్రాసి యంతటితో నాపివేయవలసిన బనియేమి? రాజరాజు మరణించిన బిదపగూడ అరవ భాషాభిమానియైన కులోత్తుంగుని

యా-స్థానమందుండి భారతమును సంపూర్ణముగా దెనిగించి యుండ వచ్చునుగదా? అట్లేదియు జరుగలేదు కాన, నన్నయ అరవవాడు కాతనియు, అతడు అరణపు కవిగా రాజరాజు అంతఃపురమునకు రాలే దనియు గట్టిగ నిశ్చయింప వచ్చును.

నన్నయగారిని గురించి పై రెండు విధములగు వింత యభి ప్రాయములేకాక, సుప్రసిద్ధాంధ్ర పండితులు కొందరు నన్నయ బాల్యమున అరవదేశమందుండు కాంచీపురమునకేగి యచ్చట విద్యా భ్యాసము జేసెనని దలంచియున్నారు. తలంచుటయే గాదు, మీదు మిక్కిలి నమ్మియున్నారు కూడ. నమ్ముటయేగాదు గ్రంథస్థము నొనర్చియున్నారు. ఇట్లు చెప్పుటకు ఏమి కారణ ముండవచ్చును? కాంచీపురము భారతదేశములోని సుప్రసిద్ధ ప్రాచీన మహానగరము లలో నొకటి. ఆచట వేదాది విద్యల నభ్యసించుటకు బ్రహ్మాండమైన వసతులుండెను.

ఈ విషయమును గురించి కీ. శే. శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారిట్లు చెప్పియున్నారు.

"ఆ కాలమున కాంచీపురము బౌద్ధులకు మాత్రమే కాక బ్రాహ్మణులకును ముఖ్యస్థానముగా నుండెను. వేదవేదాంగ విదుల యిన బ్రాహ్మణోత్తము లనేకులు కాంచీపురమును జేరి, బల్లవరాజుల పోషకత్వమున బరిషత్తులను, వేద విద్యాలయములను నెలకొల్పి, మతవ్యాప్తికై కృషిచేయుచు కృతార్థులగుచుండిరి...

[చూ. ఆంధ్రుల చరిత్రము - పూర్వయుగము]

క్రీ.శ. మూడవ శతాబ్దమునుండి 9వ శతాబ్దము వరకు పల్లవ చక్రవర్తులకు కాంచీనగరము రాజధానిగా నుండెను. వారు వేదాది విద్యలను బోషించి, సంస్కృతభాషను చాలా యభివృద్ధి గావించిరి. తొమ్మిదవ శతాబ్దమున వారి రాజ్యము జితికిపోయెను. అరవరాజులా

రాజ్యమును యాక్రమించిరి. ఈ రాజులలో గొందరు కొంతకాలము కాంచీపురమునుండి పాలించిరి. వారికి ప్రధాన నగరము తంజాపురము. ఈ కాలమున కాంచీపురములో వేదపాఠశాలలు పల్లవుల కాలములో వలెనే ప్రసిద్ధి గాంచియుండెనేమో తెలియదు.

ఆ కాలమున సుదూర ప్రాంతమందు శ్రీరంగ పట్టణ రాజ్యములోనుండిన నంజనగుడి ప్రాంతమువాడైన నన్నయ స్వస్థలమును వీడి కాంచీపురమునకేగి, ఆ యరవసీమలో విద్యాభ్యాసము చేసెననుటను విశ్వసించుటకు సాధ్యముకాదు. అ కాలమున నంజనగుడియందే యొక వేద పాఠశాల యుండెను. మరియు నా సమీపమందుండిన నగర్లయను గ్రామమందు గూడ నొక వేద పాఠశాల యుండెను. ఆ పాఠశాలలో నన్నయ మరియ నారాయణభట్టు సహాధ్యాయులుగ జదువుకొనియుంటారు. ఇది సహజమే కూడ.

కాని కీ.శే. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు నన్నయ మరియు నారాయణభట్టు బాల్యమందు కాంచీపురములో జదివియుండిరని తమ "నారాయణభట్టు" అను గ్రంథమున మరల మరల జెప్పియున్నారు. వారే అదే గ్రంథమందు నారాయణభట్టు కర్ణాటక దేశీయుడని కూడ చెప్పియున్నారు. ఆతడు కర్ణాటక దేశీయుడైన పక్షమున నతని సహాధ్యాయుడైన నన్నయకూడ ఆ దేశమునకు జెందినవాడేయనుట సూచితమగుచున్నది కదా ? ఇట్లు వీరిరువురు కర్ణాటక దేశమునుండి, అంత దూరమందున్న కాంచీపురమునకెందులకు బోయిరో తెలియదు. దీనినిబట్టికూడ వారిరువు రొక ప్రాంతపువారని తెలియుచున్నది గదా?

శ్రీ శాస్త్రిగారేకాక పూజ్యులు, "సరస్వతీపుత్ర" బిరుదాంకితు లగు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారుకూడ నన్నయ భట్టారకుని విద్యాభ్యాసము కాంచీనగరమందే జరిగియుండుననను అభిప్రాయము గల్గియున్నట్లు తెలియుచున్నది. శ్రీ ఆచార్యులవారికా యభి

ప్రాయము గలుగుటకు రెండు కారణములున్నట్లు తోచుచున్నది. ఒకటి పూతలపట్టు శ్రీరాములుగారా అభిప్రాయమును ఆచార్యులతో బలుమార్లు నొక్కి చెప్పియుండుట. రెండవది ఆళంగో అడిగళ్ అను తమిళ మహాకవి ఆ భాషలో "శిలప్పధికారము" అను గ్రంథమును వ్రాసెను. ఈ మహాకావ్యములోని కొన్ని భావాలు నన్నయభట్టు భారతములో నున్నట్లు ఆచార్యులవారికి దోచుట, నన్నయగారికి శిలప్పధికారమును గురించి తెలిసియుండెనో లేదో ఈనాడు ఆ విషయమును గురించి మనము చెప్పలేము. ఒకవేళ రాజరాజు యాస్థానమున కేతెంచుచుండిన తమిళ పండితులా గ్రంథములోని రమణీయ భావములను నన్నయగారితో జెప్పియుండవచ్చును. భావములు రమణీయముగ నుండి యవి వచ్చినయెడల తరువాతి కవులుగూడ ఆటి భావములను తమ తమ రచనలలో జొప్పించి రచించియుందురు ఇట్లగుట సహజమే.

శిలప్పధికారములోని రెండవ పదము "అధికారము" అనునది సంస్కృతపదమే. ఈ గ్రంథమును వ్రాసిన మహాకవి వాల్మీకి రామాయణమును చదివి, అందలి పురాణ దంపతులు, ఆదర్శ దంపతులయిన సీతారాముల దివ్యగాథచే ప్రభావితుడయి, తన కాలమునకు గొంత ముందు జరిగినదని చెప్పబడుచుండిన కోవలన్, కణ్ణకి దంపతుల సాధారణమైన యొక చిన్న కథను బ్రహ్మాండముగా బెంచి వ్రాసియున్నట్లు తమిళ పండితులు నిశ్చయించి యున్నారు. కావున, వాల్మీకి మహాముని కవితా ప్రభావము శిలప్పధికారములో నుండునట్లు అనుకొని యాశ్చర్యము జెందవలసిన పనిలేదు,

ఇంతేకాక, యెంత దూరమందున్నను, యే కాలమందున్నను మహాకవులు వ్యక్తపరచెడు భావములలో సమానత్వము గోచరించుననుట ఎల్లరెరింగినదే. అందువలన పై కారణములను గొప్ప యాధారముగ దలచి, నన్నయ కాంచీపురములో విద్య నభ్యసించెనని తలంచుట సముచితము కాదని మనవి చేయుచున్నాను.

తెలుగు పెద్దలకొక మనవి. ప్రాచీన కాలమున శాతవాహనాంధ్ర సార్వభౌములు మిక్కిలి సమర్థతతో దక్షిణాపథము నంతటను శతాబ్దాలకొలది పాలించినారు. ఆ రాజులు మగధ సామ్రాజ్యమును గూడ జయించి కొంతకాలము పాలించినారు. తమ యధికారము నంతటితో పరిమిత మొనర్చక నేపాళము వరకు కూడ వ్యాపింపజేసి పాలించినారు. శాతవాహన వంశమునకు జెందిన యొకరాజు పంజాబులో గూడ పరిపాలనము సాగించెనని యా దేశచరిత్రమునుండి తెలియుచున్నది. ఆంధ్ర రాజులు, "దక్షిణాపథమును" పెద్ద కాలము పాలించినందున నది "ఆంధ్రాపథ" మాయెను. ఆ కాలమునుండి, ఆంధ్రదేశమునుండీ ఈ కవులు, పండితులు, గణకారులు పలుప్రాంతాలకుబోయి తమ యాంధ్రత్వమును నిలుపుకొని వస్తున్నారు. కాన, ఆంధ్రములో గ్రంథములు వ్రాసిన వారక్కడక్కడ నుండిరి. ప్రస్తుతమును యున్నారు. కవులు మరియు పండితులు నేటి సంకుచితమైన ఆంధ్ర దేశముననే పరిమితమై యుండవలయునని తలంచరాదు. ఎప్పుడో యొకప్పుడు ఆంధ్రదేశమునుండి వలసపోయి, కర్ణాటక రాజ్యములో స్థిరముగ నెలకొన్న తెలుగు కుటుంబాలానాడేకాదు, నేడు కూడ లక్షలకొలదిగ నున్నవి. వీరిలో నన్ని జాతులవారు కూడ నున్నారు. అట్లా ప్రాంతాలకుపోయి స్థిరపడిన వైదిక బ్రాహ్మణ కుటుంబమునకు జెందినవారిలో నన్నయ భట్టారకుడొకడు. భాషా ద్వేషాలు ప్రబలి, భాషల నుద్ధరించకున్నను, విరోధములు పెంచుకొనుచుండు నేటివలె కాక ఆ కాలమున వేదాధ్యయనము చేసిన, పెక్కు శాస్త్రములు దెలిసిన తెనుగువారు మిక్కిలి గౌరవింపబడుచుండిరి. ఉదాహరణమునకు క్రీ. శ. 1600 నుండి 1950 వరకు మైసూరు దేశమును కీర్తి ప్రతిష్ఠలతో పాలించిన "అరసుల"ను రాజకుటుంబమువారి పురోహితులు, వైదికమత కార్యములను నిర్వహించుచుండినవారు ఆంధ్ర వైదిక బ్రాహ్మణులే. కావున, "మత్యమరాధిపాచార్యుడు" అని

రాజరాజుచే పొగడబడి, ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడైన నన్నయభట్టు తెనుగు కవిశేఖరు డనుటలో సందేహ మిసుమంతయు లేదు.

నన్నపార్యుని భారతమందలి, యవతారికా భాగమును, అశ్వాసాది అంతమందుగల పద్య గద్యములను, మరియు నాకాలవు చోళ, వేంగీ, చాళుక్య, పశ్చిమ చాళుక్యరాజుల చరిత్రములను నన్నయ గారిని గురించియు, ఆతని భారతమును గురించియు గల గ్రంథములను జదువగా ఆ మహాకవి జీవిత చరిత్రకు సంబంధించిన విషయములను నాకు దోచినవానిని సాహసించి, ఆంధ్ర విద్వల్లోకము ముందుంచు చున్నాను. ఇందేదైనా మంచి విషయములు కొన్నియైనా యున్నవని సహృదయులగు పాఠకులు దలంచిన నా ప్రయత్నము సార్థకమైనదని తృప్తి నొందెదను.

నన్నయగారికి సంబంధించిన రెండు విషయములను గురించిన పరిశోధన వలన దేలిన యంశములను మనవి జేయవలసియున్నది. ఒకటి నన్నయ రాజరాజునకు కులబ్రాహ్మణుడనుట రెండవది నారాయణభట్టును గురించినది. ఈ రెండంటిని గురించి త్వరలో వ్యాస రూపమున వ్రాయగలను.

ఆధార గ్రంథములు :—


1) శ్రీమదాంధ్ర భారతము (నన్నయగారిది)
2) రాజరాజ పట్టాభిషేక సంచిక.
3) రాజరాజ నరేంద్రుడు — శ్రీ బి. వి. కృష్ణారావు.
4) నారాయణభట్టు – కీ. శే. నోరి నరసింహశాస్త్రి.
5) ఆంధ్ర వాఙ్మయ చరిత్ర—డా॥ దివాకర్ల వేంకటావధానిగారు.
6) వ్యాసభారతము – నన్నయ పరిష్కారము – జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు.

7) భారతి - పాత సంచికలు.
8) పల్లవులు-చాళుక్యులు-డా॥ ఎన్. వేంకటరమణయ్యగారు.
9) ఆంధ్రుల చరిత్రము - కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు.
10) ది హిస్టరీ ఆఫ్ ఈస్టర్న్ చాళుక్యాస్——ఎన్. వెంకట రమణయ్యగారు.
11) మైసూరు గెజిటీర్స్-వాల్యూం-2 పార్ట్-2 ఎన్. హయవదనరావు
12) పల్నాటి వీరచరిత్ర - పాఠనిర్ణేత - కీ. శే. (శ్రీ) ఉమాకాంత విద్యాశేఖరులు.
13) కిన్నెర - (మాసపత్రిక) 19
14) ది చోళాస్ - కే. ఏ. నీలకంఠశాస్త్రి.
15) రాజరాజు కలిదిండి తామ్రశాసనము, ఇంకను మరికొన్ని గ్రంథములు, పత్రికలు.

—0—

# నన్నయభట్టు యుగము

శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, బి.యే.

రాజ్యాంగ పరిస్థితులు :—

క్రీ॥ పూ॥ 73 సం॥ మొదలు క్రీ. త. సుమారు 240 వరకు శాతవాహను లాంధ్రదేశము నేలిరి. ఆంధ్రు లుత్తర దేశమునుండి వచ్చిన వారగుటచే నీకాలమందలి వారు ప్రాకృతభాషనే మాట్లాడు చుండిరి. వీరి తర్వాత పల్లవులు క్రీ॥శ। సుమారు 240-600కు రాజ్య మొనర్చిరి. పిమ్మట క్రీ. శ. 600-1158 కు చాళుక్య లాంధ్రదేశ మును శాసించిరి. వీరి కాలముననే దేశభాష లుచ్చదశకు వచ్చినవి. ఈ విషయమునే నన్నిచోడుడు తన కుమార సంభవమున నిట్లు నుడివెను.

క॥ మనుమార్గకవిత దేశం
బున వెలయఁగ దేశికవితఁబుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁజనఁ జాళుక్యరాజు మొదలుగ బలువుర్.

రాజరాజనరేంద్రుడు క్రీ. శ. 1022 సం॥ జూలై 19వ తేదిన సింహాసనమెక్కి 1063 వరకు రాజమహేంద్రవరము ముఖ్యపట్టణముగ వేఁగిదేశమును పాలనము చేసెను. ఇతడు చోళరాజుల యాడపడుచు కుమారుడై, తన మేనమామ కుమార్తెను వివాహమాడుటచే రాజ్య మునకు బలమధికమాయెను. రాజరాజు స్వతస్సిద్ధముగా బలపరాక్రమ శాలి. అందువలన శత్రురాజు లీతనిని తలయెత్తి చూడలేకపోవుటచే దేశమున శాంతియు నీతనికి మనస్స్వాస్థ్యము నేర్పడెను. ఉత్తర హిందూదేశము నేలిన భోజరాజున కీతడు సమకాలీనుడు. రాజరాజు తన కాలమంతను పరరాజ్యముల జయించుటకై వినియోగింపక,

సంతృప్తిజెంది భోజరాజువలె కావ్యగీత ప్రియుడై సుఖతరంబుగ కాలమును గడుపుటచే భోజరాజుకంటె నదృష్టవంతుడని చెప్పవలయును. కాన నీ కాలపరిస్థితులు మతప్రచారమునకును సారస్వతాభివృద్ధికి ననుకూలముగా నుండెను.

మఱియు రాజనరేంద్రుడు సంస్కృత కర్ణాట పైశాచికాంధ్ర భాషాకవిరాజశేఖరుడైన నారాయణభట్టునకు నందమపూడి గ్రామమును, గణితశాస్త్రమును రచించిన మహాకవియగు పావులూరి మల్లనామాత్యునకు నవఖండవాడ యను గ్రామమును దానముచేసి భారద్వాజ గోత్రుడగు చీదమార్యుడను బ్రాహ్మణునకు కోరుమల్లి నామ గ్రామము చంద్రగ్రహణ పుణ్యకాలమున నొసగెను. ఇట్టి కవులను పండితుల నాదరించి యగ్రహారములిచ్చి భాషాపోషణము చేసినవా డగుటచే రాజును నన్నయభట్టు భారతమున నిట్లు స్తుతించెను.

"అగ్రజన్ములకు ననుగ్రహమునఁ
ఆ॥ చారుతరమహాగ్రహారంబు లిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁజేయుచిట్లు మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు.

మతపరిస్థితులు :—

అమరావతి, జగ్గయ్యపేట, భట్టిప్రోలు మొదలగు ప్రదేశము లందు బయలుదేరిన శాతవాహనులనాఁటి స్థూపములు శాసనములపట్టి యాకాలమం దాంధ్రదేశము బౌద్ధమతాక్రాంతమై యుండెనని స్పష్ట మగుచున్నది. ఆ కాలపువారు గాఢమగు బౌద్ధమతాభిమానులు.

బౌద్ధమత సిద్ధాంతములు :—

దీనికి కర్త బుద్ధుఁడు. వేదములు పౌరుషేయములనియు, కాన ప్రమాణములు కావనియు, సంసారమంతయు దుఃఖమయమనియు,

సర్వము క్షణయుక్తమనియు, సర్వము శూన్యమనియు, జన్మరాహిత్యమునకు కర్మసన్న్యాసము మూలమనియు, అహింసయే పరమధర్మమనియు వీరి యభిప్రాయము.

పల్లవుల కాలములో జైనమత మీ దేశమున వ్యాపించినది.

## జైనమత సిద్ధాంతములు :—

ఈ మతమును జినదేవుడు సృష్టించెను. వేదములు పౌరుషేయములు గాన ప్రమాణములు గావనియు, సదాచారదురాచారములచే జీవుల రక్షణ శిక్షణ జేయునుగాని ఈశ్వరుడు లేడనియు, అహింసయే పరమ ధర్మమనియు, సృష్టియు, జీవులు అనాదులు గాన వినాశము లేదనియు వీరి భావము.

## బ్రాహ్మణమతాభివృద్ధి :—

ఈ కాలమున జైనులు మతప్రచారము చేసిన ప్రతి స్థలమున కనుబోయి బ్రాహ్మణ మతస్థులు కూడ తమ మతమును బోధించిరి. ఆ కాలపురాజులు జైనులను బ్రాహ్మణమతస్థులనుగూడ సమానముగ గౌరవించిరి. జైనభిక్షువులకు దేవాలయములను గృహములను నిర్మించి తత్పోషణార్థమై గ్రామములను, భూములను నిచ్చుటయేగాక, యశ్వమేధాది యజ్ఞముల నొనర్చి, బ్రాహ్మణులకు భూరిదక్షిణలనిచ్చి యాదరించిరి గాన, బ్రాహ్మణ జైనమతములు విరోధములులేక దేనిదారి నది యీ దేశము ప్రబలుచుండెను. పల్లవులలో గొందఱు భారద్వాజులు పరమబ్రహ్మణ్యులు. వీరిలో కొందఱు శైవులు మఱికొందఱు వైష్ణవులు. మహేంద్రవర్మయను నాతడు మొదట జైనుడైయుండి శైవుల బాధించి, తర్వాత శైవుడై జైనుల నిర్మూలము చేసినట్లు కనిపించుచున్నది. మొత్తముమీద కాంచీపురము నేలిన పల్లవరాజులందఱు బ్రాహ్మణమతమునే ప్రోత్సహించిరి. కాని చాళు

క్యులు రాజ్యమునకు వచ్చినతర్వాత బౌద్ధమతమునకు ప్రాబల్యమును గలిగెను.

కన్నడ దేశమున పశ్చిమ చాళుక్యులు జైనమతము నాదరించుటచే కన్నడభాషలో నెక్కువ జైనవాఙ్మయము బయలుదేరినది. దక్షిణ మహారాష్ట్ర దేశములలో గూడ జైనమతము వ్యాప్తిలో గలదు. కాని బ్రాహ్మణ మతమునకు ప్రోత్సాహము గలుగగానే తత్ప్రతిపాదక నిబంధన గ్రంథములు బయలుదేరినవి. ఈ కాలమున భాగవతము రామాయణముకంటె తమిళమున ముందుగా భాషాంతరీకరింపబడెను.

పరిసరదేశములం దిట్లుండ, నాంధ్రదేశమున చాళుక్యులు రాజ్యమునకు వచ్చిన స్వల్పకాలమునకే, యనగా 7వ శతాబ్దమునందే మహాపండితుడైన కుమారిలభట్టు జైమిని సూత్రములలోని పూర్వమీమాంస పరముగ కర్మప్రధానమైన వైదికమతమును బోధించి పాషండ మతముల నడుగంట త్రొక్కివైచెను. ఇతనికి భట్టుపాదుడను నామాంతరము గలదు. జైమినిసూత్రముల కీతడు భాష్యము వ్రాసెను. దీనిని భాట్టమత మందురు. ఇతడాంధ్రుడు. తైత్తిరీయ శాఖవాడు. తండ్రి యజ్ఞేశ్వరభట్టు. తల్లి చంద్రగుణ. ప్రస్తుతము గంజాము జిల్లాలోని జయమందిరమను గ్రామమందు జన్మించెనని జినవిజయమునందు వ్రాయబడినది. ఈతడు జైనవేషము ధరించి రహస్యములైన జైనమతగ్రంథముల జైనగురువులయొద్ద నభ్యసించి, తర్వాత జైనమత ఖండనము చేసెను.

కుమారిలభట్టునకు చాళుక్యులు పూర్ణమైన యాతనిచ్చుటచే జైనమతనాశనమును వైదిక మతమునకు గట్టి పునాదియు నాతడు వేయగల్గినాడు. ఈతని తర్వాత నొక శతాబ్దమునకు శంకరాచార్యులవా రుద్భవించి యుపనిషద్భగవద్గీతా బ్రాహ్మణసూత్రములకు భాష్య

ములు వ్రాసి, పీఠముల స్థాపించి, యద్వైతమతమును బయలుదేరతీసి, నాస్తిక మతముల పారద్రోలి, జైనమత గ్రంథముల చాళుక్యుల సాహాయ్యమున దగ్ధము చేసి వారలను జయించెను. నిలువనీడలేక జైనులు పశ్చిమ చాళుక్యుల పాలనలో నుండి, జైనమత ప్రాబల్యము గల కన్నడ దేశమునకు, శ్రావణ బెలగొాము వాతాపి ప్రాంతములకు వేగిని విడిచిపెట్టిపోయిరి. అట్టివారిలో పంప, పొన్న, రన్న వంశీయులు గొందఱు. పంప 941 లోను, 997 మొదలు 1008 లో రన్నయు, భారతముల జైనపరముగ వ్రాసిరి.

వాఙ్మయ పరిస్థితులు :-

బ్రాహ్మణమత మభివృద్ధిపొందిన చాళుక్యుల కాలములో వేగి దేశమున వైదికమత ప్రతిపాదక గ్రంథములైన ధర్మశాస్త్రములు పురాణములు దేవాలయములోను రాజగృహములలోను, పురాణములుగా చెప్పబడుచుండెడివి. ఆ విధముగా గూడ మతప్రచారము గలిగెడిది. ఇతర పురాణములకంటె స్త్రీ ద్విజేతరులకుగూడ నందుబాటులోనున్న పంచమవేదమైన భారతమునందే ప్రజకు ప్రీతిజనించినది. అందుచే భారతమును తీరికగలయప్పుడెల్ల పురాణము చెప్పించుకొనెడివారు. శుభకార్యములందును పురాణములు చెప్పించుకొనుటయు, భారతప్రతుల వ్రాయించి పంచిపెట్టుటయు జరుగుచుండెడిది. 7వ శతాబ్దమున పరమేశ్వరవర్మయను పల్లవరాజొక దేవాలయమున భారతమును పురాణముగా జదివి చెప్పిన వారికై యొకయూరిలో నొకభాగ మొసగెనని తెలుపు నొక తమిళశాసనము గలదు. వేగి రాజవంశమున నొకరాణి యొకనోము చేసికొని భారతమును శత ప్రతులు వ్రాయించి బ్రాహ్మణులకు పంచిపెట్టెనట, ఈ విధముగా భారతముపై ప్రీతియధికమాయెను.

—0—

# నన్నయభట్టు రాజనరేంద్ర స్థాపనాచార్యుడు

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి

నన్నయ భట్టారకుని గుఱించియు, నాతని భారతాంధ్రీకరణమును గూర్చియు నాంధ్రదేశమునందు పెక్కుకథలు పారంపర్యముగా వచ్చుచున్న వి.

ఈతడు భారతము నాంధ్రీకరించుచుండఁగా అథర్వణాచార్యుఁడను పండితుఁడొకడు భారతమెల్ల నాంధ్రీకరించి రాజనరేంద్రునికడకు తెచ్చెననియు, నన్నయభట్టు మాత్సర్యముచేత నాగ్రంథమును తగులబెట్టించెననియు ప్రతీతి. అట్లే కవిజీవితకారులు భారతాంధ్రీకరణము అసంపూర్తిగా నిలిచిపోవుట కాక కారణముగా మరియొక కథను వ్రాసియున్నారు. "నన్నయ భట్టారకుఁడు భారతమును దెనిఁగించుచు అరణ్య పర్వమున దుండఁగా వేములవాడ భీమకవి కోపంబున 'నన్నయ భట్టింకను నరణ్యంబుననే రోదనంబు చేయుచున్నాఁడా? ఇతఁడెపుడును నట్లే యుండుఁగాక' అని శాపిమిచ్చెననియు, దానిచే నాతని కప్పటి నుండియు మతిభ్రమణము కల్గెననియు నందురు" అని వ్రాసి యిట్లు విమర్శించినారు. "కారణము లేకయే భీమన యాతనికి శాపంబిచ్చె ననుట సహేతుకంబుగ నున్నదిగాదు. గ్రంథములు మఱికొన్ని టెంబట్టి చూడఁ వీరలకు విరోధమున్నట్లుగఁ గానరాదుగాని స్నేహితమున్న ట్లుగ మాత్రము గానవచ్చుచున్నది." అని ఈ కథను త్రోసిపుచ్చిరి.
(కవి. జీవి. పు. ౫౭)

పై రెండు కథలును విశ్వాసార్హములు కాకపోవుటయే కాక నన్నయ మూడవ పర్వమును అసంపూర్ణముగా వదలెననుట సయి

తము విశ్వాసార్హముగాఁ గన్పట్టుటలేదు. తిక్కన భారతాంధ్రీకరణము నాఁటికి నన్నయ మూఁడు పర్వములను సమగ్రముగా నుండినట్లే తెలియుచున్నది.

"ఆదరణీయసార వివిధార్థగతి విస్ఫురణంబు గల్గి యష్టాదశ పర్వనిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నందాది దొడంగి మూఁడు కృతు లాంధ్ర కవిత్వ విశారదుండు విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్"

(తిక్కన. ఆం. భార. విరాట. ౧-౬)

కావున నన్నయ భట్టారకుఁడు ఆంధ్ర మహాభారతమునందు మూఁడు పర్వములే రచించుటకు నాఁడు అవకాశ మేర్పడినదనియు, నాతఁడు సమగ్రముగా 'నిర్వహింప' లేకపోవుటకు కారణము కవి యొక్క వార్ధక్యమో, మరణమో, లేక రాజుయొక్క మరణమో, రాజ్యవిప్లవమో అయి యుండవచ్చుననియు తలఁపవలసి యున్నది. నన్నయభట్టు తానే "ఆంధ్రకవిత్వ విశారదుండై" యుండ, తన సహాధ్యాయి 'అభిమతంబుగ తోడయి నిర్వహించుట' కేల యొప్పుకొనెనో, ఈ నారాయణభట్టు చరిత్రమేమో, అతనికి రాజనరేంద్రుని యాస్థానమున ఎట్టి స్థానమో- ఈ విషయములన్నియు నన్నయభట్టు రాజరాజనరేంద్రుల చరిత్రములు పరిశోధించిన విశదమగును. ఆంధ్ర కర్ణాట ద్రావిడ శాసనముల మూలమున నాఁటి రాజకీయచరిత్ర కొంత ఈ క్రింది విధమున తెలియవచ్చుచున్నది.

## శక్తివర్మ విమలాదిత్యులు :

రాజరాజనరేంద్రుడు "విమలాదిత్యాగ్రతనూజుఁడు" (భారత. ఆది. ౪ ఆశ్వా. ౨౭3) విమలాదిత్యుఁడును, ఆతని యన్నయైన శక్తివర్మయు ద్రావిడాధీశులైన చోళరాజులతో సంబంధ బాంధవ్యముల

నంది నిరంతరము వారి సాయమును పొందుచుండిరి. ఇందుల కారణము నాఁటి రాజకీయ కల్లోలములే, వాని నిచ్చట పరికించుట యుక్తము.

క్రీ. శ ౯౮౫ వఱకును చోళరాజ్యమును పరాంతకుఁడను రాజు పరిపాలించుచుండెను. ఈతని కాలమున చోళుల బలము కొంత సన్నగిల్లి యుండినది కర్ణాకదేశమును పరిపాలించుచుండిన రాష్ట్రకూట చక్రవర్తులలో ప్రసిద్ధుఁడైన ముమ్మడి కృష్ణరాజు చోళులమీఁదికి దండెత్తివచ్చి తొండై మండలమును సమగ్రముగా తన పరిపాలన లోనికి తెచ్చుకొనెను. అనఁగా నతని రాజ్యము నేఁటి మదరాసు చెంగల్పట్టు జిల్లావఱకు వ్యాపించి యుండెను. **(Altekar Rashtrakutas).** పరాంతక చోళుని కాలమున ఈ భాగమును చోళులు మరల స్వాధీనము చేసికొనలేక పోయిరి. కర్నాటక దేశమునందు ముమ్మడి కృష్ణుని యనంతరము క్రీ. శ. ౯౬౮ ప్రాంతమున కొట్టిగుఁడును, వాని వెనుక క్రీ. శ. ౯౭౨లో కక్కలుఁడును చక్రవర్తులైనను వారు చాల బలహీనులైనందున తొంటి పశ్చిమ చాళుక్య వంశీయుఁడైన ఇమ్మడి తైలపుఁడు క్రీ. శ. ౯౭౩లో యుద్ధమున కక్కలుని జయించి కర్నాటక చక్రవర్తి యాయెను.

సరిగా నీ కాలమునకు ఆంధ్రదేశమున విప్లవ మొకటి సంభవించెను. జటాచోడ భీముఁడను తెనుఁగు చోడఁడు వేంగీప్రభువైన దానార్ణవుని యుద్ధ రంగమున వధించి వేంగీ సామ్రాజ్యమును క్రీ. శ. ౯౭౩ సం. లోనే ఆక్రమించెను, దానార్ణవుని కుమారులు శక్తివర్మ విమలాదిత్యులు దేశమును త్యజించి పాఱిపోయిరి. ('Jatachoda Bhima' by Dr. N. Venkata Ramanayya Indian History Congress, 1939. p. 603)

తక్షణమే ఈ యాంధ్రరాజ సోదరులకు శరణమేమి లభించెనో తెలియరాదు. క్రీ. శ. ౯౮౫ నాఁటికి రాజరాజ చోడుఁడు ద్రవిడా

ధీశుఁడాయెను. (cholas I. p. 198) ఈతఁడు రాజ్యమునకు వచ్చిన తక్షణమే చోళరాజ్యమును విస్తరించుటకు పూనుకొనెను. కర్ణాటకు లపహరించిన రాజ్యములను మరల సంపాదించుటకు పూనుకొనెను. మహాబలవంతుఁడును, అపార రాజ్యకాంక్ష గలవాఁడు ననుటచే సింహాసనమునకు వచ్చిన యచిరకాలముననే చాలవరకు ఉత్తమ చోళుని స్వాధీనమైన తుండీరదేశమును మరల స్వాధీనము చేసికొనెను.

ఈ కాలమున నాంధ్ర సోదరులు చోళరాజు నాశ్రయించినట్లు అనంతర చరిత్రచే తెలియవచ్చుచున్నది. వీరు ద్రావిడదేశమేల ప్రవేశింపవలసి వచ్చినదో, ద్రావిడుల యాశ్రయమేల యుపేక్షింపవలసి వచ్చినదో అనంతర చరిత్ర చూచినఁగాని బోధపడదు. కర్ణాటకులు చోళులకు నిరంతర శత్రువులు. కర్ణాటక తైలపునికిని, తెనుఁగు చోళ భీమునికిని సఖ్యముండినదో లేదో తెలియదుగాని, పరాంతకుని మరణానంతర విషయములచేత వారు మిత్రులేమో యని తలంచుటకవకాశము కలుదుచున్నది. పైఁగా తైలపుఁడును, భీముఁడును తమ క్రొత్త రాజ్యములలో నప్పుడే కుదురుకొను చుండిరి అట్టి సందర్భమున నాంధ్రులకు అజవదేశమే గతియాయెను.

రాజరాజచోళుడు వేంగిని జయించుటకు ముందుగానే కర్ణాటక దేశముపై దండెత్తి తైలపునితో యుద్ధమొనరించుటచేతను, తర్వాత రాజకీయరంగమున వేంగీవిషయమున చోళులు ప్రవేశించినపుడెల్ల పశ్చిమ చాళుక్యులు తాము ఆంధ్ర ద్రావిడ కర్ణాటకముల నడిమి ఎల్లలలో పోరాసగుటచేతలు ఈ కాలమున చోళులును, శక్తివర్మ విమలాదిత్యులను కర్ణాటాంధ్ర జటాచోడ సమ్మేళనమునకు జంకుచుండిరని శంకింపవలసియున్నది. ఏది ఎట్లున్నను పట్టాభిషేకమైన ఆఱు ఏడు సంవత్సరములలోపల గంగపాడి (అనఁగా నేఁటి మైసూరు రాజ్యము), నొళంబ పాడి (అనఁగా నేఁటి అనంతపురము, బళ్ళారి,

కడుపూరు జిల్లాలు) రాజ్యమును జయించుటకు రాజరాజు దండెత్తెను. (cholas, 1 p. 207)

క్రీ. శ. ౯౯౯ సం కు కొంతముందు అనంతపురము జిల్లాలోని నల్లగొండ తాలూకాకు చేరిన రొడ్డమను గ్రామముకడ జరిగిన మహాసంగ్రామమున చాళుక్య తైలపుడు రాజరాజును ఓడించి నూట యేబది యేనుగులను యుద్ధక్షేత్రమునుండి హరించెను. (S. I. I IX 1-77) ఇందు వలన ఆచోట చోళుల పురోగమనము భంగమొందినను నొలంబపాడిలోని దక్షిణభాగము మాత్రము వారి స్వాధీనమందే నిలిచెను. ఇందుచే వారికి వేంగి మీద దాడియెత్తుట కనుకూలములు కలిగినట్లున్నది. ఏలయన కర్నాటకులు వేంగి వారికి సాయపడవలయునని వారు బళ్ళారి మార్గముగా వచ్చి కృష్ణ కుత్తరముగా దాటి కొండవీటి సీమ మార్గమున పోవలయును. ఇప్పుడు ఆ మధ్యభాగము చోళుల స్వాధీన మాయెను.

ఈ విధముగా సమకూర్చుకొని చోళులును, శక్తివర్మ విమలాదిత్యులును జటాచోడ భీముని ఎదుర్కొని క్రీ. శ. ౯౯౯—౧౦౦౦ ప్రాంతమున కంచికి సమీపమున జరిగిన యొక యుద్ధమందు అతనిని చంపిరి. అనంతరము చోళబలముతో శక్తివర్మ వేంగీ సామ్రాజ్యమునకు పట్టాభిషిక్తుడాయెను. (cholas I. p. 217, 218, 219) బహుశః ఈ కాలమందే విమలాదిత్యుడు చోళాధిపుడైన రాజరాజు కుమార్తె కుందాదేవిని వివాహ మాడియుండును.

ఏదిఎట్లున్నను ఆంధ్ర రాజకుటుంబమునకు అరవపోత్తు తప్పదాయెను. ఇందువలన దాదాపు డెబ్బది సంవత్సరములు ఆంధ్రభూమి ద్రావిడ కర్నాట సైన్యముల సంకుల సమరములకు రంగభూమి యాయెను. ఆంధ్ర భర్త పలుమారు తన స్థానమును వదలి దేశాంతర గతుడు కావలసివచ్చెను. కాని తుదకు ఆంధ్ర ద్రావిడములు రెండును

చోళరాజ దౌహిత్రుఁడైన యాంధ్రరాజన్యు పాలనకు వచ్చుటచే నాంధ్రదేశమునకు శాంతి చేకూరినది.

విమలాదిత్య శక్తివర్మల కష్టపరంపరలు క్రీ. శ. ౧౦౦౦ లోని ఈ విజయముతో నూతన పరిణామము నందినవి. శక్తివర్మ విమలాదిత్యులు వేంగీ సామ్రాజ్యమును గైకొన్న వెంటనే పశ్చిమచాళుక్యులు చోళులతో ఢీకొనిరి. క్రీ. శ. ౧౦౦౩ సంవత్సరపు చోళశాసనములు ఈ విషయమును, ప్రస్తావించుచున్నవి. **(333 of 1927 cholas I, p. 210)** క్రీ శ. ౯౯౭ సం. తైలపుఁడు గతించి సత్యాశ్రయుఁడు, ఆతని కుమారుఁడు కర్ణాటక చక్రవర్తియాయెను. ఈతనికిని, చోళులకును జరిగిన సంగ్రామము గంగపాడి నాళంబపాడి రాజ్యముల కొఱకగునో కాదో గాని క్రీ. శ. ౧౦౦౬ లో నీతడు వేంగిపై దండెత్తి వచ్చెను. దన్నాడయన్మదల యను ప్రదేశములోని కోటలను ఈతని సేనాధిపతియైన బయలనంబి యనునాఁడు నాతఁడు తగులఁబెట్టి కొన్ని దినములు చేబోలునందు విడిసియుండెను. **(S I. I. Vol. VI-102)** ఈ దండయాత్ర వేంగిని స్వాధీన పఱచుకొనుట కన్న నక్కాలమున కర్ణాటదేశమును ప్రవేశించిన చోళులను పాఱద్రోలుటకే యగును. ఏలన ౧౦౦౩ సం॥ముననను, ఆతర్వాత చోళులు చాళుక్య రాజ్యమున ప్రవేశించి బీజాపుర జిల్లాలోని దోనూరు వఱకును వ్యాపించి దేశమును కొల్లఁబెట్టిరి. **(E. I. XVI. p. 74)**

వేంగీ రాజ్యమును శక్తివర్మ క్రీ. శ. ౧౦౧౧ వఱకు పరిపాలించెను. అతఁడు గతించిన వెనుక నాతని సోదరుఁడు విమలాదిత్యుఁడు రాజాయెను. కాని ఏకారణము చేతనో వెంటనే పట్టాభిషిక్తుఁడుగాక కొంతకాలము చోళదేశమున మామగారి యింట తిరువయ్యారులోనే యుండెను. ఈతని శాసనమొకటి క్రీ. శ. ౧౦౧౮ లో తిరువయ్యారులో కలదు. **(215 of 1894)** ఈ కాలమున కర్ణాటకులు వేంగీ రాజ్యము నాక్రమించి యుండి రనుటకు ప్రబల నిదర్శనములు గలవు.

౧౦౧౫ లో రాజేంద్రచోళుఁడు వేంగి మీఁదుగా కర్ణాటక ముపై దండెత్తివచ్చి జయసింహుని జయించి మరల వేంగి యందు విమలాదిత్యుని ప్రతిష్ఠించెను.

విమలాదిత్యుఁడు ౧౦౧౮ వఱకును వేంగిని పాలించి చని పోయెను.

## రాజరాజనరేంద్రుని యవస్థలు :

క్రీ. శ. ౧౦౧౮ తర్వాత, మరల వేంగీరాజ్యమున కలతలు ప్రారంభమైనవి. విమలాదిత్యుని మరణానంతరము తక్షణమే రాజరాజ నరేంద్రుడు రాజ్యమునకు రాలేదు. అతని (సవతి) తమ్ముఁడైన విష్ణు వర్ధన విజయాదిత్యుఁడు పశ్చిమచాళుక్యుల సాయమున అన్నను తఱిమి వైచి వేంగీ సామ్రాజ్యమును నపహరించెను. రాజరాజ నరేంద్రుఁడు చేయునదిలేక చోళదేశమునకు మామ కడకు పాఱిపోయెను. (భారతి. స్వభాను వైశాఖ. పు. ౭౩౭). చోళదేశమున రాజరాజు గతించి అతని కుమారుఁడు రాజేంద్రచోళుఁడు చక్రవర్తి యాయెను. ఈతఁడును తండ్రివలెనే పరాక్రమశాలి. క్రీ. శ. ౧౦౨౧ ప్రాంతమున రెండు సైన్యములను- ఒకటి కర్ణాటకమునకును, మఱియొకటి వేంగికిని పంపి చాళుక్య జయసింహుని ఓడించి వేంగిని మరల గ్రహించి, తాను కొంత కాలము వేంగియందుండి, స్వయముగా రాజరాజనరేంద్రునికి పట్టాభిషేకమొనరించి ద్రవిడదేశమునకు మరలిపోయెను. (రాజేంద్ర చోళ చక్రవర్తి—వేంగి భారతి. స్వభాను. ఆశ్వయుజ) రాజరాజనరేం ద్రుఁడు క్రీ. శ. ౧౦౩౦ వఱకును నిరాఘాటముగా రాజ్యమును పరిపా లించుచుండెను.

మరల చిక్కులు ప్రారంభమైనవి. క్రీ. శ. ౧౦౩౧లో విజయా దిత్యుఁడు పశ్చిమ చాళుక్యుల సాయమునంది కాబోలు, మరల అన్నను పాఱద్రోలి వేంగీ సామ్రాజ్యమునకు మహోవైభవమున

పట్టాభిషేకము చేయించుకొనెను (J.A.H.R.S. 11. P. 277). రాజనరేంద్రుఁడు ఇంకొకమాఱు చోళదేశమునకు పోయి తిరుగ అరవ సైన్యమును చేకూర్చుకొని క్రీ.శ. ౧౦౭౫ ప్రాంతమున తిరుగ రాజ్యమును సంపాదించుకొనెను. ఈ కాలమున నీతనికి పశ్చిమ చాళుక్యులు ప్రబల విరోధులై ప్రతిఘటించిరి. ఈతని సైన్యము వచ్చుసరికి వేంగియందు చాళుక్యుల బలముండినట్లును వారప్పటికే బెజవాడ కోటను సాధించియుండినట్లును నిదర్శనములు గలవు. పశ్చిమ చాళుక్యుల సైన్యమును ప్రతిఘటించిన ద్రవిడ సేనాపతి బ్రాహ్మణుఁడును, ఆతని క్రింది సేనాపతులును కలిదిండియను గ్రామమున బరిగిన రణరంగమున మడిసిరి. వీరికొఱకై రాజరాజ నరేంద్రుఁడు శివాలయములను నిర్మించి వానికై భూదానములు గావించెను. (కలిదిండి శాసనమున తారీఖు పోయినది. అది బహుశః ౧౦౩౫, లేక ౧౦౩౭ ప్రాంతమేగాని ౧౦౪౫ కాఁజాలదని తోఁచుచున్నది.)

ఈ విషయానంతరము కొంతకాలము మరల శాంతిచేకూరెను. గాని యది కొంతకాలమే. క్రీ.శ. ౧౦౪౨ ప్రాంతమున పశ్చిమ చాళుక్య చక్రవర్తి జయసింహుఁడు మరణించెను. వాని కుమారుఁడు త్రైలోక్య మాల్లాహవమల్ల బిరుదాంకితుఁడు, పరాక్రమశాలి మొదటి సోమేశ్వరుఁడు రాజ్యాధిరోహణ మొనరించెను. ఈతఁడు క్రీ.శ. ౧౦౪౪ కు ముందే వేంగిపై దండెత్తివచ్చి, వేంగిని జయించి, తన సేనానాయకుఁడైన శోభనరసు అను నాతనికి 'వేంగీపురవరేశ్వరుఁడ'ను బిరుదును, 'యువరాజ' లాంఛనములను ఒసంగి సమ్మానించెను. (Local Records Vol. 25 P. 90). తక్షణమే రాజేంద్రచోళుని కొమారుఁడైన రాజాధిరాజు దండువెడలి వేంగీ దేశమందలి దన్నాడయను ప్రదేశమున చాళుక్యుల బలములను ఢీకొనెను. ఈ దన్నాడ యను నది కృష్ణకు దక్షిణ తీరమునందలి దన్నాడ; చరిత్ర ప్రసిద్ధమైన ధాన్యవాటి, దన్నాలకోట. కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలో నొక

దన్నాడ కలదుగాని ఇది అది కాదనుటకు, ఎప్పుడు చోళ చాళుక్య యుద్ధమేర్పడినను ఇరువురంకును ధాన్యవాటికడ పోరు పొసగుటయే నిదర్శనము. ఈ యుద్ధమునందు చాళుక్యుల దండనాయకులు గండ పయ్య గంగాధరులను వారు రంగమున మడిసిరి. విక్కి, విజయా దిత్యుఁడు, సంగమయ్య అనువారు పాఱిపోయిరి. ఈ విక్కి యను వాఁడు సోమేశ్వరుఁడు రెండవ కుమారుఁడైన విక్రమాదిత్యుఁడని చరిత్రకారుల యభిప్రాయము. విజయాదిత్యుఁడు రాజనరేంద్రుని సోదరుఁడు విష్ణువర్ధన విజయాదిత్యుడేగాని యన్యుఁడు కానేరఁడు. సంగమయ్య చాళుక్య దండనాయకులలో ప్రసిద్ధుఁడు. ఆ వెనుక చోళుల సైన్యములు చాళుక్యులను వెన్నాడి కొల్లిపాక నగరము వఱకు వచ్చి దానిని తగులఁబెట్టిరని చోళశాసనములు నుడువుచున్నవి. **(S.I.I IV. 329)**

కాని ఈ యుద్ధమునందు చోళుల కెంతమాత్రమును విజయము కలుగలేదనుటకు ప్రబల నిదర్శనము 'వేంగి' వారి స్వాధీనము కాక పోవుటయే. ఏలయన, దన్నాడ కడనుండి వారు కృష్ణనుదాఁటి వేంగీ నగరమునకు పోలేక పశ్చిమమునకు దారితీసిరి. బహుశః వారి యుద్దే శము కొల్లిపాక కడనుండి అటు కృష్ణకు ఉత్తరతీరము మీఁదుగా నడచి వేంగిని ప్రవేశింపవలయునని కావలయు. కాని కొల్లిపాకకడ సైతము వీరిని పైకి పోనీయక చాళుక్య దండనాయకుఁ డొకఁడు అడ్డు పడి ఆ నగరమును కాపాడి వారి పురోగమనమును నిరోధించెను. సింగణ దేవర సునునతఁడు, బహుశః సింధువంశజుఁడు, 'కొల్లిపాకయె కావం, దక్షిణదిశాకవాటం' అను బిరుదులను ౧౦౫౫ క్రీ. శ. లో వహించి యుండుటచే నీ విషయము తెలియుచున్నది. **(E. C. VII. S. K 3-8)**

ఈ దండయాత్ర యీ విధముగా నిష్ఫలమై నంతట క్రీ. శ. ౧౦౫౭ ప్రాంతమున మరల చోళులు దండెత్తి వచ్చిరి. మరల మును

పటిపలెనే దన్నాడకడ యుద్ధమైనది. "గండర్ దినకరన్, నారణన్, గణపతి, మదుసూదనన్" అనువారిని తామెదిరించి ఓడించి తర్వాత కంపిలి నగరము ప్రవేశించి అచ్చట రాజభవనమును తగులఁబెట్టినట్లు చోళులు చెప్పకొనియున్నారు. (S.I I.V. 978). కాని ఎచ్చటను తాము వేంగిని ప్రవేశించినట్లు చెప్పకొనలేదు. గావున వేంగి వీరికి స్వాధీనము కాలేదని తెలియుచున్నది; పైఁగా వేంగిని ప్రవేశించుట కవకాశము సైత మేర్పడలేదని స్పష్టపడుచున్నది. పై నుదహరింపఁబడిన గండర్ దినకరన్ అను నాతఁడు చాళుక్య దండనాయకుఁడైన గండరాదిత్యుఁడు. ఈతఁడు ౧౦౪౭ క్రీ॥శ॥ లో సిందవాడినాడును పరిపాలించుచుండెను. మహామండలేశ్వరుఁడు. 'మండలంగావ, నాళిం మున్నిఱివ'యను బిరుదము లీతని కుండుటచే నీతఁడు ఆమండలమును కాపాడుటకై చోళుల నెదిర్చినట్లు స్పష్టము. (S.I.I. IX-I. 105) నారణన్ అనునతఁడు బ్రాహ్మణ మంత్రి, మహా ప్రచండ దండనాయకుఁడు నారాయణయ్య యనునాతఁడు. మఱియొక బ్రాహ్మణ దండనాయకుఁడు, తర్వాత మహామంత్రియైన వాఁడు, వాణస వంశస్థుఁడు, పూర్వము జయసింహ చక్రవర్తిని కాపాడిన కాళిదాస మంత్రి కుమారుఁడు.

ఈ దండయాత్రచే తమప్రయుత్నము లే మాత్రమును ఫలించక పోఁగా చోళులు ఆ మఱు సంవత్సరము తుంగభద్రనుదాఁటి పుందూరు ప్రవేశించిరి. పేరారను నదీతీరమున చాళుక్యులకును, చోళులకును గొప్ప సంగ్రామమాయెను. పలువురు చాళుక్య దండనాయకులు చెఱఁగొనిపోఁబడిరనియు, పుందూరు నగరమును పాడుఁబెట్టి, 'మణ్ణెందిబ్బ' అను నగరమును నాశమొనర్చి, అచ్చట జయస్తంభమును నాటినట్లు చోళులు చెప్పకొనియున్నారు. (6 of 1890 S.I.I.IV.329) ఈ పుంధూరనునది హైదరాబాదు రాజ్యములోని మహబూబునగరు జిల్లాలో కృష్ణానదీ తీరమున నున్నది. ఈ నగరమును పుండ్రపురమని

సంస్కృతమున వ్యవహరించుచుండిరని ఆరవ చాళుక్య విక్రమాదిత్యుని ౧౨-వ సంవత్సరపు (ప్రభవ) శాసనముచే తెలియుచున్నది. ఒకానొక మహా మండలేశ్వరుఁడు హల్లకరసు అను నాతఁడు పుందూరులో భీమసముద్రమను చెఱువుక్రింద ఒక జైన బసదికి భూదానముచేయుచు ఆయూరిని పుంహూరనియు, పుండ్రపురమనియు పేర్కొని యున్నాఁడు. (తెలింగానా శాసనములు చాళుక్య. ౨౮) మన్నెం దిబ్బ యను నది మాన్యఖేట నగరము గాక మరి యేదైనను సమీప ప్రదేశము కావలయును.

కాని చోళు వేమి చెప్పుకొన్నను వేంగి కర్నాటకుల స్వాధీనము తప్పలేదు ; చోళుల స్వాధీనము కాలేదు. పైఁగా పశ్చిమచాళుక్యుల పట్టు గట్టిపడు చుండెను. చోళులను జయించనందుచేతనో, లేక వేంగిని శత్రువులకు లోఁచిక్కనీయక కాపాడినందు చేతనో తెలియదుగాని చాళుక్య సోమేశ్వరుని పెద్దకుమారుఁడు రెండవ సోమేశ్వరుఁడు ఈ కాలమునకు సరిగా వేంగీపుర వరేశ్వరుఁడని శాసనములలో వ్యవహరింపఁబడి యున్నాఁడు (B.I-I 84. క్రీ.శ. ౧౦౬౬) వేంగిని మరల సంపాదించి రాజనరేంద్రుని పునస్థాపితునింజేయుటకు చోళులు చేసిన ఈ మూఁడవ ప్రయత్నము ఈ విధముగా భంగమైనది. పైగా చోళుల బలము క్రమముగా తగ్గుట కారంభమైనది. చాళుక్య చక్రవర్తి సోమేశ్వరుని కుమారులును, సామంతులును, మంత్రులును,దండనాయకులును మహా బలవంతులుండిరి. సోమేశ్వరుఁడు అటువైపు కొంకణ మాళవ దాహాళములను జయించి, ఇటువైపు వేంగీ రాజ్యము మీఁద పట్టు వదలక యుండెను. రాజరాజ నరేంద్రునకును, అతని అనుయాయులకును చోళ దేశమునందలి తిరువయ్యూరు నగరమే గతిగా నుండెను. క్రీ.శ. ౧౦౫౦లో నీతఁడు తిరువయ్యూరులోని శివాలయము నకు మూఁడువందల రాజరాజ మాడలను దానమిచ్చి శాసనము వ్రాయించి యున్నాఁడు. (S.I.I.V.520) ఆహా! ఆంధ్రభాషకు తొలి

పోషకుఁడని ప్రసిద్ధినందిన మహారాజెన్ని ఇడుమలనను భవించెనోగదా!
నేఁడు ద్రావిజల పొత్తు మనకింత దుస్సహముగా నుండగా నాఁడు
ఆ మహారాజు ద్రవిడదేశము నుండి ఎంత చింతించినో. తల్లి అఱవ
రాజు కుమార్తె; భార్యయు అఱవతయే. ఎందరు అయ్యర్లు, పిళ్ళైలు,
మొదలియార్లు కృష్ణాగోదావరీ నదీతీరముల నాక్రమించిరో గదా.
పోనిండు, రాజనరేంద్రునికి మరల రాజ్యము చేకూరిన చాలును.

మరల చోళులు క్రీ. శ. ౧౦౪౧ - రాజాధిరాజు యొక్క రాజ్యసంవత్సరములు 33 లో చాళుక్యుల మీఁదికి గొప్పదండయాత్రను సాగించిరి. [S.I I.VII 1048,1049;E.C.IX Dr.76] రాజాధిరాజు మరల దన్నాడ కడకువచ్చి, పరణియను కావ్యము నంకితమంది. రట్టపాడి మీఁదికి నడచి పూమూరుకడ 'నిడువాడి తెలంగ విచ్చయ్యన్' అనునతని జయించి. అతని తల్లిదండ్రులను చెఱఁగొని, ఆహావమల్లని వేగులను అవమానపఱచి తఱిమి, శిరుతుర్తై, పెరుందుర్తై, దైవభీమకాశియను నదులను దాఁటి, ఏతగిరిలో విజయస్తంభము నాటి తనకు శరణన్న రాజులతో చెండాడి, నొళంబన్, కాళిదాసన్, చాముండన్, కొమ్మయ్యన్, విల్లవరాయన్ అనువారు కయ్యమీయఁగా జయించి, ఉత్పల గూర్జరుని వంశీయుఁడు తన సాయమపేక్షింపఁగా నభయమిచ్చి, పూర్వము తైలపుఁడు ఉత్పలుని జయించి అతని కిరీటము నపహరించి తన యుద్ధభేరికి కట్టియుంచిన దానిని మరల ఉత్పలుని మనుమనికిచ్చి రట్టపాడి సప్తార్థలక్షమును జయించెనని శాసన విషయము.

ఇదెంత మాత్రము నిజమో తెలియదు. కాని వేంగి మాత్రము స్వాధీనము కాలేదు. రాజరాజనరేంద్రునకు ఈ మాఱు ద్రవిడ బలమునందు నమ్మకము సడలిపోయెను. ఇకను అఱవవారు కర్నాటకులను జయింపలేరు. తన తమ్ముఁడు తెనుఁగురాజు కాక తప్పదు. ఈ మాఱు యుద్ధమున కన్న నరేంద్రునకు నీతియే ఆశ్రయణీయమైనది.

ఇట్టి విషమపరిస్థితులలో రాజునకు "కుల బ్రాహ్మణుఁడైన నన్నయ భట్టే సాయము గావించినట్లు దెలియుచున్నది.

## —నన్నయ నీతి—

నన్నయ భట్టారకుఁడు రాజరాజనరేంద్రునకు కులబ్రాహ్మణుఁడు, అనురక్తుఁడు; కాని 'అవిరళజపహోమ తత్పరుడ' గుటచే రాజకీయముల యందాతనికి ప్రసక్తిలేదని తలంపరాదు: ఏలయన 'లోకజ్ఞుడ' నని చెప్పుకొనుచున్నాఁడు. 'సత్ప్రతిభాభి యోగ్యుఁడును నిత్యసత్యవచనుఁడు,' నగుటచే మరల తన రాజునకు రాజ్యము చేకూర్చు పనికి పూనుకొనెను. నాఁటి కింకను మహాకవి' భరత సంహితా రచన బంధురుఁడు' కాలేదు. రాజేనిలకడలేక దేశత్యాగిగా తిరుగుచుండ కవికి- అందును 'అనురక్త'నికి గ్రంథము వ్రాయునంతటి ఓపికయు, వ్యవధియునెట్లు కలుగును.

ఆ కాలమున కర్నాటక దేశము నందువాణసవంశస్థులైనని యోగి బ్రాహ్మణులు గొప్ప పదవుల యందుండిరి. వాణస వంశస్థుఁడైన మధు సూదనయ్య "కుంతల రాజ్యలక్ష్మీలతా వసంతుఁడు, దుర్మంత్రి మంత్ర నిరతరిపు నృపాల లక్ష్మీ సమాకర్షణైక మంత్రము, సకలరాజ్య కంట కోత్పాటన ప్రచండ దోర్దండుఁడు,........చాళుక్య రాజ్యభార ధౌరేయుఁడు, సార్వభౌమరాజనియోగ రాజాధ్యక్షుఁడు, చాళుక్య చక్రేశ్వర ప్రసాదాసాదిత యువరాజ పదవీ విరాజితుఁడు" ఇతని వంగడము వారెల్ల గొప్ప పదవులలో నుండిరి. కర్నాటక చక్రవర్తి యొక్క రాజ్యంతంత్రమెల్ల వీరిచేతనే యుండెను. నన్నయభట్టు యొక్క సుకృతమో, లేక రాజనరేంద్రుని సుకృతమో ఈ వంశము నకు చేరిన నారాయణభట్టు నన్నయ్యకు సహాధ్యాయి. ఏ విశ్వవిద్యాలయ మందుండగానో ఈ యిరువురకును సహాధ్యాయ సౌఖ్య మేర్పడి యుండవలెను. ఆ స్వాతంత్ర్యముచే నన్నయ నారాయణ భట్టను

చూచి ఆతని సహాయముచే మధుసూదనయ్యను దర్శించి మరల తమ రాజుకే వేంగీ సామ్రాజ్య మిప్పించి యుండవలయును. మధుసూదనయ్య ప్రోద్బలముచే కర్ణాటాధీశుండు సోమేశ్వరుఁడు వెంటనే అంగీకరించి యుండును; చోళరాజును రణరంగమందు జయించుటయే గాక అతని బంధువును, యుద్ధమునకే కారణ భూతుఁడైన వేంగీశుఁడు రాజరాజనరేంద్రుండు స్వయముగానే తనకు వశుఁడగుటకు చాల సంతసించి యుండును. ఈయూహకెల్ల నాధారము ఈ క్రింది పద్యము :-

"పాయక పాకశాసనికి భారత ఘోరరణంబు నందు నా
రాయణునట్లు వాణసకులామర వంశ విభూషణుండు నా
రాయణ భట్టు వాఙ్మయ దురంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపఁగన్"

నారాయణభట్టు నంతటివాఁడు 'ఉభయ భాషాకావ్యరచనాభిశోభితుఁడు' భారతాంధ్రీకరణమునకు పరుల సాయ ముపేక్షించుటకు కారణము పలువురు పలు తెగలుగా నభిప్రాయ పడిరి ఇందు సువ్యక్తమగు నట్టి విషయమేమనఁగా నారాయణభట్టు' వాఙ్మయదురంధరుఁడే గాక 'దన కిష్టుఁడున్ సహాధ్యాయియు నైన వాఁడు! అందుచే నిరువురకు పరస్పర స్నేహాతిరేక స్వాతంత్ర్యము లుండియుండును. పైఁగా నీతఁడు వాణసకులామర వంశవిభూషణుండు. వాణసయనునది అతని యింటిపేరు. ఇందుకు పాఠాంతములు 'వాసిగ' అనియు, 'దానును' అనియు గలవు. కాని శ్రీ దండిగుంట సూర్యనారాయణ శాస్త్రి గారును, చదలవాడ సుందరరామ శాస్త్రి గారును, కలిసి ముద్రించిన ప్రతి యందు 'వాణస' యను పాఠమునే ఇచ్చినారు. 'వాణస' యను పాఠమే సాధువుగాఁగనబడు చున్నది. ఏలయన,నారాణభట్టు ఆంధ్రుఁడు కాఁడు కర్ణాటకుఁడు. ఈతని బంధువులందరును కర్ణాటకదేశమున గలరు. పైగానీతఁడు ఆంధ్రదేశమున త్రైలోక్యమల్ల దేవర ప్రధానిగా వచ్చి యుండెనే; గాని రాజనరేంద్రుని ఆశ్రి

తుఁడు కాఁడు. ఈ విషయము దాక్షారామమున నారాయణ భట్టు కూతురు కుప్పమ్మ ౧౦౫౫ లో చేయించిన దానశాసనముచే తెలియు చున్నది. [S.I I.IV.1010] త్రైలోక్య మల్ల దేవర ప్రధాని యనఁగా చాళుక్య చక్రవర్తి త్రైలోక్య మల్లాహవమల్ల సోమేశ్వరుఁడ పంపిన రెసిడెంట్ ఆఫీసరు. ఇందుచే మఱియొక విషయము తెలియుచున్నది. రాజరాజనరేంద్రుఁడు కర్నాట సోమేశ్వరునికి వశ్యుఁడై అతని ప్రధాని నొకనిని తనకడ నుంచుకొనెను అనునది.

ఇదెల్ల క్రీ.శ. ౧౦౫౧ నాఁటికి జరిగియుండవలయును. ఆ సంవత్సరము జరిగిన యుద్ధమున చోళులు పరాజయమందఁగానే రాజరాజ నరేంద్రుఁడు నన్నయ మూలముగా సంధిప్రయత్నములు గావించి ఆ సంవత్సరమే మరల తన సింహాసనమును సంపాదించుకొని నారాయణభట్టు తనకడ నుండుట కంగీకరించెను. ఏలయన క్రీ.శ. ౧౦౫౦లో తిరువయ్యూరులో నుండిన రాజరాజనరేంద్రుఁడు ౧౦౫౧ లో నారాయణభట్టునకు రెండేరుల నడిమి విషయమున నందంపూడి యను గ్రామమును దానముగా నొసంగుచు దానిలో సంస్కృతాంధ్ర ప్రాకృత పైశాచీ కర్నాటాది భాషలలో మహాపండితునిగా వర్ణించెను. ఈ శాసనమునకు దాత రాజరాజనరేంద్రుఁడు; ప్రతిగ్రహీత నారాయణభట్టు; రచయిత నన్నయభట్టు. (ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 1. పు. ౭౫; E. I. IV. P. 300) ఈ దానమునకు కారణము పాండిత్యము మాత్రమే కాదనియు 'త్రైలోక్యమల్ల దేవర ప్రధాని' యను వాక్యముచే స్పష్టము. కావున నారాయణభట్టువొక్క పాండిత్యము మాత్రమేగాక అధికారము అతనికీ గౌరవములను సంపాదించిన దని తలంపవలయును.

## ఆంధ్ర మహాభారత రచనాకాలము

తన 'కులబ్రాహ్మణుఁడు ప్రయోగించిన ఈ నీతిచే రాజరాజ

నరేంద్రుఁడు మరల తన రాజ్యమును సంపాదించుకొనుటయే గాక సోదరునివలని బాధను తప్పించుకొనెను. విష్ణువర్ధన విజయాదిత్యుని కర్నాటకులు శాంతిపఱచి నొలంబపాడి దేశమునకు అతనిని సామంతునిగ నేర్పాటు చేసిరి.

ఈ దెబ్బచే చోళులకు యుద్ధమునకు మొగమే లేకపోయినది. కాని వారేమో యుద్ధప్రయత్నములను మానలేదు. రాజనరేంద్రునికి మాత్రము తన జీవితమునందలి తుది పదిసంవత్సరములు క్రీ.శ.౧౦౫౧ మొదలు ౧౦౬౧ వఱకు శాంతి చేకూరినది. ౧౦౫౧ నాఁటికి రాజనరేంద్రుఁడు ఏబదియేండ్ల వృద్ధుఁడుగా నుండును. తండ్రి గతించునాఁటికి (౧౦౧౮) ఇరువదియేండ్లవాఁడుగా నుండినను నేఁటికి ఏఁబదియేండ్ల పైమాట. కాని నాఁటికే యీతనిం దఱుమగల్గిన బలిష్ఠుఁడు తమ్ముఁడుండినందున ఇంకను పెద్దవాఁడుగ నుండును.

మరల రాజ్యమందు కుదురుకొనిన వెంటనే మొదటిపనిగా నీతఁడు తన రాజధానిని వేంగీపురమునుండి రాజమహేంద్రవరమునకు మార్చుకొనియుండవలయును. వేంగీపురము అనునది అంతవరకు వేంగీదేశమునకు రాజధానియని కర్నాటకుల బిరుదులచేతను, ఇతర ప్రస్తావములచేతను తెలియుచున్నది. ఇంతవరకు జరిగిన సంగ్రామములచే శత్రువులకు అందుబాటులో నుండినది. కృష్ణాగోదావరుల నడిమి ప్రదేశమున నుండుటకన్న కొంత దూరమున నుండదలఁచి, యీతఁడు గోదావరికి తూర్పుతీరమున తన నామధేయముననే నూతన పురమును రాజమహేంద్రవరమును నిర్మించుకొనెననుట స్పష్టము. ఈ విషయమునే విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో నిట్లు చెప్పినాఁడు; రాజమహేంద్రపురస్థాత రాజనరేంద్రుఁ డెక్కువతాత యే విభునకు'

పైగా రాజరాజనరేంద్రునికే రాజమహేంద్రుఁడనియు పేరు గలదు.

"రాజ కులైక భూషణుఁడు............

............రాజమహేంద్రుఁ డున్నతిన్" (భారత. ఆది. 3)

అటనే ముందు వచనమున 'రాజరాజనరేంద్రుండు' అనియు కలదు.

ఇట్లు శాంతి యేర్పడిన యనంతరము తనతోపాటు కష్టము ననుభవించిన 'యనురక్తునకు' తన కాతఁడొనర్చిన సాయమునకును అతనియందు కృతజ్ఞత చూపువాఁడై భారతాంధ్రీకరణమునకు అనుజ్ఞ నిచ్చియుండును. నన్నయ నారాయణభట్టు రాజరాజనరేంద్రులు ముప్వురును సుఖంబుండిన ౧౦౫౧-౧౦౫౫ సంవత్సరముల నడిమి కాలమున 'విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబుల నుండి యొక్కనాఁడు' 'నన్నపార్యుఁ జూచి' 'వరచళుక్యాన్వయాభరణుఁడు' 'కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు' మని ఆనతిచ్చియుండును. కష్టములన్నియుఁ గడచిపోయినవి గావున నే "వేంగీదేశంబునకు నాయక రత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు మహిమతోఁ బరమానందంబున నవవరతమహామహీ రాజ్యసుఖంబు లనుభవించు"చుండెను. ౧౦౫౫ సం. తర్వాత నారాయణభట్టుండెనో లేఁడో చెప్పుట కాధారములు లేవు ౧౦౫౧ లోనో, లేక కొంత తర్వాతనో ప్రారంభించి భారతమునందలి తొలి మూఁడు పర్వముల నాంధ్రీకరించి నన్నయభట్టస్తమించియుండును. లేనిచో ౧౦౬౧ లోపల గ్రంథమును పూర్తి చేసియుండ లేఁడా? లేక లోకజ్ఞుఁడు గావున రాచకార్యముల నడుమ ఆమాత్రమే అవకాశము దొరికినది గావలయు. పైగా నీతఁడు నారాయణభట్టు నంతటివాని సాయమును ఎంతవఱకు పొందెనో తెలియదు గాని తనకు 'సహాధ్యాయియు', 'ఇష్టుఁడు'ను సాటిపండితుఁడు నైనట్టి వాఁడు చెంతనుండి, 'అభిమతంబుగ తోడయి నిర్వహింప

మిక్కిలి అతఁడు వేంగీసామ్రాజ్యమును తన రాజున కిప్పించియుండగా తనికింతమాత్రము కృతజ్ఞత చూపుటలో నాశ్చర్యమేమి ? అంతవఱకును భారతాది గ్రంథములు కన్నడమున రచితములై యుండినను అవియన్నియు జైనసంప్రదాయానుసారులు. వైదికమత ప్రవర్తన కాదర్శమైన భారతము కావలసియుండెను. అయా లాతిభాషాగ్రంథార్థముల నెఱింగిన నారాయణభట్టు నారాయణునట్లు నిరంతరము ఉత్సాహ మొసంగుచుండియుండును. ఆ కాలమున జైనమతమును నిర్మూలించి శైవమతము తలయెత్తుచుండెను. రాజరాజనరేంద్రుఁడు ద్రావిడ సహవాసముచేతఁ గాబోలు నన్నయతో "జగత్పరిపూజ్యములైన యీశ్వరాగమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు భక్తితోన్" అనియు 'ఇవియేనున్' అను పద్యమున 'పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవమున్' అనియు, తన శివపూజానిరతిని చెప్పుకొని యున్నాఁడు. ఇట్టి పరిస్థితు లేర్పడఁగా 'నానారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.' భారతరణమున పాకశాసనికి నారాయణుఁడు సారథ్య మొనర్చి క్లిష్టసందర్భములలో నుపాయములనేర్చి విజయము చేకూర్చినట్లు నన్నయకు నారాయణభట్టు ప్రోత్సాహకారకుఁడై గ్రంథరచనను నిర్వహింపించెను. సారథి నారాయణుఁడు, పోరాడిన వాఁడు పాకశాసని, నారాయణభట్టు ప్రోత్సాహకుఁడు, నన్నయభట్టు రచయిత. ఇట్లే ప్రథమాంధ్రగ్రంథము ఆంధ్రులకు ద్రావిడదాస్య విముక్తతా సూచకధ్వజమై యొప్పారుచున్నది.

—0—

# నారాయణభట్టు

## శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

తెనుగు కవిత్వము గుణగ విజయాదిత్యుని కాలముననే ప్రౌఢసూపియున్నను, నన్నయ కవి మహాభారత రచనాబంధురుడగు వరకు జగద్విదితము కాలేదని భావించుట అనౌచిత్యముకాదు. విధాతృనకైన శక్యము కాని దుర్గమార్గజల గౌరవ భారత భారతీ సముద్రాన్ని దరిజేర్చి నీదుటలో నిమ్మహా మహునికి తోడ్పడిన వాఙ్మయ ధురంధరుడు నారాయణభట్టు. భారతావతారికయందే[1] యీ విషయము పేర్కొనుచు నన్నయ—

"పాయక పాక శాసనికి భారత ఘోర రణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ ధురంధరుఁడుం దన కిష్టుఁడున్సహా
ధ్యాయుఁడునైన వాఁడభిమతస్థితిఁదోడయి నిర్వహింపఁగాన్."

అని పేర్కొనియున్నాడు. ఇది తప్ప భారతమున నారాయణభట్టును గూర్చి మరెచ్చటను ప్రస్తావింపబడలేదు. దీనినిబట్టి యీతని బ్రాహ్మణుఁడు, వాఙ్మయ ధురంధరుడు, నన్నయకు ప్రియస్నేహితుడు, సహాధ్యాయుడునని తెలియుచున్నది. తోడయి నిర్వహించెననుట తప్ప నారాయణభట్టు తనకెట్టి సహాయము చేసెనో స్పష్టముగా చెప్పియుండని హేతువున తత్సహాయమునుగూర్చి పెక్కు అభిప్రాయ భేదము లేర్పడినవి. అవి ప్రస్తుత మిట యసంగతము. ఆ తోడ్పాటు బహుభంగుల నొప్పియుండవచ్చును.[2] భారతావతారినుబట్టి మనకు పరిచితుడైన నారాయణభట్టు వివరము లింతవరకే.

నారాయణభట్టును గూర్చి మనకు తెల్పుతున్న మరియొక చారిత్రకాధారం నందమపూడి తామ్రశాసనం.[3] ఈ శాసన, కావ్యకర్త నన్నయభట్టు. ఇది రాజరాజ నరేంద్రుడు నందమపూడి యగ్ర

హారమును నారాయణభట్టుకు ధారవోసిన దానశాసనమగుటచే దాన గ్రహీతగా నారాయణభట్టు వర్ణింపబడినాడు. అందిట్లున్నది—

"..............................

హారీతగోత్రే హరిమూర్తి రాపస్తంబ ద్విజశ్రేష్ఠ విభుర్వినీతః
సదాపురోడాశపవిత్రవక్త్రో విద్వాన భూత్కంచెన సోమయాజీ.
తస్య శ్రీమాన్ హిమకర కర ప్రస్ఫురత్కీర్తి రాశే
రాసీత్సూనుః సకల విదుషామంచితః కంచెనార్యః
యం మన్యంతే యమ మరిగణాః కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమ సుహృదో జీవితం బంధువర్గాః॥
తస్యాత్మజో మహాత్మాసమజని శౌచాంజనేయ ఇతి విదితః
ప్రజ్ఞాజిత వాచస్పతి రకలంకో శంకనామాత్యః॥
తస్యచ సుధర్మ పత్న్యాగుణ శాలిన్యాశ్చ సామె కాంబాయాః
అభవ దనుష్ఠిత జగదుపకరణో నారాయణ స్తనయః॥
యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు।
కవి రాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వ విభవేన॥
కవీన్మనీషాలవ దుర్విదగ్ధాన్ మనోహరాభిర్నిజ సూక్తిభిర్యః
కుర్వన్న గర్వాన్పటుభిర్బభర్తిన్ కవీభ వజ్రాంకుశ నామ సార్థమ్॥
తస్మై సకల జగదభిగుణశాలినే। సరస్వతీ కర్ణావతంసా అష్టా దశావ ధారణ చక్రవర్తినే। నన్నినారాయణాయ...
.............................."

—ఇందు నారాయణభట్టు నామము 'నన్నినారాయణుడ'ని చెప్పబడినది. 'నన్ని' శబ్దము కర్ణాటక భాషలోనిదనియు, దానికి 'సుందరము లేక ప్రియము' అగు నర్థమున్నదని పండితాభిప్రాయము.[4] సాధారణముగా ఇటువంటి దాన శాసనములందు దానగ్రహీత

వంశమును మూడుతరముల ముందునుండి చెప్పుట సంప్రదాయము. హారీతగోత్ర సంభవుడు, ఆపస్తంబసూత్రుడు, విద్వాంసుడు, ద్విజశ్రేష్ఠుడు నైన కంచెన సోమయాజి యీతని ముత్తాత. శత్రువులకు కాలయముడై, కవీంద్రులకు కామధేనువై వాసిక్కెన కంచనార్యుడితని పితామహుడు. మహాత్ముడు, శౌచాంజనేయుడు, ప్రజ్ఞాజిత వాచస్పతియైన యకలంక శంకనామాత్యు డీతని తండ్రి. ఈ శంకనామాత్యునకు గుణశాలినియైన సామెకాంబవలన కల్గిన పుత్రుడే యీ దానగ్రహీత నారాయణభట్టు. ఈ శాసనమందలి వర్ణనలనుబట్టి 'జగదుపకరణుడ'ని చెప్పబడిన యీ నారాయణభట్టు సంస్కృత,ప్రాకృత, కర్ణాట, పైశాచికాంధ్ర భాషలందు కవిత్వము చెప్పగల కవి రాజశేఖరుడనియు, సుకవిత్వ విభవముతో సామాన్య కవుల గర్వము నణచెడి కవిభ వజ్రాంకుశుడనియు, సరస్వతీ కర్ణావతంసుడనియు, అష్టాదశావధారణ చక్రవర్తియనియు తెలుస్తోంది. గోదావరి పాయలైన వాశిష్ఠ, వైనతేయల మధ్యనున్న 'రెండేరుల నడిమి విషయమున' నందమపూడి యగ్రహారము సర్వకరపరియోరువుగా నొక చంద్రగ్రహణ సమయమున నీతనికి ధారాపూర్వకముగా నొసగబడినది.

నారాయణభట్టును గూర్చి ప్రస్తావించిన మరియొక శాసనం దాక్షారామమునందలి కుపమ శాసనము.[5] ఇది శకవరుషంబులు 977వ సంవత్సరమున త్రైలోక్యమల్లదేవర 'ప్రధాని'గా చెప్పబడిన నారాయణభట్టు కుమార్తెయైన 'కుపమ' దాక్షారామ భీమేశ్వరదేవరకు అఖండదీప మొసగినట్లు తెల్పెడి శాసనము.

"...శకవర్ష 977 గునేంట భీమే
శ్వర దేవరకుం జక్రవర్తి త్రైలోక్యమల్లదేవర ప్రధాని నా
రాయణభట్టు కుంతుఃు కుపమపెట్టిన అఖణ్డవర్తి లోహాపు దివి
య... ... ... ... ... ... ... ... ... ..."

ఈ వ్యాసమునందు చర్చింపబడునది యీ చెప్పబడిన నారాయణభట్టు ముగ్గురు నొక్కరగుదురా లేక వేర్వేరు వ్యక్తులా యను నంశము. ముగ్గురును ఒకేకాలమున ఒకే ప్రాంతమున నివసించిన వారైనను గతములో నేర్పడిన వాదముల ననుసరించి యీ విషయ మవసరము కానేరదు.

మొదట భారతావతారికయందలి నారాయణభట్టును పరిశీలింతము. ఈయన ఆంధ్రమహాభారత కర్తయైన నన్నయభట్టునకు సహాధ్యాయుడు. భారత రచనను తోడయి నిర్వహించిన వాఙ్మయధురంధరుడు. ఈతడన్న నన్నయ కెనలేని గౌరవాభిమానములున్నట్లు అవతారికయందలి పద్యము స్పష్టపఱుచుచున్నది.

ఈతని గృహనామము 'వానస' యని చెప్పటం జరుగుతోంది. పై పద్యమునందలి రెండవ పంక్తిలో "వాసిగ ధరామరవంశ. విభూషణుండు" అని వావిళ్ళవారి ప్రతిలో నున్నది. ఆంధ్రకవి తరంగిణిలో నుదాహరించిన పద్యమున 'వాసిగ'కు బదులుగా 'దానును' యను పద మున్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున నుండెడి యొక ప్రతిలో 'మానస' అని యున్నదట. "వానస" యనుటకు బదులు లేఖకుడు పొరపాటున "మానస" అని వ్రాసియుండుననియు "వానస" పాఠమే సమంజసమనియు చాగంటి శేషయ్యగారి అభిప్రాయం.[6] దీనినిబట్టి యీతని గృహనామం "వానస"గా భావించటం జరుగుతోంది, పై పద్యంలోని ముఖ్యమైన "పదం" యిన్ని మార్పులకు, పాఠాంతరాలకు గురికావటం గమనించదగిన విషయం. కొన్ని భారత ప్రతుల్లో యీ పద్యం లేనేలేదు.[7] అసలిది అప్పకవి 'కల్పితం' కూడా కావచ్చునని కొందరి వాదం.[8] కాని అలా భావించటానికి ఆస్కారంలేదు. నన్నయ కాలమున, నన్నయకు సన్నిహితుడై, సంస్కృత ప్రాకృత కర్ణాట పైశాచికాంధ్ర భాషలయందు కవి రాజ

శేఖరుడైన నారాయణభట్టొక రుండినట్లు నందమపూడి శాసనము చాటుచుండ యీ పద్యమును కల్పితమని భ్రమించుటకన్న వాస్తవముగా గ్రహించుటయే యుక్తము. ఈ యిర్వురి నారాయణభట్టుల వర్ణనలును సరిపోయినవి కనుక, యిరువురును నన్నయకు సన్నిహితులే కనుక, యీ భారతావతారికయందలి నారాయణభట్టును, నందమపూడి దానగ్రహీత నారాయణభట్టును ఒక్కరేయని గుర్తించుట కెట్టి యభ్యంతరమును లేదు.

ఇక 'కుపమ' శాసనమున చెప్పబడిన నారాయణభట్టీతడగునో కాదో విచారించవలసియున్నది. ఈ శాసనమునందలి నారాయణభట్టు త్రైలోక్యమల్లుని మంత్రియని శాసనమున స్పష్టముగా యున్నది. త్రైలోక్యమల్ల, అహవమల్ల బిరుదాంకితుడైన యీ పశ్చిమ చాళుక్య చక్రవర్తి కల్యాణి నగరము రాజధానిగా తత్కాలమున పాలించుచున్న సోమేశ్వరుడు. అతని మంత్రికుమార్తియైన 'కుపమ' వేంగీదేశాంతర్గతమైన దాక్షారామమున భీమేశ్వరుని సేవించుటకై క్రీ॥శ॥ 1055లో వచ్చినట్లు తెలుస్తోంది. ఇదితప్ప నారాయణభట్టు వంశగోత్రాదులుగాని, పూర్వుల ప్రశంసలుగాని ప్రస్తావింపబడలేదు. ఈతడు పై నారాయణభట్టగునో కాదో గమనింపవలసియున్నది.

ఒకే కాలమున, ఒకే ప్రాంతమున ఆదే నామముతో కన్పడుచున్నప్పుడు యీ యిర్వురు నారాయణభట్లును ఒకరుగ గుర్తించుటలో పొరపాటులేదు. కాని అనుమానించుటకు కారణములు బలముగ నుండవలెను. కేవల నామ సాదృశ్యము చాలదు.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారీ విషయము చర్చించుచు[9] అంతటి చక్రవర్తి ప్రధానియైన నారాయణభట్టు వేంగీశుని యాశ్రయమున కెట్లు వచ్చి నందమపూడివంటి కుగ్రామము నెందుకు దానము పట్టవలసివచ్చినదో పరిశీలించుచు, నీతడు ముందుగా పశ్చిమ చాళుక్య

సామ్రాజ్యమున మంత్రిగానుండి యుండుననియు, తర్వాత యే కారణమువలననో దానిని వదిలివైచి వేంగీ చాళుక్య ప్రభువైన రాజరాజు నాశ్రయించెననియు భావించినారు. మతవిషయమున కల భిన్నాభిప్రాయమో, రాజకీయ కారణమో యీతనిని కన్నడసీమనుండి తెలుగునాటికి మరలించియుండును.[10]

నేలటూరి వేంకటరమణయ్యగారీ విషయమును మరియొక విధముగా నూహించిరి.[11] మారుచున్న రాజకీయ పరిస్థితులలో పశ్చిమ చాళుక్యుల నెదిరించుటకు భీతిల్లిన రాజరాజు రంగము తన కనుకూల మగువరకును కల్యాణి చాళుక్యులకు లొంగియుండుటకన్న మార్గాంతరము లేక, ఆహవమల్ల సోమేశ్వరునితో సంధిచేసుకొనెననియు, దీనితో వారిమధ్య సుహృద్భావము వెలసెననియు; తన్నిదర్శనముగా ఆహవమల్లుని ప్రధానులలో నొకరైన నారాయణభట్టు వేంగినాటికి రాజకీయ ప్రతినిధిగా పంపబడి యుండుననియు భావించిరి.

భావరాజు వేంకట కృష్ణారావుగారి యభిప్రాయ మింకొక విధముగా నున్నది.[12] నందమపూడి శాసనమున నన్నయ, నారాయణభట్టు వైదుషీ కవితా పాటవములనేగాని, యతని తరతరములనుండి యనుభవించుచున్న మంత్రిత్వమును ప్రశంసించియుండకపోవుటకు కారణములున్నవనియు, కొప్పం యుద్ధానంతరము నారాయణభట్టు కర్ణాటక దేశమున నుండ నిచ్ఛగించక రాజరాజనరేంద్రుని వెంట యాంధ్రావనికి వచ్చియుండెననియు, నన్నయభట్టు ప్రేరణముకూడ దీనికి కారణమై యుండుననియు వీరి అభిప్రాయం. ఈయనే మరియొక సందర్భమున,[13] నారాయణభట్టు పరిపాలనా బాధ్యతలనుండి వైదొలగి ప్రశాంతతతో కవిగా, పండితునిగా తన స్నేహితుడైన నన్నయతో కాలము గడపదలచి సౌజన్యుడు, రసజ్ఞుడునైన రాజరాజు కొలువు చేరియుండునని వ్రాసిరి.

వీరి యభిప్రాయములనుబట్టి నారాయణభట్టు తన చిన్ననాటి నన్నయకు సహాధ్యాయుడై మెలగి విద్యానంతరము తన తాత తండ్రులు నిర్వహించుచున్న పశ్చిమ చాళుక్యమంత్రి పదవీ బాధ్యతలను చేబూని కాలక్రమమున-

(అ) తనకు మారిన పరిస్థితులలో కల్యాణి నగరము విడిచిపెట్టి రాజరాజు కొలువుచేరి నందమపూడి యగ్రహారము గైకొని, తన సహాధ్యాయుడైన నన్నయకు భారతరచనలో సహాయపడి యుండుననిగాని,

(ఆ) రాజరాజనరేంద్రుడు రాజకీయముగా నిలద్రొక్కుకొనుటకు పశ్చిమ చాళుక్యులతో సంధి చేసుకొన్నప్పుడు ఆ షరతులలో నొక భాగముగా సోమేశ్వరుడు తన మంత్రియైన నారాయణ భట్టును వేంగీశునియొద్ద తన 'స్థానాపతి'గా రాజమహేంద్రవరమునసుంచి యుండుననిగాని-

చెప్పుకొనవలసియుండును. అట్లైన, నారాయణభట్టు కల్యాణి పాలకులతో సరిపడక పదవి పరిత్యజించిగాని, కల్యాణి పాలకుని యాజ్ఞనొందుదాల్చి వేంగీశుని చర్యలు కనిపెట్టుటకుగాని. వేంగి నేలకు తరలివచ్చి యుండును. ఈ రెండంశములలో నేది సరిపడినను నన్నయ స్నేహితుడైన నందమపూడిగ్రహీత నారాయణభట్టును, కుపమ తండ్రియు పశ్చిమ చాళుక్య ప్రధానియునైన నారాయణభట్టును యొక్కరేయని భావించవలసి యుండును. ఈ విషయములు వివరముగా పరిశీలింతము.

భారతావతారికయందలి నారాయణభట్టు తన శిష్యుడని పండితుడని నన్నయ పేర్కొన్నాడు. అదే నన్నయ వ్రాసిన నందమపూడి శాసనమున నారాయణభట్టు పాండిత్య విభవాన్ని మరింత చక్కగా, విపులంగా ప్రశంసించాడు. కనుక యీ నారాయణభట్టిరువురు నొక్కరే యని నిస్సందేహంగా గుర్తించటం జరిగింది. కాని కుపమ తండ్రిగా

దాక్షారామపు శాసనంలో పేర్కొనబడ్డ ప్రధాని నారాయణభట్టును, యీ పండితునిగా గుర్తించటానికి అవకాశాలు తక్కువ. కేవల నామసాదృశ్యమే ఆధారం. దీనినిబట్టే చరిత్రకారులు వేర్వేరుకోణాల్లో వూహించవలసి వచ్చింది. కాని యీ పశ్చిమ చాళుక్య ప్రధానియే నన్నయకు భారత రచనాకార్యమున తోడయియుండుననుటకు నిర్బాధకమైన ఆధారము లేదు. ఎటువంటి ఆధారమును లేనిదే వీరిరువురి నొక్కరుగ భావించుటకు వీలులేదు. ఎవరో అనామకుని విషయమున నెట్లైన భావించుకొనవచ్చును గాని, యొక సాహితీవేత్తయైన నారాయణభట్టును, మరియొక రాజనీతి ధురంధరుడైన నారాయణభట్టును ఒక్కరుగ భావించి యటు కల్యాణి చాళుక్యచరిత్రయందును, యిటు వేంగీ చాళుక్య చరిత్రయందును ముఖ్యమైన మార్పు నాపాదించు యంశమును యింత చిన్నసాక్ష్యాధారముతో నిరూపింపబూనుట సమంజసముకాదు. ఇది ఒప్పదగిన నిరూపణ కాదని 'ఆంధ్ర కవితరంగిణి' కర్తకూడ యభిప్రాయపడిరి.

ఈ విషయము చర్చించు సందర్భమున నందమపూడి, దాక్షారామపు శాసనముల కాలములు, తత్సమయమున వేంగీ-పశ్చిమ చాళుక్యుల మధ్య నెలకొనియున్న రాజకీయ పరిస్థితులు పేర్కొనటం చాలా ముఖ్యం. నందమపూడి శాసనం క్రీ॥శ॥ 1053 సం॥నను, కుపమ దాక్షారామపు శాసనం క్రీ॥శ॥ 1055 సం॥నను యీయబడినవి. ఈ సంవత్సరములకు ముందు వెనుకలలో రాజకీయ పరిస్థితులు, వాటి పరిణామములు గమనింపవలసియున్నది.

దక్షిణ హిందూదేశ చరిత్రలో పేర్కొనదగినవి రాజకీయముగా వేంగి కొరకు, భౌగోళికముగా రట్టపాడి కొఱకు చోళ- పశ్చిమ చాళుక్యుల మధ్య నడచిన పోరాట పరంపర. ఇవి ఒక్కసారిగ ఆహవమల్ల సోమేశ్వరుని నాటినుండే పుట్టినవి కావు. నాటికి అర్ధ శతాబ్ది

ముందట ఇరివిబెదంగ సత్యాశ్రయుడు కల్యాణిని, రాజకేసరి, వర్మ మొదటి రాజరాజు కాంచిని పాలించునప్పుడు మొదలైన పోరాటములు తద్వ్యాపారచన యందు చోళుల ఎత్తుగడయే- వేంగీ రాజ్యముతో సంబంధ బాంధవ్యములు పెంచుకొని, వంశ తత్త్వము బలపడకుండ కల్యాణీ చాళుక్యులనుండి వేంగి ప్రభువులను విడగొట్టి తమ కనుసన్నల యందుంచుకొనుట.[14] వేంగీ చాళుక్య - చోళుల సంఘటిత శక్తి యేర్పడనిదే పశ్చిమ చాళుక్యులను నిలువరించి నిలద్రొక్కుకొనలేని పరిస్థితి చోళ సామ్రాట్టులది; చోళ సహాయములేనిదే చెలరేగుచున్న అంతఃకలహములను, కళింగగాంగ,పశ్చిమ చాళుక్యులను తట్టుకొనలేని పరిస్థితి వేంగీశ్వరులది. అందువలన పరస్పర ప్రయోజనములు వారి ఐక్యతకు దారి కల్పించినవి. పట్టాభిషేకమైనది మొదలు రాజరాజున కిక్కట్లు సంభవించు నపుడెల్ల ఆదుకొనుటయన్నది చోళరాజులకొక బాధ్యతగ పరిణమించిన దనుట పొరపాటుకాదు. క్రీ॥ శ॥ 1031 సం॥న రాజ్యభ్రష్టుడైనపుడు యీ చోళ బంధువుల సహాయ మింతింతని చెప్ప లేము. ఈ ఆదుకొనుటలో చోళులకు వేంగి రాజుపై నభిమాన మెంత కలదో, తమ రాజకీయ ప్రయోజనముకూడ నంతేయున్నది. ఇటువంటి సహాయములలో గణనీయమైనది కలిదిండి యుద్ధము. "కర్ణాటక బలారణ్యాం దగ్ధు కామమశేషతః, దణ్డనాథత్రయం దృష్టమగ్నిత్రయమివోజ్వలమ్"[15] అని వర్ణింపబడినది. వేంగి వారికి సాయము చేయవల్సిన యీ అవసరమున చోళులు తమ ప్రముఖ సేనానులైన రాజరాజ బ్రహ్మమహారాజు, ఉత్తమ చోడ చోడకాన్, ఉత్తమ చోడ మిలాన్ లను-పశ్చిమ చాళుక్య వీరులకు బలిపెట్టవలసి వచ్చినది.

క్రీ॥శ॥ 1042లో పశ్చిమ చాళుక్య, రాజైన రెండవ జయసింహుడు దివంగతుడగుటతో త్రైలోక్యమల్ల, ఆహవమల్ల బిరుదాంకితుడైన సోమేశ్వరుడు కల్యాణి చాళుక్య సింహాసనమును, క్రీ॥శ॥

1044లో రాజేంద్రచోళుడు మరణించుటతో రాజాధిరాజు చోళ సింహాసనమును నధిష్ఠించి పాత పగలను ప్రజ్వలింపజేసి పరస్పరము కోటలను తగులబెట్టుకొనుచుండిరి.[16] రట్టపాడికి తోడు వేంగి రాజకీయము వీరి యాంతరంగిక విషయముగా పరిణమించినది.

ఇదే కాలమున వేంగి రాజ్యమునకై రాజరాజుతో తలపడుచున్న విజయాదిత్య విష్ణువర్ధనుడు తన పంతము నెగ్గించుకొను పూనికతో కల్యాణి చాళుక్యుల యండ జేరినాడు. రట్టపాడికై రక్తము ధారపోయుటేగాని యిరు పక్షముల వారును రణఫలితము తేలనీయకుండిరి. ఒక రంగమున ఆధిపత్యము కల్యాణి వారికి దక్కినచో, మరొక రంగమున చిత్రమున చోళ పరాక్రమమునకు చిక్కెడిది. క్రీ॥శ॥ 1046 నాటి ఒక చోళ శాసనమున రాజాధిరాజు రెండు ఘోర సంగ్రామములొనరించి రట్టపాడి నాక్రమించినట్లు తెల్పినాడు.[17] ధరణికోట యుద్ధమున ఆహవమల్లుని తరిమివైచి అతని సేనానులైన గండపయ్య, గంగాధరులను యుద్ధరంగమున కూల్చి కొల్లిపాక దుర్గమును దగ్ధమొనరించెనట.[18] మరియొక రణమును పశ్చిమ చాళుక్య సేనానులైన గండరాదిత్య, నారాయణ, గణపతి, మధుసూదనులను కూల్చి, కంపిలి దుర్గమును నేలమట్ట మొనరించెను. ఈ పరాక్రమమును తట్టుకొనలేక నుళుంబ, కాళిదాస, కొమ్మయ, చాముండాది చాళుక్య దండనాథులు పలాయనము చిత్తగించిరి.[19] ఈ యుద్ధములన్నియు దక్షిణదేశ రాజకీయములలో పశ్చిమ చాళుక్య యుద్ధతి నణగించుటకు, వారి రాజకీయ ప్రాబల్యము సమాధి చేయుటకును నిర్దేశించినవే. ఈ విజయ పరంపరలతో చోళుల యుత్సాహ మధిగమించినది. మత దురభిమానము తొంగిచూచినది. మత వైషమ్యము రాజకీయ వైషమ్యముగా పరిణమించునట్లే రాజకీయ పరిస్థితులు మతముపై ప్రసరించును. శైవమతావలంబకులైన చోళ సామ్రా

ట్టులు కన్నడనాట ఉజ్జ్వల చరిత్ర సృష్టించుకొన్న జైనమును సహింపలేక పోయిరి. కొప్పం యుద్ధమున యీ విషయమున వెలికివచ్చినది. నిలదొక్కుకొనుచున్న ఆహవమల్లుని మరల దెబ్బతీయుటకై తన సోదరుడైన రాజేంద్ర దేవుని నాయకత్వమున చోళ రాజైన రాజాధిరాజు కృష్ణానదీ తీరమున నున్న కొప్పం యొద్ద జరిపిన సమరమే కొప్పం యుద్ధము. చోళ పరాక్రమాగ్నికి తాళక ఆహవమల్లుడు యుద్ధ భూమినుండి పారిపోగా రాజేంద్రదేవుడు విజయ సూచకముగా నచట జయస్తంభము నాటి ఆహవమల్లుని కొల్హాపురము వరకు వెంట తరిమెను. ఆ సమయముననే చోళసేన పెక్కు జైనాలయములను కాల్చివైచి యా ప్రాంతములను పాడుచేసినట్లు శాసనముల మూలంగా తెలుస్తోంది. వీని యన్నింటికి ప్రతిగా పశ్చిమ చాళుక్యుల నుండి ప్రతిఘటనలు సాగక పోలేదు గాని అవియంత బలమైనవి కావు. ఇన్ని యుద్ధములు జరిగినను స్వల్ప ప్రయోజనములే తప్ప చోళులకు తిరుగులేని అధికారము చేజిక్కలేదు. వేంగిపై పూర్తి ఆధిపత్యము ఎవరికిని దక్కలేదు. ఆహవమల్ల సోమేశ్వరుని సామంతుడైన సింగణ దేవరుసు కొల్లిపాకను కాపాడినట్లు శాసనమున పేర్కొనెను. ఇవి అన్నియు క్రీ॥శ॥ 1052 ప్రాంతమున జరుగుచున్న రాజకీయ విశేషములు. వీనిని బట్టి ఒక్కటి మాత్రము స్పష్టము. ఈ సమయమునకు పశ్చిమ చాళుక్యులు తాత్కాలిక నిస్తేజమునందిరి. అపజయ పరంపరలో తీవ్ర పరాభవమునగ్రమగ్గి యదనుకై ఎదురు చూచుచుండిరి.

రెండవ కొప్పం యుద్ధము యీ పరిస్థితులను మార్చివైచినది. మరుసటి సంవత్సరమునకు బలము, పుంజుకొని కల్యాణి వీరులు విజృంభించిరి. మగటిమి నిల్పుకొని ఆహవమల్లుడు ఏ రంగమున తాను తీవ్రముగా భంగపడెనో ఆ కొప్పం రంగముననే చోళసేనా వాహినిపై చావుదెబ్బ తీసెను. జయంగొండ చోళుని వంటి యోధులు యుద్ధ

మున పాల్గొనిరి. దక్షిణ హిందూదేశ చరిత్రలో నీయుద్ధ ప్రాధాన్యత మరువరానిది. చోళులపై నున్న పశ్చిమ చాళుక్యుల కక్ష యీ యుద్ధముతో తీరినది. దడిగ దేవుని వంటి సామంతులు, సామాన్య ప్రజలుకూడ విజృంభించి చోళ సైన్యముల నుగ్గుగావించిరి. రాజాధి రాజ జయంగొండ చోళుడు ఆహవమల్లుని చేతిలో హతమయ్యెను. రాజేంద్రదేవుడు వెన్నిచ్చి పారిపోయెను. శాశ్వతముగా కాకపోయి నను చాలకాలమువరకు చోళులు యీ పరాజయమునుండి కోలుకొన లేనంత నష్టపోయిరి. దీనితో గత యుద్ధములలో తాము కోల్పో యిన ప్రాంతములు, నామమాత్రావశేషముగా ఆధిపత్యమున్న ప్రాంతములు కూడ మరల కళ్యాణి చాళుక్యుల స్వాధీనమైనవి. ఈ విధముగా తమకు రక్షకులు, బంధువులు, రణఫలితములలో భాగ స్వాములు అయిన చోళ సామ్రాట్టుల ప్రభావ మడుగంటుటతో వేంగీ చాళుక్యులకు కూడ రాజకీయ శక్తి నీరు కారినది. వేంగి దేశ మున కల్యాణి ప్రభువుల యాధిపత్యము చెలాయింపబడెను.

ఇటువంటి రాజకీయ రంగమును దృష్టిలో నుంచుకొని మనము నారాయణభట్టు విషయము గమనింపవలెను.

నారాయణభట్టును వర్ణించిన నందమపూడి శాసనం క్రీ॥ శ॥ 1053 నాటిది. ఈతనిని పశ్చిమ చాళుక్య ప్రధానిగా కొందరు చరిత్రి కారులు ప్రతిపాదించుటతప్ప నందమపూడి శాసనమున లేని విషయము స్పష్టమే. ఒకవేళ పశ్చిమ చాళుక్య ప్రధానియే అయినచో కల్యాణి ప్రభువులు క్రీ॥ శ॥ 1053 నాటికి మొదటి కొప్పం యుద్ధమున జరిగిన దారుణ పరాభవమునకు ప్రతిగా చోళులపైనను, తదాశ్రిత వేంగీ చాళుక్యాదులపైనను తీవ్ర ప్రతీకారమునకై ఎదురు చూచుచుండిరి. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో పశ్చిమ చాళుక్య ప్రధానియైన నారా యణభట్టు తమ ప్రత్యర్థుల ప్రాపున నిల్చిన వేంగీశ్వరుని మారుమూల

ప్రాంతమున యగ్రహారమునకై చేయి సాచెననుట సమంజసముకాదు. ఇట్లుకాక రాజకీయముల నేవగించుకొని, పదవి పరిత్యజించి ప్రశాంతతకై నన్నయ సాన్నిహిత్యమునకు నందమపూడి చేరెననుటకును వీలు లేదు. కుప్పం యుద్ధానంతరము నారాయణభట్టు కర్ణాటకమున నుండ నిచ్చగించక రాజరాజు వెంట ఆంధ్ర దేశమునకు వచ్చియుండుననియు, నన్నయ ప్రేరణ కూడ దీనికి కారణము కావచ్చునని భావరాజు వేంకట కృష్ణారావుగారు పేర్కొన్నారు.[20] కాని యిట్లనుటకు ఆధారములు లేవు. పదవి పరిత్యజించి అయిష్టతతో వచ్చిననాడు మరి రెండు సంవత్సరముల కీయబడిన శాసనమున 'పశ్చిమ చాళుక్య ప్రధాని'గా చెప్పబడడు. నారాయణభట్టును నతడు పశ్చిమ చాళుక్య ప్రధానియని క్రీ॥ శ॥ 1055 నాటి కుపమ శాసనం నొక్కి చెప్తోంది. కనుక సుస్పష్టముగా నందమపూడి దానగ్రహీతయైన నారాయణభట్టు, పశ్చిమ చాళుక్య ప్రధానిగా చెప్పబడిన నారాయణభట్టు ఒక్కరు కారని, వేర్వేరు వ్యక్తులని తెలుస్తోంది. ఇట్లుకాక కొప్పం యుద్ధమునకు ముందునుండియే నారాయణభట్టు పశ్చిమ చాళుక్య ప్రతినిధిగా వేంగి యందు నిల్పబడి యుండెననుట కూడ పొసగదు. సహాయమడుగుటకో, లేక సహాయముచేయుటకో, రాజరాజు క్రీ॥ శ॥ 1050 ప్రాంతమున చోళ దేశమున సంచరించుచున్నాడు.[21] శత్రు వర్గపు ప్రతినిధి (బహుశః కొంత సైన్యముతోనని కూడ వేదము వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయము.)[22] తన రాజధానియందుండి తన నడవడికలను వేయికన్నుల కనిపెట్టుచుండ రాజరాజిట్లు చేయగల్గుట అసంభవము. కనుక యీ పరిస్థితులకు ముందే నారాయణభట్టు వేంగి నాటయుండెననుట కుదురదు.

నామసాదృశ్య భ్రమలచే యీ యిరువురి నొక్కరుగా భావించుట జరిగినది గాని యిది వాస్తవము కాదని పై చారిత్రక విశేష

ములు వెల్లడించుచున్నవి. శాసనమునందలి నారాయణభట్టు వర్ణనలకు మార్పుచేర్పులు సాధ్యపడకపోవుటచే భారత ప్రతులందలి యవతారిక యందున్న "పాయక పాక శాసనికి..." పద్యమున రెండవ పంక్తిలో– దానును, వాసిగ, మానస,...పదములు వరుసగా కూర్పు నందినవి. "జగదుపకరణః" అను విశేషణమునకు విశేషార్థము కల్పించుట కూడ నిట్టిదే. ఇవి కొంత వరకు నారాయణభట్టును పశ్చిమ చాళుక్య ప్రధానిగా నూహించి సరిదిద్దినవే కావచ్చును. పశ్చిమ చాళుక్యుల యొద్ద మంత్రులుగా, దండనాథులుగా వాణస మధుసూదనయ్య, వాణస గోవింద రాజాదులు వుండుటచేతను, నారాయణభట్టు పితామహులైన కంచెనను "యంమన్యంతే యమరిగణాః"యని వర్ణించుటచే కంచెన మంత్రిత్వమునో, తత్తుల్యమగు మరియొకరిదనియో నిర్వహించి యుండునని భావించుటచేతను యిట్లు వూహించుట జరిగినది. కాని యిది సత్యము కాదు. శాసనములను, సమకాలీన చారిత్రక సన్నివేశమును దృష్టిలో నిడుకొని చూచినచో యీ యిర్వురు నారాయణభట్టుతో సమానులుగా భావించుటయే సమంజసము.

ఈ విషయము మరియొక చిన్న అంశము మూలముగ కూడ చెప్పవచ్చును. నారాయణభట్టు సహాయముచే నన్నయ భారతాంధ్రీకరణ జరిగినది. నన్నయ విరచిత భాగమైన 'సభాపర్వము'న...

"భీమ సేనుండును... పూర్వదిక్కున కరిగి...గర్ణాట దక్షిణ మల్లులను మర్ధించి వారిచేత నపరిమిత ధనంబులు గొనియె?..." అని యుద్ధ వర్ణన కలదు. (సభా. 1-244)

— ఇందు పేర్కొనబడిన 'కర్ణాట' దేశము పేరు సంస్కృత భారతదేశమున లేదు. తెలుగు భారతమున కల్పింపబడినది. ఇట్టి కల్పన "కర్ణాట కల్యాణి చాళుక్యమల్లుల" బిరుదు చరిత్ర వ్యంజకము

చేయుటకే యని పండితాభిప్రాయము.[23] కవియై నన్నయకు తోడ్పడిన నారాయణభట్టే పశ్చిమ చాళుక్య ప్రధానియైనచో నిట్లు కించపరచు రచనల కవకాశముండదు కదా!

నన్నయ మిత్రుడైన కవి నారాయణభట్టు కర్ణాట భాషలో భారతము వ్రాసినట్లును, అందలి పద్యములకును నన్నయ భారతము నందలి పద్యములకును పలుతావుల పోలికయున్నదని కొందరి అభిప్రాయం.[24] కాని యింతవరకు లభ్యమైన గ్రంథాల్లో ఆంధ్రమున గాని, కన్నడమునగాని యీతని రచనలేవియు లభ్యము కాలేదు. పద్యములు పోలిక కన్నది కన్నడమున పంప భారతమునుండియే నారాయణభట్టు భారతము నుండి కాకపోవచ్చు. వేణీ సంహార కర్త యైన భట్టనారాయణుడే నారాయణభట్టే యగునని కొందరి అభిప్రాయం.[25] అయ్యల భాస్కర కవి రచించిన రెట్టమత శాస్త్రమున "నుదిత కీర్త్యాఖ్యచే నొనరు నారాయణభట్టు మతంబును" పొగడ్తనందిన నారాయణభట్టితడే యగునేమో! ఏమైనను రచనల విషయమై యింకనూ పూర్తి పరిశీలన జరుగవలసి యున్నది.

## అధోజ్ఞాపికలు

1. "శ్రీమదాంధ్ర మహాభారతము," ఆదిపర్వము, 25వ పద్యము.

2. "ఆంధ్ర వాఙ్మయారంభ దశ" — (నన్నయ భారతము) శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, **P.** 698

3. **CP.no.** 50, ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూం **IV**; ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక; వాల్యూం **I** (1912) **p. 45.**

4. "ఆంధ్ర కవితరంగిణి", వాల్యూం **I.**

5. ఎ. ఆర్. ఇ. 185 ఆఫ్ 1893; యస్. ఐ. ఐ. వాల్యూం **VI** నెం. 1010; "యర్లీ తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్" బై బి. రాధాకృష్ణ, నెం. **127.**

6. "ఆంధ్ర కవితరంగిణి" వాల్యూం I.

7 భారతి, 1966, ఆగష్టు, పే. 28

8. భారతి, 1968, ఏప్రియల్, పే. 69

9. "రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక", పే. 104

10. భారతి, 1930, పే. 424, కె. నరసింగరావుగారి వ్యాసము.

11. "ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి"— నేలటూరి వేంకట రమణయ్య.

12. ది హిస్టరీ ఆఫ్ ది ఈస్టరన్ చాలుక్యాస్ ఆఫ్ వేంగి"— భావరాజు వేంకటకృష్ణారావు.

13 "రాజరాజనరేంద్రుడు"— భావరాజు వేంకటకృష్ణారావు.

14. "పల్లవులు - చాళుక్యులు" నేలటూరి వేంకటరమణయ్య, పే. 356, 381...

15. C. P. నెం. 5. ఎ. ఆర్. ఇ. 1937, ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూం XXIX, పే. 65.

16. "పల్లవులు—చాళుక్యులు" పే. 392

17. యస్. ఐ. ఐ. III నెం. 28

18. యస్. ఐ. ఐ. IV. నెం. 827

19. "పల్లవులు - చాళుక్యులు" పే. 395

20. "రాజరాజ నరేంద్రుడు" పే. 129

21. యస్. ఐ. ఐ. V. నెం 520

22. ఆంధ్రపత్రిక (ఉగాది సంచిక) 1970 – 71, పే. 18.

23. భారతి 1976, డిసెంబరు, పే. 67 - డి. వి. కృష్ణారెడ్డి గారి వ్యాసము.

24. 'ఆంధ్ర కవితరంగిణి' వాల్యూం I.

25. భారతి 1951, పే. 370 – బి. వేంకటేశ్వర్లుగారివ్యాసము.

# పంపయుగం మీద నన్నయ తిరుగుబాటు

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

నన్నయకు ముందు కవిత్వం ఉన్నదేమోకాని కవితోద్యమం ఉన్నట్లు లేదు. మరి నన్నయది యుగయుగాలను ప్రభావితం చేసిన కవితోద్యమం. కవిత్వం వ్రాయటంలో చూపే ఉత్సాహంమాత్రమే కాదు ఉద్యమం. కవిత్వానికి ఒక కళాస్థాయి నందించి ప్రయోగంగా సాగించటం ఉద్యమం.

నన్నయకు ముందు చెప్పుకోతగిన సాహిత్యయుగం తెలుగులో లేదు. కాని, కన్నడ సాహిత్యంలో క్రీ.శ. 940 నాటికి మొదలైన పంపయుగం స్వర్ణకాంతులతో ప్రకాశిస్తున్నది. నన్నయ కలంపట్టే నాటికి- అంటే దాదాపు క్రీ.శ. 1050 నాటికి- పంపయుగం బాగా పండబారింది. రత్నత్రయ రచనలు కన్నడసాహిత్యాన్ని పాలిస్తు న్నాయి. వారి ప్రయోగాలకూ, ప్రక్రియలకూ ఎనలేని ప్రామాణి కత్వం ఏర్పడింది. వారి బాణీలు యుగంమీద బాగా నీడలు పరచు కొన్నాయి. రత్నత్రయ రచనలతోపాటు చాముండరాయ పురాణం, నాగవర్మ కాదంబరి చంపువు, దుర్గసింహుని పంచతంత్రం, రెండవ నాగవర్మ వర్ధమాన పురాణం, మొదలైన కావ్యాలు ప్రశస్తికెక్కి ఉన్నాయి. అంటే- పంపయుగ పూర్వార్థంలో ప్రవర్తిల్లిన సాహి తోద్యమాలు నన్నయకు పూర్వరంగాన్ని సూచిస్తున్నాయన్నమాట.

పంపయుగాన్ని నన్నయ పట్టించుకోలేదని భావించటం చారి త్రక వాస్తవాన్ని విస్మరించటం. తెలుగులో నన్నయ కవితోద్య మాన్ని రూపొందించటానికి ఆయన ముందున్న పంపయుగ కవితో ద్యమంలోని చైతన్యానికి ఆయన స్పందించిన వైఖరి కాని, తిరుగుబాటు

చేసిన వైఖరికాని ప్రాతిపదిక కాకతప్పదు. దాన్ని గమనించే ముందు పంపయుగంలో కానవచ్చే సాహిత్యవృత్తిని సమీక్షించాలి.

1. మతదృష్టితో సాహిత్యాన్ని నిర్మించటం.
2. మతప్రచారం కోసం ప్రవక్తల చరిత్రలను పురాణాలుగా వినిర్మించటం.
3. మతదృష్టితో రామాయణ భారతాది కథలను మార్చి ప్రబంధ లక్షణాలతో కావ్యాలను రచించటం.
4. కృతిపతికీ, కావ్యనాయకునికీ అభేదాన్ని పాటించి, తదనుగుణంగా కావ్యవస్తువును మెలికలు తిప్పి వస్తువుకు క్లిష్టతనాపాదించటం.
5. ప్రతి కవీ ఒక ధార్మిక కావ్యాన్నీ, ఒక లౌకిక కావ్యాన్నీ తప్పక వ్రాయాలన్న మర్యాద ఒకటి ఏర్పడటం.
6. ధార్మిక కావ్యమైన పురాణంలో కావ్య కళాశిల్పాన్నీ, లౌకికకావ్యంలో ప్రబంధ లక్షణాలనూ సంప్రదించటం నియతంగా ఉండటం. ప్రయోగాలలో మార్గ దేశి సంప్రదాయాల మేలికలయిక గోచరించటం.

పంపయుగంలాంటి మహోజ్జ్వల సాహిత్యయుగంలో నివసిస్తున్న నన్నయ తెలుగులో ఆ యుగచైతన్యాన్ని అవతరింపచేయటానికి ఎంతో అవకాశమున్నది. పంపాదులు జైనమతాభినివేశం ప్రదర్శిస్తే నన్నయ వైదికమతావేశాన్ని ప్రకటించవలసింది. రత్నత్రయంలోని మతలక్షణాలను ముద్రించుకొన్న ఒక పురాణాన్నీ ఒక కావ్యాన్నీ (ధార్మిక లౌకిక కావ్యాలను) నన్నయ నిర్మించి ఉండవలసింది. అది కాలప్రభావం. కాని, నన్నయ ఆ పని చేయలేదు. ఆ కాలానికి ఎదురీదాడు. మతప్రధానంగా సాహిత్యాన్ని సృష్టించే ప్రవృత్తిని వ్యతిరేకించాడు.

నిజానికి పంపకవియుగ మతావేశలక్షణాన్ని తెలుగులోకి మోసు కొని వచ్చినవారు నన్నయ తరువాతి శివకవులు. నన్నిచోడుడు కన్నడ లౌకిక కావ్యసంప్రదాయాన్ని కుమారసంభవ కావ్యరచనద్వారా తెలుగులోకి తెచ్చాడు. పాల్కురికి సోమనాథుడు బసవపురాణాన్నీ, పండితారాధ్య చరిత్రనూ రచించి ధార్మికపురాణ కావ్యసంప్రదాయా లను తెలుగులోకి దింపాడు. నన్నయ మతకవితోద్యమానికి వ్యతిరేకి, కావ్యకళాదృష్టి ప్రధానమైన సాహిత్య ప్రక్రియా నిర్మాణోద్యమానికి అనుకూలుడు.

అంటే నన్నయ పంపయుగ సంప్రదాయాల ననుసరించి తెలు గులో కవితోద్యమాన్ని ప్రారంభించలేదన్న మాట! మతానికి సాహిత్యాన్ని వాహికగా భావించి ప్రక్రియలను రూపొందించే రత్న త్రయ ధోరణిని వ్యతిరేకించాడన్న మాట! మతాచార్య జీవితచరిత్రగా మలచిన పురాణాన్ని ధార్మిక కావ్యంగా మన్నించే పద్ధతిని కాదన్నా డన్నమాట! భారతకథను మతదృష్టితో అన్యథాకరించటానికి అంగీక రించలేదన్నమాట! అన్నివిధాలా నన్నయ మతంతో ముడిపడిన పంపయుగ ప్రక్రియలను వ్యతిరేకించాడు. పంపయుగ ప్రవృత్తిమీద తిరుగుబాటు ప్రకటించాడు పరోక్షంగా. తెలుగులో దానికి ప్రతిగా మరో సాహిత్యోద్యమానికి శ్రీకారం చుట్టాడు.

నన్నయ కావ్యేతిహాస ప్రక్రియను చేపట్టటంలో ఈ తిరుగు లక్షణం స్పష్టమౌతుంది. పంపయుగం మన్నించిన ప్రక్రియలు, పురాణం, కావ్యం, కథాకావ్యం మొదలైనవి. అవి మతదృక్పథంతో ముడిపడి ఉండడంచేత, మతప్రయోజనంకోసం ఉపయోగింపబడటంచేత, అది నన్నయకు అంగీకారం కాకపోవటంచేత, వాటిని నన్నయ విడిచి ఆ రెండింటికంటె భిన్నమైనది. ఆ రెండింటికేవలెనే బలమైనదీ అయిన

ఇతిహాస ప్రక్రియను చేపట్టటం జరిగింది. ఇతిహాసానికి మూలలక్షణం సత్యనిష్ఠ.

ఇతిహాస కథను మూలానికి వ్యతిరేకంగా మార్చటానికి వీలుండదు. అందువలన కృష్ణద్వైపాయన వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థ మేర్పడ తెనుగున ధీయుక్తితో రచించటానికి పూనుకొన్నాడు నన్నయ.

మానవుడు చతుర్విధ పురుషార్థాలను సమగ్రంగా సాధించిన విజయగాథ ఉదాత్తనాయకాశ్రితంగా చిత్రింపబడాలి ఇతిహాసంలో. ఈ లక్షణం ధర్మజనాయకమైన మహాభారతానికి దండిగా సమన్వయిస్తుంది. ఒకవేళ నన్నయ చేపట్టిన రచన మతాచార్యనాయకమైతే కన్నడంలోని జైనపురాణానికి పుత్రికగానో, పాల్కురికి సోమనాథుని బసవపురాణానికి మాతృకగానే తయారై ఉండేది. అందుకే నన్నయ దాన్ని తిరస్కరించి ఇతిహాసమైన భారతాన్ని ఎన్నుకొన్నది.

జైన రామయణాల్లోని కథలను వింటే 'రాముడికి సీత ఏమౌతుంది?'' అనే అనుమానం శ్రోతలకు కలుగవచ్చు. అలాగే, జైన భారత కావ్యకథలను చదివితే పాంచాలి భర్తృపంచక విచారం పంచబంగాళమౌతుంది. పంపభారతంలో నాయకుడు అర్జునుడు. రన్నకవి గదాయుద్ధ కావ్యంలో నాయకుడు భీముడు. వీటిల్లో ద్రౌపది పంచ పాండవులందరికీ పత్ని కాదు. పాండవమధ్యమపత్ని; భీమపత్ని, కథ లౌకిక ప్రయోజనంకోసం (రాజుగారిని – కృతిభర్తను నాయకునిగా రాణింపచేయటం కోసం) ఎన్నో వొంపులు తిరుగుతుంది. ఒక్కొక్క సారి లక్ష్యంలేని నడక నడుస్తుంది. పతితలను గంధగోళంలో ముంచెత్తుతుంది. వ్యాసభారతకథకూ, జైన భారతకథకూ అంతరం అసంతంగా పెరిగింది. జైనకవులు భారత రామాయణ కథలను మతపరంగా మలచి కల్పించిన అష్టావక్రకతలను జైనేతర సమాజంతో పాటు

నన్నయకూడా గర్హించి ఉంటాడు. క్లిష్టతరంచేసి చెప్పే జైనకావ్య కథా పద్ధతిని వదలి ప్రసన్న కథా కలితమైన కవితాపద్ధతిని నన్నయ చేపట్టి ఉంటాడు. ఇది ప్రక్రియాపరంగా, వస్తుపరంగా, కథకథన శిల్పపరంగా నన్నయ సంపయుగం మీద తెలివిగా సాగించిన తిరుగుబాటు.

మత ప్రచారంకోసం పూర్వప్రసిద్ధ ప్రక్రియనూ, వస్తువునూ ఇష్టం వచ్చినట్లు మార్చి వాడుకొనే విధానాన్ని గర్హించినా, స్వీయ కవితా వ్యక్తిత్వం కొట్టవచ్చేటట్లు కావ్యశైలిని పద్యరుచిని నిర్మించే వైఖరిని రత్నత్రయం నుండి నన్నయ గ్రహించాడు. తన శైలిని తాను నిర్మించుకొన్నాడు. తన కవితారుచిని తాను వ్యక్తీకరించుకొన్నాడు.

నన్నయ ప్రధానంగా గుణవాది. శబ్ద గుణసంయోజన శిల్పంతో కవితలో సౌందర్యాన్ని, ఆస్వాదనీయతనూ కల్పించటంలో ఆయన సిద్ధహస్తుడు. అతని కవితలోని రుచి సర్వస్వమూ కవితా సామగ్రిని గుణపోషకంగా సంవదించుకోవటంలో నిక్షిప్తమై ఉన్నది. నన్నయ వాగ్వృత్తికి ప్రసాదగుణం ప్రాణభూతం. ప్రసాదగుణం సర్వగుణసంయోజనానికి సమర్థవంతమైనది. ఓజోగుణయుక్తమైన శిథిలబంధం శబ్దగుణమైన ప్రసాదలక్షణం, నన్నయ వాక్యానికి ఇటువంటి ప్రవృత్తి సహజం. ప్రసాదగుణం చేత వైదర్భీరీతి రూపు కట్టుతుంది.

"అస్పృష్టా దోషమాత్రాభిః
సమగ్ర గుణగుంఫితా
విపంచీ స్వర సౌభాగ్యా
వైదర్భీరీతి రిష్యతే"

అని వామనుడు వక్కాణించాడు. నన్నయ కవితలో పదరచన విపంచీ స్వరవైభవాన్ని వెలారుస్తుంది. రీతి గతిని సూచిస్తుంది. కాబట్టి నన్నయ పద్యం కుంటుపడకుండా మొదటినుండి చివరిదాకా ప్రవాహ గతిని భజిస్తుంది. హృద్యమైన గతిని పద్యానికి నేర్పిన ఆచార్యుడు నన్నయభట్టు.

గుణవ్యంజకాలైనవి వర్ణాలు. ప్రసాదగుణవ్యంజకాలైన వర్ణాలను అక్షరాలను రచనలో కూర్చి రమ్యతను కల్పించటం నన్నయ రచనా శిల్పం. 'రమ్యత' అంటే రమింపదగిన భావం. అంటే ఆస్వాదనీయత్వం సర్వసాధారణంగా సహృదయ హృదయాలకు అందే గుణం. 'ఇతరు లక్షరరమ్యత నాదరింప' అని నన్నయ అనటంలోని తాత్పర్యమదే. 'నానారుచిరార్థ సూక్తి నిధిత్వం' ఆయన వాగ్వృత్తి లక్షణం రసధర్మాలైన గుణాలచేత విశిష్ట పదాలను పరమసార్థకంగా వాడటంలో ఆ లక్షణం విశ్వరూపం తాలుస్తుంది.

ఇక కథ నాటక శరీరం. రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్య శరీరం. నన్నయ శ్రవ్య కావ్య శరీర వివేచనానికి ఒక సమన్వయం సాధించాడు. అదే ఆయన పేర్కొన్న 'ప్రసన్న కథాకలితార్థయుక్తి'. ప్రసాదగుణ ప్రధానంగా కావ్యవస్తువు వ్యంగ్య మందరంగా వ్యక్తం కావటానికి రమణీయార్థాన్ని పోషకంగా నిలిపే కవితా శిల్పం నన్నయ్యలో ప్రత్యక్షమౌతుంది. ఈ అభివృద్ధి ఆంధ్రకవిత కొక అపూర్వ శక్తిని ప్రసాదించింది. తరువాత కవులు ఎన్ని ప్రయోగాలు చేసినా నన్నయ కవితారుచి వాటికి జీవధాతువుగా నిలిచింది.

మత ప్రబోధం కోసం విలువైన కవితా కళను వినియోగించు కొన్న పంపయుగ చైతన్యాన్ని ప్రతిఘటించి నన్నయ తెలుగులో కవిత్వ కళాదృష్టి ప్రధానంగాగల కావ్యేతిహాసరచన చేపట్టాడు. నన్నయ మార్గంలో నడిచిన ఏ తెలుగు కవీ మతావేశానికి కవిత్వాన్ని

దాస్యం చేయించలేదు. ఏ ప్రక్రియను చేపట్టినా దానికి కావ్య గుణాన్ని కల్పించే స్వభావాన్ని విస్మరించలేదు. కన్నడంలోని అమిత దృష్టి తెలుగులో మితహితదృష్టిగా మారింది కన్నడ లౌకికకావ్యం లోని ప్రబంధకళ తెలుగులో కావ్యకవితా స్పృహగా జాలువారింది. పంపయుగం మీద తెచ్చిన తిరుగుబాటే నన్నయ సాహిత్య దృక్పథం పంపయుగం మీద నన్నయ ఇచ్చిన తీర్పే కావ్యేతిహాసరచనం; పంపయుగ మార్గం నుండి తెచ్చిన మార్పే నన్నయగారి కవితలోని ప్రసాదగుణరుచి.



# రాజరాజనరేంద్రుడు

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

అది పదవశశాబ్దము : శాలిశాహనశకము ప్రారంభమయి యప్పటికి వేయిసంవత్సరములు కావచ్చుచుండెను. శకకర్తయయిన శాలివాహన వంశజుడు తెలుగుదొర పరిపాలనము తెలుగాణము వారికి మఱపునకు వచ్చెను. కృష్ణాతటమున అనల్పశిల్పకళా కౌశలమును బోషించిన తెలుగుదొరలపేరు మాసిపోయెను. తెలుగు జోదులమగటిమి ధావనావ శిష్టమయ్యెను. దేశమున గల్లోలములు పొడసూపెను. రాజులపై రాజులు, సోదరులపై సోదరులు కత్తులు దూసిన కాలమది. రాజ్యములు లేచినవి. సామ్రాజ్యములు కూలినవి. అవాంతరము లనేకములు సంభవించెరు. దక్షిణాపథము నంతను గూకటివ్రేళ్ళతో బెరికివేయునట్లు వీచిన తుపానులెన్ని యోకలవు. జడివానల లెక్కయేల ? కాలక్రమమున వీరచందనమును మేనబూసి, విల్లమ్ములం గేలబూని తెనుంగురాయరాహుత్తులెందఱో యీవేగి నాటిని రాజ్యమునుకట్టి తెలుగుపడుచును సౌభాగ్యవతింజేసి కీర్తి చంద్రికలను దిశలనించిరి. అలజడికాలమంతయు ఆంధ్రదేశమునకు బ్రాణరక్తమునావచించు ఆకురాలుకాలమేయైనను తన నైసర్గిక ప్రయాణమున ఋతురాజ మేతెంచెను. వసంతము తెలుగాణముతో వియ్యమందెను. ఒరుగాలి చల్లారెను. సంస్థానములు కుదురుకొనియెను.

తెలుగుజోదుకత్తి మలసి నర్తించె
తెలుగుజోదులతేజి లలిజౌకళించె
తెలుగుదొరలసేన దెసలాక్రమించె
తెలుగురాచజెక్కంబు దెసలరాణించె

పరదుర్గములుకూలె
పరరాజ్యములువీగె
తెలుఁగువారలధాటి వెలుగొందునపుడు

అల్లన నెలుగెత్తి కవికోకిలములు రాజ రసాలాశ్రయమునంది మురువుహురువులునించు భరతగీతములను బాడఁదొడంగెను.

వేఁగినాటి కానాఁడు రాజమహేంద్రవరము కడుగూర్చు రాజధాని; చివురులుతీవలు ననలు తొడిగెను. మొగ్గతొడిగిన మోహనవల్లి కలువిరిముత్తములను వెదచిమ్ముచుండెను. రాజమహేంద్రవరము నందనవనమయ్యెను. రాజమహేంద్రవర త్యాగసింహాసనము భారతికి బృందావనపీఠమయ్యెను. తెలుఁగునాట మానవ్యసగోత్రులైన బూర్వచాళుక్యుల పరిపాలనము నిరాఘాటముగ సాగుచుండెను. రాజమహేంద్రుఁడు రాజరాజు; వేఁగీదేశమునకు పట్టభద్రుఁడు. రాజరాజవిద్యామండపముననిరంతరము భారతదేవిప్రశంసయే. నిస్తేజిత వైరివీరకులదీపకుఁ డాతఁడు. ఘోర సంగ్రామములను జయించి విజయలక్ష్మిని జేపట్టెను. మహత్తర వైభవమున నోలలాడెను. కాని యాతనికిఁ దృప్తికలుగలేదు. సామంత రాజచంద్రుల రత్నకిరీట రోచులు ఆతని పదకమలములపై బ్రసరించెను. కాని యాతని మనస్సునకు స్థిమితము లేదు. పరగండభైరవుఁ డయ్యెను. బిరుదాంకభీముడయ్యెను. కాని యాతని హృదయమునకు శాంతి చేకూరలేదు. కానైతే ఆతఁడు సర్వలోకాశ్రయుఁడే! సత్యాశ్రయుడే! ఏమికార్యము ? ఇన్నియుండియు నాతనికి సౌఖ్యము నొడగూర్పఁజాలక పోయెను. ఆతని దృష్టియంతయు ఆంధ్రభారతిపైఁ దిరిగెను. “సర్వమును భాషతోనున్నది. జాతి జీవించియున్నదనుటకు భాష తార్కాణము. రాజ్యములను స్థాపింపవచ్చును. రాజ్యములను గూల్పవచ్చును కాని యవియన్నియు నశాశ్వతములు. భాషయే శాశ్వతమైనది. అక్షరమక్షరమే. జాతీయజీవనము భాషలో

నున్నది. జాతీయచైతన్యము భాషలోనున్నది. జాతీయవీరుల రక్తము భాషలోనున్నది. మతము భాషలోనున్నది. దేశభాష రెండువైపుల వాడిగల ఖడ్గమువంటిది. దానిని సరిగనుపయోగించితిమా, యదియే మనలనుద్ధరింపఁగలదు. జగత్తంతయు భాషాప్రణవమున నిమిడి యున్నది...'' ఆతఁడిట్లని దీర్ఘముగ నాలోచించెను. మందహాస ప్రభా భాసమానమైన భారతీకటాక్షవీక్షణసందర్శనము ఆతని మనశ్శాంతి ప్రవర్ధకము: గుణసంపన్నుఁడు. విద్యానిధి. కవివాణి యెందఱినో యమరులంజేసెనని యాతఁడెఱుంగును. రామచంద్రుఁడేలిన సామ్రాజ్యము కాలమను నంధకారగర్భమునఁ గరఁగిపోయెను! ఆలోకము మాఱెను. అప్పటి పరిస్థితులు మాఱెను. అప్పటివన్నియుఁ గాలపురుషుని యద్భుత సంస్పర్శకు లొంగిపోయినవి. కాని యా ధీరోదాత్తుఁడు, పితృవాక్యపరిపాలనా మహావ్రతుఁడు, రావణాసురగర్వ నిర్వాపకుఁడు, నీలమేఘశ్యాముఁడు, ఆ రాముడు ఇంకను ఆ వాల్మీకి రామాయణమున జీవకళతో నున్నాఁడు. అయోధ్య యింకను రామాయణమున నయోధ్యగనే యున్నది. ఇదియంతయు నా రాజచంద్రుఁ డెఱుఁగును. బ్రాహ్మణమతము నుద్ధరించినవాఁడు; మృదుప్రియుఁడు. మాతృపాదానుధ్యాతుఁడు, వ్యసనవివర్జితుఁడు, పరమభట్టారకుడు, పరమమాహేశ్వరుఁడు, పరమబ్రహ్మణ్యుఁడు. అట్టివాఁడు తన కులబ్రాహ్మణుఁడైన నన్నయభట్టువైపు తన క్రేగంటిచూఁపు ప్రసరింపఁజేసెను. విద్యామండమున మంత్రులుండిరి. పురోహితులుండిరి. సేనాపతి దండనాయక దౌవారికులుండిరి. మోడ్పుకేలుతో జయవెట్టుచు సామంత నృపాలు రెందఱో యుండిరి. విలాసినీజనమునకుఁ బరిమితి యెచ్చట? ఒకవైపు వైయాకరణులు, ఒకవైపు పౌరాణికులు, ఒకవైపు తార్కికులు– మద్యామండపమంతయు మహేంద్రసభాభవనమువలె నుండెను. రాజరాజు క్రేగంటిచూపు – అది సాధారణమైనదా? ఆ చూపు వ్రాలిన నన్నయభట్టు– విద్యాదయితుఁ డాతఁడు సామాన్యుడా?

ఎల్లరును రాజరాజేమి వచియించునో యని కుతూహలముతో నుండిరి. యువతీ మన్మథుడైన యా రాజరాజు మధురస్వరము అంతలో వినవచ్చెను.

క॥ జననుతకృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమ * హాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్

తెనుఁగు నుడికారము రాజరాజును సమ్మోహితునిం జేసెను. తెనుఁగుబాస కాలంబము దొరకెనని విద్యాదయితుండు సంతసమందెను. తెనుఁగునాఁటికి మంచిదినములు సంప్రాప్తమైనవని విద్వజ్జనంబులు ప్రహృష్టాంతరంగులైరి. "తల్లివంకవారి తమిళభాష రాజచిత్తము గరఁగింపఁదయ్యె; నిది యెక్కువమాట" అని దేశీయులు సంతృప్తి వహించిరి.

తెలుగు నిలిపినయట్టి మహానుభావుఁడు మన చళుక్యాన్వయాభరణుఁడైన రాజరాజనరేంద్రుఁడు. సంస్కృతమునకేగాని గౌరవము లేని యా దినములలోఁ దెలుఁగునకు సరియైన లక్షణమైనఁ గుదురు కొనని యా దినములలో బ్రాహ్మణ మతోద్ధారకులలో నొక్కఁడైన రాజరాజనరేంద్రుఁడు అప్పటికింకను దల్లిచాటుపిల్లవలె నుండిన తెలుఁగుకన్నెను దరికిఁదీసి యాదరించి దానికి దీర్పుతీరువలం దిద్ది తీరు తీయములు గలదానిగఁ జేసెను. అట్టివాఁడు రాజరాజు సామాన్యుఁడా యాతఁడు ?

పూర్వచాళుక్యులలోని యా రాజరాజును చరిత్రలో మొదటి రాజరాజందురు. ఈతఁడు విమలాదిత్యునకు కుందవాదేవికిని జనించినవాఁడు. కుందవ చోళరాజరాజు కూఁతురు. చాళుక్యులకును జోళులకును

చోళరాజరాజు కాలమునుండియే సంబంధములు కలిసెను. చాళుక్య రాజరాజు మఱల జోళరాజరాజు కుమారుఁడగు రాజేంద్రచోళుని కూతురగు అమ్మంగదేవిని వివాహమాడెను. రాజరాజనరేంద్రునికిని అమ్మంగదేవికిని జనియించినవాఁడు చాళుక్యరాజేంద్రచోళుఁడు. పదియవ శతాబ్దినాఁటికిఁ జోళులదశ యత్యుచ్ఛగ నుండెను. చోళులలో రాజరాజు, రాజేంద్రచోళుఁడు అనువారలు సుప్రసిద్ధులు. వీరలతో బూర్వ చాళుక్యులు సంబంధములుచేసి— గౌరవముకొఱకై యుండవచ్చును— చాళుక్యులనామములనే ధరియించుచు వచ్చిరి. అంతియేగాక పూర్వ చాళుక్యులు చోళులతో సంబంధములు చేసిననాఁటినుండియు గ్రమ క్రమముగ నా యాంధ్రద్రావిడ సమ్మేళనమువలనఁ దెలుఁగువారి యాచారవ్యవహార సాంప్రదాయములన్నిటిలోను మార్పు కన్పట్టఁ జొచ్చెను. కాని ద్రావిడభాషకాని, ద్రావిడాచారముకాని, ద్రావిడ సాంప్రదాయముకాని చాళుక్యరాజరాజును వశపఱచుకొనలేదు. అందువలన నాతఁడు తెలుఁగుభాషనే యాదరించి తెలుఁగు సాంప్రదాయములనే పోషించి తెలుగునకే యెక్కుడు ఘనతఁ గూర్చెను. చాళుక్యరాజరాజు కుమారుఁడగు రాజేంద్రచోళుఁడు మాత్రము తమిళమునకు బూర్తిగ లొంగిపోయెను. మేనమామల పలుకుబడి యాతనిపై చెలాయించెను. ఆతఁడు తెలుగువారినుండి వేఱయి దమిళు డయ్యెను. చోళవంశము నుద్ధరించినవాఁడని పేరువచ్చు కులోత్తుంగ చోళ బిరుదమును వహించెను. తాను మాతామహరాజ్యమైన చోళ రాజ్యమునుగూడ వశపరచుకొని చోళసింహాసనము నధిష్ఠించి చాళుక్య చోడరాజ్యములను రెంటినిగూడఁ బరిపాలించెను. తెలుఁగుదేశమునకు ద్రావిడవంశములు విరివిగ వచ్చిన దీకులోత్తుంగచోడుని కాలముననే. ఆకాలమునాఁటి వీరచోడుఁడు, విక్రమచోడుఁడు— ఈ మొదలగువారి శాసనము :ను బరీక్షించినచో నీ యంశము విశదపడఁగలదు. ఈ యాంధ్రచాళుక్య సమ్మేళనమువలన నాంధ్రసాంఘిక రాజకీయ వ్యవ

హారములలో మార్పులు గలిగినట్లే భాషలోను మార్పులు గలిగెను. తమిళపదము లెన్నియో తెలుఁగులోనికి వచ్చి తెలుఁగువేషము వేసి కొనినవి. కులోత్తుంగచోడుఁడు తమిళభాష నాదరించి దమిళ కవులను బోషించియుండెను. అందువలన చాళుక్యరాజరాజు కాలమున బ్రారంభమైన యాంధ్రభాషాభివృద్ధికి మఱల దెలుఁగుచోడులలోని వాఁడైన తిక్కన కుమారుఁడగు మనుమసిద్ధికాలము వఱకుఁ గొంత యభ్యంతరము కలిగెను. దానంజేసియైయుండనోపు నన్నయభట్టు తరువాత రెండువందల సంవత్సరములవఱకు మన కాంధ్రగ్రంథము లంతగఁ గానరావు. ఈ నడిమికాలము చాళుక్యచోళులకాలము. చాళుక్యచోళ రాజులు కులోత్తుంగుని నాటినుండియు, జోళసింహాసనమునే యధిష్ఠించుచు, బితృపితామహదేశమైన చాళుక్యరాజ్యమును గొంత యపేక్షతోఁ జూచుచు వచ్చిరి. తెలుఁగువారికిని, దెలుఁగుబాసకును బ్రథమమున నాశ్రయమిచ్చిన మహారాజు గావున నామహానీయుఁడు తెలుగువారి కంటికిఁ జాల గొప్పవాఁడు. చాల గొప్పవాఁడైన కులోత్తుంగచోళుని కంటెను గొప్పవాఁడు.

ఈ చాళుక్య రాజరాజుకాలము అత్యంత ప్రాముఖ్యమైనది. ఒక్క మన దేశమునకే గాదు. హిందూదేశమునకంతకుఁ బ్రాముఖ్యమైన కాలము. అందు దక్షిణాపథమునకు మఱియుఁ బ్రాముఖ్యమైనది.

ఆకాలముననే యుత్తరహిందూస్థానముపై బ్రతిసంవత్సరము దండయాత్రలు సలుపుచుండిన మహమ్మదు గజనీవిద్యామండపమున పారసీకభాషావల్లికఁ పువ్వులు పూసెను. ఆ కాలముననే ధారానగరమును రాజధానిగ మాళవదేశము నేలుచుండిన విద్యానిధియైన భోజమహారాజుండెను. ఆతని యాస్థానమునందలి నవరత్నములవలె నుండిన కవిపుంగవులు భారతీయులకు శ్రుతపూర్వులే. ఆ కాలముననే పశ్చిమ చాళుక్యులలో సుప్రసిద్ధులైన జయసింహ ఆహవమల్ల సోమేశ్వరు

లుండిరి. ఆకాలముననే కలచురిప్రభువులలో సుప్రసిద్ధులైన గాంగయ దేవ కర్ణదేవులు చేదిదేశమును బాలించుచుండిరి. ఆ కాలముననే తూర్పు గాంగవంశజులలోఁ బ్రసిద్ధుడును, సమర్థుడునైన వజ్రహస్తుఁడు కళింగమను బరిపాలించుచుండెను. ఆకాలముననే పునరుద్ధరింపబడిన పౌరాణికమతము క్రమక్రమముగఁ బ్రజలను వశపఱుచుకొనుచుండెను. అదియె కాలము. ఆకాలముననే రామానుజుని వైష్ణవమత ప్రబోధము నకు బీజములు నిగూఢముగ వెదచల్లబడుచుండెను. ఈవిధముగ నది యత్యంత ప్రాముఖ్యమైన కాలము. ఆ కాలమున సమర్థులైన రాజ చంద్రులు ఎవరికి వారు ప్రత్యేకముగ రాజ్యములను నిర్మించుకొని భాషాభిమానులును, మతాభిమానులునై రాణకెక్కిరి.

ఇట్టి కాలమున శాలివాహనశకము ౯౪౪ వ సంవత్సరమున రవి సింహలగ్నమున నుండగా (శ్రావణ ?) బహుళ ద్వితీయా గురు వారమున నుత్తరాభాద్రా నక్షత్రమున వణిజలగ్నమునందు రాజ రాజనరేంద్రుఁడు పూర్వచాళుక్య రాజ్యమున కభిషిక్తుఁడయ్యెను.

రాజరాజు పట్టాభిషేకమునకుఁ బూర్వము పెక్కు వైరులతో యుద్ధములు చేసినట్లును ఆ యుద్ధములందు రాజరాజే జయమునొంది నట్లును భారతము ననుసరించి గాననగును. ఏలయన, నాశ్వాసమున కాదని అంతముననుండు పద్యములందు నన్నయభట్టు ప్రయోగించిన "ఘోరాజిముఖోపలబ్ధ, విజయప్రమదాశ్రిత, బాహుదండ, నిస్తేజిత వైరి వీరకులదీప, పరనృపలలనానన, కమలహారిణాలాంఛనమూర్తి, రిపుప్రళయప్రతాప, వైరివీరరసవైద్య, జితారి, వీరోగ్రాజిజయ, పరి భూతవిరోధివర, ఘోరారిమదకుంభి కుంభవిదారణదారుణకృపా "దక్షిణ హస్త", యిట్టి సంబోధనములవలనఁ దెలియఁగలదు. వీనినిబట్టి రాజ రాజునకు విరోధులైన భూనాథులు పెక్కురుండిరనియు, వారినెల్లర నీతఁడు జయించెననియుఁ దేటపడఁగలదు. ఇందులకు శాసనప్రమా

ణము కానరాదు. కాని యీ చాళుక్యరాజరాజు పెదతండ్రి నాఁటి వఱకుఁ జాళుక్యకుటుంబమున నంతఃకలహములుండినట్లును బినతండ్రి, పెదతండ్రిబిడ్డ లొండొరులతోఁ గలహించుకొనుచు, నొక్కొక్క రొక్కొక్క కాలమున రాజ్యాధికారమును వహించుచు వచ్చినట్లును దెలిసికొనుటకు శాసనాధారములు కలవు. పెదతండ్రిబిడ్డలకుఁ బెద్ద వంశము వారనియుఁ, బినతండ్రి బిడ్డలకుఁ జిన్నవంశము వారనియు మన మంకితము సేయవచ్చును. రాజరాజనరేంద్రుని తండ్రులును, తాతలును, పెద్దవంశమువారు. ఈతని పెదతండ్రియైన శక్తివర్మ చిన్న వంశమువారైన బాదప, తాలపులను జయించి రాజ్యమునకు వచ్చి నట్లు శాసనాధారమునఁ దెలియుచున్నది. అటుతరువాత చిన్నవంశము వారిని గుఱించి యేవియు శాసనాధారములు కానరావు. కాని బాదప, తాలపులసంతతివా రెవ్వరో కొందఱుండియుండురనియు, వారుకూడ దమ పితృపితామహులవలెనే రాజ్య మాక్రమించుకొన బ్రయత్నించి యుందురనియు, యట్టివారిని రాజరాజు జయించియుండుననియు నన్నయభట్టు ప్రయోగించిన సంబోధనా పదములవలనఁ దెలిసికొన నగును. రాజరాజును గుఱించిన విశేషాంశములను దెలిసికొనుటకు నన్నయభట్టు రచియించిన భారతమే యాధారముగ నున్నది. అదియే యీ వ్యాసరచనకుఁ బ్రధానాధారము.

నన్నయభట్టు రాజరాజును వర్ణించిన విధమును జూడఁగా రాజరాజుత్తమోత్తముఁడైన రాజశ్రేష్ఠుఁడైన యట్లు కానవచ్చు చున్నయది. ఆతఁడు తల్లిదండ్రులయందు భక్తినిలిపి వారి ననవరతము పూజింపుచుండెను. వ్యసనములం దగుల్కొనక తన వంశగౌరవమును నిల్పుకొనుచు ధర్మమతియై, శిష్టపరిపాలనాసక్తుఁడును నిత్యధర్మ ప్రారంభుఁడునునై ధరాదేవాశీఃపరంపరలచే వృద్ధిఁబొందుచుఁ వచ్చెను. ఆ మహనీయుని గుణములెన్నని వర్ణింపవచ్చును? ఆతఁడు పురారాతి,

పదాబ్జపూజ నాసక్తమతి ! కృపారసబంధురుఁడు, దానవినోది దయా వర్ధిత ధారుణీసురాన్వయుడు. ఆతఁడు రాజవిద్యనంతను పారముఁ జూచినవాఁడు. గంధసింధుర హయారూఢ కౌశలమున నాతనిమించిన వాఁడాకాలమున లేడనవచ్చును. ఆతఁడు ధనుర్విద్యయం దసమాన పాండిత్యమును సంపాదించి కోదండపార్థుఁడను బిరుదు పేరుబడసి వసుధాజనగీతకీర్తి యయ్యెను. ఆతడు పెక్కుయుద్ధములను జయించి సామంతరాజులనుండి కప్పములంగొనుచుఁ దన వైభవమునంతను ధరణీ సురులపాలును, కవిజనంబులపాలును సేయుచు, సత్పాత్రాశ్రయుఁడై, సర్వలోకాశ్రయుఁడై వన్నెకెక్కినశాఁడు. రాజరాజు తన్ను గుఱించి తానే యిట్లు వచియించి యుండెనని శ్రీమదాంధ్రమహాభారతము నందలి

ఇవియేనుస్ సతతంబునాయెడఁ గరంబిష్టంబులై యుండు బా ।
యవు భూదేవ కులాభితర్పణమహీయః ప్రీతియున్ భారత ।
శ్రవణాసక్తియుఁ బార్వతీపతి పదాబ్జ ధ్యానపూజామహో ।
త్సవమున్ సంతత దానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్ ॥

అను పద్యమువలన దేలుచున్నది. ఆతనికి ద్రాక్షారామ భీమే శ్వరుఁడు ప్రధాన దైవముగ నుండెను. భీమేశ్వరకృత నిత్యప్రసాద మున సుస్థిరైశ్వర్యపదమునంది వర్ధిల్లెను. ఆతనికి 'బిరుదాంకభీము' డనియుఁ, బరగండభైరవుఁడనియు, 'రాజపరమేశ్వరుఁ' డనియుఁ 'బర గండభేరుండకుఁ' డనియు, 'రాజనారాయణుఁ' డనియుఁ, 'త్రిభువ నాంకుశుఁ' డనియు బిరుదునామములు గలవు. ఆ రాజమహేంద్రుని నన్నయభట్టు తన మహాభారతమున నిట్లభివర్ణించియున్నాఁడు.

"సీ॥ నిజమహీమండల ప్రజఁబ్రీతిఁ బెంచుచుఁ
బరమండలంబుల ధరణిపతుల

నదిమి కప్పంబులముదముతోఁ గొనుచును
బలిమినీయని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁదనయాజ్ఞ
వెలిగించుచును విప్రకులమునెల్ల
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల
నగ్రజన్ములకు ననుగ్రహమున"

"ఆ॥ జారుతరమహాగ్ర హారంబులిచ్చుచు
దేవభోగముల మహావిభూతిఁ
దనరఁజేయుచిట్లు మనుమారుఁడగు విష్ణు
వర్ధనుండు వంశవర్ధనుండు."

"ఉ॥ రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజ తే।
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా।
రాజిత సర్వలోకుఁ డపరాజితభూరిభుజా కృపాణధా।
రాజల శాంతశాత్రవపరాగుఁడు రాజమహేంద్రుఁ డున్నతిన్."

"చ॥ ఘనదురితానుబంధ కలికాలజదోషతుషార సంహతిం।
దన యుదయప్రభావమున దప్పఁగఁజోపి జగజ్జనానురం।
జనమగు రాజ్యసంతతన సంతనితాంతవిభూతి నెంతయుఁ।
దనరుఁజళుక్య మన్మధుఁడు..."

"ఉ॥ ఆశ్రితపోషణంబున వసంతవిలాసమునన్ మనీషివి।
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ।
వర్ణాశ్రమధర్మ రక్షణమహామహిమన్ మహినొప్పు సర్వలో।
కాశ్రయుఁ డాదిరాజనిభుఁడత్య కలంకచరిత్ర సంపదన్."

రాజరాజు పరిపాలనాకాలము ఆంధ్రభాషకు వసంతకాలమని నుడువవచ్చును. ఆతనికాలముతఁ బెక్కురు కవిపుంగవులుండిరి. 'కావ్య

గీతిప్రియుడైన యామహారాజు నాస్థానమున భీమనభట్టు, నన్నయ భట్టు, నారాయణభట్టు ననువారలు ప్రముఖులుగ నుండిరి. వీరు బహు భాషలలోఁ బాండిత్యమును సంపాదించి సంస్కృతాంధ్రములందుఁ జక్కని కవిత్వము జెప్పఁగలిగియుండిరి. అందువలననే నన్నపార్యుఁడు మహాభారతమున "నుభయభాషా కావ్యరచనాభిశోభితుఁ"డని పేర్కొనంబడియెను నారాయణభట్టు "వాఙ్మయధురంధరుఁ"డని కీర్తింపఁబడియెను. రాజరాజు కవిపుంగవుల కగ్రహారములను దానము సేయుచుఁ జిఱుతకూకటినాఁటి యాంధ్రకవితాకన్యకకు మువ్వాలందెలంబెట్టి, ముద్దుమురుపులు చూచినవాఁడు. ఆ మహారాజు నారాయణభట్టునకు నందమపూఁడి యను నగ్రహారమును దానము చేసెను. ఏతద్దాన శాసనమున "వాఙ్మయధురంధరుఁడు." ఇట్లభివర్ణింపబడియున్నాడు.

"తస్యాత్మజోమహాత్మాసమజని శౌచాంజనేయ ఇదివిదితః।
ప్రజ్ఞాజిత వాచస్పతిరకలంకా శంకనామాత్యః॥

"తస్యచ సుధర్మపత్న్యాగుణశాలిన్యాశ్చ సామెకాంబాయాః।
అభవదనుష్ఠిత జగదుపకరణో నారాయణ స్తనయః॥

"యః సంస్కృతకర్ణాట ప్రాకృతపైశాచి కాంధ్రభాషాసు।
కవిరాజశేఖర ఇతి ప్రథితః సుకవిత్వవిభవేన॥"

"కవీన్మనీషాలవ దుర్విదగ్ధాన్
మనోహరాభిర్నిజ సూక్తిభిర్యః
కుర్వన్నగర్వాన్ పటుభిర్బిభర్తి
కవీభ వజ్రాంకుశనామ సార్థమ్॥"

"తస్మై సకలజగదభినుత గుణశాలినే సరస్వ। తీకర్ణావతంసా యాష్టాదశావధారణ చక్రవర్తినే నన్ని నారాయణణాయ..."

యత్యంతసహజముగా నుండుటయు నూతన విషయమే. ఇట్లు పూర్వంబు సాజంబునగు పద్ధతిని గావ్యారంభము గావించిన యమ్మహానుభావు నన్నయార్యుని, త్రిలింగదేశమున నభీష్టార్థ కల్పలత యనఁదగిన యాంధ్రమహాభారత సంహితను నిలిపిన మహాయశస్సు నార్జించిన రాజరాజనరేంద్రుని మనసార ధ్యానించి యీ వ్యాసము ముగించుచున్నాఁడ.

—0—

# రాజరాజు ప్రశస్తి వివరణము

## శ్రీ బుర్రా శేషగిరిరావు

క॥ విశ్వశ్రేయోభాసిని । విశ్వజనీనాఖ్యఁగావ్య విశ్వవిధాయిన్ ।
విశ్వేశ్వర ప్రసాదిత । విశ్వవిభుండెంచె నాంధ్రవిద్వాంసులకై ॥

ఉత్తమసభాసేవ్యంబై, లోకాగమన్యాయ్యమై కాంతగృహంబై, ఇతిహాససవస్తు సముదాయంబై, నానావేదవేదాంత విద్యాయుక్తంబైన శ్రీమన్మహాభారతము "విశ్వజనీనము", "విశ్వశ్రేయోభాసి", "కావ్యవిశ్వవిధాయి" యన దగియున్నది. మన హిందూదేశమున "విశ్వజనీన" మను గ్రంథమదియే. అక్బరుపాదుషా కాలమున నది పారసిభాషలోని కనువదింపబడియు, నీ నవయుగమున నాంగ్లీకరింపబడియు హిందూరాజ్య రమావల్లభులగు పరరాజులనుగూడ జయింప గలిగినది. నిశ్చలశాంతితత్త్వము మూర్తీభవించెనో యనదగిన పురాతన ఢిల్లీపురమున సర్వోన్నతమై యాకసమునంటి తన విభవాతిశయముఁచే తారకల నర్చించుచున్నదో యనునట్లున్న కుతుబుమినారు స్థంభరాజము నధిష్ఠించి చూడ్కులను నలుదిక్కులఁ బ్రసరించినచో మనయార్యావర్తమున పుణ్యభూమియనదగు ప్రాంతమంతయు నొక్కసారిగా దృగ్గోచరమై స్వాంతముప్పొంగును. అడుగడుగునకు నార్య నాగరికతా సూచకములగు చిహ్నములు కాళ్ళపెనగొను నావిశాల ప్రదేశమున నించుక ప్రాగ్భాగమున విమర్శించినచో నచట పురాతన ఖిల్లా జాడలగపడును. అదియే భారతవీరుల రాజధానియగు నింద్రప్రస్థము. దానికిప్పటికిని నింద్రపత్తనిపేరు. దానివిషయమునన్నైనదే భారతకథమైనను కాలక్రమమున నా వీరగాథను విశదపరచు "జయ" మను వ్యాసప్రోక్తకావ్యము మహాభారత సంహితమై "విశ్వజనీన"మై ఆర్యనాగరికతను దక్షిణమునకు దెచ్చిన క్షత్రియాన్వయాభరణులకెల్ల

సమాదరణీయమై వారిప్రోత్సాహమున దేశభాషలలోని కనువదింప బడి, దేశభాషలకు గుణ గౌరవములు సంపాదించి వాటియందును నేటికి "సర్వజనీన" మగుచున్నది.

ఇట్టి కావ్యరాజము నాంధ్రములోనికి దెచ్చినవారిలో నగ్రగణ్యుడు రాజమహేంద్రవరము రాజధానిగా వేంగీదేశము నేలిన రాజరాజనరేంద్రుడను ప్రాక్ చాళుక్య వంశ్యుడగు ప్రభువు. చాళుక్యుల కుటుంబమున మహాభారత గ్రంథమం దాదరణమును, పాండిత్యమును, వాతాపినగరమున వారు రాజ్యాధికార మేర్పరచుకొనినప్పటి నుండియు ననుశ్రుతముగ వచ్చుచుండెను. **(I A VII)** రాజరాజనరేంద్రుని కాలమున నాతని తల్లివంక వారగు చోళరాజులు భారత గ్రంథమును తామేర్పరచిన వేదపాఠశాలలలో బఠనీయముగ జేసిరి. **(M Ep R 19:9)** రాజరాజునకు పూర్వము వేంగీమండలేశ్వరుడగు నరికేసరి విక్రమార్జున విజయమనుపేర మహాభారతమును కన్నడ కావ్యముగ తన సేనానియగు పంపకవి రచింప గృతినొందెను. ఇట్లు తన కుటుంబమందలి పాండిత్యవిశేషములచే వికసిత స్వాంతుడగుట చేతనే తన తండ్రివంక వారికిని తల్లివంక వారికిని సమాదరణీయమై "విశ్వజనీన"మైన భారతమందే బద్ధస్పృహుడై" రాజరాజనరేంద్రుడు భారతాంధ్రీకరణ ప్రయత్నుడై,

బహుభాషల బహువిధముల
బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్.

అని శ్రీమహాభారతకావ్య "విశ్వజనీన" త్వమును స్థిరపరచెను.

ఈతడు క్రీ. శ. 1022 సం॥న పట్టాభిషిక్తుడైనట్టుల నాపట్టాభిషేకానంతరము కొలది దినములలో రచింపబడిన కోరుమిల్లి శాసనము

వలన తెలియుచున్నది. అది రాజరాజనరేంద్రుడుజ్జ్వలదశయందుండి నపుడు నన్నయచే రచింపబడిన నందమపూడి శాసనమందలి వాక్యములవల్ల సిద్ధాంతితమగుచున్నది. కృతిసంకల్పుడును, కృతిభర్తయు నగు నీ రాజరాజనరేంద్రుని ప్రశస్తి యాంధ్రమహాభారత మందలి యంకితాంక పద్యములందు కొంత గలదు. అదియిచ్చో విమర్శనీయము. ఇట్టి ప్రశస్తివాక్యములను రచించుటను గూర్చి యాలంకారికు లేర్పరచిన నియమములుగలవు. వాటిననుసరించియే నన్నయకుపూర్వమాంధ్రమునగాకున్నను గీర్వాణ, కర్ణాటకభాషలయందు ప్రశస్తి కావ్యములు రచించిన వేంగీ మండలకవులు విఖ్యాతులైరి. ఈనియమము లనుసరణీయములైనచో ప్రశస్తియందు రాజునుగూర్చి "కులాచారయశః శౌర్యత్యాగ శీలాది" వర్ణనములును "కీర్తి, ప్రజారాగ ప్రతాపాజ్ఞా, నయ, క్షమా, వివేక, అరపురీదాహ, ధర్మసంగ్రామ" పూర్వకములగు విశేషగుణములును చెప్పదగియుండును. "అథవా తద్విరుద్ధస్య వర్ణయిత్వా బహూన్ గుణాన్। తజ్జయన్నాయకోత్కర్ష వర్ణనంచ మతం క్వచిత్" అనియు నియమముగలదు. (ఉదాహరణము: రాజరాజనరేంద్రుని కోరుమిల్లి శాసనము.)

కృతిపతికులమునుగూర్చి రాజకులాగ్రగణ్య (ఆ1.161) రాజకులశేఖర (ఆ. 2. 28.) శ్రీమచ్చళుక్య వంశశిఖామణి (ఆ. 3, 1.) విలసచ్చాళుక్యాన్వయపయోధి సంపూర్ణశశీ (ఆ. 4. 1.) సత్యాశ్రియ కులశేఖర (ఆ. 4.272) విమలాదిత్యాగ్ర తనూజ (ఆ. 4. 272) మాణవ్యసనోత్ర (ఆ. 5.260) రాజకులశేఖర (ఆ. 5.261) రాజాన్వయతిలక (ఆ, 6. 1) విలసచ్చళుక్యకులతిలక (ఆ. 6.308) శీంతాశువంశ ప్రకాశి (ఆ. 6. 308) రాజకులదీప (ఆ. 7. 288) విమలాదిత్యాత్మజ (స 11) రాజకులోత్తమ (స. 1.294) రాజవంశ వార్ధిచంద్ర (స. 2. 421) రాజవంశరత్న (అర. 1. 40) భూపకులతిలక (అర. 3. 398) అను

సంబుధ్యంతములందు విశేషాంశములు తెలియుచున్నవి. వీనిలో రాజ రాజనరేంద్రుడు క్షత్రియుడని సమర్థించుటకు 8 బిరుదములును పాశ్చాత్య చాళుక్యులతో సంబంధము చూపుటకు 5 బిరుదములును, నీతనికి పూర్వము రాజ్యాధిపత్యము జేసినరాజుతో నీతని సంబంధము జూపుబిరుదములు 2 ను, భారతవీరులతో నీతనికి సంబంధముచూపు బిరుద "మొక్కటి" యు గలవు. చాళుక్యవంశజుల శాసనములలో మానవ్యసగోత్రులనియు చాళుక్యవంశాభరణులనియు రాజుల ప్రశంసలు గలవు. ఇవి పూర్వపాశ్చాత్య వంశ్యులకు సామాన్యములు. పులకేశి సత్యాశ్రయుని నాటినుండి పూర్వపాశ్చాత్య చాళుక్యవంశములకు భేదమేర్పడి రాజ్యములు విభక్తములైనను "సత్యాశ్రయకుల శేఖరు" డని చెప్పుకొనుటలో పౌరస్త్య చాళుక్యరాజులు పాశ్చాత్య చాళుక్యులతోగల సంబంధమును తెలుపుదురు. ఆ బిరుదములనే కుల వర్ణనమునుగూర్చిన వాక్యములలో నన్నయ యధికముగ జెప్పుట తన ప్రభువునకు రాజ్యాధికారమందుగల హక్కుల యెడల విద్యాధికులకు ప్రమాణబుద్ధికల్పించుటకై యుండవచ్చును. రాజరాజనరేంద్రుని విమలాదిత్యుని యగ్రతనూజునిగా నన్నయ విశేషించివర్ణించి రాజ్యాధికారమందాతనికిగల వారసత్వమును స్థిరపరుచుచున్నాడు. రాజరాజ నరేంద్రుడే యగ్రతనూజుడో విజయాదిత్యుడే యగ్రతనూజుడో చెప్పుటకష్టము. వీరిద్దరును విమలాదిత్యునకు వేరు వేరు భార్యలయందు కలిగినవారు. రాజరాజు నవసానదశయం దీవిజయాదిత్యుడు రాజ్యము నాక్రమించుకొని తన కుమారుని యౌవరాజ్యాధిపత్యమున ప్రతిష్ఠించెను. (M EP, REP. 1914) రాజరాజునకు రాజ్యమందు సుప్రతిష్ఠ చేకూర్చుటకే నన్నయ యిట్టి బిరుదవాక్యములు రచించియుండవలెను. "శీతాంశువంశ ప్రకాశీ" యను సంభోధనముతక్క రాజరాజనరేంద్రుడు చంద్రవంశపు రాజైనట్లే యంకితాంక పద్యములందు వేరొక సంభోధనము కానరాదు. దీనికి సూచన క్రీ॥ శ॥ 692 సం॥ రాజ్యము

చేసిన పశ్చిమ చాళుక్య వంశ్యుడగు వినయాదిత్య మహారాజు శాసనమందలి "హిమకర విమలకుల పరిభవ విలయహేతు పల్లవపతి పరాజయానంతర పరిగృహీత కాంచీపురస్య" యను వర్ణనమున గలదని శాసన పరిశోధకుల యభిప్రాయము. అయినచో నిదియు విడిపోయిన పాశ్చాత్య చాళుక్యులతో సంబంధము స్థిరపరచు నుద్దేశముతో రాజరాజు తనశాసనములందు విశదపరపించియుండును. దీనినిబట్టి రాజరాజనరేంద్రుని చంద్రవంశ సంబంధమును నన్నయ రాజానుమతముగా మాత్రము గ్రహించి భారతమున సూచించె ననవలసివచ్చును. అట్లే రాజరాజు చెట్టనభట్టుచే కోరుమిల్లి శాసనమున వ్రాయించిన పౌరాణిక వంశానుక్రమణిక నందున్నరీతినే నన్నయ తానురచించిన నందమపూడి శాసనమున బేర్కొని యుండెను. రాజానురక్తుడును, లోకజ్ఞుడును, కుల బ్రాహ్మణుడునగు నన్నయ చాళుక్యవంశ ప్రసిద్ధములగు గాథలనెఱిగిన యానాటి కులక్రమాగతాధికారులయు, రాజమహేంద్ర కవీంద్రబృందంబులయు సమక్షమున రాజాజ్ఞచే చెప్పుచున్న భారతమున రాజరాజనరేంద్రునికి భారతవీరులతో సంబంధములు కల్పించు వాక్యము లింతకుమించి యెట్లురచింపగలడు? వ్యంగమునకుగల బలమతివర్ణనమునకు సాధారణముగ గలుగబోదను లాక్షిణకసూక్తి "నానారుచిరార్థ సూక్తినిధి" యగు నన్నయ్య భట్టెఱుంగనివాడు కాడుగదా!

రాజరాజనరేంద్రుని "యాచార" వర్ణనములు సాభిప్రాయములై యున్నవి. మృడప్రియ (ఆ 1.161) మనుమార్గ (ఆ3.1) మహాదానతర్పితద్విజవర (ఆ 5.1) వ్యసనవివర్జిత [ఆ 5.260) దక్షమఖారిదయాలబ్ధసుస్థిరైశ్వర్యపదా (ఆ 7.1) భీమేశ్వరకృత నిత్యప్రసాద (అర 1.399) యనువాటితో ముఖ్యముగా మృడప్రియ, దక్షమఖారి దయాలబ్ధసుస్థిరైశ్వర్యపదా భీమేశ్వర కృతనిత్య ప్రసాద" యనునవి రాజరాజనరేంద్రుని శాసనములలో జెప్పబడిన పరమమాహేశ్వరత్వ

మును స్థిరపరచుటయేగాక "జగత్పరిపూజ్యములయిన యీశ్వరాగమ ములయందు నిల్పితి ప్రకాశముగా హృదయంబు భక్తితోన్" అను రాజరాజనరేంద్ర వాక్యమును దృఢపరచుచున్నవి. రాజరాజనరేంద్రుని తాతయగు రెండవ యమ్మరాజ రాజమహేంద్రుని కాలమున కాలాముఖ మతానుచరులగు శైవాచార్యులకు విజయవాడలో చాళుక్యరాజ్యమందు వసతులేర్పడియుండెను (Ep Rp. 1915) అయినను రాజరాజనరేంద్రుని తండ్రియగు విమలాదిత్యుడు చాళుక్య వేంగీ రాజ్యాధిపతుల యాచారమునకు విరుద్ధముగా కళింగమందలి శ్రీరామ తీర్థక్షేత్రమున దేశికగణానుచరుడగు త్రికాలయోగి సిద్ధాంతదేవర యను జైనగురువును నిలిపి యాతనికి వసతి యేర్పరచినట్లు కన్నడ భాషను శిలాశాసనము వ్రాయించెను. )Ep. Rp 18) ఇట్లు తూర్పు చళుక్యులరాజ్యమందప్పట క్రీ.శ. అయిదవ శతాబ్దమునుండి పది నొకండవ శతాబ్దమువరకు జైనమతస్థులకు సమాదరణము కలుగుచు వచ్చినను మొత్తముపైని తూర్పుచళుక్యవంశపు రాజులు సాధారణముగ వేదమతప్రతిష్ఠాపనమునందును శైవాచారపరాయణత్వమునందును కృతదీక్షులై యుండిరి. కనుక సర్వమతసమత్వము గలవాడైనను, వేదమత ప్రతిష్ఠాపనమున మదినిల్పినవాడగుచే రాజరాజనరేంద్రుని శైవాచారపరత్వము పునఃప్రకటితము కావలసివచ్చెను. విశేషించి చెట్టనభట్ట విరచితమగు కోరుమిల్లి శాసనమున "ససర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక పరమబ్రహ్మణ్యో మాతాపితృపాదానుధ్యాతః త్యాగసింహాసనాసీనః చండికాప్రసాదపరిలబ్ధ సాంబ్రాజ్యచిహ్నః" అని రాజరాజనరేంద్రుని శైవధర్మము కీర్తింపబడినది. రాజాధిరాజపరమేశ్వర, పరమభట్టాకర, పరమమాహేశ్వర పరమబ్రహ్మణ్యః యను బిరుదులు రాజరాజనరేంద్రుని పెదతండ్రియగు శక్తివర్మ చక్రవర్తియై దాల్చినవి. వీటిలో పరమమాహేశ్వర యనుదానికి బదులుగా నంతకన్న నెక్కుడు

సాభిప్రాయమగు "చండికా ప్రసాద పరిలబ్ధ సాంబ్రాజ్యచిహ్నః" యను బిరుదమును చెట్టనభట్టువాడగా నది యంత స్పష్టపరచుట కిష్టము లేకనో యనువట్లు దానిని నన్నయ తన నందమపూడి శాసనమున "పరమ మాహేశ్వర" యను వేంగీసామ్రాజ్యాధిపతుల సామాన్య సామ్రాజ్య చిహ్నముగా మార్చి, అట్టి పరమమాహేశ్వరత్వమును "ఈశ్వరాగమములయందు నిల్పితి" నను రాజరాజనరేంద్ర వాక్యము వలన సమర్థించెను.

రాజరాజనరేంద్రుడు తన పెదతండ్రి శక్తివర్మ సంతతిరాజు లుండగా రాజ్యాధిపతియగు విమలాదిత్యుని తరువాత పట్టాభిషిక్తు డాయెను. కాని శక్తివర్మపక్షమువారు రాజ్యమున లేకపోలేదు. వారు రాజరాజున కహితులనవచ్చును. శక్తివర్మ సంతతివారు దాయాదులు, వైరివీరులు, ఇట్టి యహితులవలనను, వైరివీరులవలనను పట్టాభిషేకా నంతరము రాజరాజునకు పలువిధములగు తొందరలు కలిగియుండ వలెను. పట్టాభిషేకానంతరము కొలదిదినములలో రచింపబడిన కోరు మిల్లి శాసనమున విమలాదిత్యుని ప్రతాపాతిశయము లుగ్గడింపబడి నవిగాని రాజరాజనరేంద్రుని ప్రతాపవర్ణనము లంతగా లేవు.

"శౌర్యౌదార్యాభి మానాద్యగణి" తేత్యాదిశ్లోకమున రాజ రాజనరేంద్రుని గుణములన్నియు గుత్తలముగా జెప్పబడినవి. ఈరచన జరిగిననాటికి రాజరాజనరేంద్రునికి తన ప్రతాపాతిశయములను వెల్ల డించుట కవసరము లేక యుండును. తదనంతర మట్టియవసరము తటస్థిం చుటచేతనే ఆంధ్రమహాభారతమందలి ప్రశస్తి పద్యములందు నన్నయ రాజరాజనరేంద్రుని ప్రతాపము నమితముగ, పునరుక్తిగ నదేపనిగ, విసుగులేక వర్ణించియున్నాడు. ఈ వర్ణనమునందు కొన్ని భాగములు సర్వరాజ ప్రశస్తిప్రసిద్ధములగు "పరగండభైరవ" (ఆ3.227 స2.219. అ1.398). పరగండభేరుండక" (అర 2.355). "వైరివీరరసవైద్య"

(స 2.219). "వైరిభయంకరశౌర్య" (ఆ 8.322). "నృపపూజిత పాదాంభోజ" (ఆ 7.288) అను బిరుదములు. కాని కొన్ని కులక్రమాగతముగ వచ్చిన బిరుదములును గలవు. సమస్తభువనాశ్రయ(ఆ4 273 అ 2.355) యనునది చాళుక్యవంశపురాజుల శాసనములలో వంశ పారంపర్యముగ వచ్చుచున్న "సర్వలోకాశ్రయ" బిరుదము, విష్ణు వర్ధన, పరమభట్టారకర బిరుదము లీచళుక్యుల మూలపురుషుడగు విష్ణు భట్టసోమయాజిచే నర్థితులగుటవలన కులక్రమాగతమయినవి. పరాక్రమరాఘవ (స 1 292) యనునది మొదటి విజయాదిత్యుడు దాల్చిన "విక్రమరామ" యను బిరుదమే. నిరవద్య (ఆ 5.261 ఆ 1.163) యనునది క్రీ.శ. 699 సం॥న అయిదవ విజయాదిత్యుడు దాల్చిన బిరుదము, "విలసచ్చాళుక్యాన్వయ పయోధీ సంపూర్ణశశీ (ఆ 4.1) యనునది శక్తివర్మ దాల్చినది "చళుక్యచంద్ర" యను బిరుదము. "రాజనారాయణ", నారాయణాఖ్య (ఆ 2.239; ఆ 6.309 స 1.204) యనునవి రెండవ యమ్మరాజు దాల్చిన "రాజనారాయణ" పర్యాయములు "రాజసర్వజ్ఞ" (ఆ 6.308) యనునది పాశ్చాత్య చళుక్యులలో నారవ విక్రమాదిత్యుడు దాల్చిన "రాయసర్వజ్ఞ బిరుదముకాని సామ్రాజ్యాధిపత్యము సంపాదించుటను సూచించు "నృపపూజిత పాదాంభోజ" యను బిరుదమునకు పర్యాయముగ "నానావనినాథ కిరీట మణివిరాజిత పాదాంభోజ" (ఆర 6.1) యనియు "ప్రణమద్ఖిలధాత్రీ పాలకాలోల చూడామణి గణకిరణశ్రీమండితాంఘ్రి" (ఆ 6.309) యనియు "పరనృపమణిమకుట ఘటితపద" (ఆర 1.399) యనియు "సమస్తనృప కిరీటచుంబి చరణద్వయా" (ఆర 2.356) యనియు రాజరాజనరేంద్రుని దేవనిగ "లోకజ్ఞ"డగు నన్నయ స్తుతించుట చూడగా నీభారత కావ్యరచనాప్రసక్తి కలుగునాటికి రాజరాజనరేంద్రుని కీదాయాద సామంతులతో గల్గిన పోరాటములందు సర్వతోముఖమగు విజయమును కలిగియుండవలెనని తోచుచున్నది. ఇవి నిరర్థకములగు శుష్కస్తుతులు

కావనుట కాధారముగా రాజరాజనరేంద్రునికి యుద్ధములు తటస్థించి నట్లును తెలియుచున్నది. దండితాహితవీర (ఆ 3.227) విక్రమోద్వేజి తాహిత (ఆ 8.322) విరోధి ప్రలయాంతక (ఆర 2.354) భూరిప్రతాప పరిభూతవిరోధి వర్గా (ఆర 3.399) యను సంభోధములవలన తననాటి యహితుల (శక్తివర్మప్రభృతులవలంబుల)పై రాజరాజు విక్రమము జూపక తప్పినదికాదని తేలుచున్నది. "ఘోరాజిముఖోపలబ్ధ విజయప్రమ దాశ్రిత బాహుదండ" (ఆ 1.161) వైరివేదండగండవిదారి ఘోర తరాసిభాసిభుజార్గళా" (ఆ 3.227) "వీరోగ్రాజివిజయా" (ఆ 5.260) "రిపుప్రలయ ప్రతాప (ఆ 6.308) "పరనృపలలనాన నకమలహారిణ లాంఛనమూర్తి (ఆ 6.308) రణదర్ప (స 2.319) జితారి (ఆర 1.1) ఘోరారిమదకుంభ కుంభివిదారణదారుణ కృపాణదక్షిణహస్తా(ఆర2.1) యను సంభోధనలుబట్టి దాయాదులవలన ఘోరసంగ్రామములు రాజ రాజనరేంద్రునకు సంఘటిల్లినట్లు స్పష్టమగుచున్నది. ఇందు కనుగుణ ముగా నన్నయ రచించిన నందమపూడి శాసనమున,

"యస్యస్ఫారభుజాకృపాణదళితా రాతీభకుంభస్థల। ప్రోన్ముక్తామలవృత్తమౌక్తిక చయస్సంగ్రామరంగాంతరే। ధత్తేవీరరసక్రియా భినయన ప్రస్తావనాలక్ష్మీతాం। వీరశ్రీరచితాంజలి ప్రవిసరత్పుష్పోప హారశ్రియః॥"

అని రాజరాజనరేంద్ర ప్రతాపవిజృంభణావర్ణనము గలదు. "ఉదాత్తరసాన్విత కావ్యనాటకక్రమములు పెక్కుచూచితి"నని రాజ రాజనరేంద్రుడు భారతాంధ్రీకరణావసరమున చెప్పిన వాక్యము లారాజపరమేశ్వరుని జీవితమున "లోకజ్ఞుడును" "అనురక్తుడును" నగు నన్నయ ఇట్లు సమర్థించెను. ఈ నందమపూడి శాసనము క్రీ.శ. 1053 సం॥న వ్రాయబడి యుండునని శాసనపరిశోధకుల యభిప్రా యము. ఇట్టి వర్ణనము పైనుదాహరించిన బిరుదములలో "ఘోరారి

మదకుంభకుంభివిదారణ దారుణకృపాణదక్షిణహస్తా" యను నారణ్య
పర్వమందలి ద్వితీయాశ్వాసారంభమున గానవచ్చుట చూడగా
నన్నయ నందమపూడి శాసనము రచించుటయు, మహాభారతారణ్య
పర్వమందలి ద్వితీయాశ్వాసము రచించుటయు నించుమించుగా సమ
కాలికములని పొడగట్టుచున్నది.

ప్రతాపము ప్రశంసనీయమే కావచ్చును. అది ధర్మనిరతత్వము
తోను, సత్యపాలనముతోను, విమలవర్తనముతోను, కూడియుండి
సౌమ్యగుణములకు స్థాయినొసంగుచో రాణించునుగాని లేకున్న లోక
మున కహితము కల్పించును. రాజరాజనరేంద్రునియందు ప్రతాప
కారుణికత్వములు రెండును, నన్నయకవిత్వమున సంస్కృతాంధ్రము
లట్లు యథోచితముగ పని వినుచుండినట్లే ప్రశంసాపద్యములందు
జాడలు గలవు. కావున "దాయాదుల నిర్జించి యహితుల నడంచి
వినమద్రాజన్య మకుటుండగు రణదర్పితుడేడ, భారతాంధ్రీకరణ
ప్రయత్నమేది? ఇది నన్నయ తన ప్రభుభక్తియు తన గ్రంథప్రాశ
స్త్యమును సూచించుటకు చేసిన విశేషకల్పన కానోపు" నను సంశయ
మున కవకాశము లేదు.

రణదర్పితుడైనను రాజరాజు భూరిగుణరత్నభూషణ (స 1.292)
గుణధామ (ఆ 1.163) విరాజితగుణరత్న (ఆ 2.235) సుగుణాధార
(ఆ 3.226) కలియుగపవిత్ర (ఆ 3.226) విమలధీరమణీయా (ఆ4.272)
వ్యసనవివర్జిత (ఆ 5.259) విమలమతీ (ఆ 6.309) రాజసూరి సభాంతర
భాజితసద్గుణ (స 1.293) యనియు నిత్యనిరంతరధర్మమతీ (ఆ 1.163)
నిత్యధర్మ ప్రారంభ (ఆ 2.236) ధర్మనిరత (ఆ 3.1) ధర్మధురంధర
(ఆ 1.273) ధర్మవిశారద (స 2.1) ధర్మమిత్ర (అర 1.400) ధర్మనిత్య
ప్రారంభ (ఆ 21) ధర్మవిచారోద్దామ (అర 31) ధర్మవ్యాపారవిభాసి
(అర 3.398) యనియు నిత్యసత్య (ఆ 8.323) కరుణావతార (స2.320)

కృపారసబంధుర (ఆ 4.273) యనియు విశేషించి సౌమ్యుడగు ప్రభువుగా పొగడబడెను. రాజ్యాంగధర్మ వ్యవస్థలనుబట్టి విక్రమము చూపవలసినవాడైనను, రాజరాజు సౌమ్యుడును ధర్మానువర్తియు ధర్మప్రతిష్ఠాపకుడు నగు ప్రభువని యానాటి విద్వాంసులకు (ప్రజల మనస్సులను తారుమారుచేయగల కవివతంసులకు) నమ్మకము కలుగుటకీవిశేషవాక్యములు రచింపబడియుండవలెను. ఈ ప్రశస్తి పద్యములందు సాధారణముగ ప్రతాపవర్ణనములందు సౌమ్యగుణవర్ణనములు కలిసియుండవు. అటుగాక నన్నయ రచించిన కొన్ని పద్యములందు రాజరాజనరేంద్రుని ప్రతాపవిశేషములును సౌమ్యగుణవిశేషములును నొకదానికొకటి ప్రతిగా చెప్పబడినవి. ఇట్టి రచనలు ప్రభువు పరాక్రమము చూపి, విజయముగాంచిన తరువాత ప్రభువు ననుగ్రహమునకును ఆగ్రహమునకును పాత్రులగువారలకు ప్రత్యేకించి కలుగు లాభనష్టములను సూచించుటకు వ్రాయబడియుండవలెను. ఎట్లనిన:-

వీరావతార కరుణారసపూర్ణ (ఆ 2.236) ధర్మనిత్య ప్రారంభ ఘోరారి...దక్షిణహస్తా (ఆర **3.1**) దండితావీర సూరినిధాన (ఆ3.22) బుధజనచింతామణి కోదండపార్థ (ఆర 3.1) వీరావతార సౌజన్యగుణాధార (స **2.1**) సౌజన్యగుణాభరణ పరగండభైరవ (అర **1.399**).

ఇంతేకాదు. రాజరాజనరేంద్రుడు విద్వాంసులకును మిత్రులకును సులభుడు; పార్థసన్నిభుడు (ఆ 5.1, స 1.**293**. నయబంధురుడు స **2.**320 నృప (రాజ) విద్యాపారగుడు. ఆర **3.**398, **4.1.** నిఖిలరాజవిద్యానిధి ఆ 7.287 కోదండపార్థుడు ఆ **3.227.** స **1.1** ఆర **3.1** ఆర **4.**1 గంధసింధురహయశిక్షారూఢదక్షుడు ఆ **7.1.** కనుకనే నన్నయ భారతమును "లోకాగమన్యాయైకాంతగృహంబు" అని తన ప్రభువు నెదుట స్తుతించెను.

విశేషించి, కావ్యగీతప్రియ ఆ 2.1 వాణీలీలాస్పద ఆ 4.1

విద్యావిలాస ఆ 7.282 సరస్వతీసలసన్ముఖాంభోజ ఆ 2.323 యనియు రాజరాజనరేంద్రుని నన్నయ కవిగా పొగడెను. వీటికనుగుణముగా రాజమహేంద్రి కవీంద్రి సమాజ సురభూజ, ఆ 2.238 బాంధవాంభోజవనద్యుమణీ స 1.295 మిత్రవిద్వదంభోజవన ప్రియోజమిత్రి స 2.323 ఆర 1.400 అనియు సంబోధనలు కలవు. ఇట్లు మిత్రులను, బాంధవులను విద్వాంసులను పోషించుటకును వారి రాజరాజనరేంద్రుని యనుగ్రహమున పెద్దల గనుటకును నవకాశములు సమరవిజయానంతరమున కలిగియుండవలెనుగదా! ఇట్టి విజయములు కలుగునాటికి నన్నయ యాదిపర్వము మొదలారణ్యపర్వమందలి రెండాశ్వాసముల వరకు రచించియుండును. ఆదిపర్వరచన పూర్తి యగువరకు శత్రునిర్మూలమై యుండవలయును. తదనందరము బాంధవులయెడ రాజరాజనరేంద్రుడు ప్రసన్నుడై యుండును. "విద్యావిలాస"గోష్ఠికి కొంత యవకాశము కలిగియుండును. కావుననే మహాభారతాంధ్రీకరణము కవియగు రాజరాజనరేంద్రు నుద్దేశ సంకల్పముల కనుగుణముగ వేంగీరాజ్యమందాతనికి విమలాదిత్యునివలన కలిగిన యధికారము సమరరంగములందు సమర్థింపబడిన విజయోత్సవ సందర్భమునను, పాండవేయులవలె ఖడ్గవాదమున దాయాదుల యుక్కడంచి దాజ్యప్రతిష్ఠితుడగు ప్రభువునకు గల ధర్మనిరతతయందును, సౌమ్యత్వమునందును, విద్యాసమాదరణమునందును, మిత్రబాంధవ పోషకత్వమునందును ప్రజలకు దృష్టివిశ్వాసము కలిగించుటకును, అరికేసరి విమలాదిత్యాది చాళుక్యప్రభు సమాదరణముచే రేకెత్తి "సర్వజనీనము"గు కావ్యరత్నమును వీరగాథగా మార్చి కావ్యసామాన్యముగ జేసిన జైనమత ప్రోత్సాహము గల పండితుల మనస్సుల నా కావ్యరాజము నాంధ్రీకరించు ప్రయత్నముచే నందలి సంహితాత్వగౌరవమును గ్రహించునట్లుజేసి లోకసంగ్రహమునకై వినియోగపరచుటకును ప్రారంభింపబడె ననవలయును గాని యొక వాగనుశాసన ఫక్కికి లక్ష్యముగనో, పవిత్రచరితుడును

కుమారుడునునగు సారంగధరునియెడ రాజరాజొనరించిన పాతకము నకు ప్రాయశ్చిత్తముగనో రచింపబడెననుటతగదు. కావ్యాది పద్యము మసలం జెప్పిన కృతి ప్రతిమండలమేలునని పూర్వ లాక్షణికులమతము. దీనికనుగుణముగా "శ్రీ వాణీ గిరిజాశ్చిరా" యేతి మంగళశ్లోక మాంధ్రమహాభారతాదిని "నిత్యప్రవర్ధమాన మహామహీ రాజ్యవిభవ" ప్రాప్తిసాధనమగు రాజరాజు నుపాసనావిధానము సూచించుచున్నది. నన్నయ ప్రతియాశ్వాసారంభమున జెప్పిన స్తుతియును మంగళప్రద మగు శ్రీకారముతో విధిగా ప్రారంభింపబడియున్నది.

"విశ్వశ్రేయః కావ్యం" అనియు "కావ్యం యశసేర్థకృతే" యనియు నన్నయ నాటికి కావ్యవిషయమున రెండు మతములుండెను. "ప్రాయశ్చిత్తవిధౌ కావ్యం" అను సూత్రము నేడు రూపకాలంకార ప్రాయమగుచున్నది. ప్రసిద్ధములగు నానాటి మతములలో నన్నయ యాదరించెనని యాంధ్రులు విశ్వసించునది "విశ్వశ్రేయః కావ్యం" అను నియమము. ప్రబంధపరమేశ్వరుడు "విచిత్రాలంకారోజ్జ్వల కవితాకలాప" (ఆర–6-1) మహాకావ్యరస ప్రయోజనారూఢమతి (ఆర–2–1) యను సంబోధనలచే కవియని సమర్థించిన రాజరాజ నరేంద్రు డాదరించిన మతమును నిదియే. దీని ననుసరించియే భారతాంధ్రీకరణము జరిగియుండవలెను.

—0—

# రాజరాజే భారతాంధ్రీకరణము ప్రోత్సహించెను

శ్రీ పి. వి. పరబ్రహ్మశాస్త్రి

శ్రీ ఏరూరు సీతారామశర్మ యం. ఏ. బి. ఇడి. గారు (రాఘవేంద్రస్వామి మఠం. బర్కత్ పురా, హైదరాబాదు – 27) ఒక గ్రంథమును రచించిరి. ఈ వ్యాసము దానిని గూర్చిన సంగ్రహ సమీక్ష. గ్రంథముపేరు. నన్నయ భారత రచన – రాజరాజు ప్రోత్సాహము!

నన్నయ భారతాన్ని గూర్చి శ్రీ శర్మగారు ఆ గ్రంథమున రెండు ప్రధానాంశములను చర్చించిరి. మొదటిది భారత రచనలో నన్నయను రాజరాజు ప్రోత్సహించలేదు; అట్లు ప్రోత్సాహమిచ్చిన వారు పశ్చిమ చాళుక్య (కళ్యాణి) చక్రవర్తియైన మొదటి సోమేశ్వరుడును, అతనికి సామంతుడుగ వేంగీరాజ్యము నేలుచున్న రాజరాజు సోదరుడైన విజయాదిత్యుడును దీనిని గూర్చిన చర్చ 140 పుటలున్న గ్రంథ భాగము.

రెండవ అంశము నన్నయ నారాయణభట్టునకు సహాధ్యాయుడు గనుక నారాయణభట్టువలె కర్ణాటకుడు అయియుండును. లేదా మహారాష్ట్రుడు కాదగును. ఇది 118 పుటలున్న గ్రంథ ద్వితీయభాగము. తుదిలో కొన్ని శాసనములు అనుబంధించబడెను. శర్మగారి గ్రంథము నంతను సంగ్రహముగానైన చర్చించుటకు ఇచ్చట తావుచాలదు. తెలుగు వాఙ్మయ చరిత్రలో ముఖ్యమైన విషయము గనుక దీనినొక వ్యాసరూపమున వ్రాయుచుంటిని. శ్రీ శర్మగారి గ్రంథములోని కొన్ని అంశములను శ్రీ పాటిబండ మాధవశర్మగారు, శ్రీ దేవరపల్లి

వెంకట కృష్ణారెడ్డిగారు మరికొందరు లోగడ చర్చించి తమ అసమ్మతిని తెలిపినట్లు గ్రంథములో చెప్పబడెను. శ్రీ శర్మగారికి గురువులైన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు దీనిని గూర్చి సమీక్ష వ్రాసిరి. అదికూడా గ్రంథాదిలో యథాతథముగా చేర్చబడెను. సమీక్షకు తుదిలో పుట్టపర్తివారు తమ వ్రాతకు సారాంశముగా ఇట్లు వ్రాసిరి.

"శర్మ, రాజరాజనరేంద్రుడు భారతానికి ప్రోత్సాహకుడు కాడని నిరూపించిన కారణాలు ఎక్కువ బలవత్తరములు కావు. కేవల సారహీనములు కూడ కావు. చాలా సంవత్సరాలు పట్టుదలతో విషయం సేకరించినాడు. ఆయనపైన నాకు సానుభూతి యెందుకుండదు? కానీ యిదే సిద్ధాంతమని సమ్మతించే ధైర్యం నాకులేదు. ఏదో ఒక బాంబు విసరినాడు. దీనిపైన భావిపరిశోధనలు జరుప వలసిన అవసరం వుంది."

మరియొకచోట శ్రీ నారాయణాచార్యులుగారే యిట్లు వ్రాసిరి.

''మరికొన్ని చిత్రమైన వాదాలు శర్మవి వున్నవి. నన్నయ మహారాష్ట్ర బ్రాహ్మణుడని నొక వాదం. అది ఇంకా చిత్రంగావుంది. ఎందుకంటే "భట్టు" శబ్దాన్ని వాడుకొన్నాడట. నాదృష్టికిది నవ్వులపాలుగావుంది'' శ్రీ నారాయణాచార్యులుగారి సమీక్షతో చాలా మంది యేకీభవించుదురనుకొన వచ్చును. ప్రస్తుత గ్రంథము రెండు భాగములుగా నున్నదనుకొంటిమి. మొదటి భాగములో భారత రచనకు ప్రోత్సాహ మిచ్చినవాడు రాజరాజనరేంద్రుడు కాదు; పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన త్రైలోక్యమల్ల బిరుదు వహించిన మొదటి సోమేశ్వరుడు. అతని క్రింద సామంతుడుగ వేంగి రాజ్యమేలిన సప్తమ విజయాదిత్యుడు, దీనికి ఉపపత్తిగా గ్రంథకర్త యీ దిగువ పద్యాన్ని భారతం నుండి చూపిస్తున్నారు.

వీరావతార సుకవిస్తుత నిత్యధర్మ
ప్రారంభ శిష్టపరిపాలాసక్త రాజా
నారాయణాఖ్య కరుణా రసపూర్ణ వీర
శ్రీరమ్య రాజకులశేఖర విష్ణుమూర్తీ

గ్రంథ కర్త యైన శర్మగారు ప్రయోగించిన గొప్ప బ్రహ్మాస్త్రం ఇది అంటూ నారాయణాచార్యులుగారు చక్కగా సమాధానం వ్రాశారు. ఈ వసంత తిలక వృత్తంలో రెండవపాదం తుదిలో గురువే వుండవలెనని శర్మగారు సాగదీసి నారట. పద్యంలో అట్లాగే ఉన్నది కదా. అందువల్ల 'రాజనారాయణాఖ్య' అని రాజరాజనరేంద్రునకు వర్తింపజేయు నట్టి బిరుదు కాదు గనుక 'రాజా' అని ఒక సంబోధన. 'నారాయణాఖ్య' అని మరియొక సంబోధన అయితీరునని గ్రంథకర్త వాదము. దీనితో వారికి ఒకానొక రాజును, ఒకానొక నారాయణుడను పేరుగల వ్యక్తిని చొప్పించి అన్వయం కుదర్చటానికి అవకాశం దొరికింది. దాని మీద శ్రీ నారాయణాచార్యులుగారు పాదాంతములో నుండు లఘువుకూడ ఒక్కొక్కసారి గురువే అవుతుంది. కనుక అక్కడ 'రాజా' అని దీర్ఘాంతంగానే ఉండవలసిన అవసరం లేదన్నారు అంటే దాన్ని 'నారాయణాఖ్య' అని చదివినప్పటికి వచ్చే ఛందోభంగ దోషం ఉండదన్నారు. ఇంకా 'నారాయణాఖ్య' అనేది బిరుదు కాజాలదు. వ్యక్తిగత నామమే యగును. అనే శర్మగారి వాదాన్ని కూడ సోదాహరణముగా నారాయణాచార్యులుగారు త్రోసిపుచ్చిరి. కనుక 'నారాయణాఖ్య' అనేది రాజరాజనరేంద్రుడికి బిరుదుగా చెప్పుకొనుటలో ఆక్షేపణ లేదని సిద్ధాంతీకరించిరి.

ఈ సందర్భమున గ్రంథకర్త చాళుక్యుల చరిత్ర, రాజరాజ నరేంద్రుని అసమర్థత అతడు పశ్చిమ చాళుక్య చక్రవర్తి యయిన మొదటి సోమేశ్వరునికి సామంతుడగుట ఇత్యాది విశేషములనేకము

వివరించిరి. ఆ వివరణమంతయు ఆనుషంగికము గనుక దానిని అంగీకరించుటగాని ఖండించుటగాని యిచట అంత అవసరమని తోచదు. కాగా శ్రీ శర్మగారు ఇంత చరిత్ర తిరుగతోడినవారు ఒక్క శాసనము మాచినట్లుగ తోచదు. అది శ్రీకాకుళం మండలంలో నున్న శ్రీకూర్మనాథుని ఆలయములో గలదు. ఆ శాసనము సౌత్ ఇండియన్ ఇన్ క్రిప్షన్సు '5'వ సంపుటములో 1234వ సంఖ్యగాను, ఎపిగ్రాఫియా ఇండియా '5'వ సంపుటం 4వ సంఖ్య (31వ పుట) గాను ప్రచురింపబడినది. దాని తేది శక వర్షము 1195కు సరియగు 1273 క్రీస్తు శకాబ్దము. అందు చాళుక్య వంశమువాడైన విజయాదిత్యుడనువాడు శ్రీ కూర్మనాథునికి దీపము కొరకై 25 ఆవులను దానమొసగినట్లు చెప్పబడెను. అందు ఆ విజయాదిత్యుడు తన వంశమును, తన పూర్వులను కొంత ప్రశంసించుకొనును. ఆశాసనములనుండి ప్రస్తుత మవసరమైన భాగము చూపబడు చున్నది.

1. స్వస్తి। శ్రీమాన భూత్పూరా కశ్చి త్సోమ వంశే మహాయశాః చాళు
2. క్య విమలాదిత్య గ క్రవర్తిన్ నృపాగ్రణీః ॥ (1 *) ఏక ఏవ నభోదేశే
3. యథాచంద్ర (ః) శ్రియాయుతః సమయత్ప్రత్రతు పద్మాని
4. తథా సక్షితి మండలే॥ (2 *) తస్మాదభూత్ క్షితిపతి ప్రణతాం
5. ఘ్రి పద్మః శ్రీరాజరాజ నృపతిః ప్రవిశాలకీర్తిన్ యస్సూరి
6. భిః సహాకిల స్మృతిజాల సార మంత్రీ చకార వర భా
7. రత వంశ వృత్తం॥ ( 3 * ) సేవాగత నృపాక్ష్ణేస్ రాజమహేం
8. ద్ర పట్టనే స్థితోపి తేజసాక్రాంత్తే ర రాజ వసుధా

9. తస్యై (4 *)

........................

........................

13. తద్వంశే విజయాదిత్య
14. ఇతిఖ్యాతో నృపో భవత్ । మానవస్య సుగోత్రీయో
15. విజయశ్రీ నికేతనః । (6 *) తస్మాజ్జా తశ్చ రాజేన్ద్రో
రాజరాజ
16. ఇతి_స్తుతః । మంత్రీ వీర నృసింహస్య వాచస్పతి స
17. హోమతిః ॥ (7 *) తస్యసూను స్సురాధీశ తుళితోద్దామ
విక్రమః ॥
18. జానాతి విదుషాం మోత్థన్ గుణై రత్నాకరోపమః (8 *)
19. స్వస్తిశ్రీ శకవషేన్ శరనిధిశశి భూసమ్మితే శ్కేన్
తులాస్థే రుద్రా
20. హే సౌమ్యవారే సితయుజ మహతః కూమ్మన్ నాథస్య
నిత్యం । ప్రా
21. దాద్దీపాయ పంచో_త్తర దశయుగగాః వాఞ్ఛ తాత్థన్
స్య సిద్ధ్యైసో
22. యం చాళుక్య వంశాంబుధి శశి విజయాదిత్య చక్రవ_ర్తిన్
(సచ్చక్రవ_ర్తిన్) (9 *)

..............................

..............................

ఈ శాసనాన్ని శ్రీ సీతారామ శర్మగారు చూచినట్లులేదు. వారి గ్రంథములో అనవసరమైన కొన్ని శాసనభాగము లీయబడి యున్నవి. కాని అవసరమైన ఈ శాసన భాగము ఈయబడలేదు. కనుక వారు దీనిని చూడలేదని తలంచి యీ ముఖ్య శాసనాన్ని పరిశోధకుల దృష్టికి తీసుకొని వచ్చుచుంటిని.

ఈ శాసనాన్ని రెండు భాగాలుగా విభజించ వచ్చు. 9వ పంక్తి వరకు ఒకటి. దానిలో సోమవంశములో పూర్వము మహా యశశ్శాలియగు చాళుక్య విమలాదిత్య చక్రవర్తియుండెను. అతడు శత్రు సంఘమును పరిమార్చుచు ఆకాశమున చంద్రుడువలె రాజిల్లు చుండెను. అతని యనంతము శ్రీరాజరాజ నృపతియుండెను. ఎవడు సమస్త స్మృతులకు సారభూతమైన భారతపంశ వృత్తమును విద్వాంసులతో గూడి ఆంధ్రీకరించెనో అట్టి మహా కీర్తిమంతుడతడు. సామంత రాజులచేత సేవించబడుతూ రాజమహేంద్రి పట్టన మందు అతడు తేజస్సుతో వ్యాప్తమై భూమండలమున శోభిల్లెను. ఇత్యాది వర్ణన.

రెండవ భాగము :

ఈ భాగములో దాతయొక్క పితృపితామహులు కీర్తింపబడి అతని దానము చెప్పబడెను. మొదటి భాగములో చెప్పబడిన రాజ రాజు ఏ వంశములో కీర్తిమంతుడై విరాజిల్లెనో ఆ వంశములో మాన వ్యస గోత్రీయుడు విజయాదిత్యుడను రాజు ఖ్యాతిగాంచెను. అతడికి రాజరాజు అను ఒక కొడుకు గలడు. అతడు బుద్ధియందు వాచస్పతి సముడై వీరనృసింహ రాజునకు మంత్రిగా నుండెను. ఆ రాజరాజు కొడుకు మరల విజయాదిత్యుడను రాజు శకాబ్దము 1195 తుల మాస ములో శుక్లపక్షమున ఏకాదశి బుధవారమునాడు శ్రీకూర్మనాథునికి దీపము వెలిగించుటకుగాను 25 గోవులను దానమొసగెను. ఈ యంశము శాసనము రెండవ భాగములో చెప్పబడెను. (ఇందు పేర్కొనబడిన యిద్దరు విజయాదిత్యులలో ఒక్కరిని గూడ గ్రంథ కర్తయైన సీతారామశర్మగారు కథానాయకుడుగా మలిచిన సప్తమ విజయాదిత్యుడుగా గ్రహించరాదు. కాలభేదము, దేశభేదము అడ్డు వచ్చును. శర్మగారి సప్తమ విజయాదిత్యుడు క్రీ. శ. 1020–1070 ప్రాంతమున రాజమహేంద్ర వరములో నున్నవాడు. ఈ శాసనము

లోని విజయాదిత్యులు (క్రీ. శ. 1200–1275 ప్రాంతమున కళింగ ములో నున్నవారు)

శాసనముయొక్క మొదటి భాగములో పేర్కొన బడినవారు.

1. విమలాదిత్యుడు అతని కొడుకు రాజరాజు క్రీ. శ. 1012 - 1061 వరకు వేంగి సింహాసన మధిష్ఠించిన వారిలోని రాజులు. ఈ రాజరాజే రాజమహేంద్ర పట్టణమున విద్వాంసులతో గూడి సమస్త స్మృతిసార భూతమైన భరత వంశ వృత్తమును ఆంధ్రీకరించెను. ఇచట 'ఆంధ్రీ చకార' అని యున్న క్రియాపదమునకు విద్వాంసులచేత ఆంధ్రీకరింప చేసెను. అని అర్థము చెప్పదగును. కాని యిచట 'సూరిభిస్సహ' అని విద్వాంసులతో గూడిన తనకే ఆంధ్రీకరణ కర్తృత్వము చెప్ప బడెను. దీనిని మరియొక సమస్యగా తీసికొనక ప్రస్తుతానికి విద్వాం సుల సహాయమున ఆంధ్రీకరణ మనెడి ప్రణాళికను నిర్వహించుట యందే రాజరాజు యొక్క కర్తృత్వము చెప్పుకొనుట యుక్తము. అట్టి నిర్వహణాధిపతి మాత్రముగానే యుండుటనుబట్టి రాజరాజు గ్రంథమునకు తన కర్తృత్వమునుగాని, కృతి పతిత్వము గాని కోరి యుండలేదు. ఒకవేళ ప్రభువు గాబట్టి ఆ నన్నయాది విద్వాంసుల కృతిపతిత్వమును స్వీకరించుమని అభ్యర్థించినను రాజరాజు ఏమాత్రము అంగీకరించి యుండలేదని చెప్పుకోవలెను. అయినప్పటికి ఆశ్వాసాద్యం తములలో ఆ రాజును కీర్తించుచు నన్నయ తృప్తినొందెను. అదియే అంకితమిచ్చినంతటి ప్రయోజనకారి యయ్యెను. విమర్శనల యందు ఆరితేరిన పరిశోధకులను విడిస్తే సామాన్య పాఠకుల హృదయాల్లో రాజరాజు ఆంధ్ర మహాభారతములోని నన్నయ భాగానికి కృతిభర్త గానే గోచరిస్తూ ఉంటాడు. రాజరాజుకుగాని, నన్నయగాని కావల సింది అదియే కదా. ఇంక విమర్శకులంటారు వారి వారి ప్రజ్ఞావిశే షాన్ని ప్రదర్శిస్తూ రకరకాలుగా అనేక వాదాలు చేసుకొంటారు. ఆ గ్రంథమును జదివి భారతకథను తెలుసుకొనే సామాన్యుడు వానిలో

షష్ఠ్యంతాదికములైన లాంఛనాలలో కృతిసమర్పణ సక్రమంగా జరిగిందా లేదా చర్చలోకి పోడు. ఆశ్వాసాదిలోను, ఆశ్వాసాంతంలోను రాజరాజు కీర్తింప బడటం మాత్రం గ్రహించును. రాజరాజు ప్రోత్సహించెను; ఒకరో, ఇద్దరో మఱియే కొందరో తోడ్పడగా నన్నయ దాన్ని రచించెను అని విశ్వసించును. ఇక్కడ చూపించిన శాసనంలో విమలాదిత్య తనూజుడైన రాజరాజునకు భారతాంధ్రీకరణములో అట్టి నిర్వాహణాధిపత్యము తెలుపుచూ 'ఆంధ్రీచకార' అను క్రియ వాడబడింది. రచించినవారు 'సూరిభిః' అను బహువచనాంత పదమును బట్టి యిద్దరో, యింకా ఎక్కువమందో తెలియదు. నన్నయ, నారాయణ భట్టు అనే యిద్దరున్నట్లు అందరికి తెలిసిన విషయమే. ఆ యిద్దరికే పూజార్థమున బహువచన ప్రయోగము చేయబడెనా లేక యింకా యెక్కువ మంది విద్వాంసులుకూడ ఈ బృహత్కార్యమున తోడ్పడిరా అను సంశయము కలుగుచున్నది. ఇటీవల సూర్యరాయాంధ్ర నిఘంటు నిర్మాణములో అనేక విద్వాంసులు పనిచేసినట్లుగా ఆనాడు తెలుగులో గొప్ప గ్రంథరచన జరుపుటకు రాజరాజు మరికొందరు విద్వాంసుల తోడ్పాటును గూడ సమీకరించెనేమో, ఈ చర్చ నటుంచి కూర్మనాథస్వామి గుడిలోనున్న యీ శాసనాన్ని బట్టి చాళుక్య విమలాదిత్య తనూజుడైన రాజరాజే నన్నయ భారతమునకు ప్రోత్సాహకుడని నిస్సంశయముగ అర్థమగుచున్నది.

సీతారామశర్మగారు కూడ 'రాజరాజనృప, విమలాదిత్యాగ్ర తనూజ' (భార. ఆది. చ. 279) అనే సంబోధనను వివరిస్తూ 'ధనంజయుని ప్రవరకరము' అనే సమాసంలో రాళ్ళపల్లి వారు 'శ్రేష్ఠమైన ధనంజయుని కరము (చేయి)' అని చెప్పినట్లే శ్రేష్ఠుడైన విమలాదిత్య తనూజుడని సరిపెట్టిరి. దాన్ని బట్టి వారు విమలాదిత్యుని ఇద్దరు కొడుకులలో ఒకరు భారతరచనకు ప్రోత్సహించారను అంశాన్ని అంగీ

కరించింది. ఆ యిద్దరు రాజరాజు, సప్తమ విజయాదిత్యుడు రాజరాజు చేతకాని వాడైన కారణమున భారతాంధ్రీకరణము వంటి బృహత్కార్య నిర్వహణము చేసియుండడు అని సిద్ధాంతీకరించుటకై శర్మగారు **140** పుటల గ్రంథభాగము రచించి, సప్తమ విజయాదిత్యుడే శ్రేష్ఠుడై, తానాశ్రయించిన పశ్చిమ చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరుడి సిఫార్సుమీద నన్నయ, నారాయణభట్టులను రావించి భారతాంధ్రీకరణ కార్యక్రమమును ప్రోత్సహించెను. అని నిశ్చితార్థమును ప్రకటించుటకై బహువిధముల పాటుపడిరి. శర్మగారి తలంపులో కర్ణాటక చక్రవర్తి సోమేశ్వరుడే ప్రధాన ప్రోత్సాహకుడు. దానికై 'రాజనారాయణాఖ్య' అనే సంబోధనను పుట్టపర్తివారు చెప్పినట్లు సాగదీశారు. ఇక్కడ ఆవాదమంతా చర్చించ దలచలేదు. అంతకంటే ముఖ్యమైన శ్రీకూర్మనాథాలయంలోని శాసనం విమలాదిత్య తనూజుడైన రాజరాజ భారతాంధ్రీకరణము చేసెనని స్పష్టంగా రాజరాజునే ప్రోత్సాహకుడుగా చెపుతుంటే యితర విషయాలతో ఈ సమీక్షను పొడిగించటం అనవసరము. శర్మగారి **140** పుటల మొదటి భాగము ఈ శాసన ప్రమాణంతో పరాస్తమగుచున్నది.

శర్మగారు ఇంకో వాదం లేవదీయవచ్చును. ఈ శాసన కాలం శకాబ్దము **1195** కదా. అనగా క్రీ. శ. **1273** అగును. అప్పటికి నన్నయ భారతము రచించుట సుమారు రెండువందలేండ్లకు పూర్వము జరిగెను. ఈ వ్యవధిలోనే సప్తమ విజయాదిత్యుడికి చెందవలసినఘనత రాజరాజుకునకు అంటగట్టటం అనే ఘోరమైన అన్యాయం జరిగియుండ కూడదా? మన విమర్శ ఆ అన్యాయాన్ని బయటపెట్టకూడదా? ఈ ప్రశ్నలకు సమాధానం. (శ్రీ) కూర్మశాసనం వేయించినవాడు చాళుక్యవంశానికి చెందిన యెలమంచిలి, లేక కూర్మచాళుక్యులనబడే శాఖకు చెందిన ఒకానొక విజయాదిత్యుడనే సామంతరాజు. ఈ చాళు

క్యులు వేంగిలో సింహాసన మధిష్టించిన వారిలోనే కొంతకాలమునకు వంశములో ఉత్పన్నమైన అంతః కలహములు కారణముగా వేంగిని విడిచి ఎలమంచిలి నగరముగా జేసుకొని అచట సామంత రాజ్యము నేర్పరచుకొనిరి. కొంతకాలమునకు వారు తమ ప్రక్కనున్న తూర్పు గాంగరాజుల కళింగరాజ్యములో వారిక్రింద సామంతులయి వారితో బాంధవ్యములు కూడ కలుపుకొనిరి. ఇదే శాసనములో మొదటి విజయాదిత్యుడి కొడుకు రాజరాజు గాంగరాజగు నరసింహదేవునికి మంత్రిగా నున్నట్లు చెప్పబడెను. అట్లే యీ శాఖకు చెందిన చాళుక్యులు అనేక విధములుగా గాంగరాజుతో సన్నిహిత సంబంధము లేర్పరచుకొనిరి. ప్రస్తుతము పరిశీలించుచున్న శ్రీకూర్మ శాసనము లోని దాత రెండవ విజయాదిత్యుడుగాని తండ్రి తాతలుగాని విమలా దిత్యుని కొడుకులైన రాజరాజనరేంద్రునితోను, సప్తమ విజయాది త్యునితోను చెప్పకోదగిన దాయాద సన్నిహితులు కారు. విమలాది త్యుడికి పూర్వపు పరుషాంతములలోనే కళింగ చాళుక్య శాఖవారు విడిపోయిరి. విమలాదిత్యునికిగాని రాజరాజ నరేంద్రుడికిగాని గల సంతానమెవ్వరో. వారెట్లుండిరో మనకు బాగా తెలిసిన విషయమే. వీరి తరములో వెళ్ళినవారుకారు కళింగ శాఖవారు. మరి భారతాంధ్రీ కరణ ప్రసక్తి వారికేల వచ్చెను? తమ చాళుక్య వంశములో అట్టి గొప్పవాడొకడున్నట్లు ప్రశంసించుకొనుటయే ముఖ్యోద్దేశము. అట్టి ప్రశస్తి రాజరాజ నరేంద్రుని గూర్చి చెప్పకొన్నా అతని సవతి సోదరుడైన సప్తమ విజయాదిత్యుని గూర్చి పొగడు కొన్నవారికి భేదమేమియు లేదు. ఇద్దరు వారికి సమానమైన వంశ బాంధవ్యము గలవారే. కనుక రాజరాజనరేంద్రుని మాత్రమే ప్రశంసించుకొను పనిలేదు. అతడు నిజానికి రాజకీయముగ కొన్ని ఇక్కట్లు అనుభ వించినవాడు. ఒకవిధంగా చూస్తే సప్తమ విజయాదిత్యుడే రాజరాజ నరేంద్రుని పట్టాభిషేకం మొదలు తరచుగా కళింగ రాజుల సహాయ

ముతో అతనిని అధికారమునుండి తొలగించుటకై యత్నించువాడు. విజయాదిత్యుడికి కళింగములో తగినంత పలుకుబడి గలదు. అట్టి పరిస్థితిలో భారతాంధ్రీకరణములో విజయాదిత్యుడే నిజముగా ప్రోత్సాహకుడై యున్నచో కళింగ చాళుక్యులు ఆతనిని పొగడడం మాని కళింగులతో కొంతయైన వ్యతిరేక రాజకీయ సంబంధమున్న రాజరాజ నరేంద్రుని ప్రశంసించుటకు పూనుకొనరుకదా. అట్టి పొగడ్తకూడ లేని ఘనతను అంటగట్టుచు చెప్పుట జరుగునా? తమ వంశము వాడైన రాజరాజ నరేంద్రుడే నిజముగా ఆ ఘనకార్యం చేయించెను గనుక నిజమును కప్పిపుచ్చకుండ రెండువందలేండ్లు గడచినా ప్రశంసించుకొన్నారు. ఇదేనిజము. అప్పటికే విజయాదిత్యుడికి చెందకుండ ఆఘనతను అన్యాయంగా రాజరాజ నరేంద్రుడికి అంటగట్టి యుందురను అపవాదును శ్రీ శర్మగారు లేవనెత్తరని విశ్వసించెద.

రాజరాజే భారతాంధ్రీకరణము, ప్రోత్సహించెను. శ్రీ శర్మగారు ఈ సత్యమును శ్రీ కూర్మ శాసనము నుండియైన గ్రహించి పేలవమైన తమ యితరవాదములను సహృదయులుగా ఉపసంహరించుకొందురని ఆశించెదను. 'రాజా నారాయణాఖ్య' ఇత్యాది ప్రతిబంధకములు బలవత్తరమైనవి కావని విద్వాంసులు పుట్టపర్తి నారాయణాచార్యులు వంటివారు ముందే చెప్పియున్నారు. అంతేగాక శ్రీ శర్మగారు చుట్టు ప్రాణాయామంచేస్తూ వాడుకలో లేనట్టి బిరుదును ఒక రాజుకు ఒక నారాయణుడనే శక్తికి సమన్వయంచేస్తూ వాఖ్యానించటం అంగీకారయోగ్యంగా లేదు. వారి సమన్వయం ఏదో ఒక అభిమానాన్ని పురస్కరించుకొని చేసిన ప్రయత్నంగా కనిపిస్తుంది. ఉదాహరణకు 'నాగాయిఘటికయే ఆనాడు అందరికి విద్యాస్థానం కావచ్చు' భట్టుశబ్దం మహారాష్ట్రిలలోను, కర్ణాటకులలోనే వాడుకలో నుండెను; ఇత్యాది ఊహాలు సిద్ధాంతాలు కాజాలవు. అప్పుడు కుమా

రిలభట్టు, భట్టోజీదీక్షితులు, నాగేశభట్టు, కాళీభట్టు, మున్నగు ప్రముఖ విద్వాంసుల గతియేమిటి ?

నన్నయభట్టు కర్ణాటకుడు లేక మహారాష్ట్రుడు అనేవాదం కేవలం ఊహ మాత్రమేనని (శ్రీ) శర్మగారే తమ గ్రంథాంతమున ముగింపు అనే శీర్షిక క్రింద వ్రాసిన ముగింపు వాక్యము లిట్లున్నవి.

"ఒక్కమాట. నారాయణభట్టు, నన్నయగారలు నాగాయి ఘటికలో సహాధ్యాయులని చెప్పియున్నాను. కాని సోపపత్తికముగా స్థిరీకరింపలేక యున్నాను. ఏలనన తదనుగుణమైన బలవత్తరాధార ములు లేకయునవి, మొదటి సోమేశ్వరుని శాసనములందు గలవు. అది పశ్చిమ చాళుక్యులు నిర్మించిన ఘటిక. నన్నయ యచ్చట విద్యా భ్యాసము చేసియుండునని యూహించినాను"

ఈయూహతోటే గ్రంథమును 141వ పుటనుండి 258వ పుటలో ముగింపు అగువరకు సుమారు 118 పుటలున్న రెండవభాగ గ్రంథము రంచించి నన్నయ కర్ణాటకుడయి యుంటాడను విషయం మరికొందరు పరిశోధకులుకూడ వెలిబుచ్చిరి. కాని యీ యూహను ధ్రువపరచ గల ఆధారములు గనుపించుటలేదు. కనుపించినపుడు అంగీకరించుటలో గల వ్యతిరేకతగాని, అసంభావ్యతగాని ఉండదు. ఇంతకు ఆకాలములో ఇప్పటి తెలుగు–కన్నడ భాషాప్రయుక్తమైన అభిమానము ప్రజలలో గాని విద్వాంసులలో గాని లేదనియే చెప్పవలెను. వివాహాది భాంధ వ్యములు కలిగి ప్రజలుకూడా అతి సన్నిహితులుగా ఉండువారు. చరిత్రలో క్రీ.పూ. ఆశోకుని కాలంలో అంధకులనువారు తన రాజ్యాం తర్గతులై యున్నట్లు చెప్పబడెను. ఆ రాజుయొక్క శాసనాలు బళ్లారి- కర్నూలు మండలములలోను, అమరావతిలోను గనుపించుచున్నవి. గుత్తికి దగ్గరలో ఎఱ్ఱగుడి శాసనాలున్న తావున జొన్నగిరియను గ్రామము కలదు. అదియే అశోకుని సామ్రాజ్యములో దక్షిణ

ప్రాంతపు రాజధానిగ చెప్పబడిన సువర్ణగిరి కాదగునని పలువురు పరిశోధకులు తలంచుచున్నారు. ఆ కాలములో అంధకులుగ పేర్కొనబడిన జాతివారు ఇప్పటి కర్నాటకములోగూడ నుండెడువారు. కర్నాటకులను ప్రత్యేకించి చెప్పలేదు. కనుక అప్పుడు ఉభయదేశములు పృథక్కరించబడిలేవు. అంధక రట్టమని ఒకటిగానే యుండెనని చెప్పవలెను. ఆ తరువాత చరిత్రలో కుంతల రాష్ట్రము విడిగా పేర్కొనబడుచున్నను, కర్నూలు-బళ్ళారి మండలములు విశేషించి కర్ణాటమని పేర్కొనబడెడిది. 'కర్ణి' పదాంత నామములుగల శాతకర్ణి రాజుల పాలనలలో జేరియుండుటనుబట్టి తొలిరోజులలో ఆ మండలమునకా పేరు వచ్చియుండునని నేలటూరి వేంకటరమణయ్యగారు వ్రాసిరి. కర్నూలు జిల్లాలోని నందికోట్కూరు, నంద్యాల, ఆత్మకూరు తాలూకాలు ఇంచుమించు శ్రీశైలమువరకుగల ప్రాంతము 15వ శతాబ్దము వరకు కర్నాడు, కర్నాటకము అని శాసనములందు పేర్కొనబడుచున్నది. ఈ ప్రాంతములో సాతానికోట లేక సాతవాహనకోట యను ప్రాచీన సాతవాహనులనాటి ఒక దుర్గమున్నట్లు గుర్తించబడెను; కర్నూలు నగరముగుండా ప్రవహించు హంద్రినది 'ఆంధ్ర' పదముతో పేర్కొనబడెనని కూడ నేలటూరివారు చెప్పియున్నారు. ఆదోని లేక ఆదవాని అను నగరనామము 'అంధ్ర' పదజన్యమై యుండునని కూడ కొందరు తలంచెదరు. ఇట్టి స్థితికో ఆంధ్ర-కర్నాటకములమధ్య ప్రాంతముల యొక్కగాని ప్రజలయొక్క గాని భేదము చిరకాలము లేకుండెనని స్పష్టముగ తెలియుచున్నది. ఉభయ ప్రాంతములవారు ఒకే విధమగు అక్షరములు, ఒకే విధముగా చాంద్రమానము వాడుట మనకు తెలిసిన విషయమే.

రాష్ట్రకూటుల పాలనలో 8–10 శతాబ్దులలో వారి జైనమతాదరణము వలన అనేక జైన విద్వాంసులు వారి రాజ్యమందంతట స్థిరవాసము లేర్పరచుకొనిరి. అట్టివారిలో ఉత్తరదేశమునుండి వచ్చిన

వారనేకులు గలరు. వారి సహవాసమున పలువురు ఆంధ్ర - కర్ణాట విద్వాంసులు మున్ను సంస్కృత పదముల ననేకము తద్భవ, తత్సమ రూపములలో మార్చుకొను విధానమును వ్యాకరణబద్ధము గావించు కొనిరి. వాటితో దేశి-మార్గవృత్తములలో పద్యరచన చేయు నుత్సాహపడువారు పంప, పొన్న మొదలగువారు ముందు కన్నడములో ఆ రచనలు సాగించిరి. వారినిచూచి మల్లియరేచనవంటి జైనకవులు తెలుగులోకూడ లక్షణగ్రంథములు రచించియుందురు. విద్వాంసు లెప్పుడూ తమ మాతృభూమిని భాషను అంటిపెట్టుకొని యుండరను విషయము సర్వవిదితము. వారి విద్వత్తుకు ఆదరమెక్కడ లభించునో అక్కడికి పోవుదురు. అక్కడేవారి విద్వత్ప్రకర్షను ప్రదర్శించుదురు. నేను కర్ణాటకమువాడను, నేను తెలుగువాడను, నేను కాశ్మీరము వాని అని అనుకోడు. శంకరాచార్యుడు తను కేరళవాడిననే అభిమానాన్ని ప్రదర్శించెనా! వారికి అట్టి అవధులను కల్పించి మనమిప్పుడు పరిశోధనలు సాగించాము. నన్నయ కర్ణాటకుడనని అనుకోలేదు. పంప మహాకవి తెలుగువాడినని అనుకోలేదు. ఆ భావాలతో వారు గ్రంథాలు రచించలేదు. తమ వైదుష్యమును ప్రదర్శించుటకై ఏ భాష అనువుగతోస్తే దాంట్లో వ్రాసేవారు? పంపని సోదరుడైన జిన వల్లభుడు వ్రాసిన కర్కాృల శిలాశాసనము సంస్కృత, కన్నడ, తెలుగు భాషలలో గలదు. ఆ భాషల అభివృద్ధి నుద్దేశించి ఆ విద్వాంసులు పాటుపడి తరువాతవారికి మార్గదర్శకులైనారు. ఆనాటి రాజులు కూడ రాజకీయముగా తమ రాజ్య విస్తీర్ణ విషయంలోనే ప్రాంతీయాభిమానాన్ని చూపేవారు. విద్వాంసులను ఆదరించే విషయంలో వారి విద్వత్తుమాత్రమే ముఖ్యమైన అర్హతగా ఉండేది. దేశదేశాలనుండి విద్వాంసులు వివిధ ప్రాంతాలలో రాజాశ్రయము పొందలేదా. పరిశోధనలో కుతూహలంకొద్దీ అట్టి ప్రాంతీయ సూచనలు చేసినప్పటికి విద్వాంసులైన పరిశోధకులు ఆవిషయాలు నంతగా చర్చించనవసరము

లేదు. అంటే 'రాజానారాయణాఖ్య' అనే ప్రయోగాన్ని గాని, భట్టు పదాన్నిగాని సాగదీసి నాగాయిఘటికలో ముడిపెట్టి యిట్లాంటి గ్రంథాలు అల్లటం మన సంకుచితభావాన్ని వ్యక్తంచేయునుగాని 'వసుధైవ కుటుంబకం' అను సూక్తికి ఆదర్శ పురుషులనదగిన ఆ మహానుభావుల విశాల దృక్పథాన్ని ప్రాంతీయావధులతో సంకుచిత పరచలేవు.

నన్నయవంటి విద్వాంసునకు అసమర్థుడు, చేతకానివాడైన రాజరాజ నరేంద్రుని ఆశ్రయించుట గొడ్డుటావునకు పాలకొరకై బంధమువేయుట వంటిదేనని అట్టి నిష్ప్రయోజనకరమైన పనిని చేయునట్టి తెలివిమాలినవాడు కాదు నన్నయ అనికూడ ఒకచోట శర్మగారు రాజరాజును గూర్చిన తమ యేవగింపును వెళ్ళకక్కకొనిరి. దీనినిబట్టి చాళుక్య సోమేశ్వర చక్రవర్తి పైన తమకెంతటి యభిమానమో స్పష్టమగుచున్నది. అతనికి భారతాంధ్రీకరణ ప్రోత్సాహరూపమైన కీర్తిని, తద్వారా ఆంధ్రవాఙ్మయమున కతడొనర్చిన మహాసేవను వెలువరించవలెనని వారి గ్రంథ రచనలో ముఖ్యోద్దేశమని తోచుచున్నది. అందుకై డొంక తిరుగుడు త్రోవలు త్రొక్కిరి. ఒక్కొక్క సందర్భములో అట్టి విమర్శకులకు సమాధానములు వెతుకుటకూడ కష్టమగును. అంతమాత్రాన వారి వాదాలే సిద్ధాంతాలని భావించరాదు. రామాయణాది ఆర్ష గ్రంథాల్లో యెన్ని అపాణినీయ ప్రయోగాలు మనం చూడటంలేదు. ఆ తావులలో భావరమ్యత, పదరమ్యత, యిత్యాది గుణములనే గ్రహించవలె కాని అట్టి ప్రయోగాలకు విపరీతార్థములు చెప్పి 'వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరం' అనే సామెతకు విమర్శకులు లక్ష్యం కాకూడదని మనవి చేయుచుంటిని.

—0—

# ఆంధ్రమహాభారతము వచనోపక్రమము

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

ఈ ప్రస్తావము భావుకులకు నవీనము కాకపోవచ్చును. నన్నయ భట్టారకుల సారస్వతమున మహాభారతావతారిక మనము చూచుచున్నదే, ఆయన సర్వసిద్ధాంతముల కా యవతారిక ఆయువుపట్టు. లక్షణగ్రంథ ఘట్టముగా నున్న యీభాగములో వ్యాఖ్యానతః విశేష ప్రతిపత్తి గోచరించుచునే యుండును. "నహి సందేహా దలక్షణమ్"

అవతారికలో రాజరాజనరేంద్రుని కొలువు నభివర్ణించుచు వ్రాయఁబడిన యొక వచన మున్నది. ఆ కొల్వునఁ గూర్చుండిన విద్వజ్జనులు అయిదు శ్రేణులుగా నున్నారు. ప్రథమశ్రేణివైయాకరణులది. రెండవది భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులది. మూఁడవశ్రేణిం దీర్చియున్నవారు మహాకవులు. నాల్గవయైదవ శ్రేణులకుఁ దార్కికులు వైణికగాయకాదులు వచ్చిరి. ఇది నన్నయ్య భట్టారకులు సాక్షాత్తుగాచూచి చెప్పిన రాజనరేంద్రునిసభా భవనప్రాంగణములోని ఆసనశ్రేణీ పరిష్కరణము. ఇక్కడనొక చిక్కు:

ఒకనాఁడు సులతాను కొలువులో షాజీపుత్రుఁడైన శివాజీకి అయిదువేల సరదారులు కూర్చున్న పంక్తిలోఁబీఠము చూపఁబడెనఁట. మనస్వియగు శివాజీకి అది భరింపరాని పరాభవ మైనది. ఆ మహారాష్ట్రనాయకుడు వారు చూపిన యాసనశ్రేణికంటె సమున్నతమైన యాసనముపై అధిష్ఠింపదగినవాఁడనన్న ఆత్మప్రత్యయము కలవాఁడు. పీఠోన్నతియన్నది యెత్తు పొడవు వెడల్పులనుబట్టి నిర్ణయింపఁదగినది కాదు. తన పీఠముప్రక్క మఱి యెవరి పీఠము లున్నవి! ఆ పీఠము లందాసీను లగువా రెట్టి తరహావారు! ఇదికదా ప్రశ్న. మాటలతో వేఱె తుటారింప నక్కఱలేదు. తన దృష్టికి వాఁడు విశిష్టుఁడు కాని, తుల్యుఁడుకాని కానిచో నట్టివానిచెంతఁ దనకుఁ బీటవేసిన పెద్దమాని

సితోఁ దగవుతప్పదు. ఇదియొక యవమానముగా నొకఁడు పట్టించుకొనఁడు. ఒకఁడు పట్టించుకొనును. పట్టించుకొన్న వాఁడుఆత్మగౌరవము కలవాఁడుగా విజ్ఞలోకమున నభినందితుఁడగు చున్నాఁడు. మొదటి వాఁడు అమాయికుఁడేని, యోగియేని కావలయును.

లోకజ్ఞుఁడు సద్వినుతావదాత చరిత్రుఁడునైన నన్నయ రాజ రాజుకొలువులో నేశ్రేణికిఁ జెందిన పీఠమున సమాసీనుఁ డాయెనో! యన్నది యొక వివిదిష. ఆ రాజరాజానురక్తుఁ డెచ్చటఁ గూర్చుండుఁ గాక! పురస్కారమున కేమికొదవ? ఇంతకు భట్టారకపీఠము అభివర్ణిత శ్రేణులకు భిన్నమైన యొక ప్రత్యేకస్థానమున నుండవలయును. ఆ స్థానము రాజమనోహరుని యంతరంగముకంటె నన్యముకాదు.

ఈ శ్రేణీ కల్పనమువలన మనము గుఱుతింపవలసినది భట్టార కుల హృదయము. ఆయనకుఁ బ్రథమాభిమానశాస్త్రము శాబ్దము.తరు వాత, మహాకవిత్వము. పదపడి, పక్కినవి. ఈక్రమములోఁ బూర్వా పూర్వ మాయనకు గాఢాభిమాన విషయములు. తాను విపుల శబ్ద శాసనుఁడు. "ప్రథమే హి విద్వాంసో వైయాకరణాః" కనుక. సభలో వైయాకరణశ్రేణిని ముందుంచుట జరిగినది. నన్నయ తాను బ్రహ్మాం డాది నానాపురాణ విజ్ఞాన నిరతుఁడు. రెండవ శ్రేణిలోఁ బౌరాణికు లను గూర్చుండఁజేసినది యీవిజ్ఞాననిరతి. నన్నయ తానుకవి, మృదు మధుర రసభావభాసుర నవార్థ వచనరచనా విశారదుఁడైన మహాకవి యగునుగదా! ఈకవిత్వమునకు స్థానమును మూఁడవదిగా నేల చేసి కొనెను! అహంకార నిరాసార్థమా! ఆయన దృష్టిలో దాని కదియే స్థానము కావలయునా?

'ధర్మతత్త్వజ్ఞులుధర్మశాస్త్రంబనియధ్యాత్మవిదులువేదాంతమనియు నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని కవివృషభులు మహాకావ్యమనియు' ఇత్యాదిగానున్న పద్యములో నీక్రమము మఱియు స్పష్టపఱచి భట్టార

కులు చెప్పియున్నారు. ఇంతకంటె అక్కజముగా "తనకులబ్రాహ్మణు ననురక్తు నవిరళజపహోమతత్పరు విపుల శబ్దశాసను సంహితాభ్యాసు" ఇత్యాది సీసములో నీక్రమము సువ్యక్తపడుచున్నది. విపుల శబ్దశాసనత్వము తరువాతఁ బురాణవిజ్ఞానము. తరువాత ఉభయభాషా కావ్యరచనము, మువ్మాఁటు ఈరీతిగా శాస్త్ర-పురాణ-కవిత్వకళలయొక్క క్రమత పూర్వాపూర్వవిషయములపై తనకుఁగల తత్పరత భట్టారకులు చెప్పినట్లయినది. రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో శాస్త్ర కావ్యములు-కావ్యశాస్త్రములు- కేవల కావ్యములు- కేవల శాస్త్రములు- ఈరకముగా విభజనము చేసెను. పురస్సరద్ధర్మానుశాసనమైన మహా కావ్యముగా ఆంధ్రభారతము నుపక్రమించుటలో భటారకులమెలఁకువ తెలుఁగు సరస్వతి యలికమున విశేషక రచన యగుచున్నది.

ప్రాచీనశాస్త్రము లన్నియు నేశబ్దముతో నుపక్రాంతము లగుచున్నవి? అందుఁ గొన్ని మంగళార్థకమైన 'అథ'తో నారంభమైనవి "అథాతో ధర్మజిజ్ఞాసా" – "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" ఇట్లు పూర్వోత్తర మీమాంసాసూత్రములు ప్రవర్తిల్లినవి. "అథ శబ్దానుశాసనమ్ కేషాం శబ్దానాం"ఇట్లు పాతంజల మహాభాష్యము – ఓంకారమునకు అథ శబ్దము సహోదరము. ఈ రెండు మాంగళికములు.

ఓంకార శ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికా వుభౌ॥

తత్తచ్ఛాస్త్రాదియందుఁబ్రయుక్తమైన యీ"అథ" అవ్యయమై మంగళార్థకమేకాక అధికార ద్యోతకముకూడ నగుచున్నది. నామలింగానుశాసనము దీనికయిదు అర్థములు చెప్పినది. మంగళము – అనంతరము- ఆరంభము-ప్రశ్నము- కృత్స్నత- ఇవికాక "మేదిని" దీనికి సంశయ మను నర్థము కలదనెను. నన్నయ అవతారికోపక్రమణమునకు అథ శబ్దార్థ విచారమునకు ఏమిసంబంధ మందురు! "అథ"

శబ్దార్థమునకు సరియగు తెనుఁగు అని యన్నది. అథ వర్ణద్వయాత్మకమైనది. "అని" యు నట్టిదే. అందును ఇందును అకారమే ముందున్నది. "అథ" లోని థకారము తెనుఁగులో "ని" వర్ణముగా దిగినది. ఈ తద్భవతలో మనము సంతోషపడవలసినది తవర్గను దాఁటకుండ జరుగుటయే. ఒకానొక ముచ్చటకుఁగాని యిందు మనకుఁ దద్భవతా ప్రసక్తి యక్కఱలేదు. అథ ఆనంతర్యార్థకము. "అని" యన్నదియు నట్టిదే. ఈ సంస్కృతాంధ్రావ్యయములు రెంటికీ ఇంత బలిష్ఠమైన బాంధవమున్నది.

నన్నయభట్టారకుల దేశభాషాకృతి రచనము దేవభాషాశాస్త్ర సంప్రదాయానుగతమైనది. ఆంధ్రమహాభారతము "అని సకలభువన రక్షణ ప్రభువులై యాద్యులైన హరిహర హిరణ్యగర్భ పద్మామావాణీపతుల స్తుతియించి తత్ప్రసాద సమాసాదిత నిత్యప్రవర్ధమాన మహామహీరాజ్య విభవుండును నిజభుజ విక్రమ విజితారాతిరాజ నివహుండును నఖిల జగజ్జేగీయమాన నానాగుణ రత్నరత్నాకరుండునై పరగుచున్న రాజరాజనరేంద్రుండు."

అను వచనముతో నుపక్రమింపఁబడుట చూడఁగాఁ బూర్వోత్తర మీమాంసాది శాస్త్రములవలె అథ శబ్దసహోదరమైన "అని" ముమ్మొదటఁ బ్రయుక్త మయ్యెనని విజ్ఞులు తెలిసికొనియుందురు. ఆంధ్రమహాభారత మిటులు భట్టారకుల యుపక్రమణ సంప్రదాయముతో శాస్త్రమై కవివృషభులకు మహాకావ్యమగుచున్నది. మహాకావ్యమైనపుడు కావ్యప్రయోజనము ఆదియందు సూచింపఁబడవలయునుగదా! ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశములలో నేయొకటియేని యుండవలెను. ఒకటికాదు, మూఁడింటికి ముడియగు గద్యమే ఆద్య ప్రయుక్తమైన దన్నచో నన్నయగారి హృదయము నారాధించుట యగును.

తొలివచనమున హరిహర హిరణ్యగర్భులకు నమస్కారము చేయబడుట-తత్ప్రసాద సమాసాదిత...అనుటవలన రాజనరేంద్రునకుఆశీస్సులొసంగబడుట గోచరమగుచున్నది. మఱి వస్తు నిర్దేశము! ఎక్కడో కాక ప్రథమతః ప్రయుక్తమైన శబ్దములోనేయున్నదని నాచేయుచున్నమనవి. నన్నయ తాను పాకశాసని, భారత ఘోరరణమున నుద్యుక్తుఁడై దుష్టశిక్షణ సాధుభువన రక్షణములు జరుపవలసినవాఁడు. నారాయణ సహాయుఁడైన యీ నరునితో ధర్మము మహాభారతమునఁ బ్రతిష్ఠితమైనది. దుష్టనిగ్రహమునకు సంగ్రామము వలసియున్నది, భారతసంగరము జరిగినచోటు కురుక్షేత్రము ధర్మక్షేత్రము. "భారం సంగ్రామం తనోతి విస్తారయతి" అని భారతమునకు వ్యుత్పత్తి చెప్పుదురు. ఇంతకు తేలినది భారతవస్తువు సంగ్రామము. నన్నయగారు ఆయోధనార్థకమైన అని శబ్దము నాదిలోఁ బ్రయోగించి వస్తునిర్దేశము నెంత గుప్తము గావించినారో యిపుడు విచారింపవచ్చును.

"యథాయుధానాం కులిశ మింద్రియాణాం యథామనః ।
తథేహ సర్వశాస్త్రాణాం మహాభారత ముత్తమమ్ ॥

మార్కండేయపురాణం,

మంగళార్థకమైన అథ శబ్దమువంటిదే యగు "అని" తో మహాభారతారంభమగుట - అదికాక వస్తునిర్దేశకరణోద్దేశమున సంగ్రామార్థకమగు "అని" తో సమారంభమగుట-చూడఁగా తెనుఁగుభారతమును శాస్త్రముగా మహాకావ్యముగా నాంధ్రులకు అనుగ్రహించెడి తలంపు నన్నయమహర్షి కుండెను. "అక్షరాణా మకారోస్మి", అని కదా భగవద్వచనము.

ఆంధ్రమహాభారతమువంటి సారస్వత ప్రథమావతారము ఛందోబంధేతరమైన, అని సకలభువన రక్షణేత్యాది వచనముతో నారంభింపఁ బడెనా ? మఱి -

శ్రీవాణీ గిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహంత్యవిహితాం స్త్రీ పుంస యోగోద్భవామ్
తే వేదత్రయ మూర్తయ స్త్రీ పురుషా స్సంపూజితానస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవ శ్రీ కంధరాశ్శ్రేయసే।

మూర్తిత్రయ స్తవాత్మకమైన యీ శ్లోకము మాట యేమైనది. ఇది యాంధ్రము కాలేదు. అంతరంగకృతమైన కవిప్రార్థనము శిష్య శిక్షకు గ్రంథాది నుంచుట యాచారము కదా! తెనుఁగు భారతము అచ్చముగా ఎచ్చటనుండి యుపక్రాంత మయిన దనఁగా నాయొద్ద నుండియే యని చెప్పవచ్చినట్లు గ్రంథారంభ సర్వస్వము దాచార గుంఫితమైన తొలి వచనమే చెప్పుచున్నది. పంచమవేదము నాంధ్రీక రించునపుడు ఛందః పురస్కారము విధిగా జరుగవలసి యుండగా గద్యారంభము శాస్త్రసంప్రదాయ సుందరమైన భట్టారకుల హృదయ మును పట్టి చూపుచున్నది. ఆయన గద్యపద్యములకు తుల్య ప్రతిపత్తి నిచ్చిన మహాకవి. ఏనాటికిని ఛంధః ప్రసన్నమయిన తెనుఁగు పద్య గద్యములకు నన్నయగారిదే ఆద్యస్థానము – తెలుఁగు భారత సరస్వతి గద్య పద్య స్వరూపిణి.

యా వర్ణపద వాక్యార్థ గద్యపద్య స్వరూపిణీ
వాచి నర్తయతుక్షిప్రం మేధా దేవీ సరస్వతీ !

# కవివృషభులం మహాకావ్యమనియుం

శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రి.

కవివృషభులు మహాకావ్యమంటారు భారతాన్ని. వేదవ్యాసుణ్ణి గురించి చెప్పేటప్పుడు కూడ ఆయన్ను మునివృషభుడని పేర్కొన్నాడు నన్నయభట్టు. మామూలుగా అయితే అది శ్రేష్ఠవాచకమే అవుతుంది. నన్నయ ఆ మాత్రానికే ఆ వృషభ శబ్దాన్ని తెచ్చి అటుమునితోనూ, ఇటు కవితోనూ సమాసంచేసి వుండడా అనిపిస్తుంది. వృషభం ధర్మదేవతకు ప్రతీక. భూమికి గోవు ప్రతీక. ధర్మం ప్రవర్తించవలసింది భూమి మీదనే. అందువల్ల భూమికీ ధర్మానికీ లంకె వుంది. భాగవతంలో కలిపురుషుడు గోవృషభరూపాల్లో ఉన్న భూమి మీదా, ధర్మం మీదనే మొదట దండయాత్ర ప్రారంభించాడు. భూమి మీద ధర్మ ప్రవర్తకులు కవులు. ధర్మస్వరూప స్వభావ నిరూపకులు ప్రబోధకులు కవులు. ధర్మప్రబోధకులైన కవులే కవివృషభులు. ధర్మశాస్త్ర మన్నప్పుడు ధర్మమంటే ఏమిటో విచారించాం. ధర్మాన్ని భూప్రజల అనుష్ఠానానికి ప్రబోధించటమే అసలు కవులపని. వారినే కవి వృషభులంటారు. జనం ఏం చెయ్యాలో ఏం చెయ్యకూడదో ఏం చేస్తే ఏమవుతుందో చెబుతూ ఉండటమే కవులపని. చెయ్యవలసిన పని చెయ్యకుండా మరేదో చేస్తూ అదే కవిత్వమనీ తామే కవులమని పౌండ్రక వాసుదేవుడు వాసుదేవుడని తిరిగినట్లు తిరిగే కవులనుండి అసలు కవులను వేరుగా చూపించటం కొరకు నన్నయభట్టు కవిశబ్దానికి వృషభశబ్దాన్ని కలిపి ఉంటాడు. ధర్మప్రతీకగా వృషభం ఆయన తన దృష్టిలో లేకుండానే వేదవ్యాసుణ్ణి కూడా మునివృషభుడని చెప్పి వుంటాడని అనిపించటంలేదు. మునివృషభులను కవివృషభులను, సమస్థాయికి తేవటంచేత నానృషిఃకురుతే కావ్యమన్నదాని తాత్పర్య భావన కూడా అనుమానించవలసిందిగానే ఉంది. మరొకటికూడాఉంది.

భాషాస్వరూపమైన శబ్దబ్రహ్మమును వృషభంగా చెప్పటాన్ని గమనించవచ్చు. భారతంలోనే బ్రహ్మము శబ్దబ్రహ్మమనీ పరబ్రహ్మమనీ చెబుతూ శబ్దబ్రహ్మ భజనపరుడు, పరబ్రహ్మ మహిత పదమును పొందునని చెప్పబడివుంది. (శాంతి. 5–71,332). కవివృషభులు అంటే శబ్దబ్రహ్మోపాసకులు అని చెప్పవచ్చు. శబ్దబ్రహ్మమును ఎందుకుపాసించాలి కవులు? వాళ్ళు పనిముట్లు శబ్దార్థాలు గనుక–అన్ని వేళలా అన్ని పనులకూ సాధనలుగా పనికిరావు. తామాసించిన ప్రయోజనాల నీడేర్చడానికిగాను పనికి వచ్చే శబ్దార్థాలే కవుల (కుండాలి) కావాలి. ఆ విధంగా కావలసిన శబ్దార్థాలు. ఉపాసకులయిన కవులకు ఎప్పుడు సన్నిధిలో వుంటాయి. శబ్దబ్రహ్మ అంటే భాష యొక్క బృహద్రూపం. అలాంటి భాషా ప్రపంచానికి కవులు సన్నిహితులుగా ఉండాలి. ఉపాసన అంటే అదే. నిరంతరాను సంధానమన్న మాట. దీనినే ప్రత్యభిజ్ఞానమని కూడా అంటారు. ఏమిటి విశేషమంటే – భాషారూపాలయిన శబ్దార్థాలు అందరికీ ఎంతో, కవులకూ అంతే. అయితే కవులు శబ్దార్థాలను ఉత్పత్తి చేసేవాళ్ళుకాదు, మామూలు ప్రజల్లాగ, వాళ్ళుత్పత్తిచేసిన శబ్దార్థాలను తామాశించిన ప్రయోజన సాధనాలు కావటానికి వీలుగా వాటిని అనుసంధించి వాక్యరచన చేస్తారు. ప్రజలలో కవులు చేరుతారుగనుక తమకు సాధారణంగాను సామాన్యంగాను తెలిసిన భాషను కవులు విశేషించి తెలుసుకోవటానికి ప్రయత్నిస్తారు. సామాన్య జనానికిలేని భాషావిషయమైన విశేష ప్రయత్నంచేసి భాషాతత్త్వాన్ని సాక్షాత్కరింప జేసుకొంటారు. అలా చేసుకోవటానికి ప్రత్యభిజ్ఞానమనిపేరు. ఈ ప్రత్యభిజ్ఞాన విశేష సామర్థ్యంచేతనే కవులు మహాకవిత్వసిద్ధిని పొందుతున్నారు. వాచ్యవాచకరచనా సామర్థ్యం లోకసామాన్య వ్యవహార విషయం. అందువల్ల కవిత్వసిద్ధి కలిగితే ఒకవేళ కలుగవచ్చు. వ్యంగ్య వ్యంజకరచనా సామర్థ్య రూపకమైన మహాకవిత్వసిద్ధి మాత్రం కలుగదు. కనుక

మహాకవిత్వసిద్ధిని పొందిన వాళ్ళే మహాకవులు. ప్రత్యభిజ్ఞాన విశిష్టులే మహాకవులు. ప్రత్యభిజ్ఞాన విశిష్టులే మహాకవులు. ప్రత్యభిజ్ఞాన వైశిష్ట్యానికి శబ్దబ్రహ్మోపాసనమే కారణం. అటువంటి శబ్దబ్రహ్మోపాసకులే కవివృషభులు. "మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవుల"ని నన్నయభట్టు చెప్పినప్పుడాయన మనస్సులో ఈ ప్రత్యభిజ్ఞాన విషయం కూడ ఉండవచ్చు.

మరి మహాకావ్యమంటే నన్నయగారేమని అనుకొని ఉంటారు? నన్నయ్యగారికంటె ముందున్న భారతీయాలంకారికులలో సర్గబంధమైన కావ్యమే మహాకావ్యమన్నాడు భామహుడు, ఆయననే కదా మన మొదటి ఆలంకారికుడు! అభినేయార్థమైన కావ్యాన్ని సర్గబంధంకంటె భిన్నమైన కావ్యభేదంగా చెప్పినందువల్ల మహాకావ్యము శ్రవ్యకావ్య విశేషమనే అర్థమవుతున్నది. కావ్యమహత్వము నాయకుని మహాపురుషలక్షణం చేతనూ నిర్ణయింప బడటం భామహునకు ఇష్టం. మహాకావ్యానికి లక్షణం సర్గబంధమనటం కంటె మహతాంచ మహచ్చ అనటమే సలక్షణంగా కనిపిస్తుంది. ఈ దృష్ట్యా మహాభారతాన్ని మహాకావ్యమనవచ్చు. భామహాచార్యుడు చెప్పిన లక్షణాలన్నీ – మంత్రదూత ప్రయాణాజి నాయకాభ్యుదయములు, నాయకుని వంశ వీర్య శ్రుతాదులు పురుషార్థ చతుష్టయ ప్రబోధమునందు అర్థ ధర్మ ప్రాధాన్యము, లోక స్వభావ నిరూపణము, సకలరసాన్వితత్వము – మహాభారతానికి పడుగూనే ఉన్నా. కనుకనే నన్నయ్యగారు మహాభారతాన్ని మహాకావ్యమన్నారు.

నన్నయగారి కంటె రెండువందల సంవత్సరాలకు పూర్వం మహాభారత కావ్యత్వనిరూపణం గురించి విశేషమైన శ్రద్ధచూపించిన ఆలంకారికుడు ఆనందవర్ధనుడున్నాడు. కావ్యాత్మధ్వని అనీ అది రామాయణ మహాభారతముల యందే ఉన్నదనీ – ఉన్న విషయాన్నే ఎవరూ గుర్తుపట్టి చెప్పనందున తానుచెప్పవలసి వచ్చిందంటూ ఆయన

ధ్వన్యాలోకం వ్రాశాడు. అందులో ఆయన మహాకవులూ - మహాకావ్యములూ అంటూచేసిన చర్చలను గమనిస్తే మనకు మహాకవి - మహాకావ్య శబ్దార్థములు - తల్లక్షణములు - కొంత తెలిసే అవకాశం ఉంది.

వాచ్యార్థంకంటె భిన్నంగా దాంతోపాటే ప్రతీయమానార్థాన్ని అంటే ధ్వన్యర్థాన్ని ఎవరు తమ కావ్యాల్లో నిక్షిప్తం చేయగలరో వాళ్ళే మహాకవులని, అలాంటి వాళ్ళు కాళిదాస ప్రభృతులు ఎంతో మంది ఉండరనీ అందువల్ల మొత్తంమీద అయిదారుగురుకంటె మహాకవులుండరన్నట్లు తేల్చాడు ఆనంద వర్ధనుడు. మహాకవి శబ్దానికి అర్థంగా చూపించదగిన మొదటికవి కాళిదాసు. అయితే మరి వ్యాస, వాల్మీకుల సంగతి యేమిటి? వాళ్ళు మహాకవులు కాదా! అట్లా అనటానికి వీలులేదు. వ్యాస వాల్మీకుల భారత రామాయణాల మీద గల ప్రమాణబుద్ధితోనే గదా ఆనందవర్ధనుడు ధ్వని కావ్యాత్మ అని ప్రతిపాదించింది ? అయితే వ్యాసుణ్ణి మహర్షి అనీ కవి వేధసుడనీ అంటాడు. వాల్మీకిని ఆదికవి అంటాడు. ఇద్దర్నీ కవీశ్వరులనీ, కవి ముఖ్యులనీ కూడా అంటాడు. అంటే ఆ యిద్దర్నీ మహాకవులనీ అన లేదు, వాళ్ళ కృతులను మహాకావ్యాలనీ అనలేదు, ఆనందవర్ధనుడు. చిత్రమేమిటంటే ఆయన తన అర్జునచరితమనే కావ్యాన్ని మహాకావ్యంగా చెప్పకొన్నాడు.

మహాకావ్యం అంటే శ్రవ్యకావ్యం మాత్రమేనని కూడా ఆనందవర్ధను డనుకొంటున్నట్టనిపిస్తుంది.

కావ్య మహాకావ్య ప్రబంధశబ్దాల నన్నింటినీ కూడా పర్యాయ పదాలుగానే వాడుకొన్నాడాయన. మహాకావ్యానికి ప్రబంధశబ్దాన్ని విశేషణంగా కూడా చేసి చెప్పాడు.

మహాకవి శబ్దాన్ని కానీ మహా కావ్యశబ్దాన్నిగానీ ఆనందవర్ధ నాచార్యులవారి దృక్పథం నుండి నన్నయ్యగారు వాడలేదు. రాజ రాజు ఆస్థానాన్ని ఆశ్రయించుకొని ఉన్న కవులను మహాకవులనాడు. వాళ్ళు ఏ మహాపురుష నాయకములయిన ఎంత మహా గ్రంథాలను రచించారో తెలియదు. వ్యాసుణ్ణి మహాకవి అని నన్నయ్య అనలేదు. మహాకావ్యం అని మాత్రం భారతాన్ని అనుకొంటున్నారని చెప్పాడు. కవి వృషభులు అంటే శబ్దబ్రహ్మోపాసకులయిన కవులూ, కావ్యార్థ తత్త్వజ్ఞులయిన కవులూ, అని అర్థం. వీళ్ళనే కవి పండితులనీ — కవి సహృదయులనీ అంటారు. నన్నయ్యగారు మహాభారతాన్ని భామ హుడు చెప్పినట్లు సర్గబంధమైన మహాకావ్య లక్షణ లక్షితంగా తెలుసు కొన్నాడు. అలాగే అనుకొని వుంటాడు. ధ్వన్యాలోకపు టాలోచనా విధానానికి మహాభారత స్వరూప స్వభావాలు అంతగా అనుకూల మైనవి కావు. నన్నయ్యగారి విశ్వప్రపంచ అవగాహన మీమాంసా దర్శనాన్నీ, కావ్యప్రపంచ అవగాహన భామహాలంకార మార్గాన్నీ అనుసరించినట్టు కనిపిస్తుంది.



తెలుఁగున గద్యకవితను ప్రవేశపెట్టుటలో

# నన్నయ నిర్వహించిన భూమిక

శ్రీ భమిడిపాటి విశ్వనాథ్

తెలుగు సాహిత్యంలో పద్యం, శతకం, దండకం, మొదలుగా గల ప్రక్రియ లన్నిటితో పాటు వచనానికి అంటే గద్యానికి కూడ శ్రీకారం చుట్టి ఆది పురుషుఁడయ్యాడు నన్నయ. ఆంధ్ర సాహిత్యం లో ఈతని గద్యకొక ప్రకృష్ట స్థానం, వుంది. ప్రస్తుతం ఈవ్యాసంలో తెనుఁగు గద్య కవితకు ప్రారంభదశలోనే నన్నయ రూపొందించిన స్థానం అతని విశిష్టత, విశ్లేషించబడుతుంది.

సంస్కృతంలో ముఖ్యంగా వైదిక వాఙ్మయంలో గద్యకు ప్రముఖమైన స్థానం ఉంది. "గద్యం కవీనాం నికషం వదంతి" అనెడి ఉక్తికూడా ప్రసిద్ధమైనదే. తెనుగు సాహిత్యంలో గద్యకు కావ్యత్వ స్థానం కల్పించడంలో నన్నయ్య నిర్వహించిన భూమిక మరువలేనిది. ఆదికవి తన భారత కావ్యంలో పద్యంతోపాటు గద్యానికి కూడా సమాన ప్రతిపత్తిని కల్పించాడు. తెలుగులో గద్య రచనలు విశేష స్థానాన్ని సంపాదించటానికి మూలహేతువులు పరిశీలిస్తే నన్నయ గద్య రచనా ఆరంభము, వైవిధ్యములే కాక, గుణము పరిమాణము లలో అతడు చూపిన నైపుణ్యమే ముఖ్య కారణముగా నిర్ణయింప వచ్చు. నన్నయ గద్యం విస్తృతితోపాటుః పుష్కలత్వంకూడా గలిగి ఉంది. తెలుఁగు గద్య వికాసానికి నన్నయ ఆరంభదశలోనే వేసిన పునాదులు ఎన్నో. ఆపై వచ్చిన కట్టడాలన్నీ ఆపునాదులపై నిలిచినవే

వచన మన్నది మృదు మధురంగా ఉండి, తన భావములకు ఆకరమై, కవితకు, కథకు పరిపుష్టిని చేకూర్చాలని నన్నయ ఆశయం.

అందుచేతనే ఈ మృదుమధుర శబ్దాన్ని నన్నయ భారతంలో పలుమాఱులు ఉపయోగించాడు. ఉదా॥కు దుష్యంతుఁడు కణ్వాశ్రమంలో ప్రవేశించి శకుంతలతో సంభాషించెడి సందర్భములోని వచనమిది.

"వారు వచ్చునంతకు నొక్క ముహూర్తం బుండునదీ యనిన విని యక్కోమలి వినయంబునకు మృదు మధుర వచవంబులకు సంతసిల్లి దానిం కన్యకగా నెఱింగి." "సారమతిం కవీంద్రులు" అనే పద్యంలో నన్నయ తన కవితా లక్షణాలను గూర్చి చెప్పుకున్నాడు. నాద సౌందర్యయుతమైన ఈతని అక్షరరమ్యత సందర్భానుకూలమై అలరారుతోంది. పై విశేషాలన్నీ ఈతడు ప్రవేశపెట్టిన గద్య కవితలోకూడ మనకు గృగ్గోచరమవుతాయి. పరశురాముఁడు క్షత్రియరాజులను వధించెడి సందర్భంలో నన్నయ వచనమిది.

"అప్పరశురాముఁడు నిజనిశిత కుఠారధారా విదళిత సకలక్షత్త్ర రుధిరాపూర్ణంబులుగా నేడు మడుగులు గావించి తద్రుధిర జలంబుల పితృతర్పణంబు చేసి తత్పితృగణ ప్రార్థన నుపశమిత క్రోధుండయ్యె" పరుషాక్షరాలతో కూడిన ఈసమాసరచన సందర్భానికి అనుగుణమైన రమ్యములైన అక్షరములతో కూడిఉంది.

నన్నయ గద్యాన్ని శీఘ్రగతికి, కథాసంక్షిప్తకు ఒక ఉత్తమ సాధనంగా సాహిత్యంలో ప్రవేశపెట్టాడు. ఆతడు ఉత్తమజాతి కథకుడు. కథాకథన పద్ధతికి ప్రాముఖ్యము నిచ్చి ఉపాఖ్యాన తత్త్వమును చాటించినవాడు. శకుంతలోపాఖ్యానములోని ఈక్రింది వచనాన్ని గమనిస్తే మనకీ విషయం స్పష్టమవుతుంది.

"అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దాని కోరిన వరంబిచ్చి గాంధర్వ వివాహంబున నభిమత సుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్ను దోడ్కొని రా నస్మత్ప్రధాన వర్గంబు

గణ్వామహామునిపాలికిం బుత్తెంచెదనని... దుష్యంతుండు నిజపురం బునకు జనియె."

ఇచ్చట నన్నయ శకుంతలా దుష్యంతుల సంగమసన్ని వేశాన్ని క్లుప్తీకరించి, ఎక్కువ వర్ణించకూడని ఆ సందర్భాల్ని, అలతి అలతి పదములతో, గద్యంలో రచించాడు. సంభాషణనిసైతం నన్నయ ఈ వచనంలో చొప్పించాడు.

ఉదంకో పాఖ్యానంలో ఉదంకుఁడు పౌష్యుడు శాపప్రతిశాపాలు ఇచ్చుకునే కథని అతి క్లుప్తంగా వచనంలో నన్నయ వర్ణించాడు. "ఉదంకుడు అట్లు చేయుదునని యద్దేవి వీడ్కొని పౌష్యుపాలికిం బోయిన నతండయ్యా! వీవతిథివి...అన్నంబు కేశదుష్టంబైన రోసి కరంబలిగి...అంధుడవగుమని శాపంబిచ్చిన నల్గి ఉదంకుఁడు నేనన పత్యుండుగా నోప దీనిగ్రమ్మరింపుమనిన." ఈ వచనం తరువాత "నిండు మనంబు నవ్యనీత సమానము" అనే పద్యాన్ని రచించాడు. పద్యముల నధికముగా రచించి పాఠకులకు విసువు జనించకుండ పద్యముల నడుమ గద్యమును రచించుట నన్నయకు పరిపాటి.

కేవలం కథా కథనానికే కాదు, సంవాదరూపమునకు, విషయ ప్రతిపాదమునమునకు, వైదిక వర్ణాశ్రమ ధర్మముల నుగ్గడించుటకు, నన్నయ వచనం ప్రసిద్ధమైంది. నన్నయ తన సమకాలీన వచన రచనా విశారదులను మెప్పించిన మేటి వచన రచనా విశారదుడు. రాజరాజ నరేంద్రుడు సభను వర్ణించే ఈక్రింది వచనంలో అతఁడీ విషయాన్ని స్పష్టం చేసాడు.

"అఖిల జలధి వేలా వలయిత వసుమతీ వనితా భూషణంబయిన వేంగి దేశంబునకు మంత్రి పురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహా ప్రధాన సామంత విలాసినీ పరివృతుఁడయి అపార శబ్దశాస్త్ర పారగులైన వైయాకరణులును...మృదు మధుర రసభావ భాసుర నవార్థ

వచన రచనా విశారదులయిన మహాకవులును... విద్వజ్జనంబులు పరి వేష్టించి కొలుచుచుండ." ఇక్కడ నన్నయ వచన రచనకు చక్కటి విశేషణాన్ని ఉపయోగించాడు. రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో వచనా రచనా విశారదులైన మహాకవులుండేవారు. ఆనాటికి తెలుగులో మహాకావ్యాన్ని రచించిన నన్నయ ఆ కవులందరినీ మెప్పించే విధంగా భారత రచన చేసాడు. అంతేకాదు మహాకవుల కావ్యములకు ఎటువంటి వచన రచన అవసరమో! అలంకారము, అక్షర రమ్యతాయుతమైన పై వచనంలో నన్నయ స్పష్టీకరించాడు. అశ్వాసాంత గద్యను, సంభాషణలలో వచన రచనను నన్నయ ప్రవేశ పెట్టాడు. పాత్రను వర్ణించే సందర్భంలో సమయోచితమైన వచనాన్ని నన్నయ ఉపయోగించాడు.

తెలుగు సాహితీ గద్యను నన్నయ ప్రారంభంలోనే విస్తృత రూపమున, ప్రణాళికా బద్ధంగా, ప్రయోజనకారిగా ప్రవేశపెట్టాడు ఈతని గద్యను తరువాత కవులందరూ ముఖ్యంగా తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథుడు మొదలగువారు సంప్రదాయాను సారముగా పొందికున్నంతలో అనుసరించి కొనసాగించిరి.

నన్నయ పద్య గద్యముల రెండింట సవ్యసాచి. అతని భారతం రత్నాలతోకూడిన ఒక మహోదధి. మథించిన కొలది రత్నములు వెలికి వచ్చుచునే యుండును.

—0—

# నన్నయ అక్షరరమ్యత

శ్రీ వి. వి. ఎల్. నరసింహారావు

## —: నన్నయ కవితాగుణములు :—

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలి తార్థాయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప
నానా రుచిరార్థసూక్తి నిధినన్నయభట్టు దెనుంగునన్
మహాభారతసంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్.

ఈ పద్య ఆంధ్రమహాభారతములో భారత కథా ప్రస్తావనకు ముందు అవతారికాభాగములో నన్నయ్యగారు రచించినది. ఇందు తన కవితా గుణములను గూర్చి యాయన కొన్ని సూచనలనుచేసినాడు. వానిలో మొదటిది ప్రసన్న కథా కలితార్థయుక్తి. ఇది సారమతిలో, కోనారసి కవీంద్రులు మాత్రమే మేలని మెచ్చుకో దగినది. రెండవది అక్షర రమ్యత. ఇది ఇంద్రులకంటె ఇతరు లాదరించు గుణము. మూడవది యాయన కవితకు జీవలక్షణ మనదగును "నానారుచిరార్థసూక్తి నిధిత్వము". ఆ గ్రంథము మహాభారత సంహిత. తత్సంహితారచన బంధురుడు నన్నయ. ఆ రచన జగద్ధితంగా సాగిన కల్యాణమయమైన రచన.

చళుక్య రాజమహేంద్రుడు ఆజ్ఞారూపముగ నన్నయ్యను అర్థించిన రీతి ఇది.

జననుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధని.
రూపితార్థ మేర్పడఁ దెనుగున రచియింపు మధికధీయుక్తిమెయిన్ ॥

మహానుభావుడగు వ్యాసుడు జననుతుఁడు. ఆయన రచించిన సంస్కృత భారతమందు నిరూపితమైన అర్థము స్పష్టమగునట్లుగా అధిక

ధీయుక్తితో నన్నయ తెనుగున రచనచేయవలసియున్నది. అధికమగు నీ ధీయుక్తి, ప్రసన్న మగు నాయన కథాయోచన, లోనారసి తెలిసికొన్న సారమతులగు కవీంద్రులు మెచ్చుకొన్న దే.

## 2. అక్షర రమ్యత

ఇక రెండవగుణమైన అక్షరరమ్యత ఎట్టిది? దీనినాదరించు నాయితరులెవ్వరు? భారత మనేకుల నాకర్షించిన 'విశ్వజన' మగు గ్రంథము. ధర్మతత్త్వజ్ఞులు, అధ్యాత్మవిదులు, నీతివిచక్షణులు, కవి వృషభులు, లాక్షణికులు, ఐతిహాసికులు, పౌరాణికులు – ఒకరననేల సర్వులను రంజించిన మహాకావ్యమిది. 'ఇతరులక్షరరమ్యత నాదరింప' అనుచో కవివృషభులుగాక తక్కిన యెల్లరునని యర్థమా? అట్లగుచో కవీంద్రులు అక్షరరమ్యత నాదరింపరనియా? ఎన్నో సందేహములు.

లోకములో కావ్యము నొక్కొక రొక్కొక దృష్టితో పరిశీలింతురు. కొందఱు కథాకథన మందలి యొడుపున కానందింతురు. కొందఱు శబ్దసంయోజన కుట్టూతలూగిపోవుదురు. కొందఱుతత్త్వ వివే చనమున తన్మయులగుదురు. కొందఱు రసపారవశ్యమున రక్తినందు దురు. అక్షరరమ్యత యన్నది. ప్రధానముగా శబ్దసంయోజనకు సంబంధించిన గుణము. కవీంద్రుడు కేవల శబ్దసంయోజనకు మోహి తుడుకాడు. భౌతికమైన శబ్దప్రపంచము నధిగమించి అర్థయోజనమూ లమున రసజగత్తును దర్శింపగలడు. ఈరసజగద్దర్శనమునకుశబ్దసంయో జనకు నుపయోగమని యర్థముగాదు. ప్రధానమైనది అర్థయోజనయని అర్థము. కనుక కవీంద్రుని దృష్టికథాప్రసన్నతపైనుండునని నన్నయ తాత్పర్యము.

కవికంటె నితరుడగు సామాన్య రసజ్ఞుడు శ్రవణ సుఖదమగు సలలితశబ్ద మాధుర్యముచే సులభముగ ద్రవించి పోవును. గండుకో యిల కుహూరావమున కర్థములు తీసి యానందింతుమా? ఆనందించిన

పిమ్మట ఆసక్తికలిగినచో పరామర్శ చేయుదుము. ఈ పరామర్శ ప్రత్యేకమగు మఱియొక శాస్త్రము.

నిర్వచనము : అక్షరములు ధ్వనులకు సంకేతములు. వివిధ ధ్వనులుగల అక్షరములచే శబ్దము లేర్పడుచున్నవి. ధ్వని మాటాడిన పిమ్మట నశించిపోవును. అక్షరమట్లుగాదు. ఎన్నడు నశింపని పరమేశ్వరు డక్షరపద వాచ్యుడు. అక్షరమగు రమ్యతగల కవిత లోకోత్తర మైనది.

ఈ అక్షర రమ్యత నన్నయ కవితలో సంగీత సాహిత్యముల సాహచర్యముచే సంయోజితమైనది. సంగీతములో అచ్చుల ప్రాముఖ్య మెక్కువ. సాహిత్యములో హల్లుల ప్రాముఖ్య మెక్కువ. కాని అచ్చుల సాహాయ్యము లేనిచో శబ్దమునకు వ్యక్తిత్వము లేదు. సంగీత ములో స్వరంయోజనకు హల్లుల సహాయ్యము లేకున్నను ప్రమాదము లేదు. నిజమరసిన అఖండనాద వ్యక్తికి మహాప్రాణ సంయుక్తాక్షర ములు కొంత ప్రతిబంధకములే! అంత మాత్రమున హల్లులు సహాయ్య ము లేకుండ స్వరముండుటయు కష్టమే. ఒక అచ్చునుండి మఱియొక అచ్చునకు దూకవలెననిన హల్లు ఊతగానుండవలసినదే! వీనినిబట్టి చూడ హల్లునకు అచ్చుసహాయ్య మెంత అవసరమో అచ్చునకు హల్లు సహాయ్యము కూడ అంతే అవసరము. అట్లే సాహిత్యసంగీత ములును. 'అక్షర రమ్యత' యను నీ కవితాగుణము ఈ సంగీత సాహిత్యములు సముచిత సాహచర్యము నాశ్రయించి యుండును. అంతేకాదు. సంగీత ప్రభావము సాహిత్యమునకు రమ్యత నాపాదించు నప్పుడు డుదయించు కవితాగుణములలో అక్షరరమ్యత అతి ప్రధాన మైనది. ఈ అభిప్రాయమునే శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిట్లు వివరించిరి.

"సంగీత సాహిత్యములో సంగీతము సాహిత్యమునకు పై

చేయిగా నిలిచి నప్పుడు కలుగు సహజ పరిణామములలో అక్షర మ్యత ఒకటి"

## అక్షర ప్రయోగ రమ్యత 3.

అక్షరము లేయేధ్వనులకు సంకేతితములై యున్నవో ఆయా ధ్వనులు ఉచ్చారణమునందు వాగింద్రియములలో భిన్నభిన్న స్థానముల నుండి యుదయించును. సవర్ణ సంజ్ఞకములై సమానస్థాన ప్రయత్నమున జనించెడు అక్షరములు కూడ బాహ్యాభ్యంతర ప్రయత్నముల వలన అనేక విధములుగా కన్పించుచున్నవి. అభ్యంతర ప్రయత్నమునందు స్పృష్టప్రయత్నముచే స్పర్శములు, ఈషత్స్పృష్టములై అంతస్థములు, వివృతస్వరములై ఉష్మములు, హ్రస్వాకార ప్రయోగమునందు సంవృతములై కొన్ని జనించుచున్నవి. అట్లే బాహ్య ప్రయత్నముచే, వివృత, శ్వాస, నాద, ఘోష, అఘోష, అల్పప్రాణ, మహాప్రాణ, ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదములచే ఏకాదశ విధములైన అక్షరములు గలవు. ఇవిగాక కంఠ, మూర్ధ, కంఠోష్ఠ, దందోష్ఠ, నాసికాది స్థానములలో జయనించుటచే మఱికొన్ని భేదములు గలవు. అక్షరము లుచ్చరించు నపుడు వాని ఉత్పత్తిస్థానము తెలిసి యుచ్చరించినను, తెలియక యుచ్చరించినను ఆయాధ్వనులతో ఆలక్షణములు శ్రవణేంద్రియమునకు అనుభూతముకాక తప్పదు. మహాకవులు శబ్దప్రయోగము నందు అక్షరధ్వని లక్షణములు, శ్రవణేంద్రియముపై వాని ప్రభావము,తన్మూలమున గలుగు అంతరమైన హృదయద్రవీకరణ యున్నగువానిని విస్మరింపరు. కవిత వ్రాయునపుడు ప్రత్యక్షరము నిట్లు పరిశీలించి వ్రాయుదురని అర్థముగాదు. ఆయాసన్ని వేశములందు రసోచితములైన యాయాశబ్దములు. ఆయా అక్షరములు, వానియంతటఅవే కుదురుకొని ఆమహాకవి జీవలక్షణమైన యొకానొక రచనా మార్గమును స్పష్టము చేయును. నన్నయ్యగారి

రచనలో - ఈ అక్షర సంయోజనము హృదయాహ్లాద జనకముగా శ్రవణేంద్రియ తర్పణముగా సాగినది. ఆ లక్షణము తన కవితలో నిండారి యున్నదని గుర్తించిన జ్ఞాని నన్నయ. నా కవితయందలి 'అక్షర రమ్యత' పరమాదరణీయమని యాయన విశ్వసించెను.

## 4. నాదము, రసము, రాగము

సంగీతము శ్రవణేంద్రియానందము కలిగించి ఆంతరతృప్తినొదవించు మనోహరమైన యొక కళ. వివిధస్వర సంయోజనచే వివిధరాగము లుత్పన్నమగును. వివిధ చ్ఛందస్సులెట్లుత్పన్నమైనవో వివిధరాగము లట్లే యుత్పన్నము లైనవి. మలయమారుత రాగము హృదయమ్ముపై మలయ మారుతమును ప్రసరింప జేసియానందము కలిగించును. అట్లే బృందావన సారంగాది రాగములును. కదనకుతూహల రాగము కదన కుతూహలము జనింప జేయును. మహాకావ్యములలో కనిపించు భిన్న చ్ఛందస్సులు, ఆయాఛందస్సులలో లయాన్వితముగా కుదురుకొని భిన్న భిన్నములైన అక్షరముల ధ్వనులు రసోచితమైన అఖండనాదము నుత్పన్నము చేయును. ఈ నాదవ్యక్తి ఎచ్చట ప్రాధాన్యము వహించునో అచ్చట సాహిత్యముపై సంగీతముపై చేయిగా కదలును. నన్నయ రచనలో ఈగుణ ముండుటచే ఆయన కవిత అక్షర రమ్యమగుచున్నది. దీనికాయన కవిత నుండి యెన్నియో యుదాహరణములు చూప వచ్చును.

ఆ యుదంకుడు గురుహిత కార్యధురంధరుడు. గురుపత్నీ నియోగమున క్షాత్ర్యమ్ము మహాదేవి కుండలములు గైకొని సంతోషముతో తిరిగి వచ్చుచున్నాడు. ఒక్క జలాశయము దగ్గఱ ఆచమనార్థమాగి కుండలములు అచ్చట పెట్టగా నగ్నవేషధరుడైన తక్షకుడు ఆకుండలములను తీసికొని పాఱిపోయెను. ఉదంకుడు వాని వెంటబడి పట్టు

కొనెను. నాడు దిగంబర వేషము విడిచి, మణికుండలములు మాత్రము విడువక నిజరూపముతో నాగలోకమునకు పరుగెత్తెను. ఉదంకుడు కూడ వానివెంట బోయి నాగపతులనెల్ల ప్రసన్నులు గండని ప్రార్థింప మొదలు పెట్టెను.

"బహు వనపాదపాబ్ధి కులపర్వత పూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికి పాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకు డనంతుడు మాకు ప్రసన్నుడయ్యెడున్"

ఇట్లే వాసుకిని, ఐరావత ఫణిరాజులను, తుదకు కుండలములు హరించిన తక్షకుని స్తుతించెను. ఇచ్చట నన్నయగారు నాలుగు వృత్తములు ప్రయోగించెను. రెండు చంపకములు, రెండుత్పలములు. ఈ నాలుగు వృత్తములకు మకుటము "మాకు ప్రసన్ను డయ్యెడున్" చంపకోత్పలములు శార్దూల మత్తేభములకంటె సౌమ్య స్వభావముగలవి. కార్యార్థియైన ఉదంకుడు నాగపతులను ప్రసన్నలను గావించుకొనుటకై పలికెడు పలుకులలో తీవ్రతయు, పారుష్యమును కన్పట్టరాదు. ముందు చంపకములతో ప్రారంభించినాడు. ఉత్పలముకంటె చంపకము లఘుగమనముతో ప్రారంభమగును. ఇట్టి లాఘువవృత్తితో ముందు స్తుతించినాడు. ఆనాగపతులు ప్రసన్నము కాలేదు. అంతట గౌరవవృత్తి నందుకొని ఉత్పల మాలలతో స్తుతిపూజ చేసినాడు. ఈస్తుతి పద్యములన్నిటిలో సంధింపబడిన శబ్దాక్షరముల నాదధార పరిశీలింపగా ఐరావతకోటిఘోరఫణిరాజులు పరమ పారవశ్యముతో నాట్యము చేయవలసినదిగా నున్నవి. పాములు సంగీతమునకు పడగలువిప్పి నాట్యమాడును. అట్టి సంగీతమును అనుసంధించి ఉదంకుడు నాగస్తుతిని చేయుటలో ఔచిత్యమున్నది.

ఈ సందర్భమున సంస్కృత భారతమున నాగస్తుతి తొమ్మిది

శ్లోకములలో సాగినది. ఇందనేక నాగమంత్ర రహస్యములు గలవట. అందు ఐరావత సర్పములకే ప్రాముఖ్యము. కుండలాపహర్త యగు తక్షకుని స్తుతించుటయు జరిగినది. మఱికొందఱు నాగపతుల స్తుతియు గలదు.

"య ఐరావతరాజాన స్సర్పా స్స మితి శోభనాః
క్షరంత ఇవ జీమూతా స్సవిద్యు త్పవ నేరితాః"

అను శ్లోకము మొదలుగా......

"అవసద్యో మహాదుమ్ని ప్రార్థయన్నాగ ముఖ్యతామ్
కరవాణి సదాచాహం నమ స్త స్మై మహాత్మనే"

అను శ్లోకముతో నాగస్తుతి ముగియుచున్నది. మూలముతో పోల్చి చూడగా నన్నయగారు సంఘటించిన "బహువనపాది......సమాస ఘటన స్వతంత్రతా రమణీయ మనక తప్పదు. ప్రథమ పాదములో చాలవరకు ఓష్ఠ్యములైన వర్గాక్షరములతో పదములు ప్రారంభమగును. ద్వితీయ పాదము ఊష్మాక్షరములతో మొదలగును. ఆ ఉదంకుని స్తుతితో పాములు పడగలు విప్పి పూత్కృతి చేసి ఊష్మలత వెలిగ్రక్కినట్లు అక్షరసంయోజన చేయబడినది. అజస్ర-సహస్రఫణాళి దాల్చిన ఫణిపతిమూర్తి కన్నులు గట్టినట్టు అక్షరములు కూర్చబడినవి. ఆ అనంతుఁడు దుష్కృతాంతకుడు. జలధిశాయికి పాయక శయ్యయైనవాడు. 'పాయక' అను పదము లేకయు అర్థము సరిపోవుచున్న సందర్భమున జలధి శాయికి, పాయక' అనుటలో అనంతత్వ లక్షణ స్ఫూర్తి, అనుప్రాసమహత్త్వము - అక్షర రమ్యత నాపాదించుచున్నవి. ఇట్టి అక్షర సంయోజనవలన కలుగు నాదవ్యక్తి విశేషము తెలిసిన మనీషి నన్నయ.

మహర్షి వ్యాసుడు ఉదంకునిచే నాగస్తోత్ర్యంతమున మాత్రమే 'నమ స్త స్మై మహాత్మనే' అని అనిపించి యూరకొనగా నన్నయ,

నాలుగు వృత్తముల యంతమునకు 'మాకు ప్రసన్నుఁ డయ్యెడున్' అను మకుటమును సంధించినాడు. భక్తిభావ పారవశ్యమును వ్యక్తీ రించుటలో దొరలు – శతకపద్యముల మకుటము వంటిదీ అష్టాక్షరీ మకుటము. మఱియొక విధముగా చెప్పిన తెలుగు శతకములకీ యొరవడి పెట్టిన దక్షులలో నన్నయగారుగూడ నొకరనవచ్చును. అది ప్రత్యేక ముగా పరిశీలింపవలసిన విషయము.

## 5. ఛందోరమ్యత

అక్షర రమ్యత యనగా అక్షర చ్ఛందో, రమ్యతయని అర్థము చెప్పవచ్చును. సంస్కృత చ్ఛందస్సులలో అక్షర చ్ఛందస్సుకూడ నొకటి. ఒకటి గణ చ్ఛందస్సు, రెండవది మాత్రా చ్ఛందస్సు, మూడవది అక్షర చ్ఛందస్సు. లౌకిక సాహిత్యమునందు అలతిగానున్న ఛందోగ్రంథములకు పింగళనాగుని ఛందశ్శాస్త్రమే ఒక విధముగా మూలాధారము. పింగళనాగుడు వేదములనుండి లక్షణరూప చ్ఛందస్సు నుద్ధరించెనందురు. పింగళనాగకృతమైన ఛందశ్శాస్త్రమునకు హలా యుధభట్టు మృతసంజీవనీటీకయు; సమీాహూ చక్రవర్తి, మధుసూదన విద్యావాచస్పతులు ఛందోనిరుక్తియు రచించినారు. పింగళనాగుని అక్షర చ్ఛందోలక్షణము ననుసరించియే వృత్త ప్రసార మార్గము లేర్పడినవి. నన్నయగారా మార్గములన్నియు అవగతము చేసికొన్న వైదికుడగు మహాకవి. అందువలననే ఆంధ్ర మహాభారతమున నాయా మార్గములలో వృత్తౌచిత్య పాలనము చేసి అక్షరచ్ఛందో రామణీయ కము నుద్ధరించినాడు.

ఆంధ్ర భాషయందలి వృత్తము లన్నియు అక్షరగణబద్ధము లన వచ్చును. వీనినే నిసర్గగణములనియు నందురు. సాధారణముగ చంప కోత్పల శార్దూల మత్తేభములనే ప్రయోగించు కవి ఏదే నొక ఛందో వైచిత్రి సాధించుటకు తప్ప వృత్తమును మార్పు చేయడు, ముఖ్యముగ

నన్నయగారు రసౌచిత్యమునకు, భావౌచిత్యమునకు మాత్రము భిన్న వృత్తములను ప్రయోగించు చుండును.

ప్రమద్వర మేనకా విశ్వావసులకు పుట్టినది. మహాసౌందర్యవతి. రురుడామెను మోహించినాడు. ఆ ప్రమద్వర తోడి కన్నియలతో నాడుచుండ ఆమె కాలిక్రింద బడిన పామొకటి యామెను గఱచెను. ఆమె నేలపై కొరిగెను. ఒక దేవదూత యాదేశమున రురుడు తన యాయుష్యమునం దర్థభాగ మిచ్చి ప్రమద్వరను బ్రదికించుకొనెను తన సతి కపకారము చేసిన పాములపై అతనికి విపరీతమగు పగ. పుట్టలు పొదలు తిరుగాడుచు దీర్ఘదండధరుడై పాముల నెల్లహరి యించు చుండెను. డుండుభ మనునొక పామెదురుపడి భయప్రకంపితమై అతని నిట్లు ప్రార్థించెను

మత్తకోకిల :—

"ఏమికారణమయ్య పాముల కేల యల్గితి నీవు తే
జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు" నావుడున్
"బాము లెగ్గొనరించె మత్ప్రియభామ కేనురురుండను
ద్దామ సత్త్వ్రఢ నిన్ను నిప్పుడ దండతాడితు జేసెదన్"

ఇందలి భావమంతయు మూలవిధేయమే.

"నాపరాధ్యామి తే కించి దహామద్య తపోధన
సంరభాచ్చ కిమర్థం మామభిహంసి రుషాన్వితమ్"

రురు రువాచ :—

"మమ ప్రాణసమాభార్యా దష్టాసీ ద్భుజగేన హ
తత్రతమే సమయో ఘోర ఆత్మనోరగ వైకృతః
భుజంగవై సదాహాన్యాం యం యంపశ్యేయ మిత్యుత
తతోఽహం త్వాం జిఘుంసామి జీవితే నాద్య మోక్ష్యసే"

ఈ భావము ననుసరించిన నన్నయ ఇచ్చట నొక చిత్రము చేసినాడు. అంతవఱకు చంపక వృత్తము నడిపి హఠాత్తుగా రురు డుండుభ సంవాదమును మత్తకోకిల వృత్తమున సంధించినాడు. ఈమత్తకోకిల అక్షరగణ చ్ఛందస్సులలో నొకటి. ఒక గురువు లఘువు, ఒక గురువు రెండు లఘువులుగా సాగిపోవు ఛందస్సిది. పొడవైన దండముచేత బట్టుకొని 'హరిహరి' కుయ్యివెట్టు డుండుభ మహాహిపై ఝళిపించుచు రురుడు సంభాషించుచున్నాడు. మూలములో 'డుండుభం వయసాన్వితమ్' అని యున్నది. హరిహరి అనుకూాయిలేదు. ముసలి డుండుభమును తాడించుటయు రురుపౌరుష మేమియని 'డుండుభ మహాహి' అని నన్నయ యూరుకొన్నాడా; ఆ దీర్ఘదండ మెత్తి అతడు మీదనుంకించుట ఈ పాము మెలికలు తిరిగి అటునిటు గురులఘు గమనముతో తప్పుకొనుట మొదలుగా నొక దృశ్యము ఛందోభేద ముచే నన్నయ సూచించినాడనిపించును. మత్తకోకిల ఛందస్సునందలి అక్షరసంయోజన మట్టిది. నన్నయ నూతన వృత్తము లెచ్చట ప్రయోగించినను నీ దృష్టి స్పష్టముగా గనిపించును.

దుష్యంతుడు వేటకై వచ్చి అల్లంత దూరమున మున్యాశ్రమము గాంచెను. మున్యాశ్రమ పరిసరారణ్యము బ్రహ్మసృష్టిలో గల సహజ సౌందర్యమంతయు నింపుకొనియున్నది. వ్యాసమహర్షి పులకితాత్ముడై యీ ఘట్టమును మహాకవితాకేదారముగా మలచి నాడు. భువన మోహనమైన యాసన్నివేశమును తెనుగున రూపు కట్టించుటకు వ్యాసునంతటి మహాకవి కావలయును. ఈకష్ట మెటు వంటిదో నన్నయకు తెలియును. ఉన్న భావములున్నట్లు వెలయించుచు ఛందోరామణీయక మాశ్రయించి అక్షరశిల్పము వెలయించినాడు.

మృగములను వేటాడి వేటాడి యలసియున్న దుష్యంతునిపై పరిసర నదీపవనములు చల్లగా వీచినవి. కావున సౌందర్యమంతయు

కనులార గాంచి పులకితుడైనాడు. ఈ పులకాంకురములకు కారణమైన సుందర ప్రకృతిని సాధారణ వృత్తగీతులలో కాక విలక్షణవృత్త ఛందస్సులలో వెలయించినాడు.

"ఏచి తనర్చిన కోవుల నిమ్మగు తావుల జొంపములన్......"

పూచిన మంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నలఁగేదగులన్..."

ఇది మానినీ వృత్తము : మానినీవృత్తపాదము యొక్క ప్రథమాక్షరమైన గురువును విరిచి రెండు లఘువులుగా చేసిన కవిరాజవిరాజిత' మగును. కాన నీ సౌందర్యపరవశుడైన దుష్యంతుడు ముందు మంద మందముగా నడచి, పిమ్మట వేగవేగముగా అడుగులిడుటగూడ సూచించినాడు నన్నయ.

కవిరాజవిరాజితము :

చని చని ముందట నాజ్య హవిర్ధ్రుత సౌరభ ధూమ లతాతతులన్
బెనగిన మ్రాఁకులకొమ్మలమీఁద నపేత లతాంతములైనను బా
యని మధుపప్రకరంబులఁ జూచి జనాధిపుడంత నెఱింగెఁ దపో
వనమిది యల్లదె దివ్యమునీంద్ర నివాసము దానగునంచు నెదన్॥

దుష్యంతుడు వేగముగా నడచుటకు కారణము; అచ్చటి ప్రకృతి చిత్రముగా నున్నది. ఆ తుమ్మెదలు పూవులులేని శాఖలనే ఆశ్రయించి యున్నవి. అందుచే అది నిర్వ్యాజమైన మున్యాశ్రమమైయుండునని తెలిసికొనెను. నిజమునకిది నన్నయ అమూలకముగా సృష్టించిన మనోహర భావమే.

వ్యా సు డు :

"రువంతి రావా న్మధురాన్ షట్పదా మధులిప్సవః
తత్ర ప్రదేశాంశ్చ బహూన్ కుసుమో త్కరమండితాన్."

పూవులున్నచోట తుమ్మెదలుండుటలో విశేషము లేదు. పూవులు లేకయు తుమ్మెదలుండుట తపోవనప్రభావము. ఇది దుష్యంతునకు

ఆశ్చర్యము కలిగించినది. అప్పటి యాదుష్యంతుని గమనవైభవము కవిరాజవిరాజిత వృత్తములో అక్షర గణబద్ధముగా ఛందస్సౌందర్య మహితముగా నన్నయ సంతరించెను. మానినీవృత్తము వెంట (కవి) రాజవిరాజితవృత్తము పింఛించుట శకుంతలా దుష్యంతుల వృత్తములను వ్యంగ్యముగా ధ్వనింపజేయుచే.

అక్షర గణబద్ధమైన ఛందోరామణీయకము విషయమున నొక్కమాట చెప్పవలసియున్నది. ఒక్కొక్క ఛందస్సునందలి గణములలోని అక్షరములనుకూర్చు ఒక్కొక్కవిధముగా నుండును. ఆ యక్షరముల యుచ్చారణముచే కలుగు నాదవ్యక్తి ఒక్కొక్క తీరుగా నుండును. ఆ నాదము సంగీతానుగుణముగా నుండవలెనన్న అసంయుక్త పరుషసరళమయమైన అక్షరములు కూర్చబడవలెను. కాని యీ అక్షరముల కూర్పు రసానుగుణముగా నుండవలెనన్న విషయము మఱువరాదు. ఛందస్సు నేరికొనుటలో కూడ కవియగు వాడీవిషయము గుఱుతుంచుకొనవలయును. యుద్ధవర్ణనసందర్భములలో ఉత్పలచంపకములు పడి నలిగిపోవుట ఛందస్సౌందర్యమును భంగించును. అంతఃపురసన్నివేశములలో తుండము లెత్తి మత్తేభములు ఘీంకరించుట, పంజావిప్పి శార్దూలములు ఘుర్ఘుర ధ్వనులు చేయుట కొంత అనుచితమనక తప్పదు. ఛందస్సును ప్రయోగించుటలో నన్నయగారీ యౌచితీపాలనము చాలవఱకు నిర్వహించినారు. అంతే కాక ఆయన మార్గరీతులు నచ్చినను నచ్చకున్నను వృత్తౌచిత్యవిషయమున నన్నెచోడుడుకూడ ఒకటిరెండు సందర్భములలో నిట్టి జాగరూకత ప్రదర్శించెను.

మత్తేభముల క్రీడను నన్నెచోడుడు మత్తేభవిక్రీడిత వృత్తములోనె వర్ణించుట గమనింపవలసియున్నది.

మ. హృదయాహ్లాదముతోడ పాయక సదానేకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి చూచి కౌతుక రతైః కాలీన భిలా భావా
షదృగంతోజ్జ్వల దీధితుల్ పఱలె నీశానాన నాబ్జంబుపై॥
కుమా. సం.

## 6. కావ్యగుణములు—అక్షరరమ్యత

అక్షర చ్ఛందోనియతియే కాక కేవల అక్షర సంయోజనమును గూర్చి పరామర్శించినపుడు అలంకారికులు ప్రవచించిన కావ్యగుణముల ప్రసక్తియు వచ్చును. కావ్యేందిరకు శబ్దార్థములు తనువై, అలంక్రియా వితానములు సొమ్మలై, కైశికి మొదలైన వృత్తులు సొత్తులై మాధుర్యాదిగుణములు గుణము లగుచున్నవి. భరత, భామహ, వామన, భోజరాజ, విద్యానాథాదుల మతముల ననుసరించి ఈ గుణముల సంఖ్య ఎంత యను ప్రశ్న మట్లుంచి మాధుర్యాది గుణములు అక్షరముల కూర్చుచే కలుగు భిన్నముభిన్నములైన కావ్యగుణములన్న విషయము మరవరాదు. విశిష్టవర్ణవిన్యాసరూపమైన శ్రుత్యనుప్రాసము రసావహమనినారు. సరసమైన వాక్యము మధురము. కనుక నీమాధుర్యగుణము అక్షరసంయోజనకు సంబంధించినదే. ఇందు వర్ణావృత్తి ప్రధానము. సౌకుమార్య మన్నది పదలాలిత్య సంపదోపలాలితమై కావ్యమున ప్రకాశించును. పరుషవర్ణఘటితమైనచో సౌకుమార్యవిపర్యమైన దీప్తత మొదవి సుకుమారత కొఱవడును. ఇక సమతయున్న గుణము పరుషకోమల వర్ణ మిశ్రమ మనోహర రచనామూలకమై మృదుబంధ, స్ఫుటబంధ మిశ్రబంధములై కావ్యముల నొప్పారును. ఆయా యీ కావ్యగుణములలో గల అక్షర సంయోజన రహస్యము లెఱిగిన ప్రోడ నన్నయ.

భీష్ముడు కాశీరాజ దుహితలలో అంబను సాల్వరాజున కిచ్చి పుచ్చి అంబికాంబాలికలను విచిత్రవీర్యునకిచ్చి మహోత్సవముతో వివాహము చేసెను. విచిత్రవీర్యుడు ఆ విలాసినులతో కామలీలలదేలు సన్నివేశమును నన్నయ యెట్టి అక్షరములతో గూర్చెనో వినుడు.

లాలితరూప యౌవనవిలాస విభాసినులైన యంబికాం
బాలికలన్ వివాహమయి భారతవంశకరుండు గామలీ
లాలలితానుభోగ రసలాలసుడై నిజరాజ్యభార చిం
తాలసుఁడయ్యెఁగామికి నయంబున నొండు తలంపఁబోలునే.

పద్యమెత్తుగడ మొదలు తుదివఱకు మధుర సుకుమారసమవర్ణ సంయోజనచే రచన యంతయు అక్షర రమ్యతనే వెలయించుచున్నది. సంస్కృత కవులలో జయదేవుని సరస కోమలకాంత పదావళి యిట్టిదే. నన్నయ కవితలో నీ యక్షర రమ్యత చేయివేసినచోట నెల్ల, చెవియొగ్గి వినిన చోటనెల్ల ఆపాతమధురముగా అనుభూతమగును.

నిజమున కీమాధుర్యము వర్ణావృత్తివలన కూడ కొంత కలుగును. అనగా అనుప్రాసాది శబ్దాలంకారముల కూర్పువలనకూడ కలుగునని యర్థము. నన్నయ కవితయందలి వర్ణావృత్తిమూలకమైన అక్షర రమ్యతకును ప్రబంధకవుల శబ్దాలంకారములకును చాల భేదము గలదు. నన్నయగారి అక్షర సంయోజనలో ప్రసన్నతాగుణ మెచ్చటను కొఱవడదు. ప్రబంధ కవుల అనుప్రాసములో ఆ గుణము తక్కువ. వీరి అనుప్రాస మధురిమ చెవిలో మాత్రమే గిరికీలుకొట్టి హృదయావధులు తాకుటకు చాలకాలము పట్టును.

"అతికాంత సలతాంత లతికాంతర నితాంత రతికాంత రణతాంతసుతను. కాంతమున్న" దనుకొనుడు. ద్రుతగతిలో సాగెడు నిందలి మృదంగ ధ్వనుల నతిక్రమించి 'రతికేళిలో అలసిన దంపతులు' పఠితలకు స్ఫురించుటకు చాల యెడము పట్టును. 'కామలీలా లలితాను

భోగరస లాలస, ప్రకృతి చిత్రణమున నన్నయగారు వ్యక్తీకరించెడి అర్థప్రసన్నత ఇందు లేదు. అందేకాదు అర్వాచీనులగు పలువురిలో నీప్రసన్నత లేదన్నచో తప్పులేదు. నన్నయగారి అక్షర రమ్యతలో మందమంద మందాకినీ తరంగములపయి రాయంచ తూగి యాడెడి తీరుగలదు. అర్వాచీనుల శబ్దాలంకారములలో నిమ్నోన్నత ప్రదేశములలో దూకిపడెడి కొండవాగులో కొట్టుకొనిపోవు కలువపూ మొగ్గల వడిదుడుకు గలదు.

## 7. పూర్వమీమాంసమతము—అక్షరరమ్యత

నన్నయగారి అక్షరరమ్యత కేవల శబ్దసంయోజనకు సంబంధించినది మాత్రమేకాదు. అక్షరపదవాచ్యుడైన పరమాత్మ రమ్యతకు సంబంధించినది కూడ. "ఇతరు లక్షరరమ్యత నాదరింతురనగా" ఆ యితరులు ఈ పరమాత్మ రమ్యతకు మురియువారే 'సహస్రశీర్షమైన దైవము; విశ్వాక్షము, విశ్వశంభువము, విశ్వమయము, నారాయణము నైన దైవము. అది అక్షరమైనది. పరమపదమైనది. అట్టి అక్షరమై పరమపదమైన తత్త్వముయొక్క రమ్యత అక్షరరమ్యతయే. ఈ అక్షర రమ్యతకు ధర్మతత్త్వజ్ఞులు, అధ్యాత్మవిదులు, నీతివిచక్షణులు, మొదలుగా నితరులెందరో ముగ్ధులగుదురు. ఆ రమ్యత నాదరింతురు. నన్నయ భావించిన యితరులనగా వీరేకాని సామాన్యులని యర్థము గాదు. నన్నయ కవితలో అక్షరసంయోజన చేయుటయందు మంత్ర శాస్త్ర ప్రసిద్ధములైన రహస్యము లనేకములున్నవి. అందు కొన్ని మూలవిధేయకములు, కొన్ని అమూలకములు. ఉదంకుని నాగస్తవములో వ్యాసుడు 'నమస్తస్మై మహాత్మనే' యని అష్టాక్షరితో ముగించినాడు. నన్నయ "మాకు ప్రసన్నులయ్యెడు" మని అష్టాక్షరీ మకుటమునే నాల్గువృత్తములందును అనుసంధించెను. ఇట్టి మంత్ర శాస్త్ర రహస్యము లాకవితలో నెన్నియో అక్షర సంయోజితములై

యున్నవి. ఈ మార్గములో సువిస్తృతమైన పరిశీలన జరుగవలసి యున్నది.

ఇంతకు పర్యవసానము అక్షర రమ్యత యనగా వర్ణ సంయోజన వలన గలుగు నాదవ్యక్తిమూలకమైన రమ్యత యొకటి. అక్షరపద వాచ్యమైన పరమాత్మ రామణీయకము రెండవది. ఈ రెంటిని భావించియే నన్నయ అక్షర రమ్యతను యోజించినాడు. దీనినిగూర్చి ప్రత్యేకమైన ఆంతరపరిశోధన జరుగవలసియున్నది.

ఈ పరిశోధనకు అంకురార్పణ ఈ అఖిలభారత ఆంధ్రరచయితల ద్వితీయ మహాసభలో జరుగునని యాశించుచుంటిని. ఈ వ్యాసములో నేను ఉద్దేశించిన పలువిషయములను సూచనగా మాత్రమే ప్రస్తావించితిని. ఈ ప్రారంభ ప్రస్తావములు ఫలావహములగుచో ధన్యుడను.

| | |
|---|---|
| 1. నన్నయ కవితాగుణములు (మూడు) | నిర్వచనములు |
| 2. అక్షర రమ్యత ? నిర్వచనము | |
| 3. అక్షరప్రయోగ రమ్యత | |
| 4. నాదము : రాగరసములు | సంగీతము |
| 5. అక్షరచ్ఛందోరమ్యత | ఛందస్సు |
| 6. కావ్యగుణములు : అక్షర రమ్యత | గుణాదులు |
| 7. పూర్వమీమాంసాతత్త్వము : అక్షరరమ్యత | తత్త్వదృష్టి |
| 8. [మంత్రశాస్త్ర ప్రశస్తి] – రసోచితాక్షరబంధము | ధ్వన్యౌచిత్యము. |

—[ ♦ ]—

"సంగీతసాహిత్యాలు : అక్షరరమ్యత" (శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు – భారతి. పార్థివ ఆశ్వయుజము). ఈ వ్యాసము ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రమునుండి ప్రసారితమై భారతిలో ప్రచురింపబడినది.

# నన్నయ్య 'అపూర్వ సభా రచనలు'

శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి

మయుడు ధర్మరాజునకు నిర్మించి యిచ్చిన సభను గూర్చి తండ్రికి చెబుతూ దుర్యోధనుడు 'ధారుణి నట్టి యపూర్వసభారచనలు వినగ జూడ బడ వెవ్వరిచేన్' అని తన తుదితీర్పు వినిపించాడు. నన్నయ గడుసువాడు కాకపోలేదు! తాను తన పథకంలో మహా భారత సభాపర్వాన్ని తీర్చిదిద్దిన తీరుతెన్నుల గూర్చి సంతృప్తిని కూడా ఇందులో ధ్వనించలేదని అనుకోవచ్చునా?

సంస్కృత భారతాన్ని ఆంధ్ర మహాభారతాన్ని పోల్చిచూస్తూ నిర్ణయాలకు రావడానికి ఒక అభ్యంతరం ఉన్నది. ఆనాడు కవిత్రయం వారికి లభించిన మూలపాఠం ఏదో మనకు తెలియదు గనుక. అయినా, కవిత్రయంవారు ఇతిహాసరూపంలోఉన్న మూలభారతాన్ని తెలుగులో కావ్యేతిహాసంగా మలచటంలో మూలపాఠంలోని కొన్ని అంశాలను పూర్తిగా వదలివేయడం, కొన్నింటిని సంక్షిప్తం చేయడం జరిగిందని స్థూలంగా గ్రహించడానికి అది అడ్డురాదు.

ఇక్కడ ప్రసక్తమౌతున్నది నన్నయ రచనారీతికి అందునా సభాపర్వానికి పరిమితంగా కొన్ని అంశాలు మాత్రమే. విడిచిపెట్టేది విడిచిపెడుతూ. సంక్షిప్తం చేసేది చేస్తూ నన్నయ్య ప్రధానాంశాలను ప్రస్ఫుటీకరించిన విధానం గమనిస్తే, విపులమైన మూలభారతానికి ఆసక్తికరమైన ఒక సంగ్రహప్రతిని ఆయన 'పరిష్కరించి' దాన్ని తన మూలంగా గ్రహించినట్లు కనబడుతుంది. వ్యాసభారత పాఠాలకు, తెలుగునాట బహుశః భారతదేశమంతటానేమో, తొలి 'పరిష్కర్త' నన్నయ్య అనే మాట ధ్రువపడుతుంది.

ఖాండవ వనదహనం తరవాత పాండవులతో కలిసిఉన్న

శ్రీకృష్ణుడు పితృదర్శన లాలసుడై ద్వారకకు మరలిపోవాలని బయలు దేరడం, పాండవులు వీడ్కోలవడం, శ్రీకృష్ణుడు ద్వారకకు చేరి తన వారిని అందరనూ కలుసుకోవడం మూలభారతంలో ఓ అధ్యాయ మైంది. దాదాపు 24 శ్లోకాలు. తన కథనానికి అత్యవసరం కాని ఈ భాగమంతా 'ఇట నారాయణుండును బాండవుల వీడ్కొని పితృ దర్శన లాలసుండై ద్వారవతీ పురంబున కరిగె' అని సూక్ష్మంలో తెల్చివేశాడు. అదేవిధంగా రాజసూయయాగ సమయంలో కృష్ణునకు అగ్రపూజ చేయడాన్ని నిరసిస్తూ శిశుపాలుడు ఆక్షేపించగా, అతనిని శాంతపరచడానికి ధర్మరాజు మృదువుగా మాట్లాడుతున్నప్పుడు భీష్ము డతనిని వారించి కృష్ణుని మహాత్మ్యాన్నిగూర్చి కొంత దీర్ఘంగానే వివ రిస్తాడు. అది చాలదన్నట్లు ధర్మరాజు 'విస్తరంగా వినాలని ఉంది. కనుక కృష్ణుని మహామహిమకు సంబంధించి నాకు చెప్పు' అని భీష్ముణ్ణి అడగటం, భీష్ముడు చెప్పటం సంస్కృతభారతంలో ఉన్నది. భీష్ముని ఈ వివరణ దాదాపు అయిదారు వందల శ్లోకాలకు విస్తరించింది. అక్కడ రచయిత దృక్పథం వేరు. ఆంధ్రమహాభారతం కావ్య నిర్మాణ దృష్టితో దీనిని పరిహరించింది.

శిశుపాలుని వధ తరువాత రాజసూయ యాగం సర్వసమృద్ధిగా సాగిన రీతిని సంస్కృతకవి దాదాపు 50 శ్లోకాలలో వర్ణించాడు. నన్నయ "అట్లు ప్రశాంత విఘ్నంబయి సుఖారంభంబయి ప్రభూత భక్ష్యాన్న ధన దాన సనాథంబయి జగన్నాథ రక్షితంబయి రాజసూయ మహా ధ్వరంబు సమాప్త సంప్రయోగంబయిన" అని అక్కడకు పూర్తి చేశాడు. పాండవుల భాగ్యాతిశయానికి ఈర్ష్యచెందిన దుర్యోధనుడు శకునివద్ద, తన తండ్రివద్ద ఈ యాగవైభవాన్ని వర్ణించటం మూలం లోను, తెలుగు భారతంలోను కూడా ఉన్నది. ఉన్నా, కవి వర్ణనలో కాక ఈర్ష్యాప్రజ్వలనం పొందిన దుర్యోధనుని నోటివెంట మాత్రమే

తెలుగు భారతంలో రాజసూయయాగ వైభవం తెలియజేయటం అధిక రసస్ఫూర్తిని సంతరించుకొన్నది.

ఇటువంటి విశేషాలు చాలా ఉన్నాయి. అయితే వీటికంటె ముఖ్యమైనది ఒక పాత్రను గూర్చిగాని, ఒక సన్నివేశాన్ని గూర్చిగాని నిష్కర్ష చేయడానికి అనువుగా మూలంలో సాధారణ ధోరణిలో ఉన్నదానిని వెలికితీసి పదును పెట్టడం.

శిశుపాలుడు కృష్ణునికి అగ్రపూజ ఇవ్వడాన్ని ఆక్షేపిస్తూ పరుషంగా మాట్లాడాడు; సభాస్థలి విడిచి పోవడానికి ఉద్యుక్తుడైనాడు.

"ఇత్యుక్త్వా శిశుపాల స్తానుత్థాయ పరమాసనాత్
నిర్యయౌ సదస స్తస్మాత్ సహితో రాజ భి స్తదా"

ధర్మరాజు మధురంగా, సాంత్వన పూర్వకంగా 'నేదం యుక్తం' అని అంటూ 'పారుష్యంచ నిరర్థకమ్' అని బోధించాడు. అదే తెలుగున ధర్మరాజు మూర్తిని, మూర్తిమత్త్వాన్ని ప్రస్ఫుటీకరించే విధంగాను, నన్నయ రుచిరార్థ సూక్తి నిధిత్వం భాసించే విధంగాను రూపుదిద్దుకున్నది.

"భూరి గుణోన్నతు లనదగు
వారికి, ధీరులకు, ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె ? మహా
దారుణ మది విషము కంటె దహనము కంటెన్."

ధర్మరాజు, భీష్ముడు కలిసి శిశుపాలునివంటి ఒక అల్పుని సాంత్వన పరచడం చిన్నవాడు సహదేవునికి నచ్చలేదు. ఉవ్వెత్తుగా లేచి విరుచుకుపడ్డాడు. 'ఎడపక అర్ఘ్యమచ్యుతన । కిచ్చితిమి. ఇచ్చిన దీని । కిం దోడం బడమని దుర్జనత్వమున బక్కెడు వీరుల మస్తకంబుపై నిడియెద' అని నోటిమాటగా అంటూ ఇడ దలుచుకున్న చరణాన్ని

ఎత్తి తన ఆవేశాన్ని ప్రకటించాడు. మూలంలోనైతే సహదేవుడు ఇంత ఉద్విగ్నుడు కాలేదు. 'సర్వేషాం బలినాం మూర్ధ్ని। మయేదం నిపాతం పదం' అని వాచ్యం చేశాడు. తెలుగులో ఎంత మెరుగు వచ్చిందో కనబడుతున్నది కదా! 'ఇచ్చితిమి' అనటంలో నిశ్చితత్వం, సంస్కృతంలోని బలినాం అన్నదానికి నిరసన కాకువుతో 'వీరులు' అన్న ప్రయోగం ఎంత వ్యవహార సన్నిహితత్వాన్ని కనబరుస్తున్నాయో! తిక్కన రాణింపునకు తెచ్చిన 'నాటకీయత' సభాపర్వంలో ఎన్నిచోట్ల ఆవిష్కృతమైందో పాఠకలోకం పెద్దగా పట్టించుకోలేదేమో!

నాటకీయత అంటే దుర్యోధనుడు మయభలో తాను పొందిన భంగపాటును వివరించిన వచన ఖండికను స్మరించాలి. వాచకాభినయంలో ఆరితేరిన నటుడు పఠిస్తున్నట్లు ఊహించి చూడండి.

'నిర్మల స్ఫటిక శిలా నిర్మితంబై, శశి ప్రకాశంబై, వివిధప్రభా భాసురంబైన-ఆ సభా విభవంబు చూచు వేడుక-నందు-ద్రుమ్మరువాడ-హరినీలబద్ధ మణి స్థలంబునందు-జల బుద్ధింజేసి పరిధానోత్కర్షణంబు సేసి, విమల శిలా తల బుద్ధి నుదక పరిపూర్ణంబయిన వాపిసొచ్చి కట్టిన పుట్టంబు దడియం ద్రెళ్ళిన-నన్నుం జూచి వృకోదరుండు నగియె దాని నంతయు నెఱింగి ధర్మరాజ చోదితులయిన కింకరులు నాకుం బరిధానంబులు తెచ్చి యిచ్చిరి. మఱియు-వివృత ద్వారంబు గవాట ఘటితంబని చొరనొల్లక, కవాట ఘటితంబు వివృతంబుగా వగచి-చొరంబోయి-తత్కవాట స్ఫటిక శిలా ఘట్టిత లలాటుండనైన నన్నుం జూచి-అనేక సహస్ర విలాసినీ పరివృతయయియున్న ద్రౌపది నగియె-అంత- నకుల సహదేవులు పర తెంచి-ఇదె వాకిలి-ఇట వచ్చునది-అని నన్ను దోడ్కొని పోయిరి. అట్టి సభా ప్రలంభంబు నాకు పరిచయ శల్యంబయి యున్నది.

తెలుగు వారికి సహజమైన పలుకుబడులు, చెబుతున్న అంశా నికి తగినట్లు మాటల సమాసాల దీర్ఘత, హ్రస్వత; సంభాషణలో ఆవేశాన్ని ఉద్వేగాన్ని బట్టి పలికే కాకువులు-ఈ గుణాలు నన్నయ తీర్చిన నాటకీయతలో ఉపకరణాలు.

ఈ సభాపర్వంలోని శిశుపాల వధ ఘట్టాన్ని ఎంత చమత్కార యుక్తంగా తీర్చిదిద్దాడో నన్నయ! మూల భారతంలో ఈ సంఘర్ష ణలో, వాగ్యుద్ధంలో పాల్గొన్న శిశుపాలుడుగాని, భీష్ముడుగాని, కృష్ణుడుగాని చేసినంత సుదీర్ఘ వాదోపవాదాలు తెలుగులో లేవు. వారివారి భావావేశాలను రూపుకట్టించగలపాటి ప్రసంగాలకే తెలుగు భారత కథనం పరిమితమైంది,

భీష్ముని వచనానుసారంగా ధర్మజుడు సహదేవోపనీతమైన అర్ఘ్యాన్ని వాసుదేవునికి శాస్త్ర దృష్ట విధానాన ఇచ్చిన తరువాత గాని శిశుపాలుడు ఆక్షేపణకు దిగలేదు. స్నాతకుడు, ఋత్విజుడు, సద్గురుడు, ఇష్టుడు, భూతలేశుడు, సంయుజుడు- ఈ ఆరుగురూ పూజనీ యులే. ఇట్లా లభించే వారిలో సద్గుణములకు పెద్దయైన మహాత్ముని పూజించాలి అని ముందు భీష్ముడు చెప్పాడు; అట్టివాడెవ్వడో చెప్ప వలసిందని ధర్మరాజు కోరగా కృష్ణుడుకాక మరెవరు అని నిర్దేశించాడు. సభలో శిశుపాలుడుగాని, మరెవ్వరుగాని కాదనలేదు—అప్పటికి.

తన తొలి ప్రసంగంలో శిశుపాలుడు-కృష్ణుడు కష్టచరితుడు, వార్ష్ణేయుడు, దాశార్హుడు, పూజార్హుడుకాడు అనీ, సభలో ఇంకా అంతకంటే అర్హులైన వారున్నారనీ అన్నాడు. భీష్ముడు మతిచలించి చేసిన ఉపదేశాన్ని శిరసావహించి, ధర్మరాజంటే మంచీ మర్యాద తెలిసిన 'పురుష విశేష విత్తముడు' అనుకొని వచ్చిన వారందరకూ అవజ్ఞ చేశావుగదా అన్నాడు. మీరంతా కలిసి ఇస్తామంటే మాత్రం గోవిందుడికి తగుదునా లేదా అనే బుద్ధి ఉండవద్దా అన్నా

శిశుపాలుని శాంత పరచడానికి ధర్మరాజు ప్రయత్నిస్తుంటే, బాలుడు, పాలిత దుర్నయుడు వాడితో నీ కెందుకని అతనిని వారించిన భీష్ముడు తాను మొదలుపెట్టాడు శిశుపాలునికి సమాధానం చెప్పడం! చివరకు చిన్నవాడైన సహదేవుడు తీవ్రపడటంతో ముందుశిశుపాలుని పక్షంవారిని చూచి యదు వృష్ణి భోజ కుకు రాంధక వాహిని దారుణ క్షయకాల సాగరాల తీరు వహించినాయి. సహజంగానే ధర్మరాజు భయసంభ్రమం పొందాడు. 'తాతా వీరి కిచ్చట చిత్తశాంతి యొన ర్పవే' అంటూ తత్తరపడ్డాడు. భీష్ముడు ధైర్యం చెప్పాడు; కృష్ణుని పరాక్రమం గూర్చి వివరించాడు. అది శిశుపాలునికి మరీ కోపహేతు వైంది. కృష్ణుని, భీష్ముని నిందించాడు. అందుకు భీముడు అంతక రూపుడైనాడు.

భీముని శాంతపరచడానికి భీష్ముడు శిశుపాలుని జన్మవృత్తాంతం చెప్పి అతని చావు కృష్ణుని చేతిలోనే ఉన్నదని వివరించాడు. అదేదో చూద్దాము రమ్మని శిశుపాలుడు కృష్ణుని సంగ్రామానికి ఆహ్వానిం చాడు. కృష్ణుడు శిశుపాలుడు చేసిన అపరాధాలు చెబుతూ వచ్చి తుదకు 'బభ్రు భార్య తనకు భార్య జేసె' అని నొక్కి పలకటంతో రెచ్చిపోయిన శిశుపాలుడు అసలు కోపం బయటపెట్టాడు.

'నీ కూర్మియు నీ యలుకయు
నాకవి యేమిటికి? దుర్గుణప్రియ, మొదలన్
నాకిచ్చిన యక్కన్యక
జేకొని నీకిట్లు పలుక సిగ్గును లేదే?'

అని ప్రశ్నించాడు శిశుపాలుడు. అతని నిజస్వరూపం బయట పెట్టించి కృష్ణుడు అతణ్ని సంహరించాడు. ఇంతకుముందే చెప్పినట్లుగా ఈ కథ లోని ఉద్విగ్న ఘట్టాలను యథాక్రమంగా ఆవిష్కరిస్తూ నన్నయ ఈ కథను తీర్చిదిద్దాడు.

కథావిష్కరణ సందర్భంగా చెప్పుకోదగినవి మరో రెండు మూడు అంశాలు ఉన్నాయి. శిశుపాలుని వృత్తాంతం చెబుతూ అశరీర వాణి ఏమన్నదో భీష్ముడు ఇట్లా చెప్పినట్లు నన్నయ వ్రాశాడు.

'వీని నొరులు చంపగా నోప రెవ్వరు
నెవ్వరేని వీని నెత్తికొనుడు
మిగిలియున్న బాహు యుగళంబు గన్నను
నడగు వీని కతడ యంతకుడు"

సంస్కృతంలో అశరీరవాక్కు 'ఏష తే నృపతే పుత్రః శ్రీమాం జాతో బలాధికః' అన్నట్లు ఉన్నది. అది నిజమైతే కావచ్చు గాని ఒక దుర్మార్గుని కథలో ఆ మాట పనిగట్టుకుని చెప్పించక పోవడమే బాగుంది.

తెలుగు భారతంలో కృష్ణుడు అనకుండా విడిచిపెట్టిన మాటలు సంస్కృతంలో ఉన్నాయి. 'రుక్మిణ్యామస్య మూఢస్య ప్రార్థనాఽఽసీన్ముమూర్షతః, వచతాన్ ప్రాప్తవాన్ మూఢః శూద్రో వేదశ్రుతీమివ.' అక్కడ కృష్ణుడు అట్లా అంటే, 'మత్పూర్వాం రుక్మిణీం కృష్ణ సంసత్సు పరికీర్తయన్, విశేషతః పార్థివేషు వ్రీడాం న కురుషే కథం' అని శిశుపాలుడు ఆక్షేపించాడు. తెలుగులో రుక్మిణి ఉదంతానికి సంబంధించిన సూచన శిశుపాలుని నోటి వెంట చేయించటం అదే శిశుపాలుని మృతికి దారితీయటం ఎంత పదిలంగా ఆలోచించి నన్నయ కథనం చేశాడో తెలుపుతుంది.

ఇక శిశుపాలుని సంహారం దగ్గర కూడా కృష్ణుడు సంస్కృత భారతంలో

"శృణ్వంతు మే మహీపాలా యే నైతత్ క్షమితం మయా
అపరాధ శతం క్షామ్యం మాతురస్యైవ యాచనే

దత్తం మయా యాచితం చ తాని పూర్ణాని పార్థివాః
అధునా వధయిష్యామి పశ్యతాం వో మహీక్షితాం''

అని పలికి చక్రం ప్రయోగించాడు.

వేగం పుంజుకుంటూ సాగిన నన్నయ కథనంలో దానికి పరాకాష్ఠగా 'సిగ్గును లేదే?' అన్న శిశుపాలుని వాక్కు పూర్తిఅవుతూ ఉండగానే—

అని శిశుపాలు డొండొకట నప్రియముల్ హరి బల్కుచున్నచో
ననల శిఖాతి దూల దనుజాంతక చక్రము రాజచక్ర మె
ల్లను భయమంద మూర్ధ వికలంబుగ నప్పుడు జేసె జేది నం
దను తనువున్ బృహద్రుధిర ధారలు భోరన మీది కొల్కగాన్.

ఇందులో కృష్ణుని ప్రస్తావన, మాట లేవు వాడట్లా మాట్లాడుతున్నాడు. చక్రం వచ్చింది. శిరసు ఖండించింది. హఠాత్సంజనితమైన అద్భుతంతో కథ ముగింపు!

ఈ కథనంలో నన్నయ అనేక పర్యాయపదాలను సాభిప్రాయంగా ప్రయోగించి కథలోని లోతులను మనోజ్ఞంగా ప్రకటించాడు. ఈ పర్యాయ పదాలు కొన్ని మూలంలో ఉన్నా— అక్కడ సాభిప్రాయత గోచరించదు.

శిశుపాలుడు మొట్టమొదట ధర్మరాజును ఆక్షేపిస్తూ 'కృష్ణుం గష్టచరితున్ వార్ష్ణేయుం బూజించి నీ యవివేకం బెఱిగించితి' అన్నాడు. కృష్ణుడు కష్టచరితుడు, అంటే పాపచరితుడు. అతడు వార్ష్ణేయుడు అన్నాడు. వృష్టివంశంవాడు కనుక వార్ష్ణేయుడు. కాని ఇక్కడ మరో ప్రస్తావనకూడా ఉన్నది. వృష్టి అంటే 'రేతస్సును వర్షించునది, గొఱ్ఱె' అని సంప్రదాయార్థం. కృష్ణుని నిందించటంలో అట్లా నిందించేవారికి ముందు కనబడే దోషం అతని బహుకాంతా వల్లభత్వమే కదా!

మూలంలోకూడా "నాయ మర్హతి వార్ష్ణేయ స్తిష్ఠ త్స్వీహ మహాత్మసు మహీపతిషు" అని ఉన్నా కష్టచరితుడు వార్ష్ణేయుడు అని గుదిగుచ్చడంవల్ల తెలుగులో ఈ విశేషం గమనించడానికి వీలవుతున్నది.

'శిశుపాలుం డుపాలంభన పరుండయి యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజున కిట్లనియె' అని నన్నయ ప్రారంభించాడు. అధోక్షజుడు అంటే ఇంద్రియనిగ్రహం కలవారికి మాత్రమే ప్రత్యక్షమయ్యేవాడని అర్థం. అట్టివానిని ఆక్షేపించేవాడెట్టివాడు? నన్నయ కృష్ణునికి వాడిన పర్యాయపదం శిశుపాలునిగూర్చి కూడా వ్యాఖ్యానిస్తున్నది.

ఆ శిశుపాలుడు ఎట్టివాడో నన్నయ భీష్మునిచేత స్పష్టంగా చెప్పించాడు.

> 'పాలిత దుర్నయుండు శిశుపాలుడు బాలుడు; వీని నేల భూ
> పాలక నీకు బట్టు వఱుపన్? మఱి ధర్మ వెఱుంగ వీనికిం
> బోలునె రాగకోప పరిభూత మనస్కున కల్పరాజ్యల
> క్ష్మీ లలనాంధ బుద్ధి కనిమిత్త మహాత్మపరివాద శీలికిన్'

ఇంకా ఏమి దుర్లక్షణాలు ఉండాలి కనుక? పరపదాసహిష్ణువైన శైలిలో నన్నయ చేసిన ఈ వర్ణనంతా మౌలికమే, మూలంలోలేదు— 'నాస్మై దేయో హ్యనునయో నాయ మర్హతి సాంత్వన' అని తప్ప.

'ఎందుకూ కొరగాని కృష్ణుని చేష్టలను మహిమల కింద తెగ వర్ణిస్తున్నావు'. 'కథం భీష్మన తే జిహ్వా శతధేయం విదీర్యతే' అన్నాడు శిశుపాలుడు.

ఈ మాటలకు నన్నయ ఇంకా పురిపెట్టాడు. 'కృష్ణు బీరమ్ములు పొగడుచునున్న నీ నాలుక యెుక్కడయ్యు వ్రయ్యవలయు నూఱు

ప్రయ్యలు గాగ; నట్లయినగాని చాల వతని బొగడ; నెల్లదాని నేన యెఱుగుదు; నెందు వాడర్ఘ్యదాన యోగ్యుడయ్యె జెపుమ!' అని పించాడు శిశుపాలునితో.

"బలసంపదతో ఉపేంద్రు డవని పాలురను గెలిచాడన్నావే! 'నా యెఱుగని యదియె జనార్ధను బలంబు నత్యున్నతియున్?" అని ప్రశ్నించాడు శిశుపాలుడు. జనార్ధనుడు అంటే జనులు అనే రాక్షసులను గెలిచినవాడు! ఎక్కడివారు ఈ జనులు? ఎక్కడో సముద్రమధ్యం లోనివారు. ఎవరు చూసిన పరాక్రమ మది నమ్మడానికి? ఎరిగినదేదో ఎదటే ఉన్నది కదా? ఏమిటిది?

'సకల క్షత్ర భయంకరునకు భార్గవ ప్రభుకే నని మొనసన్ మార్కొన నోపక వలియం బాఱడె యీ ముకుందుడు భయార్తి రేకమున బది మాఱుల్?'

పైగా జాలిపడి శిశుపాలుడు భీష్ముడికి ఒక మంచి ఉపదేశం చేశాడు. 'పొగడంగ వలయునేని సుగుణవంతులైన కర్ణశల్యు లాదిగా గల వీరుల బొగడుచుండరాదె ప్రొద్దుపోవ!' 'కర్ణ శల్యులను' పొగడ మని! నన్నయ హాస్య ప్రియత్వం దరహాస స్మితం. మూల భారతంలో శిశుపాలుడు పొగడ దగిన వారి పట్టిక చాలా పెద్దది ఇచ్చాడు.

కృష్ణుడెత్తుకోగానే తన కుమారుని వికృత రూపం పోవడం చూచిన సాత్వతి 'శిశుపాలస్యాపరాధాన్ క్షమేథాస్త్వం మహాబల' అని కృష్ణుని కోరింది. అయితే అంతకు ముందే కృష్ణుడు ఆమెకు 'శక్యం, వా యది వాశక్యం కరిష్యామి వచస్తవ' అని మాట ఇచ్చాడు. కాని అపరాధాలు క్షమించమన్న తరువాత 'అపరాధ శతం క్షామ్యం మయాహ్యస్య' అని వరమిచ్చాడు. ఈ ఘట్టాన్ని నన్నయ ఇంకో రకంగా తీర్చాడు. సాత్వతి 'మురవైరి' వలన తన పుత్రునికి మరణం

కలుగుతుందని తెలుసుకున్నది. తన కొడుకు ఎట్టివాడు కాబోతున్నాడో ఆమెకు అర్థమైంది.

'కు పథ ప్రవృత్తుడయి పీ
డప నయమున నీ కనిష్టు డయినను గరుణా
నిపుణుడవై నీ మఱదికి
నపరాధ శతంబు సైపుమయ్యా యుపేంద్రా!'

అని ప్రార్థించి వరం పొందింది. తల్లి మనసు! ఎంత దుర్మార్గుడైనా, వంద తప్పులు చేయడానికి సుదీర్ఘ జీవితకాలం పట్టక పోతుందా అను కున్నట్లుంది!

శిశుపాల వధ జరిగింది. సత్కారపూర్వకంగా అతని శరీరానికి సంస్కారం చేయించవలసిందిగా ధర్మరాజు తన సోదరులకు చెలిపాడని మూలభారతం పేర్కొన్నది. తెలుగులో నన్నయ కొంచెం మార్చి 'అంత ననంత శయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి'నట్లు చెప్పాడు. మృతకళేబరాన్ని తీసుకొనిపోయే వాహకాన్ని 'అనంత శయనం' అనడం ఒక సంప్రదాయం కనుక ఈ పని అనంత శయనునిచేత చేయించినట్లున్నాడు. 'జగన్నాథ' రక్షితంబయి' రాజసూయ మహా ధ్వరం సమాప్త సంప్రయోగమైనదని నన్నయ ముగించాడు.

మరొక్క విశేషం చెప్పుకొని, స్థాలీపులాకంగా పరామర్శించిన నన్నయ 'అపూర్వ సభారచన'కు అంజలి ఘటిద్దాము.

అటు శిశుపాలాదులు, ఇటు యాదవ సైన్యం 'దారుణ క్షయ కాల సాగరములట్లు' కలగటంచూసి ధర్మరాజు కలవరపడ్డాడు; ససంభ్ర ముడైనాడు. ఊగి తూగి నడిచే తరలంలో ధర్మజుని ఆతురతను నన్నయ చక్కగా పలికించాడు.

తతః సాగర సంకాశం దృష్ట్వా నృపతి మండలమ్
సంవర్త వాతాభిహతం భీమం క్షుబ్ధ మివార్ణవమ్'

అని మాత్రమే మూలభారత వర్ణన. 'క్షయకాల' ప్రస్తావన నన్నయ చేసినదే.

అంతగా విచలితుడైన ధర్మరాజుకు భీష్ముడు ధైర్యం చెబుతూ ఏమన్నాడు ?

'నీ యజ్ఞమునకు విఘ్నము
సేయగ నోపుదురె యొరులు - జితదైత్యుఁడు నా
రాయణుడు యజ్ఞపురుషు
డజేయ పరాక్రముడు దీని జేకొని కావన్ ?'

కృష్ణుడు జితదైత్యుడు. మహారాక్షసులను జయించినవాడు; ఈ శిశుపాలాదులు ఒక లెక్కా ? ఆయన యజ్ఞపురుషుడు కనుక యజ్ఞ సాఫల్యం ఆయన బాధ్యత; మధ్య నీకెందుకు ఆందోళన ? పైగా 'అజేయ' పరాక్రముడు. ఈమాత్రమే సరిపోతుందా ధర్మరాజును ఊరడపెట్టడానికి ? ఆ మిగిలిన విశేషణం - 'నారాయణుడు' అన్నది లేదూ ? సాంప్రదాయికంగా ఈ మాటకు రెండు రీతుల అర్థాలు. నారం అంటే నర సంబంధమైనది. కనుక నారాయణుడంటే అవతార సమయాలలో నరశరీరం ధరించేవాడు. ఈ కృష్ణుని మానవమాత్రునిగా భావించవద్దు. మానవరూపంలో ఉన్న భగవంతుడు అని భీష్ముని వివరణ. అంతేకాదు, ఇంకా ఉన్నది. 'క్షయకాల' సాగరాలన్నావు కదా ! నిజమే ప్రళయకాలంలో అమిత భయావహంగానే ఉంటాయి సాగరాలు. వాటి వర్ణన చాలాచోట్ల ఉన్నది. ఎంత క్షయకాల సాగరాలైతే నేమయ్యా ? నారం అంటే నీరు. ఆ నీటిపై శయనించే

వాడు నారాయణుడు. నీవు చెప్పిన ఆ సంక్షుబ్ధ క్షయకాల సాగరాల జలాలపై మఱ్ఱిమాకున సుఖంగా పవ్వళించే దివ్యబాలకుడు ఈ నారాయణుడే. వటపత్రశాయి. ఆయన లీలాప్రకటనానికి కావలసిన అనువైన వాతావరణమే సుమా! నీవు ఇంతగా భయపడే దారుణ క్షయకాల సాగరాల విజృంభణ అని భీష్ముడు ఆశ్వాసించాడు. మూలంలో హరిని సింహంగాను, ఆ సింహం విజృంభించక నిదానంగా ఉన్నంత కాలమే మొరిగే కుక్కలతో శిశుపాలాదులను వర్ణించటం మాత్రమే ఉన్నది.

కావలెనని నన్నయ క్షయకాలం అన్నమాట చేర్చుకొని దానికి సమాధానాన్ని నారాయణ శబ్దంలో లోకోత్తరంగా ధ్వనింపజేశాడు. ధ్వనికి నిధానం నన్నయ్య.

—[♦]—

# నన్నయ-ఋతువర్ణనములు

డా. కొక్కొండ సత్యవతి

తెలుఁగుసాహిత్యమునకు మహాభారతముతో శ్రీకారము చుట్టఁబడినది. నన్నయ ఆదికవియై విలసిల్లినాఁడు. ఆంధ్రమహాభారత మాంధ్రవాఙ్మయమున నాదికావ్యమై వరలినది. ఇది అనువాద కావ్యము. సంస్కృత భారతమందలి పరమార్థమును మహాభారతబద్ధ నిరూపితార్థమును తేటపరుచుటయే నన్నయ ఆశయము. అంతియగాని మూలమును యథాతథముగా అనువదించుట ఆయన సంకల్పమెంత మాత్రమును గాదు. అందుచే నన్నయ మూలాతి క్రమణమునకు వెరువక రసవద్ఘట్టములను పెంచియు, కథావేగము సరికట్టు రసభంజకములగు ఘట్టములను కుదించియు, రససమృద్ధికొరకు నూతనభావములను జొప్పించియు, మూలగతభావములకు వన్నెపెట్టియు, అనుచితాశ్లీలభావస్ఫోరకములగు సంగములను పరిహరించియు, తన కృతిని స్వతంత్రకావ్యముగనే రూపొందించెను.

వేదవ్యాసవిరచితమగు భారతసంహిత బహుళార్థబోధకమగు మహేతిహాసము. అందు ధర్మము నిర్దేశింపబడినది. అధ్యాత్మవిద్య ప్రతిపాదింపఁబడినది; నీతు లుపదేశింపఁబడినవి. లక్ష్యలక్షణ సమన్వయము గావింపఁబడినవి; బహుపురాణ ప్రసిద్ధములగు విషయములనేకములు వివరింపఁబడినవి. అందులకే మహాభారతమునుగూర్చి నన్నయభట్టారకుఁడిట్లు చెప్పియున్నాఁడు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
అధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు

లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు.

ఇట్టిదాని నాంధ్రీకరింప గడంగిన నన్నయభట్టారకుఁడును మూలగౌరవమును సర్వవిధముల నిలుపుచునే మూలాతిశాయి యగు కావ్యసౌందర్యమును తన గ్రంథమున నిక్షేపించెను. సందర్భానుసారముగ వివిధ వర్ణనములఁ గావించి. తన కృతికి మహాకావ్యత్వ గౌరవమును సిద్ధింపఁజేసి, విశిష్టమగు కావ్యమార్గమును నిర్దేశించి, "మార్గదర్శి మహర్షిః" అను మన్ననకు పాత్రుఁడాయెను.

వర్ణనల నొనరించుటలో నన్నయకు గల ప్రజ్ఞ అద్వితీయము. ఇక్కవీంద్రుని భావనాపటిమకు ప్రబలనదర్శనములు వర్ణనలు. నన్నయ హస్తమునఁబడిన వర్ణ్యము - ప్రకృతిసిద్ధము గానిండు, సాంప్రదాయకమైనదిగానిండు - ఒక వైచిత్ర్యమును గల్గియుండి, అత్యంతాకర్షణీయమై యొప్పును. ఈ వ్యాసము నన్నయ యొనర్చిన వర్ణన లన్నింటి యొక్క సమగ్రపరిశీలనము గాదు. కేవలము ఋతువర్ణనలకు మాత్రమే ప్రస్తుతమిది పరిమితము.

నన్నయకృత భారతమందలి ఋతువర్ణనముల పరిశీలనమునకు బూనుకొనుటకు ముందుగా. ఋతువులను గూర్చియు దల్లక్షణములను గూర్చియుఁ దెలిసికొనుట ఆవశ్యకము.

మన ప్రాచీనులు కాలమును, దాని స్వభావమును నిశితముగాఁ బరిశీలించి, సంవత్సరము నారు ఋతువులుగా విభక్త మొనరించిరి. అవి క్రమముగా వసంత గ్రీష్మ వర్షా శరద్ధేమంత శిశిరము లనఁబడు చున్నవి.

ప్రాచీన కాలమందలి కవులు తాము ప్రకృతియందవలోకించిన సుందరదృశ్యములను తమ కవి కన్పించిన తీరున కొంకింత భావుకతను చేర్చి వర్ణింపగా నవియే తరువాతవారికిని మార్గదర్శకము లైనవి. అందుచే వారు ప్రకృతిసౌందర్యమును. షడృతుశోభను వర్ణింపవలసి వచ్చినప్పుడు ప్రాచీనుల వర్ణనపద్ధతినే స్వీకరించి వర్ణించుట యొక పరిపాటి యైనది. అదియే కాలక్రమమున కవిసమయముగ రూపొంది నది. ఆలంకారికులును, కవులను ఈ ప్రాచీన వర్ణనాసంప్రదాయమునే ఆదరించిరి. కావ్యములందు నదులలో పంకజ నీలోత్పలాదు లున్నట్లు వర్ణించుటయు, కీర్తి, పుణ్యము, హాసము, మున్నగువానిని తెల్లవి గను, పాపమును, అపకీర్తి మున్నగు వానిని నల్లవిగను వర్ణించుటయు కవిసమయము" కుదాహరణములుగా గైకొనవచ్చును. ఋతువర్ణన విషయమున గూడ నిట్టి కవిసమయములు కలవు. కవులు ఏ ఋతువును వర్ణింపవలసివచ్చినను తామున్న కాలమునను, తాము వసించు ప్రదేశ మునను అ పరిస్థితులు లేకున్నను తాము పఠించిన గ్రంథములయందలి వర్ణనల ననుసరించి ఆయా ఋతువులను కవిసమయానుగుణముగనే వర్ణించి కావ్య సౌందర్య సంపాదనమునకై యత్నించిరి. అట్లే, ఆలంకా రికులుగూడ "యీ ఋతువునందు దీనిఁ వర్ణింపవలెను. దీనిని వర్ణింప రాదు" అనువిధి నిషేధముల నేర్పరచిరి. ఋతువర్ణమునకు వృక్షలతా కుసుమాదులును. శీతాతపవర్షాదులును. తదనుగుణములైన జీవుల క్రియాకలాపములును పుష్టిని చేకూర్చును. ఏ యే ఋతువున నే యే పుష్పములు పుష్పించునో, ప్రకృతి యెట్లుండునో, విస్పష్టముగ చెప్పి యున్నారు. విన్నకోట పెద్దన పేర్కొనిన విధము :

1. వసంత వర్ణనము –

అంకుర పల్లవ పత్రి స
మాంకిత ముకుళ ప్రసూన హారి ఫలములన్
బొంకములగు వనములు ని
శ్శంకముగ నుతింపఁబడు వసంతమునందున్.

స్మరబాణంబులు వాఁడులయ్యె, గుణవిస్ఫారంబు ఘోరంబుగా
నెరసెం, గీరము లంగజాతబిరుదానీకంబు గీర్తించె, మిం
చె రసాలాగ్నులు, పల్లవార్చులు దలిర్చెన్ విశ్వనాథావనీ
వరుతో నల్గుట చెల్లునే యనతయై వామాక్షి కీ పట్టునన్.

2. గ్రీష్మవర్ణము –

ధారాగృహముల నవ ఘన
సారాదుల, గంధసార సరసపటీ రో
శీర వ్యజనాదుల నిం
పారగ వర్ణింపఁదగు నిదాఘాగమమున్.

4. పావృడ్వర్ణనము –

తటిదటన మేఘపటలీ
ఘటితాంబరశక్రచాపకరకావ్రాత
స్ఫుటధారాసారాది వి
కటత నుతింపగవలయు ఘనకాలమునన్.

4. శరద్వర్ణనము –

వెన్నెలసొంపును, జుక్కల
చెన్నును, దెలుపారుదెసల చెలువంబులు, వి
చ్ఛిన్నములగు జలదంబుల
సన్నుతిసేయంగవలయు శారదవేళన్.

5. హేమంత వర్ణనము -

బ॥ వత్కాలీయక కం
బళ ఘనకౌశేయ పట్ట పట మాంజిష్ఠం
బు॥ జనదు సితు, యువతుల
వలిచన్నులందక్క నను చు వలయుం బొగడన్.

6. శిశిర వర్ణను -

భృశవిచ్ఛిన్నంబగు ది
గ్దశకంబును గమలరుహవితానముఁ బ్రాతః
ప్రశిథిలరవికరమును గా
శిశిరముఁ బొగడంగఁదగు విశేషక్రియలన్.

ఏ యే ఋతుస్వభావ మే యే తీరున నుండునో, ఏ యే ఋతువులం దేయేవస్తువులు పుష్కలములుగా నుండునో ఏవి లోపించునో మీఁదిపద్యములందు వివరింపఁబడి యున్నది. ఋతువులనుగూర్చిన ఈ పరిజ్ఞానము నాకళించుకొనినపిమ్మట ప్రస్తుతాంశమునకు వచ్చి నన్నయకృతములగు ఋతువర్ణనల తీరు నెన్నఁ బరిశీలింతముగాక!

నన్నయ రచించిన భారతభాగమును పరిశీలించి చూచినచో ఆయన ఋతువర్ణనములను చాల తక్కువచోట్ల - అదియును మిగుల క్లుప్తముగ - చేసినట్లును, చేసిన ప్రతిసమయమునందును సందర్భశుద్ధిని తప్పనిసరిగా పాటించినట్లును స్పష్టముగా తెలియును. నన్నయ పాండురాజుమరణమునకుఁ బూర్వము వసంతమును, ఖాండవదహనమునకుఁ బూర్వము గ్రీష్మమును, సర్పాకృతినున్న నహుషుని ప్రశ్నలకు నుత్తరము లొసంగి ధర్మరాజు భీమునితోఁ గూడి నిజాశ్రమమును చేరుకొనిన పిమ్మట వర్షాగమమును, పిదప శరత్కాల శోభను వర్ణించెను.

ఇమ్మహాకవి భారతావతారికయందలి ఆరంభపద్యమునందే

ఋతువర్ణనావిషయమగు నొక చమత్కారమును ప్రదర్శించి తన కావ్యావతారిక కొక వైశిష్ట్యమును గల్పించెను.

ఘనదురితానుబంధకలికాలజదోషతుషారసంహతిం
దన యుదయప్రభావమున దవ్వుగఁ జోపి జగజ్జనానురం
జనమగు రాజ్య సంతత వసంత నితాంత విభూతి నెంతయుం
దనరుఁ జళుక్యమన్మథుఁడు, ధర్మనిబద్ధదయార్ద్రబుద్ధియై.

– భారతము. ఆ. ప. అవతారిక.

ఇందు "వసంతర్తువర్ణనము సూచ్యమానమగుచున్నది. వసంతము తుషారసంహతిని దవ్వుగఁ జోపి, పుష్ప పల్లవ విభూతితో విరాజిల్లును. అప్పుడు మన్మథుఁడు "ధర్మ" నిబద్ధబుద్ధియై విజృంభించును. ఈ పద్యమునఁగవి యలంకారమిషచే ఋతువర్ణన మను నంగమునుగూడ జొనిపినట్లు కానఁబడుచున్నది." (ఆంధ్రవాఙ్మయారంభదశ. ద్వి. సం. నన్నయభారతము – అవతారిక. పుట 681. దివాకర్ల వేంకటావధాని గారు.)

"సంతత వసంత నితాంత విభూతి"అని యిందు వసంత శబ్దము ప్రయుక్తమగుటయే కాదు — వసంతర్తుస్వభావమును లెస్సగా వెలార్పఁబడి యున్నది. నన్నపార్యుని అసాధారణ ప్రతిభావిశేషమున కిది యొక మచ్చుతునక.

మూలమునకు నన్నయ క్రొత్తగా చేర్చిన అద్భుత కల్పనలును, అపూర్వ భావరత్నములును ఆంధ్రభారతమున పెక్కులు గలవు. అందొక్కొక్కటి కవిప్రతిభ కొక్కొక్క విజయపతాక. ఇందులకు దృష్టాంతము: పాండురాజు మరణమున కొక్కింతముందొనర్పఁబడిన వసంతఋతువర్ణనము. వర్ణనకొరకనినట్లుగాక ప్రధాన కథలోని కిది చొచ్చుకొని పోయినది. ఇది నన్నయ విశిష్టత. ఉదా:

కమ్మని లతాంతములకు మ్మొనసివచ్చు మధు
పమ్ముల సుగీతనినదమ్ము లెసగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములనునానుచు ముదమ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ముల రవమ్ము మధు
రమ్మగుచు విన్చె ననిశమ్ము సుమనో భా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్.

చందన తమాల తరులందు నగరుద్రుమము
లందుఁ గదళీ వనములందు లవలీ మా
కంద తరుషండములయందున నిమీల దర
వింద సరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులు
చుం దనుపు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందములలం దురఁగ
మందమలయానిల మమందగతి వీచెన్.

ఈ పద్యములు వసంతశోభను సాక్షాత్కరింప జేయుచుఁ దనకు గిందముఁ డిచ్చిన శాపము నెఱింగియుఁ బాండురాజు మదన సమ్మోహనమార్గణవివశీకృత మానసుఁడగుటకు పూర్వ రంగమును సిద్ధము చేయుచున్నవి. ఎంతటి విరక్తునినైనను రక్తునిగాఁ జేయ సమర్థమగునదీ వాసంత శోభ. ఇద్దాని మాదక ప్రభావముచేతనే వానప్రస్థమును స్వీకరించిన పాఁడురాజు హృదయమున రాగోదయమైనది. అంతియ గాని, యది ఆతని లాలసత్వముగాదు. ఈ వసంతర్తు వర్ణనమువలన పాండురాజు శీలము విషయలాలసతా రూపమగు నిందనుండి రక్షింపఁ బడినది. ప్రకృతియొక్క ఐంద్రజాలిక ప్రభావమునకు వశుఁడైన పాండు

భూవరుఁడు, తన మరణమును తానే కోరి తెచ్చుకొనినాఁడు. పాండు భూపతి మరణమునకు కారణభూతమైన ఈ వసంతవిలాసమును నన్నయ పద్యద్వయములో వర్ణించుటయందు స్వారస్యమున్నది.

వసంతుని విజృంభణమును కన్నులకుఁ గట్టినట్లు వర్ణించుటకై నన్నయ లయగ్రాహివృత్తము నుపయోగించుకొనెను.

పద్యమునకు చక్కని గతిస్ఫురణమును కల్పించుటకై వానిని శ్రుతిపేయములగు అనుప్రాసముల మలచెను. ఈ పద్యములయందలి రచన ధారాశుద్ధి గల్గినదై, నిరర్గళమైన గమనవేగమున నొప్పారినది. ఈ నిరర్గళ ధారాధోరణిని గాంచియే కాబోలు ఎఱ్ఱన,

ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావమదోత్కటమున్ నరేంద్రపూ
జోన్నయనోచితంబునయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్న నిరంకుశోక్తిగతి నెంతయుఁ గ్రాలుటఁ బ్రస్తుతించెదన్.

అని నన్నయను ప్రశంసించియున్నాఁడు.

"లతాంతములకున్ + మొనసి" అనునప్పుడు "ద్రుతమునకు సరళ స్థిరములు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు" అను సూరి సూత్రము ప్రవర్తింప వలసియున్నది, కాని అట్లు జరుగ లేదు. "బిందుం ప్రవదంతితం క్వచిత్ కేచిత్" అను చింతామణి సూత్రానుసారముగా నిందలి నకారమున కనుస్వారమ్మురాగా, "కమ్మని లతాంతములకుం + మొనసి" అను రూప మేర్పడినది. మకార పరత్వమున నిట్టి బిందులేఖనము నేఁడు గానరాదు. ఇట్టి రూప మును వ్రాయు నభ్యాసమును లేదు. నేఁడు "కమ్మని లతాంతము లకు మొనసి" అనియే వ్రాయుచున్నారు. ఇట్టి ప్రాసవిధానమును సంరక్షింప ఓవ్యులగు వ్యాకర్తలు "ప్రాసంబున మకారంబు పరం

బగుచో, ద్రుతంబునకు మకారాదేశంబగు" ప్రౌ॥ వ్యా. సంధి. 22. అని సూత్రించి యున్నారు. ఇది మరొక ప్రయోగవైచిత్రి.

పాండురాజు నంగజరామత్తుని గావించిన మాద్రి విలాసమును వర్ణించుటలో నన్నయ ఒక మెఱుకువను ప్రదర్శించి వాసంతవిజృంభణమును సూచించెను.

చారుసువర్ణహాసి నవచంపకభూషయు సింధువార ము
క్తారమణీయయున్ వకుళదామవతంసయు నై యపూర్వశృం
గారవిలాసలీల యెసంగ దన ముందట నున్న మాద్రి నం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁడై.

మాద్రి వసంత సుమాలంకార శోభితయై యపరమధులక్ష్మివలె నపూర్వశృంగారవిలాసలీల విరాజిల్లి నదఁట.

వనవాసిని యగు మాద్రి వసంతర్తు సమయమందు నవచంపక భూషయు, సిందువారముక్తారమణీయయు, వకుళదామ వతంసయు నైనట్లు వర్ణించుటలో నొక సొగసున్నది. వసంతకాలమందు మిక్కుటముగా లభించు పుష్పములనే ఆమె ధరించినది. తన్మూలమున వసంత విజృంభణము సూచిత మగుచున్నది.

## గ్రీష్మర్తు వర్ణనము

ఉరుతరదావపావకశిఖోత్కలితశ్వసనంబులున్, సితే
తరగతితీవ్రతిగ్మకరధామసహస్రములున్, బహుప్రవా
హారహితనిమ్నగాతతులు నైకడుదీర్ఘములై నిదాఘవా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.

— ఆంధ్ర మహాభారతము. ఆ, ప. ఆశ్వా 4. ప 230

పాండవు లింద్రప్రస్థపురంబున సుతవంతులయి సుఖమున్నంత, సర్వజీవులను తపింపఁజేయు దారుణ ఘర్మసమయ మాసన్నమైనట్లు

వర్ణింపఁబడినది. ఇట్టి ఘర్మదివసంబులు సహింపనోపక అర్జునుఁడు కృష్ణునితో "రమ్యగిరిసాను వనంబుల వేటలాడుచు నీ నిదాఘదివసంబులను గడపుద"మని చెప్పి, యాతనితో వనములకేగి "యథారుచి ప్రదేశంబుల విహరించుచు నొక్కనాఁడు ఖాండవవనసమీపంబున నొక్క చందనలతాభవన చంద్రకాంతవేదికయందు మంద శీతల సురభి మారుతం బనుభవించుచు నిష్టకథావినోదంబుల నుండునంత," అసితపక్షుఁడు విప్రవేషధారియై వచ్చి, ఇంద్రరక్షితంబగు ఖాండవమును తనకు నాహారముగా నొసంగఁ బ్రార్థించును. అంత పార్థుఁడును, పార్థసారథియు, "ఖాండవగృహము నఖండాఖండలధారలకుఁ దూఱఁగాకుండఁ" జేసి, ఖాండవదహనమునకు దోడ్పడి, అగ్నిదేవునికోర్కె నీడేర్చిరి. ఇట్లు ఖాండవ దహనమునకు హేతుభూతులైన కృష్ణార్జునులను తద్వనసమీపమున కేగునట్లు చేసిన, గ్రీష్మాతపమును నన్నయ వర్ణించుట యెంతయు సముచితమై యున్నది.

ఈ గ్రీష్మవర్ణన మత్యంతక్లుప్తమయ్యు, సందర్భోచితమును, సహృదయ హృదయంగమము నై యున్నది.

అమరావతికిఁ బోయిన అర్జునుఁ డెంతకు రాకుండుటచే సంశయాకులిత హృదయులైన పాండవులు పాంచాలీ సహితులై, బ్రాహ్మణపరివృతులై, గంధమాదన పర్వతమును సమీపింతురు. అత్తరిని, ఆకస్మికముగాఁ గురిసిన ప్రచండ వృష్టిని నన్నయ ఈ క్రింది విధముగా వర్ణించియున్నాఁడు.

వారలు గంధమాదన మహార్యబలాఢ్యులు సొచ్చుచో మహా
మారుతమప్డు వీచె నహిమద్యుతిమార్గము దిఙ్ముఖంబులన్
భూరుహపత్రమిశ్రమయి భూరిపరాగము గప్పఁగా ధరి
త్రీరుహశాఖలన్ విఱిగి త్రెళ్ళఁగ గుల్మలతాళి సాల్పడన్.

కడువడి గాడ్పుచే విఱుఁగఁగాఁబడి (వ్రెళ్ళు మహీరుహాళి చ
ప్పుడు విని యందఱుం జెదరి భూమిపయిన్ గగనం బుదగ్రితన్
బడియెనొ శైలశృంగములు భగ్నములయ్యెనొ యంచు ధూళి నె
క్కుడఁ జననేర కొండొరులఁ గానక యుండిరి సంచలాత్ములై.

ఇట్లు మహారేణుపటలం బంధకారంబునుంబోలె నీరంధ్రంబై కప్పినఁ దరు విటప లతా గుల్మంబులు కరతలంబులు బాయం(దోచుచు, విశాల దృఢ తరుమూలంబు లాశ్రయించి యగ్నిహోత్రంబులతో ధౌమ్య ధర్మజ సహదేవు లొక్కచోట, నుద్యద్గదాకార్ముకుండైన భీమసేనుండును ద్రౌపదియు నొక్కచోట, రోమశుండును నకులుండును బ్రాహ్మణులు నొక్కచోటనుగా నందఱు వేఱువేఱ యుండిరంత

కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషము లెల్ల కెలంకులన్ భయం
కరములు గాఁగ, రాలె కరకాతతు లొప్పఁ దటిల్లతాళి వి
స్ఫురితముగాఁ బ్రపూర్ణ జలపూరము ల గ్గిరి కుంజ భూరిని
ర్ఝరతటినీ విశాలకటసాలచయంబు విమూలితంబుగన్.

— భారతారణ్యపర్వము. తృ. ఆ. వ. 294–297.

వర్ణనల నొనర్చుటయందు నన్నయకు గల ప్రజ్ఞ అనితరసాధారణ మైనదనుటలో సందియ మిసుమంతయును లేదు. ప్రాయికముగా నన్నయ గావించిన వర్ణన లన్నియు నుదాత్తములై వర్ణ్యవస్తువును పఠితల కట్టెదుట సాక్షాత్కరింపఁజేయు శక్తి గలిగి యుండును.

అర్జునుఁ డమరావతినుండి వచ్చినపిమ్మట, పాండవులు పదిమాసములు గంధమాదన పర్వతప్రాంతములనే గడపిరి. తరువాత వారు బదరీవనమున కేగి యం దొక్క రాత్రి వసించిరి. పిమ్మట సుబాహుపురమున కేగి, యందు తమ పరివారమును గలిసికొని, యందరును హిమవత్పర్వతప్రాంత సౌందర్యమును తిలకించుచు, దేవర్షి బ్రహ్మర్షి యజ్ఞప్రదేశముల ననేక విధ యూపంబులు వీక్షించుచు, నొక్క వర్ష

ముండిరి. అంత నొక్కనాఁడు భీమసేనుఁడు మృగయార్థ మడవి కేఁగి, యట నొక్క మహాసర్పమువాతఁ బడఁగా, ధర్మరాజుఁ డాతనిని వెదకి కొనుచు వచ్చి, సర్పాకృతి నున్న నహుషుని ప్రశ్నలకు సదుత్తరము లొసఁగి, ఆతనికి శాపవిముక్తిఁ గలిగించి, యనుజు విడిపించుకొని నిజాశ్రమమునకు మరలెను. అట్టి తరిని వర్షర్తువు ప్రవేశించినది.

అద్దాని వర్ణనము :—

ఖరకిరణతాపమున నురు
తరదవదాహమున శోషితములైన వనాం
తరతరుతతి కాప్యాయన
కరమై వర్షాగమంబు గడు బెడఁగయ్యెన్.

నాలుగు వలకుల నవఘన
జాలంబులు వ్రాలి కురిసె ఝంఝానిలవే
గాలోలములై బహుల
స్థూలపయోధార లోలిఁ దుములంబులుగాన్.

ఘనతరనైశతమంబో కా
యనఁగ ఘనాగమతమిస్ర మవికలమై క
ప్పిన జనులకు వస్తువిభా
వన మొక్కొకయెడల గలిన వైద్యుతరుచులన్.

ఈ పద్యము పూర్తిగా నమూలకమును, (కవి) స్వకపోల కల్పితము నైనది.

అరుదగు తత్పయోదసమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వలభూములు భూరిదర్దురో
త్కరరవముల్ మహీరుహాశిఖాంతములందు శిఖండితాండవాం.
తరమదమంజులస్వనము దా నతిరమ్యములై వనంబునన్.

దళితనవీనకందళకదంబక కేతకీరజో
మిళితసుగంధబంధురసమీరణుఁడన్ సఖుఁ దూచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తు లను నుయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగెను
ల్లసదళినీకులంబు మృదులధ్వని గీతము విస్తరించుచున్.

సురచాపచిత్రగగన
స్ఫురణ బురుణించునట్లు భూవనిత నిరం
తరచిత్రితయై యొప్పెను
సురుచిర నవతృణ శిలీంధ్ర సురగోపములన్.

ఈ రెండుపద్యములు నమూనాకములే.

ఖరకరుని ప్రచండతాపముచేతను, వనాంతర దావాగ్నిజన్యమైన మహాతాపముచేతను శోషిల్లిన తరుతతి కాప్యాయనముగా వర్షాగమ మైనది. కాలమేఘముల గర్జనలు, మింటిమెఱుపుల తళతళలు, గగనంబున నింద్రధనుశ్చిత్రములు, ఆ చిత్రవర్ణములకు ప్రతిబింబములో యన భూమిపైఁ బొడమిన నవతృణ శిలీంధ్ర సురగోపములు— ఈ దృశ్యములతో క్రమముగా వానకా రవతరించినదఁట.

నన్నయ యొనరించిన యీ వర్ణన మత్యద్భుతమును అతి మనోహరము నై యున్నది. నన్నయ దేనిని వర్ణించినను దానికి సంబంధించిన వస్తుసముదాయమును సమస్తమును స్పష్టాతిస్పష్టముగా వివరించి, యందలి ఉదాత్తతను, గరిమను ప్రకటీకృత మొనర్చును. అందువలన వర్ణ్యముల సమగ్రరూపము సుస్పష్టరేఖలతో సాక్షాత్కరించి భావుకుల డెందములను పరితోషడోలికల నూగులాడించును. వర్షర్తువును వర్ణించునప్పుడు జలదధ్వానములను, దర్దురస్వరములను, శిఖండితాండవాంతరమదమంజులారవములను, నవతృణ శిలీంధ్ర సురగోపములను పేర్కొనుట యిందులకు పరమ నిదర్శనము.

వర్షర్తుపుసమాప్తముకాగానే, శరత్కాలశోభ లవతరించినవి. ఏతద్వర్ణనము :

భూసతికిం దివంబునకుఁ బొల్పెసగంగ శరత్సమాగమం
బా సకలప్రమోదకరమై విలసిల్లె, మహార్హిమండలో
పాసిత రాజహంసగతి భాసి ప్రసన్నసరస్వతీక మ
బ్జాసనశోభితం బగుచు నబ్జజయూథముతో సమానమై.

శారదరాత్రు లుజ్జ్వల లసత్తర తారకహార పంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవగంధబంధురో
దారసమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణక
ర్పూరపరాగపాండు రుచిపూరములం బరిపూరితంబులై.

—భారతము. అర. ప. ఆశ్వా. 4. వ 141, 142

ఎంతటి స్వభావోక్తిమధురమైన వర్ణనము! ఇవి నన్నయ భారతములోని చిట్టచివరిపద్యములు. ఇయ్యది నన్నయ కవితాశక్తి పరాకాష్ఠను ముట్టిన సన్నివేశము. సంస్కృతభారతమునుండి లేశమైన సూచన గైకొనకుండ, నన్నపార్యుఁడు స్వకీయములకు జ్యోతిర్విజ్ఞాన ప్రతిభా విశేషములు మెరయ సర్వతంత్రస్వతంత్రముగా రచించిన పద్యరత్నము లివి. నన్నయభట్టారకుని సంహితాభ్యాసమహిమను, ఉపనిషద్విజ్ఞానమును, బ్రహ్మాండాది నానాపురాణవిజ్ఞాననిరతిని, మహాద్భుతజ్యోతిశ్శాస్త్రవైదుష్యమును ఈ పద్యరాజము లతిరమ్యముగా ప్రకాశింపఁ జేయుచున్నవి.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలోనారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప" కవిత్వము రచింతునని నన్నయ స్వయముగా చెప్పుకొనియున్నాడు. ఆ విధముగనే నూటికి నూరుపాళ్ళను చేసియున్నాఁ డనుటకు శరద్వర్ణనావసరమున చెప్పఁబడిన ఈపద్యములే సాక్ష్యములు. "లోనారసిమేలు" నాఁదగిన పద్య

ములు; అక్షరరమ్యతకుచక్కని యుదాహరణములు; రమ్యాతిరమ్యములగు భావముల కాటపట్టులు. వీనినిగూర్చి విడివిడిగా బ్రస్తావించుకొనుట మేలు. తొలుతగా, "భూసతికిం దివంబునకు" అను పద్యమునుగూర్చి ముచ్చటింతముగాక.

ఈ పద్యము రచింపఁబడిన సందర్భమిది. చతుర్థాశ్వాసమున అజగరోపాఖ్యాన మంతమైనది. వర్షాకాలానంతరము, శరత్కాలోదయ మైనది. ఆ శరచ్ఛోభలు భూసతికిన్ అను పద్యమున వర్ణితములైనవి.

ఈ ఘట్టమున సంస్కృతభారతమం దీ క్రింది శ్లోకములు వ్రాయఁబడియున్నవి.

క్రౌంచహంసమాకీర్ణా, శరత్ప్రముదితాభవత్
రూఢకక్షవనప్రస్థా, ప్రసన్నజలనిమ్నగా
విమలాకాశనక్షత్రా శర త్తేషాం శివా భవత్.

మృగద్విజసమాకీర్ణా పాండవానాం మహాత్మనాం
దృశ్యంతే శాంతరజసః క్షపాః జలదశీతలాః.

గ్రహనక్షత్రసంఘైశ్చ సోమేన చ విరాజితాః
కుముదైః పుండరీకైశ్చ శీతవారిధరాః శివాః
నదీః పుష్కరిణీశ్చైవ ద్రుమశుః సమలంకృతాః
ఆకాశనీకాశతటాం తీరవానీరసంకులాం
బభూవ చరితాం హర్షః, పుణ్యతీర్థాం సరస్వతీమ్.

తేనై ముముదిరే వీరాః ప్రసన్నసలిలాం శివాం
పశ్యంతో దృఢధన్వానః పరిపూర్ణాం సరస్వతీమ్.
తేషాం పుణ్యతమా రాత్రిః సర్వసంధౌ స్మ శారదే
తత్రైవ వసతా మాసీత్ కార్తికీ జనమేజయః

ఇందు భూమ్యాకాశదాంపత్యవిషయప్రశంసయే లేదు. శరత్కాలమందలి ద్యావాపృథివీమిథునముయొక్క శోభా విశేషముల ప్రశంసయు స్పృశింపఁబడలేదు. వాణీహిరణ్యగర్భుల దాంపత్యప్రశంసయును లేదు. వారి వాహనమగు రాయంచ సంగతియును లేదు. రాజహంసపై నుపవిష్టులైన వాణీహిరణ్యగర్భుల విహారమునుగూర్చి కించిన్మాత్రముగనైనను నుడువఁబడలేదు. శరచ్చంద్రుని శోభతో రాజహంసకు ఉపమానము నిట గానరాదు. ఈ సమస్తభావములును, నన్నయ విరచితమగు పద్యమున ప్రతీయమానము లగుచున్నవి. ఆయన ఈ విశిష్టభావముల నన్నింటిని పలుతావులనుండి పరిగ్రహించి తన పద్యమున నిక్షేపించి యున్నాఁడు.

భూనభములను ద్యావాపృథివీదంపతులని ప్రశంసించెడి మంత్రములు ఋగ్వేదమున మిక్కుటముగాఁగలవు. ఉపనిషత్తులయందును ఈ ద్యావాపృథివీసంబంధము వర్ణితమై యున్నది. నానాపురాణవిజ్ఞాననిరతుఁడగు నన్నయ తైత్తిరీయోపనిషత్తు నెరింగియుండు ననుటలో సందియ ముండదు. ఉపనిషద్విజ్ఞానముతో ఋగ్వేదపరిజ్ఞానమును మేళవించి, "భూసతికిం దివంబునకుఁ బొల్పెసగంగ సమాగమం బయ్యె" నని నన్నయ్య కడు లెస్సయగు వర్ణనము నొనరించి యున్నాఁడు.

సకలప్రమోదకరముగా విలసిల్లిన ఈ సమాగమము, శరత్సమాగమము, వర్షర్తువు తరువాత వచ్చునది శరత్తు. శరత్కాలపు వెన్నెలలను తిలకించి ముగ్ధముకాని మనోమధుపము లుండవు. అద్దానిని వర్ణింపని కవిపుంగవుఁడు నుండఁడు. కాళిదాసంతటి మహాకవీంద్రుఁడు, గేదెపెరుగును వర్ణించుటకై "మాహిషం చ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి" అని, చిక్కని తెల్లని శరత్కాలపు వెన్నెలల నుపమానముగాఁ గొనితెచ్చుకొనినఁగాని సంతుష్టాంతరంగుఁడు కాలేదు. శరజ్జ్యోత్స్న కుగల వింతచెలువము ప్రకృతిసౌందర్య విశేషములలో

మిక్కిలి ప్రశంసాపాత్రమైనది. కావుననే వేదకాలమునుండియు భారతీయ కవివరులచే నియ్యది కొనియాడఁబడుచు వచ్చినది. కాగా ద్యావాపృథివీదంపతుల శరత్సమాగమము తేజోవిశిష్టమై సకలప్రమోదకరమై విలసిల్లిన దనుట యెంతయు నొప్పి యున్న ప్రకృతిసత్యము.

ఇఁక రాజహంసము — ఇది సమస్త కావ్యముల యందును మనకు సాక్షాత్కరించును. నీరక్షీరవిభాగము నొనరించుశక్తి ఈ హంస సొత్తనునది సుప్రసిద్ధమైన కావ్యసత్యము. "బీభత్సూనాం సంయుజం హంస మాహూ రపాం దివ్యానాం మధ్యే చరంతమ్" మిక్కిలి కలతఁ జెంది బీభత్సముగానున్న దివ్యాపగాజలములకు నెమ్మది కల్గించుచు చరించుచు నుండు ఖగరాజము హంస. ఇది బ్రహ్మవాహనముగా ప్రసిద్ధము. నభోమండలమున బ్రహ్మ ప్రసన్నవదనయు, ప్రసన్నహృదయయు నగు సరస్వతి వెంటనంటి యుండగా వాహనరాజమగు రాయంచ నధిరోహించి స్వేచ్ఛమెయి విహరించుచుండును. అట్టి బ్రహ్మయొక్క శరీరవర్ణము స్వచ్ఛమగు తెలుపు. అతని దేవేరి సరస్వతి మరింత తెల్లనిది. వారి వాహనమగు హంసయు మిక్కిలి తెల్లనిదే. వాహనమైన రాయంచ స్నిగ్ధధావళ్యముకతమున నద్దాని నధిష్ఠించియున్న సరస్వతీ చతుర్ముఖుల దాంపత్యశోభ యెంతయు నతిశయించుచున్నదట! అట్లే భూమ్యాకాశముల సమాగమస్థానమున శరచ్చంద్రిక శుభ్రజ్యోత్స్నలను వెల్లివిరియింపజేయును, వాణీహిరణ్యగర్భుల దాంపత్యశోభను హంస విశేషముగా నతిశయింపజేయుచున్నటులనే తానును ద్యావాపృథివీ దాంపత్యశోభను విశేషముగా నతిశయింపజేయుచుండెను. ఇవ్విధముగ బరిశీలించినచో నీ పద్యమున పెక్కువిశేషార్థములు ప్రతీయమానములగును.

"నక్షత్రోదయకాలవిదుఁడును, జ్యోతిర్విజ్ఞానవిలసితుండును నైన నన్నయభట్టు మూలభారతమున లేకున్నను వేదములను, పురాణము

లను, ఉపనిషత్తులను దోర్చి, దివ్యాంశములు పరిగ్రహించి, స్వీయ జ్యోతిర్వీక్షణముతో మేళవించి, స్వతంత్రముగా నీపద్యమును రచించి తెలుగుప్రజల కిచ్చి శాశ్వతయశోదేహముతో మెరయుచున్నాడు. కోహినూర్, కులినాన్ వజ్రములకంటె ఈపద్యరత్నమే ప్రశస్తమైనది. అంతకంటె యెక్కువవిలువ గలదని నా యభిప్రాయము." అని శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు వాకొచ్చియున్నారు.

"ఈ పద్యమునందలి విశేషణములు శ్లేషమహిమచే నుపమానోపమేయములు రెండింటితో నన్వయమును గల్గియున్నవి." అని డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు వక్కాణించియున్నారు.

ఇట్లు శరద్వర్ణనమునకై వ్రాసిన యీ పద్యములలో నన్నయ తన నానాపురాణవిజ్ఞాననిరతిని, జోతిశ్శాస్త్రపాండిత్యప్రకర్షను లెస్సగా వెలార్చి నిజవ్యక్తిత్వవైశిష్ట్యములను ప్రదర్శించుచు, ఋతువర్ణనాపరములగు తన పద్యములకును నొక విశిష్టతను సంతరించిపెట్టెను.

ఈ పద్యమందు నన్నయ ప్రదర్శించిన యుభయభాషాప్రయోగపునైణీసరణి మెచ్చదగినది. ఇట్టి పద్యములను గాంచియే కాబోలు శ్రీనాథమహాకవీంద్రుడు 'భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమారు' అని సగర్వముగా వాకొనియున్నాడు.

శరద్వర్ణనాపరమగు రెండవ పద్యముతో నన్నయ గంట మాగి పోయినది. మహాభారతధురికి అడ్డకట్టబడినది.

శరద్రాత్రులయందు నక్షత్రహారపంక్తులు అతిశయించిన తేజముతో మహోజ్జ్వలముగా ప్రకాశించుచు మనోజ్ఞతమమ్మలై నయనాభిరామము లగుచున్నవట. చంద్రోదయమును గాంచి సమ్మోదమునంది సువికసితమ్ములైన తెల్లకలువల సువాసనలను ఎల్లకడలకు

గొనిపోవుచు, గంధవహుండగు సమీరకుమారుడు స్వేచ్ఛావిహార మును గావించుచుండెనట. తాపహరుండగు సుధాంశుడు చల్లగా వెద జల్లుచున్న కర్పూర పరాగపాండురుచిపూరములతో నవకైరవసౌరభ ములు లీనములై కడుంగడు ముదమును చేకూర్చుచున్నవట ! ఎంత చక్కటి వర్ణనము !

ఇంచుమించుగా నీ పద్యమును అమూలకమనియే చెప్పికొన వచ్చును. ఇప్పట్టున నన్నయ అనువాదవైఖరిని ప్రశంసించుచు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు "మూలగతములగు భావములను వివక్షితములగు విశిష్ట భావాంతరములచే వ్యంగ్యసరళిని బోషించి రసపరిణతముగా నాస్వాదింప జేయునట్టి మహోజ్వలానువాద వైఖరి యిది. తెనుంగు స్వభావపుతీరునందలి యాదరమిట ప్రస్ఫుటిత మైనది. కైశికీవృత్తి, సుందరతరమగు వైదర్భిరీతి, ద్రాక్షాపాకము పద్యమునకు మనోహరాకృతి నొసంగినవి." అని నుడివియున్నారు. మరియు "నన్నయ కవితలో నొక వైశిష్ట్యమున్నది. కూర్పునందు చక్కని అవిషమమైనబిగి, సంస్కృత పదములనుగాని, సమాసములను గాని, లోకమునందు సుప్రసిద్ధములైన పద్ధతిలోని వానినే వాడుట, అనుప్రాసవాసనా లలితవిశదమైన వచనరచన, సామాన్యముగా నేపద్యమే కానిమ్ము మూడు నాలుగు పాదములకు కూర్పునందు డిడిపోవదు." అనికూడా వక్కాణించియుండిరి.

ఈ శరద్వర్ణనము కేవలము వర్ణనకొరకేయన్నట్లుగాక, ప్రధాన కథాగమనమునకును, సహాయకారి యయినది. దుర్యోధనాదుల మానస మున ఘోషయాత్రతో ద్వేషమును రేకెత్తించి బయలుదేరదీసినది.

నన్నయ ప్రధానముగా కథాకథనశైలినే ఆలంబనముగా గొని ఆంధ్రమహాభారతరచనమును కొనసాగించియుండినను, వర్ణనాశైలి యెడలను సముచితమగు నాదరమును బ్రదర్శించి దానికి దగిన ప్రాము

ఖ్యమును దాని కొసంగియుండెను. ఆయన ఋతువర్ణనమునకై వ్రాసిన పద్యములందే వర్ణనాశైలియే పరిస్ఫుటితమగును. వసంత గ్రీష్మ వర్షా శరద్వర్ణనాది పద్యములన్నియు వర్ణనాశైలి పరిచురములుగనే నడచిన వనుట నిజము. ఈ వసంత వర్షాది ఋతువర్ణనలు ఇంచుమించుగా నన్నియు నతిసంక్షేపముగా కేవల మొకటి రెండు పద్యములకు పరిమితములుగా నుండియుండుట గమనింపదగిన విశేషము. అతిక్లుప్తము లయ్యును ఈ వర్ణనము లాయా ఋతువులయందలి ప్రకృతిశోభను యథాతథముగా వెల్వరించుటలో నద్వితీయములై మహోదాత్తములై యలరారుచున్నవి. ఇవి అలంకారిక రచనతో గూడియుండి తరువాతి కవుల ప్రబంధములలోని వర్ణనములకును మార్గదర్శకములై నెగడినవి. కావుననే, నన్నయ పెట్టినాఁడుక దా తిక్కనాది కవుల కాదిభిక్ష" అని నుడివిరి విజ్ఞులైన విమర్శకులొకరు.

—0—

నాంధ్రుల పుణ్య విశేషమేనని చెప్పవొప్పను. తత్తద్భావకళా విశేషములచే నాయా భాగములలో ఆంధ్ర మహా భారతము సుసంపన్నమై యున్నది గనుక :

ఇట్టి నన్నయభట్టారకుని సంబోధించి, శ్రీ రాజరాజనరేంద్రుం డొక్కనాడు 'కవి వృషభులు మహాకావ్య' మని సంభావించు 'జన నుత కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత' మగు మహాభారతమున నిబద్ధమై నిరూపితమైన యర్థమును అధిక ధీయుక్తి మెయిన్ తెనుఁగున రచియింపు' మని యాదేశింపఁగా, మన కవివరుఁడు' మొదటఁగొ చెము జంకియు, 'నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద' నని యందుల కుఁబూనుకొని, 'ఆదరణీయ సార వివిధార్థ గతిస్ఫురణంబుగల్గి యష్టా దశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ. నం దాదిఁదొ డంగి మూఁడు కృతులు (సర్వములు)' మాత్రమే రచింపఁగ ల్గెను.

సంస్కృతమున మహాభారతము 'సత్యవాక్ప్రబంధ' (ఆది.తృతీ అధ్యా.9) రూపమగు నితిహాసము ; మఱియు 'భారత సంహితారచన' యనుచోట వేద 'సంహితా' రూపమై, దాని 'పంచమ వేద' త్వము తెలియఁబడుచున్నవి. మహా భారతమునకు 'వేదత్వము' సంస్కృత మున నిబద్ధమైనను. తెనుఁగున దానిని 'కావ్యము'గా నిబంధించిన ట్లాయన మాటలలోనే వ్యక్తమైనదిగదా ! కావున నాంధ్రభారత విమర్శకు లెల్లరును దానిని 'కావ్య' దృష్టితో విమర్శించి సంభావిం చుట యభిలషణీయమని యేర్పడుచున్నది.

మఱియు శ్రీరాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకుని బలుక రించుచు ప్రభుసమ్మితములగు 'అర్థధర్మశాస్త్రముల తెఱంగెఱింగితి'- (మిత్రసమ్మితములగు) 'విమలమతిం బురాణములు వింటినెనేకములు'- (కాంతాసమ్మితములగు) 'సుదాత్తరసాన్విత కావ్యనాటకక్రమములు

పెక్కు—సూచితి' నని చెప్పిన సందర్భమునుబట్టి, ఆయన మహాభారత మును 'కావ్యము'గా రూపొందించుటచే, 'కావ్యనాటక క్రమములు' 'ఉదాత్తరసాన్వితము' లగునుగావున, 'నానారుచిరార్థసూక్తినిధి' యగు తన కావ్యముగూడ నుదాత్తరసాన్వితముగా నిర్మించినాఁడనియే చెప్పఁదగియున్నది. మఱియు 'మహాకవి' యైనవాఁ డాయన దృష్టిలో 'మృదుమధుర రసభావభాసురనవార్థ వచనరచనావిశారదుఁడు' గదా! కావున నాయన నిర్మించిన మహాభారత కావ్యము 'మృదుమధురరస భావభాసుర' మని చెప్పుట సత్య దూరము కాదు.

కావ్యరచనాప్రవృత్తుఁడగు కవి 'ప్రతిభా-వ్యుత్పత్త్యభ్యాస'వంతుఁడై యుండవలయునని యాలంకారికులు (కావ్యశాస్త్రజ్ఞులు) నియమము! ఆ దృష్టితోఁ జూచినను నన్నయభట్టారకునియందుఁ బయిఁ ప్రతిభాదిత్రయమును సుసంపన్నమై యున్నట్లు 'నిత్యసత్యవచనుఁ'డగు ఆయన పలుకులను బట్టియే తెలియఁగలము! 'సత్ప్రతిభాభియోగ్య' ననుటచేఁ ప్రతిభయు నందునను 'సత్ప్రతిభ' యును; 'విపుల శబ్దశాసను — సంహితాభ్యాసు — బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు — లోకజ్ఞు—' ననుటచే లోకశాస్త్రకావ్యాద్య వేక్షణాభావమగు వ్యుత్పత్తియు' ఉభయభాషాకావ్య రచనాభిశోభితు' ననుటచేఁ, గావ్యాభ్యాసమును, ఆయనయందుఁ బుష్కలముగాఁబండి నిండారినట్లు నిరుపద్రవముగాఁ జెప్పవచ్చును; అంతేగాక 'ఆంధ్రగ్రావళి మోదముం బొరయ — మహాకవిత్వదీక్షావిధిఁ' —గైకొని కడఁగి మున పదునైదుపర్వములను దెనుఁగించి యాంధ్రావనిలోఁ దనవంటి మహాకవి 'న భూతో న భవిష్యతి' యనిపించుకొన్న తిక్కనసోమయాజి నన్నయభట్టారకునికి' ఆంధ్రకవిత్వ విశారదుఁడు — విద్యాదయితుండు' అని బిరుదులొసంగినట్లు శ్లాఘించుటయేగాక తత్పదములలోనే ఆయన ప్రతిభాది త్రయమును గూడ వ్యంగ్యముగఁ దెల్పినట్లు. 'మహితాత్ముఁడు — ఆంధ్రకవిత్వవిశారదుండు' అను పదములచే నాతని ప్రతి

భను, 'విద్యాదయితుండు' అను పదముచే నాతని బహువ్యుత్పత్తిని, 'ఒనర్చెదక్షుతన్' అను పదములచే నాతని రచనాభ్యాసకౌశలమును, వ్యక్తీకరించెను: ఇట్టి నన్నయ భట్టారకుని 'కవితారీతి'ని గూర్చి - అల్పజ్ఞుఁడనైనను - రెండుమాటలు వ్రాయ సాహసించుచున్నందు లకు విద్వల్లోకము నన్ను మన్నించుగాక.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి మేలునా; నితరు లక్షరరమ్యత నాదరింప; నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగన్."
(ఆం. భా. మొదటి ఆశ్వా.)

అనఁగా శ్రేష్ఠముగా (అత్యుత్తమముగా) మననము (విమర్శ నము) చేయఁగల్గు మనస్సుతోఁ గవీంద్రులైనవారు 'ప్రసన్న కథా కలితార్థయుక్తి'ని దన కావ్యము లోపలఁ బ్రయత్నపూర్వకముగా గుర్తించి గ్రహించి 'మేలు ! మే !' లని శ్లాఘించు నట్లును, తదితరులు అందలి 'అక్షర రమ్యత' చే నావర్జితులగుచు తన కావ్యమునఁ బ్రవృత్తులగునట్లును. జక్కని 'రచన బంధురత' కావ్యశైలీ గుణమయి శోభిల్లునట్లును, నన్నయభట్టు భారత సంహిత (వేదము) ను జగద్ధి తార్థమై తెనుఁగు చేసెనని భావము.

పయి విచారమునుబట్టి నన్నయభట్టారకుఁడు భారతమును 'సంహిత' గాఁగాని, పురాణముగాఁగాని తెనిఁగింపలేదనియు, కేవలము 'కావ్య ము' గానే యాంధ్రీకరించెననియుఁ దెలియఁగలము. కావుననే కవీం ద్రులు తన కావ్యమునందలి 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' కిఁదల లూపి 'మేలు, మే ! లనఁగల!' రనితన దృఢ విశ్వాసమును మృదూ క్తితో వెలార్చెను! సంస్కృత భారతమే 'సత్యవాక్ప్రబంధ' రూపమై

పెక్కు—సూచితి' నని చెప్పిన సందర్భమునుబట్టి, ఆయన మహాభారత మును 'కావ్యము'గా రూపొందించుటచే, 'కావ్యనాటక క్రమములు' 'ఉదాత్తరసాన్వితము' లగునుగావున, 'నానా రుచి రార్థసూక్తినిధి' యగు తన కావ్యముగూడ నుదాత్తరసాన్వితముగా నిర్మించినాఁడనియే చెప్పఁదగియున్నది. మఱియు 'మహాకవి' యైనవాఁ డాయన దృష్టిలో 'మృదుమధుర రసభావభాసురనవార్థ వచనరచనావిశారదుఁడు' గదా! కావున నాయన నిర్మించిన మహాభారత కావ్యము 'మృదుమధురరస భావభాసుర' మని చెప్పుట సత్య దూరము కాదు.

కావ్యరచనాప్రవృత్తుఁడగు కవి 'ప్రతిభా–వ్యుత్పత్త్యభ్యాస'వంతుఁడై యుండవలయునని యాలంకారికులు (కావ్యశాస్త్రజ్ఞుల) నియమము ! ఆ దృష్టితోఁ జూచినను నన్నయభట్టారకునియందుఁ బయిఁ బ్రతిభాదిత్రయమును సుసంపన్నమై యున్నట్లు 'నిత్యసత్యవచనుఁ'డగు ఆయన పలుకులను బట్టియే తెలియఁగలము ! 'సత్ప్రతిభాభియోగ్య' ననుటచేఁ బ్రతిభయు నందునను 'సత్ప్రతిభ' యు; 'విపుల శబ్దశాసను – సంహితాభ్యాసు – బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతు – లోకజ్ఞు–' ననుటచే లోకశాస్త్రకావ్యాద్య వేక్షణరూపమగు వ్యుత్పత్తియు' ఉభయభాషాకావ్య రచనాభిశోభితు' ననుటచేఁ, గావ్యాభ్యాసమును, ఆయనయందుఁ బుష్కలముగాఁబండి నిండారినట్లు నిరుపద్రవముగాఁ జెప్పవచ్చును; అంతేగాక 'ఆంధ్రావళి మోదముం బొరయ – మహాకవిత్వదీక్షావిధిఁ' —గైకొని కడమ పదునైదుపర్వములను దెనుఁగించి యాంధ్రావనిలోఁ దనవంటి మహాకవి 'న భూతో న భవిష్యతి' యనిపించుకొన్న తిక్కనసోమయాజి నన్నయభట్టారకునికి' ఆంధ్రకవిత్వ విశారదుఁడు – విద్యాదయితుండు' అని బిరుదులొసంగినట్లు శ్లాఘించుటయేగాక తత్పదములలోనే ఆయన ప్రతిభాది త్రయమును గూడ వ్యంగ్యముగఁ దెల్పినట్లు. 'మహితాత్ముఁడు – ఆంధ్రకవిత్వవిశారదుండు' అను పదములచే నాతని ప్రతి

భను, 'విద్యాదయితుండు' అను పదముచే నాతని బహువ్యుత్పత్తిని, 'ఒనర్చెదక్షుతన్' అను పదములచే నాతని రచనాభ్యాసకౌశలమును, వ్యక్తీకరించెను: ఇట్టి నన్నయ భట్టారకుని 'కవితారీతి'ని గూర్చి - అల్పజ్ఞుఁడనైనను - రెండుమాటలు వ్రాయ సాహసించుచున్నందు లకు విద్వల్లోకము నన్ను మన్నించుగాక.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తి లో
నారసి మేలునా; నితరు లక్షరరమ్యత నాదరింప; నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁడయ్యె జగద్ధితంబుగన్."

(ఆం. భా. మొదటి ఆశ్వా.)

ఆనఁగా శ్రేష్ఠముగా (అత్యుత్తమముగా) మననము (విమర్శ నము) చేయఁగల్గు మనస్సుతోఁ గవీంద్రులైనవారు 'ప్రసన్న కథా కలితార్థయుక్తి'ని దన కావ్యము లోపలఁ బ్రయత్నపూర్వకముగా గుర్తించి గ్రహించి 'మేలు ! మే !' లని శ్లాఘించు నట్లును, తదితరులు అందలి 'అక్షర రమ్యత' చే నావర్జితులగుచు తన కావ్యమునఁ బ్రవృత్తులగునట్లును. జక్కని 'రచన బంధురత' కావ్యశైలీ గుణమయి శోభిల్లునట్లును, నన్నయభట్టు భారత సంహిత (వేదము) ను జగద్ధితార్థమై తెనుఁగు చేసెనని భావము.

పయి విచారమునుబట్టి నన్నయభట్టారకుఁడు భారతమును 'సంహిత' గాఁగాని, పురాణముగాఁగాని తెనిఁగింపలేదనియు, కేవలము 'కావ్య ము' గానే యాంధ్రీకరించెననియుఁ దెలియఁగలము. కావుననే కవీం ద్రులు తన కావ్యమునందలి 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' కిఁదల లూపి 'మేలు, మే ! లనఁగల!' రనితన దృఢ విశ్వాసమును మృదూ క్తితో వెలార్చెను! సంస్కృత భారతమే 'సత్యవాక్ప్రబంధ' రూపమై

నప్పుడు, ఆంధ్ర భారతముగూడ నిట్టి 'ప్రబంధము' కాకపోవుటకు వీలు లేదుకదా! తిక్కన సోమయాజి 'అమ్మహాకావ్యము (వివిధ ప్రబంధ ములుగల్గి నట్టిది) నను సంధానము' చేసినట్లు చెప్పి తన భారత భాగము గూడ 'మహాకావ్యమే' నని పేర్కొన్నప్పుడు, నన్నయభట్టారకుఁ డును 'నిక్కావ్యంబు' నని పేర్కొన్నప్పుడు, ఆంధ్ర మహాభారతము 'మహాకావ్య' మనియే నిర్దేశించుట యుక్తము. అందుచే మహాకావ్య మగు భారతము, సంస్కృతమున అధ్యాయ (సర్గ) బంధమేమైనను, తెనుఁగున 'ఆశ్వాసబంధ' రూపమై యొప్పుచున్నది. ఇచ్చట దాని యందలి నన్నయ కవితారీతి విచారణీయము

'సారమతిం' అను పయి పద్యంలో 'కవీంద్రులు' అను పదము నందలి 'యింద్ర' పదము, 'శ్రేష్ఠ' వాచకమేగాక విశిష్టార్థబోధకమై యున్నదని నాభావము. ఇంద్రుఁడు త్రిలోకపాలకుఁడు; అనఁగా త్రైలోక్య విషయవిచార సంపన్నుఁడని స్పష్టము. లోకోత్తర వర్ణనా నిపుణులగు కవులలో నింద్రసదృశులు 'కవీంద్రులు' అనఁగా 'త్రైలో క్యస్యాస్య సర్వస్య నాట్యం (కావ్యం) భావానుకీర్తన' మ్మను భర తానుశాసనమునుబట్టి భారతీయదృష్టిలోఁ గావ్యము త్రైలోక్య భావానుకీర్తన రూపముగదా! అప్పుడు కవి శాస్త్రచక్షువై సంద ర్శించిన త్రిలోకస్థ విషయములను దన కావ్యమున వర్ణించువాఁడని యేర్పడును; అట్టి 'కవీంద్రులు' – అని పయి పదమున కర్థము! అట్టి కవీంద్రులు 'సారమతి' తోఁ దనకావ్యమునఁ బ్రసన్న కథా కలితార్థ యుక్తిని 'లోనారసి' శ్లాఘింపఁగలరని ఆయన భావము. ఈ దృష్టితో నన్నయ కవితారీతికి రూపుదిద్దునట్టివి – ప్రసన్నకథ. తత్కలితమగు అర్థయుక్తి, అక్షర రమ్యత, రచనాబంధురత – యను నట్టివి. వీనిని గూర్చి సంగ్రహముగాఁ బరామర్శింతును.

## (అ) ప్రసన్నకథ

సాధారణముగా దీనిని మొత్తముగా 'ప్రసన్న కథాకలితార్థ యుక్తి' యని గ్రహించుట పరిపాటి. కాని యిందు రెండంశములు — ప్రసన్నకథ. అర్థయుక్తి యనునవి- ప్రస్ఫుటముగా గోచరించుచునే, అర్థయుక్తి ప్రసన్న కథాకలితమై యున్నట్లు తెలియుచున్నది. కావున గ్రహణ సౌకార్యార్థము రెండింటిని విడఁదీయుట యుక్తమని భావించి యట్లు చేసితిని. కావ్యరీతికిఁ- గవితారీతికిఁ బ్రసన్న కథ ముఖ్యమని నన్నయభట్టారకుని యభిప్రాయము. 'ఇతివృత్తం హి నాట్యస్య (కావ్యస్య) శరీరం పరికీర్తిత' మ్మని భరతుఁడు: కథ కావ్యశరీరము గనుక, నది ప్రసన్నమై, నిర్మలమై,నిర్దుష్టమై యుండఁదగునని నన్నయ భట్టారకుడు.

జగద్ధితార్థమై కావ్యము ప్రవర్తించునప్పుడు. అట్టి విశ్వ శ్రేయస్సునకు భంగము గూర్చునదెల్ల దోషమే యగునుగదా! శ్రేయస్సును గూర్చి వివరించుచు నది 'ఐహికాముష్మిక శ్రేయః ప్రాప్తి' (ఆది-3 ఆ. 11ప.) యని నిర్దేశించెను. అట్టి శ్రేయః ప్రాప్తి 'ఇతిహాస వస్తుసముదాయంబైన (ఆది. 3 అ. 11 ప.) కథచేఁ గల్గునని ఆయన భావము. అట్టికథ 'ప్రసన్నమై' (అనఁగా నిర్దుష్టమై, విశ్వ శ్రేయోభంగకారి కానిదై) యుండఁదగునని యుపపన్నమగును. మఱియు నాలంకారిక సంప్రదాయమునుబట్టి 'ప్రసన్నకథ' యనిన ప్పుడు, 'ప్రసాద గుణభరితమైన కథ' యని యర్థము చెప్పవచ్చును గనుక ప్రత్యేక రసోచితములగు నోజోమాధుర్యము లటనట సన్ని వేశ సుందరములయి యున్నను, మొత్తముమీఁద సర్వరస స్ఫోరక ప్రసాద గుణసంపన్నమగు కథ యని యేర్పడును. అప్పుడా కావ్యము సర్వరస భరితమనియు, సందలి యితివృత్తము తదుచిత సన్నివేశ సంభృతమనియుఁ జెప్పనగును. అట్టి ప్రసన్నకథ యందుఁ గూర్పఁబడి

నది 'అర్థయుక్తి.' 'తింటే గారెలు తినవలె: వింటే భారతము వినవలె!' అను నానుడికి హేతువగు భారతము నందలి కథా వైచిత్రిని గూర్చి వేఱే చెప్పవలయునా ?

## (ఆ) అర్థయుక్తి

ఈ యర్థయుక్తిపయి ప్రసన్న కథలోఁ గలితమై (చేరి) యున్నట్టిదిగనుకనే యది 'లోనారసి' చూడఁదగియున్నట్లు నన్నయభట్టారకుని యభిప్రాయము. అప్పుడే కావ్యానుభూతికల్గి 'మేలు!' అని శ్లాఘింపఁగలరని యాయన భావించినట్లు స్పష్టము. 'అర్థయుక్తి' యనఁగా అర్థములతోడి యోగము; ఇచ్చట నర్థములనఁగాఁ 'గావ్యార్థము' లని గ్రహించుట న్యాయము. వస్తు – నేతృ – రసఫలౌచిత్యాదులు కావ్యార్థములు. అందు వస్తువు ప్రసన్నకథలో నంతర్భూతమైనది; కడమ నేతృ–రసౌచిత్యాదులు. 'అర్థయుక్తి' లో నంతర్భూతమగునని చెప్పఁదగును. ఆనందవర్ధనుఁడు 'రసాది రర్థః' అని చెప్పి, స్వప్రకరణోచితముగా రసభావ తదాభాసములను భావించియున్నను, రసాదిక 'మర్థ' రూపమని యాయన వచనముచే గ్రహింప నగుచున్నది. భరతుఁడు 'కావ్యార్థము' లను నిర్దేశించియుండుటవల్ల, నానందవర్ధనుని రసాద్యర్థములు భరతుని కావ్యార్థములలోఁ జేరునని చెప్పవచ్చును. అనఁగాఁ గావ్యమునకుఁ గావ్యత్వము నొసఁగు నర్థములన్నియుఁ గావ్యార్థములే యగుటవల్ల నవి ప్రసన్నకథలో నంతర్భవించి, కథార్థములగుటలో విప్రతిపత్తిలేదు ! కవీంద్రులు ప్రయత్నపూర్వకముగా 'సారమతి'తో 'లోనారసి' చూడఁదగిన ప్రసన్నకథలోఁ దదేకాకారత్వమును పొంది యేర్పఱుపఁబడు కావ్యార్థములే యని చెప్పక తప్పదుగదా ! అట్టి యర్థయుక్తితోనే గదా తన కావ్యమునకుఁ గావ్యత్వ మబ్బునది; ఈ యర్థయుక్తి ప్రసన్నకథా కలితమైయుండును గనుకనే నన్నయభట్టారకుఁడు దానిని వేఱుపఱుప నొల్లక, యేక

సమాస నిబద్ధము గావించి యున్నాఁడనవచ్చును. శకుంతలోపాఖ్యా నాదు లిందులకుఁ జక్కని యుదాహరణము లెన్ని యేని నన్నయ భారతమునఁ గలవు.

## (ఇ) అక్షర రమ్యత

'ఇతరు లక్షర రమ్యత నాదరింతు' రని నన్నయభట్టారకుఁడు విశ్వసించుటలోఁ దన కవితారీతి 'కక్షర రమ్యత' యు స్వరూప ప్రదానము చేయుచున్న దని చెప్పవచ్చును.

'అక్షర రమ్యత' యనఁగా, నక్షరముల 'రమ్యత - రామణీయకము-సౌందర్యము' అని భావము. ఇచ్చట 'అక్షరము' లనఁగాఁ, కేవల మక్షరములనియే గ్రహించినయెడల, 'సముచిత వర్ణవిన్యాస సౌందర్య' మాపాత మధురమై యాహ్లాద కారియగుట యతని కవితా రీతియని యేర్పడును. నన్నయభట్టారకుని కవితయందీ లక్షణము పుష్కలముగా నున్నట్టు లాంధ్రభారత పాఠకులకుఁ దెలియనిదికాదు; 'అక్షరరమ్యత' యందలి 'అక్షర' పదమును 'పద - పాద - వాక్య - వాక్యాంశములకుఁ' గూడ నుపలక్షణముగా గ్రహించినయెడల, నా యక్షరసౌందర్య పరిధి విస్తృతమయి, నన్నయ కవితారీతికిఁ జక్కని రేఖ దిద్దినట్లుగూడఁ గాఁగలదు; 'అక్షర' రమ్యతను వర్ణవిన్యాస దృష్టితోఁ జెప్పినయెడల, ననుప్రాస-యమకాది శబ్దాలంకార జాత మందు గతార్థము కాఁగలదు; పద-వాక్యాదులను గూడఁ జేర్చి గ్రహించిన యెడల, సమాస - వాక్య - వాక్యాంశ విని వేశన సౌందర్యము గోచరించుటయేగాక, పుష్పావకీర్ణ రీతితోనుండు వాచక లక్షక వ్యంజక పదరమ్యత, ఆలంకారికు లంగీకరించిన వృత్తి పాకరమ్యత, గూడఁ బ్రకాశితమై హృదయావర్జకము గాఁగలదని చెప్పవచ్చును.

ననయభట్టారకుని సమాసరచన యసమాన సౌందర్యధుర్యమని విమర్శకులెల్లరు నంగీకరించినట్టిదే! అక్షరరమ్యతయందే చేరఁ

దగిన వృత్తౌచిత్యమునఁ గూడ నాయన సిద్ధహస్తుఁడే! ఉదాహరణార్థము - ఆయన సీసములను నడపు విధానమునఁగల 'అక్షరరమ్యత'ను బరిశీలింతము. ఎంత రమ్యముగానుండునో !

1. సాధారణముగాఁ గథాకథనవేగానుకూలమగు ధారాశుద్ధితో నొప్పుచు శ్రవణతాడితమైనంతనే మనోమోదము గల్గించుట ఆయన సీసములకుఁగల ప్రధాన ప్రత్యేక లక్షణము. ఇట్లు —

సీ. "అంత దేవాహితు లమృతంబుగానక
యెంతయు నలిగి బలీంద్రుఁగూడి
మంతనంబాడి యమర్త్యులతోడి
పొత్తింతియుచాలు నింకేలయనుచు
సంతనకట్టి"— ఇట్లే పరుగులిడుచుండును !

2. తర్వాతి కవులకు భిక్షపెట్టినాఁడా యన్నట్లు ప్రపాదమున కాపాదమును విడఁగొట్టి యొకవిధమగు (Relief) విరామ మొసఁగి, యాహ్లాదముకల్గించును ! ఇట్లు

సీ. "కమనీయ ధర్మార్థ కామమోక్షములకు
నత్యంతసాధనం బయినదాని
వేడ్కతోఁ దనివి తన్ వినుచున్నవారల
కభిమత శుభకరం బయినదాని
రాజుల కఖిల భూరాజ్యాభివృద్ధి
నిత్యాభ్యుదయ ప్రదం బయినదాని
వాఙ్మనఃకాయ ప్రవర్తితానేక
జన్మాఘ నిబర్హణం బయినదాని—(ఆది. 3 ఆ.9.)"

3. మొదటి మూఁడుపాదముల నొకవిధముగా విఱిచి వ్రాసి, నాల్గవపాదమును గధావేగములోఁ గలుపుకొని నడపించి యింపుపుట్టించును! ఇట్లు —

సీ. "ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్యసంగ్రహమని
యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణ
సముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ —

ఇట్టి ప్రక్రియతో సాగిపోవుచుండును :

4. యతి-ప్రాసయతి నియమబద్ధమై శ్రుతిరమ్యతను సంతరించుకొనిపోవు సీసపద్యములకు మహాభారతము పుట్టినిల్లనఁదగును. విస్తరభీతిచే నుదాహరణము లీఁజాలనైతిని.

ఇట్టి పరిశీలనతో నక్షరరమ్యత యను నాతని కవితారీతి యక్షరమై విరాజిల్లు ననవచ్చును।

## (ఈ) రచనాబంధురత

నన్నయభట్టారకుని వర్ణపదాది విన్యాసపుఁ జక్కఁదనము తర్వాత దాని చిక్కఁదనము కొఱకు 'రచనాబంధురత' తత్కవితా రీతిగాఁ బరిగణింపఁ దగియున్నది. కాని 'తెనుంగునన్ మహాభారత సంహితా రచన బంధురుఁ డయ్యె' ననునది 'నన్నయభట్టు' నకు విశేషణమే యైనను, దాని నట్లే గ్రహించినందువల్లఁ గల్గు సారస్యము కంటె, దానినుండి యాయన యీ శైలీలక్షణమును సంపాదించుటచేఁ

గల్గునట్టిదే యెక్కువ యని నా విధేయ విజ్ఞాపనము। ఒక విధముగా నాంధ్రభాషలో నాదికావ్యమగు మహాభారతమున నన్నయభట్టు 'రచనా బంధురత' యను కవితారీతిని వ్యంగ్యముగానైనను బ్రతిపాదించినట్లు సాధింపఁబడినయెడల, నది తదితర కవులకు భిక్షాప్రధానము చేసినట్లే కాదా? వెనుకటి 'అక్షర రమ్యత' క్రిందఁ జెప్పఁబడిన వర్ణపదాది విన్యాసరమ్యత రసౌచిత్యాది సాహిత్యదృష్టితో సంభావింపఁబడినట్టిది. ఈ 'రచనాబంధురత' భాషాదృష్టి నాశ్రయించి సాధింపఁదగినట్టిదియని ద్వివిధముగా వివేచింపవచ్చును గూడ। రమ్యతాభావమక్కడ; బంధురతాభావ మిక్కడ। ఈ రెండింటికిని 'సారమతి'తోఁ జూడఁగలవారికి భేదము పొడగట్టక పోవదు। 'మహాభారత సంహిత'ను 'తెనుంగునన్ రచనాబంధురుఁడయ్యె!' నన్నప్పాడు, 'బంధురత' గల రచనారీతిలోఁ దెనుఁగున వ్రాసెనని సాధించుటయు నసాంప్రదాయికము కాఁబోదు!

నాభావమున 'విశిష్టమగు పదరచన' గల వైదర్భ్యాదిరీతియుఁ, 'బరివృత్త్యసహిష్ణు' పదరచనారూపమగు 'శయ్య'యు సహజముగా నీ 'రచనా బంధురత'లోఁ జేర్పఁబడఁ దగియున్నవి. అట్లే లుగలుక్సమాసరచనయు, మసృణతా మధురమైన సంధిబంధ సందర్భమును గూడ నీ కవితారీతియందే చేరుననవచ్చును. అంతేగాక పద్యరచనార్థమై గ్రహింపఁబడిన ప్రక్రియను గద్యరచనయందును బాటించి దాని స్వరూపము నున్నతపఱిచి యిచ్చుటయందును నన్నయభట్టారకుఁడు 'రచనాబంధురత'ను బాటించి యున్నాఁడనుట సత్యదూరముగాదు గదా! పైనఁ జెప్పఁబడినరీతి శయ్యాది 'రచనాబంధురత' ప్రక్రియలకు నన్నయ భారత భాగమంతయు నుదాహరణప్రాయమె యనవచ్చును. ఆయన యొరవడిపెట్టిన యీ 'రచనాబంధురత'నే తర్వాతి కవులతోఁ గొందఱు 'తు-చ' తప్పకుండ ననుసరించియుఁ, గొందఱు స్వోపజ్ఞ

మైన యలఁతి మార్పులు ప్రవేశపెట్టుకొని నిర్వహించియుఁ దదనుయాయిత్వమును బ్రదర్శించియున్నారు. ఈ 'రచనాబంధురత'యే రసౌచిత్యాదిసాహిత్యక ప్రయోజనవంతముగా నిర్వహింపఁబడుచో, 'అక్షరరమ్యత' క్రిందికిఁ జేరును; అట్లుగాక సాధారణముగాఁ గథానిర్వాహకదృష్టితో బోషింపఁబడుచో, స్వస్వరూపముతో నిర్దేశింపఁబడును!

ఇట్లు విభాగదృష్టితో నన్నయభట్టారకుని కావ్యమున గోచరించు 'కవితారీతులు' నాల్గు-ప్రసన్నకథ; తత్కలితమైన యర్థయుక్తి అక్షరరమ్యత; రచనా బంధురత యని- కాని యివి యన్నియుఁ గలిసియే యఖండాకారమై కావ్యరూపమును ధరించి, సహృదయులకు రసానంద విజ్ఞానానందప్రద మగుచున్నవని చెప్పవచ్చును.

—0—

# నన్నయ కవితా రీతులు -
# వేదాలవారి వ్యాఖ్యానము

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

శిరోమణి శ్రీ వేదాల తిరువేంగళాచార్యులుగారు, 'అరణ్య పర్వశేషము' గూడా నన్నయ రచనయేననీ, ఆరచనలో అక్కడక్కడ శిథిలమైన కొన్ని పదములను - పాఠములను పూరించి, ఎఱ్ఱాప్రెగడ ఆ భాగమంతయు తానే రచించినట్లు చెప్పికొన్నాడనీ, అందువల్ల అతడు గ్రంథచోరుడనీ- ఒక వాదము లేవదీసినారు. తమ వాదమునకు తార్కాణగా- ఇదిగో ఇది నన్నయ రచన; ఇది యెఱ్ఱన పూరణము- అని నేర్పరచి, కొన్ని పద్యములనుగూడా ఎత్తి చూపించినారు. కాని, అది యంతయు నన్నయ యెఱ్ఱనల కవితారీతుల నెరిగినవా రంగీకరింప వీలులేని దుర్బలవాదము.

నన్నయ కవితలో వాక్య మధ్యమున సంబోధనముండదనియు, అట్టి సంబోధనలుగలతావులు ఎఱ్ఱన పూరణము లనియు; నన్నయ సీస చరణములలోను- అట్లే- ఆటవెలది గీత పాదములలోను యతినో, ప్రాస యతినో నియతముగా వాడునుగాని, ఒకచోట యతిని- ఇంకొకచోట ప్రాసయతిని వాడ డనియు, అట్టి నియతికి తప్పిన పట్టులు ఎఱ్ఱన పూరణము లనియు ఆచార్యులుగారి తీర్మానము. పరిశీలన లోపము ఆ తీర్మానమునకు మూలము.

వాక్యమధ్య సంబోధనలును, ఆచార్యులుగారు పేర్కొన్న నియతికి తప్పిన యతి ప్రయోగములును నన్నయగారి ఆది సభాపర్వ పర్వములలోను ఆయన రచనయైన అరణ్యభారత పద్యములలోను గలవనియు- శ్రీవారి తీర్మానము సరియైనది కాదనియు, సప్రమాణ

ముగా తెలిపి, 'ఎఱ్ఱన గ్రంథచోరు'డను వాదము నిరాధారమని నేను నిరూపించాను. (1958–ఆగస్టు 24–ఆంధ్రపత్రిక; 1959 జూలై–భారతి)

అందుపై నాచార్యులుగా రుగ్రులై, నన్ను అతిమాత్రముగా నిందించుచు, వికట వాదములతో "నన్నయ ఎఱ్ఱన కవితారీతులు" అను పేర, అతిదీర్ఘమైన 'ప్రతివిమర్శ' వ్యాసమొకటి (25–12–1960) 'ఆంధ్రభూమి'లో ప్రచురించినారు. అందువారు, విమర్శ మరాద్యకు వెలియైన వెలితి ప్రసంగములను చేయుటయేగాక, ఈ క్రిందివిధముగా సవాల్ కూడా చేసినారు.

"శాస్త్రవేత్తలకు మాత్రమే ప్రవేశింప వీలైన యీ తెనుగు మహాభారతం వంటి విషయంలోకి భాషాసేవకులు రాబోవడం అనధికారకృత్యం అని ఇంకొకసారి జ్ఞాపకం చేస్తున్నాం.... నావంటివాడి మీదకు ఇట్లా కాలుదువ్వడం మహాప్రమాదం అని కనువిప్పు కల్గిస్తున్నాం– ఉదాహరణాలు అనుచితాలని సిద్ధాంతపరిచాం– నావాదంకాని నా సిద్ధాంతంకానీ, నా 'అంతరంగ సాక్ష్యం' కానీ వారిబోంట్ల కెవరికి గూడా అప్రదిష్టమే (?) ననీ, తేరిచూడడానికి శక్యమైంది కాదనీ స్పష్టంగా చెప్తున్నాం– గుండెల్లో ధైర్యంవుంటే మీవూళ్ళో సభ చేయించి నాకు కబురుచేయండి నేను వస్తాను. లేదా వస్తానంటే నేను సభ యేర్పాటుచేస్తాను. రండి ధైర్యంవుంటే. లేకపోతే "నో చేద్దుష్కృత మాత్మనా కృత మివ స్వాన్తా ద్రృహి ర్మా కృథాః(?)" అని పండితరా జన్నట్లు చేయండి. ఇకనెప్పుడు ఇట్టి అప్రసంగం చేయకండి."

ఇదీ వారి సవాలువ్రాత. ఇట్టి వ్రాతలు సహింపదగినవేనా? నిజమైన పండితునకైనను అంత దురుద్ధతి యుండదగునా? వాదములో సార ముండవలెగాని, వట్టి సవాళ్ళతో ప్రయోజనమేమి? అసలు సారస్వత చర్చలలో సవాళ్లు పనికివచ్చునా? కొమ్ములు తిరిగిన శాస్త్ర పండితుడైనను సత్యమునకు తలవంపక తప్పదుగదా! సర్వజ్ఞు డెవడు?

మావాద ప్రతివాదములు ఇంతవరకును పై విధముగా నడచినవి ఇపుడిక్కడ నామనవి యేమనగా; ఈ చర్చ భారత కవిత్వమునకు సంబంధించినదిగాని, అచ్చము ఆచార్యులుగారికి నాకును— మాత్రమే సంబంధించినది కాదు. కావున, ఇందలి మంచి చెడ్డలను విచారించ వలసిన బాధ్యత భాషారాధకుల కందరికిని ఉన్నది. నన్నయ కవితా రీతు లెట్టివి? ఎఱ్ఱన గ్రంథ చోరుడగునా? అన్న యంశములు విచక్షణులు నిర్ధారింపవలసినవి. మా యిరువురి వాదములను తలస్పర్శముగా పరిశీలించి సత్యమును పత్రికా ముఖమున వెల్లడింపవలసినదని పండితు లకు నా మనవి.

ఆచార్యులగారి ఆక్షేపపు వ్రాత కడుంగడు పొడుగైనది. అది యంతయు నొక్కమారే విమర్శించినచో నా వ్యాస మంతకంటెను పొడుగై పాఠకులకు విసుగుపుట్టించునన్న తలంపుతో "వాక్య మధ్య సంబోధన"మన్న ఒక్క విషయమును మాత్రమే యిపుడు ప్రస్తావిస్తున్నాను.

"రాజ్యంబు కంటెను రాజేంద్ర! ధర్మంబ
యిష్టమై పరఁగు నీ కెల్లనాఁడు" (ఆర. 4.15)

ఈ సీసపాదము నన్నయ రచన కాదని ఆచార్యులుగారి తీర్మానము. దానికి కారణము లిట్లు తెల్పినారు.

"ఇది యెఱ్ఱన పూరణమై యుండును. వాక్యమునకు మొదట గాని, వాక్యావసానమునగాని నన్నయ సామాన్యముగా సంబోధన ముంచును. క్రియనడుమ నుంచడు. అది కూర్పునకు బిగి తగ్గించును. కనుక, "రాజ్యంబుకంటెను రాజేంద్ర!"అనునది నన్నయదికాదంటిమి. "రాజ్యంబుకంటె ధర్మంబు నీకిష్టమై పరగును రాజేంద్ర!" అనికానీ, "రాజేంద్ర! ధర్మంబు రాజ్యంబుకంటెను ఇష్టమై పరగు నీకెల్లనాఁడు" అనికాని నన్నయరచన యుండును." అన్నారు వారు.

నేను, వాక్యమధ్య సంబోధనలు గల నన్నయ పద్యములను పదింటి నుదహరించి, శ్రీవారి తీర్మానమొప్ప దన్నాను. వారు, ఆ పదింటిలో కొన్నిటి నాక్షేపించి, వాటిలో సంబోధనలు వాక్యమధ్యమున నున్నట్లు నేను భావించుట అర్థజ్ఞానములేక నన్నారు. ఆపద్యములను, నేను భావించిన అర్థములను, వారి ఆక్షేపములను వరుసగా తెలుపుతున్నాను.

కం॥ "గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము లోకధర్మపథమిది దీనిం
బరికింపక యీపలుకులు
తరుణీ! గురుపుత్రి! నీకుఁదగునే పలుకన్."

(ఆది. 3.131)

"ఇది లోకధర్మపథము; దీనిన్ పరికింపక- ఈపలుకులు పలకన్- తరుణీ! గురుపుత్రి! నీకు తగునే" అని యన్వయ మనియు, పద్యమున సంబోధనలు వాక్యమధ్యమున నున్నదనియు నా వాదము.

ఆచార్యులుగారి

ఇది వాక్యము మధ్యలో సంబోధన అన్నారు శాస్త్రిగారు. ఇక్కడి అర్థమిది. ధర్మ మార్గాన్ని పరిశీలింపక ఈ మాటలా తరణీ! "గురుపుత్రీ నాకు గురుని కూతురవై నీవిట్లు మాటలాడదగునా అని" ఇప్పుడు సంబోధన లెక్కడున్నాయో బోధపరచుకోండి శాస్త్రిగారూ. "పలుకులు పలుకన్" అని మీ అర్థము చేయదగదు. ఏమంటే "నీకు దగునే పలుకన్" అనే ఒక వాక్యంతోనే పని తీరిపోతుంది. కాగా వెనుకటి వాక్యం "ఈ పలుకుల తరుణీ!" అనేది వ్యర్థమవుతుంది. మాట స్వరూపంలో స్పష్టత లేనపుడు 'పలుకులు పలుకన్' అని పునరుక్తి. వామనాచార్యుడు చెప్పినట్లు 'ఏకార్థం' అనే దోషంలో వస్తుంది. 'మాటలు తగునే' అంటే 'పలుకన్' అనేది అన్వయంలేక

వ్యర్థమవుతుంది. ఏకార్థము వస్తుంది. కనుక తమ అన్వయమూ, అర్థమూ తప్పు. సరిగా పద్యం బోధపడక, సాహిత్యమార్గం లేశంకూడా తెలియక ఇటువంటి రాత లేర్పడుతవి. ఈ చోట రెండు కావ్యాలని వ్యక్తం చేయడానికి, పలుకుల ప్రాధాన్యం ద్యోతన కావడానికిగానే రెండు సంబోధనలు... ఇట్లా రెండు సంబోధనలు కూర్చడంలో భట్టారకుని విశిష్టభావాన్ని బోధపరుచ్కోగల్గడం సామాన్యుల కలవిగాని పని. ఇక్కడ సంబోధనల చిక్కు తీరిపోయిందికదా మీకు శాస్త్రి గారూ!"

వారి ఈ వ్రాతలోని అవహేళన ప్రసంగము వదలి వారు చేసిన అర్థనిర్ణయములోని అనుపపత్తులను మాత్రమే సంగ్రహముగా వివరిస్తాను.

(1) "ఈ పలుకుల తరుణీ!" అని ఒక వాక్యమట "గురుపుత్రీ నీకు దగునే పలుకన్" అని మరియొక వాక్యమట! రెండు వాక్యములకును రెండు సంబోధనలట.

ఇది సంబోధనలు వాక్యమధ్యమున లేవనిపించుటకు కల్పించిన అపార్థముగాని, సాహిత్య సంప్రదాయానుగుణమైన అర్థము కాదు. భట్టారకుడు రెండు సంబోధనలు కూర్చినాడనుటయు, అందులో విశిష్ట భావమేదో ఉన్నదనుటయు, అది తమకుతప్ప ఇతరులకు తెలియదనుటయు ఉత్త దంభప్రసంగము.

(2) "ఈ పలుకులు పలుకదగునే" అని అన్వయిస్తే పునరుక్తియై 'ఏకార్థ'మనే దోషంలోకి వస్తుందట. ఆచార్యులుగారికి ఈ విషయమును వామనాచార్యుడు చెప్పినాడట.

వామనాచార్యుడు వేదాల ఆచార్యులుగారికి అట్లు చెప్పినాడేమోగాని నన్నయభట్టుకు ఆవిధముగా చెప్పినట్లులేదు. నన్నయ

ఇంకొకమారుగూడా అట్టే ప్రయోగించి యున్నాడు. "కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ పలుకందగుఁ గాదునాక" (ఆది 5-203)

వామను డావిధముగా చెప్పియుంటే నన్నయ "ఈ పలుకులు పలుకన్" అనియు, "ఇట్టి పలుకులు పలుకన్" అనియు ఒకటికి రెండు మార్లు వాడియుండునా? నన్నయకు పిమ్మట కవులును అట్లు ప్రయోగించియున్నారు. ఈ క్రిందిది జక్కన ప్రయోగము.

"లలి దొక్కుఁ బల్కులు పలుక నేర్చిననాఁడె" (విక్ర. 1-49)

విస్తర మెందుకు ఆచార్యులుగారు వామనుని వాక్యమును, నన్నయ ప్రయోగమును సరిగా అర్థము చేసికొనక తప్పుదారిన పడ్డారు చూడండి! వామనుడు చెప్పినదేమని? "మాట స్వరూపంలో విశిష్టత లేకపోతే, ఏకార్థమను దోషం వస్తుంది" అనిగదా! "ఈ పలుకుల్" అనుటలో పలుకులకు విశిష్టత లేదా? లేకపోతే "ఈ" అనుట యెందుకు? ఈ పలుకు లనగా "ధర్మసమర్థములైన పలుకు"లని భావము. "ఈ" విశేషణము పలుకుల విశిష్టతను తెల్పునదే. కనుక ఈ పలుకుల్ పలుకన్ అనుటలో పునరుక్తి లేదు. ఏకార్థమను దోషమూ లేదు. ఉన్నదనుట అజ్ఞానము.

అది యట్లుండనిండు. ఇంకొక విశేషము. అదియేమనగా పలుకులకు విశిష్టతయు లేకపోయినను అనగ, ఊరక, 'పలుకులు పలుకన్' అనినపుడు పునరుక్తి కాదు.

"దోఁచినట్లు 'పలుకు పలుక'నైన చందమయ్యె" (విరాట. 1-191) అని తిక్కన ప్రయోగము ఏమండీ! ఈ ప్రయోగమునకును పునరుక్తి, ఏకార్థదోషమును పట్టునేమో. ఆచార్యసార్వభౌములు వామనాచార్యునడిగి తెలుసుకొని మావంటి కేవల భాషాసేవకులకు తెల్పుదురు గాక.

వారు "ఈ పలుకులు తరుణీ" ఈ పలుకుల – ఈ మాటలా అని అర్థమన్నారు. అదేమి యర్థము? 'పలుకులు' అంటే, 'పలుకులా?' అని ప్రశ్నించుట యగునా? అస లది మూలవిరుద్ధంగదా! విరుద్ధార్థములతోనా వాదమును నెగ్గించుకొన ప్రయత్నించుట!

(4) "తమ అన్వయము అర్థమూ తప్పు. సరిగా పద్యం బోధపడక సాహిత్యమార్గం లేశంకూడా తెలియక ఇటువంటి రాత లేర్పడుతవి" అని వారి అధిక్షేపపు వ్రాత.

వారి 'రాత'యే తప్పుగాని, నేను చెప్పిన అర్థము తప్పుకాదు. నేనేకాదు, అన్వయజ్ఞానము, అర్థజ్ఞానము గలవా రెవరైనను, అట్లే అన్వయించి, అట్లే అర్థము చెప్పుదురు. ఈ పద్యమునకు చదలువాడ సుందరరామశాస్త్రిగారు, దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు టీకా తాత్పర్యములు వ్రాసియున్నారు. వారెట్లు వ్రాసినారో చూడుండి–

అర్థము :– "తరుణీ! దేవయాని సంబోధనము. దీనిన్, పరికింపక– ఆలోచింపక, ఈ పలుకులు పలుకన్, గురుపుత్రి – గురువు కూతురవైన, నీకున్ – తగునే?"

తా. – "గురువులకు శిష్యులు కుమారులవంటివారు. ఇది పరమార్థము. దీని నాలోచింపక గురుపుత్రివైన నీవు ఇట్టిమాటలు చెప్పరాదు."

ఈ యర్థ తాత్పర్యములు నేను చెప్పినట్లున్నవా? ఆచార్యులుగారు చెప్పినట్లున్నవా? పద్యం సరిగా బోధపడనిది నాకా? వారికా? సాహిత్యమార్గం లేశంకూడా తెలియని 'రాత' వారిదా? నాదా? సంబోధనలు నేనన్నట్లు వాక్యము నడుమ నున్నవా? వా రన్నట్లు రెండు వాక్యములకు రెండుగా విభక్తమై యున్నవా?

కం॥ "ఏను గచుం డనువాఁడ మ
హా నియమ సమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా! శిష్యవృత్తిఁ బనిసేయంగన్"

(ఆది. 3-108)

ఈ పద్యమున 'భానునిభా' యను సంబోధన వాక్యమధ్యమున నున్నదన్నాను- నేను

ఆచార్యులుగా రిట్లాక్షేపించినారు-

"ఇక్కడ 'నీకు శిష్యవృత్తితో పనిచేయడానికి ఓ శుక్రాచార్యా! నేను వచ్చాను' అని అర్థం అనుకొని, వాక్యమధ్యలో సంబోధన అన్నారు శాస్త్రిగారు. ఒక భ్రమ మరొక భ్రమను కల్పించినది. ఇక్కడ పద్యం సరిగా అర్థంకాక తప్పుత్రోవన పడ్డారు. వారనుకొన్న అర్థం తప్పు. ఏమంటే 'మానుగ'; 'నీకును'; 'పని' ఈ మూడు మాటలు కూడా వ్యర్థాలావృతని ఇక్కడి తాత్పర్యం ఇది. నేను బృహస్పతి కొడుకును. నీవు బృహస్పతి నారాధించేవాడవు కనుక, నీకు-మానుగ-ఆదరింపదగునట్లుగా-వచ్చితిని. "భానునిభా-అనగా! ప్రాతఃకాల పూజ్యపాదుడా! నాకిక్కడ చేయుటకుపని శిష్యవృత్తి. నేనిక్కడ కర్తవ్యము శిష్యవృత్తిగా నేర్పరచుకొని వచ్చితిని - అన్నాడు. అంతేగాని శిష్య వృత్తితో పనిచేయుటకు వచ్చినాను అనే అర్థంరాదు. ప్రథమాంతార్థం ప్రధానం కదా! అందువల్ల శిష్యవృత్తి'పని' అనియే తేలుతుంది. 'భానునిభా' ప్రాతః పూజ్య పాదుడనే అర్థాన్ని అజహల్లక్షణతో అర్థాంతర సంక్రమితవాచ్యధనియై వ్యంగ్యం చేస్తుంది. ఇక్కడ మూలం ఇలా ఉంది." అనుమన్యస్వమాంబ్రహ్మన్" ఇక్కడి అనుమన్యస్వ అనేదే 'మానుగ' అయింది. సరి ఇక్కడ సంభోధన చిక్కు తీరిందా శాస్త్రిగారూ! వాక్యమధ్యంలో లేదు కదా ఇది.

ఇక్కడ వారి వ్రాత యింకా చాలా వున్నది. ఆ గొడవ అంతా యెందుకని, అందలి సారాంశమును మాత్రమే ఉదాహరించి నాను. వారు నాకు పద్యం సరిగా అర్థంకాలేదన్నారు. వారికయిన అర్థ మెట్టిదో పరికింతము

(1) "బృహస్పతి సుతుడున్ మానుగ వచ్చితి నీ కును." ఒక వాకమన్నారు.

ఇదేమి వాక్యము! "వచ్చితినీకును" అంటే, అర్థమేమి, 'నీకు వచ్చితిని' ; నాడు రమ్మ' అని తెనుగు వాడనడే: నన్నయ్య అట్లు అనియుండునా! వట్టిది. అది ఆచార్యులుగారి భాషగాని, నన్నయ కాదు.

(2) "భానునిభా ! శిష్యవృత్తిపని సేయంగన్" ఇది రెండవ వాక్యము. సంభోధన యీ వాక్యమునకు మొదట నున్నదిగాని, వాక్య మధ్యమున లేదు" అన్నారు.

వారిట్లు వాక్యమును తెంచుట యేఅనుచితము. అది యట్లుండగా, మరియొక ఘనకార్యమును చేసినారు." శిష్యవృత్తిన్ పనిసేయంగన్ -వచ్చితి" నన్న పాఠము తప్పని, "శిష్యవృత్తిపని - సేయంగన్" అని మార్చి, ఇట్లొక వ్రాత వ్రాసినారు.

"శిష్యవృత్తి - ప్రథమాన్త పదము. ప్రథమాంతార్థం ప్రధానం కదా ! అందువల్ల శిష్యవృత్తి 'పని' అనియే తేలుతుంది. అంతే కాని శిష్యవృత్తితో పనిచేయుటకు వచ్చినాను" అనే అర్థం రాదు. "వృత్తి" అనే పదం వ్యర్థం అవుతుంది."

ఈ వ్రాత ఒప్పదగినదేనా ? కవి రచనను మార్చుట. వికృతార్థము చెప్పుట తప్పుగాదా! తప్పుదారిని బడ్డవారికి తోచే భావాలు తప్పులుగాక-ఒప్పులగునా!

(3) "మానుగ" అంటే' ఆదరింపదగినట్లుగా' అని అర్థమట ! 'అనుమన్యస్వ' అను సంస్కృత క్రియయే "మానుగ" అయిందట !

వారు 'శిరోమణి' గావున ఎట్లన్నను అనవచ్చును. కాని, 'మానుగ' అను పదానికి, పద్యంలో ఒక ప్రత్యేకమైన అర్థములేదు. కవులు ఆ పదమును వాక్యాలంకారముగా ప్రయోగించుదురు. భాషా కావ్యముల ముక్కు - మొగ మెరుగని వారికి, ఈ సంప్రదాయము తెలియదు. 'అనుమన్యస్వ' యే 'మానుగ' అయినదనుట కాధార మేమో అచార్యులు గారే సెలవీయవలె.

(4) 'భానునిభా' - "అంటే ప్రాతః పూజ్యపాదుడా!" అని యర్థమట! అనుగుక. ఆసంబోధన వాక్యమధ్యముననున్నదో, అంతము ననున్నదో తేల్చి చెప్పవలసినచోట అర్థము చెప్పుట యెందుకు! అనవ సరముకాదా !

(5) 'భానుఃభా అను సంభోధనలో, ఏదో ధ్వని, ఏదో వ్యంగ్యార్థం వున్నదంటూ - శాస్త్రప్రసంగము చేసినారు. ఎందుకు ? అజహల్లక్షణ. ధ్వని, వ్యంగ్యం అను మాటలు తమకువచ్చునని ప్రకటించుకోవడమేగాని, ఆ ప్రసంగముతో ప్రకృత వాదమునకు సంబంధ మేమి ?

ఇట్లెంతని విమర్శింపను! వారి అన్వయము, అర్థము-వక్రములు. "నీకు శిష్యవృత్తితో పనిచేయడానికి ఒ శుక్రాచార్యా ! నేను వచ్చాను" అన్నదే సరియైన అర్థము పూర్వోక్తటీకాకర్త లిద్దరును అట్లే చెప్పినారు.

అర్థము-"బహస్పతి సుతుడన్. భానునిభా-సూర్యునితో సమానుడా ! శుక్రుని సంబోధనము. నీకును. శిష్యవృత్తిన్-శిష్యధర్మము చేత, పనిచేయంగన్, మానుగన్, వచ్చితిన్"

తా- "కచుఁ డను పేరుగల వాఁడవు. శుక్రుఁడా! నీకు శిష్యుడనై శుశ్రూషచేయగోరి యిట వచ్చినాఁడను."

అని వారు చెప్పిన అర్థతాత్పర్యములు. వీటిలో 'భానునిభా' అనుసంబోధన॥ వాక్యమునడుమ నున్నట్లే స్పష్టపడినదిగదా! ఆచార్యులుగారు చేసినది అపార్థ మనుటకును వారిది కూటవాద మనుటకును ఈ సాక్ష్యము చాలదా?

ఉ." న, న్నేలిన దేవయానికి నరేశ్వర! భర్తవుగాన నాకునుం బోలఁగ భర్తవీవ" (ఆది. 3. 174)

నీవు న న్నేలినదేవయానికి భర్తవుగావున. నరేశ్వర-రాజా!, నాకును నీవేభర్తవు' అని యర్థమనియు, 'నరేశ్వర' అను సంబోధన వాక్యమధ్యమున నున్నదనియు నేనన్నాను.

ఆచార్యులుగా రిట్లాక్షేపించినారు,

"ఇక్కడ 'నరేశ్వర' అనేది సంబోధన అనుకోవడం పద్యం సరిగా అర్థంకాకనే, "నరేశ్వరభర్త" అనేది ఏకపదం-అది. రాజనైన మగడవు (భరించువాడవు) అని దానియర్థం. ఈ పద్యంలో ఇంకను జాలమంచి సారస్యం వుంది. కాని భాషామాత్ర సేవకులకు తెలియరాదు."

1. చిత్తగించారా శ్రీవారి వ్యాఖ్యాన వైఖరి! యయాతి దేవయానికి "రాజైనమగ"డట! అంటే 'రాజుగాని మగడు' మరియొకడున్నమాటే గదా! ఉన్నాడా? ఏమో ఆచార్యులు గారే చెప్పవలె.

2. నరేశ్వరుడైనభర్త - నరేశ్వరభర్త" అన్నారే! మంత్రియైన భర్త-మంత్రిభర్త. భటుడైనభర్త భటభర్త: కూలివాడైనభర్త కూలిభర్త - అనుట కలదా? నన్నయ ఆవిధముగా ఎక్కడైనను వాడి యున్నాడా!

3. యయాతి దేవయానికి- 'రాజైనభర్త' అన్నది పద్యంలో గల మంచి సారస్యమట! ఈ సారస్యము శాస్త్ర పండితులైన ఆచార్యుల వారికే గాని-మావంటి భాషామాత్రసేవకులకు తెలియరాదట!

నిజమే. ఇట్టిసారస్యములు వారి వంటి శాస్త్ర పండితులకేగాని; మావంటి భాషాసేవకులకు తెలియరావు. మావంటివారికే కాదు; భాషాతత్త్వము నెరిగినవారి కెవ్వరికినీపొడకట్టవు. టీకాకర్తలు, "నన్ను -ఏలినదేవయానికిన్ నరేశ్వర-రాజా! భర్తవు అని అర్థము చెప్పి "రాజా నీవు నాకు నేలికయైన దేవయానికి భర్తవుకావున నాకును నీవే భర్తవు" అనియే తాత్పర్యమునను చెప్పినారు. ఆచార్యులు గారికి తెలసిన సారస్యము వారికిని తెలియరాలేదు. పద్యములో నున్న గదా తెలియవచ్చుట !

"నరేశ్వరభర్తవు" అని పదచ్ఛేదముచేయుట తప్పు, 'నరేశ్వరా!' అని సంబోధనగా చెప్పుటయే ఒప్పు, ఆ సంబోధన మూలమున నుసరించి వచ్చినదే.-

"దేవయాన్యాభుజిష్యాస్మి వశ్యాచ తవ భార్గవీ!!
సా చాహం చ త్వయా రాజన్ భజనీయే భజస్వ మామ్"
(ఆది. 82. 83.)

అని మూలము. వ్యాసుడు "రాజన్" అంటే, నన్నయ "నరేశ్వర" అన్నాడు. అంతేగాని "నరేశ్వరభర్తవు" అనలేదు ఆచార్యులు గారి వ్రాత ముమ్మాటికిని తప్పు. సంబోధన వాక్యమధ్యమున లేదనుట పిడివాదము.

"ఇట్టి లోకవిరుద్ధంపు వరము వడయ నమరవరద ! యొల్లు,"
(ఆది. 7. 262)

ఇక్కడ, "అమరవరద" ఇట్టిలోకవిరుద్ధంపు వరము పడయ నొల్లను" అని యన్వయక్రమ మనియు, "అమరవరద"-అను సంబోధన వాక్యమధ్యమున-క్రియకు ముందు-ఉన్నదనియు నే నన్నాను.

ఆచార్యులుగారు ఇందులోను రెండువాక్యములున్న వన్నారు. వారిది ఒక పేపాటకదా ! వారి వ్రాత యించుమించు పదిపుటలుదాకా ఉన్నది. ముఖ్యాంశములు మాత్రమే నేను చూపుచున్నాను.

"పడయనొల్లన్-అని అన్వయించుకొని, మధ్యలో సంబోధన భ్రాన్తి పడ్డారు శాస్త్రిగారు. అది భట్టారకుని శైలి కాదు" అని ఆక్షేపము తెల్పి, వారు రెండురకాల అర్థములు చెప్పినారు.

మొదటి అర్థము

"ఇట్టి లోకవిరుద్ధంపురవము. వడయఁ-నేనుపొందను"ఇదియొక వాక్య మన్నారు. "అమరవరదా! ఒల్లన్-ఇష్టపడను" ఇది రెండవ వాక్య మన్నారు. సంబోధన, ఈ వాక్యము మొదటనున్నదని వారి సిద్ధాంతము.

'పడయనొల్లన్-పడయుట కిష్టపడను'-అని చెప్పుట సంప్రదాయము గాని, 'పడయను'-'ఒల్లను' అని విరిచి రెండుక్రియలుగా చెప్పుట సంప్రదాయము కాదు.

వారు, "విరిచిచెప్పుటయే నన్నయపద్ధతి" యన్నారు; అందుకీ క్రింది ప్రయోగము చూపినారు.

"జరత్కారుండు దారపరిగ్రహంబు సేయను, సంతానంబు వడయను నొల్లకున్నవాఁడు" (ఆది. 2. 140)

ఇందు 'దారపరిగ్రహంబుచేయుటకును, సంతానంబు పడయుటకును—ఒల్లకున్నాడు'-అన్న యర్థమేగాని, ఆచార్యులుగారు చెప్పిన యర్థము లేదు. అది కుదరదు.

మరియు వారు "ఒల్లన్-అనుదానికి 'వరముపడయుట' కర్మ గామి స్పష్టము" అని వ్రాసి, అందుకీక్రింది ప్రయోగము చూపినారు.

నీయొద్ధ నుండ నొల్ల" (2 157)

'నేను నీయొద్ద ఉండను'-'నేనొల్లను అని యర్థము.

"వానిం జూచికాని కుడువ నొల్లవు అని వారి యర్థము.

ఈ యర్థములు సమంజసములే. నేనూ పండితులు విచారింప వలెను.

రెండవ అర్థము :

"ఇట్టి లోకవిరుద్ధంపువరము. వడయువమరన్-పొందుటకు తగి యుండను ఇది యొక వాక్యమట! "వరద! ఒల్లన్" ఇది మరియొక వాక్యమట!

వారు 'అమర వరద'లోని 'అమర'ను క్రియాపదము చేసినారు, 'అమరు' అను క్రియయునున్న 'నేను పడయ నమరుదును' - 'నేను అమరను'-'వాడు పొంద నమరుచున్నాడు' వంటి వ్యవహారము లేదు. కవుల ప్రయోగములును నాకు కనబడలేదు. విమర్శ విస్తర మెందుకు? ఆచార్యులుగారివలె అర్థములు చెప్పినవా రిప్పటికి లేరు. అది పెడ త్రోవ. అది యొక పిడివాదము.

అమరవరద- దేవతలకు వరము లిచ్చువాఁడా! రుద్రుని సంబోధనము. అట్టి లోకవిరుద్ధపు వరము, పడయన్ - పొందుటకు, ఒల్లన్ - ఇష్టపడను" అని టీకాకర్తల అర్థము.

ఈ యర్థము సరియైనదో, శ్రీవారి యర్థములు సరియైనవో ప్రాజ్ఞులు విచారించి పరిష్కరించవలె.

క॥ "నా వచనంబునసీక

య్యేవురు పతులందు ధర్మ వెడపక యుండుం

గావున నిట్టివరం బిం
దీవరదళనేత్ర! యిచ్చితిని దయతోడన్"
(ఆది. 7-264)

ఇందులో 'ఇందీవర దళనేత్ర' అనుసంబోధన, వాక్యమునకు నడుమనేకాక, క్రియకు ముందుకూడా ఉన్నది. ఉంటే ఏమి? ఆయన గారు తమ మామూలు పాటనే పాడినారు.

"ఇట్టివరంబు" అను ప్రథమాన్తపదంతో ఒక వాక్యమూ- ఇందీ... తోడన్ రెండవ వాక్యమూ. సంబోధన రెండవ వాక్యమునకు మొదట నున్నది" అన్నారు.

ఈరీతిగా తమ వాదముకొరకు నా యుదాహరణల కన్నిటికినీ అపార్థములు చేసి, నన్నధిక్షేపించి తుద కిట్లన్నారు.

"ఈ నిరూపణవల్ల నన్నయ కవితా సామాన్య లక్షణం వాక్య మధ్య సంబోధన కాదని తేలింది. ఇక మిగిలినవాని విషయంలోగూడా సంస్కృతం సూచనలతో సమన్వయించుకొని భట్టారకుని కవితా సామర్థ్య లక్షణాన్ని జాగ్రత్తగా గమనించుకొని బోధపరుచుకోవలె. తీరిక లేక నేను అన్నింటికి సమన్వయం వ్రాయలేదు. అవుఘు భాషా సేవకులకు వందలలో కన్పడ్డవాటికి వేలల్లో సమాధానం చెప్తాం."

ఎట్లును చెప్పదలచుకొనియే యున్నారు గనుక, కొంచెం తీరిక చేసుకొని, ఈ క్రింది పద్యములలోని సంబోధనలకును సమన్వయ మెట్లో వ్రాసి, త్వరలో ప్రకటింపవలసినదిగా. భాషాసేవకుడనైన నేను శ్రీవారిని కోరుచున్నాను.

1. "అమృతాశనంబు సేయకయును దేవ! నా
కజరామరత్వంబు నందుటయును,
...గోరితిఁ గరుణతో దయసేయుము" (ఆది. 2-108)

2. "నాకు, ననఘ! వాహనంబవై మహాధ్వజమవై
యుండుమనిన" (,, – ,,)

3. "మీయన్వయరా, జ్యాయత్త మహీభారం
బాయతభుజ! నీవు దాల్చి తభిషిక్తుడవై" (,,-2-202)

4. "దివిజకన్యలతో నెనయైనవారు నీ
కున్నతిఁ బ్రీతిసేయఁగ నృపోత్తమ! వాసవుబోలి
లీలతో, నిన్నరలోకభోగము లనేకము లందుము"
(,,–3-161)

5. "శుక్రుఁడు పంచిన, నలఘుభుజా!
నను వివాహమగుదే యనినన్" (,,–3–163)

6. "మీ, వచ్చు టెఱింగిరేని జనవల్లభ!
వారును వత్తు రింతకున్" (,,–4–27)

ఈక్రిందివి తొక్కిన పద్యములు :

1. "కొడుకులు బహువిధులని యె
వ్వాడు విందును వారి తెఱఁగు పురుషవరా! యే
ర్పడఁ జెప్పవలయు నా కని
యడిగిన" (అను. 2–242)

2. "సద్వ్రతము మానితవృత్తిఁ జరించువాఁడనై
జనవర! వచ్చినాఁడ" (,,–2-295)

3. "రేపకడ నీరుద్రావక
మేపుగొనక మున్న గోవు మిక్కిలి భక్తిన్
భూపాల! యిచ్చినది" (,,-3–18)

4. "దైవిక కృత్యంబులకును
భూవర! భూసురుల సూక్ష్మముగ శోధింపం
గా వలదు" (,,–3–171)

## ముగింపు :

నన్నయ, తిక్కన, వారివలెనే- ఎఱ్ఱన వాక్యముల నడుమ సంబోధనలు వాడియున్నారు. ఆచార్యులుగారదియెరుగక తప్పు వాదమునకు దిగినారు. ఆ వాదమును నిలబెట్టుకొనుటకు తప్పర్థము చెప్పినారు. తమ తప్పులను విప్పి చెప్పినందుకు నాపై కనవికారులరచి నారు. ఇది యంతయు అనాత్మజ్ఞతవల్ల కానదగిన దోసగు మరియు వారు, "వాక్యమధ్య సంబోధన కూర్పునకు బిగి తగ్గించు" నన్నారు. అది 'కూర్పు' అనగానేమో, 'బిగి' యనగానేమో బొత్తిగా తెలియని ఉత్తప్రసంగము. ఇవి నాకు తోచిన మాటలు.

మా రెండు వాదములను విచారించి తప్పొప్పులను చెప్పవలసినదిగా విజ్ఞులకు మరియొకమారు నా విజ్ఞప్తి.

—0—

# నన్నయ కవితా శిల్పము

శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు.

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచంలో ఆదికవిగా, ఆంధ్రకవితాలోకములో త్రిమూర్తులుగా విలసిల్లిన కవిత్రయములో ప్రథముడుగా వెలసినకవి నన్నయకవి "మూర్తిని" భావుకలోకము చిరకాలము మనః ఫలకములో చిత్రించుకొని సాక్షాత్కరింప జేసుకొనుచున్నది. నేడు రసజ్ఞుడైన చిత్రకారుడు ఈ మహాకవిమూర్తికి రూపకల్పన జేయుటకు ప్రయత్నింప వచ్చును. చిత్రలేఖనములోని వర్ణసమ్మేళనము వలన, వెలుగు నీడల వలన, రేఖావిన్యాసమువలన నన్నయ కవి భౌతిక రూపమును చిత్రించి దిఙ్మాత్రముగా ప్రదర్శింపవచ్చును. కాని నన్నయకవి ఆత్మీయతను, అంతరాత్మను చిత్రించి చూపు శక్తి ఏ చిత్రకారుని కుంచెకు లేదు.

కవి అంతరాత్మ కావ్యములో ప్రతిఫలించును. కవి ఆత్మకు, కావ్యమునకు బింబ ప్రతిబింబ భావము గలదు. అనిన లౌకిక ప్రపంచములోని కవి భౌతిక స్వరూపముగాని, వాస్తవిక జగత్తులోని కవి ఆత్మీయతగాని కావ్యమున ద్యోతకముగాదు. కావ్యములో గన్పించునది కవి అంతరాత్మ. అతని దివ్యస్వరూపము. నన్నయ కవి 'దివ్యమూర్తి'ని సాక్షాత్కరింప జేసికొనదలచు భావుకుడు ఆ మూర్తిని నన్నయ భారతములోనే దర్శింపగలడు.

నన్నయ విపుల శబ్దశాసనుడు. నన్నయ భారతము ఆంధ్ర వాఙ్మయమున ఆదికావ్యము. ఆనాడు దేశీయములైన శబ్దములను, సంస్కృత శబ్దములను ఏర్చి కూర్చి నుడికారపు సొంపులు తీర్చిదిద్దిన శబ్దశాసనుడు, నన్నయకు పూర్వము తెలుగులో శిలాశాసనములు కానవచ్చుచున్నవి. ఆంధ్రభాషలో సాహితీవ్యవసాయము నన్నయకు

పూర్వమే ఆరంభించినది. వ్యవహారములో, శిలాశాసనములలో అవ్యవ స్థితముగ నున్న విపులశబ్దజాలమును తీర్చిదిద్ది నియతిగల్పించి శాసించిన కవి నన్నయ భట్టారకుడు. తెలుగు పదములకు, సంస్కృత శబ్దములకు, తెలుగు ఛందస్సునకు, సంస్కృత ఛందస్సునకు తీరుతీయములు దిద్ది పద్యములు చెక్కిన శిల్పి నన్నయకవి.

నన్నయ అవిరళ జపహోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు. 'తెలుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడు.' బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన నిరతుడు. లోకజ్ఞుడు. నన్నయకు అర్థముమీద, అంతకంటె శబ్దముమీద నిష్ఠగలదు. దీనికి కారణము నన్నయ శబ్దశాసనుడగుటకాదు. నన్నయకవి నిష్ఠ శబ్దముమీద మాత్రమేగాదు. రమణీయార్థమును ప్రతిపాదించు శబ్దములు, వాని కూర్పు, గురులఘువుల ఆనుపూర్వి మాత్రమేకాక ఏతదుచ్చారణమీద మెండు. దీనినే 'అక్షర రమ్యత' అని నన్నయకవి చెప్పికొన్నాడు. ఈ అక్షర రమ్యత శబ్దముల కూర్పులో, అక్షరముల ఆనుపూర్వితో, ఏతదుచ్చారణవల్ల అభివ్యక్తమగు నాదములోనున్నది.నన్నయ నాదబ్రహ్మోపాసి. లలిత లలితములైన సంస్కృతపదములు, కమ్మని నుడికారపు సొంపులనీను తెనుగుపదముల నన్నయ పద్యములలో ఆ గురులఘువుల ఆనుపూర్విలో అక్షరరమ్యతగా వెల్లివిరిసినది.

"నందుమనంబు నవ్యనవనీత సమానము" అన్న పద్యములోని రమణీయార్థమును అటుంచ తెలుగుపదముల కూర్పు, సంస్కృత పదముల సమాసము రెంటెని మేళవించిన పద్యమునడక, ఆనడకలో జనించు 'నాదము' అక్షర రమ్యతగా పరిణమించుచున్నది. ఈ అక్షర రమ్యత సర్వజనైక వేద్యము. శబ్దార్థములకు అతీతము, విశిష్టము. అనగా తెలుగు రానివారుగూడ విని ఆనందింపవచ్చును.

అక్షర సమ్మేళనములన జనించు నాదముపై నన్నయకుగల నిష్ఠ

కచదేవయాని ఘట్టములో నన్నయ కవితాహృదయమును చీల్చుకొని స్వయం వ్యక్తమగు చున్నది కచుడు శుక్రుడు ఉదరమును చీల్చుకొని వచ్చినాడు. ఆ సందర్భమున —

"విగత జీవుడై పడియున్న వేదమూర్తి
అతనిచేత సంజీవితుడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
అభిహితంబగు శబ్దంబు నట్లపోలె"

మృతుడైన వేదమూర్తి శుక్రుడు ఉచ్చారణ దక్షుచేత అభిహితమైన శబ్దమువలె తిరిగి సంజీవితుడైనాడు. భంగ్యంతరమున జెప్ప వలసి వచ్చిన ఉచ్చారణ దక్షుడు కానివాడు ఉచ్చరించు శబ్దము మృతప్రాయము. ఉచ్చారణ దక్షుడు వేరు; సంగీత విద్వాంసుడు వేరు. సంస్కృత మహాభారతములో లేని ఈ ఉపమానము నన్నయ కవితా హృదయము నుండి వెల్లివిరిసినది.

నన్నయ కవితా శిల్పములో అక్షరరమ్యతకు తోడుపడినది. "ప్రసన్నకథా కవితార్థయుక్తి" నానారుచిరార్థ సూక్తి నిధి నన్నయ కవి కావ్యములో నీ అక్షర రమ్యతయు, ప్రసన్న కథా కవితార్థ యుక్తియు నల్లిబిల్లిగ పడుగుపేకవలె నల్లుకొని యున్నవి పూర్వోక్త ములైన సూత్రములకు నన్నయ మహాభారతమంతయు నిదర్శన ప్రాయమే. అర్థప్రపంచార్థమై కొన్ని పద్యములను ఉదాహరింప వచ్చును.

"వాడిమయూఖముల్ గలుగువాడ పరాంబుధి గ్రుంకె ధేనువుల్
నేడిటవచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్ని హోత్రముల్..."

ఇవి దేవయాని కచునిరాకకు నిరీక్షించుచు తండ్రితో పల్కిన పల్కులు. ఈ పద్యములో 'సూర్యుడు' అను అర్థములో "వాడిమ యూఖముల్ గలుగువాడు" అన్ని నన్నయ ప్రయోగించినాడు.

సూర్యుని చండప్రచండ కిరణములు "వాడిమయూఖములతో" గనిపింపదు. ఈ దీర్ఘ సమాసమును, ఈ దీర్ఘాక్షరములను ఉచ్చరించునపుడు పుట్టు నాదము సుకుమార స్త్రీకంఠస్వరము, తేజవరాలు, శుక్రుని గారాబుపట్టి, ఆశ్రమ వాటికలోని తాపసకన్యక దేవయాని నోటిలో 'తీక్ష్ణప్రచండ కిరణుడు' వాడి మయూఖములు గలుగువాడైనాడు. ఇట్లే ఈ పద్యమునంతయు పఠించినచో గురులఘువుల ఆనుపూర్వి, దీర్ఘాక్షరములు ప్లుతములుగా నినదించుట, వాడి... మయూఖ... మృగరాక్షస... ఈ తూర్పు కన్యకా కంఠస్వరమును మాత్రమే స్ఫురింపజేయును. నన్నయ అక్షర ప్రపంచమున మేటి శిల్పి.

దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోని కీడ్చి తెచ్చినాడు.

"అవన జాననన్ గురుకులాపశదుండు గడంగి రాజసూ
యావబృథంబునందు వసుధామర మంత్ర పవిత్రవారి ధా
రావళిజేసి పావనములైన శిరోజములన్ దెమల్చి పా
పావహు డీడ్చి తెచ్చె"......

ఈ పద్యములో రమణీయార్థ ప్రతిపాదములైన శబ్దములు మాత్రమే నన్నయ కవితా శిల్పమునకు తార్కాణములు కాజాలవు. నన్నయవాడిన ఆ శబ్దములనే వాడి ఆ పద్యమును గద్యముగా జెప్పిన తొల్లిటి రసస్ఫూర్తి గల్గదు. శ్వేతగులాబిపువ్వును రేకలు రేకలుగా విడదీసి అరచేతిలోపెట్టి చూపినట్లు ఆఅందము మటుమాయమైపోవును. తిక్కనమహాకవి కూడ నన్నయ కవితా శిల్పముపై పూజ్యభావము గలవాడనుటకు ఈ పద్యము ధ్వజప్రాయమైన నిదర్శనము. తిక్కన గూడ చంపకమాలనే, ఆ 'వ' కార ప్రాసతోనే, 'రాజసూయావబృథంబునందు' అను ఆ మాటలనే వాడి శ్రీకృష్ణునితో ద్రౌపది తన పడిన భంగపాటును చెప్పించినాడు.

శ్రీకృష్ణుడు ధర్మరాజునకు పదునాలుగువేల మత్తేభములను రాజసూయ యాగమున బహుమానగా నిచ్చెను.

"మందిత సూర్యరశ్మిరుచి మన్మణిహార చయంబుతో గట
స్యంది సుగంధి దాన జలసంపద నొప్పెడువాని దేవకీ
నందను డిచ్చె బ్రీతి పదునాలుగువేల గజంబులన్"

పదునాలుగువేల మత్తేభములు, కనుచూపుమేరకు అందకుండ కదలివచ్చుచున్నవి. ఆమత్తేభములు సాలంకృతములు, మణిహారములలో ప్రతిఫలించు సూర్యరశ్మి సూర్యకాంతిని తిరస్కరించుచున్నది. ఈ రమణీయార్థములను శబ్దములచే ప్రతిపాదించినాడు.

"మందిత సూర్యరశ్మి రుచి న్మణిహారచయంబుతో, గటస్యంది సుగంధి దానజల సంపద నొప్పెడువాని దేవకీనందనుడిచ్చె..." ఈ దీర్ఘసమాసములు, ఏతదుచ్చారణ వలన పుట్టునాదము, ప్రాసమైన 'ంద' కారముల పౌనఃపున్యము మత్తేభయూథముల గంభీర మంద గమనమును స్ఫురింపజేయుచున్నవి.

విశ్వసాహిత్య ప్రపంచములో శబ్దార్థములకు, ఛందస్సునకు భిన్నమైన నాదముచే కవితాశిల్పమును నిర్మించిన మహాకవులను వ్రేళ్ళపై లెక్కింపవచ్చును. ఈ మహాకవులలో నన్నయ మేరుపూస.

దుశ్శాసనుడు ద్రౌపది వలువలొలిచినప్పుడు భీముని ప్రతిజ్ఞను చెప్పు పద్యము;

"కురువృద్ధుల్ కురువృద్ధ బాంధవులనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుడై ద్రౌపదినిట్లు జేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్"

ఈ పద్యములో కురువృద్ధుల్ గురువృద్ధ...మదోద్ధరుడై — ఇత్యాది సమాసములు, 'ద్ధ'కార ప్రయోగ పౌనఃపున్యము భీముని రౌద్రాకృతిని, భీమసేనుడు తన గదాదండమును పలుమారు నేలపై ఝుళిపించి ప్రతిజ్ఞను సల్పుటను చెప్పక చెప్పుచున్నది. 'తద్వీపుల వక్షశ్శైలల...నిర్ఝర' మను దీర్ఘసమాసము నుచ్చరించుచున్నపుడు భీముడు పండ్లు పటపట కొరికినట్లు, 'ఉగ్రాకృతిన్' అని ర్రేన్చినట్లును స్ఫురించుచున్నది. పద్యములోనున్న ఏ పదమును ఈ అర్థము చెప్పకున్నను అక్షరముల ఆనుపూర్వి, ఏతదుచ్చారణలో జనించు నాదము వలన నిదియంతయు స్వయంవ్యక్త మగుచున్నది.

ఇట్లే రాజసూయయాగమున శిశుపాలుని నిందావాక్యములును ధర్మరాజును అధిక్షేపించుచు శిశుపాలుడు "అవనీనాథులనేకులుండగ విశిష్టారాధ్యులార్యుల్ మహీదివిజుల్ పూజ్యులు పల్వురుండగ ధరిత్రీనాథ..." అనుచు సభనుండి లేచిపోయినాడు. అవనీనాథులనునపుడు 'నీ' గురువు మాత్రమే గాదు. ప్లుతము. ఆశీనుడైన శిశుపాలుడు రెండు చేతులను నేలపై మోపి లేచుటను స్ఫురింపజేయుచున్నది. "విశిష్టారాధ్యులు"— ఆరాధ్యులు అని ఆరాలను ప్లుతముగా నుచ్చరించి గిఱ్ఱున తిరిగినాడు. 'ధరిత్రీనాథ' అను సంబోధనమున 'రిత్రీ' రెండు గురువులు, రేఫము, 'రిత్రీ' అనునప్పుడు జారి రెండడుగులు ముందునకు వైచినాడు. "దాశార్హుండు పూజార్హుడే" అని ఏకారముతో తల పలుమారు పంకించి ప్రశ్నించినాడు. ఇది నన్నయ కవితా శిల్పములోని విశిష్టత.

ఛందస్సుతో, ఛందస్సుకంటె అతీతమైన విశిష్టమైన నాదముతో గురులఘువుల ఆనుపూర్వితో ఏతదుచ్చారణచే నుద్భవించు నాదముచే నన్నయ రసప్లుతము గావించుచున్నాడు. కవి ఉపపాదించు అర్థము అనిర్వాచ్యమని, వాచామగోచరమని, వర్ణనాతీతమని ఆలంకారికులు

వర్ణించుచున్నారు. కవి అతీంద్రియములైన సత్యమును, సౌందర్యమును దివ్యచక్షువుచే దర్శించి కావ్యమున ప్రదర్శించును. వ్యవహారములోని శబ్దమునకీ శక్తి లేదనుట 'వర్ణనాతీతమనుటలో గతార్థము'.

నన్నయ కవితాశిల్పమును సమీక్షించినచో "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యమ్" అన్న శ్రీ జగన్నాథ పండితరాయలు కావ్య నిర్వచనమెంత అతివ్యాప్తిదోషమునకు పాల్పడుచున్నదా యని పించును. కావ్యము రసాత్మకమనుట, రసానందము సద్యఃపర నిర్వృతి అనుట ఋషికల్పులైన భారతీయాలంకారికుల ప్రాచీన సిద్ధాంతము.

—0—

# నన్నయ కవిత్వము

శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు

కవితా స్వరూప స్వభావాదులను గూర్చి పండిత విమర్శకు లనేకులు వివరించియున్నారు. భారతీయులునూ, పాశ్చాత్యులునూ ప్రతిపాదించిన నిర్వచనములనూ, వానిపై తరువాతి కాలమున రచిత ములైన వ్యాఖ్యానములనూ పరిశీలింపగా, -కవిత ఉదాత్తమూ, హృద్యమూ, ఇంద్రియోత్తేజకమూ అని మూడు వర్గములుగా నేర్ప డుచున్నట్లు తెలియుచున్నది. High poetry, Lyrical poetry, Sensuous poetry అనెడి విభాగముకూడా పై విభజనతో సమ న్వయ మగుచున్నది.

భామహుని నిర్వచనము మొదలుగా జగన్నాథ పండితుడు ప్రతిపాదించిన నిర్వచనము వరకూ, ఆలంకారికులు నిర్వచించి వివరిం చుచూ వచ్చిన కావ్యలక్షణము లన్నియూ చాలవరకు హృద్యమనెడి కవితావిభాగమునకే ఎక్కువగా వర్తించుచున్న వనీ చెప్పవచ్చును. రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యమనెడి జగన్నాథుని నిర్వ చనము. ఈహృద్యకవిత వివిధనిర్వచనములకునూ సారభూతమైనదిగా గోచరించుచున్నది. ఉదాత్తమైన కవిత్వము సర్వత్రా హృద్యమైన దిగా నుండక పోవచ్చును. హృద్యమైనదంతయూ ఉదాత్తముగా నుండ నవసరమునూ లేదు. ఐనను ఉదాత్తమైన కవిత హృద్యమైనది కూడా కావచ్చును. వాల్మీకి రామాయణ కవిత్వముతో పోల్చి చూచినపుడు భారత కవిత్వము హృద్యమైనదిగా తోపకపోవచ్చును. అంత మాత్ర మున భారతకవిత్వ ముదాత్తమైనది కాకపోదుగదా! Keats, Shelly కవుల రచనలందు కానవగు హృద్యత Iliad, Divine Comedy, Paradise Lost వంటి మహాకావ్యములలో గోచరింపక పోవచ్చును. ఐనను ఈ యుద్గ్రంథముల యుదాత్తతకు భంగము రాదుకదా!

ఈ దృష్టితో పరిశీలించి చూడగా, కావ్యమునకు ఉదాత్తత నాపాదించెడి లక్షణములు – విశిష్టమైనవి – ఏవియో కల వనియూ, వానిని బట్టియే కావ్యమున కౌన్నత్య మేర్పడుచున్నదనియూ నిర్ణయమగుచున్నది. ఈ లక్షణములను పాశ్చాత్యులు Epic Poetry లక్షణముగా పరిగణించినారు. Epic Poetry లక్షణములను నిర్ణయించుటలో చాలవరకు ఇతివృత్తమునకే ఎక్కువ ప్రాధాన్య మేర్పడినది. ఇతివృత్తముయొక్క విస్తృతినీ, వైశిష్ట్యమునూ, అది నిర్వహించబడిన విధానమునూ బట్టి, – ఈ యుదాత్తత – సిద్ధించునని విమర్శకుల అభిప్రాయము. మానవుని బాహ్యాంతర జీవితములకు ప్రతిబింబ మగుచుండుటయే కాక ధ్వని ప్రధానమైన వాఖ్యానమగుచూ, సంఘ జీవిత సర్వస్వమునకునూ ప్రతికృతియగుచూ, మానవుని జీవిత ప్రవృత్తికి మార్గదర్శక మగుచూ, భావి మానవజాతి కుపాదేయమైన సంస్కృతిగా నిలిచి, విశ్వశ్రేయమును పరమధ్యేయముగా నిడికొన్న రచన ఉదాత్తకావ్య మని చెప్పవచ్చును. ఈ లక్షణము లన్నియు మన భారత రామాయణములకు సమగ్రముగ వర్తించుచున్నవి.

ఇట్టి ఉదాత్త కావ్యసృష్టి జరుగుటకు కవిజీవితము కూడ ఉదాత్తమై యుండుట వసరము. సామాన్యమైన జీవితావధులను దాటనివ్యక్తికి ఇట్టి కావ్యరచన సాధ్యముకాదు. మానవజీవిత మందలి బాహ్య సంఘటనలను మాత్రమే చూడగలిగిన కవి అలంకార శోభితమైన, హృద్యమైన, ఇంద్రియోత్తేజకమైన వర్ణనలను, సన్నివేశములను చిత్రింప సమర్థుడు కావచ్చును. పఠితలకు నొక విధమగు చిత్తవికాసమును కలిగింపవచ్చును, కాని, ఆ సంఘటనలకును హేతుభూతములై నిగూఢములై యున్న, బాహ్యేంద్రియముల కగోచరములై యున్న ప్రకృతితత్త్వములను గ్రహింపనివాడు, మానవ జీవిత తత్త్వమును చిత్రింపనూ లేడు, వ్యాఖ్యానింపనూ లేడు. కావున, ప్రకృతికి భాష్య

ప్రణేత కావలసిన కవి పుట్టుక చేతను, శిక్షణ చేతను, ధ్యేయము చేతను, సంస్కారము చేతను కూడ అసాధరణ వ్యక్తియై యుండవలెను. కనుకనే, – "నానృషిఃకురుతే కావ్యం" అని ప్రాచీను లభిప్రాయపడియున్నారు. ఆత్మసంయమనము ప్రధాన లక్షణముగా, బాహ్యేంద్రియాంతరేంద్రియములను స్వాధీనమునం దుంచుకొని, ద్వంద్వముల కతీతుడై విశ్వశ్రేయమును పరమధ్యేయముగా నిడికొన్న ఋషితుల్యులు మాత్రమే ప్రకృతికి భాష్యకారులు కాగలరు. అయినను, ఋషులెల్లరును కావ్యకర్తలు కాలేదనెడి విషయము కూడ గమనింపదగినది. కాగా, ఋషికి గల లక్షణములతో బాటు, కావ్యదృష్టియూ రచనాశక్తియూ కూడ అవసరములు. వీనినే మన అలంకారికులు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము-ఇత్యాదిగా కవిలక్షణములను పేర్కొనియున్నారు. తొలుత పేర్కొన్న ఋషిలక్షణములనూ, ఆలంకారికులు వివరించిన కవిలక్షణములను కూడ నొక వ్యక్తిలో నెలకొన్ననాడు ఉదాత్త కావ్యసృష్టి సాధ్యమగును. వ్యాస వాల్మీకులు ఇట్టి మహాకవులు. వారి ననుసరించినవారే కవిత్రియమువారు.

నన్నయాదుల జీవితములు, భారతమును రచించుటయందు వారికి గల ఆశయములు, భారతేతివృత్తముపై వారికి గల గౌరవాదరములు – వీనిని బట్టి చూడగా ఉదాత్త కావ్యరచనకు వీరెట్లు సమార్థులో, వ్యక్తము కాగలదు. భారతభారతీ శుభగభస్తిచయంబులచే ఘోరసంహార వికార సంతమసజాలము యొక్క విజృంభణమును తొలగించి, సూరి చేతోరుచిరాబ్జ బోధనరతుడైన పరాశరాత్మజాంభోరుహమిత్రుడు కవిత్రయము వారికి భారత రచనయందు గురువైనాడు. ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, ఇతిహాసము, పురాణము ఇత్యాదిగా పరిశంసింపబడుచున్న భారతామ్నాయమును విశ్వజనీనముగా రచించుట వీరి ఆశయము. భారత రచనచే వ్యాసుడుద్దేశించిన లక్ష్యమే కవిత్రియము వారికిని లక్ష్యమైనది.

అమితాఖ్యానక శాఖలతో, వేదార్థామలచ్ఛాయతోనొప్పుచు, సుమహావర్గచతుష్క పుష్పవితతితో శోభిల్లుచు, కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమగుచు, ధాత్రీసురప్రార్థ్యమగుచు, భారత పారిజాతము ద్వైపాయనోద్యానజాతమై యొప్పినది. వివిధాఖ్యానములు, వేదార్థములు కలవు గనుకనే తద్గ్రంథము ధాత్రీసుర ప్రార్థ్యమై విలసిల్లినది. ఐన, ధాత్రీసురప్రార్థ్యమెద్ది?

త్రిలోక రక్షకులైనవారు సురులు. మానవలోక కల్యాణము నుద్దేశించువారు ధాత్రీసురులు. 'గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్, లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు'– అనునది వీరి ధ్యేయము. ఇందు, "గో" శబ్దమునకును "బ్రాహ్మణ" శబ్దమునకును అర్థము సరియగు విధమున వివరించుకొన వలసియున్నది. మానవుని ప్రాపంచిక జీవయాత్రకు ఆధారభూతమయిన భౌతికసంపద యంతయు గోశబ్దము చేతను, ఆధ్యాత్మిక జీవిత సర్వస్వమును 'బ్రాహ్మణ' శబ్దము చేతను ఇందువ్యక్తము చేయబడియున్నవి. గోశబ్దమునకు భూమి యనియు, బ్రహ్మ శబ్దమునకు పరతత్త్వమనియు నర్థములు. భౌతిక జీవితమున కంతకును ఆధారమైన భూమియు, పారమార్థిక జీవితమునకు ఆధారమైన బ్రాహ్మణతత్త్వములు రక్షితము లయినచో, సర్వప్రజా శ్రేయస్సు సిద్ధించునని ఈ వాక్యద్వయముయొక్క భావమైయున్నది. మానవజీవితము లోకకల్యాణప్రదమై ఫలించుటకు భౌతిక సంపదయు, ఆధ్యాత్మిక జ్ఞానమును కూడ నవసరములు. అదియే జీవితము తరించుట. ఈ భావమునే "అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్యయా అమృత మశ్నుతే" అనియు వివరించారు. అట్టి సమగ్రమైన జ్ఞానమునకు, విజ్ఞానమునకు ఆకరమై యుండుటచే భారతమున కంతటి గౌరవము కల్గినది. వ్యాసునియొక్కయు, తదనుయాయుల యొక్కయు హస్తములలో ఉదాత్తేతిహాసముగ విజ్ఞానభాండారముగ సిద్ధించిన

మహాభారతము ఆంధ్రమున కవిత్రయమువారి హస్తములలో మహా కావ్య స్వరూపమును గైకొన్నది.

వ్యాసుడు ప్రధానముగ ఇతిహాస రచయిత. రసవంతమగు కావ్యరచన అతని యుద్దేశము కాదు. సత్యధర్మములకు అపద కలిగి సంఘము పాపావిష్టమైయున్న సందర్భమున సారస్వతము ద్వారా సత్యధర్మములను పునరుద్ధరించి సంఘమునకు స్వస్థత చేకూర్పదలచిన వాడు వ్యాసుడు. కావున, వ్యాసుడు సంఘమునకు గురుస్థానమున నిలిచియున్నాడు. పాండవ కౌరవుల వంశ చరిత్రయే ప్రధానమైన ఆధారముగ, లోకవృత్తము నంతటిని ప్రజలకు వివరించి, పాపపుణ్యముల స్వరూపమును వారికి అర్థమగునట్లు జేసి వారిని సత్యధర్మోన్ముఖులుగ నొనర్చుట వ్యాసుని ఆశయము. కావున, ఇతిహాస మార్గమున కథను నడిపించుటయే యతడు ధ్యేయముగా నిడికొన్నాడు. భారత రచనా విషయమున కవిత్రయమువారి ధ్యేయమును వ్యాసుని ధ్యేయమును నొక్కటే! అయినను, రచనావిధానమున వీ రవలంబించిన మార్గములు వేరు. భారతకథను ఆకర్షణీయముగ రసవంతమయిన విధమున కావ్యముగా తీర్చిదిద్ది ప్రజల మనస్సులను చూరగొనుట వీరి యాశయము. కేవలము పురాణ విధానము కవిత్రయము వారికి నచ్చలేదు. కావున వ్యాసుని రచనకు కావ్యత్వము నాపాదింపజేసిన వారు తెలుగు కవులు.

> ఇమ్మగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం
> బమ్మున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరం
> ధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదు రట్టి మునీంద్రలోకవం
> ద్యమ్ముని నప్పరాశరసుతుం బ్రణమిల్లి కరమ్ము భక్తితోన్

అని నన్నయ భారతము వ్యాసుని వాగమృత మనియు దానిని లోకులు కర్ణరంధ్రమ్మను నంజలిం దవిలి త్రావుదు రనియు వర్ణించె

నాడు. ఈ భావమునే తిక్కన 'భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావలి మోదమునం బొరయునట్లుగ.' తాను భారతము రచింతు నన్నాడు. భారత విషయమున నన్నయ తిక్కన లిరువురకును ఇట్లు భావైక్యము కలదు. భారతమును వర్ణించుచు వీరు వాడిన యమృతశబ్దము గుర్తింపదగినది. అమృతశబ్దముచే బోధ్యమైనది ఆత్మ సాక్షాత్కారమునకు సాధనమైన విద్య. ఉపనిషత్తుల యందును, ఉత్తర మీమాంసయందును బోధింపబడిన ఈ విశిష్ట విద్యయే అమృతత్వము నొసంగునది. అట్టి విద్యను బోధించునది గనుకనే భారతము అమృతమని పేర్కొనబడినది. అట్టి భారతార్థమును లోకులు ఆసక్తితో కర్ణపుటంబుల నారఁగ్రోలి యానందమును బొందుదు రనుటలో ఆంధ్ర భారత రచన లోకులనాకర్షించునట్టి కమనీయ విధమున నడచినదని స్ఫురించుచున్నది.

ఇట్టి కావ్యరచనా విధానమున కవిత్రయమునకు ఒరవడి యయిన వాడు వాల్మీకి. భారత రామాయణములు రెండును ఇతిహాసములు, మహాకావ్యములు అయినను, రచనా విధానమున నీ రెంటికిని భేద మెంతయో కలదు. వశ్యవాక్కగు వ్యాసుని రచన ప్రకృతి సిద్ధముగా స్వేచ్ఛగా, అర్థభావములను అనుసరించి సిద్ధించినది. కావున స్వేచ్ఛగా ప్రకృతియందు పెరిగి అనేక ముఖముల వ్యాపించి గంభీర స్వరూపము నుగైకొన్న మహారణ్యమువలె భారత రచన గోచరించుచున్నది. ఇందలి గాంభీర్యము, గౌరవము నిసర్గమగు ప్రకృతి సౌందర్యము భగవత్సృష్టివలె అద్భుతావహమైనది. కావుననే, "బుద్ధి బాహు విక్రమమున దుర్గమార్థ జలగౌరవ భారత భారతీ సముద్రము దరి యంగఁ నీదను విధాత్రునకైనను నేరబోలునే"– అని నన్నయ చెప్పి యున్నాడు. వాల్మీకి రామాయణ రచనా విధానము వేరు. వ్యాసుని రచన ప్రకృతియందలి మహారణ్యమును పోలుచుండ, వాల్మీకి రచన తీర్చిదిద్దిన మహోద్యానము వంటిదిగా గనబడుచున్నది. శబ్దముల

కూర్పు, అర్థమును ప్రసన్నముగ వ్యక్తము చేయుట, భావములను మనోహరమగు విధమున గూర్చుట, వర్ణనలచే సన్నివేశములను రమణీయముగ నొనర్చుట మున్నగు ప్రధానకావ్య లక్షణములు వాల్మీకి రామాయణమునందు కాననగు విధమున వ్యాస భారత రచనయందు గోచరించుటలేదు. ఇందులకు ఈ మహర్షుల భిన్న దృక్పథములే హేతువులు. వాల్మీకియందలి యీ కావ్యవిధానమే తెలుగు కవిత్రయము వారికి ఒరవడి యయినది,

'దుర్భర తపోవిభవాధికున్ గురుపద్య విద్యకు నాద్యు సం
బురుహగర్భవిభున్ బ్రచేతసుపుత్రు భక్తి దలంచుచున్'–

అని నన్నయ వాల్మీకిని మొదట ప్రశంసించి తరువాతి పద్యమున వ్యాసుని తలచియుండుట గమనింపదగినది. అందును, గురుపద్య విద్యకు నాద్యుడు వాల్మీకియట. చారిత్రక దృష్ట్యా భారత రచనకు తరువాతనే రామాయణ రచన జరిగినదని యభిప్రాయము కలదు కదా! అట్లుండ గురుపద్య విద్యకు వాల్మీకి ఆద్యుడని నన్నయ నుడువుటలో నభిప్రాయ మేమైయుండును? భారతమందలి కవితయందు కంటెను, రామాయణ రచనలో విశిష్టమైన రామణీయకత నన్నయకు గోచరించియుండుటచే పద్య విద్యయందు వాల్మీకియే ప్రథముడు. అనగా, మొదట పేర్కొనదగిన వాడు అని యభిప్రాయపడి యుండునని యూహింపవలసియుండును. కావుననే వాల్మీకి రచనను ఒరవడిగా పెట్టుకొని నన్నయ తన పద్యరచనను సాగించినాడని చెప్పవచ్చును. ఈ 'పద్యవిద్య' యను ప్రయోగమును బట్టి చూడ నన్నయ నాటికే పద్యరచన ఒక కళగా యుండెనని తలంపవలసి యున్నది.

అలంకార గ్రంథములు కావ్య ప్రస్థానములు అప్పటికే ప్రచారమునకు వచ్చినవి కావున 'కావ్య సౌందర్యము'ను పోషించు నాసక్తి కలిగినది.

మరియు ప్రసన్నకథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానా రుచిరార్థసూక్తి మున్నగు కావ్యరచనా విశిష్ట లక్షణములను నన్నయ పేర్కొని యుండుట కూడ ఈ యభిప్రాయమును బలపరచుచున్నది. కావున నన్నయ నాటికే పద్య విద్య తెనుగున బాగుగ నభివృద్ధిగాంచి యుండినదని యంగీకరింపక తప్పదు. అట్టి పద్య విద్యకు భారత రచనచే స్థిరత్వము కల్పించి, దాని నొక కళగా తీర్చిదిద్ది ఆదికవి యను గౌరవ మును పొందినాడు. భారత రచన నన్నయ యొక్క మొదటి కావ్య మని కూడ నంగీకరింప వీలులేదు – చూడుడు.

విపరీత ప్రతి భాష లేమిటికి నుర్వీనాథ యీ పుత్రగా
త్రపరిష్వంగ సుఖంబు సేకొనుము ముక్తాహార కర్పూర సాం
ద్రపరాగ ప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయున్ పుత్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే!

అని మాధుర్య ప్రసాదములుగా శయ్యా సౌభాగ్యముచే నొప్పుచు, రమణీయార్థమును లలితములగు పలుకులచే ప్రతిపాదించుచు నై సర్గికములు నర్థపోషకములు నగు నలంకారములచే శోభిల్లుచు నుం డెడి యిట్టి పద్యరచన నన్నయ ప్రథమ ప్రయత్నమని తలంచుట యెట్లు? ప్రాక్తనజన్మవిద్య యంతయు నన్నయ కీ జన్మమున సిద్ధించి యుండవచ్చును. అయినను అభ్యాసము లేనిదే యెట్టి విద్యయు పరి ణతస్థితిని అందుకొనదనుటలో విప్రతిపత్తి యుండదు. భారత రచనా రంభమునకు పూర్వమే నన్నయ పద్య విద్యను సాధించిన వాడనియు, మహాకావ్యములు కాకున్నను ఏవో కొన్ని కావ్యములనైన రచియించి యుండుననియు నా నమ్మకము.

"మానిషాద ప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీ స్సమాః"

అను విధముగ వాల్మీకి నోటినుండి వెలువడిన సరస్వతివలెనే నన్నయ

నోటినుండి ఒక్కసారిగా ఇట్టి భారతరచన ఊడి పడిన దనువారితో నేను వాదింప జాలను. నా యభిప్రాయ మిదియని చెప్పి నమస్కరించుటయే నేను చేయగలిగిన పని.

పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణ పుంజవారి జోత్కర రుచిరములు సకలగమ్యసుతీర్థములు. మహామనోహర సుచరిత్ర పావన పయః పరిపూర్ణములు నయిన సత్సభాంతర సరసీవనములను ముదంబొనర గొనియాడినవాడు నన్నయ. ఈ సభాంతర సరసీవనములలో శాస్త్ర చర్చలే కాని కావ్యాలాపములు కావ్యపఠనములు ఉండ లేదని యూహించుట యెట్లు? ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడు సత్ప్రతిభాభియోగ్యుడు అని నన్నయను రాజనరేంద్రుడు నిరాధారముగ ప్రశంసించినాడని యెట్లు చెప్పగలము. మరియు తనకు సహాధ్యాయుడయిన నారాయణభట్టు వాఙ్మయ ధురంధరుడు అనియు సంస్కృత కర్ణాట ప్రాకృ తాంధ్రభాషలలో కవిరాజశేఖరు డనియు వర్ణింపబడుట కేవలము లాంఛనమని చెప్పలేముకదా! వీని సన్నిటిని బట్టి చూడగా భారతరచనా కాలమునకే నన్నయ సంస్కృతాంధ్ర కవితా రచనయందు సిద్ధహస్తుడయి యుండెననియు, ఆ ఆత్మ విశ్వాసమును ఆధారముగ గొనియే మహాభారత సముద్రమును దరియంగ నీదుటకు పూనుకొనెననియు విశ్వసింపక తప్పదు.

అదికాక, తారకాసముదయములను లెక్కించుట, సర్వవేద శాస్త్రముల యశేషసారమును బొందుటయు నెట్టిదో భారత రచన గావించుట యట్టిదని చెప్పికొనిన నన్నయ దానికి వలయు శక్తిసామర్థ్యములు అర్హతలు శిక్షణాభ్యాసములు లేనిదే తన్మహాకార్యమునకు పూనునట్టివాడు కాడు. అవిరళ జపహోమతత్పరుడు, సద్విసుతావదాత చరితుడు, నిత్య సత్యవచనుడు – అను విశేషణములు కూడ గమనింపదగినవి. పంచమవేద మని గౌరవింపబడుచున్న మహాభారతమును

స్పృశించుటకు మాత్రమే కాక అనువదించుటకు పూనుకొనవలసిన వ్యక్తి యెట్టి యోగ్యతలు కలవాడై యుండవలెనో యిందు వ్యక్తము చేయుచున్నాడు. అవిరళజపహోమతత్పరుడు కనుక ప్రాపంచిక విషయములయందును ధనకనకపదవీ వ్యామోహములందును ఆసక్తి యేర్పడ లేదనుట గమ్యమాన మగుచున్నది. అట్టి ప్రాపంచిక విషయాతీతుడయి నప్పుడే భారత ప్రోక్తములగు వేదాంతార్థాదులను ధర్మసూక్ష్మములను తాను దర్శించి యితరులకు బోధింపగలడు. అట్లే తద్వ్యక్తి యొక్క జీవితచరిత్రయు నిష్కళంకము, లోకహితమును కాంక్షించునదియు కూడ నయియుండవలెను. లేనినాడు వ్యాసు డుద్దేశించిన విశ్వశ్రేయమును తన రచన వలన సిద్ధింపజేయలేడు. అందుననే సద్వినుతావదాతచరితుడని తన జీవితచరిత్రి యెట్టిదో, భారత రచనకు గల యర్హత యెట్టిదో సూచించినాడు. అట్లే తాను నిత్య సత్యవచనుడనియు చెప్పుకొనవలసిది. భారతామ్నాయముపై లోకమునకుఅందును పండితులకు నా డుండిన గౌరవమట్టిది. అట్టి పంచమవేదమును అనువదింప బూనుకొన్న వ్యక్తి విషయమున పెదవి విరుపులు, సందేహములు పండితులలో కలుగకపోవు. కావుననే నన్నయ తన యర్హతలను కొంతకు కొంత ముందుగా నివేదించుకొనవలసి వచ్చినది.

ఈ విధముగా ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములకు అకళంకము, నుదాత్తము నగు జీవితము తోడగుచుండ భారత రచనచే విశ్వశ్రేయమునకు పూనుకొన్నవాడు నన్నయ, భారతము నాంధ్రీకరించుటలో నన్నయ యవలంబించిన విధానమును స్వతంత్రమైనదే. వ్యాసుని కథా ప్రణాళికకు ఏ మాత్రమును భంగము కలుగనీయక తత్తత్కథాంగములను కావ్యోచిత మగు రీతిగా చిత్రించుచు, కథార్థమును పాఠకునకు ప్రసన్నమగునట్లు చేయుట నన్నయ యవలంబించిన పద్ధతి. మూలమున విస్తృతముగ తనకు తోచిన భాగములను కథా సౌష్టవమునకు అనుకూలించునట్లుగా కుదించుట మూలమున వర్ణనీయమైన సన్ని

వేశము ఈ మత్స్యపృష్టము మాత్రమే అయియున్నచో దానిని పెంచి వర్ణించుట, తన కాలపు రూఢినిబట్టియు సాంఘిక వ్యవస్థను బట్టియు అనుచితములని తోచిన వానిని తొలగించియో లేక ఔచిత్యాను గుణముగ మార్చియో కథను నడిపించుట ఇతడవలంబించిన విధానము లలో కొన్ని.

సత్యవతీ పరాశర సమాగమమును వర్ణించు ఘట్టమును పరికిం తము. యమునయందు ఓడ నడపుచున్న మత్స్యగంధిని తీర్థ యాత్రా పరుడగు పరాశరమహర్షి గాంచినాడు.

"అతీవ రూపసంపన్నామ్, సిద్ధానా మపి కాంక్షితామ్,
చారుహాసినీమ్, రంభోరూమ్, దివ్యామ్, తామ్
వాసవీమ్ కన్యామ్."—

తొలి చూపుననే మహర్షి కామించినాడు.

"సంగమమ్ మమ కళ్యాణి కురుష్వే త్యభ్యభాషత"

పరాశరుడు మహర్షి, తపోధనుడు, లౌకిక వ్యాపారాదులను లక్షింపనివాడు, తాత్కాలికముగ విధి ప్రాబల్యమున కామమునకు లోనై "కళ్యాణి, మమసంగమమ్ కురుష్వ" అని మాటిగా, ఏమాత్ర మును వక్రోక్త్యాదుల కవకాశము లేక, జంకు బిడియము భయము అనువాని ప్రసక్తి లేక, దప్పిగొన్నవాడు జలము నర్థించినట్లు, ఇంద్రియ తృప్తి నాశించినాడు. ఇది ఆ మహర్షి జీవితమునకును ఆ ప్రకృతి సన్ని వేశమునకును సరిపోయిన వర్ణన. ఏమి చెప్పుటకును నోరాడని సత్యవతి స్త్రీ ప్రకృతికిని ప్రవృత్తికిని సహజమైన విధమున —

"సా బ్రవీత్ పశ్య భగవన్ పారావారే స్థితాన్ ఋషీన్
ఆవయోర్దృష్టయో రేభిః కథంతు స్యాత్ సమాగమః"

అని ప్రశ్నించి తప్పించుకొన జూచినది. మహర్షియయిన వానిని అధిక్షే పించుటకుగాని, నిరసించుటకుగాని ఇష్టపడక క్లిష్టపరిస్థితినుండి చల్లగా

తప్పించుకొను స్త్రీప్రయత్నమూదు వ్యక్తమయియున్నది. సత్యవతికి గల ఆత్మవిశ్వాసముకూడ ప్రకటితమే. కాని, మహర్షి తన తపః ప్రభావముచే సకలదృష్టిరోధకమైన నీహారతిమిరమును తత్క్షణమే కల్పింపజేసినాడు. తద్ప్రభావదర్శనముచే సత్యవతి విస్మితురాలైనది.

"విస్మితా సా భవత్ కన్యా వ్రీడితా చ తపస్వినీ"

సిగ్గును, విస్మయమును ఆమెను లోగొన్నవి. పాపము. అయినను ఆత్మ ప్రత్యయమును గోల్పోక-

"విద్ధి మామ్ భగవన్ కన్యామ్ సదా పితృవశానుగామ్
త్వత్సంయోగాచ్చ దుష్యేత కన్యాభావో మమానఘ
కన్యాత్వే దూషితేవాపి కథమ్ శక్ష్యే ద్విజోత్తమ
గృహమ్ గన్తుమ్ ఋషే చాహమ్ధీమన్ నస్థాతుముత్సహే
ఏతత్సంచిన్త్య భగవన్ విధత్స్వయదనన్తరమ్"

అని పలికినది. తాను కన్య, తండ్రి యధీనమునం దుండునది, తన కన్యాత్వము దూషితము కాగలదు. అట్లగుచో తా నెట్లు నిలువగలదు - అను విషయముల నేకరువుపెట్టి, ఇవన్నియు బాగుగ యోచింపుము ద్విజోత్తమా అని హెచ్చరించినది. ఈ పలుకులచే మహర్షికి ప్రీతి జనింప, తన సంగమముచే నామెకు కన్యాత్వము దూషితము కాదని చెప్పి, యోజనగంధిత్వాది వరము లిచ్చి, ఆమె జన్మవృత్తాంతమును తెలిపి, తన తపశ్శక్తిచే నామె యెదురాడకుండునట్లు చేసినాడు ఋషి. అట్లు లబ్ధవరయు, ప్రీతయు, స్త్రీభావ గుణభూషితయు అయిన యామె మహాద్భుత కర్మలను ప్రదర్శించిన ఋషి సంసర్గమును పొందినది. ఇది మూలమందలి కథన విధానము.

పరాశరుని గూర్చిన వర్ణన యేమాత్రమును మూలమునందు లేదు. కాని నన్నయ-

గతమదమత్సరుండు త్రిజగద్వినుతుండు వసిష్ఠపౌత్రుఁ డు
న్నతమతి శక్తిపుత్రుఁ డఘనాశన ఘోరతపోధనుండు సు
వ్రతుఁడయి తీర్థయాత్ర చనువాఁడు పరాశరుఁ డన్మునీంద్రుఁ డ
య్యతివ తలోదరిన్ గనియె న య్యమునానది యోడ నేర్పునన్.

అని యొక పద్యమున నీ సన్నివేశమునకు ఆరంభముగా పరాశర మహర్షిని వర్ణించినాఁడు. తపోధనుఁడై, ఋషివర్యుఁడైన పరాశరుఁడు ఇంద్రియవిజేత యగుటకు బదులుగ ఇంద్రియములకు లోనై సత్యవతి యందు ప్రవర్తించినాఁడు. ఈ కార్యమును సమర్థింపవలసినందుకు పరాశరుని వర్ణన అవసరమైయున్నది. మదమత్సరములను జయించినవాఁడు. త్రిజగద్వినుతుఁడు. ఇక్ష్వాకుల కులగురువగు వసిష్ఠుని మనుమఁడు. ఇంతియ కాక పాపమును నశింపజేయునట్టి ఘోరతపోధనుఁడు— అట్టివాఁడు సువ్రతుఁడయి తీర్థయాత్ర చనుచు కర్మపరిపాకముచే ఇంద్రియవశంవదుఁ డయినాఁడు. ఈ పరాశర సత్యవతీ సమాగమ వృత్తాంతము సామాన్య కాముక వృత్తాంతము కాదనియు లోకాతీతమైన విషయమనియు తెలుపుట నన్నయ యుద్దేశము. కావుననే పరాశరు నట్టిమహర్షి యనో, ఎట్టి అఘనాశన ఘోరతపోధనుఁడో వివరింపవలసి వచ్చినది. అతని విషయమున ఇది పాపమును కాదు; అతని నిది స్పృశింపను స్పృశింపదు. ఇట్టి మహర్షుల ప్రవర్తిలో తాత్కాలికముగా నైనను జరిగిన యిట్టి సంఘటనలు తామరపాకు నంటని నీటిబిందువులవంటివని సూచించుట నన్నయ యుద్దేశము. లోకాతీతులగు మహాపురుషులయెడ భక్తివిశ్వాసము లుండిన వ్యాసుని కాలమున ఇట్టి వివరణ కవసరము లేకపోయి నది. కావున వ్యాసుడు "తీర్థయాత్రాన్ పరిక్రామన్ అపశ్యత్ వై పరాశరః–" అని ఒక వాక్యమున సామాన్యముగ చెప్పి విడిచినదానికి నన్నయ కాలమున వివరణ కావలసివచ్చినది. మరియు "మునివరుఁడు తన యభిప్రాయం బక్కన్యక కెరిగించిన నదియును దీనికొడంబడనినాఁడు నా కలిగి యిమ్ముని శాపంబిచ్చునో యని వెఱచియిట్లనియె :

తరల॥ "తనువు మీనొప్పలవల్చు జాలరిదాన నట్లును గాక యే
నసఘ కన్యకఁ గన్యకావ్రత మంతరించిన నెట్లు మ
జ్జనకు నింటికిఁ బోవనేర్తుఁ బ్రసాదబుద్ధి యొనర్పు స
న్మునిగణోత్తమ నాకు దోషవిముక్తి యెట్లగు నట్లుగాన్."

అని పలికినది చేపవాసనతోడి తనువుగలదాన ననియు, జాలరిదాన ననియు వర్ణనలు నన్నయవి. వీనిచే పరాశరునకు జుగుప్స కలిగించి అతనిని విషయ విముఖునిగ నొనరించుట సత్యవతి ప్రయత్నము. అతడు ద్విజోత్తముడు, తాను జాలరిది- అనియు పేర్కొన్నది. పరాశరుని కామమున వర్ణవిషయకమగు నిర్బంధములు తక్కువ కావున వ్యాసు డా ప్రసక్తిని తేలేదు. నన్నయనా డది ప్రధానమయిన విషయము. కావున తాను జాలరిదాన నని చెప్పియు సత్యవతి అతనిని మరల్ప జూచినది. అయినను సత్యవతి కన్యాత్వము దూషితము కాదనియు ఆమె వసురాజ సంతతి యనియు నచ్చజెప్పి యోజన గంధిత్వమును సిద్ధింపజేసి ఋషి యామె నొడంబడునట్లు చేయజూచినాడు. అప్పటికిని వెనుదీయుచున్న సత్యవతి-

"ఎల్లవారును జూడంగ నిట్టి బయల నెట్లగు సమాగమం" బని మరియొక యడ్డు చెప్పినది. మూలమునందువలెనే యిందును స్త్రీస్వభావోచితమగు ప్రవృత్తియు వయోనురూపమగు ముగ్ధత్వమును చక్కగ ప్రదర్శితములయి యున్నవి. పైన చెప్పిన విధమున పరాశర మహాముని వర్ణనను చేర్చుటచే ప్రకరణమున కౌచిత్యము సిద్ధించినది. సత్యవతికి సిద్ధించిన యోజనగంధిత్వమును గూర్చి పెంపుడుతండ్రి యగు దాశరాజు ప్రశ్నించినట్లును, పరాశరముని దయవలన కలిగిన దని యామె బదులుచెప్ప నెల్లవారును హర్షించినట్లును మూలమున గలదు. తండ్రి కూతుల మధ్య జరిగిన ఈ సంఘటన- కావ్యదృష్ట్యా అనుచితమని కాబోలు నన్నయ విసర్జించినాడు. ఇది నన్నయ పాటిం

చిన విధానము. అనువాదమున గల యీ క్రింది పద్యమునుగూర్చి యొకమాట చెప్పవలసియున్నది.

"ఇట్లేకతంబ యేక వస్త్రయయి యోడ నెక్కవచ్చువారి నిరీక్షించుచున్న సత్యవతిం జూచి యా మునివరుండు దానియందు మదనపరవశుండై దాని జన్మంబు తన దివ్యజ్ఞానంబున నెఱిఁగి యయ్యోడ యెక్కి దానితో నొక్కటం జని చని—

చపలాక్షి చూపులచాడ్పున కెద మెచ్చుఁ
జక్కని చనుఁగవఁ జిక్కఁగోరు
సన్నవ కౌఁదీగ యందంబు మది నిల్పు
జఘనచక్రంబుపైఁ జలుపు దృష్టి
యభిలాష మేర్పడు నట్లుండఁగాఁ బల్కు
వేడ్కతో మఱుమాట వినఁగఁ దివురు
నతిఘనలజ్జావనత యగు నక్కన్య
పై బడిఁ బ్రజ్జయుఁ బాపఁగడఁగు
నెంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు పవిత్రమయినచోట
సతుల గోష్ఠిఁ జిత్తచలన మొందుదు రెందుఁ
గాముశక్తి నోర్వఁగలరె జనులు."

ఈ వర్ణన మూలమున నెందును లేదు. నన్నయ వ్రాయును లే దని నా దృఢవిశ్వాసము. ఈ సీసపద్యమున వర్ణితమయినది చిర కాలాభ్యస్తమయిన కాముక చిత్తవృత్తి. జీవితమున మొదటిసారిగా, బలవద్విధికారణముగా— మహర్షికి గలిగిన ఇంద్రియోచ్ఛ కాదు. అసు నాశన ఘోరతపోధనుడు, త్రిజగద్వినుతుడు నైన పరాశరునివంటి మహర్షియొక్క తాత్కాలిక చిత్తవికృతియొక్క వర్ణన కా దిది. ఈ వర్ణన కొంతవరకు కీచకుని విషయమున అన్వయించునేమో కాని,

లోకాతీతులగు మహర్షుల విషయమున నన్వయింపదు. కామప్రవృత్తికి లోనుగానివాడు పరాశరమహర్షి. అట్టి అనుభవశూన్యుడైనవాని యింద్రియవికారము, ప్రవృత్తియు, క్షణికమును, బాహ్యేంద్రియ ప్రచోదితము, మానసిక ప్రవృత్తిరహితము నయియుండునే కాని యిందు వర్ణితమైనట్లు కాముకభావనా ప్రాబల్యమునకు లోనైనది కాదు. కీచకుని ప్రవృత్తిని వర్ణించుపట్ల తిక్కనయు నిట్టి జుగుప్సావహములగు వర్ణనలు గావింపలేదు. కవిత్రయమువారు పాటించిన ఔచిత్యము, సంయమనము నట్టివి. కావున ఈ పద్యము తర్వాతి కాలమున మహానుభావు లెవ్వరో చేర్చియుందురని నమ్ముచున్నాను. భాషావిషయమున నీ పద్యమును పరిశీలించినను నా యూహయే బలపడునట్లున్నది. మరియు దేశమందున్న ప్రాతప్రతులలో కొన్నింట నీ పద్యము కానరాకుండుటయు గమనింతురని నా ఆశ.

మరియొక సందర్భమును గమనింపుడు. పాండురాజునకు మునిశాపము కలుగ, కుంతి భర్తృప్రాణ రక్షణార్థమై నిరంతరమును జాగరూకత వహించి యుండినది. కాని విధి బలీయమైనది. వసంతఋతు విజృంభణసమయము, కుంతి బ్రాహ్మణభోజనమున నిమగ్నయై మాద్రీరక్షణంబునం దేమరియున్నది. యువతి, లావణ్యవతి, యగు మాద్రితో పాండురాజు వనమున క్రుమ్మరుచుండి, మనసిజరాగమత్తుడై, శాపభయమునుకూడ విస్మరించి, మాద్రి వారించుచున్నను మానక- అనర్థమునకు గురియైనాడు. కావ్యదృష్ట్యా గమనించుచో ప్రధానములైన యంశములు- మాద్రీదేవి తారుణ్య లావణ్య సంపద, రాగోద్దీపక మగు వసంతవిజృంభణము, మాద్రీ పాండురాజుల యేకాంతమునకు నవకాశము. ఇందులో మూడవది మూలమునను, ననువాదముననుకూడ సమానమే. మాద్రి సౌందర్యము మూలమున వర్ణితమైన విధము-

"తాం. వయః స్థాం, తనువాససామ్, రాజీవలోచనామ్–
దృష్ట్వా కామవశీకృతః సః తం కామం నియంతుం న శశాక
కామపరీతాత్మా సః మాద్రీం మైథునధర్మేణ బలాద్ అన్వాగచ్ఛత్."

'వయః స్థాం, తనువాససామ్ రాజీవలోచనామ్' అను మూడు విశేషణములును సాభిప్రాయగర్భితములు, గంభీరములు- ఇతిహాస దృష్ట్యా మానవ ప్రకృతిదృష్ట్యా చాలు. కాని, కావ్యదృష్ట్యా- చాలి నవికావు కావున, నన్నయ–

"చారుసువర్ణహాసి నవచంపకభూషయు సిందువారహా
రారమణీయయున్ వకుళదామవతంసయునై యపూర్వశృం
గారవిలాసలీల యెసఁగం దన ముందట నున్న మాద్రి సం
భోరుహనేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁడై."

అని మాద్రి శృంగారమూర్తిని చిత్రించినాఁడు. పాండురాజు అంగజ రాగమత్తుఁ డగుట కిట్టి అపూర్వసౌందర్యమూర్తిని, అందును నతని ప్రియపత్నిని, వసంతావిర్భావముచే వికసించియున్న ప్రకృతిమధ్య మున- ప్రత్యక్షముగ నిలుపవలసివచ్చినది. ఈ పద్యమందలి,- "తన ముందట నున్న" అను ప్రయోగమును, "కురుపుంగవుఁడు" అను ప్రయోగమును గమనింపుడు. వీనిచే గమ్యమానమగు అప్రస్తుత విషయము సహృదయైక వేద్యము. ఈ ప్రయోగములు ప్రయత్న సిద్ధములు కావు. అప్రయత్నముగ వచ్చిపడినవి- యని యెవరైన నాక్షేపించుచో- నింకను మంచిది. Unconscious art లో రామ ణీయక మెక్కువ.

ఇక– మూలమందలి వసంతవర్ణన–

"సుపుష్పితవనే కాలే కదాచి న్మధుమాధవే
భూతసమ్మోహనే రాజా సభార్యో వ్యచరద్ వనమ్,

పలాశై స్తిలకై శ్చూతై శ్చంపకైః పారిభద్రకైః
అన్యైశ్చ బహుభిర్వృక్షైః ఫలపుష్పసమృద్ధిభిః
జలస్థానై శ్చవివిధైః పద్మినీభిశ్చ శోభితమ్
పాండోర్వనం తత్ సంప్రేక్ష్య ప్రజజ్ఞే హృది మన్మథః

ఈ వస్తువునే నన్నయ చిత్రించిన విధము—

"కమ్మని లతాంతములకు మ్రొనసివచ్చు మధు-
పమ్ముల సుగీతనినదమ్ము లెసఁగెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల సుగంధిముకు
ళమ్ములను నానుచు ముద మ్మొనర వాచా
లమ్ము లగు కోకిలకులమ్ముల రవమ్ము మధు
ర మ్మగుచు విన్చె ననిశమ్ము సుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచ
యమ్ములును గింశుక వనమ్ములును నొప్పెన్."
"చందన తమాల తరులందు నగరుద్రుమము
లందుఁ గదళీవనము లందు లవలీమా
కందతరుషండములయందు ననిమీలదర
విందసరసీవనములందు వనరాజీ
కందళిత పుష్పమకరంద రసముం దగులు
చుం దనువు సౌరభము నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెందములలందురఁగ
మందమలయానిల మ మందగతి వీచెన్."

వస్తుభావములు రెండింటను సమానమే కాని, మూలమందలి రచన భావగర్భితము, మితపదపరిమితము, గంభీరము. అనువాదమందలి రచన భావోద్దీపకము మధురశబ్దవిన్యాసపోషితము, రమణీయార్థస్ఫోరకమునై రసికచిత్తస్పందకమై యున్నది. కావుననే రచనకు కావ్యత్వమబ్బినది.

"It is not what is said but how it is said - tha matters in Poetry" అని యొక విమర్శకుడు. అనగా- రచనకు కావ్యత్వమును సిద్ధింపజేయునది "చెప్పెడితీరు"- అని భావము. ఈ భావచిత్రణముయొక్క- తీరునే-దండి 'మార్గ'మని పేర్కొనియున్నాడు. దీనినే వామనుడు- కొంత మెరుగుపెట్టి 'రీతి' యని వ్యవహరించినాడు. కావ్యలక్షణములుగా దండికి గోచరించినవి. ఓజో ప్రసాద మాధుర్యాదిగుణములు-పది.

[శ్లేష - ప్రసాద - సమత - మాధుర్య - సుకుమారత-అర్థవ్యక్తి ఉదారత్వ - ఓజస్సు - కాంతి - సమాధి]

దండి కావ్యాదర్శ ప్రథమ పరిచ్ఛేదమున నెక్కువ భాగము-వైదర్భ గౌడీ మార్గముల విభేదమును ప్రతిపాదించుటకే వినియుక్తమైనది. అందును వైదర్భమార్గమునంటే దండికి అధికాదరము, శ్లేష, ప్రసాదాది దశగుణములే వైదర్భ మార్గముయొక్క ప్రాణము. గౌడ మార్గమున నివి విపర్యయములై కనిపించును.

"ఇతి వైదర్భ మార్గస్య ప్రాణా దశగుణాః స్మృతాః
తేషాం విపర్యయః ప్రాయో దృశ్యతే గౌడవర్త్మని."

దండి గుణములకీ విధమున నిచ్చిన స్థానమును వామనుడింకను దృఢముగ నొనర్చినాడు.

'కావ్యశోభాయాః కర్తారో ధర్మా గుణాః
తదతిశయహేతవస్తు అలంకారాః పూర్వే నిత్యాః'

కావ్యసౌందర్య హేతువులైన ధర్మములు గుణములు. సౌందర్యమున కతిశయము కలిగించునవి మాత్రము అలంకారములు. గుణములు కావ్యమున తప్పక ఉండదగినవి యని నుడివి. ఆ దశగుణముల నొక్కొక్కదానినీ శబ్దమునకూ, అర్థమునకూ వేర్వేరుగా అన్వయించుచూ, వివరించినాడు. ఈ ఇరువది విధములైన గుణములన్నియూ

కలిగి యొప్పునది వైదర్భరీతి. దీనిని మాత్రమే వామను డంగీకరించి-యిదియే కావ్యమునకు 'ఆత్మ'- యని నిర్ణయించినాడు.

"రీతి రాత్మా కావ్యస్య"

ఇట్లు కావ్యత్వసిద్ధి కత్యావశ్యకమైన గుణమునందే రసమునకును వామను డవకాశమును, ఉన్నత స్థానమును కల్పించి, "దీప్త రసత్వం కాంతిః" అని వివరించినాడు. వివిధములగు గుణములతో కూడిన శబ్దార్థముల సంయోగము 'రీతి'- యను భావమును,- Grace అను ఆంగ్లపద భావముతో సరిపోల్చవచ్చును, ఈ 'Grace' లేక 'రీతి'- యనునది చిత్తవికాస హేతువైన దనుటలో విప్రతిపత్తి లేదు. ఈ రీతియే నన్నయ రచనయందు ప్రధానముగ భాసించునది.

రీతికి ప్రాధాన్య మేర్పడినంతనే- శబ్దార్థముల పొందిక, నాద విన్యాసము, నడక, శయ్య- అనునవి తప్పనిసరి యగుచున్నవి. వీనిలో నేది లోపించినను 'రీతి' సిద్ధింపదు. ఒక పంక్తిలో Grace ఉన్న దనినంతనే- అంగాంగ భావసౌష్ఠవ సామరస్యములు, లావణ్యౌదార్యములు, కాంతివిలాసములు, చిత్తహేతువగు భావమాధుర్యము-ఉండక తప్పవు. కవిత్వమునకు నట్టే రీతికినీ, తద్ధేతువు లగు పై జెప్పిన గుణములకును సమవాయ సంబంధము కలదు. ఆ రీతియే నన్నయ సాధించినాడు. మచ్చున కొకటి రెండు పద్యముల నుదహరించి విరమింతును.

1. వివిధోత్తుంగ తరంగ ఘట్టనచల ద్వేలావనై లావలీ
   లవలీలుంగ లవంగ సంగతలతాలాస్యంబు లీక్షించుచున్
   ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీర దేశంబునం
   దవదాతంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్,

మాధుర్యము.

2. నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
   ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీ

రెండును రాజులందు విపరీతము గావున విప్రుశాపు నో
పండతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము ప్రగ్రహింపగన్,
(ప్రసాదగుణము.)

3. నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయం
కరదై తేయని కాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ నిండ బం
ధురధాత్రీధరతుంగ శృంగతటసందోహంబుపైఁ గప్పు దు
ర్ధర ధారాధరముక్త సంతతపయో ధారావళిం బోలుచున్,
(ఓజోగుణము.)

4. పలుకుల ముద్దునుగలికి క్రాల్గన్నుల తెలివును వలఁదచన్నులబెడంగు
నలఘు కాంచీపద స్థలముల యొప్పును లలితాననేందు మండలము
రుచియు
నళినీలకుటిల కుంతలముల కాంతియు నెలజవ్వనంబున విలసనమును
నలసభావంబునఁ బొలుపును మెలుపునుగలుగు సద్గిరికన్య తలఁచి
తలఁచి, (అక్షర రమ్యత.)



# నన్నయగారి కావ్యదృష్టి – ప్రకృతి వర్ణనలు

శ్రీ గంగిశెట్టి లక్ష్మీనారాయణ

9–12 శతాబ్దుల నడిమికాలాన్ని స్థూలంగా కావ్యలక్షణశాస్త్ర వికాసయుగంగా గుర్తించవచ్చు. భారతదేశం మొత్తంమీద కావ్య లాక్షణికతకు సంబంధించి ఆ నడిమికాలంలో పరిశోధనా, పరిశ్రమా మిన్నుముట్టాయి. కావ్యంపట్ల ఒక విస్పష్టమైన లాక్షణిక అవగాహన ఏర్పడింది. ప్రకౢప్తమైన కావ్యబంధానికి సంబంధించిన శిల్పరీతి సంపూర్ణంగా వికసించింది. ఇతిహాస-పురాణ-శాస్త్ర గ్రంథాలకంటే కావ్య బంధం ఎలా విలక్షణమైంది అన్న అంశం గురించీ, తదాత్మమైన కాంతాసమ్మిత ప్రబోధ సౌందర్యం గురించీ, తద్రూప విలాసకారకమైన నిర్మాణ రామణీయకాన్ని గురించీ, సర్వలక్షణ సంపన్నత గురించీ సమగ్రమైన చర్చ జరిగింది.

ఈ యుగం తొలి గుమ్మంవద్ద నిల్చిన వేంగిపంపడు భారతాన్ని దేశభాష అయిన కన్నడంలోకి తెస్తూ, 'విక్రమార్జున విజయ' అనే పదునాలుగు ఆశ్వాసాల రమణీయ కావ్యబంధంగా అవతరింపచేశాడు. సమకాలీన చైతన్యస్ఫూర్తి అయిన కావ్యప్రజ్ఞను నిరూపించినాడు. అయితే అదే యుగం మలిగుమ్మానికి ఒకడుగు ముందు నిల్చిన వేంగి నన్నయ కావ్యరీతిని ఎంతవరకు సమాదరించినాడు ? అనేది ప్రశ్న.

"ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మవిదులు వేదాంతమనియు... కవివృషభులు మహాకావ్యమనియు... విశ్వజనీనమై పరగుచుండ" మహాభారతాన్ని వేదవ్యాసుడు నిర్మించాడని నన్నయ్యగారు పేర్కొన్నారు. ఇది మహాభారతంపట్ల నన్నయ్యగారు చేసిన వ్యాఖ్యానం. ఆయన దృష్టిలో భారతం ఒక బృహదర్థ గ్రంథం. 'విశ్వజనీనత-బృహత్తత' అనేవి భారత రచనలోని మూలసూత్రాలు.

కావ్యత్వం అనేదికూడా ఆ బృహత్తతలో ఒక భాగమే. అయితే అన్నిటికీ సమానమైన ప్రాధాన్యం వుంది. భారతరచయితకు అన్నిటినీ సమంగా నిర్వహించాల్సిన ఆవశ్యకం వుంది.

పాత్రల మనోధర్మ చిత్రణలోనూ, మూలంలో లేని కొత్త మెరుపులను సంతరించడంలోనూ ప్రభావవంతమైన పలుకులతీరుతో దంసర్భదీప్తిని కలిగించడంలోనూ నన్నయ పాటించిన కావ్యశిల్పాన్ని ప్రగాఢంగా పరిశోధకులు ఇదివరకూ పరిశీలించినారు. కాని కావ్య ప్రజ్ఞను అరయగల విశేషాలన్నిటిగుండా సంపూర్ణ పరిశీలన ఇంకా చేయలేదనవచ్చు. అలాటి విశేషాలలో ప్రకృతి వర్ణనలుకూడా ఒక టనడం సాహసం కాదు.

కావ్యాన్ని సహజ సుందరంగా తీరుస్తున్నప్పుడు సహజతనూ, సౌందర్యాన్నీ ఇనుమడింపచేయడానికి ప్రకృతి వర్ణనలు ఉపకరిస్తాయి. కావ్యశిల్పంలో ఒక భాగంగా అనుకూలిస్తాయి. రానురాను లాక్షణికత వెర్రివేషాలు వేసి, కవి సమయాల గోదాలో కవులు [illegible] కుస్తీ పట్లకు ఉపక్రమించినప్పుడు ప్రకృతి వర్ణనాలకున్న ప్రాణవంత స్థానం పరాస్తమైంది కాని, మొదట మొదట అలాకాదు. కేవలం వస్తు పరంగా సాగిపోతున్న రచనలో ఆత్మీయమైన భావనలను రమ్యమైన తన ప్రతిభా చమత్కారాలనూ ప్రవేశపెట్టడానికీ, సహజ సౌందర్య శోభను సమధికం చేయడానికీ ప్రధానమైన శిల్పోపకరణంగా భావించి వర్ణనలు చేసేవారు కావ్యశోభలో వీటి ప్రాధాన్యం గుర్తించే, లాక్షణికులు అష్టాదశ వర్ణనలలో ప్రకృతిపరమైన వర్ణనలకు పెద్ద పీట వేసినారు. ప్రకృతిని వర్ణిస్తున్నప్పుడు కవి ప్రదర్శించిన భావస్ఫూర్తి వాటిని కథకు అనువుగా వాడుకొన్న పద్ధతి, కథాంశాలకు పోషకంగా వాటిని స్వీకరించిన తీరూ, అందులో ప్రదర్శించిన భావుకతా, స్ఫూర్తి–ఇవన్నీ ఆ కవియొక్క కావ్యదృష్టిని గణించడంలో బాగా ఉపకరిస్తాయి.

కావ్యతా కారకలక్షణాలలో వర్ణనలు ఒక ముఖ్య విభాగమనీ, ఉత్తమ కావ్యం అష్టాదశవర్ణనా భరితమైందని లాక్షణికులు భావించి, ఆ వర్ణనలను లెక్కగట్టడానికి ప్రయత్నించారు. అష్టాదశసంఖ్య కొంత మంది చేతుల్లో ఇంకో మూడో భాగం కలుపుకున్నదికూడాను. ఆ సంఖ్యల వివరాలు ఎలాగున్నా. లాక్షణికులు కావ్యంలో ఉండతగ్గ వర్ణనలంటూ సూచించిన వాటిల్లో నన్నయ భారతానువాదంలోపల ఈ క్రింది వర్ణనలు మనకు కనిపిస్తాయి. అవి సముద్ర, సంధ్యా, వన, తపో, యుద్ధ, పుత్రోదయ, ఋతు, పుర, సరోవర, ఉద్వాహ, గిరి, శృంగ, పుష్పాపచయ, జలకేళీ, సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ, రత, క్షితి, మధు, విరహ, దూత్య, మంత్రగతులు. వీటిలో ప్రకృతికి సంబంధించిన వర్ణనలను మాత్రము ఆశ్రయించి, నన్నయగారి కావ్యదృష్టిని అవగాహన చేసికొనడాని కొక పాక్షిక ప్రయత్నం ఈ వ్యాసంలో జరుగుతుంది.

నన్నయ చాలా మితంగా మాత్రమే ప్రకృతి వర్ణనలను చేసినారు. సందర్భానికి శోభను తెస్తాయన్న సందర్భంలోనే చాలా సంక్షేపంగా మాత్రం చేసి ఊరుకొన్నాడు. కావ్యరమణీయతను సంతరించే కొన్ని సన్నివేశాల్లో ప్రకృతి వర్ణనలకు చక్కటి అవకాశ మున్నప్పటికీ చేయలేదు. శిల్పజ్ఞత కలిగిన మరి ఏ ఇతర సామాన్యకవి అయినా చేసిఉండేవాడేమో అన్న అనుమానంకూడా వస్తుంది. చేసిన సందర్భాల్లోకూడా, కేవలం దృశ్యమాన ప్రకృతినే రమ్యమైన శబ్దాలంకారాలతో వర్ణించినాడు. కవిలోని భావుకతకూ, ఊహాచమత్కారానికి ఎక్కువ అవకాశమిచ్చే భావ్యప్రకృతి వర్ణన చాలా తక్కువ మనోహరమైన ఉపమలుకానీ, రూపకాలుకాని ప్రదర్శించినపట్లు, మొత్తంమీద లెక్కగట్టి చూస్తే చాలా తక్కువగా కనిపిస్తాయి. అయితే ఆ రెండు మూడు పట్లే తర్వాతి ప్రబంధరీతికి మేలు బంతుల్లాగా భాసిస్తాయి.

ఆయన స్వాభావికతాప్రియుడే కాని, కాల్పనికతాప్రియుడు కాడు. ప్రకృతి వర్ణన సందర్భాల్లో కేవలం నిసర్గసౌందర్యాన్ని ఛాయాచిత్ర సదృశంగా పదగ్రస్థం చేయడం కాకుండా, తన నేత్రంతో దర్శించి స్వప్రతిభాచోదిత కల్పనారమ్యతను ఆహ్లాదకరంగా మేళవించి, దృశ్య జగత్తుకంటె ఊర్ధ్వగతమైన భావ్యజగత్తును అక్షరబద్ధం చేయుట కవి లోకంలోని సామాన్య మర్యాద. అలాటి దానిని నన్నయ ఎక్కువగా పాటించలేదు. చాలా మితంగా మాత్రమే, స్వాభావికతా ప్రధానంగా మాత్రమే సాగినాడు. మూలంలో అధిక భాగం ఈ వర్ణనలు స్వాభావికపరంగా వుండడంతో, ఆ మొత్తశే అనువాదంలోకూడా అవలంబించాడేమో అని అనుమానించే అవకాశం వుంది. అక్కడక్కొద్ది విపులంగా ఉన్నవాటిని కూడా సంక్షిప్తపరిచాడు. అయితే తన ప్రతిభతో మరింత తేజోవంతం చేసిన సన్నివేశాలే అధికం. కావ్య శోభకు అత్యావశ్యకమని ఎంచిన సందర్భాల్లో అమూలకమైన వర్ణనలు కూడా చేసినాడు; అయితే అందులోని ప్రధాన లక్షణాలు- స్వాభావికత, సంక్షిప్తత.

ఇంకొక విశేషం వుంది— అది, సభాపర్వాలను దాటి, అరణ్య పర్వ రచనకు వచ్చేసరికి ఆయన దృష్టిలో విలక్షణమైన మార్పు గోచరిస్తుంది. మొదటి రెండు పర్వాల్లోలాగా కాకుండా అరణ్య పర్వంలో అవకాశమున్నప్పుడల్లా ప్రకృతి వర్ణనలను చక్కగా చేసినాడు. కేవలం స్వాభావికతను మాత్రమే తన దృక్కోణంగా ఎంచుకోకుండా, స్వాభావికతకు మెరుగులు దిద్దే అతిరమ్యమైన ఊహాలను చొప్పించినాడు. శబ్దాలంకారంతో నెట్టివేయడం కాకుండా, చక్కని చమత్కాలతో హృదయాకర్షకంగా తీర్చిదిద్దాడు. అదివరకు సంక్షిప్తతనే ప్రధానంగా ఎందుకొన్న నన్నయ్య, ప్రకృతివర్ణన విషయంలో విపులతను కూడా స్వీకరించి తరువాతి ప్రబంధ యుగరీతికి తొలి బీజాలను ప్రదర్శించినాడు. ఒక్కొక్కసారి అది, సభాపర్వాల్లో అలాగ

వున్న నన్నయ్యేనా ఈ వర్ణనలు చేసింది? లేక ఏ ప్రబంధ పరమేశ్వరుని యుగంలోనో ఇవి ప్రక్షిప్తాలయ్యాయా? అని అనుమానం రావడం కూడా కద్దు. ఆదికవి వాల్మీకిని తలపించే ఎత్తుగడలతో అక్కడక్కడ ప్రకృతి వర్ణనలు నడవడాన్ని మనం స్పష్టంగా గుర్తించగలము. ప్రకృతి వర్ణనల పరిధిలో నిలిచి ఒక విషయాన్ని తేల్చి చెప్పాలంటే, అరణ్యపర్వ రచనకు వచ్చేవరకు నన్నయ్యలో కావ్యదృష్టి, శిల్పదృష్టి ఇనుమడించాయని పేర్కొనవలసివుంది. మొదట్లో కావ్యదృష్టి ఆయన ఆశించిన బృహత్ప్రయోజకాలలో ఒక భాగం మాత్రమే. కాని ఇక్కడ అది ఒక వీసము పై ఎత్తుకు చేరింది. ఇది రానురాను వచ్చిన సహజపరిణామమా? లేక అరణ్యపర్వ మనేటప్పటికి ప్రకృతి వర్ణనలకు అధిక అవకాశం ఉన్నది కనుక అంతదూరం ఆలోచించవలసిన అవసరం లేదని భావించడమా? అనేది కొంత ఆలోచించవలసిన ప్రశ్న. మొదటిది తార్కిక సహజము కనుక, కొంత ఆమోదయోగ్యమైనదే కాని, అంతకంటె మించి నన్నయ్యగారే పునరాలోచించి కావ్యదృష్టిని సమధికపరచి వుండవచ్చు- అనడం మరి కొంత సబబుగా వుంటుందేమో. రెండవది తర్కరీత్యా తలెత్తినప్పటికీ, మొదటి రెండు పర్వాలలోని కొన్ని విశేషాలను వికాసదృక్పథంతో సజావుగా గమనిస్తే ఈ రెండవ కారణం తేలిపోకతప్పదు. క్రమంగా మొదటినుండి ఆయన చేసిన ప్రకృతి వర్ణనలను గమనిద్దాము.

ఆదిపర్వం ప్రథమాశ్వాసంలో ప్రకృతివర్ణనలకు ఎక్కడా ఎడమీయక పోయినప్పటికీ, ప్రకృత్యేతర వస్తువర్ణనలో సాదృశ్యార్థము ప్రకృతిని ఉపలక్షించినప్పటికీ దానినికూడా ప్రకృతి వర్ణనల క్రింద పరిశీలించవచ్చునంటూ ఈ వర్ణనల పరిధిని కొంత విస్తృతపరిస్తే మహాభారతములోని సర్వపర్వవిశేషాలను ఆదిలో సంక్షేపంగా సమీక్షించి, తత్ప్రశస్త్యాన్ని ప్రశంసించే సందర్భంలో సాదృశ్యప్రాయంగా ప్రకృతిని వాడుకొన్న సందర్భం వుంది." తారకా సముదాయముల

నెన్నను... బుద్ధి బహు విక్రమమున దుర్గమార్థ జలగాంభ భారత భారతీ సముద్రము దఱియంగ నీదను విధాత్రునకైనను నేరబోలునే. [1-19 [1]]

"అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యానజా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై" (1-66)

పై పద్యంలో తెచ్చిన పోలికలవల్ల ఉత్పన్నమైన గాంభీర్యతనూ, ఔచిత్యాన్నీ, రామణీయకాన్ని రసజ్ఞులు ఎందరో హృదయాలు సేవితమే కనుక మళ్ళీ ఉగ్గడించడం అటుంచి, గుర్తించవల్సిన అంశం ఒకటుంది. బహుభాషల, బహువిధముల భారతాన్ని వినిగోష్ఠిని రాజరాజ నరేంద్రుడు నన్నయ్యనురావించి తన అభిమతాన్ని వినిపించి, తెలుగులో రచింపమని అభ్యర్థింపగా, ఆ కవివరుడు అనిన మొదటిమాటకు సంబంధించిన పద్యభాగం మొదట పేర్కొనిన 1–19 మాటలు కాగా, భారతాన్ని చెప్పడం ప్రారంభించి, సర్వసర్గాంతమూ చేసి ముగింపుగా అన్నమాట 1–66 పద్యం. మొదట్లోనూ సాదృశ్యానికి చక్కని ప్రకృతి. చివరా, సాదృశ్యానికి చక్కని ప్రకృతి. సాదృశ్యం చెప్పాలంటే ఒక ప్రకృతినే స్మరించాల్సిన పనిలేదుకదా! అన్నిటికంటే ప్రకృతి నిండుగా, బహుళోపయోగకరంగా వుండటం వేరుమాట. సాదృశ్యానికీ, సుప్త చేతనలోని అభిరుచికీ అత్యంత సన్నిహితమైన సంబంధం వుంది.[2] కీలకమైన పై రెండు పద్యాలు, అంటే మొదలు పెడుతున్నప్పుడూ, ముగిస్తున్నప్పుడూ ఒకే విషయంనుంచి సాదృశ్యం తేవడం జరిగింది కనక, ఆ సాదృశ్య నిరూపిత విషయమంటే కర్తకు అధిక ప్రీతి అని చెప్పడం సాహసమూ కాదు. అశాస్త్రీయమూ కాదు. అలాగే ఆ పద్యలక్షణ విశ్లేషణ వలన గాంభీర్యత, ఉదాత్తత

అతని వర్ణనల్లో అధికంగా దర్శన మిస్తుందని తలపోయడంకూడా అలాంక్షణికం కాదు.

పై సన్నివేశం మించి ప్రథమశ్వాసంలో ప్రకృతి ప్రశంస మరెక్కడా కనిపించదు. చేయడానికి అనువైన చోటులుకూడా లేవు. కాదంటే కావ్యరమ్యత కలిగిన ఉదంకోపాఖ్యానములో పుర, జలాశయ, ఉదధివంటి వర్ణనలు, ప్రమద్వరారురు గాథలో శృంగార రస దోహదములైన ఒకటి రెండు ప్రకృతి వర్ణనలు చేయుటకు చేయ వచ్చును కానీ, అది కేవల కావ్యశిల్పమగ్నులైన కవులకు సరిపోయిన సరిపోవచ్చును గానీ, పౌరాణిక దృష్టితో బృహదర్థ సంభావితంగా భారతాన్ని నడిపిస్తున్న నన్నయ్యకు సరిపోవు. కథను నిలిపి నడిపే అలాటి వర్ణనలు నన్నయ్యకు అభిమాన విషయాలు కావు.

ప్రకృతి వర్ణనగా విస్పష్టంగా పట్టిచ్చే మొదటి వర్ణన మనకు ద్వితీయాశ్వాసంలో ప్రప్రథమంగా కనిపిస్తుంది. అది సముద్రవర్ణ. కద్రువ వినతలు కడలి తీరానికి వినోదార్థంగా విహరింపవచ్చి, ఒక అశ్వాన్ని చూస్తారు. ఇక్కడ కడలి వర్ణనకు ఎంతో అనుకూలమైన సందర్భము. దాన్ని మూలంకంటె మించిన మెరుగుల్తోనన్నయ్య వర్ణి ంచాడు కూడా. మెరుగులు చూపినంత మాత్రాన,తన ప్రధాన లక్షణ మైన సంక్షిప్తతను పోనాడలేదు. ఈ వర్ణనకు మరొక విధంగాకూడా గొప్ప ప్రత్యేకత వుంది. ముందు వర్ణనను పరికిద్దాము.

"అట్టియెడ గద్రువయు వినతయు వినోదార్థంబు విహరించు వారు కరిమకర నికరాఘాత జాత వాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని నుద్యా నవనంబునుం బోలె బహువిద్రుమలతాలంకృతబైన దాని, నాటక ప్రయోగంబునుం బోలె ఘన రస పాత్ర శోభిత రంగ రమ్యంబైన దాని దివంబునుం బోలె సహిమకర భరితంబైన దాని మఱియు [2-27]

అవారత జలవాసముచే మునులు పొందు శీతపీడను తొలగించగలిగే బాడబ శిఖలచే సముత్పన్నమగుచున్నదట. భావనేత్రంతో దర్శించి వర్ణించగలిగే కల్పనా సౌందర్య భరితమైన వర్ణనా ప్రజ్ఞకు ఇదొక తార్కాణం. ఆ తర్వాతి అరపద్యంలో శైలి విషయంగా ప్రాబంధిక మార్గానికి మార్గదర్శకమైన ప్రత్యేకత వుంది. ప్రబంధిక మార్గమంటే సుందర కావ్యమార్గమనే లెక్క. పై ప్రత్యేకతల మూలంగా ఈ సముద్ర వర్ణన, నన్నయ్యగారి ప్రకృతి వర్ణనల దృష్టినిగురించిన్థూలంగా పేర్కొన్న పరిచయ వాక్యాలకు అపవాదంగా నిలుస్తుంది. అందుకే ఇది విలక్షణమైన వర్ణన అంటూ నాతిదీర్ఘంగా పేర్కొనడం జరిగింది. "నన్నయ ఇందు శబ్దార్థాలంకార శోభితమగు రచన గావించి, భావ్యాంధ్రశయ్యా సౌభాగ్యమునకు మార్గదర్శకుడయ్యెను"[3] అంటూ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారు పేర్కొన్న మాట పాక్షికంగా మాత్రమే యథార్థం. కేవలం శయ్యా సౌభాగ్యానికే కాదు ; రకరకాల నగిషీపను లోలికించే ప్రాబంధిక శిల్ప సౌభాగ్యానికే మార్గదర్శకుడయ్యాడు. బృహదర్థ సంధాయిగా భారత రచన చేస్తున్నప్పటికీ అందులో కావ్యదృష్టి ఎంత స్వాయం సంపూర్ణంగా వుందో చాటిచెప్పడానికి ప్రకృతి వర్ణనల పరిధిలో ఇదొక ఉత్కృష్ట ఉదాహరణ.

ద్వితీయాశ్వాసములో ఇది తప్ప మరొక వర్ణన కవకాశము తీసికొనలేదు. కథలో బిగింపుకానిచోట ప్రత్యేక అవకాశమును కల్పించడం ఆయనకు అభిమతము కాదు.

ఇక తృతీయాశ్వాసములో పేరుపెట్టి ఇదొక ప్రకృతి వర్ణన అని చెప్పడానికి ఏది లేకపోయినా కచదేవయానిలోని ఒక సన్నివేశం గమనించతగింది అడవికి పోయిన కచుడు ప్రొద్దుగూకినప్పటికీ తిరిగి రాకపోయేసరికి తిరిగి రాకపోయేసరికి దేవయాని కలతపడుతుంది తండ్రికి చెప్పాలి నేరుగా చెబితే ఏమంటాడో, అందుకే ముందు ఆ సాయం సంధ్యను వర్ణిస్తూ ఇంతవేళయినా ఇంకా కచుడు తిరిగి రాలేదు

అంటుంది అయినా తండ్రికి అన్యదా ఏమనిపిస్తుందో అన్న భయం కొద్దీ ఏ "మృగరాక్షస పన్నగ బాధ నొందెనో" అంటూ ముగి స్తుంది. శిష్యుల యోగక్షేమములు కులపతి బాధ్యత కదా! కనుక దాన్ని గుర్తుచేయడం వరకే కులపతి కుమార్తెగా తన బాధ్యత అంటూ తలపింపజేస్తుంది. ఈ సందర్భంలోని ఈ క్రింది పద్యం తెలుగు సాహిత్యంలోనే సుప్రసిద్ధమైంది.

ఉ. వాడి మయూఖముల్ గలుగు వాడ పరాంబుధి గ్రుంకె ధేనువుల్
నేడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోడిగ వేల్వగా బడియె బ్రొద్దున్ బోయె గచుండు నేనియున్
రాడు వనంబులోన మృగ రాక్షస పన్నగ బాధ నొందెనో
(3-112)

దీన్ని ప్రాయికంగా సంధ్యావర్ణన క్రిందనే భావించవచ్చు. కథా సందర్భంతో ముడిపడి, కేవలం కథాకథనంలో భాగంగా మాత్రమే సాగిన సంధ్యావర్ణన ఇంకొకటిలాంటిది కనిపించదు. ఆ సందర్భంలో చుట్టుతిరిగి చెప్పవచ్చిన దేవయాని మనస్తత్వాన్నంతటినీ పద్యపు నడక ప్రతీకప్రాయమై సూచిస్తున్నది. నన్నయ కతిప్రియములైన స్వాభావికత, సంక్షిప్తత గుణాలను చక్కగా విశదపరుస్తున్నది. ఇది ప్రాయికంగా మూలానుసారిగా సాగినదే అయినా నన్నయ్య మూలా నికి మెరుగులు దిద్దుతూ ఈ పద్యాన్ని ఇంత అందంగా తయారు చేశా డన్నది మరువరాదు.

ఈ ఆశ్వాసములోనే దేవయాని శర్మిష్ఠాది సఖులతో వనకేళికి పోయినపుడు 'విమల జల ప్రవాహ విలసితంబైన యొక్క సెలయేటి కెలన నవ వికచ కుసుమ సుకుమార కోరక నికర భరిత సహకార కురవక వకుళాశోక తమాల సాలచ్ఛాయా శీతల సికతా తలంబులోన' (3-155) అంటూ ఒక దీర్ఘ సమాసాన్ని హృద్యమైన దానిని నడిపి

స్తారు. కాని అది ప్రత్యేకించి గమనించి ఆనంద పడాల్సిన ప్రకృతి వర్ణన కాదు.

ఈ మాత్రము తప్ప ప్రకృతి వర్ణనల పేరిట ప్రత్యేక గమనీయములైన వర్ణనలు ఈ ఆశ్వాసమున లేవు. కావ్యతా సిద్ధిని కలిగించే అష్టాదశ వర్ణనలలో చేయటానికి మిక్కిలి అనువైన సందర్భాలు కలిగినప్పటికి నన్నయ్య వాటి జోలికిపోడు. ఉదాహరణకు పైన పేర్కొన్న సందర్భములోనే పై వచనమునందే "ఇట్లరిగి దేయాని యవ్వనంబున గన్యకలుం దానును బుష్పాపచయంబు సేయుచు విమల జలప్రవాహ." అంటూ పుష్పాచయంబు సేయుచు అని ఒక్క మాట అంటాడే కాని, దాన్ని రమ్యంగా ఒక్క పద్యంలోనైనా వర్ణించడు. అలాగే అంతకు మునుపు శర్మిష్ఠ గౌరవము తగ్గక మునుపు ఆమెతోను, ఆమె పరిజనము తోనూ కలిసి దేవయాని జలక్రీడలకు పోయిన సన్నివేశంలో 'తమ తమ ప్రధానంబులుపెట్టి జలక్రీడలాడు చున్నవవి' అంటూ మాటను పేర్కొంటాడే తప్ప ఆటను వర్ణించడు. జలక్రీడా పుష్పాపచయములకు పై రెండూ అయువు పట్లగు చోట్లు. చక్కటి సందర్భ శుద్ధి కలిగిన పట్లు. కాని ముక్కుసూటిగా కథను చెప్పటలో మాత్రము నిమగ్నమైన పౌరాణిక హృదయము, కథా వేగమునకు భంజకములనియేమో పై వర్ణనలనుచేయదు. అట్లే ఈ ఆశ్వాసాదిలోనే ఉపరిచరవసు మహారాజ వృత్తాంతము వస్తుంది. ఆయన 'మృగయావినోదార్థమడవికిజని' అని ఒక మాట నలా పేర్కొని ఆ కలి విశేషాలకు సాగిపోతాడు. కాని ఆగి మగృయావర్ణన చేయడు. అది అష్టాదశ వర్ణనలలో ఒకటైనా సరే అవకాశమున్న చోటెల్లాచేస్తే తెలుగు భారతం మరెంత విస్తృతమై వుండెడిదో ఆ విస్తృతిని సంక్షిప్తపరచుటే నన్నయ ఆశయాలలో ఒకటి కనుక అలాంటి అవకాశాలను వదలిపెట్టాడు. తన కావ్యదృష్టిని కథా కథనంలో ఇంకో విధంగా ప్రదర్శిస్తాడు. అయితే తిక్కాతి

రోజుల్లో భట్టుమూర్తి చేతిలోబడి మనోహర కావ్యమై నిల్చిన వసు చరిత్ర వృత్తాంతము ప్రకృతి వర్ణనలకు ఒక క్రొత్త రూపాన్నే సంత రించిన శుక్తిమతీ గాథ. ఇందులోనే వస్తాయి. దీన్నంతా అతిసాధార ణంగా, పౌరాణిక దృక్పథంతోనే ఒక వచనంలో చెప్పి ముగిస్తాడు కాని, నవనవోన్మేషశీలమైన ప్రతిభకు, చక్కటి ప్రతిమా వ్యాపారా నికి అవకాశం వున్న ఈ సన్నివేశంలో ఎలాటి చమత్కారాన్ని అంద మైన వర్ణనా నైపుణ్యాన్ని కవి ప్రదర్శించడు. ఇందు మంచి సన్ని వేశాన్ని అలా అతిసామాన్యంగా వదలడం, ఎంత కథా కథన వేశనిమ గ్నుడైనా, కావ్య శిల్ప మధ్య విదునకు న్యాయమైన విషయంకాదు.

మృగయా వర్ణనను చతుర్థాశ్వాసంలో దుష్యంతుని కథలో ఆ రాజ్యం మృగయా విహారాన్ని వర్ణిస్తూ మూడు నాలుగు పద్యా లలో చేశాడు. ఛాయచిత్రదృశ వర్ణనే కాని, మనోజ్ఞమైనది కాదు. పోతూ పోతూ దుష్యంతుడు తపోవనంలో ప్రవేశిస్తాడు. ద్వితీయాశ్వా సంలో సముద్ర వర్ణన తర్వాత అంతకంటె భిన్నంగా ఆగి ఇది ప్రకృతి వర్ణన సుమా అంటూ ప్రత్యేక దృష్టితోచేసిన వర్ణన ఇది. దుష్యం తుని చూసి వనలతాంగనలు మందపవన సహాయంతో కుసుమాక్షు తలు వర్షించినాడు. శారీరక శ్రమను తీరగా నదీ పవనాలు వీచినాయి. తర్వాత

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవులనిమ్మగు తావుల జొంపములం
బూచిన మంచి యశోకములన్ సురపొన్నలఁబొన్నల గేదగులం
గాచి బెడంగుగ బండినయా సహకారములం గదళీ తతులం
జూచుచు వీనుల కింపెసగన్ వినుచున్ శుకకోకిల సుస్వరముల్
(4—20)

సుతి మెత్తని పదాలతో, మొదటి మారుగా మితరీతిని ప్రక్కకుపెట్టి కించిత్ప్రపంచన ప్రాయంగా చేస్తున్న వన వర్ణనలో ఇది నాలుగవ

పద్యము. అన్నిటికంటె సుతిమెత్తని పద్యము. అందుకు ఈడుగా మాలిని వృత్తములోని రచన. అయితే ఇక్కడమళ్ళీ గమనించాల్సింది-ఏకల్పనా చమత్కారాలనూ తొణికించకుండా సాగించిన స్వాభావిక రచన. ఉన్న వాతావరణాన్ని ఉన్నట్లుగానే ఎదల ముందు నిలిపి హాయిని కల్పించ డమే ఆయన ఆశయం. ఇలాంటి సమయాలలో అనిపిస్తుంది. ఆయన లాక్షణికతలో వామన్న సుతావలంబిపమో అని దాన్ని ప్రత్యేకంగా గమనించాలి. ఆ తర్వాతి కవిరాజ విరాజితంలో తపోవన గాంభీర్యాన్ని సాక్షాత్కరింప చేసే ఒక గంభీర సమాస బంధురమైన రచన. పుణ్య నదీతీరంలోని ఆ గాంభీర్యాన్ని ఇనుమడింప చేస్తూ చిత్రించే మరొక పెద్ద వచనం. మూలంలో ప్రకృతి రామణీయకాన్ని చిత్రిస్తూవున్న వర్ణన, ఇక్కడ శాస్త్ర గాంభీర్యాన్ని చిత్రిస్తూన్న వర్ణనగా మారి పోయింది. ఆ ధార్మిక గాంభీర్యాన్ని మరింత హృదయంగమం చేసేది, ఆ పైని సుప్రసిద్ధ ఋష్యాశ్రమ వర్ణన- 'శ్రవణ సుఖంబుగా సామ గానంబులు చదివెడు శుకముల చదువు దగిలి' - మొదలుగా నడచిన పద్యం. ఇంత వివరంగా, (4-14 లోని చివరి భాగంతో మొదలుపెట్టి 4-28 వరకు) మూలంలో లేని క్రొత్త మెరుపులను నింపుతూ ఈ మొదటి రెండు పర్వాలలో నన్నయ్య మరెక్కడా వర్ణించలేదు. దీనికి కారణము ఆ సామగానముల చదువు దగిలిన శుకము ఆయన హృదయ మగుటః ధార్మికత, తపోవనాశ్రిత నైర్మల్యత, ఋషిజన జీవనావశ్య కత వంటి వాని పట్ల ఆయన కున్న ప్రగాఢానురక్తి తజ్జనిత పారవ శ్యము మూలముననే ఆ విస్తృత వర్ణన కవకాశ మేర్పడినది. ఆ తర్వాతి కవుల కెందరికో ఒజ్జబంతిగా నిలిచింది.

అంతే, ఆ ధార్మికత పట్టులో మాత్రం పెంచి వర్ణించడం తప్పితే ఇంకెక్కడా ప్రకతి వర్ణనలకు అవకాశం తీసికోడు. నదీత్యాది వర్ణనల కనువగు సందర్భము లున్నప్పటికి చేయడు. అట్లే అష్టాదశ వర్ణనలోనివగు వివాహ-యుద్ధ-వర్ణనలకు చక్కని సందర్భములున్న

వాటిని నామమాత్రంగా తడిమి విడుస్తాడు. సాల్వుడు భీష్మునితో యుద్ధముచేసే సన్నివేశాన్ని రెండు మూడు పద్యాలలో చెప్పినా మూలానుసారంగా సంక్షిప్తతను సాగిస్తూ 'శత సంఖ్యయు, శత సహస్ర సంఖ్యయును, శతాయుత సంఖ్యయుగా... ఏసె వాడి శరంబుల్" అని లెక్కలు చెప్తాడుగానీ రసవంతమగు యుద్ధ వర్ణనగా దీర్చడు. ఇదంతా పౌరాణిక దృష్టి పెద్ద చేయి అయినప్పటి వాటము.

అ ధ సూ చి క లు :

1. ఉదాహరణలకు వావిళ్ళవారి 1925 ప్రతిని అనుసరించడం జరుగుతున్నది.

2. డా॥ ఎస్. ఎల్. భైరప్పగారి 'Truth and Beauty' అనే సిద్ధాంత వ్యాసంలో 'సాదృశ్య'ను గురించి చాలా ఆసక్తికరమైన చర్చ ఉంది.

3. వ్యాస భారతము : నన్నయ పరిష్కారము (1979) పుట 672.

# నన్నయగారి శ్లేషసరణి

## శ్రీ వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి

నన్నయగారి శ్లేషయనుటతోడనే నన్న యేమి ? శ్లేష యేమి? ప్రసన్నత ముఖ్యాశయముగాగల నన్నయ కర్థక్లేశమును కల్గించు శ్లేష యందు ప్రీతియెట్లుండును? నన్నయ శ్లేషాలంకార ప్రియుడు కాదే! అని అసాంగత్యము స్ఫురించును. నన్నయ శ్లేషాలంకారమును బహు అరుదుగా వాడెను. సభాపర్వమున 'యదువృష్టి భోజకు కురాంధక వాహినియుం గలంగె' అనుచో 'వాహిని' అనుపదము శ్లిష్టముగా ప్రయుక్తమైనది. ఇట్టి శ్లేషలు నన్నయలో ప్రభాత నక్షత్రములవలె గాన్పించును. 'ప్రసన్న కథా కవితార్థయుక్తి' ముఖ్యసాధనగాగల నన్నయకు శ్లేషయనిన కిట్టదనియే చెప్పవలెను. అయితే యిచట నుద్దేశింపబడినది శ్లేషాలంకారముకాదు. మరేమన 'శ్లేష' యను కావ్యగుణము. కావ్యగుణములలో శ్లేష మొట్టమొదటిది.

శ్లేషయనగా 'బహూనాంపదానాం ఏకపదవ భాసమానత్వం శ్లేషః' అని దీని నిర్వచనము చేయబడినది. అనేకములగు విడిపదములు కూడ పద్యమున కూర్చబడినపుడు, ఒకే పదంవలె భాసించడము శ్లేష అన్న మాట. అనగా బహుపదాలను ఒక సమాసం చేయడమన్ని భావంకాదు. సమాసంలో అనేక పదాలు సమస్తమై ఏక పదమే అయిపోతవి. ఏక పదమయిపోవడం కాక ఏకం పదంవలె భాసించడమే శ్లేష అన్నమాట. సమాసములు ప్రతి కవియు కూర్చుచుండును. దీర్ఘ సమాసముల వాడిన ప్రతికవియు శ్లేష గుణం వాడినట్లుకాదు. ఒక పద్యంలో పదో, పదిహేనో, ఇరవైయో పదాలుండవచ్చును. ఇవన్నియు మొత్తం మీద చదివినప్పుడు గొలుసుకట్టుగాసాగి, ఏక పదంవలె భాసించవలె. రైలుబండికి పదిపెట్టెలుండవచ్చును. ఒకపెట్టెకు

మఱియొక పెట్టెకు మధ్యను గొలుసుతో అతుకుండును. రెండింటికి మధ్య కొంత ఖాళీయుండును. అయినను కొంత దూరమునుండి చూచి నప్పుడు పెట్టెకు—పెట్టెకు మధ్యగల అతుకుగాని, కాన్పించక పదిపె ట్టెలూ ఒకే పెట్టెవలె ఒకరైలు రూపంలో భాసిస్తవి. అట్లే పదానికి, పదానికి మధ్య కవి సంధిచేసినను మొత్తముపై చదివినపు డి సంధులు కాన్పించక అంతరించిపోయి యేక పదముగా భాసించవలెను. పద్య మెత్తుకొనగనే మధ్యన కుంటుపడుట లేకుండ చర చరా సాగి, అంతు చేరుకొనవలెను. ఇట్టిది శ్లేషయనిపించుకొనును. కవులందరు పద్యములో పదములను సంధులతో నతుకుదురు; బహు పదములను సమాసముగా కూర్తురు. అయినను నీయతుకులు అతుకులుగా గన్పించి, పదములు విడిపదములుగనే గోచరించి పోవును. ఆదినుండి యంతమువరకు పద్యము సాఫీగా సాగిపోవదు. నన్నయలో విశేషమేమన ఈ అతుకులు – కూర్పులు అరుంధతి నక్షత్రంవలె స్థూల దృష్టికి గాన్పిం చవు. ప్రయత్న దృష్టములైనపుడే యవి గోచరించును. శ్లేష అనగా శ్లిష్టత–అన్యోన్యత. పదములకీ యన్యోన్యత నన్నయ కవితలో బాగుగ కుదురు కొనును. నన్నయకు అక్షరమైత్రి, పదబంధము తెలిసినట్లింకెవ్వరికిని తెలియదనిపించును. ఈ విషయమున నన్నయ సరిహద్దులకు రాదగినవాడు పెద్దన మాత్రమే. ఎ అక్షరమునకే యక్ష రముతో మైత్రియుండునో, ఏ అక్షరమునుండి – ఏ అక్షరమునకు గతి సంక్రమణము సుఖమగునో నన్నయ బాగుగ నెఱుంగును. ఎ సంధు లెచట పాటించిన పదములు చక్కగా నతుకుకొనునో, సమాసము లందే పదమునకు పిమ్మట నే పదము పడిన—సఖ్యము కుదురునో అయ్యది నన్నయకు సువిదితము. అట్లని నన్నయ ప్రతియక్షరమును, పదమును బాగుగా పర్యాలోచించి వేయుచుండునని కాదు. అట్లయిన ధార కుంటుపడవచ్చును. చిరసాధన వలన, సత్ప్రతిభవలన–ఆ అక్షర మైత్రి నన్నయకు సిద్ధించినది. అప్రయత్నముగనే అమిత్రాక్షరములు

సహచారి పదములు ప్రాక్తన జన్మ విద్యంవలె వచ్చిపడుచుండును అదియే నన్నయగారి అపూర్వసిద్ధి. నన్నయ శబ్దబ్రహ్మవిదుడు. ఆయనకు శబ్దము వశం పదము.

అక్షరరమ్యతకు - శ్లేషగుణమునకు సన్నిహిత సంబంధమున్నది. శ్లేష సాధించిన వాడక్షరరమ్యత నవలీలగ సాధించును. నన్నయ శ్లేష గుణములో దక్షుడగుటచేతనే యక్షరరమ్యతను సాధింపగల్గెను. శ్లేష- అక్షరరమ్యత రెండు నోతప్రోతములై యుండును. నన్నయ కవితలో గాన్పించు గుణములలో శ్లేషయే ప్రముఖమని చెప్పవలెను. ప్రసాద గుణము నన్నయలో బ్రచురమే. అంతకంటెను ప్రచుర మీా శ్లేష కొక సాక్ష్యమేమన- శ్లేషగుణ యుక్తమగు పద్యమవలీలగా గంఠస్థ మగుచుండును. నట్లు-ఒడుదుడుకు లేకుండుటచే పద్య మారంభించగనే ధారగా సాగిపోవును. మధ్య నాగుట యుండదు. అందుచే పద్యము వేగము నోటబట్టును. నన్నయ పద్యముల సులభముగా కంఠస్థము జేయగలము. చేయుట యేమి? అవి వద్దన్నను కంఠస్థమగును. కారణమవి శ్లేష యుక్తములగుట - ఇక గొన్ని యుదాహరణములతో నీ శ్లేషను ప్రదర్శింతును.

శా॥ ఆయుష్యం బతిపావన వస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తినిమిత్తముత్తమ సభాసేవ్యంబు, లోకాగమ
న్యాయైకాంత గృహంబు నాఁబరగి, నానా వేద వేదాంత
విద్యాయుక్తంబగు దానిఁజెప్పదొడగెం దద్భారతాఖ్యానమున్

ఈ పద్యమున పది పదములున్నవి. అయినను పద్యమారంభించ గనే తీగవలె సాగిపోవుచున్నది. ఇది యవలీలగా కంఠస్థమగును. 'చెప్ప దొడగెన్ దద్భారతాఖ్యానమున్' అనుచో 'తత్' శబ్దము అర్థదృష్టిలో ననవసరము. కానిఅది తీసిన 'చెప్పదొడగెన్ - భారతాఖ్యానమున్' అనుచో ద్రుతమునకు తర్వాతి భకారముతో మైత్రికుదర లేదు.

ద్రుతము నుండి భకారమునకు గతి సంక్రమణము సుఖముగాలేదు. నన్నయ గణపూరణకై వ్యర్థ పదములవేయువాడుకాదు. నన్నయ యిచట శ్లిష్టతకై 'తద్' శబ్దము నొక దానిని వేసెను. ద్రుతాత్ప రముకావున 'త' సరళమయి 'ద' అయినది. ఇప్పుడు దంత్యమగు దకారముతో ఓష్ఠ్య భకారమును కలిపినాడు. దంతములకు-ఓష్ఠ్యము లకు సన్నిహితత్వమున్నది. భకారము దకార సంయుక్తిలో కొంచెము పారుష్యమును త్యజించినది. ఇప్పుడు మొత్తముపై నుచ్చారణ, పదగతి సుఖముగా సాగిపోయినది

మ॥ "వివిధోత్తుంగ తరంగ ఘట్టన చలద్వేలా వనైలావలీ
లవలీలుంగలవంగ సంగత లతాలాస్యంబు వీక్షించుచున్
ధవలాక్షుల్ సని కాంచిరంత నెదురన్ దత్తీర దేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజ నిభునయ్యశ్వోత్తముందవ్వులన్"

ఈ పద్యము శ్లిష్టమై ధారావాహిగ సాగిపోయినది. అయితే 'వివిధోత్తుంగ'తో ప్రారంభమయి 'లాస్యంబులు' వరకొకే సమాసము కదా! సమాసమువలన, నేక పదత్వమిట వచ్చినదని యనవచ్చును. కాని అటుపైనను పది పదముల వరకున్నవి. అవియు మొదటి సమాస మునకు తీసిపోవుటకీ పదంవలె భాసించిపోయినవి. దీర్ఘ సమాసములు లేని క్రింది పద్యమునారయుడు.

చ॥ అతిరుచిరాగతుండయిన యాతనికిన్ హృదయ ప్రమోదమా
తతముగ నవ్వనంబున, లతాలలనల్ మృదులానిలావవ
ర్జిత కుసుమాక్షతావళులు సేసలు పెట్టిన యట్టిరెరి సం
పతదళినీ నినాద మృదుభాషల దీవన లొప్పనిచ్చుచున్॥

పదునాల్గు పదముల వరకీ పద్య మందున్నవి. చిన్న సమాస ములు రెండుతప్ప దీర్ఘ సమాసములు లేవు, అయినను పద్యము మృదు భాషలతో నేక ధారగా నడచిపోయినది.

ఉ॥ నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యకన్ మహా
దేవ కులావతంస! రవితేజ! వివాహము నీకు నాకుమున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్ను బరిగ్రహింపు సం
జీవనితోడ శుభ్రదయఁ జేయుము నాకు బ్రియంబు నావుడున్॥

ఇందు చెప్పఁదగిన సమాసములే లేవు. అయినను పదము లన్నియు నన్యోన్య మైత్రితో సుశ్లిష్టములు. ఏక పదమునా నొప్పినవి. పద్యగతిలో స్ఖలన మే మాత్రమును లేదు.

చ॥ “విపరీత ప్రతిభాష లేమిటికి నుర్వీనాథ! యాత్మీయ పుత్త్రగా
త్రపరిష్వంగ సుఖంబు సేయునది ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయుం బుత్త్రగా
త్ర పరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే! కడున్ శీతమే!”

మొత్తము పదునాల్గు మాటలు వరకు పద్యములో నున్నవి. విడివస్తువుల చందనాదులఁ జెప్పు పదములున్నవి. అయినను విడిపనము నిలువక ఏకత్వము నిర్వ్యాప్తమైనది. పద్యము సుఖముగా చెదరని గతితో గమించిపోయినది. ఇచట ‘హృద్యంబే’ అనుచోట ‘రమ్యంబే’ అని యనవచ్చును. ‘ఉద్యత్కోకిల కాకలీనినాదములును రమ్యాకారంబు లయ్యె’ అన్నట్లుగా కాని ‘రమ్యంబే’ అన్నచో ఉత్పాదసంయుక్త కకారమునకు తర్వాత రేఫవచ్చును. కకారము కంఠ్యము, రేఫ మూర్ధన్యము. వీనికి స్థానమున, ఉచ్చారణమున సాన్నిహిత్యము లేదు. ‘కు’ తర్వాత ‘ర’ ఉచ్చారణ పరుషమనిపించి, నడక కుంటుపడును, అందుచే ‘హృద్యంబే’ అని నన్నయ వాడెను. ‘క’ ‘హ’లు రెండును కంఠ్యములు. వీనికుచ్చారణలో సన్నిహితత్వమున్నది. ‘కు’ నుండి ‘హృ’ కు నడక సుగమముగా సాగిపోయినది. సత్ప్రతిభాభి యోగ్యుడు కాన నన్నయకీ మెలకువ లలవడినవి. ఇట్లిచట నక్షర బంధము కూడ ‘హృద్యంబే కడున్ శీతమే’ నా నొప్పినది.

క్రింది పద్యమును చూడుడు.

మ॥ "నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయం
కరదైతేయ నికాయకాయములపైఁగప్పెన్ దిశల్నిండ ఒం
ధుర ధాత్రీధర తుంగశృంగతట సందోహంబుపై గప్పదు
ర్ధరధారాధర ముక్తసంతత పయోధారావళింబోలుచున్॥"

ఇట నన్నయ పదముల కూర్పు కూడ సుశ్లిష్టమై సంతత పయోధారావళింబోలి, బృహన్నారాచధారల్ బోలియు వర్షించినది. ధారలు వేరైనను సంతతముగా గన్పించునట్లే నన్నయ పదములున్నూ వేరైనను నిరంతరములే. పద్యమును నడకలో కూడ నన్నయ మూడవ పాదమున పర్వత శృంగముల కెక్కించి, నాల్గవ పాదమున పయోధర మండలమున కెత్తినారు.

డుమంతములుగా ప్రథమైకవచన విభక్తితో విస్పష్టముగా నంతమగు శబ్దములు కూడ నన్నయ వాడుకలో పక్క పదములతో చక్కగా నతుకుకొని అవిశ్లథబంధముతో నేక పదావభాసను గల్గించు చుండును. క్రింది పద్యముల నారయుడు.

ఉ॥ "రాజ కులైక భూషణుడు రాజమనోహరుడన్య రాజతే
జోజయశాలి శౌర్యుడు విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజిత సర్వలోకుడ పరాజిత భూరిభుజా కృపాణధా
రాజల శాంత శాత్రవ పరాగుడు రాజమహేంద్రుదున్నతిన్॥"

ఇచట పద్యమంతయు నొకే సమాసమా అన్నంత శ్లిష్టముగా విచ్ఛేదము లేక సాగిపోయినది.

మ॥ "మతి లోకోత్తరుడైన యంగిరసుమన్మండా శ్రితుండా బృహ
స్పతికింబుత్రుడు మీకు శిష్యుడు సురాప బ్రహ్మచర్యాశ్రమ
వ్రత సంపన్నుడ కారణంబ దనుజ వ్యాపాదితుండైన య
చ్యుత ధర్మజ్ఞ! మహాత్మ! యక్కచునకేశోకింప కెట్లుండుదున్॥"

జాచి యెల్లవారు జులుకనపేక్షింతు
రిదియు పాపమనక హీనమతులు॥

తే॥ సర్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుగావ
యెఱుగు మెల్ల ధర్మంబులకెందు బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు॥

పలువురు యితరకవులు వ్రాసిన కందాదులలో నిట్టి శ్లిష్టత, ధార గోచరించదు. ఇంకను క్రింది పద్యములు నన్నయ శ్లేషగుణము నకు ప్రసిద్ధములగు నుదాహరణములు.

ఉ॥ ఆ వనజాననన్ గురుకులావశదుండు కడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామర మంత్ర పవిత్రవారిధా
రావళిజేసి పావనములైన శిరోజములంటె మల్చి పా
పావహుడీడ్చి తెచ్చె సభకందరు సంభ్రమమంది చూడగన్॥

దుశ్శాసనుడు ద్రోవదిని లాగికొని వచ్చినంత వేగముతోనే పద్యము కూడ నడచినది.

ఉ॥ శారద రాత్రులుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవగంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచిపూరము లంబర పూరితంబులై॥

నన్నయ, పదములతో తారహారమును గూర్చును. అందు విడిరత్నములు కాన్పించవు. మొత్తముపై హారమే మనోహారియై కాన్పించును.

నన్నయ శ్లేషగుణ మందిట్లు గడిదేరిన చేయి. ఈ గుణము కవితాధారకు చాల నవసరమైనది. అందుచేతనే యాలంకారికులు

కావ్యగుణములఁ జేర్కొనుచుఁ శ్లేషః ప్రసాదః సమతా' యనుచు దీనికి ప్రాధాన్య మొసంగినారు. నన్నయ కవితా లక్ష్మికి రామణీయకమును బ్రసాదించిన సాధనలలో నాకుం జూడగ, శ్లేషగుణము ప్రముఖమని తోచును. శ్లేష రచనకు మధురతను గూర్చును. కవితకు చక్కని శయ్యనమర్చును. శయ్యాసౌభాగ్య మమరిన పద్యము చదువుటకు, వినుటకును హాయి గొల్పును. నన్నయ కవితలోని సుఖశయ్యకు బాధ్యమిా శ్లేషగుణము. నన్నయ పద్యములెంత చదివినను మరల చదువవలెననిపించును. అవి సులభముగా కంఠస్థములగును. నన్నయ పంక్తులు జ్వాలల స్త త్తర తారకహార పంక్తులు. సద్వాను తావదాతమైన దాతని శైలి. అదియొక పావనగంగాఝురి. నన్నయ శ్లేషప్రయుక్తమైన శైలీ—ఆధిక్యముచే కవితాధిక్యత నధిరోహించినాడు.

—0—

# నన్నయగారి 'సాహిత్య సూత్ర' వృత్తి

శ్రీ కోవెల సంపత్కుమారాచార్య

నన్నయగారు తెలుగులో కావ్యరచనకు ఉద్యమించునాటికే భారతీయులందరికిని ఉమ్మడి సొమ్మయిన సంస్కృతములో సాహిత్య విమర్శ పరిణత స్థాయినందుకొన్నది. సుదీర్ఘముగా, సునిశితముగా సాగిన తత్సాహిత్య విమర్శమార్గాన పలుకావ్య సిద్ధాంతములు ప్రతిపాదింపబడినవి, సమీకరింపబడినవి. దాదాపుగా ఇవన్నియు ఆనందవర్ధన-అభినవ గుప్తులచే పరిష్కృతమయి, సువ్యవస్థితమయిన సాహిత్య విమర్శ సంప్రదాయము నెలకొన్నది. కుంతక-క్షేమేంద్రుల వివేచన ఆ సంప్రదాయమును పరమార్థతః పరిపుష్టము చేసినది. కాగా ఈ దేశమందలి ఏ భాషాకవికైనను అత్యంతావశ్యకమయిన ఈ సాహిత్య విమర్శ సంప్రదాయము యొక్క అంతస్తత్త్వావగాహన నన్నయగారికి సమృద్ధిగా ఉన్నది. అంతేకాదు. తననాటికే పెంపొందిన ఇరుగు-పొరుగు భాషలగు తమిళ-కన్నడములందు సాగిన కావ్యధోరణుల స్వరూప-స్వభావాభిజ్ఞతయు సమగ్రముగా ఆయనకున్నది. మరి, ఇదంతయు, తెలుగులో మొట్టమొదటిసారిగా ఒక మహాకావ్యము నవతరింప జేయుటకు ఉద్యమించిన నన్నయగారికి విశిష్టముగా కావ్య విషయిక వివేచన చేయుటలోనున్న వెన్నుబలము.

నన్నయగారు 'లోకజ్ఞుడు'. కావ్యము లోకప్రవృత్తినుండి నిష్పన్నము చేయబడునది. లోకము నాకట్టుకొనునది. లోకమునకు ప్రయోజనకరముగా, శ్రేయస్సంపాదకముగా సాగునది. కాగా, సంప్రదాయావగాహన, కావ్యస్వరూప-స్వభావాభిజ్ఞతలతో స్వీయనిశిత వివేచనా నిష్పన్నములైన కావ్యసంబంధి మౌలికాంశములను నన్నయగారు సూత్రీకరించినారు. నిజమునకు వామనుని 'కావ్యాలంకార సూత్ర' గ్రంథమువలె, నన్నయగారి 'సాహిత్య సూత్ర' గ్రంథ

మేదియు ప్రత్యేకముగా లేదు. తానవతరింప జేయుచున్న మహాభారత మునకు సమకూర్చిన అవతారికలో ఇముడునట్లుగా సాహిత్య విమర్శకు సంబంధించి ప్రతిపాదించిన అంశములు నన్నయగారి 'సాహిత్య సూత్ర ములు', ఆ సూత్రముల వృత్తి-అనగా, ప్రవృత్తి వ్యాఖ్యానించు కొనవలసియున్నది.

నన్నయగారి సాహిత్య సూత్రములలో మున్మొదటిది 'ప్రసన్న కథా కలితార్థయుక్తి'. దాని నంటికొని యున్నవి 'అక్షర రమ్యత', 'నానారుచిరార్థ సూక్తినిధి' ఆ తరువాతివి కథాస్వరూపము. కావ్య ప్రయోజనమునకు సంబంధించినవి. సుసంక్షిప్తములు, సంశ్లిష్టములు నైన ఈ సాహిత్య సూత్రములను – వాటి ప్రవృత్తిని విశదముగా వ్యాఖ్యానించుకొన్నప్పుడే నన్నయగారు వెలయించిన సాహిత్య విమర్శలోని మౌలికత, ఆధునికత సువ్యక్తము కాగలవు. మరియు భారతీయ సాహిత్య విమర్శ సంప్రదాయమునకు తెలుగువారి సంప్ర దానము స్పష్టముకాగలదు.

ఇక్కడ గమనించవలసిన ప్రధానాంశ మొకటి ఉన్నది.నన్నయ గారు ప్రతిపాదించిన యంశములను కేవలముగా ఆయన రచనకు మాత్రమే అనువర్తించునవిగా భావించుట సామాన్యమయిపోయినది. ఆ విధముగా అనువర్తింపజేయుట. అట్లుండగా మొత్తము సాహిత్య మునకును అనువర్తించుటకు సమర్థములన్న తాత్పర్యముతో ఆ యంశములను విశ్లేషించుకొనవలయుట అవసరము. కానిచో, నన్నయ గారి సాహిత్య వివేచనను సంకుచితపరచినట్లే కాగలదు.

## సూత్రము – 1

## ప్రసన్న కథా కలితార్థయుక్తి.

'సారమతిం గవీంద్రులు...లో నారసి మేలునా' దగిన 'ప్రసన్న

కథా కలితార్థ యుక్తి’ నన్నయగారు ప్రతిపాదించిన సాహిత్య సూత్రములలో మొదటిది. కథ ఆధారభూమికగా విస్తరించు కావ్యములను లక్షించు సూత్రమిది. ఈ సూత్రముపై మరియు తదితరములపై ఇప్పటివరకు విమర్శకులు సాగించిన వివేచన తక్కువేమియు కాదు. అయితే, పలువురు విమర్శకులు ఈ సూత్రమును స్థూలముగానే తప్ప నిశితముగా పరిశీలించి, సరియైన సమన్వయమును సాధించినట్లు కన్పించదు. ఆ సూత్రమందలి కొన్ని పదములు కలిగించు అర్థస్ఫూర్తితో ఉజ్జాయింపుగా తాత్పర్యమును భావించినవారే ఎక్కువమంది. ‘కథ సాక్షాత్కరించునట్లుచేయు శిల్పనైపుణి’ యన్నది ప్రసన్న కథా కలితార్థ యుక్తిగా కట్టమంచి రామలింగారెడ్డిగారి భావన [1] మరి :

> కథాగమనమునకు క్లిష్టతగాని, వక్రతగాని, అతి సంకుచితత్వముగాని,అతి విస్తృతిగాని కలుగకుండ ప్రసన్నముగ, నిర్వక్రముగ, అనతి విస్తారముగ (నన్నయ) కథ నడుపగలడు. ఈ ప్రజ్ఞయే ‘సారమతిం గవీంద్రులు ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి మేలునాన్’ అని ప్రతిజ్ఞగా పేర్కొని దానిని సార్థకము చేసినాడు. ఈ కథా ప్రసన్నతతోబాటు ఆయన రచనలో చూడవలసిన రెండవ యంశము అర్థయుక్తి [2]

అని పింగళి లక్ష్మీకాంతముగారి వివరణ. ప్రసన్నకథ – అర్థయుక్తి అన్న విభిన్నాంశములుగా ఆయన భావించినారు. నన్నయగారు కథను ‘క్లిష్టత...నడపగలడు’ అన్న నిర్ణయము ‘ప్రసన్నకథ’కు అనుసంధింపబడినది. అర్థయుక్తి వేరుచేయబడినది. అయితే ఈ రెండింటికి నడుమ గల ‘కలిత’ పదమున కిక్కడ గుర్తింపు కలుగకపోవుట గమనింపదగిన యంశము. ఇదిట్లుండగా నన్నయ ఉత్తమజాతి కథకుడు.కథను చక్కగా నిర్వహించగలవాడు - మొదలైన అభిప్రాయములు సమూహాము మీద వెలువరింపబడినవే తప్ప నన్నయగారి సూత్రమును క్రమముగా

అనుశీలించుట వలన నిష్పన్నములైనవి కావు. నిజమునకు సూత్రి మందలి ఏ పదమునుగూడ విడువరానిది. ఆద్యంతముగా సమన్వితము కావలసినది.

నన్నయగారిని విశిష్టముగా అనుశీలించినది విశ్వనాథ సత్యనారాయణగారు. సూత్రమునందలి పదములన్నింటిని సమాకలనము చేసికొని —

ప్రసన్నమైన కథతో గూడికొనియున్న యర్థముల యోజన [3]

అని అర్థమును చెప్పినవారాయన. నాటినుండి పలువురీయర్థము నంగీకరించి ముందుకు సాగినారు [4] సత్యనారాయణగారు తాము చెప్పిన ఈ యర్థమునే మరికొంతగా నిట్లు వివరించినారు :

> అచటనున్న యర్థములను చక్కగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్నమగును. అచటనున్న యర్థములను సరిగా యోజించవలయును. [5]

స్థూలముగా చూచినచో చెప్పిన అర్థమునకును, చేసిన వివరణమునకును కొంత వ్యత్యాసమున్నట్లు కన్పించును. ప్రసన్నమైన కథ యున్నది. దానితో గూడి కొన్ని యర్థములున్నవి ఆ యర్థములను యోజించుట— అనగా, ప్రసగించుట అనిగదా సూత్రార్థము! ఈ యర్థము ననుసరించి— 'అచటనున్న యర్థములను పరిశీలించుట వలన కథ ప్రసన్నమగు' నన్న తాత్పర్యము నిష్పన్నమగుట క్లిష్టము. అర్థముల పరిశీలనము కథ ప్రసన్నమగుటలో హేతువుగా వివరణలో చెప్పబడినది. కాని మొదటనే కథ ప్రసన్నమై ఉండునట్లు సూత్రమునకు అర్థము చెప్పబడినది. మరియు 'ప్రసన్నకథ' యనగా 'కథా ప్రసన్నత' అని సత్యనారాయణగారి తాత్పర్యము. 'కథా ప్రసన్నత' నాయన ఇట్లు వ్యాఖ్యానించినారు :

> కథా ప్రసన్నత యనసేమో తెలిసికొనుటకు మున్ను ప్రసన్న శబ్దార్థము తెలిసికొనవలయును. 'దేవీ ప్రసన్నత' ఇట్టి శబ్దము లలో- 'భగవంతుడు ప్రసన్నుడైనాడు' మొదలగుచోట్ల, భగవంతుడు ప్రసన్నుడగుట యనగా నెట్టిది? ఉపాసనా స్వరూపము తెలిసి నిశ్చలబుద్ధితో పరమేశ్వరుని ధ్యానము చేసినచో భగవంతుడు ప్రసన్నుడగును. కావ్యమునందు 'ప్రసాద'మను నొక గుణమున్నది ప్రసాదగుణమనగా నర్థవ్యక్తియని యొకమతము. ఈ యర్థవ్యక్తి యెట్లు కలుగును? శబ్దార్థములు సుపరిజ్ఞానము సంప్రదాయాభిజ్ఞతయు నున్నచో నది కలుగును. భిన్నశబ్దార్థముల వాక్యార్థముల సూక్ష్మపరిజ్ఞానముచేత నర్థప్రసన్నత కలిగినట్లు కథాగతభిన్నాంశముల పరిజ్ఞానముచేత కథాప్రసన్నత కలుగును.[6]

నిజమునకు 'కథాప్రసన్నత' యన్న పదబంధము నన్నయగారి సూత్రమున లేదు. ప్రసన్నపదమును కథాపదముతో అన్వయించి, విడిగా 'ప్రసన్నకథ' యను పదబంధము రూపొందగా, దానినుండి - ప్రసన్నమయ్యెడిది కథ గావున, కథ ప్రసన్నమగుట 'కథాప్రసన్నత'గా వ్యత్యస్తపదబంధము నిష్పన్నమైనది. మరి, ఈకథ ప్రసన్నమగుటలో 'అర్థయుక్తి'కి హేతుత్వము కొరవడుచునే యున్నది. పింగళి లక్ష్మీకాంతముగారు కూడా 'ప్రసన్నకథ'ను కథాప్రసన్నతగానే భావించినారు. ఆయన అర్థయుక్తిని భిన్నాంశముగా విడదీయుటలో, దానికి హేతుత్వము లేదని భావించినట్లే యగుచున్నది. అయితే, నడిమి 'కలిత'పదనూ రెండును భిన్నములు కావనియు, సమన్వితమై రూపొందవలసిన ఏకాంశమే యనియు సూచించుచున్నది. కాగా, ఈ యన్నింటిని దృష్టియందుంచుకొని ఆసూత్రమునకు అర్థసమన్వయము చేయవలయును.

‘ప్రసన్న’ పదమును ‘కథ’తో అన్వయించుటవలన, నిజమునకు, సమన్వయము కొరవడుచున్నది. కాగా, ‘ప్రసన్న’ పదమును ‘కథ’తోగాక ‘కథాకలితార్థయుక్తి’తో సమన్వయించవలయును. అప్పుడా సూత్రమున కర్థము సమన్వితమగును. ఆ సమన్వితి ఇట్లు : కథయందు కలితమైన. అనగా నిక్షిప్తమైన అర్థము(ల) యొక్క యుక్తి. అనగా అమరిక ప్రసన్నమగుట— ప్రసన్నకథా కలితార్థయుక్తి. కథతోగూడి యున్న, లేదా కథయందు నిక్షిప్తములైన అర్థములు— వాటి పొసగుదల ప్రసన్నమగుట యనునది కావ్యమునందు కథాకథన శిల్పములో ప్రాణభూతమైన యంశము. తదర్థ ప్రసన్నతా విరహితముగ కథ చెప్పుటలో ప్రయోజనము లేదు. కాగా, కథాకథనమందు ‘కథాకలితార్థయుక్తి’ ప్రసన్నము కావలయునని నన్నయగారు ముమ్మొదటగా ప్రతిపాదించినారు. ‘నన్నయ కవిత్వము’ను గూర్చి వ్రాయుచు భూపతి లక్ష్మీనారాయణరావుగారు :

> వ్యాసుని కథా ప్రణాళిక కేమాత్రము భంగము కలుగనీయక, తత్తత్కథాంగములను కావ్యోచితమగురీతిలో వివరించుచు కథార్థమును పాఠకునకు ప్రసన్న మగునట్లు చేయుట నన్నయ యవలంభించిన పద్ధతి[7]

అన్నారు. ప్రధానీకృతాంశము కథార్థముయొక్క ప్రసన్నత. డా. ధూళిపాళ శ్రీరామమూర్తిగారు కూడా—

> కథాంతర్గతమై బహ్వర్థ సంయోజన ముండును. నన్నయభట్టు కథాకథనమున కడువేగరి. దాని వేగమును నిలువరించుకొని పరీక్షించవలయును. అప్పుడాతని (పాఠకుని) కి కథాంతర్నిగూఢములైన యర్థములు భాసించును. ఆయన యర్థ సంయోజనా చాతుర్యమట్టిది. ఈ యర్థములను గ్రహించుటకులోనారయ వలయును[8]

వివరించి ఆ తరువాత దానిని నన్నయగారు ‘ప్రసన్నకథాకలితార్థ యుక్తి’ అని సూత్రీకరించి సర్వకావ్యానువర్తిగా ప్రస్తుతీకరించినా రన్పించును. ఇట్లు, ఆ సూత్రము కథా కలితార్థముల అమరికను ప్రసన్నము చేయవలయునని ప్రతిపాదించుచున్న దనుట నిర్వివాదాంశము.

నిజమునకీ అర్థయుక్తియొక్క ప్రసన్నతయే ‘కథాప్రసన్నత’గా వ్యవహరింపబడుచున్న దనవలయును. కథ ప్రసన్నమగుట యనగా, కథాకలితార్థములు, వాటి పొసగుదల ప్రసన్నమగుటయే. అర్థప్రసన్నతకు భిన్నముగా కథాప్రసన్నతకు ఉనికిలేదు. చెప్పబడిన కథ తెలియుచునే యుండునుగాని, నిజమునకా తెలియుట ‘తెలియుట’కాదు. కథాకలితమైన అర్థయుక్తి ప్రసన్నమగుటయే నిజమైన తెలియుట వివరించుటలో, విచారించుటలో ఈరెండు—అర్థప్రసన్నత, కథాప్రసన్నత- భిన్నాంశము లన్నట్లుగా చెప్పబడుచున్నవి. మరియు కథాప్రసన్నతలో అర్థప్రసన్నత హేతువుగా భాసింపజేయ బడుచున్నది. కాని, పరమార్థతః రెండు నొక్కటియే. విశ్వనాథ సత్యనారాయణగారు భారతములోని కొన్ని ఉపాఖ్యానములను, ప్రధాన కథాభాగములను వ్యాఖ్యానించినరీతి ఈ యంశమునే స్పష్టపరచును. ఆయా కథలయందా యా అర్థములు ప్రసన్నమగుటకు నన్నయగారి విశిష్ట పదప్రయోగము, దానివలన కలుగు ప్రసన్నతను ఆయన ‘కథా ప్రసన్నత’గా నిరూపించినారు.

> మహాకవియొక్క కావ్యగతములైన కొన్ని శబ్దములు కథామర్మమును భేదించునవి యగును [9]

అన్నారాయన. (ప్రసన్నత’ను గూర్చిన ఆయన వివరణయు దీనినే సూచించును) కథామర్మము భేదింపబడుటయనగా కథార్థము ప్రసన్నమగుటయే. కథార్థము ప్రసన్నమగుటయే కథయు ప్రసన్నమగుట. ఋష్యశృంగుని కథను వ్యాఖ్యానించి, చివరకు :

నన్నయగారి కథలో (ప్రసన్నము) చేసిన మహార్థమిది. ఋష్యశృంగుని (కథ) తీసికొని యౌవన వికార స్వరూపము నిర్ణయించెను. ఈ మహార్థము ప్రసన్నమగుచున్నది [10]

అని సత్యనారాయణగారి యంశము స్పష్టపరచినారు. తన్మహార్థ ప్రసన్నతయే ఋష్యశృంగ కథాప్రసన్నతయని తాత్పర్యము. అది లేనిచో నిది లేదు. 'అచటనున్న యర్థములను చక్కగా పరిశీలించినచో కథ పాఠకునకు ప్రసన్నమగు'నని ఆయన అనుటలోని తాత్పర్యమిదే. కాగా, ఈవిధముగా విచారించినచో "కథాప్రసన్నత"యు "ప్రసన్న కథాకలితార్థయుక్తి" తాత్పర్యముతో సంవదించుచునే యున్నది.

ఈ సందర్భముననే గమనించవలసిన యంశమొకటి,

"ప్రసన్నకథా కలితార్థయుక్తి" యన్నదానికి, "—కథా కవితార్థయుక్తి" అను పాఠాంతరము కన్పడుచున్నది.[11] మొదటి పాఠములో "కలిత" అని, రెండవదానిలో "కవిత" అని ఉండుటయే భేదము నిజమునకు మారిన అక్షర మొక్కటియే. అది 'వి' మరి 'లి' అన్నది 'వి'గా మారినదో లేక ఇది అదిగా మారినదోగాని మొత్తము సూత్రములో వివాదాస్పదమైన మార్పు వచ్చినది. అయితే 'వి'కార యుతమగు పాఠమునకు అర్థము సమన్వితమగుటలేదు, సమన్వయించు యత్నము కొంతసాగినది.

కథా కవితలోని యర్థము యోజనను ప్రసన్నముగా-ప్రసాద గుణ సహితముగా నిర్వహించుట [12]

అని వేదాల తిరువేంగళాచార్యులుగారి రెండవ పాఠమునకు అర్థము చెప్పినారు. ఇక్కడ 'అర్థము' కవితలోనిది. అప్పుడు 'కథా' పదావశ్యకత లేదు. మరి 'అర్థము' కథలోనిదైనచో 'కవితా'పద మనవసరము. మరియు, చెప్పిన అర్థమును వివరించును :

భారత కథను కవిత నల్లుటలో అందలి విషయములన్నింటిని
రసవ త్తముగా - ఏయే చోటుల నేయేరస ముచితమో అది
చక్కగా వెంటనే వ్యక్తమై రంజిల్లునట్లు చేయు రచన[13]

అన్నారు. ఈ వివరణలోని 'రస' విషయము పై అర్థము ననుసరించి నదికాదు. 'ప్రసన్న' మనగా ప్రసాదగుణ సహితమని, ప్రసాదగుణము సర్వరస సమర్పక మగుటను బట్టి, ఇక్కడ రసప్రస్తావన కవకాశము కల్పించబడినది. డా. వేంకటావధానిగారును 'ప్రసన్నకథ' లనగా, ప్రసాదగుణము 'సర్వరస సమర్పక' మగుటచేత 'నానారసమయము లైన కథ'లని భావించినారు.[14] కాని 'ప్రసన్న' పదముచే స్ఫురించు చున్నదనుకొనబడుచున్న 'ప్రసాద' గుణము సర్వరస సమర్పకమైన రచనాసంబంధి. 'శబ్దార్థముల యకాలుష్యము' నకు సంబంధించినది[15] గాని, కథకు సంబంధించినది కాదు. కథ ప్రసాదగుణ సమేతమగుట నెవ్వరును చెప్పియుండలేదు. ప్రసన్నత నొకవేళ కథకన్వయించినచో డా. అవధానిగారే చెప్పినట్లు - 'ఏవైన కథలను రచించునపుడు ప్రధానకథతో వానికిగల సంబంధమును, అందు వానికిగల స్థానమును వివరించుచు...విన్నంత మాత్రమున నందలి తత్త్వమును స్ఫురింప జేయుట[16] కావచ్చును. అయితే, ఈచెప్పినదియు 'అర్థయుక్తియొక్క ప్రసన్నత'కే అనుగుణముగా ఉన్నది. కాగా 'ప్రసన్న' పదము నాశ్రయించి రసప్రస్తావన సుదూరమైన క్లిష్టకల్పన. నన్నయగారి అక్లిష్ట రచనారీతికి అననుగుణము.

ఇదిట్లుండగా ఈ రెండవ పాఠమునుబట్టి, నన్నయగారు 'కథా కవిత' యను నొక కవితా భేదమును ప్రతిపాదించినట్లు దీని ననుసరించి నన్నెచోడుడు అనంతర కాలమున 'కథాకవిత'నే 'వస్తుకవిత'గా ప్రస్తుతీకరించినట్లు వేదాలవారు, డా. పాటిబండ మాధవశర్మగారును నిర్ణయించినారుకాని, దానికి భూమిక కన్పించదు. నిజమునకు చోడుడు

"వస్తుకవిత"ను "కథాకవితా" తాత్పర్యముతో ప్రస్తుతీకరించ లేము. ఆయన ప్రస్తుతీకరించిన రీతిలో వస్తుకవితా స్వరూపమిది:

## వ స్తు క వి త

నన్నెచోడుడు వస్తుకావ్యము, వస్తుకవిత, వస్తుకవి అను మూడు పదబంధములను ప్రయోగించినాడు. ఈ మూడును పరస్పర సంబద్ధములు, పరమార్థతః ఏకతాత్పర్యవంతములు. వీటి స్వరూపావగాహనకు 'వస్తు' పదము కీలకము. ఆ పదముద్వారా చోడు డుద్దేశించిన అంశముపై తత్స్వరూప మాధారపడియున్నది.

'వస్తు' పదార్థ విషయమున విమర్శకులలో భిన్నాభిప్రాయము లున్నవి. "భరతుని నాట్యశాస్త్రమున ప్రబంధమునకు ప్రఖ్యాత వస్తువుయొక్క ఆవశ్యకత చెప్పబడినది" అన్న ఆనందవర్ధనుడు,[17] "వస్తు - నాయక - రసములనుబట్టి రూపకములు భేదించును" అన్న ధనంజయుడు...[18] ఇట్లే ఇంక నితరులనుబట్టి వస్తుపదము 'కథా' ర్థకము. ఇట్టిప్రయోగములాధారముచేసికొని; వేదాల,[19] పాటిబండ[20] మొదలగువారు వస్తుకవితయనగా కథాకవిత (వస్తుకావ్యము; కథాకావ్యము = వస్తుకవి = కథాకవి) అని నిర్ధారించినారు. వారిదృష్టిలో నన్నయగారు "కథాకవిత"యనుట ఈనిర్ధారణకు ప్రమాణము. మరి, నన్నయగారు స్పష్టప్రతిపత్తితో "కథాకవిత"యనగా పాక్షికముగా కథాపరమైన 'వస్తు'పదమును నన్నెచోడుడు ప్రయోగించవలసిన యవసరమేమి వచ్చినది? దీనికి వేదాలవారి సమాధానమిది : వస్తుపదమునకు తెలుగులో బంగారమని సంస్కృతములో కథయని వాడుక యున్నది. ఈ ఉభయార్థస్ఫూర్తికొరకు చోడు డీపదమెన్నుకొన్నాడు. "బంగారమెట్లు అలంకారములుగా మన యభిరుచులకు దగినట్లు రచింప వీలగునో అట్లే కథయు గనుకనుగూడ. కథ బంగారమే. ఈ రెండు

రకముల విశేషములను జోడించుట వస్తుపదముననే వీలగునుగాని కథా పదమున వీలులేదు. కనుక వస్తుకవితయని వాడినాడు." [21]

నన్నయగారు "కథాకవిత"ను ప్రతిపాదించినారా లేదా అను విషయమట్లుండగా, వస్తుపదమునకు కథాపరమైన ప్రయోగము పాక్షికము. ఇదియు నట్లుండగా; చోడుడు తన కావ్యావతారికయందు 'కథ' యని చెప్పవలసివచ్చిన ఏ సందర్భమందును కథాపరముగా వస్తుపదమును ప్రయోగించలేదు. "దివ్య కథాసూత్రం బెట్టిదనిన" (1-67) ఇత్యాదిగా సర్వత్ర కథాపదమునే ప్రయోగించినాడు. మరి, కావ్య విమర్శ మార్గమున వస్తుపదమునకు సందర్భమునుబట్టి కథాపరముగా ప్రయోగమున్నను, వస్తునిర్దేశము, వస్తుధ్వని మొదలగుచోట్ల తద్భిన్నరీతిలో ప్రయోగములున్నవి. కావ్యాదియందు ఆశీర్నమస్క్రి యావస్తు నిర్దేశములలో నేదోయొకటి యుండవలెననుట ప్రసిద్ధము. ఇక్కడ వస్తునిర్దేశమనగానేమి? మేఘసందేశ కావ్యాదియందుయక్షుని గిరినివాస రూపవస్తువు నిర్దేశింపబడినదని మల్లినాథ సూరి వ్యాఖ్య. 'నివసించుట' యనునదే వస్తువని తాత్పర్యము. అది కథ కాదు. నిజమునకు మేఘసందేశమున కథ యేమున్నది? మరి, వస్తుధ్వని యనుచో "విధి నిషేధా ద్యనేక ప్రకారము వస్తుశబ్దముచే చెప్పబడుచున్నది" అని అభినవగుప్తోక్తి. [22] విధి, నిషేధాదులే వస్తువులిక్కడ. అనగా, ఏదైన నొక యంశము, విషయము, పదార్థము మొదలగునవి వస్తువాచ్యము లగుచున్నవి. కాగా, వస్తు ప్రయోగములోని ఈవిస్తృతిని, చోడుడా పదమును వేర్వేరు కవులు ప్రయోగించిన రీతిని- పూర్వాపరములు ననుసరించి చోడుని "వస్తుకవితా" స్వరూపము నిర్ణయించవలయును.

చోడుడు తన కావ్యావతారికయందు పూర్వ కవిస్తుతిలో ఆర్గురు సంస్కృత కవులను స్మరించినాడు. వారిలో వాల్మీకి, భారవి

ఉద్భటుల- ముగ్గురి స్మరణలో 'వస్తుకావ్య, వస్తుకవితా' పదబంధ ములు ప్రయుక్తములు. ఇక్కడ భారవి ఉద్భటుల గూర్చిన పద్య ములు ప్రస్తుతమునకు గమనించదగినవి.

భారవియు వస్తుకవితను
భారవియును బరగిరుదయ పర్వత శిఖరా
గ్రారోహణేంద్ర కీల న
గారోహణ వర్ణనల జనారాధితులై. (1-20)

కాంతియందు సూర్యుడు (భా: + రవి) ఉదయ పర్వత శిఖరాగ్రారో హణముచేత జనారాధితుడు. ఆ సమయమున అర్ఘ్యప్రదానాదులతో జనులు రవి నారాధింతురు. ఇక వస్తుకవితయందు భారవి (కవి) ఇంద్ర కీల నగారోహణ వర్ణనచే జనారాధితుడు. ఆయన వర్ణనాశక్తి జనా రాధ్యమయినది- ఇది పద్య తాత్పర్యము. సూర్యసామ్య విషయ మట్లుండగా, ఇంద్రకీల నగారోహణ వర్ణనకు వస్తుకవితకు నేమి సంబం ధము? (నగారోహణ) వర్ణనము వస్తుకవితి యగునా? వస్తుకవితయందు వర్ణనయుండునా? వర్ణనయే వస్తుకవితయా?...భారవిని గూర్చిన పద్య మిట్లుండగా, ఉద్భటుని గూర్చిన పద్యమిది :

క్రమమున నుద్భటుడు కవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రముగూఢ వస్తుమయ కా
వ్యముగా హరులీలఁ జెప్పి హరుమెప్పించెన్ (1-21)

ఉద్భటుడు కుమార సంభవమును 'వస్తుమయ కావ్యముగాన్'- వస్తు మయ కావ్యమగునట్లు- రచించినాడు. మరి, అది వస్తుమయ మెట్లయి నది? 'అలంకారము గూఢన్' [23] అని సమాధానము. కుమార సంభవ ములోని కథ హరులీల. కాని, దానివలన కుమార సంభవము వస్తు కావ్యము కాలేదు. అలంకారము వలననైనది. అట్లుకానిచో అలం

రకముల విశేషములను జోడించుట వస్తుపదముననే వీలగునుగాని కథా పదమున వీలులేదు. కనుక వస్తుకవితయని వాడినాడు."[21]

నన్నయగారు "కథాకవిత"ను ప్రతిపాదించినారా లేదా అను విషయమట్లుండగా, వస్తుపదమునకు కథాపరమైన ప్రయోగము పాక్షికము. ఇదియు నట్లుండగా; చోడుడు తన కావ్యావతారికయందు 'కథ' యని చెప్పవలసివచ్చిన ఏ సందర్భమందును కథాపరముగా వస్తుపదమును ప్రయోగించలేదు. "దివ్య కథాసూత్రం బెట్టిదనిన" (1-67) ఇత్యాదిగా సర్వత్ర కథాపదమునే ప్రయోగించినాడు. మరి, కావ్య విమర్శ మార్గమున వస్తుపదమునకు సందర్భమునుబట్టి కథాపరముగా ప్రయోగమున్నను, వస్తునిర్దేశము, వస్తుధ్వని మొదలగుచోట్ల తద్భిన్నరీతిలో ప్రయోగములున్నవి. కావ్యాదియందు ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశములలో నేదోయొకటి యుండవలెననుట ప్రసిద్ధము. ఇక్కడ వస్తునిర్దేశమనగానేమి? మేఘసందేశ కావ్యాదియందుయక్షుని గిరినివాస రూపవస్తువు నిర్దేశింపబడినదని మల్లినాథ సూరి వ్యాఖ్య. 'నివసించుట' యనునదే వస్తువని తాత్పర్యము. అది కథ కాదు. నిజమునకు మేఘసందేశమున కథ యేమున్నది? మరి, వస్తుధ్వని యనుచో "విధి నిషేధా ద్యనేక ప్రకారము వస్తుశబ్దముచే చెప్పబడుచున్నది" అని అభినవగుప్తోక్తి.[22] విధి, నిషేధాదులే వస్తువులిక్కడ. అనగా, ఏదైన నొక యంశము, విషయము, పదార్థము మొదలగునవి వస్తువాచ్యము లగుచున్నవి. కాగా, వస్తు ప్రయోగములోని ఈవిస్తృతిని, చోడు డా పదమును వేర్వేరు కవులు ప్రయోగించిన రీతిని- పూర్వాపరములు ననుసరించి చోడుని "వస్తుకవితా" స్వరూపము నిర్ణయించవలయును.

చోడుడు తన కావ్యావతారికయందు పూర్వ కవిస్తుతిలో ఆర్గురు సంస్కృత కవులను స్మరించినాడు. వారిలో వాల్మీకి, భారవి

మరి బహువస్తుద్యోతకము. ఈ యంశమును 'విబుధవర్గము'ను స్మరించుచు చోడుడే స్పష్టపరిచినాడు.

గుఱుతెఱిగి వస్తుచయమున
కొఱగెడు నాదీప వర్తియునుబోలె నిజ
మ్మెఱిగి కృతివస్తు సమితికి
వఱలఁగ మదినెఱుఁగు విబుధవర్గము దలఁతున్ (1-26)

ఇందులో "వస్తుచయము, వస్తుసమితి" గమనింపదగినవి. దీపవర్తి వస్తుచయమున కొఱగును. విబుధవర్గము కృతియందలి వస్తుసమితి నెఱుగును. వస్తుసమితి "మృదురీతి" పద్యమున చెప్పబడినది. చయము సమితి— రెండును సమూహార్థకములేయైనను, సమూహముగా కూడిన వస్తువుల పరస్పరానుగుణ్యము, అన్యోన్యానాతిరిక్తమైనఅవస్థితిని "సమితి" స్ఫురింపజేయును. కృతిలో వఱలెడు వస్తువులకీ స్థితి తప్పనిసరి. ఎఱుగువారు బుధులు. మృదురీతి పద్యమునందును 'బుధులు' స్మరింపబడుట గమనింపదగినది.

ఇట్లు వస్తువు "వస్తుసమితి" ద్యోతకముకాగా, ఆ సమితియందు "కథ" చేరకపోవుటయు, కథయని చెప్పవలసినచోట్ల వస్తుపదమును గాక కథాపదమునే ప్రయోగించుటయుబట్టి వస్తుకావ్యము / కవిత అనగా కథాకావ్యము / కవితకాదని, మృదురీత్యాది గుణాలంకారాది సంవలితము మాత్రమే "వస్తుకావ్యము / కవిత"గా చోడుడు ఉద్దేశించినాడనుట నిర్వివాదాంశము. కాగా చోడుని "వస్తుకవిత" నన్నయగారు 'కథాకవిత' యన్నారనుట నేవిధముగాకూడ సమర్థించదు.

## ప్రసన్న+కథా: ప్రసన్న+కవితా

ఇదిట్లుండగా, '-కవితా-' పాఠమును సమర్థించుచు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు ఆ సూత్రమునకు—

> ప్రసన్న+కథా+ప్రసన్నకవితా+అర్థయుక్తి అని పదవిభాగ ముచేసి ప్రసన్నమైన కథ యొక్కయు, ప్రసన్నమైన కవిత యొక్కయు ప్రయోజనముతో కూడియుండుట అని యర్థము చెప్పవచ్చును. [24]

అన్నారు. ఇక్కడ ప్రసన్న పదమును కథకు, కవితకును విడివిడిగా అన్వయించుట, అర్థపదమునకు ప్రయోజనమని అర్థము చెప్పుట గమనింప దగినది. అయితే, మొదట గుర్తించవలసిన యంశము 'అర్థ' పదము ఇక్కడ 'ప్రయోజనా' ర్థకము కాదని. '... నిరూపితార్థము ...', 'అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై' (ఆది.1-) మొదలగు నన్నయగారి ప్రయోగములు, 'వ్యాసమునీంద్రు సార కరుణాతిశయంబున భారతార్థముద్భాసితమైన యట్టి నుత భాగ్యున కున్ –' (స్వర్గా. 1-92) వంటి తిక్కనగారి ప్రయోగములు, 'వ్యాసముని ప్రణీత పరమార్థము' (నృసిం-పీఠిక) వంటి ఎఱ్ఱనగారి ప్రయోగము లీయంశమున ప్రమాణములు. కాగా, 'అర్థము' విషయపరమేగాని ప్రయోజనపరముకాదు. ఇక – 'భారత కథలు గహనమైనవి. వానిలోని అనవసరములైన వివరములును, పునరుక్తులును పాఠకులకు విసుగువేసటలు కల్పించును. దానిని పాఠకుని అభిముఖ్యమునకై ప్రసన్నములు చేయవలెను. భారత కవితయందును పైలక్షణములున్నవి. అనౌచిత్యములున్నవి. వానినన్నింటిని తొలగించి స్ఫుటమైన కవితను సాక్షాత్కరింప జేయవలెను. అదియే ప్రసన్న కథ; అదియే ప్రసన్నకవిత' [25] అని ఇంద్రగంటి వారి వివరణ. ఈ వివరణ వ్యాస భారతముపై అధిక్షేపణములనే తప్ప, నన్నయగారి తాత్పర్యమును తెల్పదు. ఈ వివరణబట్టి చూచినచో, వ్యాస భారత మున అక్షర రమ్యతయు, నానారుచిరార్థ సూక్తినిధిత్వము కూడ లేవని చెప్పవలయును. ఇట్లు చెప్పుట నన్నయగారిపై మన అభిమానమునే

సూచించును. నిజమునకు మూల భారతముతో పోల్చుకొనుటకు 'ప్రసన్నకథా...' మొదలైనవి నన్నయగారు చెప్పలేదు. కావ్య రచనా స్వరూపమును వివరించుటకు చెప్పినారు. ఆయన చెప్పినవి సర్వత్ర అన్వయించుటకు ఉద్దేశింపబడినవి. ఈ యంశము మరచినచో వివేచన సంకుచితమగును. ఇదిట్లుండగా, కథను సాక్షిగా చెప్పుట, కవి తను స్ఫుటీకరించుటలే అయినచో ఇక్కడ నన్న మహాకవి యుండదు. మరియు, ప్రసన్న / కవితల యొక్క ప్రయోజనమేమిటో చెప్పబడలే దిక్కడ. దీనివలన ఆ నిర్వచన మసమగ్రము. మరియు ప్రసన్నపద మును కథతో, కవితతో గూడ అన్వయింపజేయుట క్లిష్టమార్గము. గమనించవలసిన మరొక యంశమేమనగా అక్షరరమ్యత, నానారుచి రార్థ సూక్తినిధిత్వములను కవితాపరముగా, జగద్ధితత్వమును ప్రయో జనపరముగా చెప్పబోవుచున్న నన్నయగారి సూత్రమున కవితా విష యమును అసమన్వితముగా చెప్పినారనుట కుదురదు. ఇక, నన్నయ గారికి పూర్వుడైన కన్నడ కవియగు పంపన 'లలితపదం, ప్రసన్న కవితాగుణ...' మనగా నన్నయ దానినే అనుసరించినా రనుట సరి గాదు. నన్నయగారి భావన పంపని భావన యొకటిగాదు. నన్నయగారి 'కథా' పదము ఈ యంశమును స్పష్టపరచును. ఇద్దరి ధోరణులు వేరు వేరు. కాగా నన్నయగా రిక్కడ కథా విషయమునే తప్ప కవితా విషయమును ప్రస్తావించలేదు. అందువలన – ప్రసన్నకథా కలితార్థ యుక్తికి సుగమత 'కలిత' వలననే కలుగునుగాని 'కవిత' వలనగాదు. అందుకనియే, 'కవితా' పదయుక్త పాఠమునకు అర్థము పొసగించుటకు మూడు నాల్గు విధములుగా ప్రయత్నించి చివరకు డా. అవధానిగారు—

> కవితా పదముతోఁగూడిన పాఠమునకు దూరాన్వయమయిన యర్థమేకాని, సహజమైన యర్థము విశదమగుటలేదు. అందుకే 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' యను పాఠమే గ్రహించుట యుక్తముగా నుండును.[26]

అను నిర్ణయమునకు వచ్చినారు. ఈ పాఠమునందలి ఈ అన్వయము లోని సుగమతను, ఔచిత్యమును బట్టియే చిన్నయసూరి, గిడుగు రామమూర్తి మొదలగువారు 'కలిత' పదయుక్తమగు మొదటి పాఠ మునే ప్రమాణీకరించినారు.[27]

నిజమునకు, నన్నయగారి సాహిత్య వివేచనలోని మౌలికత పాఠమువలననే వ్యక్తమగుచున్నది నాటికేకాదు, ఈనాటికిని 'కావ్య మున కథయెట్లు చెప్పబడవలయు' నన్నది యెవరును విచారించి యుండలేదు. విచారించి చెప్పినది నన్నయగారొక్కరే కథ చెప్పు టలో - అది పూర్వకథయే యైనచో, ఆ కథ యందలి అర్థములు; స్వీయమైనచో, ఆ కథయందు నిక్షిప్తములైన అర్థములు, వాటి పొసగుదల ప్రసన్నము కావలయునన్నది భారతీయ సాహిత్యవిమర్శ సంప్రదాయమునకు తెలుగువారి సంప్రదానము. కథాకథన శిల్ప మన్నది దీనినుండి ఉదయించి విస్తరించినది. నన్నయగారు భారత కథ చెప్పిన రోమహర్షణిని 'కథాకథన దక్షుడు' (ఆది. 1-29) అన్నారు. ఈకథనదక్షత కథాగత వివిధవస్తు ధ్వనులను ప్రసన్న మొనరించును.[28] కాగా. 'ప్రసన్న కథా కలితార్థయుక్తి' అన్న నన్నయగారి సాహిత్య వివేచనా నిష్పన్నమైన సూత్రము కావ్యసంధి కథాపరమైన మౌలిక తను వ్యక్తపరచుచున్నది.

## సూత్రము - 2
## అ క్ష ర ర మ్య త

కథావిషయమును ప్రతిపాదించిన సూత్రమును అనుసరించి యున్నది రెండవది 'అక్షర రమ్యత'. కథా ప్రధానములుకాని కావ్య ములకును అనువర్తించుట కనువుగా, ఈ యంశము విడిగా సూత్రీక రింపబడినది. అక్షరములయొక్క రమ్యత, అక్షరమైన రమ్యత అని

ఉభయవిధముగా సమన్వయించుకొనవీలయిన సూత్రమిది. ఇది ఉత్తర పదార్థ ప్రాధాన్యముగల పదబంధము. కావ్యమునం దాద్యంతము 'రమ్యత' వ్యాపించి యుండవలసిన యంశముగా నన్నయగారు భావించినారు.

డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి మాటలలో ఈ అక్షర రమ్యత – 'శబ్దగతాక్షరగతమైనది. ఆ యక్షరములను ధ్వని ఆశ్రయించినది. దానిని గ్రహించు నేర్పు శ్రవణేంద్రియ గతమైయుండును.'[29] సంగీత సాహిత్యములలో అక్షరరమ్యతనుగూర్చి విచారించుచు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు – 'నాదవ్యక్తికి సహాయంగా వచ్చేభాష అసంయుక్తపరుష సరళమయంగా ఉంటేనే గానకళ తలయెత్తుకుని మెరుస్తుంది' [30] అనుటలో భాషయందు హల్లుల అసంయుక్తత్వము అక్షర రమ్యతగా సూచితము. ఈ అసంయుక్తత్వము కర్ణపేయమగు నాదానుస్యూతికి మూలము. ఈ దృష్టితోనే పారుష్య విరహితమై గాంభీర్యకారణమైన శబ్దప్రయోగ మక్షర రమ్యతయని భావించిన పింగళి లక్ష్మీకాంతముగారు దానిని 'శబ్ద జటిలత' (Closeness of words) కు వ్యాపింపజేసినారు.[31] ఈ జటిలతను లక్షించియే కావచ్చు. డా. అవధానిగారు అక్షర రమ్యత యున్నది. 'శయ్య'గా భావించినారు. 'పదములయొక్క పరమమైన అన్యోన్యమైత్రియే శయ్య' అని విద్యానాథుని నిర్వచనము.[32] విద్యానాథుడు తెలుగువాడు. నన్నయగారి కర్వాచీనుడు. 'ప్రతాపరుద్ర యశోభూషణ' కర్త. సాహిత్య విమర్శకుడుగా ఆయన సంకేతించినదీ 'శయ్య'. దీని నాధారించుకొని––

> ఏశబ్దముల తరువాత నేశబ్దములను వాడిన శ్రుతి సుభగముగా నుండునో గ్రహించి దానినట్లుచితరీతి వాడుచుండవలయును. అట్లు పొందికగల పదములను వాడుటకే 'శయ్య' యనిపేరు, అదే అక్షర రమ్యత.[33]

అని డా. అవధానిగారి నిర్ధారణ. విద్యానాథుడు శ్రుతిసుభగతా విష యము చెప్పలేదు. అయినను పదముల అన్యోన్య పరమమైత్రి యనుట వలన ఈ సుభగత్వము కలుగనే కలుగును. అయితే, ఇవి మాత్రమే కాక —

> పదసంఘటనా రూపమైనరీతి, వర్ణసంఘటనా రూపమయిన వృత్తి, పదముల అన్యోన్య మైత్రీ రూపమైన శయ్య, పద పరి వృత్త్యసహిష్ణుతారూపమైన పాకము– ఈ సర్వమును నన్నయ అక్షర రమ్యత [34]

అని డా. పాటిబండ మాధవశర్మగారు వివరించినారు.

క్రమముగా పర్యాలోచించినచో, అక్షర రమ్యత యనగా – అక్షరముల గ్రథనమందలి కౌశల్యముచేత నిష్పన్నమగు రమ్యత. సర్వవాక్సమాజ మక్షరమయము. అక్షరములు క్రమముగా పదములై వాక్యములై, మహావాక్య / కావ్యములై సాహిత్య ప్రపంచమును అనుభవమునకు తెచ్చుచున్నవి. కావున అక్షరగతమైన రమ్యత కావ్య మునందు విశ్వరూపము నొందును. 'ఏశబ్దమును వాడిన శ్రుతిసుభగ ముగానుండు 'నన్నది శబ్దములనుండిగాక, అవి యేర్పడుటకు మూల మైన అక్షరముల నుండి గమనింపదగినది. 'శ్రుతి శుభగత్వ' మన్నది సంకుచితము. 'రమ్యత' యన్నది విస్తృతము. స్థూలముగా చూచి నచో ఏకార్థకములన్నట్లు కన్పించు పదము లనేకములున్నను ఏవిధ మైన అక్షరముల కూర్పుతో రూపొందిన పదము రమ్యతను సంపా దించు నన్నది ప్రయోక్త గమనింపదగినది. అక్షరముల కూర్పు అర్థ సంపాదకము. అర్థప్రసన్నత రసవ్యక్తికి మూలము. కాగా, పరమా ర్థతః అక్షర రమ్యత రసాభివ్యక్తియందు పర్యవసించుచున్నది. రసాను గుణత్వము ననుసరించి అక్షరములకూర్పును లక్షించుచు పూర్వులు కొంత వివేచన సాగించినారు. అదిస్థూలము. అవిశదమైన వివేచన

ఎంతయైనను పాక్షికమే. ప్రయోక్తయొక్క ప్రతిభననుసరించి అక్షరములు తమ కలయిక ద్వారా తమ రమ్యతను సువ్యక్తపరచును. అందువలన ఫలానా యక్షరముల ఫలానా విధమైన గ్రథనమే రమ్యతాపాదకమని నిర్ధారించుటకు వీలులేదు. డా. అవధానిగారు స్పష్టీకరించినట్లు—'కేవల మృదులాక్షర ఘటితములైన పదములచే మాత్రమే రమ్యత ఏర్పడునని తలపరాదు. ఆది పదములందలి సరలతా పారుష్యములపై కంటె, రసానుగుణత్వముపై నెక్కువగా ఆధారపడి యుండును'.[35] మరియు, సర్వకావ్యములు రసప్రధానములుకావు. వర్ణనాది ప్రధానములు నగును. ఆయా కావ్యములందును ఈ విధమైన ఘట్టములుకూడ ఉండును ఆట్టి స్థితియందును అక్షర రమ్యతను కవి సాధించును. ఈవిధముగా అక్షర రమ్యత సర్వవిధ కావ్యజాతమునకు అభివ్యాప్తమగుచున్నది. అందువలననే, అక్షరములను వాలికముగా గ్రహించి రమ్యతా ప్రతిపాదనము చేసిన నన్నయగారు కావ్యము మొత్తము విషయముగా నిరుపపదమైన రమ్యతను, తదర్థకములైన రుచిర, హృద్య రంజన రోచన, రమణీయాది పదముల నుపయోగించి రమ్యతయొక్క అనవధికత్వమును సూచించినారు. భారతమున సర్వానుక్రమణికలో సర్వగతాంశములను సూచించు పద్యమునందు, కొన్ని ఆశ్వాసముల చివరలందు 'రమ్యము' లిత్యాది పదప్రయోగము గమనింపదగినది. కావున కావ్యరమణీయత యంతయు అక్షర రమ్యతగా నన్నయగారు ప్రతిపాదించినారు. కావ్యమందు ఏకదేశ గతముగాక, ఆద్యంతము వ్యాప్తమగుటచే ఈ 'అక్షర రమ్యత'[36] నిజముగా అక్షరమైన-క్షరముకాని రమ్యతయే.

మరి, ఈ వివేచన మంతయు కేవలముగా అక్కడక్కడి పొడి పొడి మాటలను సమీకరించి నిష్పన్నము చేయబడినదికాదు. మూడవ సూత్రమగు 'నానారుచిరార్థ సూక్తినిధి' యన్నది ఈ విశ్లేషణము నంతటిని సమర్థించుచున్నది.

## సూత్రము – 3

## నానారుచిరార్థ సూక్తినిధి.

'నానారుచిరార్థ సూక్తినిధి' యన్నది, సత్యనారాయణ గారన్నట్లు— నన్నయగారు తనకది యొక బిరుదముగా చెప్పికొన్నట్లు[37] భాసించును. కాని, అది కావ్య సిద్ధాంత ప్రతిపాదకమైన ప్రధాన సూత్రము. నన్నయగారు "నానారుచిరార్థ సూక్తినిధి" యగుట ఆయన కావ్యము వలన స్పష్టమగును. కారణము కావ్యము "నానా... నిధి" యగుటయే కావున కావ్యము నానారుచిరార్థ సూక్తినిధి కావలయును. మొదటి సూత్రముల ద్వారా ప్రతి పాదించిన యంశములను నన్నయగారీ సూత్రమున సమీకరించినారు.

'నానారుచిరార్థ సూక్తినిధి' యనగా-అనేక విధములైన రుచిరములగు అర్థములను సూక్తులకు కావ్యము నిధికావలయునని అర్థము. మరి, సూక్తులనగా నేమి? నైనందిన జీవితములో వివిధ సందర్భములందు ఉదాహరించుకొనుటకు యోగ్యములైన "సుభాషితము"లని సామాన్యముగా అర్థము చెప్పబడుచున్నది. "నన్నయగారి సూక్తులు జగత్ప్రసిద్ధము"[38] లని సత్యనారాయణగా రనుటలోని తాత్పర్యమిదే. ఈ ధోరణిలోనే—

> సూక్తులనగా సుభాషితములనియేగాక, సామెతలు, నానుడులు జాతీయములు (పదగతములు, వాక్యగతములు) నీతిబోధక వాక్యములు మున్నగునవియని గూడ విశాలమైన యర్థమును గ్రహించవచ్చును.[39]

అని డా. అవధానిగారనగా, భారతము "లోకాగమన్యాయైకాంత గృహము" అని నన్నయగారన్నారు కావున అట్టి న్యాయ ప్రతిపాదక వాక్యములు "సూక్తు" లని, వాటినాయన 'రుచిరార్థవంతములుగా

తీర్చుటకు యత్నించె' నని డా. పాటిబండవారభిప్రాయపడినారు.[40] ఈ ధోరణిలోనే ఇంద్రగంటివారు :

> రుచిరార్థ మనుమాటను కవితాపరముగా గ్రహించుటలో వినిగమకము లేదు. అది "ప్రసన్న కవితార్థయుక్తి" అనుమాటతో గతార్థమగుచున్నది. కాగా— రుచిరార్థమనగా ఉజ్జ్వలమైన ధర్మనీతిబోధనమనియు, సూక్తి యనగా అనుభవ పరిపాకములో గ్రహించిన జీవనసత్యములకు చెందిన లోకోక్తులనియు గ్రహించుట మేలు.[41]

అని భావించినారు. ఈ విధమైన అభిప్రాయముల కనుగుణముగా నన్నయగారి రచనలోని అనేకవాక్యములు, పద్య / పద్యభాగములు లోకోక్తులు, సుభాషితములు, నానుడులుగా దేశమున ప్రసిద్ధములు. అవన్నియు నంత ప్రసిద్ధములైనవనగా అది నన్నయగారి పరమమైన లోకజ్ఞతకు నిదర్శనము. కాని, ఈ సూత్రము నన్నయగారి రచనకు మాత్రమే పరిమితముగాదు. 'సూక్తు'లకే సంకుచితముకాదు. దాని పరిధి చాలా విస్తృతము. మరియు "రుచిరార్థమను మాటను కవితా పరముగా గ్రహించుటలో వినిగమకము లేదు" అనుటకు వీలులేదు. అనంతరకాలీనుడైన జగన్నాథ పండితుడేగాక, పూర్వుడైన దండి చెప్పిన యంశములు వినిగమకములు ఇక్కడ స్పష్టముగా కవితాపరమై కుదురుచుండగా, మొదటి సూత్రమున నుండి వీలులేని "కవితా-" పదముచే నిది గతార్థ మనుటయు కుదరదు.

నన్నయగారి కంటె అర్వాచీనుడు, తెలుగువాడు, సుప్రసిద్ధాలంకారికుడు, ప్రామాణికుడునగు జగన్నాథ పండితరాయలు తనకన్న పూర్వలాక్షణికుల కావ్యనిర్వచనములను సయుక్తికముగా నిరాకరించి సమగ్రముగా తానుచేసిన కావ్యనిర్వచనము అచ్చముగా నన్నయగారి "రుచిరార్థ సూక్తి" కనువాదముగా కన్పించును. ఈ యంశమును డా. శ్రీరామమూర్తిగారు ఈవిధముగా వివరించినారు:

> రుచిరార్థమనగా రమణీయార్థమని యర్థము గదా! ప్రతిపాద కత్వమన్న శబ్దార్థములకుగల సంబంధము. రుచిరార్థసూక్తి యనగా రమణీయార్థ ప్రతిపాదక సుశబ్దము [42]

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దఃకావ్యమ్'అను తన కావ్య నిర్వచనమున జగన్నాథుడు "శబ్ద"పదము నుపయోగించినాడు. నన్నయగారి నిర్వచనములో "సూక్తి"పదమున్నది. సు + ఉక్తి, ఉక్తి మరియు శబ్దము అనునవి స్థూలముగా సమానార్థకము లన్పించినను, ఈషద్ భేదమున్నది. 'ఉక్తి' అనగా చెప్పబడినది అనియర్థము. చెప్పెడివా డుద్దేశించిన యర్థముగూడ ఉన్నదన్న స్ఫూర్తి ఉక్తిపదమువలన కలుగును. ఇందు వలననే కావచ్చును, డా. శ్రీరామమూర్తిగారు "ఉక్తి యనగా శబ్దార్థముల సమాహారమని యర్థము చేసికోవలెనన్నారు. కాని, ఇట్లర్థము చేసికొన్నచో "రుచిరోక్తి" అనుటయే చాలును. 'అర్థ' పద మనవసరము. కాని, సూత్రమున 'అర్థ' పదముకూడ ఉన్నది. కావున "ఉక్తి"యనగా కేవలము "శబ్ద'మనియే చెప్పవలయును. జగన్నాథుడు గూడ ఈ యంశమునే బలపరచినాడు. అయితే కేవలముగా "ఉక్తి" అనక, సు X ఉక్తి = సూక్తియనుట నన్నయగారి విశేషము. అర్థము రుచిరము కావలయునట్లు ఉక్తి సూక్తి కావలయునని ఆయన నిర్ణయము. అర్థమునందు రుచిరత్వ ముండుటయేకాక, తదర్థ ప్రతిపాదకమైన ఉక్తియందును సుష్ఠుత్వము ఉండవలయును. కాగా రుచిరమైన యర్థమును ప్రతిపాదించు రుచిరమైన ఉక్తి (సూక్తి) యే కావ్యము "ఉక్తి" విశేషము కావ్యమన్న రాజశేఖరోక్తి [43] నన్నయగారి నిర్వచనమునకు కొంతగా ప్రేరకమన్పించును.

ఈ 'రుచిరార్థ సూక్తి"కి ఆదియందు "నానా" యని, అంతమందు "నిధి" యని నన్నయగారు చేర్చుట మరొక విశేషము. ఉక్తి లేదా శబ్దము-ఇవి ఏకత్వబోధకములు. అయితే ఉక్తి లేదా శబ్దము

కావ్యమన్నను ఒకే శబ్దము కావ్యమగుట నెవ్వరును భావించి యుండ లేదు. 'ఇష్టార్థ వ్యవచ్ఛిన్న పదావళి కావ్య' మని దండినిర్వచనము. ఇందలి 'పదావళి' పదసమూహము కావ్యమని స్పష్టపరచును. నన్నయగారి "రుచిరార్థము"నకు దండి "ఇష్టార్థము" ప్రేరకము కావచ్చును. అందువలన "పదావళి"లోని ఆవళి 'నానా' ప్రయోగమునకు ప్రేరకమయియుండును. అయితే 'నానా' యనునది సమూహత్వముతో బాటు వైవిధ్యమును గూడ సూచించుట ఇక్కడ విశేషము. ఇట్లు నానావిధములైన రుచిరార్థ ప్రతిపాదకములగు సూక్తులకు కావ్యము 'నిధి' కావలయును. కావ్యమాద్యంత మీవిధమైన సూక్తులమయము కావలెనని, కాగా "నానా రుచిరార్థ సూక్తినిధి' కావ్యమని నన్నయగారి నిష్కర్ష.

ఇక్కడ గమనించవలసిన మరొక యంశమున్నది. "అర్థము" అనగా కావ్యవస్తువు. ఉక్తి అనగా కావ్యరూపము. ఈ వస్తురూపములు పరస్పరము అన్యూనాతిరిక్తముగా నుండవలయును. ఈయంశము "అర్థ–ఉక్తి' పదములకు 'రుచిర–సు' అను పద–ఉపసర్గలను చేర్చుటద్వారా సూచింపబడినది. కాగా కావ్యము వస్తు-రూపముల సమన్వితరూపమని నన్నయగారి తాత్పర్యము.

జగన్నాథ పండితరాయలు తన కావ్యనిర్వచనమును నిరూపించుచు పూర్వులు చెప్పినవాటిని నిరాకరించుటలో చేసిన చర్చయంతయు నన్నయగారి ఈ సూత్రమువద్దచేసి పరిశీలించుకొన వచ్చును. అప్పుడు నన్నయగారి విచారమౌలికత మరింత ఉజ్జ్వలితమగును.

నన్నయగారి మౌలికమైన ఈ విచారమంతయును, పరమ వివేక సౌరభ విభాసితము'లని ఆయన "ముదంబొనరం గొనియాడి"న 'సత్సభాంతరము'లందు ప్రస్తుతీకరింపబడి ఆమోదింపబడినది. నన్నయగారి ఈ కావ్యవిచారమార్గము నిశ్చితమైనవి. కాగా, విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు :

ఈ మార్గమునే నాల్గువందల యేండ్ల తరువాత జగన్నాథ పండితరాయలు తన రసగంగాధరమునందు ప్రపంచించినాడు. అటు కాశ్మీర, మిటు వేంగీదేశము అలంకార శాస్త్రమునకు రెండు సూర్యోదయ పర్వతములనలెనున్నవి. అభినవ గుప్తుడు కాశ్మీర దేశ విద్వన్మార్గమును ప్రపంచింపగా,జగన్నాథ పండితుడు వేంగీ దేశ విద్వత్పరిషన్మార్గమును ప్రపంచించినాడు. 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అన్న జగన్నాథుని సూత్రము జగన్నాథుని కల్పనకాదు;వేంగీ పరిషత్తుల నిశ్చితాభిప్రాయము[44]

ఈ అభిప్రాయమునకు తన మౌలికవివేచన ద్వారా రూపకల్పనచేసి సమగ్రతను సంపాదించినది నన్నయగారు.

## కథా స్వరూప వివేచన

భారత కథాప్రస్తావనలో ఇమిడిపోవునట్లుగా నన్నయగారు చేసిన కథాస్వరూప నిరూపణము 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' యన్న మొదటి సూత్రమునకు అనుబంధ వృత్తిగా గమనింపవలసినయంశము. 'నావలన నెక్కథ వినవలతురు' (ఆది. 1-29) అని రోమహర్షణి శౌనకాదిమునుల నడిగినప్పుడు వారు వెలువరించిన యభిప్రాయముగా నన్నయగారీ పద్యము (1-30) రచించినారు.

ఏయది హృద్య, మపూర్వం
బేయది, యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు, నఘ నిబర్హణ
మేయది- యక్కథయ వినఁగ నిష్టము మాకున్.

ఇక్కడ శౌనకాది మునులు సహృదయులగు శ్రోతల / పాఠకుల స్థానములో నుండుట గమనింపదగినది. సహృదయుల నైపునుండి వివేచన సాగుచున్నదని తాత్పర్యము. తమకు విన 'నిష్ట' మైన కథకు వారు

భావించిన నాలుగు లక్షణములను నన్నయగారు ఒకపద్ధతిలో కూర్చి నారు. అవి : 1. హృద్యత, 2. అపూర్వత, 3. ఎఱుక సమగ్రముగా కలిగించవలయుట, 4. అఘునిబర్హణత, ఇవి అనుశీలింపదగినవి.

మొదటి లక్షణము కథహృద్యము కావలయుట. రెండవది అపూర్వము కావలయుట. ఈ రెండును పరస్పర సంబద్ధములవలె ఉన్నవి. హృద్యము విషయ మటుండగా, అపూర్వ మనగానేమి ? 'భారత' సందర్భమును బట్టి చూచినచో, మునులు రోమహర్షణి నడిగి నప్పుడు భారతకథ 'యపూర్వమైన కావచ్చునేమోకాని, నన్నయగారి నాటికది అక్షరాలా అపూర్వముకాదు. కావున నన్నయగారి నాటి భారత శ్రోతలకు / పాఠకులకు అది విదితపూర్వమే. మూలమున కను వాదప్రాయముగా వ్రాయబడిన పద్యముకాదిది. నన్నయగారి స్వీయ వివేచనా నిష్పన్నమైన నిర్ణయముగా రూపొందినదిది. మరి, నన్నయ గారు కథ యపూర్వము కావలయుననుటచే తాత్పర్యమేమి ?

'అపూర్వ'త్వ మనునది రెండు విధములుగా నుండును. అంతకు ముందు లేనిది. క్రొత్తగా కల్పితమైనది యగుచో ఆ కథయందుండు అపూర్వత్వ మొకవిధమైనది. 'క్రొత్తొక వింత'గా అది యుండును. అంతకు ముందు లేని, లేదా వినని కథయైనచో, కథలో ముందేమి జరుగునో తెలుసుకొనవలయునన్న పాఠకుని ఉత్సుకతను ఈ అపూర్వ త్వము రెచ్చగొట్టును. ఒకసారి వినిన / చదివిన తరువాత, ఇక ఆ అపూర్వత్వము ఉండదు. ఉత్సుకతయు ఉండదు. కాగా, ఇది కాలిక మైన అపూర్వత, కథకు దాని 'ఉత్పాద్యత్వ' లక్షణమును బట్టి ఇది కలుగుచున్నది. మరి, కథ ఉత్పాద్యమైనప్పుడే ఆ పూర్వతము ఉండు నను కొన్నచో, — 'అతి విచిత్ర కవి పరంపరా వాహినియగు ఈ సంసారమునందు కాళిదాసాదులగు ఏ ఇద్దరో ముగ్గురో మహాకవులుగా పరిగణించ బడుచున్నారు' అని ఆనందవర్ధనుడు ప్రస్తావించిన[45] కాళి

దాసాదులు 'అపూర్వ కథా' రచనా దక్షులు కారనియే చెప్పవలసి యుండును. వారు తమ కావ్యములందు నిర్వహించిన కథలన్నియు ఇదివరకటివే. దండి మాటలలో చెప్పినచో అవన్నియును 'ఇతిహాస కథోద్భూతము'లే. ప్రసిద్ధములు. కాగా అవి అపూర్వములు కావు. మరి, వారి కావ్యములందు అపూర్వత్వము లేదా ? ఉన్నది. అయితే, అది కాలికమైనది కాదు. మరొకవిధమైనది.

పూర్వము ఉన్నదేయైనను కవియొక్క ప్రతిభావిశేషముచేత, కథనరీతి ననుసరించి,నిర్వాహణరీతిని పురస్కరించుకొని, భంగీవైచిత్రిని బట్టి, లోకజ్ఞతలోని లోతుననుసరించి— ఇంక ననేక విధములుగా కథ యందు 'అపూర్వము' సంకలితమగును. ఒక భావము పూర్వము వ్యక్తీకరింపబడినదేయైనను, మరల వ్యక్తీకరించుటలో క్రొత్తదనము కలుగుననుచు ఆనందవర్ధనుడు —

కృతే వర కథాలాపే, కుమార్యః పులకోద్గమైః
సూచయన్తి స్పృహామన్త, ర్లజ్జయాఽ వనతాననాః [46]

అను శ్లోకమంతకు ముందే యున్నను, అందలి భావము నే —

ఏవం వాదిని దేవర్షౌ, పార్శ్వే పితురధోముఖీ
లీలా కమల పత్రాణి, గణయామాస పార్వతీ [47]

అని కాళిదాసు వ్యంజించినరీతి 'అర్థశక్త్యుద్భావానురణనరూప వ్యంగ్యమునకు కవి ప్రౌఢోక్తి నిర్మిత శరీరత్వముచేత నవత్వము కలిగినది' అని వివరించినాడు [48] ఇక్కడ లజ్జాభావ వ్యక్తీకరణమునందు నవత్వము సిద్ధించినది. ఇట్లే కథయందును. కాగా, కాలికమైన అపూర్వత్వముకన్న ఈవిధమైన అపూర్వత్వము స్థిరాంశము. రోమహర్షణి 'కథాకథన దక్షుడు' అని నన్నయగారనుట ఈ సందర్భమున గుర్తింపదగినది. అపూర్వత్వమునకు ప్రసన్నకథా కలితార్థయుక్తిత్వముతో పాటుది కథాకథనము. ఇట్లు నన్నయగారు ప్రధానముగా రెండవ

అపూర్వత్వమును, గౌణముగా మొదటి దానిని లక్షించినా రనవల యును.[49]

ఈ అపూర్వత్వము కథకు హృద్యత్వమును కల్గించుటలో ప్రధాన హేతువు. ఇదిట్లుండగా, హృద్యత్వము కథయందలి హితలక్ష ణమువలన నెక్కువగా నుండును. 'హితము, మనోహరమునైన వాక్కు దుర్లభ'మన్నాడు భారవి. కాని, హితముకాని మనోహర త్వము = హృద్యము నిజమైనది కాదు. స'హిత'మైనదే హృద్యము. కాగా, హృద్యత్వ మీవిధముగా కథయందు సమాహితము కాదగినది.

ఎఱుక సమగ్రముగా కలిగించునది కావలయుట కథావిషయ మున ఆశింపబడిన మూడవ యంశము. మరి, యెఱుక = జ్ఞానము దేనికి సంబంధించినది? విచారింపగా, ఉభయమునకు సంబంధించినది. ఒకటి: లోకము, రెండు: తాను = ఆత్మ, లోకజ్ఞతనుండి నిష్పన్న మైన కథ శ్రోతకు లోకవృత్తము గూర్చిన ఎఱుకను కలిగింపవల యును. అనంతరకాలమున మమ్మటుడు కావ్య ప్రయోజనములలో పేర్కొన్న 'వ్యవహార వేతృత్వము' ఇక్కడ గుర్తుచేసికొనవలయును. ఇది ఎఱుకకు సంబంధించిన యొకపక్షము. రెండవది తాను. సమగ్ర మైన ఎఱుక అనగా ఆత్మజ్ఞాన మనవలయును. ఆత్మయొక్క ఆనంద స్వరూపజ్ఞానమే జ్ఞానసమగ్రతాలక్షణము. కావ్య విషయికముగా నిది రసానందము. 'ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచితి' (ఆది. 1–10) నని రాజరాజ నరేంద్రుడు డన్నట్లుగా నన్నయ గారు చెప్పినారు. కాగా కావ్య కథకు రసాన్వితత్వము వారు భావించి నారనుటలో విప్రతిపత్తియుండ నక్కరలేదు మరి. ఉదాత్తరసము లనగా నేవి? పూర్వుల వివేచన ననుసరించి శృంగార, వీర, కరుణ, శాంతములు ఉదాత్తరసములు[50] భారతమునకు ఆనంద వర్ధనాభినవ గుప్తులు,[51] రామాయణమును కుంతకుడు[52] శాంత రసాన్వితముల

నుగా లక్షించినారు. ఎఱుక సమగ్రమగుట శాంతరసమునకు అచ్ఛముగా సరిపోవు లక్షణము. అభినవగుప్తుడు శాంతమునకు తత్త్వ/ఆత్మజ్ఞానము స్థాయి భావముగా చెప్పినాడు.[53] నన్నయగారి యంశము నీవిధముగా సూచించినారు. రాజరాజనరేంద్రునిచే మొదట ఉదాత్త రస ప్రస్తావన చేయించుటయు, ఇక్కడ కథావిషయికముగా మునులచే ఎఱుకయొక్క సమగ్రతను చెప్పించుటయు ఈ సూచనను స్పష్టపరచును. కాగా, ఇక్కడ కథకు శాంతరసాన్వితత్వము లక్షింపబడుచున్నది.

'ఉదాత్తరసాన్విత కావ్యనాటక క్రమము' లన్నప్పుడు ఆ సమాసమందలి రసపదమునకు ఏకవచన, బహువచనత్వములు రెండును లక్షింపదగినవి. ఉదాత్త రసము/రసములచే నన్వితమైన కావ్యములః నాటకముల క్రమములు. కాగా, శృంగారాది నాల్గురసములతోడి అన్వితత్వము సంభావింపదగినది. నిజమునకు విశ్వనాథ సత్యనారాయణ గారన్నట్లు:

> భారతము నందొక రసముండి మరియొక రసము లేదనుటకు వీలులేదు. కాని, శాంతరసము ప్రధానమైనదని చెప్పవలెను.[54]

అనగా, భారతము ప్రవృత్తిపరమైన శృంగారాద్యష్ట రసములకును విహార భూమియేకాని, ఇవన్నియు నివృత్తిపరమైన శాంతరసాభిముఖీనములగుటచే భారతము శాంతరస ప్రధానమని తాత్పర్యము. శృంగారాదులను శాంతమునందు పర్యవసించు విధముగా నిర్వహించుటవలన ఎఱుకకు సమగ్రత్వము సంపాదింపబడును. ఈవిధముగా నన్నయగారు కథకు శాంతరసాన్వితత్వమును ప్రతిపాదించినట్లు భాసించును.

భారతము దృష్టితో నిది సరికావచ్చునుగాని, ప్రతి కావ్యకథయు శాంతరసాన్వితము కావలయుననియే నన్నయగారు భావించియుందురా? మరొకవిధముగా విచారించినచో, ఆయన 'శాంత'మని

ప్రత్యేకముగా చెప్పకపోవుటవలన ఉదాత్తరసము లన్నింటిని ఆయన లక్షించినా రనవచ్చును. అయితే, ఉదాత్తరసములందును ఆయనకు మొగ్గు శాంతమువైపున్నదని మాత్రమే భావించవచ్చును.

కథా విషయికముగా నాల్గవ లక్షణము 'అఘనిబర్హణ'త్వము. పాపమును నిరోధించుట / నశింపజేయుట. ఈ చేయు లక్షణము కథ యందుండవలయును. మరి, పాపమును కథయెట్లు నిబర్హణముచేయును? పాపము-పుణ్యము అనునవి కర్మమును బట్టి. ఆ కర్మ చేయునది వ్యక్తి. 'పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడన' మ్మనుట ప్రసిద్ధము. పర పీడన పరాయణమైన ఏ కర్మ అదెంతటిదైనను, పాపహేతువు. ఈ కర్మను నిరోధించినచో పాపము విరుద్ధమగును. నశించును అనగా కథ వ్యక్తిని పాపహేతువైన కర్మము నుండి నిరోధించుటకు ఉద్బోధించునది కావలయునని తాత్పర్యము. అప్పుడా కథ "అఘనిబర్హణ" మగును. ఈ లక్షణము హితోద్బోధకము కథ కావలయునని చెప్పిన ట్లగుచున్నది.

ఈ విధమైన నాలుగు లక్షణములుగల కథను కావ్యమున కెన్నుకొని/కూర్చుకొనవలయునని నన్నయగారి తాత్పర్యము. ఈ లక్షణములు భారత కథకవి కాదు. కావ్యకథకు అందుకనియే నన్నయగారి లక్షణములను కథాసామాన్యముగానే నిర్దేశించినారు తప్ప, భారత కథకని ప్రత్యేకించలేదు.

భారతీయ సాహిత్య విమర్శ సంప్రదాయమందు 'కథావిచారణ చేసినది ముగ్గురు విమర్శకులు మాత్రమే. మొదటి యిద్దరు భామహుడు, దండి,[55] చివర నన్నయగారు. మొదటి యిద్దరు 'భావిక(త్వ)'మును "ప్రబంధ విషయ గుణము"గా ప్రతిపాదించినారు. ఆ భావిక(త్వ)ము కథకు సంబంధించినది. వారిద్దరు చెప్పిన యంశము లను సమీకరించినచో ఎనిమిదంశములు నిష్పన్నములగును.[56]

1. కథ ఋజువుగా సాగిపోవలయును.
2. కథయందు చిత్రోదాత్తాద్భుతార్థత్వము ఉండవలయును.
3. కథాంశములు పరస్పరోపకారకములుగా సంధింపబడవలయును.
4. వ్యర్థ విశేషణములను వదుల వలయును.
5. స్థాన (సందర్భ) మును బట్టి వర్ణనలు చేయవలయును.
6. వస్తువు గంభీరమేయైనను శబ్దానాకులత్వముతో– ఉక్తి క్రమబలముతో సువ్యక్తము కావలయును.
7. భూత భవిషదర్థములు ప్రత్యక్షములువలె దర్శితము లగునట్లు చిత్రింప బడవలెను.
8. ప్రబంధములందు కథయంతయు కవ్యభిప్రాయపరమై సాగవలయును.

రెండవది, చివరిది తప్ప మిగిలినవన్నియు కథా నిర్వాహణమునకు సంబంధించినవి.[57] కథను కవి తన యభిప్రాయమునకు అనుకూలముగా మలచుకొనవలయు నన్నది చివరి యంశము. అచ్చముగా రెండవది మాత్రమే కథా స్వరూపమునకు సంబంధించినది. కథయందు ఉత్సుకత్వమును కలిగించుటకు ఈ లక్షణము తోడ్పడును కాగా, నన్నయగారు కథాస్వరూపమును గూర్చి చేసిన విచారమును నిరూపించిన లక్షణములను భామహుడు, దండి చెప్పిన యంశములతో పోల్చి పరిశీలించుకొన్నచో నన్నయగారి మౌలికత స్పష్టమగును. కీలకములు ప్రాణభూతములైన యంశముల నాయన పట్టుకొని ప్రస్తుతీకరించిన రీతి గమ్యమానమగును.[58]

## కావ్య ప్రయోజనము జగద్ధితము.

నన్నయగారు సాగించిన కావ్య విచారములో చివరిది కావ్య ప్రయోజనము. అది "జగద్ధితము". తాను 'జగద్ధితంబుగన్, మహా

భారత సంహితారచన బంధురు' డైనట్లు ఆయన చెప్పినారు. నన్నయ గారికన్న పూర్వము పలువురు సాహిత్య మర్మజ్ఞులు కావ్య ప్రయోజనములను పలువిధములుగా చెప్పినారు. బుద్ధి వివర్ధనము. లోకోపదేశ జననము యశస్సు, హితము మొదలైన వాటిని నాట్యశాస్త్రము; ధర్మార్థ కామ మోక్షములయందు. కళలయందు వైచక్షణ్యము. కీర్తి ప్రీతి అని భామహుడు; ప్రజలకు వ్యుత్పత్తి అని దండి; అర్థము, అనర్థోపశమమని రుద్రటుడు; ప్రీతి - కీర్తి హేతుకములై నదృష్టాదృష్టార్థములని వామనుడు; ప్రీతియని అభినవగుప్తుడు ఈ విధముగా కావ్య ప్రయోజనములను పలువురు వ్యక్తీకరించినారు. మరి, నన్నయగారు లక్షించిన కావ్యప్రయోజనము. ఈ యన్నింటికన్న విలక్షణ మగుటయే కాక, ఈ యన్నింటిని గర్భీకరించుకొనుచు సమగ్రత్వమును సాధించుచున్నది.

నన్నయగారు తాను లక్షించిన 'జగద్ధితమ'ను కావ్య ప్రయోజనమును పలుచోట్ల ప్రస్తావించి దాని ప్రాధాన్యమును సువ్యక్తపరచినారు. '...పరాశరాత్మజుండు, విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండఁజేసె భారతంబు' (ఆది. 1-32) అన్నారాయన. విష్ణువు సర్వవ్యాపకుడు. లోక స్థితికారకుడు. ఇది ప్రసిద్ధము. కవియందు గూడ ఈ లక్షణములు లక్షితమగుచున్నవి. కవి తన లోకజ్ఞతచేత, భావనాశక్తిచేత విశ్వవ్యాపకుడు. సృష్టియొక్క, చరాచర జీవ సంతాన ప్రవృత్తులయొక్క రహస్యముల నాకళింపు చేసికొనువాడు. లోకప్రవృత్తి నుదాత్తీకరించుటకు సర్వథా ప్రయత్నించువాడు. విశ్వము యొక్క సుస్థితి, హితము ఆయనకు ధ్యేయములు. వ్యాసునియందు విష్ణు సన్నిభత్వము భారత రచనా సందర్భమున పలుచోట్ల నన్నయగారు విశేషలక్షణముగా ప్రస్తావించినారు. వ్యాసుడు విష్ణువు యొక్క అవతారమన్న విషయము అటుండగా, ఇక్కడ వ్యాసుడు ప్రధానముగా భారత సంహితా రచన బంధురుడు. నిజమునకు వ్యాసుడు

త్రిమూర్త్యంశాత్మకుడుగా కూడ గౌరవించబడును.[59] ఆయనయొక్క వైశ్వికలక్షణము నిది సూచించును. కాగా, కవిగా వ్యాసుడు విష్ణువు ఆయన కావ్యము లోకానుగ్రహ ప్రవృత్తి పరమైనది. నన్నయగారా యంశమును ప్రధానీకరించినారు.

'ఆంధ్రశబ్ద చింతామణి' ఆరంభమునందు కావ్యప్రయోజనము "విశ్వశ్రేయస్సు" అని నన్నయగారు నిర్ధారించినారు. భారత రచన నారంభించుచు మరల అదే అంశమును ప్రతిపాదించినారు. "వేద త్రియ మూర్తులు మీ శ్రేయస్సుకొరకు కగుదురు"- అని భారతాది పద్యము- 'శ్రీ వాణీ గిరిజాశ్చిరాయ...' యందాయన వ్యక్తీకరించిన ఆకాంక్ష. ఆ వేదత్రయ మూర్తులు పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరులు, శ్రీ వాణీ గిరిజలతో అవినాభావులు. లోకములోని స్త్రీపుంస యోగోద్భవమగు అవిహతమైన స్థితిని సమగ్రముగా వహించువారు- రక్షించువారు. లోకగతమగు సమాజము స్త్రీ పుం మయమైనది. వారి యోగలక్షణము చేతనే స్థితిని- ఉనికిని పొందుచున్నదివారు. వారి యాగిక ప్రవృత్తి లేనిచో సమాజములేదు. కాగా వారి ప్రవృత్తి యొక్క ఉదాత్తత్వము మీద శ్రేయస్సు ఆధారపడియున్నది. ఆ శ్రేయస్సు వ్యష్టిసమష్టిగతము. అనగా, ఏకదేశగతమని కాదు - మొత్తము విశ్వమునకు అభివ్యాపించునది. అందువలన అది 'విశ్వశ్రేయస్సు', 'జగద్ధిత' మన్నది విశ్వశ్రేయస్సుకు పర్యాయపదము.

స్వధర్మము శ్రేయస్సు అని భగవద్గీతోక్తి[60] అనగా స్వధర్మాచరణము శ్రేయస్కరమని తాత్పర్యము. వ్యక్తులయొక్క సమాజము యొక్క అభ్యుదయము పరస్పరమాధారాధేయభావము కలది. వైయక్తిక సంబంధములు, సామాజిక సంబంధములు, వ్యక్తి - సమాజపారస్పరిక సంబంధము లన్నియు సర్వముయొక్క అభ్యుదయమునకు అనుగుణములు కావలసి యుండును. ఈ తాత్పర్యముతో వివిధ

సంబంధములకు సంబంధించిన ప్రవృత్తి అభ్యుదయ - నిశ్శ్రేయ సములుగా నిర్ణీతములగును. ఈ నిర్ణీతమైన ప్రవృత్తియే - ఉదాత్తీ కృత ప్రవృత్తియే ధర్మము - స్వధర్మము. దీనికి విరుద్ధమైనది పర ధర్మము. అందుకని అది భయావహము మరియు, సృష్టి మొత్తము నకును సంయోజకతా లక్షణము సహజమైనవి వియోగతా లక్షణము అసహజము. సంయోజకతా లక్షణాభిముఖముగా నిర్ణీతములైన వైయక్తిక- సామాజిక ప్రవృత్తులు వ్యక్తి- సమాజ స్వధర్మములు. శాస్త్రములు కావ్యములు ఈ ధర్మాచరణము ద్వారా ఆ ప్రవృత్తుల నుదాత్తీకరించుటకే ఉద్దేశించబడినవి. అయితే అవి అనుసరించు విధా నములు భేదించును. శాస్త్రముల దారి ఒకవిధమైనచో కావ్యములది మరొకటి. ఇది ప్రీతిపూర్వక మైనది. కాగా ఈ విధమైన కావ్యము యొక్క ప్రయోజనము విశ్వశ్రేయస్సు / జగద్ధితము. ఇంక వేశే ఎన్నెన్ని చెప్పినను అవి పాక్షికములో, అపర్యాప్తములో మాత్రమే యగును. విశ్వశ్రేయస్సు/జగద్ధిత మన్నదే సమగ్రము. ఈ సమగ్ర త్వమును లక్షించినది; ప్రసాదించినది నన్నయగారు.

'—చింతామణి'యందు సాహిత్య వివేచనాపరముగా నన్నయ గారు కూర్చిన మొట్టమొదటి పద్యము చతుస్సూత్రి. ఆ నాల్గు సూత్ర ములివి: 1. విశ్వశ్రేయః కావ్యమ్, 2. తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ, 3. సావాగ్వ్యారసవృత్తిః, 4. సాధ్యోహి రసో యథా యథం కవిభిః, మొదటిది కావ్య ప్రయోజనమును ప్రతిపాదించునది. చింతా మణి నాటికే కావ్య ప్రయోజన స్వరూపమాయనకు నిశ్చితమైనది. కాగా, మిగిలిన మూడు సూత్రములలోని యంశములు నేరుగా భరత భామహ, దండి, ఆనందవర్ధన, అభినవగుప్తుల ప్రభావమున వారు నిరూ పించిన సిద్ధాంతములకు దాదాపుగా పునరుక్తులు[61] 'వాగర్థౌ' అను పద బంధమును కాళిదాసునుండి గ్రహించి 'శబ్దార్థౌ సహితౌ కావ్య'మన్న భామహుని కనుగుణముగా నన్నయగారు ప్రయోగించినారు. 'పరిష్కృత'

శబ్దమునకు సహితము అలంకృత మనియు నర్థములు చెప్పవలయును. "వాగర్థ" పదబంధము మహాకవియైన విమర్శకుడు మాత్రమే అన గలిగినది. స్వీకరించ గలిగినది. మరి, ఆ దోషత్వము, అలంకృతత్వ మన్నవి దండి ప్రభావమునకు సంబంధించినవి. 'అలంకృతము, అసం క్షిప్తము. రసభావ నిరంతరము' కావ్యమన్నాడు దండి. రస విషయము భరతుని నుండి ప్రసిద్ధమై, ఆనందవర్ధన, అభినవగుప్త కుంతకాదులచే సుపరిష్కృత సిద్ధాంతమైనది. 'నిరంతరము రసోద్గార గర్భసందర్భ నిర్భరములైన కవుల వాక్కులు జీవించును' అన్నాడు కుంతకుడు.[62] నన్నయగారి 'సావాగ్యారసవృత్తిః' అన్నది ఈ యన్నింటి ఫలము. ఇక్కడి 'వృత్తి' పదము లాక్షణికముగా కూడ గమనింప దగినది. అయితే, ఆ యంశములను నన్నయగారు మరల చెప్పవలసిన యవస రములేదు. ఆ యంశముల నన్నింటిని అంగీకరించి, స్వీకరించి, వారు విచారించని ఇతర ప్రధానాంశములను గూర్చి నన్నయగారు మౌలిక ముగా సాగించిన విచారములో నిష్పన్నములైన యంశములు భారతా వతారిక యందు, సూత్రప్రాయములుగా, సందర్భమున కొదుగు నట్లుగా వ్యక్తీకరింప బడినవి. దీనినిబట్టి చింతామణి నాటినుండి భారత రచన నాటికి నన్నయగారి విచారములోని ఎదుగుదల గమనింపదగినది. మౌలికత లక్షింపదగినది.

గమనింపవలసిన మరొక యంశమేమనగా, నన్నయగారు ఆ నాడు సాగించిన విచారములోని యంశములు వందలేండ్ల తరువాత — జగన్నాథ పండిత రాయలను వదిలినచో — మరల ఆధునిక కాలమున తెలుగు సాహిత్య విమర్శ మార్గములో వివేచింపబడుట. కథనుగూర్చి కథా పరమార్థమును గూర్చి, తద్భాసనమును గూర్చి, కట్టమంచి, రాయప్రోలు, విశ్వనాథ వంటి సృజనాత్మక విమర్శకులు వివేచన సాగించినారు. ఆ సంప్రదాయ మింకను సాగుచున్నది. కాగా, నన్నయ గారు 'పరమ వివేక సౌరభ విభాసిత' ముగా వెలయించిన సాహిత్య

వివేచన, ఆయన నాటికే కాదు. ఈనాటికిని మౌలికము. ఆధునికము, భారతీయ సాహిత్య విమర్శ సంప్రదాయమునకు సమకూర్చిన ఒకానొక చిక్కని కాంతి రేఖ.

ఇది నన్నయగారి సాహిత్య సూత్రవృత్తి.

## అధస్సూచికలు

1. కట్టమంచి రామలింగారెడ్డి; వ్యాసమంజరి; పు 39
2. పింగళి లక్ష్మీకాంతము; ఆంధ్ర సాహిత్య చరిత్ర; పు 55
3. విశ్వనాథ సత్యనారాయణ; 'నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి' పు 15
4. 'ప్రసన్నములైన కథలయందు గూర్చబడిన యర్థముల యొక్క యుక్తియని దీని కర్థము' – డా. దివాకర్ల వేంకటావధాని; నన్నయ భారతము, పు 704
5. న. ప్ర. క. యు; పు 15
6. పై. పు 22–23
7. భూపతి లక్ష్మీనారాయణ; నన్నయ కవిత్వము, పుట 27 ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ.
8. — డా. ఘూశిపాళ శ్రీరామమూర్తి; 'నన్నయభట్టు కావ్య సిద్ధాంతము' భారతి. మే. 1959.
9. "మహాకవేః కావ్యగతాశ్చ శబ్దాః, కేచిత్ కథామర్మభిరో భవన్తి'– శాకుంతలము యొక్క అభిజ్ఞానత' పీఠికా పద్యము–3
10. న. ప్ర. క. యు; పు 74
11. ఆంధ్ర మహాభారతము; ఉస్మానియా విశ్వవిద్యాలయ వారి సంశోధిత ప్రతి. ఆది. పు. 8 అధోజ్ఞాపిక–సంపా, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం.

12. వేదాల తిరువేంగళాచార్యులు;కుమారసంభవ తత్త్వము– పు.19
13. పై. పు 17
14. నన్నయ భారతము- పు 77
15. వేదాల తిరువేంగళాచార్యులు; 'ఆంధ్ర ధ్వన్యాలోకము'- పు. 204
16. నన్నయ భారతము; పు. 706
17. 'అత ఏవచ భరతే' 'ప్రఖ్యాత వస్తువిషయత్వం... ఉపన్యస్తమ్' ధ్వన్యాలోకము. పు 334
18. 'వస్తునేతా రసస్తేషాం భేదకో వస్తుచద్విధా'— దశరూపకము. 1-11
19. 'కుమార సంభవ తత్త్వము. పు. 45
20. సాహిత్య అకాడెమీవారి భారతారణ్యపర్వ పీఠిక. పు 12
21. కుమారసంభవ తత్త్వము- పు 20
22. '...సచ విధి నిషేధాద్యనేక ప్రకారో వస్తుశబ్దేనోచ్యతే'— ధ్వన్యాలోక లోచనము. పు 50
23. 'గూఢవస్తు' అని పాఠాంతరమున్నది కాని "గూఢవస్తు"(అలంకారము గూడన్ + వస్తు...) అనునదే సరియైన పాఠమని బహుధా చర్చించి వేదాలవారు నిర్ణయించినారు. (కు. సం. త; పు. 17) రాళ్ళపల్లివారి పాఠము గూడ ఇదే. (చూ. సాహిత్య అకాడమీవారి కుమారసంభవ పీఠిక.)
24. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, 'సారమతి నన్నయ,' పు. 50
25. పై.
26. నన్నయ భారతము. పు. 704
27. ఆంధ్ర మహాభారతము- ఉస్మానియా సంశోధిత ప్రతి. పు. 8 అధోజ్ఞాపిక.

28. "విశ్వనాథవారు, నన్నయ కథాకథనములోని... వస్తుధ్వను లనే కథాప్రసన్నత యన్నారు... (అది) ప్రౌఢవాద మగును గాని, ప్రసన్నకథాత్వము మాత్రము కాదు" అన్నారింద్ర గంటివారు, (సారమతి నన్నయ. పు- 51) కథార్థ ప్రసన్నత వస్తుధ్వనుల ప్రసన్నతవలన మాత్రమే కలుగునన్నది గమనించ వలసిన యంశము.

29. "నన్నయభట్టు కావ్య సిద్ధాంతము."

30. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ; "సంగీత సాహిత్యాలు; అక్షర రమ్యత" భారతి, అక్టో. 11-5

31. ఆంధ్ర సాహిత్య చరిత్ర.

32. "యాసదానాం వరానోర్వ్యన్యసై్మత్రీ శయ్యేతి కథ్యతే." ప్రతా. 2-34.

33 నన్నయ భారతము. పు. 750

34. ఆరణ్య పర్వ. పీఠిక.

35. నన్నయ భారతము; పు. 750

36. 'నన్నయ కవిత్వము : అక్షరరమ్యత' అను తమ సిద్ధాంత గ్రంథమందు డా. వి. వి. ఎల్. నరసింహారావుగారు 'అక్షరరమ్యత'ను విస్తరింపజేసిన రీతి అనుశీలింపదగినది.

37. న. ప్ర. క. యు; పు. 12

38. పై.

39. నన్నయ భారతము; పు. 753

40. అరణ్యపర్వ పీఠిక.

41. సారమతి నన్నయ; పు. 113

42 నన్నయభట్టు కావ్యసిద్ధాంతము.

43. 'ఉక్తివిశేషః కావ్యమ్'— రాజశేఖరుడు. 'కర్పూర మంజరి'

44. న. ప్ర. క. యు; పు 178

45. ధ్వన్యాలోకమ్, పు. 93
46. వరుని గూర్చి సంభాషణ సాగుచుండగా, లోనిసిగ్గుతో మోములు వంచిన అమ్మాయిలు తమ కోరిలను పులకరింతలతో సూచించుచున్నారు.
47. దేవర్షి (నారదుడు) ఇట్లు మాట్లాడుచుండగా తండ్రి ప్రక్కనున్న పార్వతి మొగము వంచుకొన్నదై (చేతిలోని) లీలా కమల పత్రములను లెక్కపెట్ట సాగెను.
48. ధ్వన్యా. పు. 528
49. నన్నయగారి పరోక్ష శిష్యుడనదగిన పింగళి సూరన ఈ రెండు విధముల అపూర్వత్వమునకు లక్ష్యములుగా కళాపూర్ణోదయ, ప్రభావతీ ప్రద్యుమ్నములను రచించినాడు.
50. ఈ యంశమునకు సంబంధించిన విస్తృత విచారమునకు నా 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ : సాంప్రదాయిక రీతి' గ్రంథము ఏడవ అధ్యాయము చూడవలెను.
51 ధ్వన్యాలోకము, ఉద్ద్యో, 4 పు. 530, 1
52. 'రామాయణ మహాభారతయోశ్చ శాంతాంగిత్వం పూర్వసూరిభి రేవ నిరూపితమ్'- కుంతకుని వక్రోక్తి జీవితమ్, ఉన్మేషము 4, పు. 441
53. అభినవ గుప్తుడు, అభినవ భారతి నాట్యశాస్త్ర వ్యాఖ్య. పు. 336, 337
54. విశ్వనాథ సత్యనారాయణ, కావ్యానందము, పు. 251
55. చూ. భామహుని కావ్యాలంకారమున 3-53, 54; దండి కావ్య దర్శమున 2-364, 5, 6
56. వీటిని గూర్చిన విస్తృత విచారమునకు నా 'ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ సాంప్రదాయిక రీతి' అను గ్రంథము (పు. 70-73) పర్యవేక్షించ వలయును.

57. ఆరవ యంశము ప్రధానముగా కథా కథనమందు ఉపయోగించ వలసిన భాషారీతిని సూచించును.

58. నన్నయగారు కథకు చెప్పిన ఈ లక్షణముల మౌలికత యెంతటి దనగా, తిక్కనగారీ లక్షణములనే పేర్కొనునంతటిది–'ఎయ్యది హృద్యంబును' అపూర్వంబును, సమగ్ర జ్ఞానప్రదంబును,నైన యది, యక్కథయ మాకు విన నభీష్టంబు...' (స్వర్గా. 77)

59. అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహు రపరోహరిః అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః, –వ్యాస స్మరణ.

60. 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా స్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః'
భగవద్గీత, 3–35

61. '–చింతామణి' యందలి ఈ మూడు సూత్రములు మమ్మట విశ్వనాథుల సిద్ధాంతములను ప్రతిధ్వనించు చున్నవని, కావున వారి తరువాతి కాలమున చింతామణి రచింపబడినదని, అందు వలన నన్నయ కృతము కాదన్నది– చింతామణి నన్నయ కృతము కాదనుటకు చూపెడు ప్రధానోపపత్తులలో నొకటిగా చెప్పబడుచున్నది. కాని, ఆ సూత్రములను భరతాదుల ననుస రించి చూచుట సమంజసము. అది కుదురనప్పుడు గదా తరువాత వారి విషయము : భరతాదుల సిద్ధాంతములచే అవి దగ్గర, ఇది గమనించదగిన యంశము.

62. 'నిరంతర రసోద్గార గర్భసందర్భ నిర్భరా :
గిరః కవీనాం జీవన్తి నకథామాత్ర మాశ్రితాః' వక్రోక్తి జీవితమ్ 4–11.

—0—

# నన్నయ నాటకీయత

శ్రీ ఎస్వీ. భుజంగరాయశర్మ.

"సాలప్రాంశు, నిజోజ్జ్వలత్కవచు, శశ్వత్కుండ లోద్భాసితున్
బాలార్క ప్రతిమున్, శరాసన ధరున్, బద్ధోగ్ర నిస్త్రింశు, శౌ
ర్యాలంకారు, సువర్ణవర్ణు ఘను, కర్ణాఖ్యున్ జగత్కర్ణ పూ
ర్ణాలోల ద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్"

'అచ్చటన్ - అంటే ఎచ్చట?

రంగం - హస్తినాపురపు పొలిమేరల్లో ప్రత్యేకంగా నిర్మింపబడిన ఓ బ్రహ్మాండమైన ప్రేక్షాగారం - అంటే 'స్టేడియం.'

సమయం - ద్వాపర యుగంలో ఓ సాయంకాలం.

గుండ్రటి ఆకారంలో నిర్మింపబడి తాడిచెట్టంత ఎత్తున లేచిన సోపాన శ్రేణులమీద జనం క్రిక్కిరిసి కూర్చున్నారు. విదురుడు పంపిన ఆహ్వానాలను పురస్కరించుకుని దేశదేశాల రాజులందరూవచ్చి తమతమ ఆసనాల నలంకరించి వున్నారు. కౌరవస్త్రీలకు ప్రత్యేకమైన ఏర్పాట్లున్నాయి. వ్యాసాదులూ, భీష్మద్రోణాదులూ, ధృతరాష్ట్రాదులూ తమకు పత్యేకింపబడ్డ స్థానాల్లో కూర్చుని కుతూహలంగా చూస్తున్నారు. గాంధారీ ధృతరాష్ట్రులకు- రంగమధ్యంలో జరుగుతున్నదంతా విదురుడు చెబుతున్నాడు.

కురు కుమారుల అస్త్రవిద్యా ప్రదర్శనం కొన్ని గడియల నుండీ జరుగుతోంది.

దృఢహస్తులూ, బద్ధగోధాంగుళి త్రాణులూ, మార్గణ పూర్ణ తూణులూ, మహాధన్వులూ, అయిన కౌరవ పాండవ కుమారులు-

ద్రోణుని అనుజ్ఞ పొంది రంగమధ్యానికి వచ్చి కొందరు అసి చర్మ కౌశలాన్ని ప్రదర్శించీ, కొందరు తమతమ నామాంకితాలైన శరాలతో లక్ష్యాలను కొట్టీ, కొందరు హయమదద్విరద రథా రూఢ దక్షత చూపీ, మరికొందరు కుంతతోమరగదా కుశలత్వాన్ని ప్రకటించీ –

ఇలా తమ తమ విద్యలు ప్రదర్శించి జనాన్ని ఆశ్చర్యపరిచారు.

తర్వాత భీమ దుర్యోధనులు తమ గదాయుద్ధంతో కొంత సేపు ప్రేక్షాగారాన్ని సంక్షుభితం చేశారు.

అనంతరం అర్జునుడు వచ్చి అపారమైన తన శస్త్ర కళాలాఘవాన్నీ అస్త్రవిద్యా కౌశలాన్నీ ప్రదర్శించేటప్పటికి ప్రేక్షకులు సమ్మోహితులై పోయారు. వారి ఆశ్చర్యానికి మేర లేదు. ఆనందానికీ అవధి లేదు.

సరిగ్గా ఆ సమయాన –

ఓ పెద్ద చప్పుడైంది. కొండమీద పిడుగుపడ్డంత చప్పుడైంది.

ప్రేక్షాగారం దద్దరిల్లిపోయింది. ఆ పిడుగు ఎక్కడో పడలేదు; రంగద్వారంలోనే పడ్డది.

అదరి పడ్డ జనం రంగ ద్వారం వైపు చూశారు.

రంగ ద్వారంలో ఓ యువవీరుడు నిలబడి వున్నాడు.

అది పిడుగు కాదనీ, ఆ యువవీరుడు జబ్బచరిచిన చప్పుడనీ తెలుసుకున్న ప్రేక్షకులకు గుండె ఆగినంత పనైంది.

భయంగా, ఆశ్చర్యంగా– కొన్ని వేలకళ్ళు అతణ్ణి చూశాయి, కుతూహలంతో, మెప్పుతో కొన్ని వేల గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

అంతా నిశ్శబ్దం.

చూస్తున్న కళ్ళకు ఆయువ వీరుడు ఎలా కనబడ్డాడో, కొట్టు కుంటున్న గుండెలకు అతని విలక్షణత ఎలా తోచిందో వర్ణించిన పద్యం "సాలప్రాంశు" అనేది, నన్నయగారిది!

ఆ యువ వీరుని సమున్నత విగ్రహం వారిని చకితుల్ని చేసింది ముందు! అంత యెత్తైనవాడు ఇంతవరకూ శస్త్రాస్త్ర విద్యా ప్రదర్శనం చేసిన వీరుల్లో ఒక్కడూ లేడు. వారిలోనే కాదు. కూర్చుని చూస్తున్న ప్రేక్షకుల్లో మాత్రం అంత ఎత్తైన మనిషి ఉంటాడా అని ఆశ్చర్యపడ దగినంత పొడుగ్గా ల్ఫ్రఢంగా వున్నాడతడు. 'అమ్మో యితడు సాల వృక్షమంత ఎత్తు! అనుకున్నారు, ఆశ్చర్యపోయారు, వారు!

వారతని వంకే చూస్తున్నారు. కాని వారి చూపులు అతని మీద సరిగా నిలవలేక పోతున్నాయి. అలా నిలవనీయక చెదరగొడు తోంది. అతని కవచపు ధగ ధగ. అది మెరిసిపోతోంది. కళ్ళు మిరు మిట్లు గొలుపుతోంది. కురుకుమారుల్లో అంతటి ఉజ్జ్వల కవచంఎవరికీ లేదు. 'ఓహో, ఇతడు నిజోజ్జ్వలత్కవచుడు' అనుకుని మరీ ఆశ్చర్య పోయారువారు.

వారతని వంకే చూస్తున్నారు. చూపులు గుచ్చి చూస్తు న్నారు. అతని కుండలాలు కాంతులు చిమ్మి కొడుతున్నాయి. అతడి కుండలాలు కదలి నప్పుడల్లా కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. అప్పళి స్తున్న కళ్ళతో 'అహో! ఇతడు శశ్వత్కుండలోద్భాసితుడు!' అను కున్నారు. మరింతగా ఆశ్చర్యపోయారు.

వారతనివంకే చూస్తున్నారు,చూడలేక చూస్తున్నారు.చూస్తూ చూడలేక పోతున్నారు. చూపులు పక్కకి తిప్పిచూస్తున్నారు.చూడా లని బుద్ధి పుట్టినకొద్దీ చూడలేక పోతున్నారు. చూడలేకపోతున్న కొద్దీ చూడాలని మరీ బుద్ధిపుట్టి చూస్తున్నారు. సాయంకాల సూర్యుని కాంతులు అతడిమీదపడి మరీ దుర్నిరీక్ష్యుడుగా కనబడుతున్నాడు.

వారిలో కొందరికి- మనస్వులకు- భావుకులకు- ఆవీరుడు తూర్పుకొండ మీదుగా దిగివచ్చిన మరో బాలసూర్యుడా అనిపించాడు. అవును' అతడు నిలిచిన రంగద్వారం తూర్పునేవుంది. 'ఇతడు నిజంగా బాలార్క ప్రతిముడు' అనుకున్నారు. చకితులైపోయారు.

వారతనివంకే చూస్తున్నారు. కళ్ళు చికిలించి చూస్తున్నారు. వారిదృష్టి అతడి ఎడమ భుజాన వ్రేలాడుతున్న వింటి మీదికి జరిగింది. అది సామాన్యమైన విల్లుకాదు. సాల ప్రాంశువు మాత్రమే ధరించ గల విల్లు ధనుర్వేద పారంగతుడు మాత్రమే ఎక్కుపెట్టదగిన విల్లు. ఆ వింటిని బట్టి అతని మహానుభావాన్ని ఊహించుకోగల విజ్ఞులు ప్రక్కవారికి వింటిని చూపి అతని విలుకాని తనాన్ని తలచుకొని మురిసిపోయారు. విప్పారిన కళ్ళతో ఆవింటినిచూస్తూ 'ఇతడు, మహా శరాసన ధరుడు!' అనుకుని ఇంకా ఆశ్చర్యపోయారు.

కుడివైపున అతడి మొలనుండి వ్రేలాడుతోంది... ...ఏమిటో అది! పరికించి చూచారు. అది ఓ అలవి మాలిన కత్తి! చూడటానికే దారుణంగా వుంది! రణరంగంలో శత్రువుల్ని దాంతో నరికి పారేస్తోంటే... తలచుకుంటేనే శరీరం గడ్డకట్టుకుపోతోంది. ఒకరికొకరు మరీదగ్గరగా జరిగి ఆ కత్తిని చూపుకుంటూ 'ఇతడు బద్ధోగ్ర నిస్త్రింశుడు' అని చెప్పుకున్నారు, భయంగా మెప్పుగా!

ఆ శరాసనాన్నీ ఆ ఉగ్ర నిస్త్రింశాన్నీ ఆ తేజస్వితనూ, ఆ ప్రాంశుతనూ చూస్తోంటే, చూస్తూ భావిస్తోంటే - అవన్నీ మసక మసకై, మాయమై, అతడు బోసిగా నిలబడ్డట్టూ అతని శౌర్యమే ఆతనికి అలంకారమైనట్టూ అనిపించి, 'అహో, యితడు శౌర్యాలంకారుడు!' అనుకుని, వారు ముగ్ధులైపోయారు!

అంత ఎత్తైన ఆలోచనలనుండి వారి మనస్సు చిత్రంగా ఒకసారి క్రిందికిజారి 'ఇంతకూ ఇతని మేని ఛాయ ఎలాటిదో' అనే కుతూహలం

కలిగింది. వారికళ్ళు – అతని శరీరమంతా ప్రాకాయి. దాదాపు శరీర మంతా ఆవృతమయ్యే వుంది. మిగిలిన భాగాలు మేలిబంగారంలా మిల మిల్లాడుతూ కనబడ్డాయి. 'ఓహో యితడు సువర్ణకర్ణుడు కూడా!' అని చివరికి అతని మేని చాయ కూడా మెచ్చుకుంటూ విస్తుపోయారు.

ఇంతలో ఆ మహావీరుణ్ని ఎరిగినవారు, ప్రేక్షకుల్లో కొందరు, అతడెంత గొప్పవాడో ప్రక్కవారికి వర్ణించి చెప్పటం మొదలెట్టారు. అది విన్నవారు కొత్తవారికీ, ఆ కొత్తవారు ఇరుగుపొరుగులకూ చెప్పు కుంటూ పోయిపోయి అందరూ అతణ్ని 'ఘను' డని ఆకాశానికెత్తి మురిసిపోయారు.

ఇంతకూ ఆ వీరుని పేరేమిటి? ఇంత వరకూ ఆ ప్రశ్న తట్టనే లేదు, వారికి! ఎంత చిత్రం'... తెలిసినవారెవరో 'కర్ణు' డన్నారు.

ఆ మాట ఆ నోటా, ఆ నోటా పడి క్షణంలో ప్రేక్షాగారమంతా కర్ణుడనే పేరుతో తరంగితమై పోయింది. 'ఓహో, యితడు కర్ణాఖ్యుడు! అనుకుని, అనుకున్నది అని, ఆ పేరుకూ అతని మహానుభావానికీ ముడి పెట్టుకొని, ఊహకు రెక్కలుకట్టి, అతని శౌర్యాన్ని పొగడి, గుణ గణాన్ని కథలు కథలుగా చెప్పుకొని, కర్ణుణ్ని జగత్కర్ణ పూర్ణాలోల ద్గుణుణ్ణి చేస్తూ, చేస్తున్నంతసేపూ అతణ్ణే చూస్తూ, అంతులేని ఆశ్చ ర్యంతో ఉక్కిరి బిక్కిరై పోయారు వారు.

ఇది – కర్ణుని ఆకార వర్ణనమో లేక చూపరుల మనోభావ చిత్రణమో వేర్పరచి చూడరానంతటి అద్భుతమైన నాటకీయ రచన.

నాటకంలో – అంటే దృశ్యకావ్యంలో – కవి మాట్లాడడు. పాత్రలే మాట్లాడతాయి. శ్రవ్యకావ్యంలో – కవే యెక్కువ మాట్లా డతాడు. అక్కడక్కడా పాత్రలూ మాట్లాడతాయి.

దృశ్యకావ్యంలో సాధారణంగా వర్ణన లుండవు, ఉండరాదు. ఉన్నా, అవి పాత్రలు పలికేవి కాబట్టి వాటిలో పాత్రల మనోభా

వాలు ప్రతిఫలించి తీరతాయి తప్పదు. ఇక - శ్రవ్యకావ్యంలో వర్ణ నలు కోకొల్లలు. వాటిని సాధారణంగా కవే చేస్తాడు కాబట్టి అందులో పాత్రల మనోభావాల ప్రసక్తి ఉండదు.

ఒకవేళ- శ్రవ్యకావ్యంలో కవి, ఓ పాత్రచేత వర్ణన చేయించి ఆ వర్ణన ద్వారా పాత్ర మనస్తత్వాన్ని ఆవిష్కరించాడనుకోండి. లేదా- తానే ఆ వర్ణన చేస్తూ, ఆ పాత్ర దృక్కోణం నుంచి చేస్తు న్నట్టు చెప్పి, ఆ పాత్ర తాలూకు మనోలోకానికీ అద్దం పట్టాడను కోండి.

అప్పుడు శ్రవ్య కావ్యానికి దృశ్య కావ్య గంధం అంటిందన్న మాట.

శ్రవ్యకావ్యాల్లో దృశ్యకావ్య లక్షణాలు అభివ్యక్తమయ్యే తీరుల్లో ఈ వర్ణన విధానం ఒకటి. సాధారణంగా వర్ణనలకు చోటు లేని నాటకంలో తరుచు కనబడనిదీ, నాటకీయమైన చూపుతో రచించిన శ్రవ్యకావ్యంలో తరుచు కనబడేదీ ఈ శిల్పం.

"కర్ణుండును జనులనందఱ నదల్చి చొత్తెంచి, రంగమధ్యంబున నిలిచి, కలయంజూచి, కృపద్రోణాచార్యులకు నమస్కరించి, సజల జలధర ధ్వాన గంభీరవచనంబుల నర్జుననాక్షేపించి యిట్లనియె" అని ఒక చలత్ చిత్రాన్ని గీశారు, నన్నయగారు, ఆ పద్యం క్రిందనే.

కొన్ని క్షణాలపాటు స్తంభించిపోయిన ఆ ప్రేక్షాగారం, ఊపిరి పీల్చుకుంది, ఊగిపోయింది, సందడించింది. కోలాహలంగా వుంది! కుతూహలాన్ని ఆపుకోలేని కొందరు రంగద్వారంవైపు పరుగెడుతు న్నారు. కొందరు ఆసనాలనుండి లేచి చూస్తున్నారు. భీష్మద్రోణ విదురాదులు సర్దిచెబుతున్నారు. రంగద్వారాన్ని ముసురుకున్న జనాన్ని అదిలించాడు కర్ణుడు! జనం అదిరిపడి, ఒత్తిగిలి, దారి యిచ్చారు. కర్ణుడు వారిని నెట్టుకుంటూ రంగమధ్యానికి వచ్చాడు. నిలబడి అంతా కలయజూచాడు. జనం ఎక్కడివారక్కడ సర్దుకున్నారు.

ప్రేక్షాగారం మళ్ళీ స్తంభించిపోయింది కర్ణుడు- ద్రోణ కృపా చార్యులవైపు నడిచి వారికి నమస్కరించాడు. దిమ్మెరపోయిన అర్జునుడు ఇంతసేపూ రంగ మధ్యంలో అలాగే నిలబడి వున్నాడు. కర్ణుడతణ్ని చూచాడు. బలంగా అడుగులువేస్తూ అతని ఎదటికి వచ్చాడు. అతడి కళ్ళల్లోకి చూస్తూ అతణ్ని ఆక్షేపించాడు.

ఎలా ఆక్షేపించాడో నన్నయ చెప్పలేదు. తిరస్కారంగా నవ్వి-వుండవచ్చు; చులకనచేస్తూ హుంకరించి వుండవచ్చు. కాని ఆక్షేపించటం మాత్రం జనమంతా చూశారు. అప్పుడు కర్ణుడు అర్జునునితో కొన్ని మాటలన్నాడు.

జనం ఇంతవరకూ అతని గొంతు వినలేదు. ఇదే మొదటిసారి వినటం. నీళ్ళతో నిండిన కారుమబ్బు ఉరిమినంత హుందాగా వుంది, కర్ణుని గొంతు! జనం మళ్ళీ ఆశ్చర్యపోయారు.

ప్రతిభావంతుడైన నటుడు మౌనంగా రంగస్థలంమీద చేసే అభినయ కార్యాన్ని వివరంగా సూచించే మాటలు నాటకంలోవుండవు. కాని ఆ నటుని అభినయాన్ని చూస్తున్న ప్రేక్షకులకు నాటక శాలలో ఎలాంటి అనుభూతి కలుగుతుందో అలాంటి అనుభూతిని కలిగించటానికి శ్రవ్య కావ్యకర్త తన కావ్యంలో పాత్రల కదలికల రేఖా చిత్రాలు గీచి, ఆ రేఖాచిత్రాన్ని వర్ణ చిత్రాలుగా మార్చుకునేపని భావుకతకు వదలి సహృదయులైన పాఠకుల కళ్ళముందు నిలుపుతాడు. ఇలా అభినయాన్ని బొమ్మకట్టే శిల్పం శ్రవ్యకావ్యంలో నాటకీయత అభివ్యక్తమయ్యే రెండోతీరు. రంగమధ్యానికి వచ్చినిలబడిన కర్ణుడు—చుట్టూ కలయజూచాడని నన్నయ చిత్రించటం ఆ ఘట్టానికి నాటకీయమైన ప్రాణస్పందన కలిగించటం కోసమే!

కర్ణుడు అర్జునునితో—

"నీవ కడు నేర్పు కాఁడవు

కా వల వదు; దీనిఁ గొన్ని గఱచితి మేమున్

నీ విద్యలెల్ల జూపుదు
మే, వీరులు సూచి మేలు మేలని పొగడన్!"

అర్జునుని 'నీవు' గానూ తన్ను 'మేము'గాను చెప్పుకోవటం లోనిదర్పం —

"నీ నేర్చిన వాటిలో కొన్ని మేమూ నేర్చుకున్నాంలే" అని తాను కొన్ని మాత్రమే నేర్చుకున్నట్లు తెచ్చికోలు వినమ్రతతో అధిక్షేపాన్ని రంగరించి, మరుక్షణంలో నీ విద్యలన్నీ చూపమంటావా అని తలవిసిరి సవాల్ చేయటంలోని మగతనం—

"వీరులు చూచి మేలు మేలని పొగడన్" అనటంలో "ఇంత సేపూ నిన్ను పొగడి తబ్బిబ్బులైన జనం వట్టి పనికిమాలిన చవటలు! వాళ్ళని కోసి చూసినా వీరరక్తం- చుక్క- కనబడదు. వీరులు మెచ్చిన వాడు వీరుడుగాని ఈ కుంకలెంతమంది మెచ్చుకుంటే మాత్రం నువ్వు వీరుడవౌతావా?" అనే ఎద్దేవలోని నిర్లక్ష్యపు తిరస్కారం—

కర్ణుని వ్యక్తిత్వాన్ని పట్టి యివ్వటమే కాకుండా, 'నీవ' అవటం లోని కాకువూ, 'చూపుదు మే!' అనటంలోని విసురూ, ఆ మాటలు అతడి నోటినుండి వూడిపడ్డట్టే అనిపిస్తాయి.

సాధారణంగా శ్రవ్యకావ్యాలలో వి'భాషణ'లేగాని 'సంభాష ణలు' కావు. భాషణలు పాత్రల నోటివెంట వచ్చిన మాటల సారాం శాలు, సంభాషణలు అచ్చంగా పాత్రల నోటినుండి వెలువడిన మాటలు! పాత్రలు ఎలా మాట్లాడుకుంటున్నారో తానుగా చెప్పటా నికి అవకాశం వున్న శ్రవ్యకావ్యకవి, సాధారణంగా వ్రాసేవి భాష ణలే! కాని ఈ అవకాశంలేని నాటకకవి సంభాషణలే వ్రాసితీరాలి, తప్పదు. నాటకలక్షణమైన సంభాషణను నడపటం - శ్రవ్యకావ్యంలో నాటకీయత అభివ్యక్తమయ్యే మూడో తీరు.

ఈ మూడు తీరులకూ నన్నయ భారతంలో ఎన్నో ఉదాహర ణలు దొరుకుతాయి. అవలోకించండి.

అయితే, ఈ నాటకీయత సంస్కృత భారతంలో లేదా అని ప్రశ్న. సంస్కృత భారతంలోనూ – ఉంది. ఫోకస్ తప్పిన ఫోటో గ్రాఫ్‌లా, బూజర బూజరగా! నన్నయ్యగారి కున్నంతటి స్పష్టమైన నాటకీయ దర్శనం వ్యాసునిలో కనబడదు.

ఎన్ని శిల్పాలకో ఒరవడి పెట్టినట్లు నాటకీయ శిల్పానికి కూడా తెలుగులో ఒరవడి పెట్టింది నన్నయగారే అనుకుంటాను.

కుమారాస్త్రవిద్యా ప్రదర్శన ఘట్టం చదువుతోంటే కర్ణుడు రంగమధ్యాన్ని ప్రవేశించినట్లు కనబడదునాకు. నాటకీయ శిల్పం ఆంధ్ర వాఙ్మయంలో అడుగుపెట్టినట్లు తోస్తుంది.



మును వినుతించినాడు. దీర్ఘతముని వృత్తాంతము, వసిష్ఠుని చరిత్రము ఉదాహరణములు. వసిష్ఠుని చరిత్రమునుండి

"దాని యుదరంబున నుండి
షడంగాలంకృత వేదధ్వని
కరంబు మధురంబయి
ఏతెంచిన విని విస్మితుండయి
తే॥ శక్తి చదువునుబోలె సువ్యక్తమగుచు
వీనులకు నిది యమృతోపమానమయ్యె
వేదనాదంబు........"

అను భాగమును నిచ్చుట పునరుద్ధరించుట యప్రస్తుతము గానేరదు.

వేదార్థము తెలియకపోయినను స్వరమాధుర్య మొక్కటే హృదయము నున్నత భూములకు గొనిపో, జాలియున్నది. అర్థములో విశేషమేమియు పొడకట్టని మంత్రములు కొన్ని స్వరమువలన అనగా నాదమువలన సుజ్జీవించుచున్నవి. అర్థము తెలియకుండ నయిన వేదపాఠ మొనర్చుట కంగీకరింతురుగాని స్వరభంగ మొనర్చుట కెవ్వరు నంగీకరింపరు. దీనిలోని రహస్యమేమి? స్వరభంగమైనచో నర్థభంగ మగుననియు అందుచే స్వరమునకట్టి ప్రాధాన్యమనియు వ్యాఖ్యాతలు సమర్థించిరి. కాని స్వరమును గూర్చిన ఈ పట్టుదలలో నింకను సూక్ష్మ రహస్య మేమయిన నున్నదేమో పరిశీలింపవలసి యున్నది.

నాదమును గూర్చి ముచ్చటించు విద్యలు కొన్ని మనలో నున్నవి. అందు యోగవిద్య ముఖ్యము. పరిణత చిత్తులగు యోగులకు పరమాత్మ సన్నిహితమైనపుడు ఒకానొక నాదము వినవచ్చుననియు ఇది యమృతమయమగుటచే నత్యంత సుఖమును చేకూర్చుచుండుననియు ఈ విద్య సిద్ధాంతీకరించుచున్నది. ఈ నాదమును అనాహత మందురు. ప్రణవనాదమని కూడ వ్యవహరింతురు. చిత్తమును విషయ

వాసనలనుండి విముక్త మొనరించి ఏకాగ్రముగ చేయుటయే దీని ప్రయోజనమని నాదబిందూపనిషత్తు ఘోషించుచున్నది. ఈ నాదమే సర్వవేదములకు ప్రభవస్థానమని మన శాస్త్రములు నిర్ణయించుచున్నవి. అయినచో ఈ నాదమునకు వేదస్వరమునకు సంబంధమేమైన నున్నదేమో ఆలోచింపవలసి యున్నది. ఈ నాదాంశము వేదస్వరము నందుండుటచేతనే వేద స్వరమున కంత ప్రాముఖ్యము వచ్చినదేమో కూడ పరిశీలింపవలసి యున్నది.నాదమునుబట్టియే స్వరమునకు ప్రాముఖ్యము వచ్చినచో నర్థభేదమువలన సిద్ధించు నష్టముకంటె నాదభంగము వలన సిద్ధించు నష్టమెక్కుడని స్పష్టపడుట లేదా ?

ఈ సందర్భమున నింకొక పరమరహస్యముకూడ స్ఫురించుచున్నది. నాదమే సాహిత్యమునకు మాతృస్థానమగు వేదములకు ప్రభవస్థాన మగుచున్నది. అటు సంగీతమున కంతకును మాతృస్థానమగు సప్తస్వరములునుకూడ ఈ అనాహత నాదమునుండియే ఉదయించుచున్నవని ఆ శాస్త్రపరిశోధకుల మతము. అయినచో సంగీత సాహిత్యములకు సమన్వయము నైక్యము కుదురుటలేదా ? ఒకవంక శబ్దము అర్థము భావము ఉపకరణములుగా గలిగిన సాహిత్యవిద్యకును ఇంకొక వంక రాగము తాళము భావము ఉపకరణములుగా గలిగిన సంగీతవిద్యకును పరమగమ్యము అనాహత నాదమే యగుచున్నది గాదా !

కాని పరమగమ్యము ఒక్కటే అయినను దానిని సాధించు విధానములందలి భేదపడుచున్నవి.సరిగా సంగీతమున నాదముదయించు విధానముననే సాహిత్యమున నుదయింపదు. ఈ యంశమును జ్ఞప్తియందుంచుకొనుట మిక్కిలి యావశ్యకము. సాహిత్యమునకు గూడ నాదమే గమ్యముగదా యని సంగీతములోవలె సాహిత్యములో సరిగమలు ప్రవేశపెట్టుట కనుపుపడదు. అనాహతము ఆకాశ గంగవంటిది. అది

సమాధిలో గోచరము గావలసినదే గాని స్థూలమైన కర్ణేంద్రియమునకు గోచరముగాదు. ఇక సంగీతము సాహిత్యము దానినుండి భూలోకము నకు దిగు రెండు పాయలవంటివి. ఇవి అత్యుచ్చదశలో అనాహతో దయమునకు దోడ్పడవచ్చును. కాని వీని నిమ్నగమనమున అనాహ తము పూర్ణముగ ప్రత్యక్షముగాదు. దాని యంశము కొంతయుం డును. ఈ యంశమే సుఖసంపాదకము. ఈ యంశమునకు సంగీతమున రాగము తాళము ఆలంబనము లయినట్లే సాహిత్యమున శబ్దసారము తాళము ఆలంబనమగుచున్నది. ఎట్లాలంబన మగునదియు ఇంచుక వివరింపవలసి యున్నది.

సాధారణముగా కవులు ఏదో యొక ఛందస్సు వాడుట గాన నగును. కొందరు ప్రాచీన పద్ధతిని వృత్తములు జాతులు ఉపజాతులు వాడుచున్నారు. వానిలో నున్న స్వేచ్ఛ చాలక కొందరు ఆధునాత నులు క్రొత్త ఛందస్సులను గల్పించుకొను చున్నారు. మొత్తము మీాద ఛందస్సులను గల్పించు కొనుచున్నారు. మొత్తము మీాద ఛందస్సు లన్నియు లయబద్ధములే యనుట నిర్వివాదము. ఇంకొక విశేష మేమనగ ప్రవీణులగు వచన రచయితలు గూడ తమ వచన మున సూక్ష్మమయిన లయ ప్రవేశపెట్టెదరు. విదగ్ధులయిన మహా కవులు ఛందస్సువలన సిద్ధించు లయతో తృప్తినందక అక్షరముల పొందికవలన లయ నభివృద్ధి చేసికొందురు.

శబ్దసారమును విమర్శించునపుడు ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన ఈ క్రింది పద్యము మిక్కిలి సాహాయ్యకారి. ఇది నృసింహ పురాణ పీఠిక లోనిది.

మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయ గ్రొంచమునునావలఁ గూయగడంగు
భంగి ప్రౌ

ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్యాదీ-
లంచన కీర్తిసంగ సుఖలీలకు నెన్నను గాంతు నేసితిన్.

ఇందలి విశేష మేమనగ మహాకవి నాదమునకు నికృష్టకవి నాదమునకు భేదము తీయుచున్నాడు. మహాకవి నాదము రాజహంస కూజితమట. నికృష్టకవిది క్రౌంచరుతమట. "ప్రౌఢాంచిత శబ్దసారులు మహాకవులు" అనుటలో నున్న రహస్యములను కొంత వెల్లడింపవలెను శబ్దము వేరు శబ్దసారము వేరు పూవుకు తావికి ఉన్న సంబంధమే రెండిం టికి నున్నది. ఈ శబ్దసారములో రెండు గుణములుండవలెను. మున్ముందు అది ప్రౌఢముగా నుండవలెను. ప్రౌఢత్వమనగ శ్రవణమును దాటి బుద్ధిగ్రాహ్యముగ నుండవలెను - (సుఖ మాత్యంతికమ్ యత్తత్ బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్ అనినట్లు) ఇంగ్లీషులో చెప్పిన Subilety దీనికి సరిపోవును అనవచ్చును. ప్రౌఢత్వమేగాక, అంచితత్త్వము గూడ నుండ వలెనట. అంచితత్త్వమే సుఖమునకు జన్మభూమి. అవిచ్ఛిన్నత ఐక్యము సౌఖ్యము ను త్తేజకత్వము అననవి అంచితత్త్వమునకు పోషకములని చెప్పవచ్చును. శబ్దసారమునందీ రెండు గుణములు ఉన్న కావ్యశయ్యా వీథులకు మిక్కుటమైన మధువృష్టి గమ్మెచున్నదట. నాదవిమర్శన మున ఎఱ్ఱప్రెగ్గడ మహాకవి ఇంతదూరము దారిచూపుచున్నాడు. నన్నయ్య తిక్కనల నాదము దృష్టిలో నుంచుకొని ఆతడీ పద్య రచనము సల్పియుండవచ్చును — చెప్పుచున్నది తెలుగు కావ్యము గనుక.

సంస్కృత సాహిత్యమున నాదమునకు అగ్రతాంబూలము వేద ములదే. అటుపిమ్మట చెప్పవలసినది రామాయణము. స్వరముల్ని రైలుపట్టాలమీద నడవకపోయినను

కూజంతమ్ రామ రామేతి,
మధురమ్ మధురాక్షరమ్

అనుటలో "మధురాక్షరమ్" అనుటవలన శయ్యా మాధుర్యము లేక నాదమాధుర్యము ఉద్దిష్టము. నన్నయ 'అక్షర రమ్యత'కును దీనికిని ఎంత సన్నిహిత బాంధవ్యమున్నదో గమనింపుడు. తక్కిన కావ్యగుణములన్నిటిని అటుంచగా ఒక్క నాదానుసంధానమునకయి వాల్మీకి పదేపదే చదువుకొనవచ్చును. ఇది చెవులపండువు చేయుటమాత్రమే గాదు. తన రెక్కలమీద గూర్చుండబెట్టుకొని ఆత్మ నెక్కడికో దీసికొనిపోవును. మనస్సును సుప్రసన్నముగా జేయుటలో దీనికున్న మహిమ అనిర్వాచ్యము. చక్కని కావ్యార్థమునకు ఉచితమయిన మాధుర్య పూర్ణమగు కావ్యశయ్య బోధించినపుడు గోక్షీరమున పంచదార కలిసినట్లుండును. అందుచే కావ్యార్థమును చదువరుల హృదయములలో హత్తించుటకయి మహాకవులు నాదమును ఉపాంగముగ జేసికొందురు. అర్థము తెలియకపోయినను వాల్మీకి శ్లోకము విన్నంతనే హృదయముప్పొంగుటకు ఈ నాదమే కారణము. అతనిలో శబ్దాడంబరము మృగ్యము. కాని నాదమాధుర్యము సుపుష్కలము.

ఈ గుణమునందుకూడ నన్నయ వాల్మీకికి మానసికపుత్రుడే. వేదముల నాదమును వీణాస్వనముతో బోల్చినచో వాల్మీకి నాదమును వేణురవముతో బోల్పవచ్చును. మరల నన్నయది కొన్ని మెట్లు దిగుచున్నది. దీనిని కింకిణీనిక్వాణనముతో బోల్పవచ్చునేమో. వాల్మీకికి నన్నయకు నంతర మెంతో గనవచ్చుచున్నను బాంధవ్యము మాత్రము నిర్దిష్టము.

నాదసౌష్టవమును ఒక మహాగుణముగ నెంచి బుద్ధిపూర్వకముగ యత్నించినవారిలో నాంధ్రమున కవిత్రయము అగ్రవీథిని సంచరించుచున్నది. ఇతరు లెవ్వరయిన దీనిని సాధించుటకు యత్నించిరేమో యత్నించిన ఎంతవరకు కృతార్థులైరో విమర్శనీయము. శబ్దాలంకార మున్నచోటనెల్ల నాదము సిద్ధించుచున్నదని పొరపడరాదు.

అడిగెదనని కడువడిజను,
నడిగినఁ దనుమగుడ నుడువడని నడయుడుగున్
వెడవెడ చిడిముడి తడబడ
నడుగిడు నడుగిడచు జడిమ నడుగిడు నెడలన్.

(భాగ. స్కం 8 ప 103)

ఈ పద్యములో శబ్దాలంకారము చెవిగ్రుద్ది ప్రత్యక్షమగుచున్నది. నాదము లేనేలేదు. నన్నయ ఈ క్రింది పద్యమును దిలకించినచో

గంగాధర పింగ జటా సంగమ
మంగళ విశాల చటుల తరంగన్
గంగానది సేవించెను గంగా
ద్వారమున విగత కల్మషుడగుచున్.

(భార. ఆది. ఆ. 8. ప. 136)

శబ్దాలంకారము నాదమాధుర్యముగ నెట్లు పరిణమించునో ప్రత్యక్షమగుచున్నది. ఇంచుమించుగ నిరలంకారములని చెప్పదగిన పద్యములలో గూడ నాతడు నాదమును సాధించుట గాననగును.

వారిరుహనేత్ర మదన
ప్రేరితయై లజ్జయుడిగి భీతిల్లక బ్రం
దారకమూర్తికి రాజకు
మారున కిట్లనియె మందమంద మృదూక్తిన్.

ఇందలి యతిప్రాసములును 'మంద మంద మృదూక్తిన్' అనుటలోనున్న యనుప్రాసమును శబ్దాలంకారములే యయినను ఎంత వినయసంపద సంపాదించుకొనుచున్నవి!

నన్నయ రచనమునకు నాదమాధుర్యము ప్రాణమని చెప్ప వచ్చును. ఇది లేని పద్యము లేనేలేదని కూడ చెప్పవచ్చును. అర్థ మునుబట్టి భావమునుబట్టి సామాన్యముగ గనవచ్చు పద్యములుకూడ నాదమాధుర్యమునుబట్టి పదేపదే చదువ బుద్ధిపుట్టును. ఇంద్రప్రస్థ పురమును వర్ణించుచు

సరళ తమాల తాలహరి చందన చంపక నారికేళ కే
సర కదళీలవంగ పనసక్రముకార్జున కేతకీలతా
గరు ఘనసారసాలసహకార మహీరుహరాజ రాజసుం
దర నవనందనావళుల దత్పుర బాహ్యము లొప్పజూడగన్.

అని చెప్పిన పద్యమును గైకొందము. ఇందు ఉద్యాన వృక్షముల జాపితా యిచ్చినాడు. ఇదియే నిఘంటువు నుండియైనను సంగ్రహించు కొనవచ్చును. ప్రకృతిని పరిశీలించియే రచింపవలెనను పట్టుదలలేదు. గతానుగతికమన్నను ఒప్పుకొనవలసి వచ్చును. అయినను నాద మాధుర్యము దీనికొక వైశిష్ట్యమును చేకూర్చుచున్నది. ఇట్లే

బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్ర సహస్ర ఫణాళిదాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికి పాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుడనంతుడు మాకు ప్రసన్ను
డయ్యెడున్.

ఇత్యాది యుదంకుని నాగస్తుతి పద్యములు కూడ.

స్థూలదృష్టికి పెక్కు సంబోధనలతోడను వ్యర్థములుగ గన వచ్చు పదములతోడను వదులుగ గనవచ్చు పద్యములు కూడ నాద మును బట్టిచూచినచో బిగువుతో రమణీయములుగ నుండును.

నీల గళోపమాన కమనీయ గుణోన్నతి జెప్పజూచు న
న్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవుగాన నాకు నుం

బోలఁగ భర్త ఏవయిది భూనుత ధర్మపథంబు నిక్కువం
దాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్
మహిన్.

నీవును బ్రహ్మచారివి వినీతుఁడవేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నాకు నీకుమున్
భావజ శక్తినైన యది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుఁ దయసేయుము నాకుఁ బ్రియంబు నావుడున్.

లలితమైన శయ్యలోఁగాక ఉద్ధతమైన శయ్యలో గూడ నాద మాధుర్యము నన్నయ సాధించుట గాన నగును.

పాతాళైక నికేతనాంతరమునన్ బర్వెన్ దదశ్వాఖిల
స్రోతోమార్గ వినిర్గతోగ్ర దహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెన్ భుజగాధినాథు మనమున్ భేదిల్లెఁ గల్పాంత సం
జాతప్రోద్ధత బాడబానల శిఖా శంకాధికాతంకమై.

ఇట్లుదాహరించుచు బోయినచో నాతని భారత భాగమునంతను ఉదాహరింపవలసి వచ్చును. ఏ రసములోఁగాని ఏ ఘట్టములోఁగాని ఈ గుణ మాతనిని విడనాడకున్నది.

దేవతలను మహాపురుషులను వర్ణింపవలసి వచ్చినపుడు కొన్ని విశేషణములను కుప్పపోసినట్లగపడును. ఆ విశేషణములో నంతర్గతమైననాదము ననుసంధింపమేని పద్యమునందలి యందము బోధపడదు.

వరదు సురాసురవందితుఁ
గరుణాకరుహారుఁబినాక కరుఁ గరిచర్మాం
బరు శంకరు గిరిజాసుం
దరు నిట్లని స్తుతించె దద్దయుభక్తిన్.

ఇట్లే ముకుంద స్తవములుఁగూడ గనవచ్చును. వ్యాసుడు

మున్నగు మహాపురుషులను వర్ణించుటలో గూడ ప్రాయికముగ నీ సాధనమే యవలంబనీయ మగుచున్నది.

పరమ బ్రహ్మనిధిన్ బరాశరసుతున్ బ్రహ్మర్షి ముఖ్యున్ దయా
పరు గౌరవ్యపితామహున్ జనహిత ప్రారంభు గృష్ణాజినాం
బరు నీలాంబుద వర్ణ దేహు ననురూపప్రాంశు నుద్యద్దివా
కరరుక్పింగ జటాకలాపు గతరాగ ద్వేషు నిర్మత్సరున్.

ఇట్టి పద్యములననుసరించియే తిక్కనాదులు

ప్రాంశుపయోదనీలతను భాసితు నుజ్జ్వలదండధారు బిం
గాంశు జటాచ్ఛటాభరణు నాగమ పుంజపదార్థ తత్త్వని
స్సంశయకారుఁ గృష్ణ మృగచర్మ కృతాంబరు కృత్యు భారతీ
వంశవివర్ధనున్ త్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.

మొదలయిన పద్యములు రచించిరి.

సాధారణముగా శబ్దవిజృంభణము అర్థగౌరవము నరికట్టుట గాననగును. నన్నయ గాఢప్రతిభకు ప్రబల నిదర్శనలేమనగా శబ్దము వలన నాదమును నాదమువలన భావమును పోషించుకొనుచుండును. ఇది మహాకవులకు గూడ దుస్సాధ్యమైన కళారహస్యము.

జలధి విలోలవీచి విలసత్కల కాంచి సమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునన్ దదున్న మ
ద్గళదురుఘర్మవారి కణ క్రమకరాబ్జమువట్టి నూతిలో
నిలువక గోమలిన్ దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.

అను పద్యమును గైకొందము. దేవయానిని నూతిలోనుండి చేయూతనిచ్చి ఈవలకు లాగెను అని మాత్రమే దీని యర్థము. ఇందలి యనుప్రాసము కొంత గడబిడచేయుచు అర్థమును వెనుకకు ద్రోయు చున్నట్లుకూడ అనిపించును. దీని తరువాత భాగమనవచ్చు

విగ్రహమేది నన్ను ధరణీ వర ! కూపము వెల్వరించునా
డుగ్రమయాఖ సాక్ష్యముగ నున్నత దక్షిణ పాణిజేసి భూ
పాగ్రణి ! నాదు దక్షిణ కరాగ్రము వట్టితి కానమున్న పా
ణిగ్రహణంబుసేసి తది నీయెడ విస్మృతిబొందబాడియే.

అను పద్యము చదువువరకు "జలధివిలోల" అను పద్యములోని యనుప్రాసము సాధించుచున్న గంభీర భావము బోధపడదు. ఈ పద్యములో యయాతి దేవయానుల పాణిగ్రహణోత్సవము వ్యంగ్య ముగ వర్ణితమైనది. అగ్ని సన్నిధిని యయాతి తన దక్షిణకరముతో దేవయాని దక్షిణకరగ్రహణము చేసినాడు. ఇది యప్పటికి వారికి గూడ తెలియలేదు. కాని తరువాత నా యుదంతమును తలచుకొని దేవయానిదాని కింత యర్థము కల్పించినది. ఈ భావమును నన్నయ తన యనుప్రాసమువలనను దానిలో నంతర్గతమగు నాదము వలనను సాధించుచున్నాడు. వారి పెండ్లికి వేరే మంగళవాద్యము లక్కరలే కుండగ నన్నయనాదము ఆ ప్రయోజనమును నెరవేర్చుచున్నది!

వివిధోత్తుంగ తరంగ ఘట్టనచలద్వేలావనైలావలీ
లవలీలుంగలవంగ సంగతలతాలాస్యంబు వీక్షించుచున్.

ఈ లాస్యములు నాదమునుబట్టికూడ స్ఫురించుచున్నవి. పాండు రాజునకు మదనోన్మాదమును పెంచిన ఈ క్రింది వసంతవర్ణనములో నాదము ఎంత భావద్యోతకముగా నున్నదియు రసజ్ఞులకు విస్పష్టము.

కమ్మని లతాంతములకు మ్రొనసివచ్చు
మధుపమ్ముల సుగీతనినదమ్ము లెసగెం జూ
తమ్ములలసత్కిసలయమ్ముల సుగంధి ముకు
ళమ్ములను నానుచు ముదమ్మొనర వాచా

లమ్ములగు కోకిల కులమ్ముల రవమ్ము
మధురమ్మగుచు విన్చెనవిశమ్ము సుమనోభా
రమ్ముల నశోక నికరమ్ములును జంపక
చయమ్ములును గింశుకవనమ్ములును నొప్పెన్.

కిరాతార్జునీయము నందలి ఈ క్రింది పద్యమును బరికించిన నన్నయకు భావపోషణమున నాదమెంత పరమప్రయోజనకారియగు చున్నదియు సుగమమగును.

హరుశరమును నరుశరమును
సరి నిరుపక్కియలు దాకి జనమతిశరసం
భవమున దిరిగె వరాహము
శరనిధి మథనమున దిరుగు శైలముపోలెన్.

వరాహ మెట్లు తిరుగుచున్నదియు నాదములోనే ప్రత్యక్షమగుచున్నది.

ఈ నాదానుసంధానమున అనేక రకములయిన హాయి యేర్పడుచున్నది. ఒకప్పుడు చందనచర్చ చేసినట్లు మరియొకప్పుడు మలయ మారుతమువచ్చి ఆశ్లేషించినట్లు వేరొకప్పుడు పన్నీరు వర్షించినట్లు సహృదయుని రసమయ తనువు సుఖపడుచున్నది. ఈ క్రింది పద్యముల లోని నాదము ఎట్టిహాయిని గూర్చుచున్నదియు సహృదయులే నిర్ణయించుకొందురుగాక !

అలఘుతపస్సమాధి నియతాత్ములకున్ బహుపుణ్యలోక కాం
క్షులకు విశుద్ధమానసులకున్ సతతంబును నాశ్రయంబనై
లలితనిలింపదంపతి విలాస విహార మహోత్సవంబులున్
గలిగి వెలుంగు రత్నమయ కందర సుందరమంద రాచలా!

నల దమయంతు లిద్దరు మనః ప్రభవానల బాధ్యమానులై
నలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనంబులన్
నలినదళంబులన్ మృదు మృణాళములన్ ఘనసారపాంశులన్
దలిరులశయ్యలన్ సలిల ధారల చందనచారు చర్చలన్.

అనాహతనాదములో మరల సూక్ష్మసూక్ష్మ తరవిభాగమును నాదబిందూపనిషత్తు చేయుచున్నది. మొదట సముద్రఘోషము మేఘ గర్జనమువలెను సూక్ష్మతరమయిన కొలది మృదంగము కాహళము వలెను తుదకు వేణు వీణాస్వనములవలె సూక్ష్మతమముగను ఆనాదము వినవచ్చునట.

ఆదౌ జలధిజీమూత భేరీనిర్ఝర సంభవః
మధ్యే మర్దళ శబ్దాభో ఘంటకాహళ జ స్తథా
అంతేతు కింకిణీవంశ వీణాభ్రమరనిస్వనః
ఇతి నానావిధా నాదా శ్శ్రూయంతే సూక్ష్మ సూక్ష్మతః.

మహాకవుల కావ్యములలోని అనాహతాంశమగు నాదమున గూడ పై నుదాహృతమైన తారతమ్యము నిశ్చయింపవచ్చునేమో. మొత్తముమీద చూచుకొన్నచో ఆదిపర్వముకంటె సభాపర్వము సభాపర్వముకంటె నారణ్యపర్వఖండము నాదమాధుర్యమునకు ఉత్త రోత్తరముగ ప్రశస్తతరముగ నెన్నదగియున్నవి. ఆదిపర్వమున

నిండుమనంబు నవ్య నవనీతసమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున నోపు విప్రుడో
పండతిశాంతుడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్.

వంటి పద్యములును సభాపర్వమున

మదమాతంగ తురంగకాంచనల సన్మాణిక్య గాణిక్యసం
పదలోలిం గొని తెచ్చియిచ్చి ముదమొప్పంగాంచి సేవించిర

య్యుదయాస్తాచల సేతుశీత నగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజు దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.

వంటిపద్యములును లేకపోలేదు. కాని బాహుళ్యమున పై విమర్శనము నిలుచును.

ఒక్కొక పద్యములోనే నాదమాధుర్యమును చిప్పిలజేయు పద్యము లసంఖ్యాకములుగ నున్నపుడు ఆయాపద్యములకు ప్రతినిధులుగ ఒక్క పద్యమును నిర్ణయించుట రుచిభేదములకు వివాదములకు ఆస్పదము గాకుండనేరదు. కాని సాహిత్యరంగమున రుచిభేదములు కూడ ఆనందదాయకములే గావున నీ క్రింది పద్యములు నాదమునకు ప్రతినిధిపద్యములుగ నిర్ణీతములగుచున్నవి.

క్వణదణు కింకిణీ కలిత కాంచన కాంచికలాపమున్ రణ
న్మణి కలనూపురంబులు సమధ్వని నొప్పగ భక్తిబాదచా
రిణియయి కన్యకాజన పరీత సుభద్ర తద ద్రిపూజ న
ప్రణతులుసేసె నింద్రసుతు బార్థుని జేశ్వరుగా దలంచుచున్.
ఆది. ఆ 8. ప 178.

నీ కరుణం గరంబు రమణీయతరంబయి సర్వవిఘ్న దూ
రీకృతమై సమాప్తి నొనరెన్ ధరణీధర యిమ్మఖంబు భూ
లోకములోన నేను నృపలోక నమస్కృతి గీర్తిబర్వితిన్
నాకులమున్ వెలింగె సుగుణంబుల కాస్పదమై పవిత్రమై.
సభా. ఆ 2. ప 81.

శారద రాత్రు లుజ్జ్వల లసత్తరతారకహారపఙ్క్తులన్
జారుతలంబులయ్యె వికసన్నవకైరవ గంధబంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచి పూరము లంబర పూరితంబులై.
అర. ఆ 4. ప 142.

ప్రతినిధిగా నెన్నుకొనుటలో పైని వచించినట్లు సకృత్తుగనున్న తరగతిని కాదని బహుళముగా నున్న తరగతికి ప్రాధాన్యమీయవలసి యున్నది. నాదముననున్న వినయము పుష్టి అనుగుణములలోనున్న తారతమ్యమునుబట్టి ప్రాశస్త్యనిర్ణయ మొనర్పవలసి యున్నది.

నాదము ఆపాతమధురమనినంత మాత్రమున దాని మెలకువలు ఎల్లవారును అనుసంధింపగలరని కాదు. అపాతమధురమనుటకు ప్రబల లక్ష్యమైన సంగీతము కూడ కొంతవరకే సర్వజనానుభోగ్యము కాని సూక్ష్మభూములను జొచ్చినపుడు రసికజనవేద్యమే యగుచున్నది. రత్న పరీక్షకంటెను క్లిష్టతరమైన కావ్యనాద ప్రాశస్త్య నిర్ణయమున పారీణులమని ఎవరు చెప్పకొనగలరు? రసమయతనువునందలి శ్రవణేంద్రియము మిక్కిలి సునిశితమయి ఏకాగ్రచిత్తముతో పరిశీలించు వారుగాని ఈ సూక్ష్మాతిసూక్ష్మ విభజనమున కానందింపజాలరు.

తారతమ్య నిర్ణయముమాట యటుంచగ 'శ్రీవాణీ' అను శ్లోకమున (శ్రీ)కారము చుట్టుట మొదలుకొని "శారదరాత్రు" లను పద్యాంతమువరకు నాద(శ్రీ) నన్నయ గంటపు మొననెక్కి నాట్యమాడినది. నాదమునం దాతడుచూపిన వైవిధ్యమునుగాని దానిని సాధించుటకాతడవలంబించిన పద్ధతులుగాని కూలంకషముగ చర్చించుట దుస్తరము. ఏ శబ్దము తరువాత నే శబ్దము పొందుపరచినచో నాదము సొంపు సంపాదించుకొనునో ఆతనికి సహజపాండిత్యముగ నలవడియుండవలెను లేక అభ్యాసనిష్ఠమైనను బహుదీర్ఘమైనది సునిశితమైనది గావలయును.

కొందరు మహాకవులు శబ్దసిద్ధులు. మరికొందరు అర్థసిద్ధులు. ఉభయసిద్ధులు అత్యల్ప సంఖ్యాకులు. అందులో నన్నయ యొకడు. ప్రసన్న కథాకవితార్థయుక్తిలో నర్థసిద్ధిని అక్షరరమ్యతలో శబ్దసిద్ధిని ప్రతిజ్ఞచేసికొని యుక్తిజ్ఞుడయినాడు.

న్నియు నన్నయకడ నున్న వనుట నిర్వివాదము. ఆతనికున్న శబ్దశాసన బిరుదమునకు ఇంతవరకు వ్యాకరణపదముగానే అర్థము లీయుచున్నాము నాదమాధుర్యమును సాధించుటలో నాతని నిరంకుశప్రజ్ఞనుబట్టికూడ ఈ బిరుద మన్వర్థమగుచున్నది. ఈ మతములకు ఎఱ్ఱాప్రెగ్గడ మహాకవి కొంత చేయూత నొసగుచున్నట్లు గానవచ్చుచున్నది.

ఉన్నతగోత్ర సంభవము నూర్జితసత్త్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతార్య పరి భావి మదోత్కటమున్న రేంద్రపూ
జోన్నయ నోచితంబునయి యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి నెందును గ్రాలుట బ్రస్తుతించెదన్.

అథన్సూచిక

*వీణానాద ప్రతిమ నిగమావిర్భవిత్స్వర పుణ్యశ్రేణీ సంపాదిత! (స్త్రీ పర్వము. ఆ. 2 ప. 184.)

—0—

# నన్నయ నానారుచిరార్థ సూక్తినిధిత్వం

డాక్టర్ ఎస్. గంగప్ప.

'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థయుక్తిలో
నారసి మేలునా, నితరు లక్షర రమ్యత నాదరింప, నా
నారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్'
(1-1-26)

ఇందులో ఆదికవి అయిన నన్నయకు కవితా సిద్ధాంతాల్ని తెలుపడం గమనించవచ్చు. నన్నయకు పూర్వం శాసనాలు తప్ప మనకు గ్రంథస్థ ఆధారాలు లేకపోవడంవల్ల ఆ కవుల కవితా ఆశయాలు ఏమిటో తెలియడంలేదు. ప్రస్తుతం నన్నయ కవితా సిద్ధాంతాలను గూర్చి అందులోను ప్రధానంగా-ఆయన 'నానారుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని' గూర్చి తెలుసుకోవడమే ఈ వ్యాసోద్దేశం.

ఇందులో నన్నయ మూడు విధాలైన తన కవితా సిద్ధాంతాల్ని పేర్కొన్నాడు. 1: ప్రసన్న కథా కలి(వి)తార్థయుక్తి. 2. అక్షర రమ్యత. 3. నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం. వీటిని పేర్కొన్న క్రమం పరిశీలనార్హం. మొదటిదైన ప్రసన్న కథాకలి (వి) తార్థ యుక్తిని గూర్చి 'సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలి (వి) తార్థ యుక్తిలో నారసి మేలునాన్' అనడంలో విశేషముంది. అంటే సారమతులైన కవిశ్రేష్ఠులు మాత్రమే తన కావ్యంలోని 'ప్రసన్న కథాకలి (వి) తార్థ యుక్తి'ని 'లోనారసి' లోలోపలే మనస్సులో పరిశీలించి. 'మేలునాన్' భేషని మెచ్చుకొంటారనీ నన్నయ ఉద్దేశం. పోతే 'ఇతరులు' అంటే 'సారమతులైన కవీంద్రులు' కాని వారు తన

కవితలోని 'అక్షరరమ్యత' ని గ్రహించ గలరనీ అర్థం. కాగా అటు సారమతులైన కవీంద్రులుగాని ఇటు ఇతరులుగాని గ్రహించలేని మరో కావ్యలక్షణం తనలో గలదనీ అదే 'నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం' అనీ పేర్కొన్నాడు నన్నయ. ఈ విషయం స్వతఃగా తానే చెప్పవలసి వచ్చినదన్నమాట. కారణం తన సమకాలికులు సైతం తన ప్రసన్న కథా కలి (వి) తార్థయుక్తిని, అక్షరరమ్యతనీ గుర్తించారు. కానీ తనలోని 'నానారుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని గమనించినట్లు లేదు. కనుకనే స్వయంగా చెప్పవలసిన అవసరంఏర్పడింది.

1.1. దీన్ని పరిశీలించేముందు నన్నయ తన విశిష్టగుణాలలో పేర్కొన్న 'తన కుల బ్రాహ్మణు' అనే పద్యంలోని ప్రధాన లక్షణాలు 'విపుల శబ్దశాసనత', 'లోకజ్ఞత', 'మత్సమరాధిపాచార్యత్వం', బుద్ధిని బృహస్పతి, వీటిని మించి 'సత్ఫలితా యోగ్యత' అనేవి గమనించడం ముఖ్యం. వీటి మూలంగానే నన్నయ మహాకవి, ఆదికవి అయ్యాడు. తిరుగులేని అత్యద్భుతమైన ఆదిమ రచనకు ఆద్యుడయ్యాడు. తరువాతి తెలుగు కవులందరికీ ఆదర్శప్రాయుడయ్యాడు కనుకనే మనమీనాడు ప్రస్తుతిస్తూ ఉన్నాము. స్మరిస్తూ ఉన్నాము.

1, 2, నన్నయ కవితాశయాల్లో మొదటిదైన 'నన్నయ ప్రసన్నకథా కలి (వి) తార్థయుక్తి'ని గూర్చి కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు బహుముఖాల దర్శించి, లోనారసి అనుభవించి మిక్కిలి చక్కగా వివరించారు. నన్నయ 'అక్షరరమ్యత'ను అన్ని విధాల విపులంగా 'నన్నయ అక్షర రమ్యత' అనే తమ సిద్ధాంత గ్రంథంలో మిత్రులు డా॥ సి. వి. యల్. నరసింహారావుగారు చక్కగా నిగ్గు దేల్చారు. 'నన్నయ రుచిరార్థసూక్తి నిధిత్వాన్ని' గూర్చిన పరిశ్రమ ఇంతవరకు పరిపూర్ణంగా జరగనేలేదు. దీన్ని గూర్చి మొట్టమొదట క్లుప్తంగానే అయినా– వ్యాసరూపంలో వివరించ యత్నించిన ఆచార్య

ఖండవల్లి లక్ష్మీరంజనంగారికీ దక్కుతుంది. ఈ సందర్భంలో లక్ష్మీ రంజనంగారి మాటలు కొన్ని ఉట్టంకించడం అసమంజస మేమీకాదు. పైపెచ్చు అత్యావసరంకూడా. 'కావ్యలక్షణములను గూర్చి వారి భావములు; దండి, భామహుడు మున్నగు ప్రాచీనాలంకారికులకు సన్నిహితముగా నున్నట్లుతోచును. వీరు చాలవరకు వస్తుగుణాలంకార వాదులు. అనంతరికులు అనందవర్ధనాదులు ప్రధానముగా ధ్వని రసవాదులు- సారమతిన్ అను పద్యములోని మూడు లక్షణములును దండ్యాదుల వస్తు రీతి అలంకారములకు ప్రతీకలుగా తీసికొనవచ్చును'. నానారుచిరార్థ సూక్తినిధి- అనగా యోజింతము నానా...అనేకములైన విస్తారమైన అని యర్థము చెప్పవచ్చును. రుచిరార్థ- రుచిరములైన యర్థములు గల సూక్తులయందు, నిధి- గని వంటివాడు. రుచికలది రుచిహేతువైనది రుచిరము అని చెప్పవచ్చును. 'మధు' శబ్దమునకు మత్వర్థమున మధురము రూపమగును. తియ్యనైనది, రుచిర శబ్దమునుగూడ నట్లే నిష్పన్నము చేసుకొనవలెను. రుచిమంతమైనది రుచిరము. ఇచ్చట రుచి యనగా హృదయాహ్లాద కరమైనది. దీనినే దండ్యాచార్యుడు ఇష్టార్థము అని వ్యవహరించును 'శరీరం తావ దిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' అని యాతని కావ్యలక్షణము. నన్నయ రుచిరార్థము, దండ్యాచార్యుని ఇష్టామును అభిన్నములనియే చెప్పవచ్చును. దీనినే ఉత్తర కాలికుడగు జగన్నాథుడు 'రమణీయార్థము' అని పేర్కొనును. దండి, నన్నయ, జగన్నాథుడు ఒక కోవకు చెందినవారు. దేశికావ్యములందు సూక్తులకే అగ్రతాంబూలముగా దండి మతము. సేతు బంధ కావ్యమును గూర్చిన యాతని ప్రశంసా వాక్యములు గమనింపదగినవి.

"మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాది యన్మయమ్॥"

"మహారాష్ట్ర దేశమాశ్రయముగా గల భాషను ప్రశస్తమైన ప్రాకృతముగా విజ్ఞులు తలతురు. సూక్తి రత్నములకు నిలయమైన సముద్రము వంటి సేతు బంధాది కావ్యములిందే వెలసినవి. ఆదిపదముచే సప్తశతి వంటి ఇతర కావ్యములని వ్యాఖ్యాతలు వివరించినారు. ప్రాకృత కావ్యములకును, దేశికావ్యములకును సూక్తి సంపద ప్రత్యేక ధర్మముగా చెప్పినట్లయినది. నన్నయ భట్టారకుడీ భావమే గలవాడుగా తోచును." సూక్తియనగా రుచిరమై చమత్కార యుక్తమైన కూర్పు అని గ్రహింతము... పదమునందు చమత్కృతి అనగా ఆ పదము తన వాచ్యార్థమును వీడి మనోహరమైన అన్యార్థమునందు వాడబడుట. రూపలక్షణమును దానికి సంక్రమింప జేయుట దాని లక్ష్యార్థమన వచ్చును" [నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వము లక్ష్మీరంజన వ్యాసావళి- పు. 1–5]

2. 0. పై విషయాన్ని దృష్టిలో పెట్టుకొని నన్నయ నానా రుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని గురించి నివేదించిన కవ్యభిప్రాయం వ్యక్తమవుతుంది. నన్నయ నానారుచి రార్థాలతో కూడిన సూక్తులు పలు విధాల దర్శన మిస్తాయి. పదాలలో పదబంధాలలో, సమాసాల్లో విభక్తుల్లో, క్రియల్లో, ఎడనెడ సంధిలో, చివరికి వాక్యాల్లో ఈ నానా రుచిరార్థ సూక్తి నిధిత్వం స్పష్టమవుతుంది. అంటే వీటన్నింటిలో ఏదో ఒక వ్యంగ్యభావ స్ఫోరకమైన అభిప్రాయాన్ని ఉద్దేశించే కవి అలా ప్రయోగించి ఉంటాడని గమనించవచ్చు. అలా గుర్తించగలిగినప్పుడే నన్నయ గొప్పదనం, సూక్తి నిధిత్వం, అభిగమ్యమానమై ఆనందాతిశాయి కాగలదు. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

పదాలు :

పదగతమైన సూక్తులు బహు చమత్కారంగా సున్నితంగా చెప్పడం నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వంలోని మొదటిమెట్టు.

అంటే మామూలుగా ఒక పదానికుండే అర్థం కంటే విశేషార్థంలో ప్రయోగిస్తే దాన్ని సూక్తిగా మనం స్వీకరించవచ్చు. నన్నయ చేసినది ఇలాంటి పనే.

క్రమములు :

"ఉదాత్త రసాన్విత కావ్య నాటక క్రమములు పెక్కు సూచితి" (1-1-10)

"క్రమము" అంటే వరుస, అనుష్ఠానము" అని అర్థం. కాని ఇక్కడ అలాకాక యీ అర్థాలకంటే విశిష్టార్థంలో ఈ పదం ప్రయుక్తం కావడం విశేషం. పద్ధతులు, విధాలు, రీతులు, అనే అర్థంలో నన్నయ ప్రయోగించడం గమనించడం అవసరం అప్పుడే నన్నయ హృదయం అవిష్కరించినట్లు అవుతుంది.

అభిప్రాయంబు :

'అనవరతంబును శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయైయుండు' (1-1-11) సామాన్యంగా వ్యక్తి అభిప్రాయం, అభిమతం అనడం లోకన్యాయం. కానీ ఇక్కడ నన్నయ శ్రీమహాభారతంబు నందలి యభిప్రాయంబు అని ప్రయోగించాడు. అంటే ఇక్కడ భారతేతివృత్తం భారతకథ అనే నన్నయ అభిప్రాయ మని మనం గ్రహించవలసి ఉంది.

పెద్దయై :

పై వాక్యంలోనిదే ఈ పదం. 'అభిలాష పెద్దయై యుండు' అనడంలో అభిలాష పెద్దది అంటే అధికమై, గొప్పదై ఉందని అర్థం. సామాన్యంగా చిన్న, పెద్ద అనే ప్రయోగం. కాని అభిలాష పెద్దయై యుండునని నన్నయ ప్రయోగించడం విశేషం.

'అక్షరరమ్యత'లో సిద్ధివడయుటకు అపారమగు శబ్దపాండిత్యము నిశితమగు రసశ్రవణము పవిత్రమగు చరిత్రము ఆవశ్యకములు. ఇవ

వివర్ధనుండు :

'పాండు వంశ వివర్ధనుండు' (1-1-83)

జనమేజయునకిది విశేషణం. అంటే పాండు వంశాన్ని విశేషంగా వర్ధిల్ల జేసిన వాడని అర్థం. ఇదే అర్థంలోనే లక్ష్మీనిరంజనంగారు 'వివర్ధించు' 'విశేషంగా వర్ధిల్ల జేయుట' (1-5-9) అని వివరించారు.

ఏ న :

అలయక యేన దేవ యజనాధ్యయన వ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని నేన గురుసద్ద్విజ భక్తుడనేని నేనయ
త్యలఘుతపస్వినేని దివిజాధిప భూసురులార మన్మనో
నిలయకు నీ ప్రమద్వరకు నిర్విషమయ్యెడునేడ మీదయన్
(1-1-149)

ప్రమద్వర సర్పదష్టయై మరణించగా ఆమె ప్రియుడు రురుడు దేవతల్ని ప్రార్థించిన సందర్భంలోని పద్యం. ఇందులో 'ఏను' అని మూడుసార్లు ప్రయుక్తం కావడంలో రురుని ఉత్తమ గుణ గరిష్ఠతని వ్యంజింప జేయడం ఇందులోని విశిష్ట విషయం. సామాన్యంగా పునరుక్తి కావ్యదోషం లాక్షణికుల ప్రకారం. కానీ ఇక్కడ విశిష్టార్థంలో పునరుక్తి కావడం రురుని గుణ గరిష్ఠతా నిరూపణార్థమే.

కర్కోటకుడు :

'అందు శాపానుభవ భీత చిత్తుండై' (1-2-37)

కద్రువ నూరుమంది పుత్రులతో ఈ 'కర్కోటకు' డనేవాడు ఉచ్చైశ్శ్రవం తోకకు అతుకుకొనియుండి అంతా తెల్లనైనదానిలో మచ్చను కలిగించి, కద్రువకు దాస్యం కల్పించిన దుర్మార్గుడు. నన్నయ ప్రయోగించిన నాటి నుంచి తెలుగుదేశంలో ఏ దుర్మార్గుణ్ని చూసినా, విన్నా 'వాడు కర్కోటకుడు' అనడం సామాన్యమై

పోయింది. ఇది నన్నయ సూక్తివైచిత్రిలోని రుచిరమైన అర్థస్ఫూర్తికి చక్కటి నిదర్శన

వాడు, దానవి :

'పతి విహితానురాగమున భార్గవ పుత్రి యయాతిచేత వం
చిత యయి ( వాఁడు దానవికిఁ జేసిన నెయ్యమెఱింగికోప దుః
ఖిత యయి తండ్రిపాలి కతిఖేదమునం జని దీర్ఘ నేత్రని
ర్గత జలధారలం గడఁగెఁ గాంత తదీయ పదాబ్జ యుగ్మమున్'
(1-2-186)

ఇక్కడ యయాతి లాంటి మహారాజును "వాడు" అని ప్రయోగించడం, శర్మిష్ఠను 'దానవి' అనడం సమయాతిక్రమం చేసిన యయాతి దౌష్ట్యాన్ని ఎత్తిచెప్పడమే నన్నయ సూక్తులలోని అర్థపుష్టి. ఇలాగా ఎన్నైనా ఉదహారణలు ఇవ్వవచ్చు.

2. 2. పదబంధాలు :

పదబంధాల్లోను నన్నయ నానారుచిరార్థ సూక్తినిధిత్వం స్పష్టమవుతుంది. సమాస పదబంధాలు ఒకటే అనుకొన్నా ! ఈ పదబంధాల్ని విశిష్టార్థ ద్యోతకాలుగా-నేనిక్కడ సమాసంకంటే వేరుగా గ్రహించాను.

వినంగనభీష్టము :

'హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనగా మహి నొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్రనాకు సతతంబు వినంగ నభీష్టమిమ్మెయిన్

'వినంగనభీష్ట' మంటే వినాలన్న కోరిక, వినాలన్న కుతూహలం అని అర్థం. ఇలానే ఈనాడు ప్రయోగం. నన్నయ తన నాడు ప్రయో

గంలో ఉన్న రీతిలో 'విసంగసక్తి'మని వ్రాశినట్లు తెలుస్తుంది. ఇలాంటిదే 'విసంగడువెక్కు' (1-1-128)

తథ్యము సమకూరు :

'అమల సువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు న
త్తమ బహువేద విప్రులకు దానము సేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారత కథా శ్రవణాభిరతిన్...

'థత్యము సమకూరు'-తప్పక కలుగుతుంది. అనే అర్థం ఎంతో చక్కగా నన్నయ ఈ పదబంధాల్ని ప్రయోగించడంలో కవి విశిష్టత విశదమవుతుంది.

నేరఁబోలునే :

'అమలిన తారకా సముదయంబులనెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందమ బుద్ధి బాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సము
ద్రముఁదఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే

విధాతకు సైతం సాధ్యమవుతుందా ? అనే అర్థంలో సహజ సుందరంగా ప్రయోగించాడు.

ఏయది :

ఏయది హృద్యమపూర్వం
బేయది యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘునిబర్హణ
మేయది యక్కథయ వినంగ నిష్టము మాకున్'

'ఏయది' పునరుక్తం కావడం వల్లనే ఆ మునులు వినగోరి కథావైశిష్ట్యం స్పష్టమవుతుంది. పూర్వోక్తమయినట్లు పునరుక్తి ఒక దోషమే అయినా ఇక్కడే పదబంధంవల్ల దాని తీవ్రతవక్తమవుతుంది.

కాకేమి :

'అనిన విని యుదంకుండప్పుడు దలంచి యావృషభ గోమయ భక్షణంబునన్నైన యశుచిభావంబునఁగాకేమి యప్పరమ పతివ్రత మదీయ దృష్టి గోచరం గాకున్నదయ్యె' (1-1-98)

కాకమరేమి ! అందువల్ల అర్థంలో 'కాకేమి' ప్రయుక్తం

పోవనినాడు :

చేయనినాడు :

కానినాడు :

'నేడు పోవనినాడు నిష్ఫలంబిమ్మహాయత్నమంతయు'(1-1-115)

'మీరట్లు చేయనినాడు దానికి మఱియేను దాసి నగుదు'

(1-2-34)

'దేవతలన్ జయించుచు నతిస్థిర సంపదలన్ ద్వదీయ వి
ద్యా విభవంబు పెంపునన దానవు లుద్ధతులైరి కాని నాఁ
డీ వన శాశిలోఁ జొరరె......, (1-3-151)

ఈ ప్రయోగాలన్నీ ఎంతో అర్థవంతంగా నన్నయ వాడినట్లు తెలుస్తుంది. పైగా ఇవి ఈనాడు తెలుగు వాడి వాడుకలో ఉండడమే విశేషం.

చిత్తముగలదేని :

'నీవు నీదయిన దాస్యముఁబొచి కొనం నీకు చిత్తముగలదేని'

(1-2-55)

'నీకిష్టముంటే, నీకిష్టమైతే, నీకు కోరిక ఉంటే' అనే అర్థంలో నీకు చిత్తముగల దేని' 'నీకుమనసుంటే' అని ప్రయోగించాడు నన్నయ. ఈనాడు ఈ ప్రయోగం ఇలానే ఉండడం గమనించదగ్గ విషయం.

ఇదియేటి తపము :

'అనఘ యిది యేటి తపమే
మనుపమ దుష్కృతుల మగుట నాధారము లే
దని సంతానోచ్ఛేదం
బున బ్రేలెద మధమలోకమున వెరువుచనన్ (1–2–143)

అని తన పితామహులు జరత్కారునితో చెప్పిన సందర్భంలోని ఇది యేటితపము' ఇది ఒక తపమేనా ! అనే అర్థంలో ప్రయుక్తం కావడం నన్నయ లోకజ్ఞతకు నిదర్శనం. ఆనాటి ప్రయోగం ఈనాడు ప్రయోగంలో ఉండడమే ఇందులోని గొప్పదనం. ఇలాగే 'ఇదియేటిదని (1. 3–198) కూడా ప్రయుక్తం.

కొండుకయది, దాని తోడిదేమి.

'కావున బుద్ధిగల వారికిఁ గ్రోధంబు గొనియాడంగదు. శర్మిష్ఠ రాచకూతురు గొండుక యది దాని తోడి దేమి రమ్మనిన దేవయాని యిట్లనియె' (1-3-148)

శుక్రుడు దేవయానితో చెప్పి బుజ్జగించడం ఇందులోని విషయం కోప పూర్ణ ఆయన దేవయాని సహించదు మొదట. రాచకూతురని అభికాత్యాన్ని, అధికారాన్ని చెప్పి 'కొండొకయది' చిన్నది, బుద్ధి లేనిది 'దానితోడిదేమి' రమ్మన్నాడు. ఈ ప్రయోగాలు సహజ సుందరమైన తన ముద్దులకూతురును సముదాయిస్తున్నట్లే స్పష్టంగా ఉంది.

ఎట్టి కుమతులైన :

'తగిలి జరయు రుజయు దైవవశంబున
నయ్యెనేని వాని ననుభవింత్రు
గాక యెఱిఁగి యెఱిఁగి కడఁగి యారేటఁ జే
కొందురయ్య యెట్టి కుమతులైన (1–3–193)

విధివశాత్తువల్ల వచ్చినవాటినైతే ఎవడైనా అనుభవిస్తాడు! గతి లేక. కానీ కావాలని ఏబుద్ధిలేని వాడైనా మొసలి తనాన్ని గ్రహిస్తాడా అని దేవయాని పుత్రులైన యదుతుర్వ్య-సదుహ్యానులు తండ్రి యయాతితో చెప్పిన మాటలు ఎట్టి కుమతులైన-ఎంత బుద్ధిహీనులైన అనే అర్థంలో ప్రయోగం.

పెద్దయుం ప్రొద్దు :

'హృదయ సంతాపంబు దనకుఁదాన యుపశమించుకొని పెద్ద యుం బొద్దు చింతించి శకుంతల యా రాజున కిట్లనియె' (1-4-78)

చాలసేపు అనే అర్థంలో ప్రయుక్తం. ఇలాగే

'అనిన విని బెద్దయుంబ్రొద్దు చింతించి శంతనుండు గొడుకున కిట్లనియె' (1-4-180) అనే వాక్యంలోను గమనించగలం.

ఇలాగ పదబంధాల్లో నన్నయ నానారుచిరార్థ సూక్తినిధిత్వాన్ని స్పష్టం చేశాడు.

2. 3. సమాసాలు :

పద బంధాల్లో లాగానే సమాసాల్లోను నన్నయ తన రుచిరార్థ సూక్తి నిధిత్వం అభివ్యక్తీకరించడం గమనించగలం.

కొన్ని ఉదాహరణలు :

భారత కథా శ్రవణాభిరతిన్

'అమల సువర్ణశృంగ ఖురమై కపిలం బగు గోశతంబు ను
త్తమ బహు వేద విప్రులకు దానముచేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారత కథా శ్రవణాభిరతిన్...'' (1-1-15)

ఇక్కడ 'భారత కథా శ్రవణ మందలి అభిరతిన్ - అతిశయితమైన కోరికవల్ల' అనే విషయాన్ని నన్నయ ఇమడ్చడంగమనించవచ్చు.

కృతాంత నికేతనాతిథిన్ :

"..............భవ

జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్ముఁడసహ్య విషాగ్ర ధూమకే
తన హతుఁ జేసిచేసె నతి దాంతుఁ గృతాంత నికేతనాతిథిన్"
(1-1-124)

ఇక్కడ 'భారతాన్వయాభివర్ధనుడు", ధనంజయ సన్నిభుఁడు" అయిన పరీక్షిత్తును "భుజగ జాల్మడైన"తక్షకుడు ప్రాణంగొన్నాడన డానికి "కృతాంత నికేతనాతిథిన్"-యమ సదనాని కతిథిగా జేశాడని ఈ సమాసంలో చక్కగా వ్యంజింప చేశాడు. నన్నయ.

''మదీయైక పర్ణ శకల చ్ఛేదంబు''

ఇంద్రుడు గరుడునిపై వజ్రాయుధం ప్రయోగించగా చూచిగరు డండునగి నీచేయు వేదన నన్నొందాక నోపదు. నీవుమహాముని సంభవం బగుటను, దేవేంద్రుని నాయుధంబవగుటను, నిన్నుసవమానింపం గాదు. గావున మదీయైక పర్ణశకలచ్ఛేదంబు సేయుము'' (1-2-109) అని అంటాడు. ఎంతో అర్థవంతమై నన్నయ సూక్తి నిధిత్వం నిండారి ఒప్పుతుంది. ఇందులో వజ్రాయుధం గొప్పదనం తెలిపి ,నిన్నవమానిం చరాదనే ఉద్దేశంతో "మదీయైక పర్ణ శకలచ్ఛేదంబు'' అంటే ''నా వెంట్రుక ముక్కను తుంచివేసే'' దంటాడు. ఇదే సంస్కృతంలో ఉంటే అంపబాగావుంది. కానీ తెలుగు చేసేసరికి తెలుగువాడి వాడిన మాటలాఉంది. ఇది ఆందులోని విశేషం.

మనోజ రాజ్యలక్ష్మి :

''దానిం గన్యకఁగా నెఱిఁగి మనోజ రాజ్యలక్ష్మియుంబోనిదాని
(1-4-28)

తరుణ శశిరేఖ :

''అమ్మాలినీ పులిన తలంబున శకుంత రక్షిత యన్న కూతు నత్యంత కాంతిమతి నవనీ తలంబున కవతరించిన తరుణ శశిరేఖయు

బోని దాని" (1-4-48)- అని సాభిప్రాయంగా శకుంతలను గూర్చిన విశేషణాలు ప్రయోగించాడు నన్నయ.

విమల యశోనిధీ :

"విమల యశోనిధీ ! పురుషవృత్తమెఱుంగుచు నుండుఁజూవె
——————— నరుడుదక్కఁగ నేర్చునె తన్నుఁ బ్రముచ్చిలన్
(1-4-80)

సూనృత వ్రత :

"నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత వ్రత యొక బావి మేలు——————(1-4-94)

పై రెండు ప్రయోగాలు సంబోధనలు. ఈసంబోధనాత్మక ప్రయోగాలలో నన్నయ సూక్తినిధిత్వం రుచిరార్థపూరితమై ఒప్పుతుంది.

కుమారాయిత శక్తిశాలి :

"కుమారాయిత శక్తిశాలి ధృతరాష్ట్రుడు" (1-5-6)
(చూడుడు-లక్ష్మీరంజన వ్యాసావళి-పుట-9).

కులతిలకుండు :

"కులమును రూపము శీలము
గల కన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుండీ
నలఘుఁడు ధృతరాష్ట్రుడు కుల
తిలకుండు వివాహమయ్యె దేవీ శతమున్" (1-5-13)

ఇక్కడ "కుల తిలకుండు" అని నన్నయ ప్రయోగం ధృతరాష్ట్రుని జీవితాన్నంతటిని పరిశీలిస్తే అసలు అర్థం కంటే వ్యంగ్యార్థం స్ఫురించి తన సూక్తినిధిత్వాన్ని వ్యంపింప జేశాడని స్పష్టమవుతుంది.

2-4. విభక్తులు :

ఒక విభక్తికిబదులు మరోవిభక్తివాడి నన్నయ విభక్తిప్రయోగంలోనూ తన ప్రత్యేకతను ప్రకటించుకొన్నాడు. కొన్ని ఉదాహరణలు.

నా యెడ (1–1–12) నా యందు అధికధీయుక్తి మెయిన్ (1–1–16) తోడన్, తోన్; ఇదేరీతిగా ఇలా "మెయిన్" నాఖిగా ప్రయోగించాడు. నన్నయ ఇలా చేసి, వలన ప్రయోగం చాలాసార్లు చేయడం జరిగింది." అయినను దేవానీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున" (1–1–20) "భారత భారతీ శుభ గభస్తి చయంబులఁజేసి" (1–1–22) క్రమంబునఁ జతు ర్వేద సూత్రంబులఁ జేయించి వేదవ్యాసుండై నిజతపో మహత్త్వం బునం జేసి" (1–1–31) ఇంక "చేత" తక్షకుచేతఁ గుండలంబులుగొని (1–1–114); వలన : నాకుం గరుణింపఁడని (1–2–87) నన్ను గరుణింపఁ డని; నాయందు నీ శక్తియింతియు (1–2–109) నాపై; నాయం దధిక ధనంబు గొనిపొమ్ము (1–2–193) నా యొద్ద, నా వలన నాకుఁగొనుట (1–2–187) నేను పొందుట; నూతిలో వెలువడు (1–3–144) నూతి నుంచి; సకల వేదంబులు సదివె వశిష్ఠుతో (1–4–169) వద్ద; వివాహంబు చేయు పొంటె (1–4–191) కొరకు.

## 2–5. సంధి :

సంధిలో ముఖ్యంగా త్రికసంధిలో నన్నయ ఈ విశిష్టతను సాధిం చినట్లు స్పష్టమవుతుంది. ఏదో గణం కోసమనికాక, విశిష్టార్థ స్ఫుర ణార్థమే నన్నయ ఈ ప్రయోగాలు చేసినట్లు గమనించగలం.

అద్దివ్య. అత్తురంగంబు, అయ్యుదంకుండు, అకుండలంబులు (1–1–16), అద్దేవయాని (1–3–107); అక్కచునకు (1–3–118); ఇన్నూత (1–3–143); అవ్విప్రకన్యక (1–3–143); అవ్వనంబున (1–3–155); ఇన్నాతి (1–3–159); అక్కన్యం జూచి (1–4–26); ఇత్తన్వి (1–3–108); ఇలాగా ఎన్నో ఉదాహరణలు.

## 2–6. క్రియలు.

క్రియలు ఏ భాషకైనా జీవనాడులు అనడంలో అత్యుక్తి లేదు.

క్రియ మీఁదనే ఆయా భాషల స్వరూప స్వభావాల్ని మనం పరిగణించి గుర్తించగలం. అందులో నన్నయ ప్రయోగించిన క్రియాపదాలు ఎంతో అర్థవంతమై ఒప్పుతూ ఉండడం విశేషం. కొన్ని ఉదాహరణ లను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

'వెలిగించుచు' :

''నిజ మహీ మండల ప్రజలఁ బ్రీతిఁ బెంచుచుఁ
బరమండలముల ధరణి పతుల
నదిమి కప్పంబుల మొదముతోఁ గొనుచును
బలిమి నీయని భూమి వలయ పతుల
నుక్కడఁగించుచు దిక్కుల దనయాజ్ఞ
వెలిగించుచును......... (1-1-6)

దిక్కులన్నిటా తన శాసనాన్ని ప్రకాశింప జేశాడనడానికి 'వెలిగించుచును' అని నన్నయ ఎంతో అర్థవంతంగా ప్రయోగించాడు. ఇలాగే ఈసందర్భములో లక్ష్మీరంజనంగారు ఉదాహరించిన మాటల్ని ఉల్లేఖించడం సముచితం.

'కడు వెలింగె' :

"కౌరవ రాజ్యంబు కడు వెలింగె" (1-5-3)

లోకమునందు మండుచున్నది వెలుగునిచ్చును. దహనకార్యము లేకయే వెలుగు నిచ్చుట ఇచ్చటి చమత్కారము. కౌరవ రాజ్యము ప్రకాశించుచున్నది యనుటకు వెలింగె అని కవి ప్రయోగించెను. ఈనాడు మనము దీనిని వాడుచున్నాము. వాడి ప్రతిభ వెలిగిపోతోంది (లక్ష్మీరంజనవ్యాసావళి – పు. 6)

'ఎన్నను, పొందను, ఈదను' :

ఇవి ఈనాడు వ్యస్తంగా ప్రయోగిస్తే వ్యతిరేకార్థద్యోతకాలు. కానీ ఆనాడు నన్నయ ప్రయోగించిన దీరు వేరు.

"అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేషసారము ముదంబున బొందను బుద్ధి బాహు వి
క్రమమున దుర్గ మార్గ జలగౌరవ భారత భారతీ సము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే"
(1-1-19)

ఎన్నను- ఎన్నుటకును అంటే లెక్కించడానికి, పొందను- పొందుటకును, ఈదను–ఈదుటకును- అనే విశిష్టార్థాల్లో ఈ పదాలు పై పద్యంలో ప్రయోగించి తన రుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని నిరూపించుకొన్నాడు నన్నయ.

నన్నయ కొన్ని క్రియల్ని క్త్వార్థంలో పునరుక్తి చేసి, తనూ్మలంగ విశేషార్థ స్ఫురణకు అవకాశం కల్పించడం ఈ సూక్తి నిధిత్వంలో మరో విశేషం. అలాంటివి కొన్ని :

పర్వం బర్వన్ :

"అప్పులోముండు నిది నాకుఁ దొల్లి వరియింపఁబడిన భార్య పదంపడి భృగుండు పెండ్లియయ్యెనని వరాహరూపంబున నా సాధ్వి నతిసాధ్వ సచిత్త నెత్తికొని పర్వం బర్వన్" (1-1-131)

ఇక్కడ 'పర్వం బర్వన్' పరుగెత్తి పరుగెత్తి అనడంవల్ల ఎంత వేగంగా, ఎంత దూరంగా పరుగెత్తాడో స్పష్టమవుతుంది. పునరుక్తివల్ల కవి సాధించిన ప్రయోజనం ఇది. ఇలాగే

రోసి రోసి, వచ్చి వచ్చి :

"తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాములరోసి రోసిని
ష్ఠుర వర దీర్ఘ దండమున డొల్లఁగ వేయుచు వచ్చి వచ్చి య
య్యెడ నొక డుండుభంబను నహింగని వేయఁగ దండమెత్తుడున్
హరి హరి యంచు డుండుభ మహాహి భయంబడి పల్కె భార్గవున్
(1-1-153)

రురుడు పాములపై ఎంతగా రోసినాడో ఇందు స్పష్టమవుతుంది.

త్రచ్చి త్రచ్చి :

"ఉరగ పతి తల వలనురు
తర జవమున నసురలూఁది తత్పుచ్ఛముని
ర్జర వరులూది మహో మ
త్సరమున వడిఁ ద్రచ్చి త్రచ్చి జవమఱి యున్నన్" (1-2-13)

"త్రచి త్రచ్చి" అని పునరుక్తిలోని విశిష్టత. ఇలాగే

'తరువం దరువన్' :

'ఉడుగక యొండొరుం బఱచి యొక్క బలంబున దేవదానవుల్
వడిగొని వార్ధి నిట్లుఁ దరువం దరువన్...' (1-2-15)

చూడం జూడ :

"సురపతి సభ జూడం జూడ నంగార వృష్టుల్
గురిసెఁ గులిశధారల్ కుంఠితంబయ్యె దిక్కుం
జర మదములడంగెన్ సర్వ దిక్పాలకాంతః
కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్" (1-2-82)

ఇక్కడ 'చూడం జూడ' అని పునరుక్తి విశిష్టార్థద్యోతకం. పై పెచ్చు మనం ఈనాడు "చూడగా చూడగా" అని ప్రయోగిస్తూనే ఉన్నాము.

"ఎఱిఁగి ఎఱిఁగి వారి నేటికి వారింప
రిట్టి గోత్ర కలహ మేల పుట్టె
దీని కల తెఱంగు దెలియంగ నానతి
యిందు నాకు సన్మునీంద్ర వంద్య" (1-3-5)

ఎఱిగి ఎఱిగి అంటే తెలిసి తెలిసి అనడం మనమీనాడు ప్రయోగిస్తాము. అత్యంత విశిష్టార్థంలో. ఈ ప్రయోగం పలుమార్లు నన్నయ ప్రయోగించడం గమనించవచ్చు. (1-3-143; 1-4-79; 1-4-267)

తలచి తలచి :

పలుకుల ముద్దును గలికి క్రొల్గన్నుల
తెలుపును వలుఁద చన్నుల బెడంగు
నలఘు కాంచీ పదస్థలముల యొప్పును
లలితాననేందు మండలము రుచియు
నళి నీల కుటిల కుంతలముల కాంతియు
నెల జవ్వనంబున్ విలసనమును
నలస భావంబునఁ బొలుపును మెలపును
గలుగు నగ్గిరికన్య తలచి తలచి 1-3-27)

ఉపరిచర వసువు గిరికా సౌందర్యాన్ని మరల మరల స్మరించి అనడంవల్ల ఆమెపై అతనికి గల వ్యామోహం వ్యక్తమవుతుంది.

చని చని :

పరాశరుడు 'సత్యవతిని జూచి యా మునివరుడు దానియందు మదన పరవశుండై దాని జన్మంబు దన దివ్య జ్ఞానంబున నెఱింగి యయ్యోడ యెక్కి దానితో నొక్కటఁ జనిజని' (1-3-37)

ఇందులో ఆ ముని సత్యవతితో 'చని చని' అనడంవల్ల ఎంతో దూరం వ్యామోహంతో వెళ్ళాడని స్పష్టమవుతుంది, ఇలాగే

'చని చని' దుష్యంతుడు వేటకై అరిగిన తీరులో ప్రయుక్తం

'చని చని ముందట నాజ్య హావిర్ధూత సౌరభ
ధూమలతా తతులం (1-4-21)

ఇలాగా క్రియల్ని ద్విరుక్తంచేసి తద్వారా సూక్తి నిధిత్వాన్ని నన్నయ ప్రకటించడమే గాక ముమ్మారు ప్రయోగించి మరింత మనోజ్ఞం చేసిన పట్టు ఒకటుంది.

"తక్షకుఁడతి భీతుండై
యాక్షణమున నరిగె సురగణాధిప నన్నున్

రక్షింపుము రక్షింపుము
రక్షింపుము యనుచు నప్పురందరు కడకున్ (1-2-217)

ఇది జనమేజేయుడు సర్పయాగం చేసిన సందర్భంలోనిది ఇందులో తక్షకుని భయమెంత తీవ్ర తరమైనదో విపులంగా మనకు తెలుస్తుంది.

మఱువు సొచ్చిరి :

''పక్షతుండాగ్ర నఖక్షత దేహులై
బోరన నవరక్తధార లొలుక
విహగేంద్రునకు నోడి విహతులై సురవరుల్
సురరాజు మఱువు సొచ్చిరి కలంగి (1-2-100)

గరుత్మంతుని పరాక్రమానికి తాళలేక దేవతలు పరుగెత్తుకొని దేవేంద్రుని మరువు- అంటే రక్షణను కోరి వెళ్ళారనడానికి మనమీ నాడు ప్రయోగించే వాడు ఫలానా వ్యక్తిమరుగున ఉన్నాడంటో న్నట్లే నన్నయ వాడకం గమనించవచ్చు.

ప్రసాదమనుచు మ్రొక్కి :

విష్ణువు గరుడునితో
'అనఘ ! వాహనంబై మహాధ్వజమ్మవై యుండుమనిక బక్షి యును ప్రసాదమనుచు మ్రొక్కిపలిచె... (1-2-108)
ఈనాడు మనం అదే ప్రసాదం చాలు అనడం వాడుక.

తలలువాంచియున్న

యయాతి తన జరాభారం తీసుకొని యౌవన మిమ్మని తన పుత్రులను కోరగా-

'అగ్రి తనయు డయిన
యదువు దొట్టి సుతులు మునిమికి నోపక
తలలు వాంచి యున్న వెలయఁదండ్రి

పనుపు జేసి ముదిమిగొని జవ్వనం బిచ్చి
బూరుండను సుతుండు భూరియశుండు (1-3-95)

ఇక్కడ 'తలలు వాంచియున్న' ఇష్టాలేనప్పుడు వ్యక్తులు ఎలా ప్రవర్తిస్తారో అలాగే నన్నయ ప్రయోగించడం విశేషం. ఇలాగా ఎన్నైనా ప్రయోగాల్ని ఉదాహరించవచ్చు.

2. 7. వాక్యాలు :

క్రియల్లాగానే వాక్యాలుసైతం ప్రతీ భాషకీ ప్రాముఖ్యం. అందులో నిర్మాణం వల్లనే ఏ భాషైనా మరో భాషనుంచి వేరవుతుం దని స్పష్టమవుతుంది. వాక్యాలు కవి కృతులు సందర్భోచితంగా కావచ్చు. ఆనాడు ప్రజల వ్యవహారంలో ఉండవచ్చు. అలంకారిక భూషితమై ఉండవచ్చు. లేదా లోకన్యాయాన్ననుసరించి ఉండవచ్చు. ఇంకా సమయోచితంగా సూక్తుల్లాంటి వాక్యాలూ ఉండవచ్చు. ఇన్ని విధాల ఉన్న వాక్య ప్రయోగాల్ని నన్నయ ఎలా ప్రయోగించి తన రుచిరార్థ సూక్తి నిధిత్వాన్ని అభివ్యక్తీకరించడాన్ని పరిశీలిద్దాం ఇతః పూర్వం వాక్య గతమైన ఇతర అంశాల్ని పరిశీలించాం. ఇక్కడ వాక్యాల్ని గమనిద్దాం.

2. 7. 1. కవి కల్పిత సూక్తులు :

విన నభిలాష పెద్దయై యుండు (1-1-11) (వినాలన్న కోరిక అధికంగా ఉంది అనడానికి)

"తగునిది తగదని మొదలో
వగవక సాధులకుఁబేదవారల కెగ్గుల్
మొగిఁజేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగ మంబులైన భయంబుల్ (1-1-88)

సరమ కుమారుడు సారమేయుడు అనేవాణ్ణి జనమేజేయుని తమ్ముళ్ళు నిష్కారణంగా కొట్టారని జనమేజేయునితో సరమ ఫిర్యాదు

చేయడం ఇందులోని విషయం. మంచీ చెడ్డా ఆలోచించకుండా నిష్కారణంగా సాధువుల్ని బాధ స్తే దానికి తగిన రీతిలో అనుభవిస్తారను అర్థాన్ని కవి నిబంధించాడు. పద్యమంతా ఒక సూక్తి లాంటిది.

"అశుభులకు గాన గాదన వద్యా!" (1-1-97)

ఉదంకుని అపవిత్రుడని చెప్పలేక పౌష్యుడు పవిత్ర పతివ్రత అయిన తన ధర్మపత్నిని గూర్చి వ్యంగ్యంగా చెప్పడంలో ఈ సూక్తి వైచిత్రి గోచరిస్తుంది.

'ఇది వడి గలదు మనము కంటె గాడ్పు కంటె' (1-1-115)

దివ్య పురుషుడు ఉదంకునితో చెప్పిన మాటలు. వాయువేగ మనోవేగాల కంటే వడి గలదని చెప్పడం ఇందులోని విశేషం. ఇలా మనమీనాడు వాడుతూండడం గమనించ దగ్గది.

'అడచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కు-యల్కతో
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినం
జెడు నిహాముంబరంబు నిది సిద్ధముగావు లెఱింగి భక్తి నె
ప్పుడు ధరణీ సురోత్తములఁ బూజలఁ దన్పుదునల్ల నోడుదున్'
(1-1-139)

'మాన్యాస్తు బ్రాహ్మణామమ' అను దానికి నన్నయ కాలోచితంగా కల్పించిన సుభాషితాలు ఇందులో చూడవచ్చును.

'అమర్త్యులతోడి పొత్తింతియచాలు నింకేల' (1-2-21)

రాక్షసుల మాట యిది. ఈ నాడు వ్యవహారంలో ఇలాంటి వాడుక ఉంది. వాడి సావాసమింక చాలు అనడంకద్దు.

'ప్రొద్దునుబోయె' (1-3-112) ఈనాడు మనం సాయంత్రమైందనడానికి పొద్దుపోయింది అనడంకద్దు.

'వానిం జూచి కాని కుడువనొల్లను' (1-3-119) ఇది ఈనాడు వాడుకలో ఉంది.

'నా యొద్దన పలుకనీకు నానయు లేదే'

'మా యయ్యకుఁ బాయకపని,
సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండున్
మీ యయ్య యేటి మహిమలు
నాయొద్దనె పలుక నీకు నానయు లేదే' (1-3-137)

నాయొద్ద పలుకడానికి సిగ్గులేదా అంటుంది. దేవయానితో శర్మిష్ఠ. ఇవి ఈనాడు ప్రయోగంలో ఉండడం విశేషం.

'ఎందు బోయి రొక్కో వారు' (1-4-27)

గౌరవార్థం దుష్యంతుడు కణ్వుని గూర్చి శకుంతలతో నన్న మాటలు. 'వారు వచ్చునంతకు నొక్క ముహూర్తం బుండునది' (1-4-28)

శకుంతల దుష్యంతునితో అన్నమాటలు ఒక్కక్షణం ఆగి వెళ్ళండి అనడం ఈనాడు ఉంది.

'ఇంతకు నింతయు నెఱుగరె జనులు' (1-5-28)

కన్య అయిన కుంతి వాపోయినతీరు

'గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్' (1-5-159)

నన్నయ కృతం. ఇది అత్యుత్తమ సూక్తిలా మిగిలిపోయింది. కవి ప్రతిభకిది నిదర్శనం, పాండురాజు మృతిలో దుఃఖితులైనవారి నోదారుస్తూ వ్యాసుడు చెప్పిన మాటలు,

'వీరెవ్వరయ్య ద్రుపద మ
హారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె యహహా మ
హారాజ్య మదాంధకార మది వాసె నొకో' (1-6-90)

ఇందులో ప్రతిపదం, ప్రతివాక్యం, అర్థయుక్తితో కూడి ఎంతో

వ్యంగ్యస్ఫూర్తితో కూడుకొనిఉంది. నన్నయ నానారుచిరార్థ సూక్తి నిధిత్వానికిది పరమోదాహరణము.

'దానికి గురులు సంతాపమంది భూతలేశనన్ను బుత్తెంచిరి'
(1-2-131)

గౌరవార్థంలో శృంగి శిష్యుడు పరీక్షిత్తునకు తెలపడం ఇందలి విశిష్టత.

2. 7. 2. లోక న్యాయాలు :

1. 'తన యెఱిగిన యర్థంబారుఁ
దనఘా యిది యెట్లు సెప్పుమని యడిగిన జెఁ
ప్పనివాఁడును సత్యము సె
ప్పనివాఁడును ఘోరనరక పంకమునఁబడున్' (1-1-137)

శాపమిచ్చిన భృగుమహర్షితో అగ్ని పల్కినమాటలు

2. ప్రమద్వర సర్పదష్ట కాగా రురుడు దుఃఖిస్తూండగా
ఆకాశం నుంచి ఒక దేవత అయ్యో! కాలవశంబయిన
నెవ్వరికిం దీర్పఁ దరంబు గాదు' అని అంటుంది.

3. శుక్రుడు మద్యపాన దోషాన్ని గూర్చి చెప్పిన మాటలు
'మొదలి పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరగఁ బెక్కు సేసి పడయఁబడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రాన
చెఱచు మద్య సేవ సేయ నగునె' (1-3-120)

4. కచుడు దేవయానితో పల్కిన పల్కులు
'గురులకు శిష్యులు పుత్రులు
పరమార్థము లోక ధర్మ పథమిది దీనిం
బరికింప యీ పలుకులు
తరుణీ గురుపుత్రి, నీకుఁ దగునే పలుకన్' (1-3-131)

5. శుక్రుడు కూతురు దేవయానికి చెప్పిన హితం
'ఆలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నము వడి యెదఁ
దలపక యున్నతఁడు చూవె ధర్మజ్ఞుఁడిలన్ (1–3–147)

6. శర్మిష్ఠ యయాతికిఁ జెప్పిన మాటలు–
"చను బొంకఁగ బ్రాణాత్యయ
మున సర్వ ధనాపహరణమున వధగా వ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహసమయములందున్" (1–3–178)

7. యదు తుర్వ సుద్రుహ్యానులు యయాతికిచ్చిన సమాధానం–
'నరులు గల కాలమునైనను
దరుణులు రోయుదురు డాయ ధనపతి యయ్యుం
బురుషుఁడు దుర్వార జరా
పరిభూతి నభీష్ట భోగ బాహ్యుఁడు కాఁడే' (1–?–194)

8. కణ్వుఁడు శకుంతలకు నచ్చచెప్పడం–
'ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాలమునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ బతుల సూవె' (1–4–66)

2.7.3. సామెతలు :

శకుంతల తన పూర్వ కృతాన్ని గూర్చి చెప్పడం–
'నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు
దొల్లి కడకే నోచితిని గాక' (1–4–103)
శంతనుని సంతోషం ఇందు వ్యక్తమవుతుంది.

'తనయు నెమ్మిఁదోడుకొనుచు నిధిగన్న పేదయపోలె సంతసిల్ల భూవిభుండు' (1-4-169)

వెదకబోయిన తీగ కాళ్ళకు తగిలినట్లు మనుమల విద్యాభ్యాసం కోసం గురువును వెదుకుతుండగా ద్రోణుడు లభించిన సందర్భంలోనిది-

'రోయుతీగ కాళ్ళం బెనగం దానను చుఁ బొంగి భీష్ముఁడు'
(1-5-220)

2. 7. 4.- అలంకారాన్ని ఆశ్రయించిన రుచిరార్థ సూక్తులు :

**1.** ఉపమాలంకారము :

కచుని సంజీవనీ విద్య చేత శుక్రుడు సజీవుడు కావడం :

'విగత జీవుఁడై పడియున్న వేదమూర్తి
యతనిచేత శంజీవితుఁడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షు చేత
నభిహితంబగు శబ్దంబు నట్ల పోలె' (1-3-127)

2. అర్థాంతర న్యాసాలంకారము :

గురువు శిష్యుడైన ఉదంకుని అభినందించడం—

'గురు కార్య నిరతులగు స
త్పురుషుల కగుటరుదె యధిక పుణ్యఫలంబుల్' (1-1-120)

కద్రువ పుత్రులు తల్లితో నన్నమాటలు :

'తల్లి పనిచెనని యధర్మవు సేయంగ
నగునె యెఱుకగలరె మగువ లెందు' (1-2-34)

పరాశరమహర్షి మత్స్యగంధిపై వ్యామోహితుడైన సందర్భంలోనిది.

'ఎందుఁ గాముక శక్తి నోర్వఁగలరె జనులు' (1-3-38)

ఇందులో నన్నయ పద్యరచనా శిల్పం స్పష్టం.

మేనక ఇంద్రునితో నన్నమాటలు.

'ఉగ్రతం బన్నినయట్టి కోపపరుపాలికి భామలు పోవనోడరే'
(1–4–33)

శకుంతల దుష్యంతుని గూర్చి పల్కిన పల్కులు
'ముగ్ధలఫీవులు మఱవరె బహుకార్యభారమగ్నులు కాకే'
(1–4–69)

'మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల గర్భుని వశమే' (1–4–72)

భార్యల యందు కామలీలావినోదుడైన విచిత్రవీర్యుని గూర్చి పల్కిన మాటలు.

'కామిని నయంబున నొండు దలంపఁబోలునే' (1–4–215)

3. 0. ఇలాగా నన్నయలోని రుచిరార్థభరితాలైన అనేక సూక్తులు నానారీతుల పరిశీలించేవారికి గోచరమై ఆతని కవితాత్మ స్పష్టమవుతుంది. ఇలాంటి మార్గదర్శకుడు కావడం వల్లనే నన్నయ ఆదికవి. దాగనుశాసనుడు అయ్యాడనడం సత్యం. ఈనా పరిశీలన ఆదిపర్వం ఐదు ఆశ్వాసాలకు మాత్రమే పరిమితం. ఇలాగే పరివ్యాప్తంగా పరిశీలించాలంటే ఒక సిద్ధాంతవ్యాసమే అవుతుంది.

ఇంకా నన్నయ పద్యశిల్పంలో, కథాకథన శిల్పంలో సన్నివేశాల్లో, సంఘటనల్లో వివిధ ముఖాలా పరివ్యాప్తమై గోచరించి సహృదయ హృదయాలను అలరిస్తాయి. మరి సాహిత్య ఆలోచనామృతం కదా!

———

# నన్నయ నానారుచిరార్థసూక్తి నిధిత్వము

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

నన్నయ్యభట్టారకుడు "సారమతిన్ గవీంద్రులు" (ఆది-1-26) అను పద్యములో తన కావ్యలక్షణములను బేర్కొనుచు ఒక లక్షణము నిట్లు చెప్పినాడు. నానారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు అని సూచించెను. నన్నయ సూచించిన ఇతర కావ్యలక్షణములను గుఱించి కొంత పరిశ్రమ జరిగినది. ముఖ్యముగ ప్రసన్న కథాకవితార్థయుక్తిని గూర్చి కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ప్రపంచించి యున్నారు. నన్నయ అక్షరరమ్యతనుగూర్చి కూడ విద్వాంసులు తలపోసిరి. అయినను దీని విషయమై సమగ్రము, శాస్త్రీయము అయిన విశ్లేషణము జరిగినట్లు తోచదు. అట్లే నన్నయ తన కావ్య లక్షణముగా సూచించిన 'నానారుచిరార్థసూక్తి నిధిత్వము' కొంత ఆకాంక్షను, విశ్లేషణమును కోరుచనని భావించి యీ సంగ్రహ ప్రయత్నము చేయుచున్నాను. సంగ్రహమని యెందుకనుచున్నాననగా నన్నయ భారత భాగములోని యొక అంశమును మాత్రమే యీ వివరణమునకు ఆధారముగా తీసికొన్నాను. ఆదిపర్వము అయిదవ యాశ్వాసము మాత్ర మాధారముగా ఈ యాకాంక్షను చేసి యున్నాను. కావున నిది దిఙ్మాత్ర ప్రదర్శనమే యగును.

కావ్యలక్షణములను గూర్చి నన్నయ భావములు దండి, భామహుడు మున్నగు ప్రాచీనాలంకారికుల భావములకు సన్నిహితముగా నున్నట్లు తోచును. వీరు చారవరకు వస్తుగుణాలంకార వాదులు. ఆనంతిరికులగు ఆనందవర్ధనాదులు ప్రధానముగా ధ్వనిరసవాదులు. ఆనందవర్ధనుడు నన్నయకు పూర్వుడే అయినను ధ్వనివాదప్రభావము నన్నయగారిమీద విస్తారముగా ప్రసరింప లేదనవచ్చును సారమతిన్

అను పద్యములోని మూడు లక్షణములును దండ్యాదుల వక్రోక్తి అలంకారములకు ప్రతీకలుగా తీసికొనవచ్చును. రసప్రధాన్యమును నన్నయ యెఱుగనివాడు కాడు. సముద్ర వర్ణనమునందు (ఆది-2-27) 'నాటక ప్రయోగంబునుంబోలె ఘనరసపాత్ర శోభితరంగరమ్యంబైన దాని' అని శ్లేషించి నాటకమునందు రసస్థానమును సూచించినాడు.

నానారుచిరార్థ సూక్తినిధి-అనగానేమో యోచింతము. నానా-అనేకములైన, విస్తారమైన అనియర్థము చెప్పవచ్చును. బహు విధములైన, లేక బహుభంగులైన అనియు చెప్పవచ్చును. రుచిరార్థ-రుచిరములైన యర్థములుగల, సూక్తి=సూక్తులయందు, నిధి=గనివంటి వాడు. రుచికలది. రుచిహేతువైనది రుచిరము అని చెప్పవచ్చును. 'మధు' శబ్దమునకు మత్వర్థమున మధురము అని రూపమగును. తియ్యనైనది. రుచిరశబ్దమునుగూడ నట్లే నిష్పన్నము చేసుకొనవలెను. రుచిమంతమైనది రుచిరము. ఇచ్చట రుచియనగా సహృదయాహ్లాదకరమైనది. దీనినే దండ్యాచార్యుడు ఇష్టార్థము అని వ్యవహరించును. 'శరీరం తావదిష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ' అని యాతని కావ్య లక్షణము. నన్నయ రుచిరార్థము దండ్యాచార్యుని ఇష్టార్థమును అభిన్నములనియే చెప్పవచ్చును. దీనినే ఉత్తరకాలికుడగు జగన్నాథుడు 'రమణీయార్థము' అని పేర్కొనును. దండి, నన్నయ, జగన్నాథుడు ఒక కోవకు చెందినవారు. అర్వాచీనుడగు జగన్నాథుడు ధ్వనిప్రస్థానముచే ప్రభావితుడయినవాడు. ప్రాచీనకాలంకారికుడగు భామహుడు కావ్యముయొక్క శరీరమునుగూర్చి కాని, ఆత్మనుగూర్చి కాని అభినివేశమును చూపలేదు. కావ్యనిర్మాణమునకు కావలసిన సామగ్రిని సూచించి తృప్తిపడెను.

"శబ్ద శ్ఛందోభిధానార్థా ఇతిహాసాశ్రయాః కథాః । లోకో యుక్తిః కలాశ్చేతి మంతవ్యా కావ్యగైర్హ్యమీ" అన్నాడు భామ

హుడు. వ్యాకరణము, ఛందస్సు, కోశము, ఇతిహాసములు, లోక వ్యవహారము, తర్కము. కళా పరిజ్ఞానము – వీనిని కావ్య నిర్మాణపరులు మననము చేయవలెనని భామహుడు హెచ్చరించెను. నన్నయ తనను గూర్చి ప్రసంగించిన యంశములు భామహుని అనుశాసనములోనివే. విపులశబ్ద శాసనత్వము. బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతి, లోకజ్ఞత, ఉభయ భాషాకావ్య రచనాభి శోభిత్వము, సత్ప్రతిభ –ఇవి భామహుడు అవసరమని పరిగణించినవియే. కేవల శాస్త్ర జ్ఞానము కావ్యకరణ క్షమము కాదనియు, ప్రతిభయే ముఖ్యకారణమనియు, భామహుడిట్లు వచించెను.

'గురూపదేశా దధ్యేతుం శాస్త్రం జడధియో ఽ ప్యలమ్
కావ్యంతు జాయతే జాతు కస్య చిత్ప్రతిభావతః'

అయితే నన్నయ తన కవిత్వమునకు విశేషలక్షణముగా సూచించిన సూక్తిసంపదను గూర్చి భామహుడుకాని, దండికాని ప్రత్యేకముగా పేర్కొనలేదు. వారి దృష్టియందు సూక్తులు అలంకారములలో నంతర్భవించినవియే కావచ్చును. దండ్యాచార్యుడు అలంకారములకు ప్రముఖస్థానమునే ఇచ్చెను.

'సర్వత్రభిన్న వృత్తాంతై రుపేతం లోకరంజకమ్ ।
కావ్యమ్ కల్పాంతరస్థాయి జాయతే సదలంకృతిః

ప్రతి సర్గయందును భిన్నకథ కలిగికాని, సర్గాంతమందు భిన్న వృత్తము కలదియై కాని యుండుచు, లోకరంజకమై, సదలంకారములు కలిగిన కావ్యము కల్పాంతర స్థాయియగును. పూర్వాలంకారికు లింతగా ఒత్తిచెప్పిన యలంకారములను నన్నయ ప్రత్యేకముగా పరిగణింపలేదు. సూక్తులను నిర్దేశించెను. ఆయన దృష్టిలో సూక్తులు అలంకారములను మించినవేమో! అలంకారములు సూక్తులందే అంతర్భవించునని ఆతని యాశయముగా తోచును. దేశికావ్యములందు సూక్తు

లకే అగ్రతాంబూలముగా దండిమతము. సేతుబంధ కావ్యమును గూర్చిన యీతని ప్రశంసా వాక్యములు గమనింపదగినవి.

'మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః।
సాగరః సూక్తిరత్నానాం సేతుబంధాదియన్మయమ్॥'

'మహారాష్ట్ర దేశమాశ్రయముగా గల భాషను ప్రశస్తమైన ప్రాకృతముగా విజ్ఞులు తలతురు. సూక్తిరత్నములకు నిలయమైన సముద్రమువంటి సేతుబంధాది కావ్యములిందే వెలిసినవి.' ఆదిశబ్దముచే సప్తశతివంటి ఇతర కావ్యములని వ్యాఖ్యాతలు వివరించినారు. ప్రాకృత కావ్యములకును దేశికావ్యములకును సూక్తి సంపద ప్రత్యేక ధర్మముగా చెప్పినట్లైనది. నన్నయ భట్టారకుడీ భావమే కలవాడుగా తోచును.

నన్నయభట్టేకాదు ప్రాచీనులైన ఆంధ్ర కవులుకూడ ఈ భావమే కలవారుగా డనబడుచున్నారు. నన్నయకు మిక్కిలి సమీపస్థుడైన నన్నెచోడ మహాకవిగూడ కావ్యమునందు సూక్తుల స్థానమును మిక్కుటముగా తలిచినాడు.

''సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపుపెంపుతోఁ
బిరిగొనవర్ణనల్ ఫణితిపేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ ప్రాణముల్ మధుమృదుత్వ రసంబునఁ గందళింపన
క్షురములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్॥
కుమా. 1–35

నన్నయ అక్షరరమ్యతను పేర్కొనెను. నన్నెచోడుడును అక్షరములను తలచినాడు. ఈయక్షరములు కేవల వర్ణమాల కాదనుట తథ్యము. దీనిచే ఈ యుభయకవులును శబ్దాలంకారములను గాని రీతులనుగాని సూచించు చున్నారని తలంపవలసి యున్నది.

అట్లే కుమారసంభవము 1–36 పద్యమునందును సూక్తులను స్మరించినాడు.

మృదుకీర్తి సూక్తులింపొందవింప, మేలిల్లు
భావమ్మునెలమి క్రీడావహాముగ.

నన్నెచోడుడిపద్యమును ముగించిన విధము నన్నయను తలపించును: "వలవదే సమస్త వస్తుకవీశ్వర నూత్నరుచిర కావ్యరత్నవీథి" రుచిరశబ్దము నన్నయ వాడినదే.। ఆ 31వ పద్యములో నన్నెచోడుడు. 'సదుక్తులు' పేర్కొన్నాడు. "అక్కజమై మహార్థ నివహంబు సదుక్తులు మెచ్చజూచినన్" ఆ 1-39లో నన్నెచోడుడు చతురోక్తులను ప్రశంసించినాడు. చతురోక్తులు' సూక్తులనియే భావించవలెను. సూక్తియనగా చతురోక్తి యని పైన నుదహరింపబడిన దండ్యాచార్యుని శ్లోకవ్యాఖ్యానమున సూచితమైనది. "సాగరః సూక్తిరత్నానామ్' అన్నప్పుడు వ్యాఖ్యాతయిట్లు చెప్పెను "సూక్తిరత్నానామ్- చమత్కారపూర్ణ వచనానామ్నిధిః – యథాసాగరే మహార్ఘమణయోవసంతి – తథైవ మహారాష్ట్రీ భాషానిబద్ధే సేతుబంధాదౌ కావ్యవిశేషే చమత్కారోక్తయో బహుళ్యేన ఉపలభ్యంతే." మరల ఆ 1-48లో నన్నెచోడుడు సూక్తులను పేర్కొన్నాడు. "జంగమ మల్లికార్జును నిసర్గకవి స్తవనీయ సూక్తి యుక్తింగొనియాడి"అన్నాడు.

ఈ యథార్థములను బట్టి మనపూర్వకవులు ఉత్తమ కవిత్వమునకు సూక్తులు ప్రధానాంగముగా భావించినట్లు తెలుచున్నది. సూక్తి యనగా చమత్కార పూర్ణ వచనము. శ్రీనాథుడు కాశీఖండ పద్యలోనందు సూక్తి వైచిత్రి తన కవిత్వ లక్షణమయినట్లు నుడివెను.

"పరిఢవింతుఁ ప్రబంధపరమేశ్వరుని తేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు.

శ్రీనాథుడు నన్నయ యందు ఉభయభాషా ప్రౌఢినాకాంక్షించినాడు.

సూక్తియనగా రుచిరమై చమత్కార యుక్తమైన కూర్పు అని గ్రహింతము. ఈ చమత్కారము ఒక్కొక్క పదమునందు, పద బంధమునందు, సమాసమునందు, కారకమునందు, వాక్యమునందు బహుభంగుల చూడవచ్చును. నన్నయ పేర్కొన్న నానారుచిరార్థ సూక్తులు ఇంత వైవిధ్యముగలవి. పదమునందు చమత్కృతి యనగా ఆ పదము తన వాచ్యార్థమును వీడి మనోహరమైన అన్యార్థము నందు వాడబడుట. రూపకలక్షణమును దానికి సంక్రమింపజేయుట. దీనిని లక్ష్యార్థమనవచ్చును. ఆంగ్లమునందు Metaphorical Sense అను చున్నారు. పదబంధము, ఒకటికన్న యెక్కువ పదములు గుత్తిగా నేర్పడి వాచ్యార్థమును వీడి మరొక రుచిరార్థమునకు ప్రతీకగా నేర్ప డుట. ఇట్టి సందర్భములలో జహల్లక్షణ – అజహల్లక్షణ – ధర్మము లను గూడ అన్వేషింపవచ్చును. ఒక్కొక్క సమాసమునందొక చమ త్కార పోషణ యుండును. కారకము నందును వాచ్యార్థభిన్నమైన చమత్కారమున్నచో దానిని కారక గతసూక్తి యనవచ్చును. ఒక సంపూర్ణ వాక్యమునందు చమత్కారార్థము నిబద్ధమైయున్నచో దానిని వాక్యగతసూక్తి యనవచ్చును. సాధారణముగా సూక్తి యనగా సంపూర్ణ వాక్యగతమైనదానినే గ్రహించు చున్నారు. ఈ సూక్తులు కొన్ని కవిప్రతిభా కల్పితములు. కొన్ని లోకవ్యవహారము నుండి గ్రహింపబడినవి. కవికల్పితములలో తిరిగి రెండు భేదములు గుర్తింప వచ్చును. కవి స్వయముగా చెప్పినవి. కవి కల్పితమైన పాత్ర ముఖమున చెప్పింప బడినవి. వీనిని కవి ప్రౌఢోక్తి సిద్ధములు, కవినిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధములు అని వ్యవహరింప వచ్చును. ఇట్టి వాని నన్నిటిని కలిపి తెలుగులో సామెతలు అని పేర్కొను చున్నాము. నానుడి, పలుకుబడి, మున్నగునవి అసంపూర్ణ వాక్య గత సూక్తులుగా గ్రహింప వచ్చును.

మనము గైకొన్న సూక్తి నిర్వచనము కుంతకుడను ఆలంకారికుని వక్రోక్తికి దగ్గరగా నున్నది. నిరలంకారమై, రసహీనమైన నిత్య జీవిత వ్యవహారమునకు భిన్నముగా చమత్కార యుక్తముగా అర్థ విశేషవంతముగా భాషను ప్రయోగించుటయే వక్రోక్తి. అలంకారములు సూక్తులలో అంతర్భవించును. సమాసోక్తి, విశేషోక్తి, వ్యాజోక్తి, అతిశయోక్తి – ఇట్లు ఉక్తి విశేషములైన అలంకారములు గుర్తింపబడియే యున్నవి. సూక్తి ప్రపంచము అలంకారములకన్న విస్తృతమైనది. అలంకారము సాధారణముగా సంపూర్ణ వాక్యగతమై యుండును. సూక్తులు భాషాంగములన్నిటిని ఆశ్లేషించును. చతురోక్తులు అనగా సూక్తులు అలంకారములకంటె భిన్నమైనట్లు నన్నెచోడుడీ క్రింది పద్యములో పరిగణించెను.

చతురోక్తులనుత పదబహు
గతులనలంకార భావకాంతి రసార్థో
న్నతిఁ గృతిసతిరసికులు వర
సతిగతి నెఱిఁగింపవలదె సౌభాగ్యమునన్.

ఇట్టి సూక్తులను నన్నయ యెట్లు ప్రయోగించెనో సంగ్రహముగ ప్రదర్శింతును. ఆదిపర్వము ఐదవ యాశ్వాసమాధారముగా దీనిని నిరూపింప దలిచినాను.

## పదగత సూక్తి

వెలుంగు –

కౌరవ రాజ్యంబు కడు వెలింగె 1–5–3. లోకమునందు మండుచున్నది వెలుగునిచ్చును. దహనకార్యము లేకయే వెలుగునిచ్చుట ఇచ్చటి చమత్కారము. కౌరవరాజ్యము ప్రకాశించుచున్నది యనుటకు వెలింగె అని కవి ప్రయోగించెను. ఈనాడును మనము దీనిని వాడుచున్నాము "వాడి ప్రతిభ వెలిగి పోతూంది."

వివర్థించు —

విశేషముగా వర్థిల్ల జేయుట. 1-5-9 ఈ కులము వివర్థింపగ నా కభిమతము. వర్థిల్లు అకర్మకధాతువు. దీనిని సకర్మకము చేయుట చమత్కారము. ఇప్పటి వాడుకనుబట్టి వర్థిల్లునట్లు చేయుట అని వివరణాత్మకముగా చెప్పవలెను. ఒక్క ఉపసర్గను చేర్చి నన్నయ దీనిని సకర్మకముగాచేసి చమత్కారము చూపినాడు.

ఎందు —

ఎక్కడ అనునర్థమున 1-5-16. ఇక్కుమారున కెందు వివాహంబు సేయుదమని, ఒక కన్యక భవిష్యత్తునుగూర్చి మాటలాడుచు లోకమున ఇట్లందురు "ఇది యెక్కడ పడుతుందో, ఏయింట్లో పడుతుందో."

వేడు —

కోరు 1-5-21. ఇమ్మంత్రంబుపదేశించిన దాని శక్తి నెఱుంగ వేడి. ఎఱుగగోరి ఇప్పుడు మనము దీనిని ప్రార్థించు అను నర్థమున వాడుచున్నాము. ఈ యర్థము కూడ నన్నయకు పరిచితమే. "వేడు కెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్ ! వేఁడికోలుచితంబ" 1-5-218.

నిలువుండ —

నిలిచిపోవుడు, ఆగిపోవుడు, అనునర్థమున వాడబడుచున్నది. 1-5-68 'ఇటచను, దేరకనిలువుండయి వియదేవపథంబుల్' కూర్చుండుటకు వ్యతిరేకము నిలుచుట, ఇట్టి సంకుచితార్థమునందుగాక పెంపొందిన యర్థమున ఈ క్రియనువాడుట చమత్కారము. నిలువుడు, నిలువుండు, నిలువుండి, నిలువుండ ఇట్టి గూఢములు వేంగిమండల ప్రయోగములు. ఈ సందర్భమున తెలంగాణమునందలి ప్రయోగము ఇంకను చమత్కారముగా నున్నది. 'నిలువుండ్రి, చేయుఁడ్రి, నడువుండ్రి'

దీనిలో పూజ్యార్థ మిమిడియున్నది. వేంగిమాండలికమును నన్నయ వాడుటచే అదియే ప్రామాణికమైనది. అంతకన్న ఎక్కువ ముద్దుగా నున్నను, 'నిలువుండ్రి' ప్రామాణికము కాలేదు.

## పదబంధగత సూక్తులు

కావచ్చిన –

అగుటకు సిద్ధముకాగా 1-5-8. ఈ వంశము విచ్ఛేదముగా వచ్చిన, ఇప్పటికిని ఈ పదబంధమును మనము వాడుచున్నాము. 'పరీక్షలు కావచ్చినవి' ముగియుటకు వచ్చినవి.

కేలుమొగుచు –

చేతులు జోడించి మ్రొక్కు. 1-5-20 అని కేలుమొగిచి మ్రొక్కిన-సాగర ప్రాంతమున దండముపెట్టి వాడుకలో నున్నది. తెలంగాణమున మ్రొక్కు, మొక్కు వాడుకలో నున్నది. 'కాళ్ళు మొక్కుతాను'. మొగుచు ధాతువులో చమత్కార మున్నది. మొగుడు-మొగుచు; మొగుడు ముడుచుకొను - పద్మము మున్నగు వానివలె, కేలు మొగుచు-చేతులను పద్మాకారముగా ముడిచి యని చమత్కారము.

వడవడవడంకు –

నడునడ నడంగు అని పాఠాంతరము, ఆమ్రేడితముచే భావ సాంద్రతను సూచించుట. దీనినే భృశార్థము అనుచున్నారు. 1-5-21 కడు సంభ్రమించి వడవడవడంకుచున్నదాని నోడకుండుమని, ఇట్టివి భాషయందు నేటికిని కోకొల్లలు "వాడు గడగడ మాట్లాడెను. పూలు జలజల రాలినవి. ఆమె కలకల నవ్వినది."

ఎవ్వరిని మెచ్చక –

లెక్క సేయక. 1-5-35. పాండురాజు పరాక్రమంబున నెవ్వరిని మెచ్చక, ఇప్పుడు పొగడు, అంగీకరించు అను నర్థమున వాడుకలో

నున్నది. 'మెచ్చనంటా వీవు నీవిక! మెచ్చకుంటే మించి పామెనే' 'కవిత చెప్పి యుభయ కవిమిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన' కేతన.

ఇందుండి నవయక –

ఇక్కడ ఉండి కష్టపడక – 1–5–61. 'మీరందుండి నవయక హస్తిపురంబునకుంజని'. ఎందుండి, ఇందుండి మున్నగు ప్రయోగ ములు నన్నయ కిష్టములు– 'ఎందుండి వచ్చితిందుఁ కిందుండఁగ నీకు నిష్టము' 1–5–213 ద్రోణునితో భీష్ముని మాటలు. పదబంధగతమైనవి పెక్కులు వచ్చుచుండును. సుఖావసరంబున నున్న 1–5–57; ఋణము తీఱుట 1–5–70; అంతియ సంతసిల్లు 1–5–128; ఆఁడుపుట్టువున 1–5–129 నేఁబోరచి యాఁడు పుట్టువున– మాద్రిపలుకులు; కమ్మని లతాంతములు 1–5–138; ఇల్లడయిడి 1–5–148 కొడుకుల నిందఱ నిల్లడయిడి; ఎడ సేయక – ఆలస్యముచేయక, వేరు చేయక 1–5–148 ఒండొరుల గడ వంగ వచ్చి– 1–5–150. వీపులొలియ 1–5–165. వీపులొలియ నందఱ నీడ్చెన్. మేచూడక నిద్రవోవు – 1–5–170 భీముడు మేయూడక నిద్ర పోయెను; చదువనొల్లక 1–5–185. వేదముల్ చదువనొల్లక–వలచు ధాతువు వ్యతిరేకరూపము. తెలంగాణమున బాగుగా వాడుకలో నున్నది. నేనొల్లను కం; ధనమెల్ల 1–5–200. ఉన్న ధనమంతయు అని నేటి వ్యవహారము కొలఁదియెఱుంగక 1–5–203. కొలఁది యెఱుంగ కిట్టిపలుకులే వలుకందగుఁ గాదు నాక. అంతరము తారతమ్యము అని నేటి వ్యవహారము. ఎడ్డియు చేయునదీ నేరక 1–5–206. ఒండొరుల మొగంబు చూచి 1–5–210. నాలుగేన్ పాడి కుఱ్ఱలు. 1–5–218. నాలుగు ఆవు గొడ్లు అన్నట్లు. నాలుగేన్ పొగసినకూరలున్ అని ఆముక్తమాల్యద. నాకంటెను మీకంటెను 1–3–240 ఏకలవ్యుని గూర్చి యర్జునునివాక్యములు. వల్లె యని 1–5–248. 'సరేయని' ఇప్పటి వ్యవహారము. ధర్మజుం బదరి 1–5–251. నీళ్ళ నాడుచు

నున్నన్ 1-5-255. ద్రోణుడు స్నానము చేయుచుండగా ఇవ్వడు నీళ్ళాడుట ప్రసవించుట అను నర్థమున వాడుక.

## సమాస గతములు

నన్నయకు కొన్ని సమాసపు కూర్పులు మిక్కిలి యిష్టము. 'కుమారాయిత శక్తిశాలి' 1-5-6. క్యజ్ ప్రత్యయాంతము. భద్రాయితమూర్తి - తిక్కనసోమయాజి ప్రయోగము. 'జితశ్రముఁడు' 1-5-15 ఆయుధ విద్యలయందు జిత శ్రముఁడై. 'కలఁలేని హిమరశ్మి కాంతి' 1-5-15. 'నీకోరిన వరంబు' 1-5-21 సూర్యుండును నీ కోరిన 'వరంబీవచ్చితి ననిన.' నానేర్చు విధంబున నిక్కావ్యంబు. గజవశాద్వయ మధ్య గజేంద్రలీలతో 1-5-47. కుంతీమాద్రుల నడుమ నున్న పాండురాజునుగూర్చి, కృతస్తుఁడు 1-5-49. సంశిత వ్రతులు 1-5-96.

## కారకగతములు

'కప్పముల్ ధరణిపాలురచేఁగొని' 1-5-39 వలనకు తృతీయ, చిన్నయసూరి దీనినే గ్రహ్యాదిజంబగు పంచమియని వ్యవహరించును. 'నిత్యంబు నొక్కొక్క వనస్పతియందు'-పంచమికి సప్తమి 1-5-59. 'రాజసూయము ధర్మరాజునునుచు' 1-5-124 అర్జునుని గూర్చిన ప్రశంస. ధర్మరాజను రాజసూయమునందు ఉనుచును అనగా ప్రతిష్ఠించును. సప్తమికి ద్వితీయముగా గ్రహింపవలెను. దీనికి ననుచు అని పాఠాంతరముగలదు. 'వేదంబుల్ చదివించె భూసురలతో' 1-5-190. కృపాచార్యుని వృత్తాంతము. ఉపయోగంబునం బాఖ్యాతకుతోడ వర్ణక మగునని చిన్నయసూరి. 'ఎఱుకు విలువిద్య కలిమికి హీనుడయ్యె'- సప్తమికి షష్ఠీ ప్రయోగము. 1-5-244. 'నిన్నుగలపుడు' - 1-5-245 నీకు గలపుదు. షష్ఠికి ద్వితీయను వాడుట. 'బలరిపు సుతునకుఁ బలికిన పలుకు'- 1-5-245. సుతునితో బలికిన పలుకు. తృతీయకు షష్ఠిని వాడుట.

పై ప్రయోగములనుబట్టి 'ఒకానొక విభక్తికి కొండొక విభక్తి కానంబడియెడి' అని చిన్నయసూరి చెప్పినది వాస్తవమేయనిపించును. విభక్తి ప్రత్యయములుగా వాడుచుండిన శబ్దములును కాలాంతరమున మారుచూవచ్చినవి. వాని విభక్తి సంబంధమును నియతముగాలేదు. కారక ప్రపంచము ద్రవస్థితిలో నున్నది.

## వాక్యగతములు

సూక్తులు సామాన్యముగా వాక్యగతములుగానే యుండును. సంపూర్ణ వాక్యమే సూక్తియొక్క సహజస్థితి యనుట యుక్తము. అసంపూర్ణ వాక్యగతములు పదబంధముల కోటిలోనికి రాదగును. ఈ సూక్తులలో కొన్ని విభాగములను మనము గుర్తింపవచ్చును. (1) లోక వ్యవహార జన్యములు. వీటిని నానుడులు, పలుకుబళ్ళు, జాతీయములు, భాషీయములు ఇత్యాదిగా వ్యవహరింపవచ్చును. (2) అలంకారాశ్రయములు. దీనిలోనే అర్థాంతరన్యాసాదులు వచ్చును. (3) కవికల్పిత సూక్తులు ఇవి కవి యొక్క లోకజ్ఞతపైనను, వక్తృప్రతిభపైనను ఆధారపడి లోకమునందు సువ్యాప్తినంది సామెతలా యను భ్రమను కల్పించునంతగా ప్రాకిపోవును. ఉదాహరణకు నన్నయ ప్రయోగించిన ఒక సూక్తిని, ఒక సామెతను గ్రైకొందము. 'గత కాలము మేలు వచ్చు కాలముకంటెన్' 1-5-159. కృష్ణద్వైపాయనుడు సత్యవతీదేవితో అన్నమాటలు. "రోయు తీగ కాళ్ళంబెనగెందాననుచుం బొంగిభీష్ముఁడు." 1-5-220. మనుమలకొరకు సమర్థుడైన గురువును వెదకుచుండగా ద్రోణాచార్యులు కౌరవులకడకు వచ్చెను. భీష్ముడు సంతసించెను. రోయుతీగ కాళ్ళం బెనగెను, అను సామెతను ఈనాటికిని మనము వాడుచున్నాము. 'వెదుకబోయిన తీగ కాళ్ళకుదగిలినట్లు' అని దీని నేటిస్వరూపము-గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్ అను నన్నయగారు కల్పించిన ప్రౌఢసూక్తికూడ అతిశయ వ్యాప్తిని

పొంది సామెత గౌరవమును సంపాదించుకొన్నది. 'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్' అనునది సామెతయనుకొందుముగాని కాళిదాసు వాక్యమని పలువురకు తెలియకయే పోవచ్చును. సామెత లోకపుసొత్తు. సూక్తియన్నది ప్రతిభావంతుడైన కవి లోకమునకు ఇచ్చినసొత్తు.

నన్నయగారి వాక్యగత సూక్తులను కొన్నిటిని చూతము :

1. లోకవ్యవహారజములు :

'జాడకుండుము' 1-5-21 సూర్యుడు కన్యయైన కుంతితోనన్న మాటలు. వెనుదీయకుము అని యర్థము. జాడు అను ధాతువిప్పుడు పరాజయార్థము నందే యున్నది. ఇదియు కోరంగాదనాక 1-5-24. నన్నుఁ జూచి నగరె 5-24 ఇవి కుంతి పలుకులు ఇప్పటివ్యవహారములో, పదములలో స్వల్ప వ్యత్యాసముండును. నీయెఱుఁగని నృప ధర్మువుల్ గలవె 1-5-54, మృగములఁ దవిరియేయ రెఱచి యాహారముగ మను నెఱుకులయిన 1-5-53. ఇవి పాండురాజుతో కిందముని మాటలు. మాంసము మీద బ్రతుకు ఎఱుకులైన ఇట్లు చేయరు అని యాక్షేపము. "ఇంకొరులమనుష్యుల నంతఃకరణములఁ దలఁపఁ బొందఁదా నోపుదు మే." 1-5-76. పాండురాజుతో కుంతిమాటలు. పరపురుషులను పొందుట మాట అటుంచి మనస్సులలో తలపనైన తలప గలమా, నేటి పలుకుబడియే మారురూపములోనున్నది. రక్షింపుము నా వచనమున 1-5-100. గాంధారితో వ్యాసుని మాటలు. నా మాటగా దీనిని కాపాడుము అని యర్థము. ఈనాడు 'రక్షించు' ధాతువు గాఢమైన యర్థమందు వాడబడుచున్నది. ఇట్టిదేనా పలుకు. (పనుపు) సేయుము 1-5-144. చూతమురండని పౌరులెల్ల 1-5-150. పాండవులు మొదటి మారుగా హస్తినాపురమునకు వచ్చినప్పుడు జనులనుకొను మాటలు. ఏను ద్రోణుండనువాఁడ 1-5-199 నేను ద్రోణుడను అని చెప్పుకొనుట వృద్ధాచారముకాదు. నన్ను ద్రోణుడందురు అనవలెను.

ఈనాటికిని పెద్దలీ సం ప్రదాయముననుసరింతురు. ఎందుండి వచ్చితిం దుల కెందుండఁగ నీకునిష్టము 1-5-213 ద్రోణునితో భీష్ముని పలుకులు. తనయుం డేడ్చెను పాలునాకుఁ బోయుండనుచున్ 1-5-216. అశ్వత్థామ బాల్యమును గూర్చి ద్రోణాచార్యునిమాటలు. ఇచ్చట యేడ్చుట అనగా మారాముచేయుట, తెలంగాణపు పలుకుబడిలో జిద్దు చేయుట. ఇదె దేహం బిదెయర్థం బిదెనా పరిజనము – 1-5-242. ఏకలవ్యుని మాటలు.

## 2. అలంకారాశ్రయములు

ఇంతులెప్పుడు నపరాధయుతలు 1-5-22 సూర్యునితో కుంతి విన్నపము 'మున్గట్టిన కర్మఫలంబులు । నెట్టిన భోగింపకుండ నేర్తురె మనుజుల్' 1-5-58. పాండురాజు పశ్చాత్తాపము. పాపమో, పుణ్యమో మూటగట్టుట అను వ్యవహారము నేటికిని గలదు. జీవించిన మృతిఁ బొందిన నిర్విశేషము 1-5-74. పాండురాజు నిర్వేదము. బ్రతికినా చచ్చినా ఒక్కటే అని నేటి వాడుక. సంసారమతి చంచల మెండమావులట్టుల, సంపత్ప్రతతు లతిక్షణికంబులు - 1-5-59. దుర్యోధనాదుల దుశ్చేష్టలను చూడకుండ సంసార నివృత్తిఁ బొలుకండని వ్యాసుడు సత్యవతీదేవికి బోధించుట ప్రసంగము సూక్తులు కొన్ని నీతిబోధకములు, వేదాంత ప్రతిపాదకములు, కర్తవ్యపు బోధకములుగ నుండును. 'కర్మబంధములు గ్రక్కునఁ బాయుదుఁ బుణ్యాగతికినేగు పురుషునట్లు - 1-5-173. కృతఘ్నునకుం జేసిన లగ్గులునుంబోలె 1-5-180. దుర్యోధనుడు చేసిన యెగ్గులు విఫలమైనవను ప్రసంగము. విద్యలెల్ల నభ్యాసమునఁ బడయ భారము లేదని 1-5-228. చీకటిలో అన్నము తిననేర్చిన యర్జునుని యనుభవము.

## 3. కవి కల్పిత సూక్తులు

గత కాలము మేలువచ్చు కాలముకంటెన్ 1-5 – పాపవ్యవసాయుల చెయ్వు లర్థవంతములగునే 1-5-176. పాలుఁడు సంగడి కాడె

యెందునున్ 1-5-203. సఖ్యము దానొందఁగూడ నేర్చునే 1-5-204 బాల్యసఖుడైన ద్రోణుని త్రోసిపుచ్చుచు ద్రుపదుడన్న మాటలు. దారిద్ర్యంబునకంటెఁ గష్టంబొండెద్దియు లేదు. 1-5-217. ఇది భారద్వాజుని స్వానుభవము.

పై పరిశీలనవలన ఒకటి రెండు అంశములు విశదమగు చున్నవి. భాషయందు పాదుకొనియున్న నానుడులు, పలుకుబళ్ళు, సామెతలు మొదలగునవి శతాబ్దములకు ముందే అచ్చట వెలసియున్నవి. వానిలో వచ్చిన మార్పులు అత్యల్పములు, శబ్దములు వాని శరీరము; అర్థము వానియాత్మ అని భావించినచో శరీరస్థానీయమైన శబ్దము మార్పునకు లోనగుచున్నట్లు కన్పించును. ఆత్మస్థానీయమైన అర్థమునందు మార్పు లేనట్లే యున్నది. 'రోయుతీగ' వెదకేతీగ అయినది. కొలఁది మెఱుంగక తారతమ్యము తెలియక అయినది. ఇట్లే మిగిలినవియు ఊహించుకొనవచ్చును. అర్థచమత్కృతిగల పద బంధములను, వాక్యములను కూర్చు శక్తి యీనాటి జనులలో కొంత కొరవడినదని చెప్పవలెను. మానవుడిప్పుడు విస్తారముగా బుద్ధిజీవి; హృదయజీవి కాడు. భావనా బలము చక్కఁగా జాగరూకమైన కాలములో మానవుడు సూక్తులను, సామెతలను, నానుడులను విరివిగా సృష్టించినాడు. అనంతర కాలమున క్రొత్తవానిని సృజింపక, పాతవానినే క్రొత్తదుస్తులలో తీర్చి వాడుకొనుట కలవాటుపడినాడు. "సిద్ధిర్లోకాత్ దృశ్యా, లోకోవన్యాదృశశ్చ నిత్యశ్చ" అని యాంధ్రశబ్దచింతామణి సూత్రించినది వాస్తవమే యనిపించుచున్నది.



# నన్నయ - 'ప్రసన్నకథా వివిధార్థయుక్తి'

శ్రీ పరిమి సాంబయ్య.

మహాభారతము వివిధార్థ ప్రతిపాదక గ్రంథరాజమని అందరకు తెలిసిన విషయమే. ధర్మతత్త్వజ్ఞులకు ధర్మశాస్త్రముగను, అధ్యాత్మ విదులకు వేదాంతముగను, నీతి విచక్షణులకు నీతిశాస్త్రముగను, కవి వృషభులకు మహాకావ్యముగను, ఐతిహాసికులకు ఇతిహాసముగను, పౌరాణికులకు బహుపురాణ సముచ్చయముగను, మహాభారతము విశ్వ జనీన మైనది.

ఇట్టి 'నానా వేదవేదాంత విద్యాయుక్త' మయిన మహాభారత మును, జిజ్ఞాసువులై సారమతులైన వారు ఏదో ఒకదృష్టితో పరిశీ లించిన; వారికి మహాభారతముయొక్క సమగ్ర స్వరూపము తెలి యదు. సర్వ శాస్త్ర కోవిదులు, బహుముఖ ప్రజ్ఞగలవారు, నగు కవులు 'సహస్రాక్షులై (వేయికళ్ళతో) మహాభారతమును 'లో నారసి' సారమును గ్రహించి మే లనవలె నని నన్నయ భావన. 'వేయికళ్ళతో భారతమును పరిశీలింపవలె నన్నభావము 'కవీంద్ర' లోని 'ఇంద్ర' శబ్దముచే గ్రాహ్యము. 'ఇంద్ర' శబ్దము శ్రేష్ఠార్థద్యోతకమే అయి నచో కవిశ్రేష్ఠత్వము సిద్ధించి 'కవివృషభ' త్వమునకు తుల్య మగునే కాని సహస్రాక్ష పరిశీలకత్వము సిద్ధింపదు.

ఆంధ్రమహా భారతావతారిక యందున్న 'సారమతిం గవీం ద్రులు ప్రసన్న కథాకవి (లి) తార్థయుక్తిలో(తో) నారసి మేలునాన్' అను పద్యపాదమునకు వి-లి, లో-తో, లకు గల లిపిసామ్యమువలన, లేఖక ప్రమాదము వలన, ఎటులైన నేమి ? అనేక పాఠాంతరము లేర్పడినవి. పాఠపరిశీలనకు ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు

1968 సం॥న ప్రచురించిన ఆంధ్రమహాభారతము (ఆదిసభా పర్వములు) సంశోధిత ప్రతియందలి పై పద్యపాదమునకుగల పాఠాంతరములు ప్రమాణముగ గ్రహింప బడినవి.

పరిశీలనకుగల పాఠాంతరములు :—

1. ప్రసన్నకథా క'లి'తార్థ యుక్తి 'లో' నారసి
2. ప్రసన్న కథా క'లి'తార్థయుక్తి 'తో' నారసి
3. ప్రసన్నకథా క'వి'తార్థయుక్తి 'లో' నారపి
4. ప్రసన్న కథా క'వి'తార్థయుక్తి 'తో' నారసి
5. ప్రసన్నకథా క'వి' తార్థయుక్తి 'లో' తారసి
6. ప్రసన్నకథా 'వివిధా'ర్థ యుక్తి 'లో' నారపి
7. ప్రసన్నకథా 'కథితా'ర్థ యుక్తి 'లో' నారసి
8. ప్రసన్నకథా 'కవి'తార్థ 'తత్త్వము' న్నారసి
9. ప్రసన్నకథా క'వి'తార్థ 'తత్త్వ మొప్ప'రసి

వివిధ పాఠములపై గల పూర్వ వ్యాఖ్యానములు :

1. ప్రసన్నకథా క'లి'తార్థయుక్తి 'లో' నారసి

శ్రీ విశ్వనాథ : 'ప్రసన్నమైన కథతో కూడుకొనియున్న అర్థముల యోజనము'

శ్రీ డా. దివాకర్ల :— 'ప్రసన్నమైన కథల యందు కూర్చ బడిన అర్థముయొక్క యుక్తి' [2]

శ్రీ డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు : 'ప్రసన్న కథలతో కలితమైన (కూడిన) అర్థయుక్తి' [3]

శ్రీ ఖండవల్లి : "మహాభారతము తెనిగించుటలో ఈయన రెండు లక్ష్యములను పెట్టుకొనెను. ఒకటి; కథను మిక్కిలి ప్రసన్నముగను, రసవంతముగను నడుపుట,... రెండవది; రమ్యమైన శైలిని కూర్చుకొని అత్యుత్తమ కవిత్వము వ్రాయుట.'

ఈ "ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి" అను పాదము మొట్టమొదటి సారిగ 1922 సం॥న ప్రచురింపబడిన "రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక"లోఁ గైకొనబడినది. ఇంతకు పూర్వము 1909 సం॥న ముద్రితమైన నన్నయ భట్టారక చారిత్రము (శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య) నందును, 1907 న వెలసిన (శ్రీమదాంధ్ర మహాభారత మునందును తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యంగారు), 1913 సం॥న శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి 'మహాభారతాంధ్రీకరణ విమర్శనము' నందును, 1920 సం॥న శ్రీ వంగూరి సుబ్బారావుగారి "ఆంధ్ర వాఙ్మయ చరిత్రము" నందును, ప్రసన్నకథా క'వి' తార్థయుక్తి 'తో' నారసి అనియే కలదు.

2. ప్రసన్నకథా క"లి" తార్థయుక్తి 'తో' నారసి: ఈ పాఠమును శ్రీ చాగంటి శేషయ్యగారొక్కరే గ్రహించిరి. కాని వారు దీనిని వివరింపలేదు. (ఆంధ్ర కవితరంగిణి. ప్రథమ భాగము. 1947)

శ్రీ చాగంటి వారు ఈ పాఠమును చాలయుక్తితో గ్రహించి నట్లనిపించుచున్నది. 1922 సం॥న 'ప్రసన్నకథా కవితార్థయుక్తి'లో' నారసి, ప్రచురింపబడగ, 1925 సం॥న వావిళ్ళవారి భారత ప్రతి యందు "ప్రసన్నకథా కలితార్థయుక్తిలో నారసి" ప్రధాన పాఠమై, పాఠాంతరముగ 'కవితా' 'యుక్తితో' నిలచినది. ఈ ప్రతిని చూచిన చాగంటివారు ప్రధాన పాఠమునుండి, 'ప్రసన్నకథా కలితార్థ'ను పాఠాంతరమునుండి "యుక్తితో"ను గ్రహించి ఈ పాఠమును గైకొన్నట్లు భావింపనగును.

3. ప్రసన్నకథా కవితార్థయుక్తిలో నారసి

శ్రీ విశ్వనాథ :— ప్రసన్నకథ యొక్కయు, కవితార్థము యొక్కయు, యుక్తి అనగా కవితార్థములో ప్రసన్నమైన కథ యుండుట. కథ ప్రసన్నమగుట.[5]

శ్రీ డా. దివాకర్ల :- 1. ప్రసన్నమైన కథలయొక్కయు, కవిత్వము యొక్కయు, అర్థము యొక్కయు, కూడిక.

2. ప్రసన్నమైన కథా కవితయందలి అర్థముయొక్క కూడిక.

3. ప్రసన్నమైన కథలయందలి కవిత్వము యొక్కయు అర్థము యొక్కయు కూడిక.

4. ప్రసన్నమైన కథా కవితార్థముల కూడిక [6]

శ్రీ డా. జొన్నలగడ్డ :- కవితార్థముయొక్క యుక్తి (కూడిక) కవితార్థయుక్తి, ప్రసన్న కథలతోడి కవితార్థయుక్తి ప్రసన్నకథా కవితార్థయుక్తి' [7]

శ్రీ డా. పాటిబండ :- "ఇతివృత్తము, వస్తువు, కథ అన్న మాటలు సమానార్థకములుగా సంస్కృతాలంకార శాస్త్రములం దుపయోగింపబడి యుండుట ఎల్లరు నెరిగినదే. ఇతరులు వస్తుకవిత అన్నదానినే నన్నయ కథాకవిత అనెనని ఊహించుట సులభము." [8]

శ్రీ ఇంద్రగంటి :- "ప్రసన్న + కథా + (ప్రసన్న) + కవితా + అర్థయుక్తి అని పదవిభాగముచేసి ప్రసన్నమైన కథ యొక్కయు ప్రసన్నమైన కవిత యొక్కయు ప్రయోజనములతో కూడి యుండుట అని అర్థము చెప్పవచ్చును." [9]

(ఈ పాఠమును మొదట 1968 సం॥న ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "లక్ష్మీరంజన వ్యాసావళి'లో గ్రహించినట్లు తెలియుచున్నది. 1968, 69 సం॥లలో ప్రచురింపబడిన మహాభారత సంశోధిత ప్రతుల ఆది, అరణ్య పర్వములకు గల ఉపోద్ఘాతములో శ్రీ డా. దివాకర్లవారు ఈపాఠమునే గ్రహించిరి. కాని 1970 సం॥న సాహిత్య అకాడమీ వారిచే ప్రచురింపబడిన ఆంధ్రభారత (సభాపర్వ) పీఠికలో వీరే "ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి" అను పాఠమును గ్రహించిరి.)

4. ప్రసన్నకథా కవితార్థ యుక్తితో నారసి :

శ్రీ వంగూరి సుబ్బారావు. 'ప్రసన్నకథా కవితార్థయుక్తితో నన నేమి ? ప్రసన్నమైన కథ, కవిత, అర్థయుక్తి యివి యున్నవా లేవా అని యోచించుట గదా ! అనగా సంస్కృత భారతమునకు సరియైన భాషాంతరము, సరసమైన శైలి, కవితలోని సౌభాగ్యము సరియైన యర్థము ఇవి ఉన్నవా? లేవా? అని యోచించిరి. ఉండుటచేత మే లనిరి. అని మరల వారు ప్రత్యుత్తర మిచ్చిరనుకొందము' 10

[ఇంకెవ్వరును ఈ పాఠమునకు వివరణము నియ్యలేదు. అంతే కాదు. మిగిలిన అయిదు పాఠాంతరములను గూర్చి కూడ ఎవ్వరూ పరిశీలింప లేదు]

పాఠ వివరణము :

ప్రసన్న కథా కలితార్థయుక్తిలో నారసి :

ఈ పాఠమునకు పాఠభేదములు: కలిత/కవిత/కథిత/వివిధ/ మొదలైన వానిచే కలుగుచున్నవి.

ధనము సమయమునకు లేనివానికి దానియొక్క అవసరము బాగుగా తెలియును. అట్లే సమాసములోని శబ్దముయొక్క సార్థకతను తెలిసికొనవలెనన్న ఆ శబ్దమును సమాసమునుండి తొలగించి (Elimination) చూడవలెను. ఇట్లు శబ్దమును సమాసమునుండి తొలగించిన ఆ సమాసము యొక్క అర్థమునందు మార్పులేనిచో తొలగింపబడిన శబ్దము సార్థకము కాదని, పూర్వార్థము సంధిల్లనిచో, ఆ శబ్దము సార్థకమైన దని, తెలిసికొన వచ్చును.

ఈ పద్ధతి ప్రకారము కలిత కవిత వివిధ కథిత లను సమాసము నుండి తొలగించిన –

ప్రసన్నకథా'కలిత'అర్థయుక్తి ప్రసన్న కథార్థయుక్తి–అగును.

ప్రసన్నకథా'కవిత' అర్థయుక్తి ప్రసన్న కథార్థయుక్తి-అగును.

ప్రసన్నకథా'కథిత' అర్థయుక్తి ప్రసన్న కథార్థయుక్తి అగును.

ప్రసన్నకథా'వివిధ' అర్థయుక్తి ప్రసన్న కథార్థయుక్తి అగును.

ఈ 'ప్రసన్న కథార్థయుక్తి' అను సమాసమునకు పై పాఠార్థములను పొందగలిగితిమేని, ఆయాపాఠములు 'ప్రసన్న కథార్థయుక్తి'కి సమానమై, ఆయా పాఠములలోని తొలగింపబడిన శబ్దములు వ్యర్థములగును.

'ప్రసన్న కథార్థయుక్తి'కి అర్థము ఈ క్రింది విధములుగ చెప్పవచ్చును.

1. ప్రసన్నమైన కథలలోని అర్థముల కూర్పు.
2. ప్రసన్నమైన కథయొక్కయు, అర్థముల యొక్కయు కూర్పు.
3. ప్రసన్నమైన కథయొక్కయు, ప్రసన్నమైన అర్థము యొక్కయు కూడిక.

ఈ అర్థములను, వివిధ పాఠములపైగల పూర్వ వ్యాఖ్యానములతోఁ గలిపి పరిశీలించి చూచిన, పై సమాసమునందు 'కలిత' 'కథిత' వ్యర్థశబ్దములని తెలియుచున్నది. (శ్రీ) డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయ రావుగారు "కలితార్థయుక్తి"కి "కవితార్థయుక్తి"కి ఇచ్చిన అర్థములను కలిపి "ప్రసన్న కథాకలితార్థయుక్తి"కి అర్థముచెప్పిన 'ప్రసన్న కథలతో కూడిన అర్థముల యొక్క కూడిక' అగును.

ఇచట రెండు కూడిక లేల? 'కలిత', "యుక్తి" ఇంచుమించుగా సమానార్థకములు. (కలితము = ఎఱుగబడినది, పొందబడినది, యుక్తి = కూడిక, న్యాయము, ఉపాయము, అలంకార విశేషము, శబ్ద రత్నాకరము.)

పై అర్థములను దృష్టియందుంచుకొని 'ప్రసన్నమైన కథలచే ఎఱుగబడిన అర్థముల (భారతార్థముల) కూడిక' అని 'ప్రసన్నకథాకలితార్థయుక్తి'కి అర్థము చెప్పవచ్చును. అయినను, ఈ అర్థమును ప్రసన్నకథార్థయుక్తి నుండియు పొందవచ్చును.

పై పరిశీలనము వలన తేలిన విషయము, I, VII, పాఠముల కన్న వేరు పాఠము గ్రహింపదగు నది.

'ప్రసన్న కథాకలితార్థయుక్తి' అసాధువని కాదు. ఒకదృష్టితో చూచిన సాధుపాదము. దీని నాలంబనముగా చేసికొని వెలసిన నన్నయ కవితారీతుల వివరణ లన్నియు ఏకకోణ పరిశీలనమునకు పరిమితమైనట్టివే. (శ్రీ) గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి "నన్నయ భట్టు—విజ్ఞాననిరతి," (శ్రీ) డా॥ కె. వేంకటేశ్వర్లుగారి 'Political philosophy of Bharatha,' (శ్రీ) డా॥ పి. వేంకటరాజుగారి "మహాభారతము—ఉపాఖ్యాన తత్త్వము." (శ్రీ) డా॥ వి. వి. ఎల్. నరసింహారావుగారి 'నన్నయ కవిత్వము – అక్షర రమ్యత' మొదలైనవి భిన్న భిన్న దృక్కోణ పరిశీలనములు. ఇట్లే, పంప-నన్నయ తులనాత్మక పరిశీలనము, ఆంధ్ర మహాభారతము – ఆధ్యాత్మిక తత్త్వము, నన్నయ–పురాణ కథాకథన దక్షత, నన్నయ భారతము— నీతిశాస్త్రము, మొదలగు వివిధ విషయములపై పరిశోధనము జరగినఁగాని నన్నయయొక్క—బహుముఖ ప్రజ్ఞ తెలియదు.

ప్రసన్నకథా కవితార్థయుక్తిలో నారసి :

సంశోధిత ప్రతిలోని ఈ ప్రధాన పాఠమునకు వావిళ్ళవారి ప్రతిలోని పాఠము ఆధార మని సంపాదకులు తెల్పినారు. కాని ఏయే తాళపత్ర ప్రతులు ఆధారములో తెలుపలేదు. సంశోధిత ప్రతియందు–

ప్రసన్నకథా 1 కవితార్థ 2 యుక్తిలో 3 నారసి.

1. కలితా — గి-ద-న-మ-య-ల-వ-వా, కవితార్థయుక్తితో- పీ. ఇది 29 ప్రతులలోని పాఠము.

వివిధార్థయుక్తి-(కొన్ని ప్రతులు) కథా కథితార్థ-కొ. చొ. కవితార్థ తత్త్వ మొప్పారసి-టీ.

2. తత్త్వము న్నారసి- ఉ. ర. యుక్తితో - ఆ. ఇ. ఎ. ఏ. ఒ. ఔ. క. చ. జ. ట. డ. ప. బ. మ. య. వ. శ. ష.

3. లోతారసి — ఆ.ఈ.ఎ.ఏ.ఐ.ఒ. - అని కలదు.

ఇది ఇట్లుండగా "నన్నయ కవిత్వము — అక్షర రమ్యత" (పుట-1) లో 'కవితార్థయుక్తిలో నారసి'- 29 ప్రతులలోని పాఠము అని ప్రచురింపబడినది. ఇందు 'వివిధార్థయుక్తి'అను పాఠమువ్యాగ్యము. ఇక శ్రీ ఇంద్రగంటివారు కూడ అధిక ప్రతులందున్నది "ప్రసన్న కథాకవితార్థ యుక్తిలో నారసి" అని ఎట్లు గ్రహించిరో తెలియుట లేదు. ప్రమాదోధీమతామపి.

ఈ పాఠమును విశ్వనాథవారు 'కథాకవిత' నన్నయ నాటికి లేదనియు, సమంజసముగా లేదనియు అంగీకరింపలేదు.1 శ్రీ దివాకర్ల వారు ఈ సమాసము దూరాన్వేయముగా నున్నదని విశ్వనాథవారితో నేకీభవించిరి.2 శ్రీ ఇంద్రగంటివారు ఈ పాఠము అధిక ప్రతులందున్న దనియు, అర్థపుష్టి కలదనియు గ్రహించిరి.[9] శ్రీ మృత్యుంజయరావు గారు అభేద భావముతో కవితార్థయుక్తిని కవితార్థయుక్తిని సమర్థించి 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' నే ప్రధాన పాఠముగ గ్రహించిరి.[11]

అధిక ప్రతులందున్న పాఠమునకే ప్రాధాన్యము నీయదలచిన, అది, 'ప్రసన్నకథా కవితార్థయుక్తితో నారసి' అగునేకాని, 'ప్రసన్న కథాకలితార్థయుక్తిలో నారసి' కాదు.

ప్రసన్నకథాకథితార్థ యుక్తిలో నారసి :

పాఠము. కొ. చొ. ప్రతులలోనే కలదు. పరిశోధిత ప్రతిలో

'కథితార్థ యుక్తి' అను పాఠాంతరమునిచ్చు తావున (Foot Note) "కథాకథితార్థయుక్తి" అని ముద్రితము 12, పాఠాంతరమును యథాతథముగ గైకొన్నచో ఛందోదోష మేర్పడును.

"కథిత" మనగా చెప్పబడినది "ప్రసన్నముగా చెప్పబడిన కథ యందలి అర్థముల కూర్పు" అని సమాసార్థము.

సూతుడు శౌనకాది మునులకు వినయావనతుండై నమస్కరించి తాను 'పురాణపుణ్య కథాకథన దక్షుం' డని చెప్పెను. 'సూతునకు కథాకథన దక్షత' అను విశేషణము సంస్కృత భారతమున లేదు–'లోమహర్షణపుత్ర ఉగ్రశ్రవాః సూతః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతే ర్ద్వాదశవార్షికే సత్రే ఋషీనభ్యాగతానుపతస్థే' (1–4–1 శ్లోక) తెనుగు భారతమునందే కలదు. ఈ 'కథాకథన దక్షత' నన్నయ దని భావింపనగును. అట్టిచో 'కథాకథితార్థ యుక్తిని' మరల చెప్పుట వలన ప్రయోజనములేదు. అంతేకాదు. ఈ పాఠమునకుఁగల అర్థము 'ప్రసన్న కథార్థయుక్తి' అను సమాసార్థమునకు సమానమగుటచే 'కథిత' శబ్దము వ్యర్థమగు చున్నది.

'ప్రసన్న కథాకవితార్థ తత్త్వమున్నారసి; / మొప్పారసి'

ఈ పాఠములకు ప్రసన్నమైన కథల యందలి కవితార్థ తత్త్వమును విచారించి కవితార్థ తత్త్వముయొక్క గొప్పదనమును విచారించి అను అర్థములు చెప్పదగును. ఇందు కవితార్థ తత్త్వమొప్పారసి అనునది 'కవితార్థయుక్తితో నారయు'టకు సమానము.

'లోనారయు' 'ఆరయు'ట కన్న అధికార్థబోధకము. కావున III వ పాఠము VIII వ పాఠముకన్న మెరుగు V వ పాఠమునందు "లో తారసి" అని కలదు. "లో తారసి" "లో నారసి" ఇంచుమించుగ సమానములు.

ప్రసన్నకథా వివిధార్థ యుక్తిలో నారసి :

ఈ పాదము కొన్ని ప్రతులం దున్నట్లు సంశోధితప్రతి తెల్పు చున్నది. ప్రసన్నమైన కథయందలి వివిధార్థముల కూర్పు అని పాఠార్థము. వివిధార్థములనగా, స్థూలదృష్టికి గోచరమగు కౌరవపాండవుల కథ నాలంబనముగ చేసికొని అందు కూర్పబడిన ధర్మశాస్త్ర,నీతిశాస్త్ర, వేదాంతశాస్త్ర, ఇతిహాస, మహాకావ్య, పురాణాదుల అర్థములు.

నన్నయ తెనుగు చేసిన మహాభారతమునందు వివిధశాస్త్ర లక్షణము లున్నవనుట జగద్విదితము – (చూడు. ప. ధర్మతత్త్వజ్ఞులు) సంస్కృత భారతమునందును గలదు –

ధర్మకామార్థ శాస్త్రాణి శాస్త్రాణి వివిధానిచలోక యాత్రా విధానం చ, సంభూతం దృష్టవా నృషిః (1–1–47 శ్లో)

వ్యాసభారతమున కథ అను స్యూతముగ నడువదు. సన్నివేశ పునరావృతులచే, వేదాంతాధ్యాత్మికస్తోత్ర విషయ శ్లోకములచే కథ తేలికగ ప్రసన్నముగాదు. కథాకథన దక్షుడు, 'నానారుచిరార్థ సూక్తినిధి' అయిన నన్నయ తన బుద్ధి బాహుబలముచే భారత భారతీ సముద్రము నీది అచట లభించిన 'కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమైన ప్రసన్న భారతకథను మనకందించినాడు. ఇది కౌరవపాండవుల చరిత్ర మాత్రమే కాదు. వ్యాస హృదయ ప్రతిపాదిత వివిధార్థ యుక్త రచన. జిజ్ఞాసువులు, సారమతులునైన కవులు, వేయికళ్ళతో లోనారసి వ్యాస హృదయము నెరిగి మేలనవలెనని నన్నయ భావన.

"ఆయుష్యం బితిహాస వస్తుసముదాయం బైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తి నిమిత్త ముత్తమ సభా సేవ్యంబు లోకాగమ
న్యాయైకాంత గృహంబునాఁ బరగి నానావేద వేదాంత వి
ద్యా యుక్తంబగు దానిఁజెప్పఁ దొడఁగెన్ తద్భారతాఖ్యా
నమున్" (ఆది. 3–1)

అని మహాభారత స్వరూపమును నన్నయ తెలిపినాడు.

మహాభారతములోని ఇతిహాస వస్తు సముదాయము నన్నయ రచనలో ప్రసన్న కథగా పరిఢవిల్లినది. 'నానా వేదవేదాంత విద్యా యుక్తంబగు' విషయము, 'వివిధార్థ యుక్తి'లో తెలుగున వెలిగినది. ఈ పద్యములోని ఇతిహాస వస్తుసముదాయము 'నానా వేద వేదాంత విద్యాయుక్తంబగు దాని' భావముల సంక్షిప్తీకరించిన ప్రసన్నకథా వివిధార్థయుక్తి అగుచున్నది.

భారతము ఆదరణీయసార వివిధార్థ గతిస్ఫురణంబుగల్గి యష్టాదశపర్వ నిర్వాహణ సంభృతమై, పెనుపొంది' యుండెనని తిక్కన చెప్పినాడు.[13] ఈ పద్యములోని 'వివిధార్థగతిక' సంశోధిత ప్రతిలో 'కవితార్థగతి' అను పాఠాంతరము గలదు. ఈ పద్యములోని 'సార వివిధార్థగతి' 'ప్రసన్నకథా వివిధార్థ యుక్తి'ని తలపించుచున్నది. అంతేకాదు. 'వివిధం సంహితాజ్ఞానం దీపయంతి మనీషిణః' (1-1-51) అను భారత శ్లోకార్థము 'వివిధార్థ గతిస్ఫురణమే' 'వివిధార్థయుక్తికి' మూలముగా నున్నది.

వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేయుశక్తి ప్రసన్నకథా వివిధార్థ యుక్తికే కలదు. కవితార్థయుక్తి, తత్త్వార్థ యుక్తి, కథార్థయుక్తి వ్యాస హృదయమును తెలుపవు. ఈమూడిటి కన్న 'కలితార్థయుక్తి' అర్థవంతమైనది.

'కూ' ధాతు నిష్పన్నమైన 'కవి'కి, వర్ణించువాడు అనిఅర్థము. అంతేకాక దాగియున్న దానిని ప్రకాశవంతము చేయువాడు సర్వమును వ్యక్తము చేయువాడు 'కవి' అని యాస్కాచార్యులు నిర్వచించిరి.

విశ్వా రూపాణి ప్రతి ముంచతే కవిః
ప్రాసావీ ద్భద్రం ద్విపదే చతుష్పదే
వినాక ముఖ్యాత్ సవితావరేణ్యోఽను
ప్రయాణ ముషసో విరాజతి.

'విశ్వాని సర్వాణి రూపాణి రూపవస్తు అర్థేషు ప్రతిముంచతే అబధ్నాతి। తయోపఘ్నన్ రూపాణ్యాభిః కుర్వన్। కవిః క్రాంత దర్శనః। అథవా కవతేః దాతోః గత్యర్థస్య కవిః గచ్ఛత్యసౌ నిత్యం' [14]

పై అర్థమును బట్టి 'ప్రసన్నకథా వివిధార్థ యుక్తిలో నారసి' పాఠమునకు ఈ క్రింది విధముగ అర్థము చెప్పవచ్చును.

ప్రసన్నమైన కథయందు / వర్ణింపబడు / గుప్తమైన దానిని ప్రకాశవంతము చేయు / సర్వమును ధ్వనింపచేయు / భారతార్థముల కలయికను సారమత్తులైన కవీంద్రులు లోనారసి మేలనగలరు.

సమన్వయదృష్టితో చూచిన, ప్రసన్నకథా వివిధార్థయుక్తిలో నారసి ప్రసన్నకథా కవితార్థయుక్తిలో నారసి పాఠములు మిగిలిన పాఠముల అర్థములను తమయందిమిడింప జేసికొన సమర్థమైనవిగా మన్నవి. ఈ రెండింటిలో 'వివిధార్థయుక్తి' గల పాఠమునకు అర్థము స్పష్టముగానున్నది. 'కవితార్థయుక్తి'గల పాఠమునకు అర్థము,మనము వ్యాఖ్యానము చేసికొనుటపై ఆధారపడియున్నది. పాఠాంతరము లేర్పడుటకు వి/లి, లో/తో, లకు అవకాశ మెక్కువ. కవిత/వివిధలకు తక్కువ. ఈ ఒక్క విషయము మినహా 'ప్రసన్నకథా వివిధార్థ యుక్తిలో నారసి' పాఠము సంజసముగ నున్నది.

ఈ ప్రయత్నము వివిధ పాఠములను, వానిపైగల వాదోప వాదములను, ఒకచోట చేర్పవలెననియే కాని, పాఠముల సాధుత్వా సాధుత్వములను నిర్ణయింపవలెననికాదు. పాఠమేదైనను నన్నయ కవితా స్వరూపమును దర్శించి ఆనందించు వారికి కలుగు నష్టము లేదు. నన్నయ నర్థము చేసికొనలేనివారికి కల్గు లాభమును లేదు. భారత పర మార్థమునకు భంగము వాటిల్లదు.

అధస్సూచికలు :

1. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి. పుట 19
2. ఆంధ్ర వాఙ్మయారంభదశ (నన్నయ భారతము) పుట 704
3. వ్యాసభారతము – నన్నయ పరిష్కారము. పుట 475
4. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము. పుట 15
5. నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి. పుట 18
6. ఆంధ్రవాఙ్మయారంభదశ. పుట 703
7. వ్యా. భా – న. ప. పుట 477
8. అరణ్యపర్వ పీఠిక. పుట 13 (ఆం. ప్ర. సా. అ. ప్రచురణ)
9. సారమతి నన్నయ. పుట 50
10. ఆంధ్రవాఙ్మయ చరిత్రము (1920) పుట 197
11. వ్యా. భా–న.ప. పుట 478
12. ఆంధ్రభారతము (ఆది సభాపర్వములు సంశోధిత ప్రతి :– ప్రథమాశ్వాసము 26వ పద్యమునకుగల పాఠాంతరము)
13. విరాటపర్వము (సంశోధిత ప్రతి) ప్ర. 6 పద్యము.
14. **Nirukta of Yaska. page : 1116, 2117 Bombay Sansksit & prakrit Series. No. Lxxxv.**

**Note :** ఈ వ్యాసమున సంస్కృత భారతశ్లోకములసంఖ్య భండార్కర్ ప్రతినుండి ఇయ్యబడినది.

---

# నన్నయ భారతంలోని శైశవలీలలు

శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

మానవ జీవితంలో శైశవదశ పరమ రమణీయం! కల్లకపటా లెఱుగని మనస్సులతో మసలుకొనే సమయ మది! ఒకసారి కేరింతలు, ఒక పర్యాయం కలతలు, మరోపర్యాయం కలవరింతలు, కలబోసుకునే కాల మది! నవ్వుల పువ్వులు రువ్వుతూ ఉన్నట్లుండి కన్నీళ్ళ మధు స్రవంతులను, అంతలోనే హఠాత్తుగా ఉత్సాహ ఝరీతరంగాలను ప్రవహింపజేసే వాతావరణ మది! ఇట్టి అనుభూతి ప్రధానమైన ఈ శైశవ దశ, మానవ జీవితాలకు దర్పణరూపంలో వ్యాఖ్యాన ప్రాయ మైన సాహిత్యంలో, విశేషించి మన ఆంధ్రసాహిత్యంలో చోటు చేసుకుంది! ఈ శైశవ లీలాభివర్ణన వర్ణనగా ప్రపంచ పరమేశ్వరుని అసమాన సృష్టిలో సహజత్వాన్ని ఘణిల్లుపుచ్చుకున్నప్పటికినీ అంతకు ముందు కవిరాజ శిఖామణి రచించిన కుమారసంభవ కావ్యంలోనూ, ఇంకనూ అంతకుముందు నానారుచిరార్థసూక్తి నిధియైన నన్నయ భట్టారకుని మహా భారతంలోనూ సముచితరీతిలో నిర్వహించబడింది! ఆంధ్రసాహిత్యంలో ఆదికావ్యం నన్నయ భారతమైనా, అది సాహి త్యానికి శైశవ దశమాత్రం కాదు; అలాగే ఈ భారతంలో శైశవ దశాలీలలు పుష్కలంగా వర్ణనాత్మక దృష్టితో సమకూర్చబడక పోయినా, ఇందు శైశవ చేష్టా ప్రస్తావన అసలు లేకపోలేదు. ఆదికవి భారతంలో ముచ్చటగా మూడు నాలుగు చోట్ల మాత్రమే ఉన్న శైశవ చేష్టా విశేషాలను నిస్పష్టంచేయడమే ప్రస్తుత వ్యాసమున కుద్దిష్టాంశం!

ఆఖ్యానశైలీ ప్రధానమైన ఆదికవి భారతంలో శైశవ చేష్టా ప్రస్తావన మొట్టమొదటగా ఆదిపర్వం దుష్యంతోపాఖ్యానంలో

చేయబడింది! మొదట దుష్యంతుని గుణగణాలను వర్ణిస్తూ ఆతని బాల్య చేష్టలను కవి యిట్లు తెలిపెను :-

'బాలహరిణములఁ బట్టెడు, లీలను విషమాటవీ చలిత కేసరి శా
ర్దూలేభ శరభములఁ దన, బాలత్వమునంద యెగిచుపట్టుచు
మరియున్'

ఇది అమూలకము.

పిమ్మట ఈ ఉపాఖ్యానంలోనే 'కణ్వ నిర్వర్తిత జాత కర్మాది క్రియాకలాపు డై'న శాకుంతలుని నానాశైశవ క్రీడలను కవి యిట్లు ప్రస్తావించెను :-

'అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరుచరా హవ్యాళి శార్దూల ఖ
డ్గమదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూ
జములందోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుం డొప్పెవ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవ క్రీడలన్॥

దీనికి మూల మిది :-

షడ్వర్ష ఏవ బాలః సః కణ్వాశ్రమపదం ప్రతి
వ్యాఘ్రాన్ సింహాన్ వరాహాంశ్చ గజాంశ్చ మహిషాంస్తథా
బద్ధ్వావృక్షేషు బలవాన్ ఆశ్రమస్య సమన్తతః
ఆరోహన్ దమయంశ్చైవ క్రీడంశ్చ పరిధావతిః

... ... ... ... ... ... ... ...ఇత్యాది

ఇచటి శైశవ చేష్టనుబట్టి మహాసత్త్వ విషయంలో భరతుఁడు తండ్రియైన దుష్యంతుని పోలికను పుణికి పుచ్చుకొనెనని తెలుస్తోంది! భరతుఁడు తండ్రికి తగిన కుమారుఁడని తెలుపుటకును, దేశనామము తన పేరిట వెలయునట్లుగా పరిపాలించుట కర్హమైన లక్షణములు కుమారుఁడైన భరతునకు తండ్రి యొద్దనుండి సంక్రమించెనని వివరిఁ

చుటకై పరాక్రమోచితమైన దుష్యంతుని బాల్యవర్ణనం కవి చేయడం జరిగింది !

ఇక భరతుని విషయం :— మూలాను వాదముల రెంటనూ బాలభరతుని పరాక్రమ సంబంధమైన వీరోచితమై శైశవచేష్ట అభివర్ణితమైంది! మూలంలో భరతుఁడు నానాశైశవ క్రీడలను చేయునప్పటికి ఆరు సంవత్సరముల వయస్సుగలవాడని తెలుపఁబడెను. అనువాదమున నన్నయ ఈ విషయమును స్పష్టంగా చెప్పక పాఠకుల ఊహకు వదలెను. మూలంలో భరతుఁడు కేవలం 'బాలః' అని పేర్కొనఁబడగా, అనువాదంలో నన్నయభరతుని 'శాకుంతలు'డని పేర్కొనెను. ఇట్లు పేర్కొనఁబడుటలో కథాంశస్ఫూర్తి యొకటి గమనార్హం; భరతుఁడు జన్మించి ఆరుసంవత్సరములైననూ దుష్యంతుఁ డిదివరకు తానన్నమాట ప్రకారము శకుంతలను తన రాజధాని కింకను రప్పించుకొనలేదని సూచన; కావుననే భరతుఁడింకనూ లోకులదృష్టిలో దౌష్యంతి కాలేదనియు, శాకుంతలుఁడుగనే ఉన్నాడనియు కవి భావన; ఇట్టి కథాంశ స్ఫూర్తితోఁగూడిన విశేషణ పదప్రయోగము నన్నయ ప్రసన్న కథలోని అర్థయుక్తి సంబంధమైన చమత్కారము. ఇంతకూ నన్నయ ఒక్క విశేషము ద్వారా సమగ్ర కథాస్ఫూర్తిని పాఠకులకు గలిగింపజేయుట ఇందలి విశేషం :

ఇక అనువాదమున భరతుని వీరోచితమైన శైశవ క్రీడను తదనుకూల తేజస్ఫూర్తి మంతమైన మత్తేభవృత్తము నందభివర్ణించుట అనునది ఒక ఛందశ్శిల్ప రచనా విశేషమై నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తిని అక్షరమైన రమ్యతతో చాటుచున్నది; మూలంలో భరతుడు మృగములను పట్టి బంధించి ఉంచినది ఎవరి ఆశ్రమము లందలి భూజములనో స్పష్టముగా పేర్కొనబడలేదు; కాని నన్నయ ఇట కణ్వాశ్రమోపాంత భూజములకని పేర్కొని వెనుక వర్ణించిన

కణ్వాశ్రమగత శాంతరసస్ఫూర్తి గల్గిన 'శ్రవణ సుఖంబుగా సామ గానంబులు చదివెడి శుకములఁ జదువు తోలి...' అను పద్యమును పాఠకులకు జ్ఞప్తికి తెచ్చెను. ఇట్లు జ్ఞప్తికి తెచ్చుటలో ఒక ప్రయో జనము గలదు; ఆ ప్రయోజనమిది :- అంతటి శాంతరసమునకు స్థాన మైన కణ్వాశ్రమమునుగూడ తన శైశవ క్రీడలచే మృగములను బాధించు రూపములో నచటి వాతావరణ పరిస్థితినే భరతుడు మార్చి గల్గెనను విషయము తెలుపుట; మరియు భరతుని వీరోచితమైన శైశవ క్రీడాధిక్య మెట్టిదో అభివ్యక్త మగుటయు కడాగతి ప్రయో జనమే! కావుననే అచటి మునులు భరతుని చేష్టలను గమనించి సర్వ దమనుఁడను పేరును వాని కేర్పఱచిరి; ఈ విషయము మూలానువాద గ్రంథముల రెంటను చెప్పఁబడెను. ఇట్టి కథా గత ప్రయోజనము లతో, భావానుకూలచ్ఛందః ప్రయోగ వైశిష్ట్యముతో ఈ భరతుని శైశవ చేష్టా ప్రస్తావన విశిష్టమై శారద రాత్రివంటి నన్నయ కవితకే అక్షర రమ్యతను సంతరించినది.

ఇక తరువాతి శైశవ చేష్టా ప్రస్తావన కురుపాండు కుమారుల బాలక్రీడా ఘట్టమున సుమారు మూడు నాలుగు పద్యములలోఁ గావింపబడెను. ఇందెక్కువగా భీమసేనుని పరాక్రమోద్ధత్యమునకు చెందిన క్రీడా విశేషములే.

'గెలుపునెడ, నేయు నెడ వడిఁ
బఱచు నెడం బెనఁగు నెడ నపారబలంబుల్
మెఱయు నెడ భీమునకు నం
దొఱుఁ గీడ్పడఁ దొడగి రుద్ధతులు రాజసుతుల్'

...ఇత్యాదిగా వర్ణితములయ్యెను. మూలమునంగూడ

'జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంశు వికర్షణే
ధార్తరాష్ట్రాన్ భీమసేనః సర్వాన్ స పరిమర్దతి'

ఇత్యాదిగా చెప్పబడెను.

ఇచటి శైశవచేష్టా ప్రస్తావనలో భావిభారత కథా బీజావాపము గావింపబడెను. భీముని పరాక్రమ సంబంధములైన చేష్టలచే దుశ్శాసనాదులు బాధితులైరి. కావుననే తరువాతి వచనంలో దుర్యోధనుడు శకుని దుశ్శాసనాదులతో భీమవధ కుపాయము విచారించెనని చెప్పబడెను. ఇంతకూ కురుక్షేత్ర యుద్ధము జరుగుటకు హేతుభూతమైన అంశంగా ఇచటి భీముని శైశవచేష్టా ప్రస్తావన గావించుట అనునది నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తిలో ఒక భాగం! భీముని క్రీడలను వర్ణించుటలో స్వల్పాక్షర పరిమితమైన అచ్చతెనుఁగు పదములనే సాధ్యమైనంత వరకు వ్యస్తమైన ధోరణిలో 'గిఱుపు నెడ నేయు నెడ'... ఇత్యాదిగా ప్రయోగించుటను బట్టి కౌరవాదులను పరాక్రమ విషయమున నలయించుటలోని భీముని అలవోకతనము స్పష్టమగుచున్నది. మరియు భీముని పరాక్రమ సంబంధమైన బాలక్రీడలను విస్తృతి పరచుటలో సహజముగా పదవిస్తృతిగల సీసపద్యము నుపయోగించుటలో భావానుకూలచ్ఛందః ప్రయోగము వైశిష్ట్యంగలదనవచ్చును.

"కూడి జలక్రీడలాడుచోఁ గడఁగియా ధృతరాష్ట్రు
తనయుల నతుల శక్తి లెక్కించియుఁ
బదుండ్ర నొక్కొక్క భుజమున
నెక్కించు కొన వారి యుక్కడంగ
గ్రంచఱ నీటిలో ముంచుచు నెత్తుచుఁ
గాలించి తీరంబుచేరఁ బెట్టుఁ
గోరి ఫలార్థులై వారల యెక్కిన
మ్రాకుల మొదళుల వీఁకఁబట్టి

వడిఁ గదల్చుఁ బండ్లు దడబడు వారల
తోన ధరణి మీఁదఁ దొరఁగుచుండ
నిట్టి పాట గాడ్పు పట్టిచే దుశ్శాస
నాదులెల్ల బాధితాత్ములైరి॥

ఇట్టి కవితా విశేషములు నన్నయ ప్రసన్నకథా కలితార్థయుక్తిలో భాగములే యగును.

ఇక చివరి శైశవ చేష్టా ప్రస్తావన ఆదిపర్వంలోనే బకాసుర వధకు ముందు, బ్రాహ్మణ వేషములతో పాండవులుంటున్న ఇంటి వారికి తాము బకాసురున కాహారము కావలసిన వంతు రాగా, వారు దుఃఖించుచు "నేను వెళ్లెదనన్న నేను వెళ్లెద" ననుకొనుచుండగా, వారి పిల్ల వానిని గూర్చి కవి పల్కెడి విషయమున ఇట్లు గలదు—

"...కూతుం గౌగిలించుకొని యేడ్చుచున్న వారల కన్నీళ్ళు తుడుచుచు

"బాలకుండొక కొండొక కోలచేతఁ
బట్టికొని యేనరక్కసుఁ గిట్టిచంప
చులుక వత్తు మీరేడ్వగా వలదనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుపలుకులొప్ప"

వాని యవ్యక్త వచనంబులు విని యందఱు నేడ్పుడిగిన నయ్యవసరంబున... దీనికి మూలమిట్లు గలదు —

తతః ప్రరుదితాన్ సర్వాన్ నిశమ్యాథసుతస్తయోః
ఉత్ఫుల్ల నయనో బాలః కల మవ్యక్త మబ్రవీత్॥
మారోదీ స్తాత! మా మాతర్మాస్వ సస్త్వమితి బ్రువన్
ప్రహసన్నివ సర్వాంస్తా న్నేకైకం సోపసర్పతి॥
తతఃస తృణమాదాయ ప్రహృష్టఃపున రబ్రవీత్
అనేన తంహనిష్యామి రాక్షసంపురుషాదికమ్॥

తథాపి తేషాం దుఃఖేన పరీతానాం నిశమ్య తత్
బాలస్య వాక్య మవ్యక్తం హర్షం సమభవత్ మహాన్॥

మూలంలో బాలుడు మారోదీస్తాత!... తల్లీ! తండ్రీ! సోదరీ! మీ రేడ్వవలదని చెప్పాను. కాని అనువాదమున బాలుడు వారివారి కన్నీళ్ళను తుడిచిన చేష్టమాత్రమే గలదు. ఇచట చిన్నపిల్లవానిచే మాటలు పల్కించడం కన్న చేష్టలు చేయించడంలోనే పాఠకుల నాకర్షించేశక్తి సహజంగా ఉందనిపించును.

దీనివలన ఆ పిల్లవాని అమాయికత్వం కరుణరసస్ఫోరకమైన ధోరణిలో అభివ్యక్త మౌతుంది. బాలుని తొక్కు పలుకులకు అనగా అవ్యక్తములగుమాటల కనుకూలమైన అలంతి అలంతి పదముల సంధానము పైని పేర్కొనబడిన తేటగీతి పద్యంలో గలదు. బాలుని స్వచ్ఛహృదయమునకు ప్రతిబింబమైన అచ్చతెలుగిట సాధ్యమైనంత వరకు ప్రయుక్తమైనది. బాలుని హృద్భావమున కనుకూలమైన తేటగీతిచ్ఛంద మిచట ప్రయోగింపబడుట విశేషము. ఈ శైశవచేష్ట బాలుని అమాయికత్వమునకు చిహ్నమై హాస్యప్రవృత్తి రూపమునం దారబ్ధమై కరుణరసస్ఫోరకముగా విశ్రాంతి నొందినది. బాలుని అవ్యక్త వచనములకు వారానందమును చెందిరట! ఇదియు కరుణ రసస్ఫోరకమే! అనగా ఆ యింటిలోని పెద్దవారా బాలుని మాటలకు ఏడ్వలేక నవ్విరనుట! ఇందలిభావము హాస్యాత్మకమైనను ఏతత్సంబంధమగు భావనలో పాఠకుల హృదయాలను బరువెక్కింపజేయు దయారసామృత తరంగాలు అనంతంగా గలవు. ఉత్ఫుల్లనయనుడని బాలుని మూలమున వ్యాసుడు వర్ణిస్తే నన్నయ ఆ బాలునికి ఏ విశేషణమూ వాడలేదు. ఎందుకంటే ఆ సమయంలో కవియైనవాడు పాఠకులదృష్టికి తీసికొని రావలసినది ఆ బాలునిచేష్టగాని వాని రూపురేఖలు కావు గదా! "ఏన రక్కసు గిట్టి చంపుదు ననుటలో "నేను"అను శబ్దమును

ఏవకారపూర్వకముగా (అవధారణాత్మకముగా) అనగా "నేనే సంహరించెదను. ఇతరు లవసరములే"దను అర్థము వచ్చునట్లుగా కవి ఉపయోగించుటను బట్టి ఆ బాలకుని అమాయికత్వంతో కూడుకొన్న శౌర్యం ద్యోతక మౌతుంది. ఇట్టి సర్వసహృదయ హృదయావర్జకమైన శైశవచేష్ట యావదాంధ్ర సాహిత్యప్రపంచంలో మరి న భూతో న భవిష్యతి! అక్షరముల రమ్యతతో అక్షరమైన రమ్యతనందుకున్న నన్నయ భారతంలోని ఇలాంటి శైశవ చేష్టాఘట్టాలు గోదావరి గలగలా పాఱేంత వరకూ పాఠకుల హృదయ కుహరాల్లో మనోహరాలై చిరంజీవాలై నిల్చియుంటాయి.



# నన్నయ భారతము - వేదప్రతిపత్తి

డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావు

పంచమవేద మనఁబరఁగిన సంస్కృత మహాభారతము నాంధ్రీకరించుటలో దాని వేదసమ్మితత్వమున కెట్టి భంగమును గలుగకుండ మిక్కిలి జాగరూకత వహించినాఁడు నన్నయభట్టారకుఁడు. తెలుఁగు భారతమున నట్టి వైదికభావమున కెక్కడ లోపము వచ్చునో యని నన్నయ మూలమున లేని పట్టులందుఁగూడ వేదప్రాధాన్యమును స్థాపించుచు వచ్చెను.

నన్నయకు వేదముల యెడలను, వేదవ్యాసుని యెడలను సహజముగాఁ గల ప్రీతి గౌరవముగూడఁ దెలుఁగు భారతమునందలి యీ యమూలక వేద ప్రాధాన్య నిరూపణమునకుఁ గారణములని చెప్పవచ్చును. నిజప్రభువగు రాజరాజు వైదికమత పునరుద్ధరణాభిలాషము గూడ దాని కొక హేతువయి యుండవచ్చును. అందుచేఁ దెలుఁగు భారతమునఁ జూపిన భక్తిప్రపత్తులను బట్టియు నన్నయభట్టారకులకు వేదములయెడఁ గల గాఢప్రతిపత్తిని నిశ్చయింపవచ్చును. అట్టి సందర్భము లీదిగువఁ జూపఁబడును.

(i) తక్షకాదిష్టులై పరీక్షితునికడకు బ్రాహ్మణవేషధారులై వచ్చు నాగకుమారులను నన్నయ యిట్లు వర్ణించెను.

చ. 'ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శనులైనవారి ఋ
గ్యజుష పదక్రమంబులు క్రియన్ గుణియించుచు
వచ్చువారి...' ఆది. ద్వి. 196

ఈ వర్ణన మూలమున లేదు.

ఇది నన్నయ వైదికాచార సంపన్నతను దెలుపును.

(ii) తెలుఁగు భారతమునందలి యష్టకుఁడు సుగతి దుర్గతి స్వరూపములను గూర్చి యయాతి నడుగ. దానికి యయాతి యతని కిచ్చిన సమాధానము.

ఆ. 'వేద విహితవిధుల నాదరించుట యూర్ధ్వ
గతికిఁ దెరువు; విధులఁ గడచి యెందు
నాఁగఁబడిన వాని లోఁగక చేయుట
యధమగతికి మార్గ మనిరి మునులు' (ఆది. తృ. 220)

దీనికి సరియగు మూలము గానరాదు, నిది నన్నయ వైదిక ధర్మప్రీతికి నిదర్శనము.

(iii) ప్రద్వేషిణి జాత్యంధుఁడు, నతివృద్ధుఁడు నగు తన భర్తను దీర్ఘతముఁ డనువాని నెటయేనియుం గొనిపొండని తన కొడుకులం బంచి నవా రతని బంధనములతో బంధించి గంగలో విడిచిరి.

దీర్ఘతముఁ డట్లయ్యుఁ బంధనబంధనంబున నుండియు నుదాత్తాను దాత్త స్వరిత ప్రచయ స్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదం బులం జదువుచుండె నని తెలుఁగునఁ జెప్పఁబడినది.

మూలమున నతఁ డట్లు వేదములను జదువుచుండెనని చెప్పఁ బడలేదు.

సోఽనుస్రోత స్తదా రాజన్ ప్లవమానో ముని స్తదా।
జగామ సుబహూన్ దేశాన్ అన్ధ స్తే నోడుపేన హ॥
ఆది. 99–36

ఆతని యీ వేద పఠనమును నన్నయ సముచితముగాఁ గల్పించెను.

ఈ కల్పనము దీర్ఘతముని వేదానురక్తి నేగాక, నన్నయ వేద ప్రీతిని సైతముఁ బ్రకటించును.

(iv) మూలమున శకుంతల దుష్యంతునితోఁ బలికిన

"ఆదిత్య చన్ద్రా వనిలోఽ నలశ్చ
ద్యౌ ర్భూమి రాపో హృదయం యమశ్చ ।
అహ శ్చ రాత్రి శ్చ ఉభే చ సన్ధ్యే
ధర్మ శ్చ జనాతి నరస్య వృత్తమ్ ॥

అను శ్లోకమునకుఁ దెలుఁగు –

చ. విమల యశోనిధీ! పురుషవృత్త మెఱుంగుచునుండుఁ జూవె వే
దములును, బంచభూతములు, ధర్మువు, సంధ్యలు, నంతరాత్మయున్
యముఁడును, జంద్రసూర్యులు, నహంబును, రాత్రియు నన్మహాపదా
ర్థము; లివి యుండఁగా నరుఁడు దక్కొన నేర్చునె తన్ను బ్రముచ్చిలన్? ఆది. చ. 80

మూలమున 'వేద' వ్యాసుఁడు పేర్కొనని 'వేదముల'ను నన్నయ చేర్చుట విశేషము. ఇది యాతఁడు తెలుఁగు భారతమున వేదముల కొసఁగిన ప్రాధాన్యమునకు నిదర్శనము.

భగవంతుఁడగు వ్యాసభట్టారకునియెడ నన్నయభట్టారకున కపార గౌరవము, కావుననే మూలమున నాతని ప్రసంగ మెచ్చట వచ్చినను, నన్నయ యాతనిని మూలాధికముగాఁ బ్రశంసించును. దీని కెన్నియే నుదాహరణములఁ జూపవచ్చును. మచ్చున కొక్కటి.

హిడింబాసుర వధానంతరము పాండవులకడకు వ్యాసుఁడువచ్చి నప్పుడు మూలము –

'ఆజగామ మహావ్రతః ।
పారాశర్యో మహాప్రాజ్ఞో దివ్యదర్శీ మహాతపాః॥ ఆది. 153. 1

అని మాత్రమే కలదు,

ఈ సందర్భమున నన్నయ నిర్మించిన పద్యమును జూడుఁడు –

ఉ. పుణ్యతపోమయుండు, ముని పూజ్యుఁడు, బ్రహ్మ సమప్రభుండు, బ్ర
హ్మణ్యుఁడు ప్రావృషేణ్య జల దాసిత వర్ణుఁ డశేష కిల్బిషా
రణ్య దవానలుం డగు పరాశరనందనుఁ డేగుదెంచె ద
త్పుణ్య మయ స్వరూపమును బోలెఁగరంబు మనోముదంబుగన్.

ఆది. ప. 228

అతఁడు పాండవుల పుణ్యచయ స్వరూపమాయన వచ్చెననుట యమూలకము, అతి రమ్యము.

ఇది యాదిమభట్టారకులయెడ నపర భట్టారకులకుఁగల భక్తి పారమ్యమునకు నిదర్శనము.

ఇట్లు నన్నయ తాను రచించిన తెలుఁగు భారత భాగమున వేదముల ప్రాధాన్యమును స్థాపించి భారతము పంచమవేద మను దానిని సార్థకము చేసెను.

— * —

# నన్నయ మహాభారతము
# నాటకలక్ష్య లక్షణ సమన్వయము

శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు పంతులు

## జనమేజయ సర్పయాగము ♦ సంభాషణానుకూల్యము ♦ కథాగమనత్వరీకరణము

రంగమందలి పాత్రల వాక్యోపవాక్యములవల్ల ప్రయోజనమును సాధించు విధాన మేర్పడుటయే నాటక ప్రయోజనమున కనుకూలమగు కథాగమనము కనపడవలెను. కానిచో నాటక ద్రష్టలకు విసుగుపుట్టును. నాటక ప్రేక్షక హృదయముల నాకర్షింపఁజాలదు. కథాగమనత్వరీకరణమును చూపు వాక్యోపవాక్యములు జనమేజయ సర్పయాగ" వర్ణనమునఁ గలవు.

స్థలము హస్తినాపురము. రంగము జనమేజయ చక్రవర్తి యాస్థానము. కొలువుదీర్చిన యాస్థానమున కుదంకుడు వచ్చి పరీక్షిన్నరేంద్రుడు తొల్లి తక్షకు నపకారంబున పంచత్వంబు నొందిన వృత్తాంతముఁ జెప్పి రాజును సర్పయాగము చేయఁ బ్రోత్సహించును.

జన :- (మంత్రులఁజూచి) ఇది యేమి నిమిత్తంబు? విని విస్తరంబుగాఁ జెప్పుఁడు.

మంత్రులు :- (పరీక్షిన్నరేంద్రు మరణవృత్తాంతము తామెఱిఁగినరీతిని సవిస్తరముగఁ జెప్పి)

ఆయుష్మంతుడవై ల<br>
క్ష్మీయుత బాల్యంబునంద మీయన్వయరా<br>
జ్యాయత్త మహీభారం<br>
బాయతభుజ నీవు దాల్చి తభిషిక్తుఁడవై.

పెంచితి ధర్మ మార్గమునఁ బ్రీతి నెలనర్చుచు ధాత్రిఁ బ్రజన్
మించి తనేకయాగములు మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్
సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీ సమానులే?
కాదన కిట్టిపాటి యపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ హుతవహోగ్రసమగ్ర శిఖాచయంబులన్.

(జన :- కోపోద్దీపితుఁడై, సర్పయాగంబుఁ సేయ సమకట్టి పురోహితులను ఋత్విజులను బిలువఁబంచి)

చ. తనవిషవహ్ని మజ్జనకుఁ దక్షకుఁ డెల్లు దహించె నట్టి యే
నును సహమిత్రబాంధవజనుం డగు తక్షకు నుగ్రహవ్యవా
హనశిఖలన్ దహించి దివిజాధిపలోకనివాసుఁడైన మ
జ్జనకున కీయుదంకునకు సాధుమతంబుగఁ బ్రీతిఁ జేసెదన్.

వ. సర్పయాగం బిట్టిదని శాస్త్రవిధానంబు గలదేని చెప్పుడు.

ఋత్వి :- మత్తు! నీతదర్థమకాఁగ దేవవినిర్మితం బిది; యన్యు
లుర్వీతలేశ్వర దీనిఁ జేయరు; వింటి మేము పురాణ
విఖ్యాత మాద్యము"...

జనమేజయునిచే సర్పయాగము చేయించి పాముల వంశనాశము చేయుట యుదంకు నుద్దేశము. ఉదంకుని వచనములందు ప్రమాణబుద్ధి యున్నను వాని సత్యాసత్యము లరయనిది ఈ జనమేజయునివంటి చక్రవర్తి కార్యమునకు దిగుట పాడిగాదుగదా! ఈ యుదంతము తానెఱుఁగడు. తనవారెఱుఁగుదురుగాఁబోలు. వారివచనములను స్థిరపఱచినచో ధర్మపరిపాలకుఁడు గనుక తాను విచారణపైని తేలిన సత్యమునకు తగినట్లు నడచుకొన వచ్చును. జనమేజయుఁడు మంత్రుల

నడుగుటలో ప్రయోజనసాధనవిధాన మేర్పడుటకు సూచన గలదు. ఊహింపఁబడిన ప్రయోజనమునకు సాధనవిధాన మేర్పడినఁగాని కథాగమన మారంభముకాదు. "మంత్రులు తామెఱిఁగినది చెప్పుదురు. తన వాక్యములసత్యము తేటపడును. రాజునకు నిశ్చయము కలుగఁ గలదు" అని యుదంకుని యూహ. కార్యాచరణోత్సాహముచే పురికొల్పఁబడి మనస్సునకు నిశ్చయజ్ఞానము కలుగుట ప్రయోజన సాధనమునకు రెండవ మెట్టు. మంత్రుల వాక్యములు ఇట రెండురకములు: (1) పరీక్షిన్నరేంద్రుని దుర్మరణ వృత్తాంతమును విస్తరించి చెప్పునవి. (2) రాజును ధర్మమార్గ ప్రవర్తకునిగ స్తుతించి యాతనిచే ప్రతీకారము చేయింపఁ బ్రోత్సహించునవి. ఉదంకుని వాక్యము లీ రెండవరకములో చేరినవి. మొత్తముపైని మంత్రులవాక్యములవల్ల ఉదంకుని వాక్యములు సమర్థింపఁ బడినవి. కార్యాచరణమునందు పనిగల పాత్రలోకదాని కొకటి యనుకూలపడినఁగాని కథాగమనము త్వరపడనేరదు. ఇట్టి పాత్రానుకూల్య మీ ఘట్టమునఁ గలిగినది. ప్రయోజన సాధనము మఱియొక మెట్టెక్కెను. రాజు కృతనిశ్చయుఁ డగుటయు నాతని నిశ్చయమునకుఁ గోపము తోడగుటయు నాతని వాక్యములవల్ల స్పష్టము. నిశ్చయజ్ఞానమునకు రాగము తోడగుట కథాగమనత్వరీకరణమునకు ముఖ్యము. అయినను జనమేజయుని యెడ రాగమునకన్న ధర్మమునకే ప్రాముఖ్య మని తేటతెల్ల మగుచున్నది. అది రాజధర్మము. రాజులు తొందరపడి కోపము తెచ్చుకోరు. సకారణముగ వారికిఁ గోపమువచ్చి కార్యమునకు దిగిరా వెనుకంజ వేయరు. మనసునకు నిశ్చయము కలిగీకలుగుటలో రాజు పురోహితులతోను ఋత్విజులతోను యోజించెను. ఇది మూఁడవ మెట్టు. ఋత్విజుల వాక్యములవల్ల యాగవిధాన మేర్పడినది. ఇది నాల్గవ మెట్టు. ప్రయోజనసాధనము సన్నిహితమైనది. దీనిని వర్ణించువాక్యములలో నన్నయ కవి సర్పయాగమును కంటికిగట్టిన ట్లగపఱచెను.

"ఇట్లు కృతనిశ్చయుండై జనమేజయుండు కాశి రాజపుత్త్రియైన వపుష్టయను మహాదేవి ధర్మపత్నిగా సర్వయాగదీక్షితుండై శాస్త్రో పదిష్ట ప్రమాణలక్షణనిపుణ శిల్పాచార్య వినిర్మితంబును యజ్ఞోప కరణానేకద్రవ్య సంభారసంభృతంబును ప్రభూత ధనధాన్య సంపూర్ణంబును స్వస్వనియుక్త క్రియారంభ సంభ్రమ పరిభ్రమద్బ్రాహ్మణ నివహంబునునైన యజ్ఞాయతనంబున నున్న"

[ఇచట కవి నన్నయ వేదఘోష ననుకరించు పవిత్రరవ ప్రాధాన్యముగ పదబంధములను కూర్చి యుండుట పాత్యానుకూల్య తుల్యమై యున్నది.]

ఈ వర్ణనమువలన ప్రయోజన ప్రచోదనము మొదలు ప్రయోజనాసన్నత వఱకును గల కథాగమన మెంతత్వరలో నెఱవేఱెనదో స్పష్టము.

పరమ భాగవతోత్తములు పూర్వము మిత్రత్వ శత్రుత్వముల వలన పరమేశ్వరునిలో నెట్లు లీనమైపోయిరో అట్లే వాక్యోపవాక్య ములును అనుకూల ప్రతికూల మార్గములఁ గథాగమనమున లీనము గావలెను. మాటల రూపమున కథ నడచిపోవలెను. ఇంతవఱకీవాక్యో పవాక్యములలో ననుకూల మార్గమే కలదు.

అటు యజ్ఞదీక్షితుండగు రాజు నొద్దకు వారి విద్యానిపుణుండగు పౌరాణికుండు (వచ్చి) —

క. అనఘా యీ యజ్ఞము విధి
సనాథ ఋత్విక్ప్రయోగ సంపూర్ణం బ
య్యును గడచన నేరదు నడు
మన యుడుగును, భూసురోత్తమ నిమిత్తమునన్.

అనెను. ఈ వాక్యమున ప్రయోజనమునకు ప్రాతికూల్యము గలదు. ఈ పౌరాణికుడు ప్రయోజన సాధనమునకు రంగ ప్రాతి

కూల్యము సూచించెను. ఇది "వాద విద్యానిపుణుండైన" యను విశే షణమువల్ల సూహ్యము. ఋత్విక్కు లాతని మాటలను సరకుగొన రైరి. తమ ప్రయత్నములందు నూతనోత్సాహులైరి. కాగా ప్రయో జనము ప్రతికూల మార్గమున నైదవ మెట్టెక్కెను. సర్వము లగ్నిలో పడఁజొచ్చినవి. ఇంతవఱకు నన్నయ భూమియందలి చర్యను వర్ణనలో నిరూపించెను. వివిధేంద్రియ గ్రాహ్య మగునటుల నర్థముల వర్ణించు టయు. వాని నిరూపించుటయు ఇవి దృశ్యకావ్య లక్షణములు. ఈ గుణము రూపములందు, వేష భాషల వలనను, సీనులయమర్పుల వలనను, అభినయము వలనను తేటపడును. భాషామయమగు వర్ణన మున నింద్రియ గ్రాహ్యత్వము (Sensuousness) వలన తేటపడును. నభోంతిరాళమున నా యుత్తర రంగమున నప్పుడెట్టి విచిత్రములు పుట్టెనో నన్నయ యిట్లు దెల్పెను.

క. ధరణి సుర మంత్ర హోమ
స్ఫురణను వివశులయి భూరిభుజగ ప్రభు లొ
ఓ రుఁ బిలుచుచు నధిక భయా
తురులై కుండాగ్నులందు దొఁగిరి పెలుచున్.

ఇందు "ధరణీ... స్ఫురణను" "ఒండొరు బిలుచుచు" అని వర్ణించుటవల్ల శ్రోతల కావాక్యములు వినబడుచుండినట్లే యుండును. ఇది కర్ణగ్రాహ్యత్వము. "వివశులై" "అధిక భయాతురులై" "కుండాగ్నులందు దొఁగిలి" అను మాటలనుబట్టి యా పడుచుండిన పాము లేలపడినవో నేత్రగ్రాహ్యము చేసికొనవచ్చును. ఈ గుణ ములు పాములను వర్ణించిన యితర పద్యములలోఁ గూడఁ గలవు. ఎట్లనిన :—

అతివేగాకులచిత్తులై పడి దుదాత్తాశీ విషాగ్నుల్ సితా
సిత పీతారుణ వర్ణ దేహులు నవాసృగ్రక్త నేత్రుల్ మహా

న్నతు లేక త్రిక పంచ సప్త నవ నానామస్తకుల్ పల్వురు
ద్ధత నాగేంద్రులు బ్రహ్మదండ హతి నార్తి ధ్వానులై
వహ్నిలోన్.

"ఆర్తధ్వానులై" అని యున్నది. కర్ణగ్రాహ్యము కలిగిన దంత యును నేత్రగ్రాహ్యము.

తడబడ బఱియెడు రవమును
బడికాలెడు రవము గాలి పలు తెఱంగుల బ్ర
ప్పెడు రవమును దిగ్వలయముఁ
గడుకొని మ్రోయించె నురగ కాయోత్థితమై.

ఇది యంతయు కర్ణగ్రాహ్యము. ఇంకను కర్ణనేత్ర గ్రాహ్యత్వము నుదాహరించెను.

తక్షకు డతిభీతుండై
యాక్షణముని నరిగె సురగణాధిప నన్నున్
రక్షింపుము రక్షింపుము
రక్షింపుము యనుచు నప్పురందరు కడకున్.

ప్రయోజనము కథాగమనత్వరీకరణ మార్గమున సాఫల్యము జేరనున్నది. ఇది ఆఱవమెట్టు. రూపకములు ముఖ్యముగా కర్ణనేత్ర గ్రాహ్యములు. అవి కర్ణనేత్ర పేయములైనచో హృదయము నరి కట్టును. ఈ వర్ణనమువలం దిట్టి గుణము మాత్రమే గాక కార్య గమనముయొక్క త్వరితమును (Rush of action) సూచింపబడు చున్నది. నభోంతరాళమున —

అతులోర్వీసుర ముఖ్యమంత్రహుత మాహాత్మ్యంబునన్ వాసవ
చ్యుతుడై ముందర తక్షకుం డురు విషార్చుల్ దూల వాత్యారయో
ద్ధతి మద్ధూత వివర్ధితాయుత బృహద్దావాగ్ని వోలెన్ విచే
ష్టితుఁడై మేఘ పథంబునన్ దిరుగుచుండెన్ విస్మితుల్ గా జనుల్

ఇది ప్రయోజన సాధనమున నేడవమెట్టు. ఇంతలో నా స్త్రీకుడు సర్పయాగ రంగమును ప్రవేశించును. ఈతని యుద్దేశము ప్రయోజనమునకు ప్రతికూలము. సర్పయాగము నాపి తన బంధుజనంబులగు నురగుల రక్షింప నీతని యాశయము. ఇతఁడు మంచి లౌక్యుఁడు. ఆ రంగమందున్న యందఱ యనుగ్రహము వలన గాని తన యభీష్టము నెఱవేఱ నేరదని యెఱుఁగును. ప్రతికూల వాక్యము లాడినచో వాని ప్రయత్నము దృఢపడును. తనకార్యమును భగ్నమగును. వారి ప్రయత్నము నిరోధింపఁబడుటయే తన ప్రయత్నము నెఱవేఱుట. పౌరాణికుని ప్రతికూలవాక్యములవలన కథాగమనము త్వరపడినది. ఆ స్త్రీకుని వాక్యములు ప్రతికూలము లైనచో కథాగమనము (అనఁగా తక్షకుండు చావకుండ యాగ మాపఁబడుట) త్వరపడదు. కనుక నా స్త్రీకుని వాక్యములు సానుకూలములై రంగమునందలి యెల్లపాత్రల యాభిముఖ్యమును సమకూర్చుకొన వలయును. కనుక కవి నన్నయ పౌరాణికుని వాక్యములవల్ల రంగప్రాతికూల్య సూచకమగు కార్య సాధన విధానమును చూపినట్లే ఆ స్త్రీకుని స్తుతివాక్యములవల్ల రంగానుకూల్యసూచక మగు సాధన విధానమును చూపెను. ఆ స్త్రీకుఁడు "జనమేజయు నాతని యజ్ఞమహిమను, ఋత్విజులను, సదస్యులను నగ్నిభట్టారకు ననురూపవచనంబులఁ బ్రస్తుతించెను." ఈ స్తుతివాక్యములవల్ల నాతనికి రంగానుకూల్యము పూర్తిగా సమకూఱి కథా ప్రయోజనము తుదమెట్టునకు చేరిన ట్లీఘట్టముననున్న వాక్యోపవాక్యములవలన స్పష్టము.

జన :– (ఆ స్త్రీకుం జూచి) మునీంద్రా! నీ కెద్ది యిష్టంబు? దానిని యిత్తు నడుగుము.

ఆ స్త్రీ :– ఉ. మానిత సత్యవాక్య యభిమన్యుకులోద్భవ! శాంత మన్యు సంతానుఁడవై దయాభినిరతస్థితి నీవు మదీయ బంధు సంతాన

మనోజ్వరంబు పరితంబుగ నాకుఁ బ్రియంబుగా మహాత్మ్వనుత! సర్ప యాగ ముడిపింపుము కావుము సర్పసంపతిన్.

సదస్యులు :— ........................ ఇట్టి విశిష్ట విప్ర ముఖ్యునకు మహాతపోధనునకుం దగు పాత్రున కిద్ది యిచ్చినన్ ఘన మగు నక్షయంబు నగు గావున నీ ద్విజనాథుకోర్కెఁ బెంపున వ్యథ సేయఁగాఁదగదు భూవలయేశ్వర యిమ్ము నెమ్మితోన్.

తదనంతర ముపంకుని ప్రమోదనమున "సర్వజనానుమతంబుగా" సర్పయాగ మారంభించిన జనమేజయుఁడు ఆస్తీకుని "ప్రార్థనంజేసి" "సర్వ జనానుమతంబుగా" దాని నుడిగించెను. ప్రయోజనము కడతేరెను. కథాగమనము పూర్తియాయెను. భువినుండి యాస్తీకుఁడు "ఓహో తక్షక! క్రమ్మఱుము" అని "యత్యుగ్రానలపాతోన్ముఖుఁ డైన" యా తక్షకుని గ్రమ్మఱించెను.



# నన్నయ రచనలో నాటకీయత

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం

"సామతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారతసంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగాన్."

నన్నయ భారతభాగము ప్రసన్నకథాకలితార్థయుక్తికి ప్రసిద్ధము. కథాకథన శిల్పమునఁ బాటింపఁబడు ననేక ప్రక్రియలలో నాటకీయరచన మొకటి యని విమర్శకులు గుర్తించియుండిరి. శ్రవ్యకావ్యము నందు కవిగాని, కథకుఁడుగాని స్వయముగాఁ జెప్పు కథాంశమును తగ్గించి పాత్రల సంభాషణముల కధిక ప్రాధాన్యము కల్పించి, సన్నివేశమున రూపక రచనాప్రక్రియలోని వివిధాంశములను జొప్పించి రచించుట నాటకీయరచన మని విజ్ఞులు భావించుచున్నారు. భారతరచనలోఁ దిక్కనసోమయాజి యట్టి నాటకీయరచనను విరివిగాఁ బ్రయోగించె నని విమర్శకులు తలంచుచున్నారు. అది సత్యమే కాని, నన్నయభట్టారకుని రచనమును నిశితముగాఁ బరిశీలించినచో నట్టి నాటకీయశిల్పము ననుసంధింప వీలైన సన్నివేశములం దాతఁడు దానిని సామర్థ్యముతో నిర్వహించె నని తేటపడఁగలదు. అట్టి నన్నయ నాటకీయ రచనాశిల్పమును శిశుపాలవధాఘట్టము నాధారముగా నిరూపించుట యీ వ్యాసతాత్పర్యము!

ఆంధ్రమహాభారత సభాపర్వ ద్వితీయాశ్వాసారంభమున శిశుపాలవధాఘట్టమును నన్నయ 72 పద్యగద్యములందు రచించెను. ధర్మజరాజసూయాధ్వరమున శ్రీకృష్ణునిఁ బూజించు ప్రతిపాదనతో నారంభమైన యీ ఘట్టము శిశుపాలవధానంతరము యజ్ఞ సమాప్తితో ముగియుచున్నది. ఆరంభనిర్వాహణములతోఁ గూడుకొనినయీఘట్టమొక

రూపకప్రయోగమువలెఁ బాత్రల మనస్సులకు రూపుకట్టునట్లు నన్నయ రచించెను.

మహాభారతమున సభాపర్వమున కొక విశిష్టస్థానము కలదు. పాండవ కౌరవ సభలలో ప్రజ్వరిల్లిన పరస్పర ద్వేషానలము భావిభారత మహారణముగాఁ బర్యవసించినది. అందు మయసభ పాండవ వైభవమున కెత్తిన పతాక యగుటయే కాక సుయోధనావమానాగ్నిని రగిల్చిన యింధన మై భావి రణమునకు నాంది నాలపించినది. కౌరవ ద్యూతసభ పాండవలక్ష్మికి పరమశాపమై, దుర్యోధనాదుల దౌష్ట్యమునకు పతాకస్థానమై, పాండవావమానాగ్నికి నింధనమై భావిరణమునకు ప్రస్తావన నిర్వహించినది. ఇట్లు భావిభారత కథకు బీజప్రాయముగా నావహిల్లిన ఈ పర్వమునఁ బాండవ కౌరవ ద్వేషమునకు ప్రాతిపదికను గల్పించినది శిశుపాలవధ. ధర్మజుని రాజసూయము ప్రశాంతముగా ముగిసినచో నీ ఘట్టమున కథ లేదు. భావికథకు జిగి లేదు.

నన్నయ యీ ఘట్టము నుదాత్తముగాఁ జిత్రించెను. కథాస్వభావమును గాఢముగా భావించి, యందు సహజముగ భాసించు సార్థక శిల్పములను బరిపోషించుచుఁ గావ్యమును నిర్మించుట సమర్థుఁడైన కవిచేయుపని. శిశుపాలవధ కథాఘట్టమున దశరూపకములలో నొకటియైన 'వ్యాయోగము' యొక్క లక్షణము లధికముగా భాసించుచున్నవి. యుద్ధప్రాయ మగు వ్యాయోగమునఁ బురుషులు వర్తింతురు కావున దాని కా పేరు వచ్చెను. దాని లక్షణము[1] లీ కథాఘట్టమునకు సమన్వయపడుచున్నవి. ఇందు వస్తువు ప్రఖ్యాతమే. నాయకుఁడు ప్రసిద్ధుఁడే. స్త్రీపాత్రయే లేనే లేదు. ఇందు వీరరస మంగి; రౌద్ర మంగము. శిశుపాలాదుల పరుషవాక్యములతోడైన రణవిజృంభణము, భీష్మకృతధిక్కారవచనములు, భీమసహదేవుల రౌద్రోద్రేకము, శ్రీకృష్ణ పౌరుషపరాక్రమ ప్రదర్శనము, ధర్మజుని

నయనీతివర్తనము నీ ఘట్టమున బహుపురుషుల యుద్ధాభిముఖ్యమును గోచరింపఁ జేయుచున్నవి. కావున శ్రవ్యకావ్యమర్యాదలో నొదిగి యున్న వ్యాయోగముగా నీ ఘట్టము సహజస్వభావమును సంతరించు కొని యున్నది. నన్నయ యీ రహస్యమును గుర్తించి దర్శత రూప కాంగలక్షణ విస్ఫూర్తి ప్రస్ఫుట మగునట్లు రచించి తన కథాకథన కౌశలమున కొక వైశిష్ట్యమును సంతరించుకొనినాఁడు!

నాందీ ప్రయోగము సర్వరూపకసామాన్యము. "ఆశీర్నమ స్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖ" మ్మని దానికి నియమము. ఆశీర్నమస్క్రియలలో నే యొక్కటి యున్నను వస్తునిర్దేశమును మాత్రము రూపకకరచయితలు తప్పక పాటించుట పరిపాటి. అదిశబ్దము చేతను, అర్థముచేతను సూచింపఁబడవచ్చును. నన్నయ యీ యదను కనిపెట్టి సభాపర్వద్వితీయాశ్వాసారంభమున గృతిపతిని సంబోధించు పద్యమునే నాందిగాఁ దీర్చి దిద్దెను. ఇది యొక యపూర్వమైన నాటకీ యరచనా ప్రయోగము.

"శ్రీరమణీప్రియ ధర్మవి
శారద వీరావతార సౌజన్యగుణా
ధార భురనైకసుందర
వీరశ్రీరమ్య బుధవివేకనిధానా!" —సభా 2. 1.

ఇవి యన్నియు బహువ్రీహులై యన్యపదార్థ మగు రాజరా జను నర్థమును గల్పించుచున్నవి. ఈ పద్యము నన్నయ రాజరాజును సంబోధించిన దని చెప్పక యే పరితకైనను వినిపించినచో నది యతనిని సంబోధించుచుండె నని తెలియుట దుర్లభము; ఇందు రాజరాజ సంబోధనము నిమిత్తమాత్రము. కావ్యార్థసూచనము పరమప్ర యోజనము.

కథార్థసూచనమునఁ గథార్థములు సూచింపఁబడుట యొక

పద్ధతి. కావ్యపాత్రల నామములు నిర్దేశించి ముద్రాలంకారముగా నాందీ పద్యమును రచించుట మఱియొక పద్ధతి. నన్నయ రెండవ దానిని పాటించెను. ఈ కథాఘట్టమున వచ్చు నాయకపక్షవర్తులగు పాత్రలు ప్రధానముగా నేడుగురు. అందు శ్రీకృష్ణునకు పూజనీయ మగు స్థానమున్నది. కావున నాతఁడు ప్రథమగణ్యుఁడు. తరువాత ధర్మజాదు లగు పాండవులు. అపైవారికి ధర్మనిర్దేశము చేసిన కురుపితామహుఁడు. వీరిని చెప్పినచోఁ గథార్థములు సూచితములై నట్లగును. నన్నయ నాందీ పద్యరచనా సంప్రదాయము నందలి యీవిధానము నిం దనుసరించెను.

శ్రీరమణీప్రియుఁ డనఁగా రమావల్లభుఁ డైన శ్రీమహావిష్ణువు. ఇచ్చట తదవతార మూర్తియైన కృష్ణుఁడు. ధర్మవిశారదుఁ డన ధర్మచరణకోవిదుఁడైన ధర్మరాజు. వీరావతారుఁ డన భీముఁడు ధర్మ తేజమైన ధర్మజున కాతఁడు కార్యసాధనమునఁ బురుష కారసాధకుఁడు, ఉత్సాహమూర్తి, సౌజన్యగుణాధారుఁ డను సమాసమునందలి 'గుణా ధార' శబ్దార్థశక్తిచే వ్యంగ్యమగు గాంఢీవమును, దానిని ధరించు పార్థుఁడును సూచింపఁబడుచున్నారు. భువనైకసుందరుఁ డని గ్రహింప వీలగును. స్వర్గారోహణ పర్వమున నకులున కున్న సౌందర్యగర్వాతిశ యమే యతని పతనమునకుఁ గారణ మైనట్లు మనకు స్పష్టమగును. 'వీరశ్రీరమ్య' యను విశేషణ మీ కథాఘట్టమున సహదేవుని కన్వ ర్థమగుచున్నది. శిశుపాల విజృంభణముచే సంకులమైన సభను దన వీరోక్తులతో ననుశాసించి దేవతల మెప్పును వడసిన యా చిన్నవాఁడు పరాక్రమసంపదచేత నందమైనవాఁ డనుట సార్థకము. అందములో నలుకులునితో దీటైనవాఁ డయ్యును రణరంగములో నాతని కంటె రెండాకు లెక్కువ చదివినవాఁడు సహదేవుఁడు. ఇఁక 'బుధవివేకని ధానా !' యను సంబుద్ధి భీష్ముని వ్యంజించుచున్నది. బుధుఁ డనఁగా

పండితుడు. పండానామ ఆత్మ విషయకజ్ఞానః. ఆత్మజ్ఞానవేత్త బుధుఁడు. అతని వివేకము సదసద్వివేకము. సత్తు పరమాత్మ. తద్వివేకమునకు నిధానమైనవాఁడు జ్ఞాని. భీష్ముఁ డట్టి జ్ఞాని. కావుననే భావికథలో శ్రీకృష్ణుని పరమాత్మత్త్వము నాతఁడు ధర్మరాజునకు నిరూపించి చెప్పినాఁడు. ఆశ్వాసాదిపద్యమును మనము సామాన్యముగా సంత పట్టించుకొనము—అందు రసభావము లుండవుకనుక. కాని, నన్నయ రచనలో నట్టి నీరసపద్యము కూడ నాటకీయరచనా శిల్పమున నొక యనర్ఘ పద్యరత్నమై నాందీశ్లోక గౌరవముఁ గాంచఁ గలుగుచున్నది: మహాకవి సృష్టి యట్టిది

నాంద్యంతమున స్థాపకుఁడను రెండవ సూత్రధారుఁడు రంగమున ప్రవేశించి ప్రస్తావన పూర్వరంగ ప్రయోగమును నిర్వహించుట రూపక సంప్రదాయము. ప్రస్తావనలోని చివరియంశము పాత్రప్రవేశ సూచనము. నన్నయ యీయంశమును నారదపాత్రను ప్రవేశపెట్టి నిర్వహించెను. సభాపర్వ ద్వితీయాశ్వాస మీక్రింది వచనముతో నారంభ మగుచున్నది.

"అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పెనట్లు రాజ సూయ మహోత్సవంబు నొప్పను ధర్మరాజు ధర్మనిత్యతయును స్తుతి యించి నారదుండా సదంబున సకలరాజ సమూహంబును రాజలోకం బులో మనుష్యసామాన్యుం డయియున్న జగన్మాన్యు జనార్దనుం జూచి తొల్లి బ్రహ్మాదిసురగణప్రార్థితుం డయి యఖిలమహీభారావత రణార్థంబు నారాయణుండు యదువంశంబున నుదయించుటయు, నయ్యయిక్షత్త్రియ కులంబుల సురదైత్యదానవ యక్షరాక్షసగంధ ర్వాదుల యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారత రణంబునకు సంహృష్టహృదయుఁ డయి యుండునంత." —సభా. 2. 2.

మహాభారతమున నాయకుఁడు ధర్మరాజు. అతఁడు ధర్మనిర

తుఁడు. అతని ధర్మనిత్యతను నారదుఁడు మొదట స్తుతించె నని చెప్పుటచే కథానాయక ప్రశస్తిని, అంగిరస సూచనమును నన్నయ చేసెనని గ్రహింపఁదగును. అపై నవతారపురుషుఁడైన శ్రీకృష్ణుని మహత్త్వము కీర్తింపఁబడినది. అతనికిఁ బ్రత్యర్థులై యున్న రాజలోకమును. భక్తులై యున్న పార్థసమూహమును బేర్కొనఁబడినవి. కలహభోజనుఁడైన నారదుని దృష్టి సహజవిరోధ వర్గములు కలసియున్న సభపైఁ బడిన దన్నచో నచ్చట చిచ్చుపుట్టినట్లే మనము భావింపవచ్చును. ఈ కథాఘట్టమునకు సంబంధించిన తెవఁజకు శిశుపాలునితో నగు సంఘర్షణము ముఖ్యము. కాని, మహాభారతకథాదృష్టికి కురుక్షేత్ర సంగ్రామము ముఖ్యము. ఆ మహాఫలము నందుకొనుటకు నేర్పడిన కథాసోపానములలో నీ ఘట్ట మొకటి మాత్రమే. ఇట్లగుటచే ప్రస్తుత సంఘర్షణమును వ్యంగ్యముగను, భారత రణమును వాచ్యముగను నన్నయ నారదుని తలంపులో సూచ్యమగు నట్లు నిబంధించెను. ప్రస్తావ నాంగతుల్యమైన యీయంశమును నన్నయ కథాకథనముగాఁ జెప్పెను. గాని నారదుఁడు తలంచిన వాక్యముల నొక సంభాషణశిల్పమున నిబంధింపలేదు. పూర్వాంగ ప్రక్రియకును, రూపక ప్రయోగప్రక్రియకును భేదమును సూచింప నెంచి నన్నయ యట్లు వచించె నని భావింపవచ్చును.

నన్నయ యీఘట్టమున కథాకథనమును సంగ్రహముగను, సంభాషణముల నధికముగను రచించి నాటకీయత నచ్చుపడునట్లు చేసెను. ఇందు వాక్క్రియారూప సంఘర్షణములలో వాగ్రూపమైనది అధికము. శ్రీకృష్ణుఁడు శిశుపాలుని వధించినక్రియ నన్నయ యొక పద్యమున జెప్పెను. మిగిలినదంతయు ధర్మజ భీష్మ శ్రీకృష్ణాదులకును శిశుపాలునకును నడుమ జరిగిన వాగ్వివాదమే. కావున నీ ఘట్టమున సంభాషణలు దీప్తములై, శక్తివంతములై పూర్వాపరసమన్వయసంబద్ధ

ములై, సంఘర్షణను సృష్టింపఁజేయఁగలుగునట్టివిగా చిత్రించుటయందే నాటకీయ రచనాశిల్పము రాణింప వీలగుచున్నది. నన్నయ దానిని నిపుణముగా నిర్వహించెను.

నిజమున కీఘట్టమునఁ జెప్పఁగొనఁదగిన కథయే లేదు. రాజసూయము ఉత్తమ పూజతో ముగియవలెను. అట్టియుత్తముఁడు శ్రీకృష్ణుఁడని భీష్ముఁడు ప్రతిపాదించెను. ధర్మజుఁడాతనిఁబూజించెను. కార్యమంతటితో ముగియనుండగా శిశుపాలుఁడు 'శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడు కాఁ'డని యధిక్షేపించెను. అతఁడు ధర్మజునితో, భీష్మునితో వితండవాదము చేసెను. వారు యథాశక్తి నయమున భయమున నతని నోడఁబడఁ జేయ యత్నించిరి. అతఁడు సదము వెలువడి యుద్ధసన్నద్ధుఁడయ్యెను. యజ్ఞదీక్షితుఁడైన ధర్మజుఁడు పోరుసలుప వీలులేదు. పైపెచ్చాతఁడు రాజలోకము నాహ్వానించిన యజమాని. భీష్ముఁడు సమర్థుఁడే. అతనినిగూడ శిశుపాలుఁడు పడతిట్టెను. కాని, శిశుపాలిమరణము కృష్ణునిచేత వ్రాయబడి యున్నదని తెలిసినవిజ్ఞుఁడాతఁడు. అందువలన భీష్ముఁడు శ్రీకృష్ణునిమహత్త్వమును గీర్తించుటయే కాక, యతనిని శిశుపాలవధోన్ముఖునిగాఁ బురికొల్పెను. పూజగైకొన్న పురుషోత్తముఁడే తనయుత్తమత్వమును స్థాపించుకొనవలసివచ్చెను. సమయము ననుసరించి శ్రీకృష్ణుఁడే శిశుపాలుని సమయింపవలసివచ్చెను. దానితో సవనము సమాప్తమైనది. పాండవులకార్యము సఫలమైనది. ఈఘట్టమున 'శ్రీకృష్ణుఁడు పూజార్హుఁడా?' యను నంశముపై జరిగిన వాదోపవాదములే కథావిస్తృతికి మూలములైనవి. ఆవాదోపవాదము లెట్లొకదానిపై నొకటి కార్యకారణసంబద్ధములై శిశుపాలవధాకార్యమునకు దోహదములైనవో గమనించుటయే సంభాషణరచనా శిల్పమును సమీక్షించుట యగును.

కథారంభమున నన్నయ - భీష్ముఁడు ప్రశాంతుఁ డనియు,

ధర్మజుఁడు ధృతిమంతుఁ డనియు, నత్యంతధర్మమతి యనియుఁ బరిచయము చేసెను. ధర్మమతికి ప్రశాంతుని హితబోధ కలిగినది. అది ధృతిమంతమైన యుత్సాహముతో నాచరింపఁ బడినది. అత్యంతక్లిష్ట పరిస్థితులయందును జలింపని శక్తి ధృతి. అది దీప్తిమంతము కావ లయునన్నచో బంగారము పుటము పెట్టఁబడినట్లు కథలో నత్యంత సంఘర్షణమునకు గుఱియై సమర్థవంతముగా విజయము సాధింపవలెను అనఁగా శిశుపాలుని దుర్వ్యవసాయము ధర్మజునిధృతిని, ధర్మనిరతిని ప్రకాశింపఁజేయునట్లు కథలో నిబంధింపఁబడిన దని నన్నయ సూచనము. పరమశాంతుఁ డగు భీష్ముఁడు పరతత్త్వప్రతిపాదనసమర్థుఁ డని తాత్పర్యము.

మత్తకోకిల :

"స్నాతకుండును బుత్త్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు వీరిలోఁ
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టిమహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా!"
— సభా. 2-4

అని భీష్ముఁడు ధర్మజుని ప్రబోధించెను. ధర్మజుఁడు సవనమున భీష్మ ద్రోణులను 'కృతాకృతపరిజ్ఞానంబునందు' నియోగించెను. అందువలన భీష్ముఁడు కర్తవ్యము నెఱుకపఱచెను ఆ చెప్పుటలోఁ బూజార్హుఁడైన మహాత్ముని లక్షణములఁ బేర్కొని భీష్ముఁడాతని నామనిర్దేశము చేయక ధర్మజుని నిర్ణయమునకు వదలెను. ధర్మజుఁడు తాతకు దగ్గులు నేర్పఁగలిగిన చతురుఁడు. నిర్ణయము తాను చేసినచోఁ దరువాత బాధ్యుఁడు తానగును. కావున నాపాపపుణ్యములుకూడ నాతాతపైఁ ద్రోయనెంచి 'అట్టివాఁ డెవ్వండు? నా కెఱింగింపు' మని యతనినే యడిగెను. మనుమ డిచ్చుచున్న పెద్దఱికమున కన్నింటటతగిన పితా

మహుఁ డాతఁడు. అందువలన నిశ్శంకగా నఖిలలోకపూజ్యుఁ డైన నచ్యుతునిఁ బూజార్హునిగా నిర్దేశించినాఁడు. తాను తలఁచినదే తాత చెప్పినాఁడు; సహదేవుఁ డర్ఘ్యపాద్యాది పూజాద్రవ్యములు తెచ్చి నాఁడు; ధర్మజుఁడు వాసుదేవునకుఁ బూజ నిచ్చినాఁడు. శ్రీకృష్ణుఁడు కిమ్మనక పూజలు స్వీకరించినాఁడు.

శిశుపాలుఁడు గోపాలునకు బద్ధవిరోధి. భీష్ముని హితబోధయు' ధర్మజుని వర్తనము, శ్రీకృష్ణుని యంగీకార మొక్కటొక్కటి యతని చిత్తము నుడు కెక్కించినది. ఆ పూజకు కర్త ధర్మరాజు. ప్రేరకుఁడు తాత. ఫలభాక్కు గోవిందుఁడు. శిశుపాలుఁ డందువలన ధర్మజుని కేంద్రముగాఁ జేసి యీ ముగ్గుర నధిక్షేపించెను. గాంగేయుని దుర్వ్యవ సాయమునకు లోఁగి కష్టచరితుఁడైన కృష్ణునిఁ బూజించి ధర్మజుఁడు తనయవివేకమును బ్రకటించెననియు, 'దాశార్హుఁడు పూజ ర్హుఁడు' కాఁ డనియు నతని యభ్యంతరము వాది యెదుటివాని వాదమును మొదట ఖండించును. ఆపై దానియందలి యసంబద్ధములైన యంశ ముల నుటంకించి వరుసగా నధిక్షేపించును. శిశుపాలుఁ డట్టివాద కౌశల మును బ్రకటింపఁ బూనినాఁడు!

శిశుపాలుఁడు ధర్మతాత్పర్యమును బ్రతిపాదించు తలంపుతో వాదు నారంభించియు నందు వ్యక్తిదూషణమునకుఁ దావు కల్పించెను అది వాదకుశలుఁడు చేయు పని కాదు. దానికితోఁడు శిశుపాలుఁడు తనకుఁ దలకు మించిన ధర్మపన్నములు చదివి తన వివేకమును బ్రద ర్శింపఁబోయి కొన్నియెడల నా వాక్యములు తనకే తగిలివచ్చునట్లు మాటలాడి యెదుటివారి వాదమునకు బలము చేకూర్చు బలహీనతకు గుఱియైనాఁడు.

"కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యుని న్నొడఁబడ నిట్టుఁడై కలపి యుత్తము లుండఁగ వాసుదేవుఁ డ

జ్ఞడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్
వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే?"

— సభా. 2-9

భీష్ముఁడు వృద్ధుఁడే కావచ్చును. అతనిబుద్ధి వార్ధక్యమువలన చలించిపోయి యుండవచ్చును. అతఁడు విచారవిదూరుఁ డనుట, అతనిది 'వెడఁగుదన' మని వెక్కిరించుట, ధర్మజుని ధర్మబాహ్యుఁడని నిందించుట, వాసుదేవుఁడు జడుఁ డని నోటికసి దీర్చుకొనుట - శిశుపాలుని వాదపక్షపాతముకంటె నెదుటివాని నధిక్షేపించు చిత్తవృత్తిని, వాక్పారుష్యమును బట్టియిచ్చుచున్నవి. 'కడుఁగొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్య' మను సత్యమును జెప్పిన శిశుపాలుఁడు మత్సరగ్రస్తుఁడగుట విచారము. తా నన్నమాట తనకే తగిలివచ్చు నన్న వివేకము లేదతనికి! సద్ధర్మమును గాంచి అధర్మమని శంకించెడి యజ్ఞాని నోట సాక్షిప్రాయముగా నామాట ననిపించుట నన్నయచేసిన చమత్కారము. ధర్మజుని సభలో ధర్మస్థాపన మాతని యత్నము! అది యనధికారి చేతఁ బడి హాస్యాస్పద మగుచున్న దని కవి సాధించిన వ్యంగ్యము!

ఇట్లు నోటికసి తీర్చుకొని శిశుపాలుఁడు పూజార్హుఁ డగు వానికుండఁ దగు నని భీష్ముఁడు నిర్దేశించిన గుణగణములు శ్రీకృష్ణుని యందు లేవని వరుసగా ఖండింప నారంభించెను. పై మత్తకోకిలలోని గుణములన్నిఁటిలోఁ బాండవులు సమర్థించుకొనుట కత్యంత సులభమైనది శ్రీకృష్ణుఁడు వారి కిష్టుఁడై యుండుట. ఇష్టుఁ డైనంతమాత్రమున సభలో నర్హులైనవా రుండగా నతనికిఁ బూజ చేయుట పాడికాదని శిశుపాలుఁడు మొదట వాదించెను

"ఇతనికి గూర్తురేని ధన మిచ్చి రభీష్టము లైన కార్యముల్
మతి నొనరింతు రిష్టుఁ డని మంతురుగాక మహాత్ములైన భూ

పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁ డని యచ్యుతు నర్చితుఁ జేయఁ
బాడియే? —సభా. 2.10

పూజార్హుఁ డగు వాఁ డిష్టుఁడై యున్నను తగిన యర్హతలు కలవాఁడై యుండవలెను నని యీ పద్యమున శిశుపాలుఁడు నిష్కర్షించెను. ఆపైఁ దగువారి యర్హత లాయచ్యుతిని యందు లేవని వరుసగా ఖండించెను. వసుదేవాదు లుండఁగా నాతఁడు వృద్ధుఁ డనియు, ద్వైపాయనుఁ డుండ నాతఁడు ఋత్విజుఁ డనియు, ద్రోణకృపాదు లుండఁగా నాతఁ డాచార్యుఁ డనియు, భూనాథు లనేకు లుండగా యాదవుఁ డైన అతఁడు రాజనియు నెట్లు పూజించుట కర్హుఁ డయ్యెనని ప్రశ్నించెను. అట్లు నిండుసభలో ననర్హునిఁ బూజించుట ధర్మజుని పూజ్యత్వమునకును, భూమీశుల విశ్వాసమునకును గొడ్డలిపెట్టని వర్ణించెను. ధర్మజుఁ డట్టిపని చేసి సభికులైన ధారుణీశ్వరుల నవజ్ఞచేసె ననియు, నది ధర్మవిరుద్ధమనియు నధిక్షేపించెను. అంతటితో నాగక ధర్మనందనునితో—

క. "నీ వెఱుఁగక యిచ్చిన నిది
నా విషయమె యని మనంబునం దలఁపక ల
జ్జావిరహితుఁ డయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ గొను టుచితంబే?"
— సభా. 2. 13

యని ముకుందుని మొగము మొత్తున తిట్టిపోడిచెను అంతటితో తనివి దీరక —

క. "చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
త్యనుపమ సురూపదర్శన
మును జేజేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టెలన్"
—సభా. 2. 14

అని వాక్కంఠమాత్రిని దీర్చుకొనెను. నాటితో ధర్మరాజు నామము నిరర్థకమై నవ్వులపాలై పోయినదని నొవ్వఁబలుకుచు శిశుపాలుఁడు సపుత్రబలుఁడై సదము వెల్వడి పోయెను.

శిశుపాలుని అధిక్షేపమువలన కథలో రెండంశములు ప్రశ్నింపఁబడుచున్నవి. ఒకటి: శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము. రెండు: పాండవు ధర్మసర్వతము. మహాభారతమున నీరెండును పరస్పర పోషకములు. వీనిలో మొదట నిరూపింపఁబడవలసినది శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము. అప్పుడు రెండవది తనంతటతానే నిరూపిత మగును. ధర్మజుఁడీ యంశమును గుర్తించెను. సదస్యుల నాహ్వానించిన యజమానిగాఁ దనసభ్యతను వెల్లడిచేయుచు శిశుపాలునివెంట నేఁగి ధర్మనందనుఁడు ప్రియవచనములతో నాతని ననునయించినాఁడు! సమయోచిత ప్రజ్ఞాప్రదర్శనమునందు ధర్మజుఁ డందెవేసినచేయి!

ధర్మజుని అనునయవాక్యము లెంతమెత్తగా నుండునో అంత వాడిగా నుండును. మెత్తనిపులియైన ధర్మజుని లక్షణ మది. అన్ని మాట లనిన శిశుపాలునిపై మఱొక్కఁడైనచో నగ్గిపై గుగ్గిలముగా భగ్గు మనెడివాఁడు. ప్రశాంతుఁ డనిచెప్పిన భీష్ముఁడే యీ ఘట్టమున భీషణహుతాశనకీలవలె మండిపడినాఁడు. తాత కన్న మనుమఁడు ధృతిమంతుఁడని నన్నయ అందులకే నిర్దేశించినాఁడు. ధర్మజుని మాటలు సంగ్రహములు, సారవంతములు, సార్థకములు, నారసతుల్యములు.

క. "భూరిగుణోన్నతు లనఁదగు
వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణ మది విషముకంటె దహనము కంటెన్"—సభా. 2.17

శిశుపాలుని వాదనలో వాక్పారుష్యము తొలగించినచో వాక్యతాత్పర్యము మిగులును పారుష్యము భావప్రకటనమున వ్యక్తి సంస్కార

మును దెల్పును. వాక్యతాత్పర్యము వ్యక్తిసంస్కారమును దెల్పును. వాక్యతాత్పర్యము వ్యక్తి వివేకమును దెల్పును. ధర్మజుఁడు మొదట అతని సంస్కారము నెత్తి చూపించెను వాక్పారుష్య ముండకూడదని వాని కున్నచో నాతని భూరిగుణౌన్నత్యము, ధీరత్వము, ప్రభుత్వము రాణింపవని ధర్మజుని తాత్పర్యము. అనఁగా శిశుపాలునియందా మూఁడు లక్షణములు వాక్పారుష్యము వలన దూషితము లైనవని వ్యంగ్యమైన ధర్మజుని యధిక్షేపము. వాక్పారుష్యము విషము కంటెను, దహనముకంటెను మహాదారుణ మైనదని ధర్మజుని బెదరింపు. విషమువలన మూర్ఛ కలుగును, అది మంత్రతంత్రముల వలన నివారింపఁదగినది. దహన మట్టిదికాదు. నరుని నిశ్శేషనరించునది. వాక్పారుష్య మీ రెండింటి కంటె మహాభయంకర మైనదట! వాక్శక్తి యెఱిగినవాడు ధర్మజుఁడు. అందువలననే యింత తీవ్రమైన విషయమును బ్రతిపాదించుచున్నను పారుష్యము కానుపించ దాతని పలుకులలో! ఎత్తుకొనుటలోనే ప్రతివాది దోషమును నిరూపించి, యతని నప్రతిభు నొనర్చెడి వాదకౌశలము ధర్మజుఁడు ప్రదర్శించినాఁడు. ఆపైఁ దనయందు దోషము లేదని వాదించినాఁడు

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పద మైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁ డని యుక్తము కా కిది యేమి
దోసమే" —సభా. 2. 18.

ఆదిదేవుఁడైన బ్రహ్మకు ఆదియై, ఆదివాఙ్మయమైన వేదమున కాదియై త్రిలోక సృష్టికి మూలమైన వాఁడు దామోదరుఁడని పితామహుఁడు చెప్పెనఁట! 'పితామహ' శబ్దమున నీ పద్యప్రాణ మున్నది. దానికి బ్రహ్మ యనియు, భీష్ముఁ డనియు నర్థము చెప్పవచ్చును. భీష్మార్థము

ప్రకృతము. అప్రకృతార్థము వ్యంగ్యము. బ్రహ్మ చెప్పినదే తాత చెప్పెనని చమత్కారము. పూర్వప్రసిద్ధ సిద్ధాంతములఁ బ్రమాణముగాఁ జూపించి వాదమునకు బలము కల్పించుకొను నేర్పు ధర్మజుని వాక్కులయందు ధ్వనింపఁబడుచున్నది.

క. "పరమార్థ పతిభఁ దమో
హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్?" —సభా. 2.19

అన్యుతుని తత్త్వము నిరూపించుటకు పరమార్థప్రతిభ కావలెననియు, నది భీష్మునియందువలె శిశుపాలునియందు లేదని చెప్పి ప్రతివాది యజ్ఞానమును ధర్మజుఁడు బయటపెట్టుటయేకాక, "పెద్దలచరితం బల్పులకు నెఱుఁగశక్యమె యెందున్?" అను నర్థాంతరన్యాసమున తన వాక్యార్థములను సమర్థించుకొనినాఁడు. 'పిన్నలకు' అని వాడినను సరిపోవుచోట 'అల్పుల' కని వాఁడుట ధర్మజుని వాక్కులోని గూఢమైన తీక్ష్ణత !

ఇప్పటికి ధర్మజుఁడు శిశుపాలునిదోషమును, కృష్ణుని పూజార్హతను, భీష్ముని పరమార్థ ప్రతిభను వరుసగా నిరూపించినాఁడు. శిశుపాలుఁడు పూజనీయులైన పురుషులు సభలో నుండఁగా కృష్ణుఁ డెట్లు పూజ్యుఁ డయ్యె నని వాదించిన వితండవాదమునకు కీలెఱిఁగి వాత పెట్టినట్లు సమాధానము చెప్పినాఁడు.

క. "గురుఁ డని సమస్తలోకో
త్తరుఁ డని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుతు నర్చన నెడఁ
గర మభినందింప నీకుఁ గా దనఁ దగునే?" —సభా. 2. 20

పూజార్హు లని శిశుపాలుఁడు చెప్పినవారే అచ్యుతునిఁ బూజార్హుఁడని యభినందింపఁగా దనిన శిశుపాలుని వాదమునకంటె వ్యక్తిస్వభావము నందే దోషము కలదని ధర్మజుఁ డీవాక్యములవలన నిరూపించెను. అది తరువాతి భీష్ముని వాక్యములకును, శిశుపాలవధకును బోషకమై యుండుట సంభాషణక్రమవిన్యాసమునకు చక్కని యుదాహరణము.

ధర్మజుఁడు ఈపద్య చతుష్టయమునఁ బ్రతిపాదించిన అంశములు శిశుపాలుని వాదమును నిర్వీర్య మొనర్చినవి. శిశుపాలునొక యవివేకిగా నిరూపించినవి. ధర్మజుని పాత్ర యీ ఘట్టమున నిర్వహింపవలసిన పని యైపోయినది. ఇఁక నాపాత్ర యీ విషయమై మాటలాడిన చర్వితచర్వణ మగును. ధర్మజునివాక్కులలో గూఢమైన వాడిమికలదు. అది ప్రజ్వలనప్రక్రియకు తోడుపడదు. సన్నివేశమున సంఘర్షణ సృష్టింపఁబడ వలెను. యజమానివాక్కు లనునయవాక్కు లగుటచే ప్రతినాయకునియందు కోపాగ్నిని ప్రజ్వలింపఁజేయవు. అందువలన కథలో భీష్ముఁ డుద్రేకము దాల్చి శిశుపాలుని కుతుకెక్కించుమాట లనినట్లు చిత్రింపఁబడినది.

భీష్ముఁడు ధర్మజునితో ననినమాట లివి :

ఉ. "పాలితదుర్నయుండు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బుట్టువఱుపన్ మఱి ధర్ము వెలుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూత మనస్కుల కల్పరాజ్యుల
ట్లోలలనాఁధబుద్ధి కనిమిత్తమహాత్పరివాద శీలికిన్."

— సభా. 2. 22

ఎదుటివాఁడు తూలనాడినప్పుడు ఓరిమితో పరువము చెడకుండ ప్రవర్తించు నిగ్రహము ధర్మజుని కున్నంతగా భీష్మునికి లేదు. అందువలననే భారతమున తాతకన్న మనుమనికి గౌరవము. భీష్ముఁ డుపాలంభనముతో మొదలుపెట్టినాఁడు సంభాషణమును. శిశుపాలుఁడు తన సన్న

మాటల కావృద్ధసింహము క్రుద్ధమై నెమరువేసికొనుచు నెదురుదెబ్బ తీయుటకు యత్నించినది. శిశుపాలునిలో మొదట విమర్శింపఁబడినది యవినయము. దానివలన పెద్దలను దూషించువాక్పారుష్య మేర్పడినది. తరువాతివి అజ్ఞానము, అప్రౌఢత్వము. వాని వలన నాతఁడు ధర్మాధర్మవివేచనము లేని మాటలు వ్యక్తిదూషణ ప్రధానముగా మాటలాడెను. ధర్మరాజు వానిని ప్రతిమిలాడవలసిన పని లేదనుటలో శిశుపాలుని అయోగ్యత నిరూపింపఁబడినది. ఈ మాటలన్నియు పోక యెత్తు. "మఱి ధర్మ వెఱుంగ వీనికిం బోలునె..." అనువాక్య మొక యెత్తు. 'కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్య' మను అధిక్షేపమున కీవాక్యము ప్రత్యాఖ్యానము. అనిగూఢామర్షకు తాత్పర్యాణాము ధర్మ నిర్ణయ వేత్త యగు వాని కుండఁగూడని మూఁడుగుణములు శిశుపాలునియందుఁ గల వని భీష్ముఁ డధిక్షేపించెను. అవి: 1. రాగకోప దూషితమైన మనస్సు కలిగి యుండుట; 2. రాజ్య సంపదవలని మద ముచే వివేకము కోల్పోవుట 3. నిష్కారణవాదబుద్ధి. తుల్యపరిశీలనమున పతిత కీయవలక్షణములు ధర్మజునియందు లేకపోవుట యతని ఉత్తమత్వమును గ్రహించుటకు వీలుపడుచున్నది.

భీష్ముఁడు ధర్మజుని వారించి శిశుపాలునితో ముఖాముఖి వాదమునకు దిగినాఁడు. అతనివాదమంతయు శ్రీకృష్ణుని పూజార్హతను నిరూపించుటకు వెచ్చింపఁబడినది. వాదాంశ విశ్లేషణమునందును, విశిష్టాంశవివరణమునందును, తాత్పర్యాంశ ప్రతిష్ఠాపనమునందును భీష్ముడు కడుశ్రద్ధ వహించెను. 'వృద్ధులబుద్ధులు సంచలింపవే' యను శిశుపాలునితో సుసంబద్ధ తాత్పర్యములుగల వాక్యములను మాట్లాడి తన స్థిరచిత్తమును సభకు వ్యక్తము చేసికొనెను.

సభలో శ్రీకృష్ణుని పూజార్హతను ప్రతిపాదించినది భీష్ముఁడు కావున నతఁడే దానిని సమర్థించుచు మాటలాడుట సమంజసముగా

నున్నది. దానికి శిశుపాలుఁ డొడంబడునట్లు లేఁడు. ధర్మజుని నయ వాక్యముల వెంట వెలువడిన భీష్ముని వివేకవాక్యములు కూడ విఫలములైనచో కార్యము సఫలమగుట యెట్లు? కోపము వచ్చి కొలువు వీడిపోవు కొరకరాని కొయ్యపై కఱకుమాటలు, చేష్టలు పనిచేయునని భావించి సహదేవుఁడు సంక్షుభితసభ స్తంభించునట్లు భీషణ ప్రతిజ్ఞ చేసెను.

చ. "ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
నిడియెద నంచు దాఁ బరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై"

ఇది సహదేవుని సమయోచిత ప్రజ్ఞాప్రదర్శనము. దీనికి దేవతలు పూలవాన కురిపించిరి. సభికులు విస్మయావిష్టులైరి. నారదుఁ డానంద ముతోఁ జిందులు త్రొక్కెను!

కథ కిది యొక విశ్రాంతి స్థానము. నాయక పక్షమున ఆరంభ, ప్రయత్నావస్థలు స్ఫురించినవి. బీజబిందువులను అర్థప్రకృతులు సార్థకముగా ప్రయుక్తములైనవి. గర్భసంధి కున్ముఖమై యున్న యీకథాఘట్టమున ముఖసంధియందలి బీజార్థములు విచ్ఛిన్న మగు నంతటి సంఘర్షణము సృష్టింపఁబడవలెను. అందువలననే అంతటిసహదేవ ప్రతిజ్ఞను ధిక్కరించి శిశుపాలుని సేనాపతి యగు సునీథుఁడు విజృంభించినాఁడు. ప్రళయజలవలె పరవాహిను లుప్పొంగివచ్చినవి. క్రియాబహుళమైన యీ సన్నివేశమును నన్నయ రసోదంచితఛందో విన్యాసమున వ్యంగ్యము చేసెను.

చ. "రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్ఛటుల సైనికమత్స్యములన్ భయంకరం

బయి యదువృష్టిభోజకుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుతనితాంతసమీరిత మై క్షణంబునన్"
—సభా. 2. 33

ఇందలి శ్లేష సన్నివేశమునందలి సంశ్లిష్టతను, రూపకము రూపకరస ప్రక్రియను వ్యంజింపఁ జేయుచున్నవి.

ఈ సైన్య సంక్షోభమును గాంచి ధర్మజుఁడు భయసంభ్రమా క్రాంత మనస్కుఁడై తాతతో నిట్లని విన్నవించుకొనెను :

తరలము : "ధరణిలోఁ గల రాజు లెల్లను దారుణ క్షయకాల సా
గరములట్లు గలంగి రిపు మఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ బ్రజాపకారము పుట్టకుండఁగ నీవు చె
చ్చెరఁ బితామహ! వీరికిచ్చట చిత్తశాంతి యొనర్పవే!"
— సభా. 2. 35

నన్నయ కథాకథనమునఁ బ్రయోగించిన రూపకాలంకారమును ధర్మజ పాత్రముఖమున నుపమాలంకారమున నిబంధించి నాటకీయ సంభాషణ శిల్పమును పోషించెను. పై వర్ణనాత్మక పద్యమును వీడి ధర్మజునిపద్య మొక్కటి చదివికొనినను కథాప్రభావము చెడకుండ రక్షించుట యీ రచనలోని శిల్పము: తాత చెప్పిన సలహాను పాటించుట వలన ధర్మజునకు శత్రుద్వాతము నెదుర్కొనవలసి వచ్చినది. వారి నుప శాంతింపఁజేయు బాధ్యత మఱల నాతఁడా తాతపై నుంచుట లౌకిక ప్రజ్ఞావిశేషము. కథ భీష్ముని సంభాషణతో ముందుకుసాగు నని సూచన. రంగముపై ప్రదర్శనకసాధ్య మగు యుద్ధక్రీడకు బదులు వాగ్వివాదము ప్రవేశపెట్టు నవకాశ మీ ధర్మజుని వాక్యమువలన కథలో సిద్ధించుచున్నది.

భీష్ముఁడు తన బాధ్యతను నిపుణముగా శ్రీకృష్ణునిపై నుంచినాఁడు.

క. "నీ యజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా

రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్" —సభా. 2. 37

అనుటలో కథ యొక క్రొత్తమలుపునకు తిరిగినది. సవనప్రయోగభీతి కలిగిన నాయకునకు శ్రీకృష్ణుని ప్రాపు చూపి భీష్ముఁడు ప్రాప్త్యాశ యను నవస్థను గల్పించుచున్నాఁడు; శ్రీకృష్ణుఁడే సవనరక్షకుఁ డను సరికి శిశుపాలునికి మహామర్షము పొడుచుకొని వచ్చినది. శ్రీకృష్ణుని పరాక్రమము లన్నియు ప్రగల్భము లని నిరూపించుచు నిష్ఠురములకు దిగినాఁడు శిశుపాలుఁడు. స్త్రీ గోవధాపాపముల నాగోవిందుని కంట గట్టి నిండుసభలో నాతని గర్హించినాఁడు. ఆపై భీష్ముని దుర్వ్యవసాయమును దృష్టాంతరూపముగాఁ జెప్పి దుయ్యఁబట్టుటకు వృద్ధహంసోపాఖ్యానము చెప్పినాఁడు. నన్నయ శిశుపాలుఁడు 'రూక్షాక్షరవచనంబు'ల నాక్షేపించెనని వర్ణించి సంభాషణస్వభావమును వ్యంజింపఁ జేసెను.

గురునిందఁ జేయుచున్న శిశుపాలునివాక్కులు భీమునికి భీషణ క్రోధోద్రేకమును గల్గించినవి.

చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁ ద్రికూటతటి త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్"
—సభా. 2. 51

భీముఁడు శిశుపాల నిర్మూలనా భీల సంరంభంబున ముందుకురికినాఁడు భీష్ముఁడతనిని వారించి, శిశుపాలుని వృత్తాంతమంతయుఁ జెప్పి, యతఁడు శ్రీకృష్ణుని వలనఁ దప్ప నన్యులచే నసాధ్యుఁడ నని తేటపఱచెను. అట్లుకానిచో —

చ. "ఇతనికి నిట్లు నన్నుఁ జక యెగ్గులు వల్కఁగఁ బోలెఁగాక యు
ద్ధతమతి నన్ను లీతనివిధంబునఁ బల్కి మదీయచాపని
ర్గతిచటులోగ్ర మార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితు లయి పోవనేర్తురె గభీరపరాక్రమ మారుతాత్మజా!
—సభా. 2. 61.

అని యనునయించి మనుమని క్రోధోద్రేకము మాన్పెను.

కథయందు శ్రీకృష్ణుఁడే శిశుపాలుని వధింపఁ గలిగినవాఁ డను తాత్పర్య మీసంభాషణలచే స్థిరీకరించి నాటకీయతను బోషించుటతో పాటు కథలో నవమర్శసంధిని సూచించినాఁడు నన్నయ. వృద్ధహంసోపాఖ్యానమును శిశుపాలవృత్తాంతమును పాత్రసంభాషణల యందు నిబంధించుట రూపకమర్యాద.

శిశుపాలుఁడు శ్రీకృష్ణుని యుద్ధమున కాహ్వానించుటకంటె వేఱుగత్యంతరము లేనిస్థితిలోఁ బడినాఁడు. ఆతని యుద్ధాహ్వానమును మన్నించిన శ్రీకృష్ణుఁ డాతనివధార్హతను నిరూపించు దుశ్చేష్టితముల నేకరువు పెట్టినాఁడు. సమయపాలనమునకు సమయము దీరినదని సూచించినాఁడు. శిశుపాలుఁడు శ్రీకృష్ణుని మనసును మండించు మాటలనినాఁడు !

క. "నీకూర్మియు నీయలుకయు
నాకవి యేమిటికి దుర్గణప్రియ మొదలన్
నా కిచ్చిన యక్కన్యకఁ
జేకొని నీ కిట్లు వలుక సిగ్గును లేదే ?" —సభా. 2. 67

అర్ఘ్యార్హతానర్హతలచర్చతో నారంభ మైన వాదులాట అంతఃపురచరిత్రలను దడవుకొను వఱకు ముదుఱఁ జొచ్చినది. చక్రధారి యిఁక శిశుపాలునికథకు చక్రము నడ్డము వైచినాఁడు. శిశుపాలుని మొండెము నేల కొఱిగినది. తేజము విశ్వాత్మయగు కృష్ణునిలో లీనమైనది. రూపకతుల్యమైన యీసన్నివేశము నిర్వహణమున నద్భుతముగా ముగిసినది,

నన్నయ యీఘట్టమున యజ్ఞవిధానమును బేర్కొనుచు ప్రయోగశబ్దమును వాడుట గమనింపఁ దగినది !

"ముఖప్రయోగము విఘ్నముం బొరయకుండ" (సభా. 2. 35)

"జగన్నాథరక్షితంబయి రాజసూయమమహాధ్వరంబు సమాప్త సంప్రయోగం బయిన" (సభా. 2. 72)

ఈ ప్రయోగము వెనుక నాంది నుండి నిర్వహణమువఱకు సాంగముగా నిర్వహించిన తనరూపకప్రయోగ సంవిధానమును నన్నయ వ్యంగ్యముగా సూచించె ననుట కావ్యశిల్పాంశము! నన్నయ నాటకీయశిల్పప్రపంచమున నిది యొక కళారేఖ!

అ థ స్సూ చి క

1. "వ్యాయోగస్తు విధిజ్ఞైః కార్యః ప్రఖ్యాతనాయకశరీరః
అల్పస్త్రీజన యుక్తస్త్వేకాహకృతస్తథా చైవ॥
బహావస్తత్ర చ పురుషాః కవిభిః కార్యా యథా సమవకారే
న చ తత్ప్రమాణయుక్తాః కార్యా ఏకాంక ఏవాయమ్॥
న చ దివ్యనాయకకృతః కార్యో రాజర్షి నాయకనిబద్ధః
యుద్ధనియుద్ధాక (ధ) ర్షణ సంహా (ఘ) ర్ష కృతశ్చ కర్తవ్యః॥
ఏవం విధాస్తు కార్యో వ్యాయోగో దీప్త కావ్యరసయోనిః"
— భరతనాట్య శాస్త్రము. 18 అధ్యా. శ్లో. 142-145

—

# నన్నయ వచనము

## కొర్లపాటి శ్రీరామమూర్తి

శ్రీకారము చుట్టి, మంగళ శ్లోకము వ్రాసి, తెలుగు వచనమును అలరించిన వాగనుశాసనుడు నన్నయభట్టు. అంతేకాదు. తెనుగు వచనమును 'అధిక ధీయుక్తి మెయిన్' రచియించిన గాఢ ప్రతిభుడు కూడ నన్నయభట్టారకుడే.

నన్నయ వచనము నాందీవచనము. నవనీత కోమలము. కలకండ పలుకుల కలకంఠ స్వరము. సమాస కుసుమ సమాహారము. అది త్రివిధము. అసలు వచనమే త్రివిధము. సరళ వచనము, సంవాద వచనము, సమాస వచనము అని. రసోచితమైన రచనావిధానము లోని త్రిమూర్తి స్వరూపమది. అట్టి నన్నయ అంశయే అర్వాచీన వచన రచనలో అంతర్యామి.

నన్నయ రచనలో అలతి పదముల అలరింపు లేదని, జటిల దీర్ఘ సమాస జటాజూటమని కొందఱి అభిప్రాయము. అదిగాక, "నన్నయది ఆఖ్యానక శైలి. తిక్కనది నాటకీయ శైలి" అని ఒక అర్వాచీన సిద్ధాంతము. అసలు శైలి అను పదమే ఆంగ్ల భవమని అనేకుల భ్రమ. ''శైలీ రీత్యాం'' అని నానార్థ నిఘంటూక్తి. రీతి అనగా పదముల కూర్పు. ఆ కూర్పులో వృత్తుల వ్యంజనము, వృత్తులనగా అప్పటి చేష్టాదికము. అనగా రీతి అర్థవిలసనముకల శబ్ద సంయోజనము. కనుకనే, "రీతి రాత్మా కావ్యస్య" అనుట. అది వామన హృదయము. అడుగుకొలది అతిప్రపంచనము. అనగా, రసోచితమైన రచనా విధానమే రమణీయమైన రీతి అని ఫలశ్రుతి. అట్టి రీతిగా అగ్రేసరభాసమానము నన్నయభట్టు శైలి. అదొక పద్యగతమే

కాదు, గద్యగతమైనది కూడ. పద్య గద్యముల సమప్రాధాన్యము నన్నయ భారతమున కలదు. కావ్యగత వచన మది కథానుసంధాన మాత్ర ప్రయోజని కాదు. ప్రధాన కథా ప్రతిపాదన పరమావధికము. అనగా పద్యమువలె, గద్యమును అనేక స్థలముల రసవద్ఘట్ట చిత్రణ పరికరము. అపవాదము గద్యమునకువలె పద్యమునకును అవకాశము. అనంతర వచనమునకు ఆద్యప్రకృతిగ సంతరించిన నన్నయ వచన మున అధిక భాగము సరళ వచనము కలదు.

సమాస రహితమైనది సరళవచనము. అక్కడక్కడ సకృన్మాత్రముగ అల్ప సమాసకములును అవకాశము. అనగా సంస్కృతాలంకారికుల చూర్ణ, ముక్తక, చూర్ణక, గద్య ప్రభేదములు సరళ వచన సందర్భములు.

"అనావిద్ధ లలితపదం చూర్ణమ్—

అనావిద్ధాన్యదీర్ఘసమాసాని లలితాన్యనుద్ధాతాని పదాని యస్మిం స్తదనావిద్ధ లలితపదం చూర్ణమితి. యథా- 'అభ్యాసోహి కర్మణాం కౌశల మావహతి' నహి సకృన్నిపాత మాత్రేణోదబిందు రపిగ్రావణి నిమ్నతా మాదధాతి."

—కావ్యాలంకార సూత్రవృత్తి

"ఆద్యం (ముక్తకం) సమాసరహితం తుర్యం (చూర్ణకం)చాల్ప సమాసకమ్. ముక్తకం యథా-గురుర్వచసి పృథురురసి ఇత్యాది.

చూర్ణకం తథా మమ-గుణరత్నసాగర, జగదేకసాగర. కామినీ మదన, జనరంజన ఇత్యాది."

— సాహిత్యదర్పణమ్

సమాసరహితమైన సకృదల్ప సమాససహితమైన సరళ వచనము నన్నయభారతమున నవనీత కోమలము.

"ఆ ప్రదేశంబునను సరమ యను దేవశుని కొడుకు సారమేయుండను కుర్కుర కుమారుండు క్రీడార్థంబు వచ్చి, క్రుమ్మరుచున్న

నలిగి జనమేజయు తమ్ములు శ్రుతసేనుండును, భీమసేనుండును, నుగ్ర సేనుండును ననువార లా సారమేయు నడిచినది యఱచుచుం జఱచించి తమ తల్లికిం జెప్పిన నాసరమయు నతికోపాన్వితమై జనమేజయునొద్దకు వచ్చి యిట్లనియె." —ప్రథమాశ్వాసము.

ఇట్లే ఆదిపర్వమున ఆశ్వాసమునకొక ఉదాహరణము నీయ వచ్చును. నన్నయ వచనమున అలతిపదముల అలరింపు క్వాచిత్కము కాదు. సార్వత్రికము. కథాకథన సందర్భముల 'కాహళి సంధానము' నన్నయ కావ్యరచనాకౌశలము. సభాపర్వమంతట సంవాదరూప సంభాషణము. అపవాదముల అరిది కూడ అలతి పదముల ఆఖ్యానకము.

"అట్లు కౌశిక చిత్రసేనులు పరలోకగతులయిన నసహాయుండై జరాసంధుండు మగిడి మగధ పురంబునకుం జనియె నేమును వాడితోడి వైరంబు బలవంతంబైన నమ్మధుర నుండనొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతక పర్వతంబున ఘనాఘనంబుగా నిర్మించుకొని భవదాశ్రయం బున సుఖంబున్న వారము." —ప్రథమాశ్వాసము.

"ధృతరాష్ట్రుండును దానినంతయు విని కొడుకుల దుర్నయంబుల నాక నెట్టి యరిష్టంబులు పుట్టెడునోయని వగచుచు, విదురుంబిలిచి ధౌమ్య ద్రౌపదీ సహితులయిన పాండవు లెట్లు వోయిరని యడిగిన నతనికి విదురుండిట్లనియె." —ద్వితీయాశ్వాసము.

అరణ్యపర్వమున సైతము అత్యధికభాగము సంవాద వచనమే. కథాకథన సందర్భముల కాహళసంధానమే. అట ఉపాఖ్యానము లందును నన్నయ కంఠకాహళి పొసగు ముత్తెపు సరుల పోహళియే.

"ఇట్లపూర్వ స్వయంవర లబ్ధయైన దమయంతి నత్యంత విలా సంబుతో వివాహంబైన యా నలునకు నింద్రుండు వాని యజ్ఞంబుల యందు నిజ రూపంబుఁ జూపను నగ్నియు వరుణుండును వాని వలచిన చోటన యగ్నిజలంబు లుత్పాదింపను ధర్ముండు ధర్మువునంద వాని

బుద్ధి వర్తిల్లను వరంబులిచ్చి దేవలోకంబున కరుగు వారెదుర ద్వాప రంబుతోవచ్చు కలింగని యెందులకు బోయెదవని యడిగిన నింద్రాదు లకు గలి యిట్లనియె." —ద్వితీయాశ్వాసము.

"ఇట్లు ఋశ్యశృంగుం బ్రబోధించి వేశ్యాపుత్త్రి యరిగిన దాని పోయినవలనను సూచుచు ఋశ్యశృంగుం డగ్నిహోత్రంబు వేల్వక మఱచి విపరీత బుద్ధియైయున్న నంత నడవినుండి వన్యఫలంబులు గొని వచ్చి విభాండకుండు గొడుకుంజూచి యిట్లేల చింతాపరుండవై యగ్ని హోత్రంబు వేల్వక కాలాతిక్రమణంబు సేసెదవనిన దండ్రికి ఋశ్య శృంగుం డిట్లనియె." —తృతీయాశ్వాసము.

అలతిపదముల అల్లరింపు సరళవచనము. నిసర్గ రమణీయము లైన పలుకు నుడికారములు పాల వెల్లిగ, తత్సమపదములు తార హార చంద్రికలుగ నన్నయ సరళవచనము నాన్యతోదర్శనీయము. నన్నయభట్టు నందనవనములోని సరళ మాకందశాఖలకే తిక్క నాదులు అంటుకట్టిన తేలికవచనము.

రీతిపరముగా 'ఆఖ్యానక శైలి. నాటకీయ శైలి' అను పాశ్చాత్యప్రభావమువలని శైలీవివక్ష ఒక అపశ్రుతియే. అది "నన్న యది ఆఖ్యానకశైలి, తిక్కనది నాటకీయశైలి" అనుట. పాత్రప్రమే యము వచ్చినచో నన్నయశైలి నాటకీయమే అపవాదమయిన ఆఖ్యానకశైలి తిక్కనకును అతిపాతమే. అసలు పాత్రపరమైన సంభా షణ మాత్రమే నాటకీయశైలి కాదు. అగుచో భారతము ఆద్యంతము నాటకీయశైలియే. జనమేజయ వైశంపాయన పాత్ర సంభాషణమే కదా పంచమవేదము! – నాటకీయశైలి అనగా నాటకీయతాముద్రిత మైన పాత్ర సంభాషణ ప్రతిఫలనము. మఱి సంఘర్షణాత్మకమైన సంఘటనానైపథ్యము నాటకీయత. అనగా ప్రతీపకలాపముల సంవాద రూపము. అట్టి సంవాదరూప సంభాషణమే నాటకీయశైలి. అది

వస్త్వపేక్షాఫలసిద్ధి కలదేగాని, కవి ఆత్మీయతా సంబంధి కాదు. శకుంతలాదుష్యంతుల ఘట్టము నన్నయ వ్రాసినది నాటకీయము. పాండవ కౌరవ జననప్రకారము తిక్కన వ్రాసినను ఆఖ్యానకశైలియే అపరిహార్యము. నాటకీయతాముద్రిత వస్తువైన కర్ణ జననప్రకారము నన్నయ ఘంటమున నాటకీయశైలీపరకోటి.

పాత్రసంభాషణమునకు పరీక్షానికషము శ్రవ్యత. అది ఉచ్చారణాతసహజతాగుణప్రకటన యోగ్యతకల సజీవలక్షణమువలనసాధ్యము. భాస కాళిదాస భవభూతుల రూపక సంభాషణల వైభవమట్టిది. తాదృశమైన రచనయే నన్నయ వచనములోని కలకంఠ పలుకుల కల కంఠ స్వరము. నన్నయభట్టు నాటకీయ శైలి కిదొక నాటకరూపోదాహరణము. ఇందలి విసంధి ఇప్పటిది.

"కద్రువ : (వినతంజూచి) చూడవే! అల్ల—అతి ధవళంబైన అశ్వంబునందు సంపూర్ణచంద్రునందు నల్లయైయున్నది.

వినత : (నగి) నీ వే కన్నులం జూచి శేయక్క?—ఎక్కడిదినల్ల? ఈ అశ్వరాజుమూర్తిమహాపురుషు కీర్తియుంబలె, అతినిర్మలంబై యొప్పుచున్నది.

* * *

(పన్నిదంబు సజచిన)

వినత : అయ్యశ్వంబు డాసి చూతము రమ్ము.

కద్రువ : ఇప్పుడు ప్రొద్దులేదు; రేపకడచూతము."

ఆకృతికూడ అమరినది. అచ్చ మిద్దఱు స్త్రీల అతి సహజమైన సంభాషణమున కిది దర్పణప్రతిఫలనము. ఈసహజతాగుణమే సంభాషణకు సజీవలక్షణము. సజీవలక్షణ సముజ్జ్వలమైన సంభాషణకు అచ్చపు సంఘర్షణ అంతరవేదిక యైనచో నది సమగ్రమైన నాటకీయశైలి. అనగా ప్రతీపకలాపము ప్రతీయమానముగా సంభాషణాంతర్గతము

కావలెను. సంఘర్షణ ప్రాతిపదికపై సంభాషణల విజృంభణ మొక శిల్పమే కాదు. ప్రతీయమాన ప్రతీపకలాప నిరూపక నిర్మాణ మార్మికతయే శిఖరశేఖరమైన శిల్పరచనము. అట్టిదీ నన్నయ వచనము. ఇట, కద్రువ 'సంపూర్ణచంద్రునందు' అన్నది. వినత 'మహాపురుషుని కీర్తి' అన్నది. ఆ రెండు మాటలలో కలదు ఆంతరమైన సంఘర్షణ. సాధారణముగా 'కీర్తి' ఉపమేయము. 'చంద్రకాంతి' ఉపమానము. కద్రువ ఉపమానములో 'జాగ్రత్త' పడినది. అయినప్పటికి అ ఉపమానమునకు ప్రసిద్ధమైన ఉపమేయమై, అది మఱల ఉపమానములోని దోషము లేని ఉపమేయమైన, మహాపురుషుని కీర్తిని ఉపమానము చేసికొన్నది వినత. ఆ చేసికొనుటలో నున్నది ఆమె సోల్లుంఠనము అనగా నది ఆంతర ప్రవృత్తి. వినత గడుసరి. కద్రువ తెలివైనది. వెంటనే పందెము సఱచినది. అశ్వము తెలుపునలుపుల చర్చను ఆకద్రూవినతల ఆంతర విజిగీషాహేతువైన సాపత్న్యమిట ప్రతీయమానము.అది సంఘర్షణాత్మకమైన నైపథ్యసంఘటనము. సంభాషణగతమైన సంఘర్షణ గ్రథన మిది 'ఉదాత్తరసాన్విత' మైన నాటకీయశైలి. వినత నగి అనుటలో నొకవిశిష్టత. ఆంతరప్రవృత్తి ఆంగిక చేష్ట, ఆంతర సంఘర్షణ. సజీవసంభాషణ కలదే అసలైన నాటకీయశైలి.

ఆంతరమైన సంఘర్షణలేని బాహిరమైన సంఘటన బాహాటము. అట్టి సంఘటనలోని సంభాషణలును నాటకీయ ధోరణులు. అవికూడ నన్నయకు అమ్నాతపూర్వములు.

బ్రాహ్మణుడు : పెద్దకాలంబునకు ఈయిలు వగుస నేడు మాకు వచ్చిన, ఇచ్చిఱుతవాని, నారాక్షసునకు భక్ష్యంబుగాబుచ్చపోవను: ఏన పోయెదను.

కుంతి : అయ్యా ! దీనికి సంతాపింప వలవదు. ఈయాపద దలుగునట్టి యుపాయంబుగంటె. నీకుంగొడు కొక్కరుండ, వాడును గడు

బాలుండు. బలిగొనపోవ సర్వాంచుగాదు. ఏవ్వరు కొడుకులు కలరు. వార లలో నొక్కరుండా రక్కసునకు భవదర్థంబుగా బలిగొనిపోయెదను.

బ్రాహ్మ : (చెవులు మూసికొని)........

సజీవమైన సంభాషణలే కదా !— పై వచనమున "అని దుఃఖించి" అని కలదు. అది స్పష్టార్థ ప్రతిపత్తికి. అనగా రంగసూచన వంటిది. అన్న తర్వాత ఆదుఃఖము కాదు; సంభాషణలోనే ఆదుఃఖము సమ్మిళితము. 'పెద్దకాలంబునకు' అనుమాటలోనే ఒక ఆశ్వాసనము. 'మాకువచ్చిన' అను మాటలోని అవస్థ మానగాఢ్యము. అస మాపక క్రియా ప్రయోజన మది. 'ఏన పోయెదను' అనుచోట అవ ధారణార్థకము హృదయవిదళనసహము. అట్లే కుంతి అవస్థ.ఆమె ఎంత దానవీరయైనను, అపత్య పరిత్యజనమొక అవస్థయే తదవస్థా ప్రకట నార్థము ఆమె సంభాషణకు వచనరచన విశ్లథ రూపము. అనిచెప్పి ప్రతిజ్ఞ అనైచ్ఛికముకాదు. కనుకనే ఆమాట ఏకధాటీవచనము. 'భవదర్థంబుగా' అను బరువైన సంస్కృతపద సంయుక్తాక్షర సంక లనము సతోద్ఘాటన సహకారి. ఆరెండు పాత్రల మనస్థితికి, ఈరెండు సంభాషణలు రెండు మణిదర్పణములు. అట్టిరచనము నాటకీయశైలి. అది 'ఉచ్చారణదక్షుడగు వానిచేత అభిహితంబు' కావలసినది. అట్టి నాటకీయశైలి ఆద్యంతము నన్నయ పద్యముల, గద్యముల అణిము త్యాల హారము. నాటకీయశైలి గౌణమనుట గౌరవ దూరము. సర్వాంధ్రకవి సమాజము నన్నయ గురు పీఠమునకు నతశీర్ష నమ స్కృతము.

కతిపయాక్షర పరిమితమైన అల్పసమాసము, క్రాంతముద్రాక పదద్రాఘిష్ఠ ధారావాహికమైన దీర్ఘసమాసము, ధ్వన్యుపస్కారకము లగు ధన్యజీవులని ఆనందవర్ధన మతము. ప్రతీయమానమగు అర్థమే సమాస ప్రయోజనము. 'మహాసముద్ర' మనునది మామూలు పదము.

ఒక మహాసముద్రమును ఒకరికి తెలియజేయుటకు ఉచ్చారణలో ఒత్తి పలుకుట, దీర్ఘము తీయుట మానవసహజము. ప్రయత్నమది సముద్ర పరిణాహ గాంభీర్యాది గుణ ప్రకటనార్థము. ఉచ్చారణలోని ఊనిక, దీర్ఘము అర్థపూర్తిక ఆకాంక్ష. అది రచనకు అలభ్యము. అందుచేత, ఉదాత్త స్వరానుకూలమైన దీర్ఘద్విత్వ సంయుక్తాక్షర పౌనఃపున్యము తోడి దీర్ఘ సమాసరచన మొక శిల్పలాఘవము. "కరిమకర నికరా ఘాతజాతివాతోద్ధూత తుంగ తరంగాగ్ర సముచ్చలజ్జలకణాసారచ్ఛ టాచ్ఛాదిత గగనతలంబైన దాని" అని మహాసముద్రమునకే ఒక సమాసవచనము నన్నయ రచనము. సరిగాచూచిన తరంగ సంచల నమే ఈ సమాస రచనలో మూర్తి కట్టును. ఆ సముద్రము ఆకాశ మంత విశాల మనుటకు వలయు ఆంగిక వికారమంతయు అక్షరగతము. ఉచ్చారణలోని ఊనిక, స్వరగానములకు, ఈ ద్విత్వ సంయుక్త దీర్ఘా క్షర సంధానము. దీర్ఘము తీయకుండగనే, దీర్ఘ సమాసమిది తదర్థ ద్యోతకము. అనేక దశలలోని అనేక విధములైన ఔచ్చారణాద్యనేక సహజాంశములకు వ్యంజకమైనట్టి సమాసమే శమాసము. అర్థవంతము కాని ఆకాశ పదయానము అనవసరాడంబర వాగ్వ్యయము. సార్థక మైన, సావధికమైన సమాస రచనము నన్నయ్య వచనమందలి వైభ వము. నన్నయ ప్రతి సమాసము ప్రత్యేకార్థ ప్రతిఫలకమైన రత్న ఫలకము.

మఱొక సమాసము: "అవిరళగళిత నయనోదక బిందుసందోహ పరిపీడ్యమాన పీనస్తన పరిధానాంతర–" ద్రౌపది సభకు వచ్చిన సందర్భములోని సమాస మిది ఆమె అథోనీవి. ఏకవస్త్ర ఆస్థితిలో కౌరవేశ్వరుసికడకు ద్యూతపణముగా సభలోనికి రావలసినదిగా ప్రాతి కామి పిలుపు!– ఎవరు ముందోడినదని ఎట్లో ద్రౌపది వేసినది ఎదురు ప్రశ్న. సందిగ్ధమయిన సమ్యకు అందఱి సన్నిధినే అవధానమని మఱల

ఆహ్వానము! దుర్యోధను దుశ్చేష్టిత మది భయజనకము. (కెఱచి) తదవస్థ. శోక పరితాప దందహ్యమాన గాహ్ని మధ్యము. పైగా ఆ స్థితిలో సభాప్రవేశము లజ్జావహము. ఏవంవిధ భయ శోక బాధా మయ లజ్జాభావ శబలతా హృదయభారమున కీ సమాస బంధనము. అనగా నది మనస్థితికి అచ్చపు మణిదర్పణము.

అతి దీర్ఘ సమాసములకంటె, అల్పసమాసములే నన్నయ వచనములో అధికము. అవికూడ అలతి పదముల అలరింపుతోడి అను సంధానములు. సంస్కృతాంధ్ర సమ్మిశ్రణ మది వర్ణనస్థలములందే వైభవోద్దిష్టములు. ఆ వర్ణన స్థలములును అరుదు.

1. కుమారాస్త్ర విద్యా సందర్శనరంగ వర్ణన. (ఆ. ప. ష. ఆ. 5)
2. వారణావత వర్ణన. (ఆ ప. ష. ఆ. 132)
3. ద్రౌపదీ వివాహమండప వర్ణన. (ఆ. ప. స. ఆ. 231)
4. యుధిష్ఠిరద్యూత పరాజయ వర్ణన. (స. ప. ద్వి. ఆ. 177)
5. ద్వారవతీ వర్ణన. (అర. ప. ప్ర. ఆ. 153)
6. ద్వైతవన వర్ణన. (అర. ప. ప్ర. ఆ. 201)
7. ఊర్వశి ఉద్దీపన విభావ వర్ణన. (అర. ప. ద్వి. ఆ. 347)
8. హిమవత్పర్వత వర్ణన. (అర. తృ. ఆ. 77)

అసలు వర్ణనలు అతి ప్రగల్భములు. ప్రగల్భతకు అక్షరరమ్యత వస్తు సౌందర్య వ్యంజనమునకు శబ్ద సౌందర్యరంజనము రచనాశిల్పము.

కుమారాస్త్ర విద్యా సందర్శన రంగవర్ణన :

"అనిన నట్లచేయుదునని ధృతరాష్ట్రుండు కుమారుల విద్యా సందర్శన రంగంబు రమ్యంబుగా జేయింపుమని విదురుంబంచిన నతండు వల్లెయని శాస్త్ర విహిత ప్రమాణోపేత వృత్తాయామంబును నపాకృత వృక్షగుల్మ వల్మీకి వల్లీకంబును నంగీకృత పూర్వోత్తర

ప్లవంబును సమీకృత సమోన్నత ప్రదేశంబును దూరీకృత కంటక పాషాణశల్య శకలంబును విరజీ (ళీ) కృత రజోధూసర స్థలంబును విరచిత బహువిధ ప్రేక్షాగారమంచక ప్రపంచంబును నానాధ్వజ నవ పల్లవతోరణ చందనమాలాలంకృత ద్వారదేశం బును ప్రతిదిశనిర్వర్తిత శాంతికబలి విధానంబునుంగా జేయించి నం బంచాంగశుద్ధదిన శుభముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాంధారీ పురస్కృత దేవీ శతపరివృతుండై వివిధ భూషణ భూషితానేక విలా సినీనివహసంబుతో జనుదెంచి విలంబిత కదంబక స్థూలముక్తాఫలదామ రమణీయంబై యూబద్ధమరకత వజ్రవైడూర్య పద్మరాగ ప్రవాళ ప్రభా ప్రకర వ్యతికర విరచితాపూర్వసుర చాప చారు గౌరవంబై యతి మనోహరంబైన శాతకుంభ మయ ప్రేక్షాగారంబున నున్న..."

ఇది నాగరకులైన నవీనకుమారుల క్రీడారంగమునకు చూడా రత్నము కదా! రాజమహేంద్రవరము నేటికిని క్రీడారంగ కేంద్రమే! మఱి నాడు రాజరాజరాజనరేంద్రుని సమక్షమున ఆ ధ్ర యువకుల కందుక క్రీడగాక, కార్ముకక్రీడ నన్నయభట్టు స్వయముగా సందర్శిం చిన సందర్భమేమో!— నేటి తెలుగు వీరుల బంతియాటకును.— పొడవు వెడల్పుల లెక్క, సమతలముచేయుట, రాయి రప్ప లేరుట, ముల్లు ముట్ట తీయుట, దుమ్ము ధూళి తొలగించుట, ప్రేక్షకులకు ప్రత్యేకా సనములు, నిలువుజీతములు, రత్నమాలికలు లేకపోయినను రంగుజెం డాల పేలికలును— తప్పనిసరి తతంగమే కదా! అయినను కుమారాస్త్ర విద్యా సందర్శన రంగమున, మరకతమాణిక్యాది రత్నప్రభలు,ఇంద్ర ధనస్సు లగుట ఇప్పటి వారికి అతిశయోక్తి! అది కాలదోషము. దృష్టి దోషము కూడ. ఇంతకు వర్ణనములు ఇంతింతలో, అంతంతలో వాస్తవ ప్రకృతి కలది. ఆంధ్ర సారస్వతమున వర్ణనాగతమైన సమాస వచన మునకు ఆద్యప్రకృతి కాదంబరీవచన సమాసవల్లనము.

"తస్మిన్నపి చలతి చటుల తురంగబల ముఖర ఖురరవ బధిరీ కృత భువనాంతరాళా బలభరప్రచల వసుధాతల దోలాయమాన గిర

యోగళన్మదాంధ గంధ గజదాన దారాంధకారాః సంసర్పదతి బహుళ ధూళిపటల ధూసరిత సింధవః ప్రచలపదాతి బల కలకలస్ఫాటిత కర్ణవివరాః సరభసోద్ఘుష్యమాణ జయ శబ్దనిరంతరాః ప్రోద్ధూయమాన ధవళ చామర సహస్ర సంఛాదితాః పుంజిత నరేంద్ర బృంద కనక దండాతపత్ర సంఘట్ట నష్ట దివసాః దశదిశో బభూవుః"

ఈదృశమైన సమాస వచనము ఉత్కలికా ప్రాయమని సంస్కృతాలంకారికుల ప్రతిపాదనము.

ఇక వృత్తగంధివచనము. ఇది లాక్షణికుల వచన భేదవర్గీకరణమున ఇతోధిక విశేషము "పద్య భాగవద్వృత్తగంధి" అని వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలోని లక్షణము "వృత్తభాగయుతం పరమ్" అని విశ్వనాథుని సాహిత్య దర్పణమునందలి లక్షణము. అనగా "పద్యభాగవత్" అను స్థలమున మతుప్ప్రత్యయార్థము స్పష్టము. "వృత్త భాగయుతం" అను లక్షణము తెదుపజాలకము. కాగా పద్య భాగములతో కూడిన వచనము వృత్తగంధి వచనమని సులభ గ్రాహ్యము.* వృత్తగంధి లక్ష్యము లివికూడ స్పష్టము.

"(యథా-) పాతాల తాలు తలవాసిషు దానవేషు" ఇతి. అత్ర హి వసంతతిలకాఖ్యస్య వృత్తస్య భాగః ప్రత్యభిజ్ఞాయతే.

— కావ్యాలంకార సూత్రవృత్తి.

(యథా మమ-) సమరకండూల నిబిడ భుజాదండ కుండలీకృత కోదండ శింజినీటంకారోజ్జాగరిత వైరినగర - ఇత్యాది.

అత్ర 'కుండలీకృత వేదండ' ఇత్యనుష్టుబ్వృత్తస్య పాదః. 'సమర కండూల' ఇతి చ ప్రథమాక్షర ద్వయరహిత స్తథైవ పాదః.

— సాహిత్య దర్పణమ్.

మఱి నన్నయ వచన మధ్యమున యతిమైత్రికల తేటగీతిపాదముతో కూడిన వృత్తగంధి వచన మిది :

"వ. అని ధృష్టద్యుమ్నుండు మూగిన రాజపుత్త్రులకు నెల్ల నెఱుంగం జెప్పి ద్రుపద రాజపుత్త్రిం జూచి యఖిల జలధివేలావలయిత మహీతలంబునం గల రాజనందనులెల్ల నీ స్వయంవరంబునకు వచ్చిన వారు....." (ఆ. ప. స. ఆ. 170)

అఖిల| జలధివే| లావల| యవల| యితమహీత| లంబునం| గలరాజ|

ఇట్లు వచనాంతమున కల వృత్తగంధి—

"అరయు | చున్నంత | ననతిదూ | రంబున..."

(ఆ. ప. ష. ఆ. 71)

ఇది యతిమైత్రికల సీసపద్యము మొదిపాదము.

ఇక వచనాదిని కల వృత్తగంధి —

"కావున| సర్వప్ర| కారంబు| లనపకా| ర..."

ఇదికూడ యతిమైత్రికల సీసపద్యము మొది పాదము. ఇట్లు నన్నయ వచనముయొక్క ఎత్తుగడ అక్కడక్కడ పద్యముయొక్క ఎత్తుగడవలె నుండుట కలదు.

"అంత| దౌష్యంతి| సంతాన..." (ఆ. ప చ. ఆ. 115)
ఇది తేటగీతి ఎత్తుగడ.

"రణరం| గంబున| ద్రోణు..." (ఆ. ప. స. ఆ. 8)
ఇది మత్తేభము ఎత్తుగడ.

ఇట్లు ఎత్తుగడ పద్యపాద భాగమాత్రముగాక పద్యపాదమే కల స్థలములును క్వాచిత్కములు. కాని ఆయా పద్యపాదముల యతి మైత్రిలేదు.

"ఏను| ధర్మప| థంబున| నున్న| వాఁడ" (ఆ. ప. స. ఆ.112)

మొత్తముమీద నన్నయభట్టు వచన భాగములందు వృత్త గంధి వచనము బహువిధ భాసమానము. ఇట నొక విశేషము.

"అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె."

ఇది వచనము. వట్టి వచనము. పొడిపొడి మాటల పోడిమిలేని వచనము. ఈ వచనమునకు పరిచిత జాత్యుపజాతి వృత్త లక్షణము పట్టించుట దుర్ఘటము. అలతిమాత్సైన గణమాత్ర పరిగణనమున ఇది పెక్కు అపరిచిత పద్యపాదములగుట అవకాశము. ఎట్లన,

"అనిన। వినిజ। నమేజ"

ఇది ప్రభాతవృత్తపాదము, "నజజరగ."

"అనిన। వినన్ జ। నమేజ। యుడున్వై."

ఇది తోదక వృత్తపాదము. "నజజయ"—ఇట్లు ప్రతివాక్యము పద్యభాగ విలసితమగుట పరమావకాశము. కనుక గణసంఖ్య కంటె గమనవైఖరి ముఖ్యము.

"అదియును నంబరంబున నగ్నికణంబులు చెదరం
బఱతెంచి పక్షిరాజు పక్షంబులు దాక వచ్చినంజూచి"

(ఆ. ప. ద్వి. ఆ. 108)

పద్యగమన మిట ప్రతీయమానము. వృత్తమువలె వాసించు నది. వృత్తగంధి వచనము అను వ్యుత్పత్త్యర్థమున కిది అనుకూలము. ఈదృశమైన వచనము నన్నయవచనమున సమధికము.

సమష్టిపై నన్నయవచనము కావ్య సౌందర్య రచనము. అలతి పదముల అలరింపు, సంవాదరూప సంభాషణము. రసోచితమైన రచనము తెనుగు వచనమునకు తెలివేకువ. ఆంధ్రవాఙ్మయ సుప్రభాతమున అవతారమూర్తి నన్నయభట్టు. అనంతరకవులకు ఆరాధ్యమైన

అతిత్యహృదయము నన్నయభట్టు వచనము. నన్నయభట్టు సమాస రచనమునకు నాటివ్యవహారము నాట్యశాల అందు చతుర్ముఖ శృంగా టక చరితార్థమైన గీర్వాణ వాణికే. మఱి, రంగపూజ. ఆంధ్రవచన సాహిత్య సంగీత భంగీమధుర ఫణితికి ఆద్యమహర్షి వాగనుశాసనుడే. ఆ వాగనుశాసనునికాలము పదునొకండవ శతాబ్ది. పదునొకండవ శతా బ్దిని వచన వాఙ్మయదశ నందినది. వైశారద్యము నొందినది. వైవి ధ్యము పొందినది. అనంతర వచన వాఙ్మయమునకు అధ్యాపక వాణియు అయినది. సరళ, సంవాద, సమాస వచన సామ్రాజ్యమది సమగ్రవైభవము, పరిత్యగ్ర ప్రాభవముల ప్రఫుల్ల నందనము. "వచనరచనకు దండ్రిఁబుట్టివాడు నన్నయభట్టు" అను డాక్టర్ కట్ట మంచి రామలింగారెడ్డిగారి కతపత్రము (కవిత్వతత్త్వవిచారము, పుట 195) ఆంధ్రసరస్వతి అందలమున అనర్ఘ రత్న ముకురము.

అ థ సూ చి క

* సులభగ్రాహ్యమైన అర్థమిది. "పద్య పాదభాగముల కలయి కతో వృత్తముల హాసన దోపించుచుండు వచన రచనము వృత్త గంధి...... వృత్తభాగములతో గూడుకొన్నట్టిది." అని కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు స్పష్టపరచిన సంగతియే. (సింహావలోక కనము. పుటలు 87, 88.) అయినను వృత్తగంధి వచనము అనగా, "పద్యభాగములతో ప్రారంభమై, వృత్తములని తోపింపజేయు గద్య రచన" అని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయము. (ఆంధ్ర వచన వాఙ్మయము. పుట, 4.) మరి. "పద్యభాగవత్"అను స్థలమున మతుప్ప్రత్యయమునకు "ప్రారంభమై" అను వేంకటరావుగారి "లాక్ష ణిక సంప్రదాయార్థము" నకు వారి గ్రంథాంతర లక్ష్యసమన్వయ మిది కూడ గమనార్హము. "నన్నయ వచనమును ప్రారంభించు పట్టుల

పద్యమువలెనే నడిపించును...." (తెనుగు కవుల చరిత్ర–పుట 120–123) మరి, నన్నయ వచనమును "ప్రారంభించు పట్టుల" సర్వత్రి "పద్యమువలె నడిపించ" లేదు. "ప్రారంభించని పట్టుల" అనగా వచన మధ్యమున, వచనాంతమున "పద్యమువలె నడిపించక"పో లేదు. అయినను మరి అట్లు భ్రాంతిపడి ఇట్లు లక్ష్యలక్షణ సమన్వయము చేయుటే గాక, ఏతదర్థమునకు నన్నయ భారతమును "నన్నయనాటి లిపిరీతిని, నుచ్చారణరీతిని ముద్రింప" వలెనని నిడుదవోలు వేంకటరావుగారు నిర్ణయించుట ఎట్టిదో సాహిత్యవేత్తలు సమాలోచింతురుగాక !

—o—

# నన్నయ వచన రచన

## శ్రీ క్రొవ్విడి రామం

'గద్యం కవీనాంనికషం వదంతి' అనే సూక్తి, కావ్యకళలో గద్యానికిగల ప్రాధాన్యాన్ని తెలియజేస్తుంది. కాదంబరి వంటి గద్య కావ్యాలు, గీర్వాణభాషలో ప్రభవించిన ఆణిముత్యాలు, రాజరాజ నరేంద్రుడు, 'అపార శబ్దశాస్త్ర పారగులైన వైయ్యాకరణులును, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులును, మృదుమధుర, రసభావ భాసుర. నవార్థవచన రచనా విశారదులైన మహాకవులును...ఆదిగాగల విద్వజ్జనంబులు, పరివేష్టించి కొలువ, తన కులబ్రాహ్మణుడైన నన్నపార్యునితో భారతాన్ని గురించి ముచ్చటించినట్లు భారతావతారికలో వుంది.

ఆ కొలువులో వైయ్యాకరణులు, పౌరాణికులు, తార్కికులు, వచన రచనా విశారదులైన మహాకవులు వుండేవారు, అందుచేత ఆనాడు వచన రచనచేసే కవులకు ప్రముఖస్థానం వుండేదని మనం ఊహించవచ్చును. వారిని మహాకవుల కోవలో చేర్చడమేకాక, కేవలం పద్యకవితను చెప్పేవారిగురించి, ప్రాముకపోవడం గమనార్హం.

గద్యాన్ని నన్నయ ఏఏ ప్రయోజనాలకోసం వినియోగించేడో ఆయన గద్యరచనకు జిలుగుదిద్ది మెరుగుపెట్టి భారతంలో ఏవిధంగా, రచన సాగించాడో, నాటి వాడుకభాషకు లేక శాసనభాషకు, భారతంలో గల, వచనానికి ఏలాంటి సంబంధం వుందో కూలంకషంగా పండితులు పరిశీలించిననాడు నన్నయ గద్యరచనలోగల విశిష్టత, సువ్యక్తమాతుంది.

వేంగీ దేశానికి నాయకరత్నమైన రాజమహేంద్రవరంలో, పరమానందంతో, మహామహీరాజ్య సుఖాల్ని అనుభవిస్తున్న రాజ రాజ నరేంద్రుడు, ప్రవర్థమాన మహామహీరాజ్య విభవుండనిన్నీ, నిజ భుజ విక్రమ విజితారాతి రాజనివహుండనిన్నీ, నానా గుణరత్న

రత్నాకరుడనిన్నీ, నన్నయ వచనంలో కృతిపతిని కీర్తించి, కొలువు కూటాన్ని వర్ణించేడు.పర్వానుక్రమణిక, పర్వసంగ్రహం,వచనంలోనే వున్నాయి.

శతపర్వసంఖ్యగల సంస్కృత భారతాన్ని తాను ఏవిధంగా 18 పర్వాలుగా విభజించేడో, పర్వసంగ్రహ శీర్షికలో నివేదించేడు. ఉదాహరణకు, "మరియు, మహారణ్యంబునందు కిమ్మీరవధయును, గృష్ణపాంచాలా గమనంబును, సౌంభకాఖ్యానంబును" అని అరణ్యపర్వంలో గల యితర వివరాలను, గద్యలో విపులంగా పేర్కొన్నాడు. కొసను కంద పద్యంలో-

కం. అరణ్య పర్వమనగా నారణ్య ప్రముఖ షోడశాంతః పర్వా
ధారమయి సకల సూరి సభారమ్యంబగు తృతీయ పర్వము
వెలయున్

అని చెప్పి తిరిగి విరాటపర్వ వివరణ గద్యతో ప్రారంభించేడు. సంస్కృత భారతంలో షోడశాంతః పర్వాధారమైన గాథను, తెనుగులో ఒక్క పర్వంగా సంఘటితం చేసేడు. అతివ్యాప్తి, అవ్యాప్తి దోషాలను పరిహరించి, యథార్థంగా విషయవివరణ చెయ్యడానికి నన్నయ గద్యను చక్కగా చేపట్టేడనిన్నీ, యావత్తు మహాభారతం సారాన్ని (Synopsio) పర్వసంగ్రహ శీర్షికద్వారా నిరూపించేడనిన్నీ అవగత మౌతుంది.

కొన్ని అపూర్వ విషయాలు కూడా గద్యలవల్ల మనకు తెలిసేయి. కృష్ణద్వైపాయనుడు మూడుసంవత్సరాలలో సంస్కృత భారతాన్ని రచించేడనిన్నీ దానిని దేవలోకంలో ప్రచారం చెయ్యడానికి నారదుడిన్నీ, పితృలోక ప్రచారానికి దేవలుడిన్నీ, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస, లోకాల్లో ప్రచారం నిమిత్తం, శుకుడిన్నీ, నాగలోకానికి సుమంతుడిన్నీ మనుష్యలోకానికి వైశంపాయనుడిన్నీ పంపేడని గద్యలోనే, నన్నయ, వెలువరించేడు. భారతంలో గద్యఖండికల సంఖ్య

కన్న పద్యాల సంఖ్య ఎక్కువే. పద్యాలలోగల భావోద్వేగం, రామణీయకమైన శైలి, రసస్ఫూర్తి గద్యంలో లేకపోవచ్చు. కాని గద్య రచనలో కూడ వైశిష్ట్యం లేకపోలేదు.

పరిశీలన నిమిత్తం నన్నయ గద్యాన్ని అనుసంధాన గద్యము (Link prose), విషయ వివరణ నిమిత్తం రచించిన గద్యము, (Narrative prose) వర్ణనకోసం ఉపయోగపడే గద్యము, (Descriptive prose) అలంకార శోభితమైన గద్యము, (artiatic prose) గద్యశైలి (prose style) అని ఐదువిధాలుగా విభజించవచ్చును. గద్యశైలిని పరిశీలించినప్పుడే నన్నయ వచనంలో ప్రయోగించిన భాషకు, నాటి నాడుక భాషకు లేదా శాసనభాషకుగల సంబంధము మొదలైన విషయాలు చర్చకు వస్తాయి. ఈ బృహత్తర కార్యాన్ని యమ్. ఫిల్. పట్టాను ఆపేక్షించే పధీశాలో సమర్థవంతంగా చెయ్యగలడు. పురానా పెద్దలుచేసే విందులో వడ్డనచేసే పదార్థాలపై మోజు పెంచడంకోసం ముందుగా, ఏప్పిటైజర్' అనే ద్రవపదార్థాన్ని గాని ఒక మాత్రనుగాని యిస్తారట. అదేవిధంగా నన్నయ గద్య రచనపై అభిరుచిని పెంచడానికి రెండు అశ్వాసాలు మాత్రమేగల సభాపర్వాన్ని గ్రహించి, దానిలోగల గద్యను స్థాలీపులాకన్యాయంగా స్పృశిస్తాను.

రాజసూయానికి ఏర్పాటు చేసిన యజ్ఞ వేదికను కన్నులకు కట్టినట్టు గద్యలో నన్నయ యెలా వర్ణించేడో చూడండి. Descriptive prose కి చక్కని మచ్చుతునక-

'అంత ననంత వేదమూర్తులైన పైల, ధౌమ్యులు హోతలుగా యాజ్ఞవల్క్యుండ ధ్వర్యుండుగా, ద్వైపాయనుండు బ్రహ్మగా సుసాముండుద్గాతగా వీరల పుత్ర శిష్యగణంబులు, క్రమంబున మైత్రావరుణుండును, నచ్ఛావాకుండును, గ్రావస్తుతుండును, బతిప్రస్థాతయు,

నేష్టయు, నున్నేతయు, బ్రాహ్మణాచ్ఛంసియు, నాగ్నీధ్రుండును బోతయు, బ్రస్తోతయు, బ్రతిహర్తయు, సుబ్రహ్మణ్యాఖ్యుండునుంగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాది రాజర్షులు సహాయులుగా, సర్వక్రియా సమగ్రంబయి, షడంగ సమృద్ధంబయి సంపూర్ణ దక్షిణాసనాథంబయి, సకల ధనధాన్య సమన్వితంబయి, జగన్నాథ రక్షితంబయి సకల జనానందకరంబయి రాజసూయంబతి రమణీయంబయిన.

ఇంక వివరణ గద్యలేక Narrative prose లో సాధారణంగా నన్నయ కొన్ని ధర్మశాస్త్ర విషయాలను జొప్పిస్తూ వుంటాడు. జరాసంధుడు భీమసేన, కృష్ణార్జునుల కెదురువచ్చి, "ఆ ద్వారమున బోలు ణారగనగునె' అని ప్రశ్నించగా కృష్ణుడు.

'ద్వారంబున మిత్ర నివాసంబును, నద్వారంబున, నమిత్ర నివాసంబును, జొచ్చుట యిది బాహువీర్య సంపన్నులైన క్షత్రియులకుం గర్తవ్యంబు, మఱి గంధ మాల్యంబుల యందు లక్ష్మి యుండుం గావున బలాత్కారంబున గంధమాల్యంబులు గొంటిమి నీ యందు మాకు నొండు కార్యంబు గలుగుటం జేసి, నీ యిచ్చు నర్ఘ్యంబుగొన నొల్లమనిన జరాసంధుండిట్లనియె.' జరాసంధునిలో వారికి వేరే కార్యం వుండడంచేత అర్ఘ్యం తీసుకోమని యీ వివరణ గద్య (Narrative prose) లో చెప్పడమే కాక, అమిత్రులవద్దకు వెళ్ళేటప్పుడు "అద్వారంబున' వెళతారనే శాస్త్రవిషయాన్ని కూడా పై గద్యలో సూచించేడు.

కావ్యకళాశోభితమైన గద్యకు ఉదాహరణగా ఆదిపర్వ ద్వితీయాశ్వాసంలో కద్రూవినతలు ఉచ్చైశ్శ్రవాన్ని చూపిన సందర్భంలో నన్నయ రచించిన సందర్భంలో నన్నయ రచించిన గద్యభాగాన్ని ఉదాహరణగా యిస్తున్నాను. సభాపర్వంలో యీ రకమయిన గద్య నాకు కనపడలేదు. అందుచేత యీ ఉదాహరణ ఆదిపర్వంలో నుంచి తీసుకున్నాను.

'అట్టియెడ గ్రుదువయు వినతయు వినోదార్థంబు విహరించు వారు, కరిమకర నికరా ఘాతజాత వాతోద్ధూత, తుంగతరంగాగ్ర సముచ్ఛలజ్జల కణాసారచ్ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని, నుద్యానవనంబునుంబోలె, బహువిద్రుమలతాలంకృతంబైన దాని నాటక ప్రయోగంబునుం బోలె ఘన రసపాత్ర శోభిత రంగ రమ్యంబైన దాని దివంబునుం బోలె నహిమకర భరితంబైన దాని మఱియు,

నన్నయ మహోదధిని వర్ణిస్తూ దాన్ని ద్రుమలతాలంకృతమైన ఉద్యాన వనంతోను, నాటక ప్రయోగంతోను సరిపోల్చినప్పుడు ప్రయోగించిన శ్లిష్టోపమలు ఎంతో హృదయంగమంగావున్నాయి. సముద్రాన్ని నాటక ప్రయోగంతో సరిపోల్చడం నన్నయ కావ్య కళావైదుష్యాన్ని స్వాతంత్రపోకడను సూచిస్తుంది.

ఇంక అనుసంధాన గద్య లేక (Link prose) ను తీసుకుందాము.

సంభాషణలో ఒక వ్యక్తి అడిగిన ప్రశ్నకుగాని వివరాలకుగాని సమాధానము చెప్పేవాడు, 'ఇట్లనియె' అని ముందుగా చెప్పి, ఆ వివరాలు తరువాత వచ్చే పద్యంలో చెబుతాడు – అంటే, పై ప్రశ్నకు దిగువ సమాధానానికి మధ్య యీ వచనం వారధిగా ఉపయోగ పడుతుంది. రాజసూయయాగం చేసేటప్పుడు,

'నరసుతులయ్యె దిక్కులకరిగి, మహీపతులచే నరిగొని ధనముల్
దేరలగ దెచ్చిన మార్గము బరువడి నెరిగింపు నాకు బరమ
మునీంద్రా'

'అని అడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె' అనే ఘట్టం తీసుకుదాం – జనమేజయుడు అడిగిన ప్రశ్న పద్యంలోవుంది. దానికి సమాధానంగా వైశంపాయనుడు అర్జునుని ఉత్తర దిగ్విజయయాత్ర గురించి సీసపద్యంలో చెబుతాడు. పై ప్రశ్నకు క్రింది సమాధానానికి

వారధిలాగ ఉపయోగ పడుతుంది. 'అని అడిగిన జనమేజయునకు వైశంపాయను డిట్లనియె' అనేవచనం, అందుకే దీనిని లింక్ ప్రోజ్ అందాం.

నన్నయకాలంలో అనేకమంది వచన రచనచేసిన కవులున్నారని భారతావతారికవల్ల తెలిసినా, ఆ గ్రంథాలు కాలగర్భంలో లీనమై పోవడంచేత, నన్నయ పద్యకవిత్వానికి ఏవిధంగా ఆదికవో, అదేవిధంగా గద్యరచనకు కూడా శ్రీకారం చుట్టిన మహామహుడని మనము గ్రహించవలసివుంది. అయితే నన్నయకాలములో ప్రచారంలో వుండే భాషకు, భారతంలోవున్న భాషకుగల పోలికల్ని, సంబంధాన్ని, చెప్పే తాహతునాకు లేదు. భాషాకోవిదులెవరో ఆ పనికి పూనుకోవాలి.

కీర్తికాయులైన గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు, రాజరాజు కాలమందున్న తెలుగుభాష అనే సుదీర్ఘమైన వ్యాసంలో ఆనాటి శబ్దాల స్వరూప స్వభావాలను గురించి చర్చించేరు. నన్నయ పరికల్పించిన నందంపూడి శాసనంలో గల "తాళ్ళదేవ" అనే పదంలో ఏ వార్థకమైన ఆకారమును చేర్చి నన్నయ, 'అదే సీమ' అనే అర్థంలో ప్రయోగించేడనిన్నీ దేవు+అ దేవ అయినదనిన్నీ గిడుగు పిడుగు ఉద్ఘాటించింది — 'నన్నయకాలమందు ఏవార్థకముగా అకారము వాడుకలో ఉన్నది గాని మన కాలమందున్నట్టి ఏకారము లేదు. అని వ్రాసేరు. భారతంలోగల భాషను కూలంకషగా పరిశీలించగలిగినవారే నన్నయ శైలిగురించి ప్రామాణికంగా వ్రాయగలరు. నావంటి పరిమిత జ్ఞానికది అసాధ్యం.

భావాన్ని అనుసరించి శైలివుంటుంది. అందుకే ఆంగ్లేయులు Sound echoing the sense అన్నారు. పద్యాలలో మనకు యీ పద్ధతి విస్పష్టంగా గోచరిస్తుంది. గద్యరచనలో కూడా నన్నయ, 'అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపిత కుంజర వైరియుం

బోలె గడునలిగి పటుకుటిల భ్రుకుటి ఘటిత నిటలుం డగుచు బురుషో త్తమున కిట్లనియె' అని వ్రాసేదుగనక భావానుగుణ శైలిని నన్నయ పాటించేడని మనకు సుబోధక మౌతుంది.

ఇప్పుడు వ్రాస్తున్నట్టు చిన్న చిన్న వాక్యాలు, పదాలు పూర్వపు గద్య రచనలో కవపడవు. ఎంత విరళమైన భావవితతినైనా వారు ఒకే 'యూనిట్' లేదా వాక్యంకింద పరిగణిస్తారు.

ఆర్ష సంప్రదాయాలకు ప్రతిబింబం నన్నయ. నన్నయ మనో ధర్మం వికర్ణుని వచనాలలో ఏవిధంగా గోచరమౌతుందో చూద్దాం.

ఇక్కురువృద్ధులైన భీష్మ ధృతరాష్ట్ర విదురాదులును, నాచా ర్యులైన ద్రోణ, కృపాదులుంబలుకరైరి, యున్న సభాసదు లెల్లం గామక్రోధాదులు దక్కి విచారించి చెప్పం డనిన, నెవ్వరుంబలుక కున్న నేనిందు ధర్మ నిర్ణయంబు సేసెద–నెల్లవారును వినుండు. జూదం బును, వేటయు, పానంబును బహుభక్షణాసక్తియు, ననునాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మువుం దప్పి, వర్తిల్లునట్టివాని కృత్యంబులు సేకొనందగవు. కితవాహూతుండై వ్యసనవర్తి యయి, పరాజితుండయిన పాండవాగ్రజుండు, పాండవుల కందఱకు, సాధారణ ధనంబయిన పాంచాలి బణంబు జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత, యక్కోమలి, నేకవస్త్ర నిటదోడ్కొని తెచ్చుట యన్యాయంబనిన వికర్ణు పలుకుల కోడంబడక కర్ణుండు వాని కిట్లనియె.'

—*—

# నన్నయ - సూక్తినిధి

శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్.(ఆది1-26)

భారతావతారికలో ఆదికవి నన్నయ భట్టారకుడు తననుగురించి తాను వ్రాసుకున్న పద్యమిది.

ఈ పద్యంలో మనకు ప్రధానంగా నాలుగుపదాలు కనిపిస్తై. ప్రసన్న కథా కవితార్థయుక్తి (దీనికి 'కలితార్థయుక్తి' అని పాఠాంతరం వుంది) అక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తినిధి, జగద్ధితము.

వీటిల్లో మొదటి రెండుపదాలు నన్నయగారి కవిత్వానికి, మూడవది నన్నయగారికి విశేషణాలు. నాలుగవది నన్నయగా రాసించిన కావ్యప్రయోజనం.

అసలు సాహిత్యానికి ప్రయోజనాలు రెండు. ఒకటి ఆనందం. రెండవది ఉపదేశం. అంటే నీతిబోధ. వీటిలో ఆనందం అనే ప్రయోజనాన్ని ప్రసన్నకథా కవితార్థయుక్తి వలన, అక్షరరమ్యత వలన, ఉపదేశాన్ని తాను చెప్పిన సూక్తుల వలన సాధించాడు నన్నయ.

ఆంధ్రమహాభారతం చంపూకావ్యం. నన్నయగారు తాను చెప్పదలచుకున్న సూక్తుల్ని పద్యంలోను, వచనంలోను చెప్పారు.

పద్యంలో సూక్తిని చెప్పేవిధానంలో రెండు పద్ధతుల్ని పాటించాడు నన్నయ. ఒక్కొకసారి పద్యంలోని కొంతభాగములోకథ, లేదా ఒకవ్యక్తి తాలూకు సంభాషణ, చెప్పి; మిగిలిన భాగంలో నీతిని చెబుతుంటాడు. ఇది ఒక పద్ధతి. ఒక్కొకసారి పద్యం అంతటా గూడ

నీతి మాత్రమే చెబుతాడు. ఇందులో కథగాన, కథకు సంబంధించిన పాత్రల ప్రసక్తిగాని ఏమీ వుండదు.

ఇతరు లెవరైనా మనకు ఆ పద్యాలని చదివి వినిపించినట్లయితే ఆ పద్యాలు ఏ సందర్భంలోవి? ఎవరు ఎవరితో చెప్పారు? అనే విషయాలు అంత త్వరగా మనకు గుర్తుకురావు. ఇది మరొక పద్ధతి.

మొదటి పద్ధతికి చెందిన పద్యాలు సూక్తి, కథాభాగం కలిసి వున్నవి-నన్నయ భారతంలో కోకొల్లలుగా వున్నై. వాటినన్నింటినీ వివరించటం ఈ వ్యాస లక్ష్యం కాదు. అందుచేత రెండవపద్ధతికి చెందిన పద్యాలను-కేవలం సూక్తిమాత్రం ఉన్న పద్యాలను గురించి వివరించటమే ఈ వ్యాసానికి ముఖ్యోద్దేశ్యం.

పరీక్షిన్మహారాజు శమీకుడి మెడలో చచ్చిన పామును వేసి వెళ్ళాడు. శమీకుని కుమారుడు శృంగి కృశుడు అనే మునివలన ఈ విషయం తెలుసుకొని కుపితుడై 'మాతండ్రిని ఈవిధంగా అవమానించిన పరీక్షితుడు ఈరోజు మొదలు ఏడురోజుల లోపల తక్షకవిషాగ్ని దగ్ధుడై యమసదనానికి వెళతాడు' అని శపించాడు. విషయాన్ని విన్న శమీకుడు చాలబాధపడి, శృంగితో ఇట్లా అన్నాడు.

'క్రోధము తపముం జెఱచును
గ్రోధమయణిమాదులైన గుణములఁబాపుం
గ్రోధము ధర్మక్రియలకు
బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే ? (ఆది. 2-172)

ఆ తర్వాత శమీకుడు శృంగికి క్షమయొక్క ప్రాశస్త్యాన్ని గురించి చెప్పాడు.

'క్షమలేని తపసి తపమును
బ్రమత్తు సంపదయు ధర్మబాహ్య ప్రభు రా
జ్యము భిన్న కుంభమున తో
యము లట్టుల యధ్రువంబులగు నివి మెల్లన్ (ఆది. 2-173)

ఓర్పులేని తాపసియొక్క తపోధనం, జాగ్రత్త వహించనివాని సంపద, అధర్మపరుడైన రాజుయొక్క రాజ్యం, ఇవన్నీ కూడా పగిలిన కుండలోని నీళ్ళలాగా క్షణకాలంలో-అనతికాలంలోనే-నశించిపోతై.

పై అవలక్షణాలవలన కలిగే సద్యఃఫలితాన్ని వివరించటానికి నన్నయ చక్కని ఉపమానాన్ని ప్రయోగించాడు.

క్షమ ఔన్నత్యాన్ని గురించి ధర్మరాజు ద్రౌపదికి చెప్పాడు.

'క్షమగలవానికిఁ బృథ్వీ
సమునకు నిత్యంబు విజయ సంసిద్ధి యగున్;
క్షమి యైనవాని భుజ వి
క్రమము గడున్ వెలయు సర్వకార్య క్షమమై. (అరణ్య. 1-223)

క్షమగలవాడు భూదేవితో సమానుడు. అతనికి అన్ని పనుల లోనూ విజయమే లభిస్తుంది. వాని భుజబలానికి క్షమకనుక తోడయి నట్లయితే అతనికి సర్వకార్యాలూ నెఱవేఱుతై.

అక్రోధనుడి వైశిష్ట్యాన్ని గురించి శుక్రాచార్యులవారు దేవయానికి చెప్పాడు.

అతను గొప్ప నియమంతో వేలకొద్దీ యాగాలుచేసి, యాచకులకు ఘనమైన దక్షిణల నిచ్చినవానికంటె అధికుడట.

'అనుపమ నియమాన్వితులై
యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సే
సిన వారికంటె నక్రో
ధనుఁడు గరం బధికుఁడండ్రు తత్త్వవిధిజ్ఞుల్. (ఆది. 3-146)

ఇతరులు మనపట్ల కోపించినప్పుడు మనం ఏవిధంగా ప్రవర్తించాలి? ఏవిధముగా మసలుకుంటే లోకం గౌరవిస్తుంది? అనేవిషయాన్ని అతనే ఆవిడకు చెప్పాడు.

'అలిగిన నలుగక యొగ్గులు పలుకక బన్నము పడి యొడఁ
దలపక యున్న తఁడ చూవె ధర్మజ్ఞుఁడిలన్.' (ఆది. 3-147)

ఇతరులు తనపట్ల కోపించినట్లయితే, తను తిరిగికోపపడగూడదు. తన మనసుకు కష్టం కలిగేవిధంగా మాట్లాడినప్పటికీ వినికూడ వినని విధంగా మౌనంగా వుండాలి. అవమానించబడికూడ దాన్ని పట్టించుకో గూడదు.

అంటే నిష్కారణంగా అవమానించబడ్డ ప్రతివాడూ ఈవిధంగా జీవచ్ఛవంలాగా పడివుండాలనికాదు శుక్రుడి తాత్పర్యం. సమయాసమయాలు, తరతమ భేదాలు గుర్తించాలి. తొందరపడి మాటతూల గూడదు. ఒదిగి వుండటం చిన్నతనమేమీ కాదు అని శుక్రుడి ఉద్దేశం.

'అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్ల కొదువ కాదు
కొండయద్దమందుఁ గొంచెమై యుండదా'

అన్న వేమన్నగారి అభిప్రాయం నన్నయగారి ఈ భావబింబాలకి ప్రతిబింబమే!

క్రోధగుణాన్ని గుఱించిన నన్నయగారిపద్యాలను ఈపద్యాలను చదువుతుంటే భగవద్గీతలోని శ్లోకం గుర్తుకు వస్తుంది.

'క్రోధా ద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।
స్మృతి భ్రంశా ద్బుద్ధినాశః బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥' (2–63)

క్రోధవశుడైన మానవుడు నశించిపోతాడు అని సారాంశం.

యయాతి ఘోరతపస్సు చేసి, తత్ఫలితంగా ఇంద్రలోకానికి వెళ్ళాడు. ఇంద్రుడు అతణ్ణి పూజించి, 'నీవు నీ కుమారుడికి రాజ్యాన్ని అప్పగించే సమయంలో అతనికి నేర్పిన నీతి ఏమిటి? అని అడిగాడు. దానికి యయాతి ఈవిధంగా సమాధానం చెప్పాడు.

'ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనులగోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱువ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్' (ఆది. 3-202)

'శ్రీరామ వద్వర్తితవ్యం నరావణవత్' శ్రీరామచంద్రుని లాగా ప్రవర్తించాలి. రావణునిలాగ కాదు అని పెద్దలన్నారు.

కనక ప్రతీవ్యక్తీ మహాత్ముల నడవడి ఏవిధంగా ఉంటుంది? అనేదాన్ని గురించి తెలుసుకుంటూ, సజ్జనులతో స్నేహం చేస్తూ, ధర్మప్రకారాన్ని గురించి తెలుసుకుంటూ, ఆ తెలుసుకున్న దాన్ని ఆచరణలో పెట్టాలి. ఆ విధంగా చేసినవాడే ధర్మజ్ఞుడు.

'వివాహమైన తర్వాత స్త్రీ ఎక్కువకాలం భర్తకు దూరంగా, పుట్టినింట్లో ఉండగూడదు. అట్లావుంటే ఆవిడ ఎంతటిసాధ్వి ఐనప్పటికీ అపనిందల పాలౌతుంది. భార్యకు నిజమైనరక్ష భర్తవద్దనే ఉంటుంది.

కణ్వమహర్షి శకుంతలను అత్తవారింటికి పంపుతూ ఈ విషయాన్ని తెప్పాడు.

'ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాలమునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మవు
సతుల కేడు గడయు బతుల చూవె, (ఆది. 5-66)

'అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ'
(రామాయణం. యుద్ధ. 18-34)

అన్నాడు శ్రీరామచంద్రుడు.

శరణాగత రక్షణానికి మన సంస్కృతిలో గొప్ప ప్రాధాన్యం ఉంది.

'ధైర్యచ్యుతుడై ప్రార్థించిన వాడిని, అతిథి అభ్యాగతులను, భయపడుతున్న వాడిని, శరణు కోరినవాడిని, చంపటానికి పాలుపడే దుర్మార్గుడికి ఈలోకంలోనూ, పరలోకంలోనూ సుఖుండుండదు.

ఈ సూక్తి ఏకచక్రపుర నివాసిఐన ఒక బ్రాహ్మణుడు కుంతీ దేవితో చెప్పాడు. బకాసురుడికి ఆహారంగా వెళ్ళేవంతు ఆరోజు ఆ

బ్రాహ్మణుడి ఇంటికి వచ్చింది. ఆ యింటిసభ్యులు 'నేను వెళతానంటే నేను వెళతా' నని పోటీపడుతున్నారు. పాండవులు కుంతీ సమేతంగా ఆ బ్రాహ్మణుడి ఇంట్లోనే నివాసం చేస్తున్నారు. ఈ దృశ్యాన్ని చూసిన కుంతి 'నా కుమారుల్లో ఒకణ్ణి ఆ రాక్షసుడికి ఆహారంగా పంపుతా' నన్నది. ఆ మాటలు విన్న బ్రాహ్మణుడు కుంతితో పై మాటలు అన్నాడు.

'ధృతిసెడి వేఁడెడు వానిని
నతిథిని నభ్యాగతుని భయస్థుని శరణా
గతుఁ జంపఁగ నొడఁబడు దు
ర్మతి కిహాముం బరము గలదె పరికింపన్, (ఆది. 6-274)

'తనవద్ద పనిచేస్తున్న ఉద్యోగస్థులకి సకాలంలో జీతాలు ఇవ్వాలి' అనే విషయాన్ని నారదుడు ధర్మరాజుకు చెప్పాడు.

'తమ తమ కనియెడు తఱి జీ
తము గానక నవయు భటుల దౌర్గత్య విషా
దము లేనివాని కవ
శ్యము నెగ్గొనరించు నతఁడు శక్రుండైనన్' (సభా. 1-38)

'సకాలంలో జీతాలందకపోతే ఉద్యోగులు బాధపడతారు. ఆ బాధ యజమానికి హాని కలుగజేస్తుంది-అతడు దేవేంద్రుడైనా సరే.

'భూరి గుణోన్నతులనఁ దగు
వారికి ధీరులకు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణమది విషముకంటె దహనము కంటెన్' (సభా. 2-17)

వాక్పారుష్యం అనేది విషంకన్న, అగ్నికన్న దారుణమైనది. కనుక గుణవంతులు, ధీరులు, రాజులు దాన్ని దగ్గరకురానీయగూడదు.

ధర్మరాజు రాజసూయాధ్వరంలో శ్రీకృష్ణుడికి ప్రధాన తాంబూలమిచ్చి గౌరవించాడు. శిశుపాలుడు దీన్ని సహించ లేక

పోయాడు. కృష్ణుని, భీష్ముని పరోక్షంగా ధర్మరాజును కూడ నానా దుర్భాషలాడాడు. తర్వాత అక్కడ వుండటం యిష్టంలేక, సభాభవనాన్ని వదిలి బయటకు వెళ్ళాడు.

అప్పుడు ధర్మరాజు వానివెనకనే వెళ్ళి అనునయిస్తూ పై మాటలు చెప్పాడు.

జూదం సప్తవ్యసనాల్లో ఒకటి. షట్చక్రవర్తుల్లో రెండవవాడైన నలమహారాజంతటివాడే ఆ వ్యసనంవలన నానాయాతనలు పడ్డాడు. అందుచేతనే 'జూదం పనికిరాదు' అంటున్నాడు ధర్మరాజు దుర్యోధనుడితో.

కుటిల మార్గులయిన కుత్సిత కితవుల
తోడఁ గడఁగి జూదమాడఁ జనదు
దానఁజేసి యర్థ ధర్మ వివర్జితు
లగుదు రెట్టివారు జగములోన. (సభా. 2-167)

'పెద్దపెద్ద అనుభవాలలోనుంచి కుదించిన చిన్న చిన్న మాటలే సామెతలు' అన్నారు పెద్దలు.

ప్రతి సూక్తి వెనుకా ఆ సూక్తికారుడు అనుభవించిన, లేదా లోకాన్ని చదివి గ్రహించిన విషయం చాలా వుంటుంది. తన సమకాలికులు, తన తర్వాతివాళ్ళు స్వయంగా అనుభవించి తెలుసుకునే శ్రమ అవసరము లేకుండా కవులు తమ అనుభవాలని సూక్తులద్వారా తమ జాతికి అందిస్తారు.

నన్నయభట్టారకులవారు కూడ తమ నాటిసమాజాన్ని, సమాజానికి ప్రతిబింబమైన వ్యాసభారతాన్ని చదివి తాము గ్రహించిన విషయాలని సూక్తులరూపాన తన భారతంలో నిక్షిప్తం చేశారు.

'నానారుచిరార్థ సూక్తినిధి' అని సార్థక బిరుదాంకితులయ్యారు.

— * —

# నన్నయ్యుభయవాక్ప్రౌఢి

శ్రీ యడవల్లి ఆదినారాయణ

"వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు."

అని కవిసార్వభౌముడు శ్రీనాథుడు కాశీఖండమున తనకు పూర్వులైన కవులలో, తన కాదర్శ ప్రాయులైనవారిలో, తనకు నచ్చిన యొక్కొక్క గుణమును స్వీకరించి తన కవితలో పొందు పరిచినట్లు చెప్పెను.

"ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి" యన్నారు శ్రీవిశ్వనాథ. నన్నయ, తననుగూర్చి రాజరాజనరేంద్రుని ముఖమున "తన కులబ్రాహ్మణు... లోకజ్ఞు, నుభయభాషా కావ్య రచనాభిశోభితు, సత్ప్రతిభాభియోగ్యు"నని పల్కించెను. మహాభారత సంహితను తాను రచించులక్ష్యము "సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో నారసిమే" లనుట యితరు లక్షరరమ్యత నాదరించుటగా తెల్పెను. ఈ లక్ష్యసాధనకు తాను "నానారుచిరార్థ సూక్తినిధి" యయ్యెనట. ఈ సూక్తినిధిత్వమున నుభయవాక్ప్రౌఢిమ చేరును. కాన "నుభయవాక్ప్రౌఢిమ" యన్నదాని స్వరూపమేమో విచారింతము.

నన్నయ మార్గకవితాగామియనియు, శైవ కవులు దేశి, జాను తెనుంగుల నుద్ధరించిరనియు, భాషా, సారస్వతచారిత్రకు లుద్ఘాటించు చున్నారు. శైవయుగము తర్వాతివాడగు శ్రీనాథకవి సార్వభౌముడు నన్నయ నుభయవాక్ప్రౌఢిమ గలవానిగా నుద్ఘోషించినాడు.

వ్యాసకృత భారతము నాధారముగా దానిసారమును తెనుగున రూపొందింప యత్నించుట చేతను. నప్పటికి సంస్కృత పండితాదరమును, రాజాస్థానాదరమును తెనుగుపొందని కారణముననను, తెనుగు సంస్కృత భవ మేయగుభాష యను భావముకలవాడు నన్నయ యగుటను "శ్రీవాణీ గిరిజాః" అన్న శ్లోకముతో "రాజకులైక భూషణుఁడ"న్న తత్సమసద బహుళమైన పద్దెముతో తెనుగు భారతము నవతరింపజేసెనేగాని, 'మార్గ' మార్గము నే యవలంబించి 'దేశి'ని వదలవలెననిగాని, 'దేశి' 'మార్గ' మార్గముల విడదీసి రెండుగా చేయవలెననిగాని యాత డూహించినట్లు నాకు తోపదు. తెనుగు నుడికారమును చక్కగా తన భారతమునందెల్లెడల పొందుపరిచి, సంస్కృతాంధ్రములకు భేదము పరిశీలించినగాని తెలియనంతగా వాడిన మహామహుడు, ఆంధ్రభాషోద్ధరణకు నడుముకట్టిన మహోద్యమ ప్రవర్తకుడు నన్నయ. తెనుగుకవులలో చక్కని నుడికారమును వెలయించి కావ్యములందెల్ల దెనుగుదన ముట్టిపడునట్లు చేసిన కవులలో ప్రథమగణ్యుడు శ్రీనాథుడు. కాశీ మహాపట్టణమునగూడ నాంధ్రత్వమును ముద్రింపచేసిన జాతీయకవిసార్వభౌము డాతడు. అతడు సంస్కృతాంధ్రముల కుడియెడమల వాడగల సవ్యసాచి. అతని కావ్యములలో ప్రథితముగా కన్పట్టునవి మహోజ్జ్వలమైన పద్యరచనా శిల్పమును, నందెల్లెడలను ప్రచురముగా భాసించు తెనుగు సంస్కృతముల పొందికయు. ఈ యందమున కాతనికి నన్నయ యాదర్శమట.

అయితే తెనుగు సంస్కృత శబ్దములుగల మహాంధ్రమున నా రెండు భాషలపదములను కలిపి వాడుటగూడ నొక గొప్పయేనా! దీనికి వాగనుశాసనులును, కవిసార్వభౌములును కావలెనా అని అనిపించును. కాని కలిపివాడుటయేగాదు వాడుటయందలి ప్రౌఢిమ చూడవలె. దీనికి సత్ప్రతిభాభియోగ్యత కావలెను.

ముందు శ్రీనాథునిలోని 'ఉభయవాక్ప్రౌఢిమ'ను స్థాలీపులాక ముగా చూపుదును.

"కలశాబ్ధికన్యకా కరపల్లవద్వయీ
సంవాహనక్రియా సముచితంబు."

ఈ సీసమిట్లే ప్రౌఢసంస్కృత సమాసములతో ప్రతిపాదమును కూడి యలరారుచున్నది.

"మకర కుండల వజ్రమాణిక్య దీప్తులు
చెక్కుటద్దములపై జీరువార."

ఇందలి మొదటి సగము సంస్కృత సమాసము. రెండవ సగము తెలుగు. ఒకదానికొకటి తీసిపోని అందాల సంతరించుకొన్నవి. సంస్కృత సమాసమున కద్దమైన తెనుగువాడి మెప్పించుట శ్రీనాథేత రులకు సుసాధ్యము కాదు.

"డాకాలి గండపెండారంబు దాపువ
బొమ్మలై వైరిభూభుజులు వ్రేల."

ఇందు తెనుగు సంస్కృతపదములు మిశ్రితములైనవి.

"త్రసరేణు పరిమాణధాతు ధూళీపాళి
యలికంబులకు వింత చెలువునొసగ"

నన్న సంస్కృత సమాస సౌష్ఠవమునకు తీసిపోని.

"ఘనమైన రారాపు చనుదోయి రాయిడి
నిలు పేదనడిమికి వెలపుచూప
తొలుకాలు మెలుగుదీగెల నేలుకన్నులం
వడదాకి యొక్కింత వాడుపాఱ"

నన్న తెనుగుపదముల యల్లికసొంపుతో పద్యమును హంసిందా నముతో నడిపించుటయు,

"సింధూర తిలకంబు, చెమటచిత్తడివాకి
యలకభాగంబు నం, దసలుకొనగ"

నని రెండుగణములు సంస్కృతపదములు రెండుగణములు తెలుగుపదములుకూర్చి రెండు బాసలకుభేదము నేర్పరింప శక్యముగానట్లు రచించుట ప్రౌఢులకును ప్రతిభావంతులకునే సాధ్యమన సాహసమగునా!

"వేనలిపాటపాట నలివెంద్రుకతోఁ దిలతండులాన్వయ
శ్రీనటియింపగ సడలి ప్రేకనిచన్నులు పాలవంకలై
కొనసియూర్పు వాలుఁజెలి కన్నులఁ గల్కితనంబు పిక్కొనన్
మానినిహస్తమూది యొక మంజులభాషిణి వచ్చె పీఠికిన్."

ఇందు తెనుగుఁదనము పదములందేకాక పాత్రచిత్రణ యందునుగాఁదు. వెంటనే

"వేదపురాణశాస్త్ర పద వినదవియప్రియమైన పెద్దము
త్తైదువ కాళికానగర హాటకపీఠ శిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివరా! యిటురమ్మనిపిల్చె హస్తసం
జ్ఞా దరలీలరత్నకట కాభరణంబులు ఘల్లుఘల్లనన్.

అనుచు నామెనే "ఆదిమశక్తి"గా చూచియు "పెద్ద ముత్తైదువ"గా గుర్తించుచు సంస్కృతమున వ్యాకరణజ్ఞులు మురిసిపోవు పదప్రయోగ కౌశలమును ముద్దుగా ప్రదర్శించినవాడు కవిసార్వభౌముడు.

నన్నయ యీదృశమైన రచనలో శ్రీనాథున కాదర్శమై యుండనోపు.

నన్నయ శ్రీనాథుల పద్యరచనా శిల్పమున భేదము చాలకలదు అందుచె నన్నయపిగానేచూపు నుదాహరణములు శ్రీనాథుని వానికి చాయలుగానుండ గలవేగాని ప్రాసున తూపగలట్టులుండవు.

నన్నయ సంస్కృతమున వాల్మీకి రచనాశిల్పము గలవాడని

శ్రీ విశ్వనాథులన్నది సరియైనది. సంస్కృతమున నార్షరచనాశైలి విలక్షణమైనది అది చాల సంక్షిప్తముగా నున్నట్లు కన్పట్టి విమర్శించిన కొలదియు రుచిరార్థదాయకముగా నుండును. దానిలో విశేష్యవిశేషణ బంధమెక్కువ. తెలుగునగల యతిప్రాస వైఖరి సంస్కృత పద్య రచనమున లేకున్నను విశేషణ విశేష్యము లేకవిభక్తికములౌటచే నంత్యము లోకేవిధముగనుండి శ్రుతిపేయములగును. దేశీయమైన ప్రాసయు, అఖ్యలాత్మకమైన యతిమైత్రియు తెనుగు పద్యముల గూర్చుటయేగాక నన్నయ యార్షశైలియందలి యేకవిభక్తిక విశేషణ విశేష్యబంధ ప్రాచుర్య సౌందర్యము నిందు గల్గించుటచే పద్యము లక్షరరమ్యములును, హృద్యములునగుటయేగాక విశిష్టములుగాకూడ కన్పట్టును. చూడుడు !

"రాజకులైక భూషణుడు, రాజమనోహరు, డన్యరాజ తే
జో జయశాలి శౌర్యుడు, విశుద్ధ యశశ్శర దిందుచంద్రికా
రాజిత సర్వలోకు. డపరాజిత భూరిభుజాకృపాణధా
రా జల శాంత శాత్రవ పరాగుడు, రాజమహేంద్రుడున్నతిన్.

ఇందక్షరరమ్యత యేమి హృద్యత యేమి రచనాశిల్ప మేమి పరాకోటి నందినవి. కాననే మఱిసి శ్రీనాథుడు కాశీఖండమున

"రాజశశాంక శేఖరుడు, రాజకిరీట వతంస మష్ట ది
గ్రాజ మనోభయంకరుడు, రాజులదేవర, రాజరాజు, శ్రీ
రాజమహేంద్ర భూభువన రాజ్య రమా రమణీమనోహరుం
డాజి కిరీటి, కీర్తినిధి, యల్లయ వీరన రేంద్రు డున్నతిన్."

అని వ్రాయక యుండలేకపోయెను. మరల నిట్టిదే నన్నయ ప్రథమా శ్వాసాంతమున మఱియొకటి "రాజ కులాగ్రగణ్యా..." అని వ్రాసి తనిసెను. ఈ పద్యమెందది మెప్పులు చూరగొన్నదో. ఇంతకు నిది భారతమున మొదటిపద్యము, ఇందు విభక్తి ప్రత్యయములు తప్ప

తక్కినదంతయు సంస్కృత పదబంధమే. ఇది యంతయు సంక్షే- సమాసము చేయుటయో విస్తరించి వ్రాయవలెను. సంబంధస్ఫురతలు నన్నయ విరిచి అర్థశైలి ననుకరించును. ఇందు సంక్షిప్తతయు, లోతు దనమునుగలవు. ప్రబంధశైలిలో విస్తృతియు, పాకట్యమునుగలవు. నన్నయ పై పద్యము సంస్కృత వాక్ప్రౌఢిమకు మచ్చుతునుక.

> "పరమ వివేక సౌరభ విభాసిత సద్గుణపుంజవారిజో
> త్కర రుచిరంబులై, సకల గమ్య సుతీర్థములై, మహామనో
> హార సుచరిత్ర పావన పయః పరిపూర్ణములైన, సత్సభాం
> తర సరసీవనంబుల, ..............."

ఇందు మూడు విశేషణాత్మకములైన సమాసములును, అయి పదాంతములై సంస్కృతమునందలి యేక విభక్తికములగు విశేషణ విశేష్యముల యందము నించుచున్నవి.

> "తాం సనందన సంకాశాం, మృగపక్షిభి రావృతాం
> హార్మ్యప్రాసాద సంబాధాం, కోకిలాకుల నిస్వనాం
> కాంచనోత్పల పద్మాభి ర్వాపీభి రుపశోభితాం."

... ... ... ... ... ...

ఇది అర్థశైలి. ఈ రచనాప్రౌఢిమ నన్నయ సంస్కృతము నుండి గ్రహించి తెనుగున పొందుపరిచెను. ఇది నిగూఢార్థ ప్రతిపాదకము. విశేషణములన విశిష్టార్థకములుగదా. అర్థగ్రంథములం డివి తప్పక యుల్లేయుండును. వాని సార్థక్యము తరిచిచూచినగాని వాని అందము తెలియదు. అదియే "కవీంద్రులులో నారసి మేలునాన్" అన్నది నన్నయ. కాన సంస్కృతకవుల సంప్రదాయము తెలియనివారికి నన్నయ వ్యర్థపదానుబంధిగా కన్పట్టు. తెలిసిన వానిని రుచిరార్థమూర్తిని శ్రీనాథు డుద్దేశించియే యామెచ్చుకొనుట.

జాతీయత, నుడికారమను పదములు మనము వాడుచున్నాము. ఒక్కొక్కజాతి కొక్కొక్క భావనా రీతియు, భావప్రకటనా వైఖరియు నుండును. ఏజాతి నుడికార మాజాతిదే. అందుచే నన్నయ సంస్కృత భారతమునందలి రహస్యములను, అందమును, సారమును మాత్రమే గ్రహించి తెనుగు మూసలోపోసి "ఆంధ్రకవిత్వ విశారదుడు"గా "తిక్కన"చే గణుతింపబడెను. ఒక భావమును పద్యమున రూపొందించునపుడు దానిని సంపూర్ణముగా చిత్రించుశబ్దములు యతిప్రాసలు ఛందము నెన్నుకొనుట యొక జాగ్రత. దానినిమించి యేకోసనుండి చెప్పినచో భావమునకు దీప్తి కలుగునో తెలియుట యొక ప్రత్యేక జాగ్రత. ఇది సామాన్య కవులకు కొంతగానుండును. నన్నయ భావము నుద్దీప్తముగా ప్రకటించుటయేగాక జాతీయముగాగూడచేసి విశిష్టతను చాటును. చూడుడు!

"భూనుతకీర్తి, బ్రాహ్మణుడు
పుట్టుడు, తోడనపుట్టు నుత్తమ
జ్ఞానము..............."

"బ్రాహ్మణుడు పుట్టటంతోటే యివన్నీ పుట్టుతవి" అనునది మన మిప్పటికిని చేయు వాక్యరచనావైఖరి. ఇది మన జాతీయము. పుట్టున వన్నియు ముందుచెప్పి, బ్రాహ్మణుడు పుట్టుటతోడనే అనునది తర్వాత పెట్టినచో నీదీప్తియుండదు.

ఇట్లే,

"ప్రల్లదుడైన యొక్కకుల పాంసను చేసినదానతత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము?"

ఈ మాదిరి వాక్యవిన్యాసము తెలుగులది. ఇందలి ద్విత్వలకారము, 'ఎల్లను'న 'అంథా' అను దాని సమగ్రత భావమునకు నిండుదనమును కూర్చుచున్నవి. సంపూర్ణమైన సంస్కృత సమాసాదిక రచనముగల సముద్రవర్ణనము చూడుడు!

"అంఘముఫణీంద్రిలోక కుహరాంతర దీప్తమణిస్ఫుర త్ప్రభా
వలిగలదాని, శశ్వదుద వాసమహావ్రత శీతకీడితా
చలముని సౌఖ్యహేతు విలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలిగెడు దాని, గాంచి రర వింద నిభాననలమ్మహోదధిన్."

సరళమై ప్రసన్నమైన శైలీమాధుర్యముతో సంస్కృత పదరచన యిందెట్లుసాగినదో చూడుడు రెండు పెద్ద సంస్కృతసమాసముల చివర 'గలదాని', 'వెలిగెడు దాని' అని ముగింపుచేసి రచనాశిల్పమున మెరుగులు చూపెను. వర్ణనలుచేయునప్పుడు వస్త్వౌదాత్త్యమును బట్టి సంస్కృత సమాస బాహుళ్యముతో పద్యరచన సాగించుట నన్నయ తీరు. సంభాషణలయందు మృదులాతి మృదులమైన తెనుగు నుడికారము లందు సరళశైలి నుపయోగించుట యీతనినేర్పు.

దేవయానీశర్మిష్ఠల సంభాషణము చూడుడు:

దే వ యా ని :

"లోకోత్త రచరితుండగు,
నా కావ్యతనూజ నీకు నారాధ్యను నే
ప్రాకటభూసుర కన్యక,
నీకట్టిన మైలకట్ట నేర్తునె చెపుమా."

ఈమె బ్రాహ్మణి, అత్మాభిమాన, కాన సంస్కృత పద బహుళ రచన ఉదాత్తతా సూచకముగా నామెను కూర్చి నంతవరకు చేసెను.

శ ర్మి ష్ఠ :

"మాయయ్యకు పాయకపని
చేయుచు దీవించి ప్రియముచేయుచునుందున్
మీయయ్య వెండిమహిమలు
నాయొద్దన పలుకనాకు నానయు లేదే."

అభిజాత్యగర్వము దేవయానికి. అధికార గర్వము శర్మిష్ఠకు. రజోగుణ మూర్తి శర్మిష్ఠ. దానిని 'నాయొద్దన పలుక'లో 'రామస్యగాత్రమసి' అనుదాని వ్యంగ్యవైభవమును తెనుగుదనముతో రూపొందింపచేసిన వాడు నన్నయ ఈ పద్యమున శర్మిష్ఠ దేవయాని నెంత తక్కువగా చూచినదో కానవచ్చును. ఆమెను బుగ్గలు పొడుచుచున్నదా యన్న ట్లున్నది రచన. పదములకూర్పులో పాత్రల నాట్యభంగిమలు చిత్రిం చుట ప్రౌఢిమ కాదామరి. ఈ రెండు పద్యముల పదములకూర్పు తద్భావములకు, తద్గతనాయికల రూపములకు ప్రతిబింబములుగా నున్నవి. అని శర్మిష్ఠ "నాకట్టిన పుట్టంబు నీకుం కట్టంగాదుగా కేమి ? అని విసిరినది. దేవయాని "నీకట్టినమైల" యనగా శర్మిష్ఠ "నాకట్టిన పుట్టంబ"ని మార్చినది ప్రత్యుత్తరము నింత జాగ్రత్తగా వ్రాయు జాణతనముగలవాడు నన్నయ.

సంస్కృత కావ్యాలంకారిక మర్యాదలన్నియు పుణికి పుచ్చు కొని నన్నయ 'ఉభయభాషా కావ్యరచనాభిశోభితుడై'నట్లు ప్రతిఘట్ట మునను మనకు కన్పట్టును.

నూతనున్న దేవయానిని యయాతి యుద్ధరించుట.

"జలధివిలోల వీచి విల సత్కలకాంచిసమంచితావనీ
తలవహనక్షమంబయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళ దురుఘర్మవారికణ కమ్రకరాబ్జమువట్టి నూతిలో
వెలువడ కోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్"

ఇందు రెండు దీర్ఘసమాసములుగలవు. ఒకటి యయాతి దక్షిణ హస్తమునకు విశేషణము. రెండవది దేవయాని కరాబ్జమునకు విశేష ణము. ఈ సమాసముల యౌచిత్యము వారి పాణిగ్రహణమునకు గల సమస్థితిగతులను తెలుపును. నూతిలో వెలువడ లాగుటకా సమా సములు కలిసి చేదుత్రాడుగా నైనవి. మొత్తము రుచిరార్థద్యోతకమై

సాత్త్విక భావోపసంపన్నమై రసపోషక మగుచున్నది. పాణిగ్రహణము వ్యంగ్యము. 'ఉద్ధరించుట' యను శబ్దార్థము, పైకి లేయుటకును, పాణిగ్రహణముచేసి భరించుటకునుగా చమత్కరింపబడినది. వినతా కద్రువల సంభాషణ మెంత సుకుమారమైన తెనుగు నుడికారమును జూపునో చూచుడు :

కద్రువ (వినతంజూచి) :

"చూడవె! యల్ల యతిధవళంబైన యశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుంబోలె వాల ప్రదేశంబున నల్లయై యున్నది."

వినత (నగి) :

"నీవే కన్నులం జూచితే యక్క! ఎక్కడిది నల్ల? యీ యశ్వ రాజమూర్తి మహాపురుష కీర్తియుంబోలె నతినిర్మలంబై యొప్పు చున్నయది."

నన్నయ వచనరచన యందము తెనుగు కవులలో నేరికిని సంపూర్ణముగా చిక్కలేదన్న సత్య దూరముకాదు.

ఇట్టివే చక్కని విశిష్టప్రయోగములు నన్నయ భారతమునగల విందు చూపుచున్నాను.

"ఎఱుకగలరె మగువలెందు; మాయీదాస్యము; నీకు చిత్తము గలదేని; నీతధర్మమకాగ; కడుగూర్చు మిత్రులు; నీవు మాచుట్ట మవపోలె నెమ్మితోడ నవహితుండవై మాపల్కులాదరించితి; ఇప్పుడు ప్రొద్దులేదు; కచుండు నేనియున్ రాడు. నీవును చూచితట్టి సభ నేనివినం బడదేయుగంబులన్ (మట్టుకు);కడుచోద్యమయ్యె;మీవచ్చుటెఱింగి రేని పరికాడు, వారకములు, కుశాగ్రీయబుద్ధులు, దాని చేతులాడక యుం డెన్; ఇల్లడయిడు; భవన్నిదేశ సంశ్రయమున నున్న మాకధిక శత్రుజయంబగుటేమిపెద్ద? ఎంతవారు చొచ్చునప్పుడమ్మని శక్తింజేసి

ద్రోగుదీనినే శ్రీనాథుడు నైషధమున "ఎంతవారలు లేరుగా నింత నంత, ఉవిద మనవారలేగదా యున్నవారు" అనెను. తన పొడవు చూపు, లావుచూపు, మూర్తమైన ధర్మమ్మునుబోలె; జీతముగాన కనవయు, ఋణములిచ్చు, వార్తయంద జగము వర్తిల్లుచున్నది. బిభీషికలు, పొగడుచుండరాదె ప్రొద్దునోక; ఆవజ్ఞచేయు, అరుంతుదుడు;అనపాశ్రయయే; మిక్కిలి కన్నులు, జూదమ్మాడంగ కాన్పనాకు, అసురముడిగి పడియె, కన్నుమూయడు నాకున్" 'నిద్రరాదు' కంటె నిది ప్రౌఢము సుందరమును.

"క్షత్రియపుడైన విశ్వా
మిత్రునకు పవిత్రయైన మేనకకున్ స
త్పుత్రినయి బొంకువలుకఁగ
ధాత్రీతలనాథ యంత ధర్మేతరనే"

ఈ మొత్తము పద్యమునకు నాయకమణిగా 'అంత' అను చిన్న తెనుగుపదము కూర్పబడినది. రెండుభాషలలోను నెక్కడ నేశబ్దము వాడిన దీప్తి కలుగునో దానిని వాడుటయే యతని లక్ష్యముగాని యే యొక్క భాషాపదముపైనను ప్రత్యేకమైన మోజు నన్నయకుండదు. ఇక్కడ నీపదముతప్ప నన్యమేదియు నింత సొగసు గూర్పదుగదా. దీనితో మొత్తము తత్సమపదబంధము తెనుగుదనము వహించినది. ఇట్టిదే ద్రౌపది 'నిట్లు' చేసిన ఖలున్‌లోని 'ఇట్లు' ఇది పాత్రను సన్నివేశమును కనులయెదుట బెట్టును.

"ఎందుల దాన వేకతమ యియ్యమునఁ నది నోడసల్పుచున్
సుందరి నీకునున్కి యిది చూడగదా నుచితంబె ?

కవి సంభాషణాత్మకశైలి ఇక వర్ణనముచే

"మందమహానోజ్జ్వహాసముఖ మండలమెత్తి మృగాక్షిచూచి సం
క్రందన సన్నిభున్ నృపతిఁ గన్యక యిట్లనిపల్కె ప్రీతితో."

ఈ నాయికావర్ణనమును తత్సన్నివేశ చారుత్వమును నీ సుకుమార వర్ణసమావేశమున నెట్లు చిత్రింపఁబడినదో భావింపుఁడు. ఇందలి బిందుపూర్వక దకారప్రాస మీ శృంగార సన్నివేశమునకు తళుకు పూత.

పెద్దన మనుచరిత్రమునందలి సౌందర్యములను నన్నయ ఘట్టములనుండియే గ్రహించెననుట సుస్పష్టము. ప్రతిశబ్ద సార్థక్యమును, అర్థగాంభీర్యమును గలిగి సంస్కృతమున మేటికవుల కావ్యములతో తులదూగదగిన శిల్పవైభవము గలది మనుచరిత్ర.

"ఎందుండి వచ్చి తిందుల
కెందులకేగుదు మహామునీశ్వర విద్వ
ద్వందిత !......" అన్న నన్నయ పద్యము;
"ఎందుండి ఎందుబోవుచు నిందులకే
తెంచినార లిపుడు విద్వద్వందిత...

అన్నదిగా నైనది మనుచరిత్రలో,

నారలుగట్టు కూరలశ
నంబుగ నుగ్రవనంబులో"

అన్నది యథాతథముగా పెద్దన గైకొనెను.

కర్ణుండు 'సజల జలధర ధ్వాన గంభీర రవంబున' నన్నది శ్రీనాథుడు నలునకు 'ప్రావృషేణ్య పయోధర ధ్వానగంభీరంబైన యెలుంగు'గా వాడెను.

"అమలసుధారమ్య హర్మ్యతలంబుల
నవకుసుమామోద నందనముల
కృతకాద్రి కందర క్రీడా గృహాంగణ
వివిధరత్నోపల వేదికలను
కలహంసకలనాద కమనీయ
కమలినీదీర్ఘికా సైకత తీరములను"

అను సీస సౌందర్యము శ్రీనాథుని నాకర్షించి యుండబోలు.

నన్నయ సీసములు రెండు రకములు– కథా కథన సీస మొకటి, వర్ణనాససీము రెండు, మొదటి వానికి సమరుతిగాని చక్కని తీర్చిదిద్దిన పాదక్రమముగాని యుండదు. పై సీసము రెండవ రకమునకు చెందును. ఇవి నన్నయలో తక్కువ. ప్రబంధ కవులు రెండవరకమువానినే ఎక్కువగా నవలంబించిరి. శ్రీనాథుని సీసముల హొయలు చెప్ప రానిది.

"వచశ్శ్రీ, జయశ్రీ భూషణశ్రీ" వంటి మధ్యాంతములందు శ్రీకారముతోగూడి నేడు సారస్వత ప్రియుల మోదమునకు పట్టులైన ప్రౌఢ ప్రయోగములు నన్నయవే.

"నెఱి కుఱులున్ విలోలసిత నేత్రయుగంబును నొప్పులొల్కు వా
తెఱయును దీని యాననము తెల్వి కరంబు మనోహరంబు నా
యెఱిగిన యంతనుండి సతి నిట్టి లతాంగి తాంగి చూచి యే
నెఱుగ సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాస సంపదన్."

ఈ పద్యము నన్నయ యుభయ వాక్ప్రౌఢికి చక్కని మచ్చు తునక తెనుగు సంస్కృతములు నేర్పరింప జాలనంతగా యదికి పోయినవి.

ఇంద్రప్రస్థ వర్ణనమునందలి వృత్తములు ప్రబంధముల పుర వర్ణనములకు మాతృకలు.

"గంగ నిజాంగదీప్తు లెసగన్"
అన్న వృత్తపద బంధము
"గంగాధర పింగజటా
సంగమ మంగళవిశాల చటులతరంగన్
గంగానది సేవించెన్"

అన్న కందమునందలి బిందుపూర్వక గ కార ప్రాసానుప్రాస

లును తర్వాతి కవుల నదీ పర్వతాది వర్ణనల శబ్దాలంకారములకు ప్రత్యేక శైలులకు మూలములు.

"క్వణదనుకింకిణీకలిత కాంచన కాంచికలాపమున్
రణ న్మణికల నూపురంబులు సమధ్వని..."

అన్న దాని కమ్మని శైలీ బంధము, "రణన్మణి" యను దాని విరుపు నందము గీర్వాణికి బంగరుగంటల మొలత్రాడు గదా.

"సంకులమిళితాళీ నీల పరి
కుంచిత కోమల కుంతలన్
శకుంతల యను కన్యకన్ గనియె"

నన్న సమాస సౌరభము యావత్కాళి దాస శకుంతలా సౌంద ర్యము నాచికొన్నాడన్న దోసమా!

సభాపర్వమున నన్నయశైలి పరిపక్వమై పరాకోటి నందినదా అనిపించు. ఈ భాగము చాలావరకు నాటకీయ శిల్పసంపద గలది. శిశు పాలుని యుపాలంభన వాక్యములు, ఆ పాత్రను ఆ సన్నివేశమును కన్నుల యెదుటనే పెట్టును. ఇట్టి వాక్ప్రౌఢిమ మరెందు నింతగా కానరాదు.

"ఇతనికి గూర్తురేని ధనమిత్తు రభీష్టములైన కార్యమున్
మతి నొనరింతు రిష్టుడని మంతురుగాక, మహాత్ములైన భూ
పతులయు, విప్రముఖ్యుల సభన్ విధిదృష్ట విశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుడని యచ్యుతు నర్చితుజేయ బాడియే."

పాత్రముఖమున కవి చెప్పింపదలచిన భావ ముద్దీప్తమై స్పష్టమై సూటిగా శరమువలె నెట్లు వచ్చినదా యీ వాక్యరచనా విన్యాసము తెనుగుందనమునకు పొలిమేరగాదో ఆలోచింపుడు. "మీకు కావలసిన వాడైతే యింటికి తీసుకొనిపోయి కట్టపెట్టవలెను. గాని సభామర్యాద నుల్లంఘించుట" అను శిశుపాలునిభావమును చక్కగా చిత్రించి కృతకృత్యుడైనాడు నన్నయ.

"చనబేడికి దార క్రియయును,
జెవిటికి మధుర గీతియును, జీకునక
త్యనుపమ సురూపదర్శనమును."

ఇందు "పేడి. చెవిటి, చీకు" అనునవి తెనుగు మాటలు."దార క్రియ మధురగీతి, అత్యనుపమ సురూపదర్శనము" నునువి సంస్కృతము. ఇవి యొకదానిమించి యొకటి దీర్ఘములై పెంపుదలను చూపుచున్నవి. తెలుగుపదము లంగవికలుల బోధించును. సంస్కృతమునవి వారి కందని విషయమును నీసడింపునకీ భేదము కల్పింపబడినది.

ఇట్లే

"ఈ మునిపల్లె నుండుటిది యేల? కరం బనురాగ మొప్పగా
భామిని నాకు భార్యవయి భాసురలీల న శేషరాజ్యల
క్ష్మీమహనీయ సౌఖ్యముల మేలుగ నందు మనింది తేందు పా
దామలతుంగహర్మ్యముల హారి హిరణ్మయకుట్టి మంబులన్."

"ఈమునిపల్లె" చాల యల్పభోగసూచకము. ఆమెకు తగనిది. అతనిని చేపట్టినచో వచ్చులాభము సంస్కృత సమాసాలలో పోనుపోనుదాత్తముగా నుండునట్లు తద్భావన సూచక పదబంధముతో సాగినది. ఇదే కందుకూరు రుద్రకవి

"ఆకటా ! చేరెడు నేలకుందగడె ?
సప్తాంభోధి వేష్టిభవత్సక లోర్వీప కలాప..."

అను పద్యమున చేసెను. 'చేరెడునేల' అను తెలుగు పదయుగళము, మిగిలిన మొత్తము సమాసమునకు మెరుగుపెట్టినది. ఇది రెండు భిన్న స్థితిగతుల చూపవలసినప్పటి రచనా విధానము.

"భూరిగుణోన్నతులన దగు
వారికి, ధీరులకు, ధరణివల్లభులకు వా
క్పారుష్యముచన్నె మహా

దారుణమగి విషముకంటె దహనము కంటెన్"

ఈ పద్యమున నన్నియు సంస్కృతపదములే. తత్సమములైనవి. కాని రచనా చమత్కారమేమో మొత్తము తెనుగా యున్నట్లు భాసించును. సర్వ సులభముగా నున్నట్లు కన్పట్టు. ఈయన నీతులు ఈరకపుశైలిలో ఉండును. నీతుల బోధించుటలో మర్మమేమియు నుండరాదుగదా. అందుచే నిట్టి ఘట్టములు స్ఫటిక నైర్మల్యముగల సుస్పష్టభావబోధకములుగా నుండును.

"మూర్ఖపు శిశుపాల" అనునది చాల చక్కని రూపము. కోపమును తక్కువ యక్కరములలో బాగుగా స్ఫురింపచేయవచ్చు. తత్సమములలో చిత్రములైన రూపములెన్నో తయారై వాడబడినవి. "గుణవృద్ధ" నిదియొకరూపము.

తెనుగు వాక్య రచనా విన్యాసమున నందమునిందు మఱికొన్ని యుదాహరణములు చూడుడు :

"ఎడపక యర్ఘ్య మచ్చుతున
కిచ్చితి, మిచ్చిన దీనికిం దొడం
బడమని......" అను సహదేవు వాక్యము.

"ఏం, ఇచ్చాం, ఇస్తే, కాదనేవాడెవడో రమ్మను చూస్తాం" ఈ ఊతలో నీ భావము చిత్రింపబడినది. దానికి "ఇచ్చితి, మిచ్చిన" అనునవి పోషకములుగా వాడబడినవి.

ఇతనికి నిట్లు నమ్రారక ఎగ్గులువల్కగవోలె గాక. (ఊరికే తిట్టటానికి సాగిందిగాని లేకపోతేని) ఆశ్చర్య ప్రకటనకు 'ఆహా, ఓహో' శబ్దములు వాడక వాక్యరచనలోనే దాన్ని ద్యోతింపచేయుటకు 'అర్ధరాత్రంబు నపుడుగాని కుడువదట్టె?" అనుట ప్రౌఢిమ. ఇవన్నియు వ్యంగ్యవైభవము నంతర్భూతము చేసికొనినవే.

ఇట్లు భయభాషల శబ్దములను వాడుటలోని నైపుణ్యమున

నన్నయ కావ్యముల శిల్పసంపద నంతను వెల్లివిరియించినాడన్న నతిశయోక్తి కాదు.

శ్రీనాథ కవిసార్వభౌముడు నన్నయాదుల యందములన్నియు తన కావ్యముల గూర్చినట్లు చెప్పికొనుట సత్యమే. ఇవన్నియు శ్రీనాథునిలో జూపుట ప్రకృతముకాదు. కావున నుపేక్షించితిని'

సారస్వత ప్రక్రియలో, ప్రయోగములలో. అందములు స్వానుభవమున నెఱుంగవలెనేగాని దిఙ్మాత్రముగా జూపిన విమర్శల వలన సంపూర్ణానందము కలుగదు. అయినను నాయోపినంతవఱకు, నా నేర్చినంతకు, స్థాలీపులాకముగా జూపితిని. సహృదయులు గ్రహింతురు గాక !



# నన్నయ గద్యగతులు

శ్రీ వి. సత్యనారాయణ

వచనము.గద్యము తెలుగులో దాదాపు యేకార్థమున ప్రయోగింప బడుచున్నది. కొన్ని తావుల-అనగా అశ్వాస గద్య మొదలగు చోట్ల మాత్రమే "గద్య" అనేగానివచనమను వాడుక లేదు. సంస్కృతములో గద్యకు వచనమను నామాంతరము లేదు. నిజమునకు వదమనే పదము సంస్కృత పదమైనప్పటికిని అది భాషలో గద్యకు బదులుగా నాడబడలేదు. తెలుగులో యే కాలమున అది గద్యకు మారు పేర యిందో చెప్పలేము గాని నన్నయ కాలము నుంచియు అవి పర్యాయములై యుండుననవచ్చును. "సర్వార్థ వచన రచనా విశారదు" (1-1-8) లను చోట వచనమునకు వేరే అర్థమున్నను గద్యమునకు పర్యాయమైన వచనమును కూడ నన్నయ మనసునందుంచుకొనియే ప్రయోగించి యుండు ననుట అసమంజసముకాదు. "వచనము లేకయ వర్ణన-రచియింపఁ గొంతవచ్చు ..." (నిర్వ. రా. 1-15) అని తిక్కన పేర్కొనుటచేత తిక్కన కాలము నుండి అవి పర్యాయములే యని మాత్రము మనము ఖచ్చితంగా నిర్ణయింపవచ్చును.

సంస్కృతములోను కన్నడములోను దాదాపు పదవ శతాబ్ది నుండి చంపూ కావ్యములును, సంస్కృతములో అంతకుముందు చాలా కాలము క్రితమే గద్య కావ్యములు రచితములు. సంస్కృత కన్నడ చంపూ సంప్రదాయముల ననుసరించి నన్నయు చంపూ రీతిలోనే ఆది కావ్యావిర్భావమునకు నాంది పలికెను. తరువాతి కవులందరును నన్నయనే అనుసరించినవారై దాదాపు యీ పద్ధతియే 19 వ శతాబ్ధి వరకు అవిచ్ఛిన్నముగా సాగిన దనవచ్చును.

నన్నయ తాను రచించిన రెండున్నర పర్వముల భారత భాగ మూడవ వంతు వచనమునే ప్రయోగించి యున్నాడు. తెలు

గులో మరి యే కవియు వచనమునకు నన్నయ యిచ్చిన ప్రాధాన్యత నివ్వలేదు. పద్య గద్యములను వేర్వేరుగా లెక్కించి నట్లైతే అన్నిటి కన్నా వచన సంఖ్యయే అధికము. తరువాత స్థానము కందపద్య మాక్రమించును.

నన్నయ సంఖ్యలో మాత్రమే గాక రచనా విధానములోను పద్య గద్యముల కభేదమాత్రముగా రచన సాగించినాడు. ఇట్లు వచనమునకు పద్యమున కిచ్చినంత గౌరవము నిచ్చిన కవి తెలుగులో మరి యొకడు లేడు.

'గద్యం కవీనాం నికషం వదంతి' అను ఆరోక్తి తెలుగులో ఒక నన్నయ యందే ప్రవర్తించును. మిగిలిన చంపూకవులెవరును గీటురాయిగా భావించి వ్రాయలేదు.

తెలుగులో నన్నయ పద్య విద్య కాద్యుడైనట్లే గద్య విద్యకును ఆద్యుడగుటయేగాక ఆద్యంతములు నతడే యనుటలో (ప్రాచీనులలో) అసమంజస మెంతమాత్రము లేదేమో యనిపించును.

సంస్కృతమున అలంకారికులు గద్యమును చూర్ణకము, ఉత్కలికా ప్రాయము, వృత్తగంధి అని మూడు విధములుగా విభజించిరి. ఈ చూర్ణకాది భేదములను నన్నయ యెట్లు నిర్వహించెనో తెలుపుటయే యీ వ్యాసోద్దేశము. ఇట వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిలోని లక్షణములే గ్రహింపనైనవి.(విస్తరభీతిచే లాక్షణికు లందరి లక్షణములను,వానిఔచిత్యానౌచిత్యములను పరిశీలింపక విడువనైనది.)

1. చూర్ణకము :- వామనుడు దీనినే చూర్ణమని వ్యవహరించెను. 'అనావిద్ధ లలిత పదం చూర్ణమ్' అని అతడు నిర్వచించెను. (1-3-24)

భరతముని గద్యమునే చూర్ణమని పేర్కొనెను. తెలుగులో సంకీర్తన లక్షణకారకుడు కృష్ణమాచార్యాదుల వచనములను చూర్ణ

ములనియే ప్రయోగించెను. (చూ. వచన రచన-త్రాక్షపాక వాసు-సింహావలోకనము-వేటూరి ప్రభాకరశాస్త్రి పు. 99)

సులభశైలియే దీనికి ప్రాణమని భావింపవచ్చును. లలిత పద సమాయుక్తమై యుండుట, అసమాసకమై యుండుట దీని ప్రధాన లక్షణము. ఒకరకంగా జెప్పవలెనంటే తేట తెలుగు తియ్యదనమంతా చూర్ణకములోనే యిమిడి పోవును.

నన్నయ యెక్కువగా సంస్కృత పదజాలమునే ప్రయోగించి యున్నను తెలుగునారి కర్థముకాని సంస్కృతపదజాలమందు తక్కువ. నన్నయ వచనములలో ఉత్కలికాప్రాయము కన్నా చూర్ణకములే యెక్కువ. ఆయనది కథాకథన పద్ధతి యగుటచేత చూర్ణకములే యెక్కువ దొరలిన వనవచ్చును.

ఈ వచన భేదముతో చిన్నచిన్న వచనములు లెక్కకుమిక్కిలి గలవు గాని పెద్దవచనముల రెండింటిని మాత్రము ఉదాహరింతును.

**(i)** "వ. అట్టి యింద్రోత్సవంబున నతి ప్రీతుండయిన యిందుి వరంబున నుపరిచరుండు బృహాద్రిథ, మణివాహన సౌబల యను రాజన్యులనియెడి కొడుకుల నేవురం నడసి, వారల బెక్కు దేశంబుల కభిషిక్తులంజేసిన నయ్యేవురు వాసవులు వేఱు వేఱు వంశకరులయి పరగి రట్లు పరిచరుండు లబ్ధసంతానుండయి రాజర్షియయి రాజ్యంబు సేయుచు నిజపుర సమీపంబునం బాఱిన శక్తిమతియను మహానదిం గోలాహలంబను పర్వతంబు గామించి యడ్డంబు వడిన..." (1-3-26) ఇత్యాది వచనమంతయు చూర్ణకమే.

**(ii)** "వ. దీనియందు రాక్షస భావం బుపలంక్షీప వలవదు మాకు నాత్మీయ బుద్ధియ యుండుననిన హిడింబ ధర్మరాజునకుం గుంతీ దేవికి మ్రొక్కి యేకాంతంబునఁ గుంతి కిట్లనియె నవ్వా! సర్వప్రాణు

లకు సామాన్యంబయ్యును, మనోజరాగంబ వనితల కసహ్యంబయి విశేషంబయి యుండు నేను వృకోదరు నిమిత్తంబు మదనబాణ బాధితనయి ...” (1-6-222) ఇత్యాది మరి కొంత వచనమున్నది.

2. ఉత్కలికా ప్రాయము : 'విపరీత ముత్కలికా ప్రాయమ్' అని వామనుడు దీనిని నిర్వచించెను. (1-3-25). విపరీతమనగా చూర్ణకమునకు వ్యతిరిక్తమైనదని యర్థము. చూర్ణకము అసమాసకము కాగా ఉత్కలికాప్రాయము దీర్ఘసమాసకము. ఇదియెక్కువగా ఓజోగుణము నుద్దీపింపజేయును.

దండ్యాచార్యుడు “ఓజః సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్” అని కావ్యాదర్శములో నిర్వచించెను.(1-80) ఓజోగుణము = గద్యము> ఉత్కలికాప్రాయ గద్యము-అని భావింప వచ్చును. ఇది సమాస భూయిష్ఠమై యుండును. సమాస భూయిష్ఠమైన గద్యమే యెక్కువగా రాణించుననియు అసమాసక గద్యము వినుటకుసొంపుగా నుండదనియు దండి అభిప్రాయమైయుండును నిజమునకు సంస్కృతములోని గద్య సమాస భూయిష్ఠమైతేనే అందంగా ఉంటుంది. అసమాసకత అందు రాణించదు. తెలుగు పదజాలములో నిది కుదరదు. కావున తెలుగులో ఉత్కలికాప్రాయ గద్యమును రచించు కవులు అట్టి సందర్భములందు సంస్కృత పదజాలమునే ఆశ్రయించిరి.

నన్నయ ఉత్కలికాప్రాయముల నేలనో అంతగా రచింపలేదు. ఆయన కథాకథన పద్ధతికిది సరిపోదు కాబట్టి దానినంతగా రచింపలేదేమో అని అనిపించును. పద్యములలో ఓజోగుణమును యెన్నో మార్లు ప్రదర్శించిన నన్నయ అదే సందర్భములోని దయ్యును వచనములో నీగుణము నంతగా స్పృశింపలేదు. అసలే వ్రాయలేదని అర్థము కాదు. తక్కువగా వ్రాస్తాడని భావము. దీనికి రెండుఉదాహరణములు పరికింపుడు —

**(i)** "వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటన కుపిత కుంజరవైరియుంబోలెఁ గడునలిగి పటుకుటిలభ్రుకుటీఘటిత నిటలుం డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె" (2-1-195).

**(ii)** "వ....ద్రుపదుం డైశ్వర్య గర్వంబున మెచ్చక పలికిన విని ద్రోణుం డవమానజనిత మన్యుఘూర్ణమాన మానసుండయి యెద్దియుం జేయునది నేరక పుత్రకళత్రాగ్ని హోత్రి శిష్యగణంబులతో హస్తిపురంబునకు వచ్చె..." 1-5-206).

వేట వన, పుర వర్ణనాదులలో నీ గద్యభేదము నెక్కువగా తెలుగు కవులు వాడిరి, దీనికి నన్నయయే మార్గదర్శకుఁడు కానోపు. పురవర్ణన సందర్భములోని ఒక ఉదాహరణ తిలకింపుడు.

**(iii)** "వ. అని పంచిన వారును వారణావతంబున ననవరత సురభికుసుమ ఫలభార సశ్రమశాఖా విశాల తరువనరేఖా లంకృతం బనియును, వన జలకేళీ కందుక మృగయాది వివిధ విహార హారిప్రదేశాభిశోభితం బనియును నవసుధా ధౌతసౌధ సుధాకర నికర ప్రభాపటలు ప్రధ్వంసితాసితపక్షదోషం బనియును..." (1-6-133) ఇత్యాదిగా మరికొంత వచనము గలదు.

3. వృత్తగంధి :– 'పద్యభాగవత్ వృత్తగన్ధి' (1-3-23) అని వామనుడు నిర్వచించెను.

కవులు సాధారణముగా ఛందోయుక్తమైన రచనయందే ఆసక్తి కలిగి యుందురు చంపూ కావ్యమునందు పద్యముల మధ్య అచట నచట వచనములు ప్రవేశించుచుండును. ఆ పద్యము వేగములోనే గద్యమునందును ఛందోయుక్త రచన గానిపింపవచ్చును. కేవల గద్య కావ్యము నందును కవికి తెలియకనే వృత్తగంధుల రచితములు కావచ్చును. ఇట్టివానినే వృత్తగన్ధి గద్యములుగా లాక్షణికులు పేర్కొనిరి.

నన్నయ రచనలో యిట్టివి పెక్కులు గలవు. కొలది మార్పు

లను గావించిన పూర్తి పద్యపాదములు లభించు వచనములున్న గలవు. అసమగ్రముగా పరిశీలించియు నేనే యింతవరకు 30 దాకా యిట్టి వచనములను గుర్తించితిని. సూక్ష్మ పరిశీలన గావించిన యింకను యెన్నింటినో గుర్తింపవచ్చును.

విస్తరభీతిచే రెండుఉదాహరణములను మాత్రమే పేర్కొందును.

(i) "వ. గరుడండును గద్రువ పంచిన పనులెల్లను వినత యను మతంబున నతి వినయపరుండై చేయుచు." (1-1-44)

ఇందు సీస పద్యపాదము గలదు.—

సీ. "గరుడండును గద్రువ పంచిన పనులెల్ల
 ను వినత యను మతంబున నతివిన
యపరుఁడై చేయుచు"—

(ii) "వ. అని రుక్మాసుర వచనంబుల నాక్షేపించుచున్న శిశుపాలుంజూచి సహింపనోపక భీమసేనుం డతిరౌద్రాకారంబుగ నలిగిన." (2-2-50)

ఇందు కంద పద్యపాదములు రెండు గలవు.

కం. "రూక్మాక్షుర వచనంబుల
 నాక్షేపించు—శిశుపాలుఁజూచి సహింపన్

కొలది మార్పులతో నన్నయ వచనముల నెన్నింటినో పద్యములుగా మార్చవచ్చునని తెలియుచున్నది. ఒక్క ఉదాహరణ మాత్రమిచ్చెదను.

(iii) 'వ అగ్గరుఁడని మహాత్మ్యంబు నీవు నెఱుంగుడి నదియెట్లనినఁ దొల్లి కశ్యపప్రజాపతి పుత్రార్థియై భవత్ప్రభృతులైన దేవగణంబులను దనకు సహాయులనుగాఁ బడసి...' (1-2-84)

ఇందు తేటగీతి పద్యము గలదు—కొలది మార్పులతో.

తే. గీ. 'అగ్గరుఁడని మహాత్మ్యంబు నీవు నెఱుఁగు
దువది యెట్లనినన్ దొలి కశ్యపు (డను
యా) ప్రజాపతి పుత్రార్థియై భవత్ప్రి
భృతులయిన దేవ గణ (ములన్) వాలఖిల్య'-

ఈ విధముగా గద్య భేదములను నన్నయ యెంతో చక్కగా భారతమునందు నిర్వహించి తర్వాతి కవులకు యెన్నియో అంశము లందు మార్గదర్శకుడైనట్లే వచనరచనయందును మార్గదర్శకుడయ్యెను. పద్యగద్యముల రెంటికి నాద్యుడై నన్నయ సంస్తవనీయుడయ్యెను.

—0—

# నానారుచిరార్థ సూక్తినిధి నన్నయ

## శ్రీ పరిమి సాంబయ్య

సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకవితా (వివిధా)ర్థ యుక్తిలో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురు డయ్యె జగద్ధితంబుగన్.

ఆంధ్ర సాహిత్యోద్యాన వనమున విహరించు రసికులకే కాక ఆబాల గోపాలమునకు ఆనందమును కల్గించు ఏకైక ద్వైపాయనోద్యాన జాత మహాభారత పారిజాతపదంకుసుమమిది.అంతేకాదు. వివిధ కుసుమ పరిమళార్థముల స్వరూపమును ముంజేతి కంకణమువలె నిరూపించు ఈ పద్యమును నన్నయదని వేర చెప్పపనిలేదు.

పై పద్యమునందు నన్నయ తనను గూర్చి 'నానా రుచిరార్థ సూక్తి నిధి' అను విశేషణమును వాడుకొనినాడు. ముందుగా ఈ పద బంధముపై గల పూర్వవివరణలలో కొన్నింటిని పరిశీలింతము.

1. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'సారమతి నన్నయ'లో 'ఇచ్చట ప్రియమైన సూక్తులు అని అర్థము చెప్పుటకన్న ఉజ్జ్వలము లైన అర్థములును, సూక్తులును, అని ద్వంద్వ సమాసముగా అర్థము గ్రహించుటలో ఔచిత్య విశేషమున్నది.' పుట. (112)అనినారు.

2. శ్రీ డా॥ మృత్యుంజయరావు 'వ్యాసభారతము – నన్నయ పరిష్కారము' లో-'అనేకములైన రుచిరము (మధురము) లగు నర్థములతోఁ గూడిన సూక్తులకు నిధియని యర్థము. నన్నయ రచనలో నెన్నియో మృదుమధురములయిన సూక్తులుండునవి భావము' (పుట 739) అని వివరించి, నన్నయ భారతమున గల సూక్తులలో సుమారు నూటయేబదింటిని పొందుపరచి వానిని 1. లోకనీతి, 2. రాజనీతి, 3.

ఆధ్యాత్మిక ధర్మము, 4. లోకజ్ఞత, 5. శాస్త్రజ్ఞత. అని వింగడించి వివరించిరి.

3. (శ్రీ) డా॥ శలాక రఘునాథశర్మ 'భారతధ్వని దర్శనము'లో సూక్తి యనఁగా మంచిమాట. అది మానవుని మంచినతముసకుఁ జక్కని రాచబాట. రుచిరమైన అర్థములతోఁ గూడిన సూక్తులు మధురము లైన ఔషధముల వంటివి. అవి గ్రహింపబడునప్పుడు గాని సేవించిన పిమ్మటఁగాని, యెట్టివికారమును బుట్టింపక, మానసారోగ్యమును పరీక్షించి మానవునకు సౌమనస్యమును సంధానించును' (పుట.256) అని వ్యాఖ్యానించిరి.

4. (శ్రీ) డా॥ పాటిబండ మాధవశర్మ 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మహాభారత (అరణ్య పర్వ) పీఠిక' లో

'భారతములో కాగమన్యాయమై కాంతగృహము అని చెప్పి నన్నయ అన్యాయములను ప్రతిపాదించు వాక్యములను, సూక్తులను చెప్పినాడు' (పుట 20) అని కొన్నింటిని మూదలించిరి.

5. (శ్రీ) డా॥ దివాకర్ల -'నన్నయభట్టారకుఁడు'ఆంధ్రకవి నక్షత్ర మాలిక-1 ప్రచురణ. 1972 లో-పై పద్యమున నన్నయ తనకు 'నానారుచిరార్థసూక్తినిధి' అను విశేషమును వాడుకొని యున్నాడు. సూక్తులనఁగా సుభాషితములు. అతడు పెక్కు-రుచిరార్థములైన సుభాషితములకు నిధి యని పైవిశేషణముయొక్క అర్థము, (పుట. 73) అనిరి. మొత్తము పై తేలిన సారము సూక్తులనగా నీతులు. అట్టి నీతులకు నన్నయ నిధి అని. ఇట్టి నిధియైన నన్నయ నీతిపద్యములను వ్రాసికొనక భారత రచనకేల 'ఉపక్రమంచెను? అని ప్రశ్నించుట కవకాశము కలదు.

మహాభారతము కేవలము నీతిశాస్త్రము కాదు. అనేక శాస్త్రముల సంహిత. 'సారమతిం గవీంద్రులు'అను పద్యమునందు నన్నయ

తనకు తానిడుకొనిన విశేషణము, 'నానారుచిరార్థ సూక్తినిధి'. వివిధార్థ ప్రతిపాదితమగు భారతమును తెనిగించుచు నన్నయ కేవలము 'నీతినిధి' అయినచో తెనుగు భారతము నీతిశాస్త్రముగనే ఉండెడిది, అట్లుకాక సంస్కృత భారతమునకును దక్కిన గౌరవము తెనుగు భారతమునకు దక్కుటచే, ఇది కేవలము నీతిశాస్త్రము కాదనియు, తత్కర్త కేవలము 'నీతినిధి' కాడనియు ఊహింపవచ్చును.

"నానారుచిరార్థ సూక్తినిధి" త్వము నన్నయ యొక్క పరిపూర్ణ ప్రజ్ఞాకౌశలమును చాటు విశేషణము. కాని అయన యొక్క నీతికుశలతకే పరిమితము కాదు. అనగా ఈ పదబంధమునకు నీతినిధి అని అర్థము చెప్పుటకన్న, మత్యమరాధిపాచార్యుడు. ఉభయ భాషా కావ్య రచనాభి శోభితుడు, లోకజ్ఞుడు, బ్రాహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు, సంహితాభ్యాసుడు, విపులశబ్దశాసనుడు, అయిన నన్నపార్యుని సర్వతోముఖ ప్రజ్ఞకు తగినట్లుగ సంభావించుట మిన్న.

'నానా రుచిరార్థ సూక్తినిధి' అనగా—అనేకములైన రుచిరములగు అర్థములనిచ్చు శ్రేష్ఠములైన మాటలకు నిధిఅని అర్థము చెప్పవచ్చును. శ్రీ ఇంద్రగంటి—"ఇచట ప్రియమైన సూక్తులు అని అర్థము చెప్పుటకన్న 'ఉజ్జ్వలములైన అర్థములును, సూక్తులును"అని ద్వంద్వ సమాసముగ అర్థము గ్రహించుటలో ఔచిత్యమున్నది.' అని ఇందు గల ఉజ్జ్వలములగు అర్థములకు ధర్మనీతి బోధనమనియు, "సూక్తు" లనగా అనుభవ పరిపాకములో గ్రహించిన జీవనసత్యములకు చెందిన లోకోక్తులనియు గ్రహించిరి. వీరు రుచిరార్థ అను పదబంధమునకు విస్తృతార్థమును చెప్పి, దీనిని కేవలము ధర్మనీతి బోధనకే పరిమితమనునట్లు వ్యాఖ్యానించిరి అని ఊహింపవచ్చును.

వారు అనినట్లుగనే ద్వంద్వ సమాసముగనే "నానా రుచిరార్థ సూక్తినిధి" కి 'నానారుచిరార్థనిధి'"నానాసూక్తినిధి" అని అన్వయము

చెప్పినచో, పై నవారు ఈ పదబంధమునకు చెప్పిన అర్థము లన్నియు 'నానాసూక్తి నిధి' అనుదానివలన పొందవచ్చును.

ఇక మిగిలిన 'నానారుచిరార్థ సూక్తినిధి'త్వము వలన రమణీయార్థ ప్రతిపాదకత్వము నన్నయకు సిద్ధించి ఆయనయొక్క సర్వతోముఖ ప్రజ్ఞను బహిర్గతము చేయునది కాగలదు. ఇది నన్నయ తనకు తానిడుకొనిన విశేషణమగుటచే ఈపదబంధమును మహాకవిత్వ లక్షణముతో అన్వయించుట అనుచితము కాదనుకొందును.

ఈ సందర్భమున నన్నయకు పూర్వాలాక్షణికుల కావ్య నిర్వచనములను ఈ విశేషణమును పరిశీలింప తగును.

భామహుని (క్రీ. శ. 5. శ.) కావ్య నిర్వచనము—శబ్దార్థౌ సహితౌ కావ్యం—నన్నయ తన విశేషణమున ప్రయోగించుకొనిన 'అర్థ' 'సూక్తి' శబ్దములుపై పై నిర్వచనముగల అర్థములను స్ఫురింపజేయునవిగా ఉన్నది. అటువంటి శబ్దార్థములకు నిధిఅగుటచే, నన్నయ ప్రయోగించుకొనినవిశేషణముచే భామహునికావ్యలక్షణము ధ్వనింపచేయబడినదిగా ఉన్నది. అంతేకాదు కావ్యమునకు కావలసినది కేవలము శబ్దార్థముల సహితత్వము కాదనియు, అ శబ్దార్థములు రుచిరముగా నుండవలెననియు నన్నయ భావన. శబ్ద రుచిత్వమే అక్షర రమ్యత. అర్థరుచియే ప్రసన్నకథా కవితార్థయుక్తి. ధ్వని సిద్ధాంత ప్రవక్త ఆనందవర్ధనుని **(10th A. D.)** నిర్వచనము.

'కావ్య స్యాత్మా ధ్వనిః'—వాచ్యార్థము కంటె భిన్నమైనది. రమణీయమగు అర్థాంతరమును స్ఫురింపజేయునది ధ్వని. నన్నయ, 'నానా రుచిరార్థనిధి' అనుటచే ధ్వని కారుని సిద్ధాంతమునకు నన్నయ భారతము మూలగా నున్నది.

'నానారుచిరార్థ సూక్తినిధి' అను విశేషణమునకు మరియొక

అన్వయము చెప్పవచ్చును. 'రుచిరార్థము' ప్రసన్న కథా కవితార్థమును, సూక్తి నిధిత్వము అక్షర రమ్యతను స్ఫురింపజేయుచున్నవి.

కావ్యమీమాంసాకారుడైన రాజశేఖరు (క్రీ. శ. 9) ని 'ఉక్తి విశేషః కావ్యం' అను నిర్వచనము నన్నయకు గల విశేషణములోని 'సు+ఉక్తినిధి' త్వముచే అన్వయ మగుచున్నది.

నన్నయకు 6 శతాబ్దముల తరువాతి వాడగు జగన్నాథ పండితరాయలు (క్రీ. శ. 17 శ) గావించిన 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం' అను కావ్య నిర్వచనమునకు ప్రాణమైన 'రమణీయార్థ'మునకు సమానమైనది 'రుచిరార్థ'ము. అంతే కాదు. నన్నయ ప్రయోగించిన 'నానారుచిరార్థసూక్తి'యే జగన్నాథ పండితరాయలకు 'రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యం' అని నిర్వచించుటకు ఆధారమై యుండి యుండవచ్చును.

జగన్నాథుని కావ్య నిర్వచనమున ఉత్తమ కావ్యమే రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము. నన్నయ కవిత్వమున రుచిరార్థ ప్రతిపాదక మైనది 'సూక్తి'. అనగ 'నీతి' 'సుభాషితము' అని అర్థములు చెప్పుట కన్న సు+ఉక్తి = మంచిమాట, అని చెప్పదగును. సూక్తులు (మంచి మాటలు) కేవలము నీతులనే సూచింపవు, రమణీయార్థ ప్రతిపాదకమైన మాటలు అని కూడ ధ్వనింపజేయును. కావున నన్నయ 'నానారుచిరార్థసూక్తి నిధి' అగుటచే భారతము కవివృషభులకు మహాకావ్యముగను వెలసినది.

—o—

# పద్యవిద్యా—నన్నయ భారతావతారిక

ఆచార్య. తుమ్మలపూడి కోటేశ్వరరావు

వాల్మీకి పద్యవిద్య కాద్యుడని నన్నయ తీర్పు. దీంతో తెనుగు బాసకు తానంతేనని తర్వాతి మనతీర్పు.

విద్య ఏమిటి? దానికి రెండర్థాలు: 1. కళ, 2. శాస్త్రం. అది ప్రతిభాజన్యం. అది హృదయం. ఇది మేధ. అది అనుభవం. ఇది విచారణ. అది స్ఫురణారూపం (ఇన్ ట్యూషన్ అని క్రోచే) ఇది దాన్ని ఆలోచించి ఒక క్రమంలో బంధించే సూత్రం. ఇదొక పరిణామం. ప్రమాణం. భౌతికం కానిది. ఆలోచనకు మాత్రం అందేది. ఇదే ఛందమంటే (వచన కవిత్వానికి అడుగున సంగీతముందన్న ఇలియట్ వాక్యానికర్థం ఇదే) అందుచేత ప్రతిభాజన్యమైన భావం మనస్సు ద్వారా, ఛందస్సుద్వారా అభివ్యక్తమైతే అది పద్యం. లక్షణానికి సరిపడిందే కాదు. అది శాసన పద్యం. నన్నయ పద్యం విద్యాసనాథం.

భావముంది అది అనేకధా భిన్నంగా వుంటుంది. దాన్ని వ్యక్తీకరించటం ఛందోప్రజ్ఞా విషయం. ఇది దాన్ని అనుభవ జనకంగా — ఆవిర్భవింప చేస్తున్నది. ప్రతిభావంతుడంటే కవి. మనీషి అంటే ప్రజ్ఞావంతుడు. ప్రతిభ దర్శించేది. దాని లక్షణం చూడటమే. మనిషి లక్షణం ఆలోచన. తప్పొప్పుల నిర్ణయంబు జూపపరచుకోవటం. ఇదంతా లౌకికం. అనగా లోకాధారంగా శాస్త్రాధారంగా నిర్ణయించుకోవటం. ఇది తార్కికం. ఇదీ పద్యమంటే. అందుకని నన్నయ ఆద్య కవి. శాసనకర్త కాడు. అందులోనిది పద్యంకాదు. లక్షణోపేతమంటే. ప్రతిభ అలాగే వ్యక్తమైతే మంత్రం. ప్రజ్ఞద్వారా వ్యక్తమైతే శ్లోకం, పద్యం. అది తత్త్వం. ఇది రసతత్త్వం. అందుకని కావ్యపద్యం

మంత్రం నుండి, శాసన పద్యం నుండి వేరవుతున్నది. నన్నయ అవతారిక సంపూర్ణమైనట్టిది. దానంతటదొక కావ్యం.

కవి తనను గూర్చి తాను చెప్పుకొన్న పద్యం తన కుల బ్రాహ్మణు-అన్నది. ఆ పద్యం తననుగూర్చి తాను చెప్పుకొన్నా అది లోకదృష్టిలో తానెట్టివాడో జనవాక్యంగా చెప్పుకొన్నదే తప్ప ఉత్తమపురుషలో చెప్పుకోలేదు

వ్యక్తిత్వం బాహ్యాభ్యంతర భేదాలుగా రెండురకాలు. బాహ్య వ్యక్తిత్వంలో తను ఊరూ పేరూ ఉద్యోగాదులు, దీనికి సంబంధించిన మాటలివి (తన కుల బ్రాహ్మణుడు-ముద్గల గోత్రజాతుడు-ఆపస్తంబ సూత్రుడు.)

శీల విషయక శబ్దాలు : సద్వినుతావదాత చరితుడు, సుజనుడు పాత్రుడు.

పాండిత్య విషయకాలు : బ్రహ్మాండ పురాణవేత్త-విపుల శబ్ద శాసనుడు. ప్రతిభావంతుడు. ఉభయభాషా కావ్యరచనాభి శోభితుడు. లోకజ్ఞత :

ఋషిత్వ సంబంధాలైన మాటలు-అవిరళ జపహోమ తత్పరత్వము-సంహితాభ్యాసి, నిత్యసత్య వచనుడు.

ఇందులో నన్నయ కవితా వ్యక్తిత్వముంది. పాండిత్య లోకజ్ఞత-విపుల శబ్ద శాసనత్వము బాహ్యకారణాలు కాగా ప్రతిభ బీజ కారణ భూతమౌతున్నది. అతని శీలము-వైదికత (సంహితాభ్యాసాదులు) ప్రతిభా పాండిత్యాల కాధారమైన అంశం. స్వచ్ఛమైన మనస్సు - హృదయమూ కావ్యభావ ప్రతిబింబయోగ్యాలు. భారత రచనకు యోగ్యతా ప్రదాయకాలు. ఇది చూచి రాజరాజాయన కాపని వప్పగించాడు. రాజరాజు ధర్మవిదుడు. పైదంతా నన్నయ ధర్మం-గుణం-వ్యక్తిత్వం. అది చూచి, భారతం పవిత్రగ్రంథం. బహు

యాగ ఫలప్రదాయకం కనుక. (15-16 పద్యాలు-పీఠిక) అది రెంటి కున్న సంబంధాన్ని చూచి ఆపని కీయన అర్హుడని భావించటం ధర్మ విరుద్ధం. అతనికీ ధర్మ వేత్ృత ఎలా వచ్చిందంటే 'తన కుల బ్రాహ్మణు అన్న పద్యం క్రింది పద్యం చెబుతున్నది.' 'విమల మతిం బురాణములు వింటే' నన్నదే ఆపద్యం రాజరాజు కావ్యనాటకాదుల చదివి - శాస్త్రాలు చూచి పూజ్య శివాగమాలపై హృదయం లగ్నం చేసాడుట. తత్ఫలితం ధర్మవేత్తృత. పైగా నన్నయ కులబ్రాహ్మణుడు గురువు. పురోహితుడు రాజునకు హితవర్గంలోని వాడని రాయల రాజనీతి (ఆముక్త 4273) తదనురక్తుడు - రాజునందు నన్నయ కనురక్తి. మంత్రాంగదక్షుడు. మత్యమరాధిపాచార్య శబ్దంతో అది వ్యక్తమౌతున్నది. కాగా నన్నయ లోకజ్ఞుడు - వేదవేదాంగ వేత్త - శాస్త్ర వేత్త - మంత్రాంగవేత్త కవి. ఇది అతని అంతర వ్యక్తిత్వం. అది ధర్మం. అది తెలిసినవాడు రాజు.

భారత మెలాంటిది. వ్యాస స్వరూప స్వభావాలు ఎలాంటివి? యాగ ఫలము. గోశతదాన ఫలము భారత శ్రవణంచేత లభిస్తాయన్న పద్యాలు భారత పవిత్రతను చెప్పేవి. అమలిన తారకా సముద్రయం బులనెన్నను-అన్న పద్యం దాని అగాధత్వాన్ని చెప్పేది.'ధర్మతత్త్వ జ్ఞులు ధర్మశాస్త్రంబు' అన్న పద్యం దాని బహుముఖీ దృష్టిని చెప్పేది. ఇది ఐతిహాసిక వైశాల్యము.

"ఏయది హృద్య మపూర్వం బేయది ఎద్దాని వినిన ఎఱుక సమగ్రంబై యుండు నఘనిబర్హణ మేయది - (30)

అమితాఖ్యానక శాఖలంబొలచి వేదార్థా మలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్ప వితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థఫలమై - ద్వైపాయనోద్యాన జా
తమహా భారత పారిజాత మమరున్ ధాత్రి సురప్రార్థ్యమై (66)

ఇవి భారతంలోని మహాకావ్య దృష్టిని చెప్పేవి. కావ్యము హృద్యము. ఎప్పుడు అపూర్వతచేత, ఇది అనుభవాంశ, ఎఱుక - జ్ఞానాంశ, శాస్త్రీయాంశ, అఘనిబర్హణ-ధర్మదృష్టి. ఇది సాంఘిక సమన్వయాంశ. మహాకావ్యంలో ఈ మూడంశాలు వుంటాయి. భారతమొక కల్పవృక్షం. ఇది భూలోకంలో, స్వర్లోకంలో దాన్ని అనుభ నీడచేవారు దేవతలు. దేశపండితులు, దీనికి కథలే శాఖలు అనటంచేత ఇది కావ్య నిర్మాణ విషయాన్ని సూచిస్తున్నది. వృక్షం నిర్మాణ సంకేతం. ఇందుకే వైదిక వాఙ్మయంలో అది సృష్టి ప్రతీకగా చెప్పబడటం తటస్థించింది. బోద-కాండం-కొమ్మా-రెమ్మా-పువ్వూ-ఫలం-ఇది క్రమ నిర్మాణం. కావ్యంలోనూ బీజం మొదట ఉండి పోనుపోను విస్తరిల్లి ఫలంగా పర్యవసిస్తుంది. ఇదే పంచ సంధిగత విషయంగా నాటక విషయంలో నాట్యశాస్త్రం చెప్పినది. కాబట్టి ఇది నిర్మాణాంశం. నీడభారతానికి వేదార్థం-తత్త్వబోధ. దీనిచే సంక్రమించేది చతుర్విధ పురుషార్థాలు. అవే పూలు, ఫలం కృష్ణార్జున ద్వంద్వం. కృష్ణుడు ఈశ్వరుడు - దైవము. అర్జునుడు నరుడు-జీవుడు. వీరి సమన్వయకథ భారతం. ఇది ఐహికాముష్మిక సమన్వయ రూపమైన ఆర్ష నాగరికతా సారం, చెట్టు నీటి ఒడ్డున- సమీపంలో - ద్వీపంలో జన్మిస్తుంది కాబట్టి ద్వైపాయన శబ్దం ద్వీప విషయాన్నే సూచిస్తున్నది. [ద్వీపమంటే దేశం-విశ్వం-సృష్టి పదార్థ జగత్తు] ఇలా భారతం పట్టి కొమ్మలూ-నీడా-పూలు-పండ్లు కల స్వర్లోక కల్ప వృక్షాన్ని అధిగమించింది. దీనిచేత వ్యతిరేకాలంకారం ధ్వనించి భారతాధిక్యాన్ని వ్యంగ్య రమణీయంగా చిత్రీకరిస్తున్నది.

వ్యాసుడంటే జ్ఞాన భాస్కరుడని 'భారత భారతీ శుభగభస్తి చయము' అన్న 22వ పద్యం చెబుతున్నది. రవి చీకట్లను విదలిస్తే-కవి అజ్ఞానాంధ తమస్సును చీలుస్తున్నాడు. అందుచే ఇద్దరూ జ్ఞాన ప్రతీకలే. వెలుగునిచ్చేవారే.

సాత్యవతేయ విష్ణుపద సంభవమై [73] – పద్యం వ్యాసుడు సాక్షాన్నారాయణుడని చెబుతున్నది. ఆయన పదం నుండి శబ్దం నుండి విష్ణుపాదం నుండి గంగలాగా భారతం స్రవించింది. గంగకు ధ్యేయం సముద్రంకాగా భారతధ్యేయం విభుదేశ్వరు సంగతి. విబుధే శ్వరుడు లక్షణము కృష్ణుడనాలి. కృష్ణార్జునోత్తమ ఫలమన్నమాట బట్టి. భారత వస్తువునుబట్టి లేదు సహృదయులైన పండితులు 'ధాత్రీ సురప్రార్థ్యమై' అన్న మాటనుబట్టి అలా చెప్పటం తత్త్వ దృష్ట్యా, ఇలా అనటం కావ్య తత్త్వ దృష్ట్యా. అది కావ్యవస్తు దృష్టి, ఇది కావ్యానుభవ దృష్టి.

ఇలా రాజరాజు – నన్నయ – వ్యాసుడు – భారతం – అంటే ఏమిటో కవి పూర్ణంగా చిత్రించాడు. సారమతిన్–పద్యం తన కవితా లక్షణాలు చెప్పేది. 1. ప్రసన్న కథాకలితార్థయుక్తి. అర్థయుక్తి– అర్థాలంటే పద్యంలో, ఘట్టంలో, కావ్యంలో, వాచ్యార్థం దగ్గర నుండి రసతత్త్వందాకా అభివ్యాపించేవి. అంటే వాచ్యార్థ–ఘట్ట–సన్ని వేశం–సందర్భం – ఏదికాదు అర్థమంటే. అన్నీ వాటి మధ్య వున్న కూర్పు. ఈ సుసంఘటితాలైన ఘట్టాలు కూడుకొన్నకథ. దాని పర మార్థం ప్రత్యక్షంకావటం ప్రసన్నత అంటే ఒక కథ ఉంది. దానికొక అర్థం. దాన్ననుసరించి పరమార్థం. అర్థం బాహ్యంకాగా పరమార్థం అంతర మగుతున్నది. ఈ రెంటికి ఒకచక్కని కూడిక–బంధం కావ్యం. కథలో అనేకార్థాలు యాథాతథ్యతః సుసంఘటితాలు కావటం అర్థ యుక్తి. అసంఘటితాలుగా కన్పిస్తూ ప్రజ్ఞచేత విచారిస్తే సుసంఘ టితం కావటం యుక్తి. ఇది పాఠక విషయం. వ్రాసే కవి విషయ ముహ్నా అలాంటి దూర దూరతః విభిన్నతః విన్యస్తాలైన అర్థాలు విమర్శతోడైన పాఠకునిలో– కవీంద్రుడిలో–సుసంఘటితాలై తర్వాత వాని వెనుకవున్న పరమార్థం భోధిస్తున్నవి. ఈ రెంటికీ సంబంధం

కవితత్వం. ఈరెంటినీ కలిపికట్టే బంధన సూత్రం అది. ప్రసన్నత అంటే శబ్దార్థాల చాటునవున్నా రహస్యార్థాన్ని సుస్పష్టం చేయటం. కావ్యం సరస్వతీ స్వరూపమన్న భావం నన్నయ కంది. ఇందుకే భారత భారతి అని పలుమార్లు చెప్పటం. కాబట్టి భిన్నార్థాలు వాటి మధ్య యుక్తి. ఇదొక అంచె. దీని వెనుకకథ X అంటే వస్తువు [థీమ్] తప్ప ఇతివృత్తం కాదు. కాబట్టి బాహ్య శరీర విషయం కాదు. ఆ వస్తువు ప్రసన్నం కావటం కావ్య తాత్పర్యబోధ కాబట్టి ఒక కథ – తత్పరమార్థం–స్పష్టం కావటానికి కనుగుణమైన అర్థయుక్తి కవి నిక్షేపిస్తున్నాడు. పాఠకుడు భావించి ఆనందపారవశ్యం చెందుతున్నాడు. కవి కథా పరమార్థం నుండి యుక్తి ద్వారా అర్థనిక్షేపణ చేస్తున్నాడు (పద్యవిద్య) పాఠకుడి యుక్తి సూత్రానుసారంగా అర్థాలను ఒక క్రమంలో ఆన్వయించుకొంటూ కథా ప్రసన్నత నాస్వాదిస్తున్నాడు. కవి అవరోహణ పథంగా అవతరిస్తే పాఠకుడు ఆరోహణ పథంగా పోతున్నాడు. అందుకని ఆ సమాసానికి వెనుకనుండి అర్థవివరణం చేసుకోవాలి. ఇక్కడ కొంతమంది ప్రసన్నత అంటే స్పష్టంగా కథ చెప్పటం–ఒకేసారి విన్నంతనే అర్థం అయ్యేది– అన్నట్లు వ్రాసారు. అప్పుడు కవీంద్రులు–లోనారసి–శబ్దాలు బరువులేనివి. ఆ శబ్దాలను దృష్టిలో పెట్టుకొని ఆ పద్యార్థాన్ని చూడాలి. ఆ శబ్దాలు ఏం చెబుతున్నాయో తర్వాత చూద్దాం. పైగా ప్రసన్న శబ్దం ప్రసాదగుణాన్ని చెబుతున్నాడని వారిమాట. అప్పుడు కవి ప్రసాద శబ్దాన్నే వాడేవాడు. కాక ప్రసాద గుణభరితంగా కథ చెప్పటమే మహా విషయమని ఏ అలంకారికుడున్నాడు గనుక. ఆ విషయం ఇక్కడ కన్వయించటం. ఇందుకే ఈ వాదం అపార మౌతున్నది. ఇంద్రగంటివారి వాదాన్ని బట్టి ప్రసన్నకథ, ప్రసన్నకవిత– అర్థ ప్రయోజనం యుక్తి కూడి యుండటం ఇలా చెప్పి వారు విశ్వనాథుడు చూపిన ఆయా కథలను విమర్శించినారు. దానికి ప్రోద్బలకాలుగ పంప కవిమాట లలితపదం,

ప్రసన్న కవితా గుణమిల్లదె ఉదహరించుకొన్నారు. ఇంకా కథాకవిత-అన్నదాక ప్రత్యేక విషయంగా ఎవరూ స్వీకరించలేదు కాబట్టి దాన్ని త్రోసిపుచ్చారు.

కథాప్రసన్నత - కవితాప్రసన్నత - అంటే మూలంలోఉన్న వెలికి తనాన్ని తీసివేసి కథకు అడ్డంకులు కల్పించే వాటిని తీసివేసి - సూటిగా చెప్పటం. దీనివల్ల కథల్లో క్లిష్టత తొలగి ప్రసన్నత వచ్చింది. ఇదే నన్నయ్యగారి భావమని చెప్పారు.

ఇది సారమతులైన కవులు లోనారసి మేలునా-దగిన విషయమా అని ప్రశ్న. ఎందుకంటే అదంత మహావిషయం కాదుగాబట్టి మత్కేమూల భారతం దగ్గర పెట్టుకొని చూస్తేకాని తెలియదని అనటం నన్నయ స్వాతంత్రతను భంగించటమే తప్ప ఏమీకాదు. ఇలాంటి చిన్న విషయాలు ప్రతి కవి చేసిందే కాబట్టి. అని ఒక అంశంగా మనం గుర్తించాల్సిందేగాని, అదే మహావిషయమనటం సారమతిత్వాన్ని భంగించటమే తప్ప వేరేమీకాదు. శ్రీనాథాదులు చేసిన పనులివేకాబట్టి నన్నయగారి ప్రత్యేకత అందులో ఏమీలేదు. అదే అయితే పాపం నన్నయ అంత సాగదీసుకోనక్కర్లేదు. సారమతిం - అన్నట్లుగా అందుచేత ఈ వాదంలో బరువులేదు. అంతేకాదు అది వ్యాస గౌరవానికి భంగకరమే. నన్నయకీ సృష్టి నంటగట్టటం - ఆయన కాయన మీదున్న గౌరవాన్ని నూరిచేతో రుచిరాజ్ఞ బోధనరతుండు. ధర్మశాస్త్రజ్ఞులు - ఇత్యాది వ్యర్థమౌతుంది కాబట్టిన్నీ. ఈ వాదంలో సారంలేదు.

పైగా ప్రసన్నత అంటే 'వినీవినగానే అరచేతిలో రేగుపండులాగా స్పష్టమయ్యే రచన' అన్న రసగంగాధరోక్తి నిచ్చి - అర్థం చెప్పారు. ఐతే లోనారయ వలసిన పని యెక్కడ. ఆ చూచేవాడెవడు.

కవీంద్రులు ఎలాంటివారు? సారమతులు-ఇంత సాగలాగిన పద్యమంతా నిర్వచనంచేత వ్యర్థమౌతున్నది. ఇందుచేతా అసంజసమే. విశ్వనాథ ఇచ్చిన ప్రసన్న శబ్దాని కర్థమేమిటో విచారించనూ లేదువారు. విశ్వనాథ చెప్పిన కద్రూవినతల కథను వివరించి చివరవారు వ్రాసిన మాట విని - భావ్యర్థ సూచనను గ్రహించుట ఎవ్వరికైనను క్లిష్టత అని తోచునుగాని ప్రసన్నత అనిపించదు. (చూ. 583 పుట) క్లిష్టతకు వ్యతిరేకంగా ప్రసన్నతను అనుకోవటం విశ్వనాథ దృష్టికాదు. ఇంద్రగంటివారి దృష్టి. దేవుడు ప్రసన్నుడైనాడు అన్నచోట ప్రసన్నత. ఆలోచనచే లభించే ఆస్వాదం ప్రసన్నత. ఇది కవీంద్రుల భావనా విషయం. కాబట్టి ప్రసన్నత అంటే అరటిపండు ఒలిచి చేతిలో పెట్టటంలాగా కథ చెప్పటకాదు. గాంధారి వివాహం కథలో విశ్వనాథ చెప్పిన విమర్శ కుదరదనటం చాలా సాహసం. ఏది కుదురుతుంది గనుక? ఆ కథకు మూలాన్నిచ్చి విశ్వనాథ వాదం కుదరదనటం ఎలాగో తెలియటంలేదు. మూలకథ ధృతరాష్ట్రుని కులాదులు చూచి కళ్ళులేనివాడని తెలిసీ కూతుర్నిచ్చాడు (దరా) గాంధారి కూడా వరుడు కబోదని తెలిసీ అంగీకరించింది. దీన్ని నన్నయ్యగారు మరొకరీతిగా చెప్పారు. ఆ చెప్పిన తీరే విశ్వనాథ వివరించింది. నన్నయ్యగారి లోకజ్ఞతను బట్టి మూల కథను సమస్యాయుతంగా చిత్రించి తత్పరిష్కారార్థం సుబలుని తీవ్ర ప్రకృతిగా చిత్రించటం జరిగింది. అంతేకాక మూలంలో ఉందా లేదా అన్నది సమస్యకాదు. అక్కడ సమస్య లేకపోవచ్చు. అనువాదకుడు సృష్టించుకో గూడదని శాసన మెక్కడుందో మరి తెలియదు. ఇందుచేత ఇంద్రగంటివారి వాదంలో సారం లేదు.

ఒక పద్య మొకవృత్తం. అందులో ప్రతిశబ్దమూ ఒక చువ్వ. ప్రతీదాన్నీ చూడవలసిందే. పరిగణలోనికి తీసుకోనవలసిందే. లేకపోతే పద్యం విద్యకాదు. నన్నయ ఆద్యుడూ కాడు. పెద్ద కథ వ్రాసినంత

మాతా్రన ఎవడూ మహాకవికాడు. దీన్నే ధ్వన్యాలోకం నిరసించింది. కథామాత్రి నిర్వహణచేత ఎవడూ కవికాడు అని కాబట్టి ఎలాచూచినా ప్రసన్నత ప్రసాదం కాదు.

ఇది అర్థసంబంధగుణం. కావ్యాంతర్యం. దాన్ని లోపలకు చొచ్చి చూచి మేలన దగ్గ వారు కవీంద్రులు.

**2,** అక్షర రమ్యత ఇది బాహ్యమైన శబ్దం స్వరూపం. పైది అర్థయుక్తి. ఇది అక్షరయుక్తి. ఇది ఆకర్షణీయాంశం. అది తాదాత్మ్య విషయం. అక్షరయుక్త్యా ఏర్పడే నాదసౌందర్యం అక్షరరమ్యత. కాగా అర్థయుక్త్యా వస్తున్న శాంత సౌందర్యం ప్రసన్నత. ఇందు చేత శబ్దార్థ విషయాలుగా వీటిని చూడాలి. శబ్దం బాహ్యం. అది ఇతరుల కన్వయించేది. అర్థం అంతరం. అది కవీంద్రులకు విషయం (అక్షర రమ్యత విషయాన్ని ఫిబ్రవరి 76 "భారతి"లో చూడగలరు).

నన్నయ తన వ్యక్తిత్వాన్ని గూర్చి చెప్పిన మాటలు యథార్థాలే అని అవతారికే చెబుతుంది. అతని సౌజన్యం నారాయణభట్టుని స్మరించటంలోనే ఉంది. వేంగీ పరిషత్తులకు నమస్కరించటంలోనూ ఉంది. భారత సముద్రం ఈదటం కష్టమనడంలో వినయమూ సౌజన్యమే. అలాగే మొదటి శ్లోకంలోను.

(మే 78 'భారతి'లో నన్నయగారి మీద (శ్రీ) కె. వి. రమణారెడ్డి ఒక వ్యాసంలో వ్రాసాడు. అందులో 5, 6 ఆక్షేపణలు సూచించారు. నన్నయ సత్య వచనుడుకాడు. ఎలాగంటె యుద్ధాల్లో ఓడిపోయిన రాజరాజును 'అన్యరాజ తేజోజయశాలి' అనటం. కాని 1035 ప్రాంతంలో కలిదిండి దగ్గర - అలాగే మరొకసారి రాజరాజు జయించిన సాక్ష్యాలున్నాయి కాబట్టి ఆ ఆక్షేపణ నిలిచేదికాదు. ఈ సందర్భంలో వ్యాసకర్త తెలుగు కవులకూ చారిత్రక సత్యానికీ చుక్కెదురన్నదీ అంతే. మనుచరిత్ర, ఆముక్తం, పారిజాతం, కృష్ణ

రాయ విజయం - లాంటివి చారిత్రకులకు చరిత్ర భిక్షపెట్టిన గ్రంథాలన్నవి జగమెరిగిన సత్యం గనుక ఈ అభాండం చిద్ర భాండం నిత్య సత్య వచనుడనుకోవటంలో ఆత్మస్తుతి ఉందనటం ఇంకొకటి. రెంటికీ పొత్తేమిటో తెలియదు. అది సరే! ఆమాట లోకదృష్ట్యా తప్ప వ్యక్తిదృష్ట్యా కాదు. "నా పేరు ఫలానా అంటారండీ" అన్న పద్ధతి తెలిసిందేకదా! జగద్ధితమంటే పంచమ వేదమైన భారతానువాదమే – ఈ వాక్యానికి అర్థం మనమే చెప్పుకోవాలి కాబోలు. అదంతేమరి!

'నన్నయ రచన ప్రజలకు పరాయిది' – పంప భారతం నేటి కన్నడిగులకు అర్థంకాదు. ప్రాచీనాంగ్లం నేటికి గ్రీకు. అలా కాకుండా ఈ నాటికీ కావ్యభాష-అలాగే వస్తున్నదంటే-భారతం మన కర్థమవుతున్నదంటే ఆదికవి భాషానుశాసనమే. అది ఆ మహాప్రతిభునిభిక్షే.]

నన్నయగారి రచనలో అర్థయుక్తి– తార్కికాన్వయం చాలా గొప్పది. దాని కదొక వుదాహరణ. పద్యవిద్యలో ఇదొక భాగం. పరిషత్తులకు నమస్కరించిన పద్యం చూడవచ్చు. సభాంతర సరసీ వనంబులు-అన్నది కేవల రూపకంకాదు. మహాకవిలో అలంకారమొక భావమూర్తికి సంకేతం కాదు వ్యంజకం. పండితులు పద్మాలు. వాళ్ళు కూర్చున్నచోటు రాజు తీర్చిన పరిషత్తుకావచ్చు. ప్రాచీన కాలంలో సభాస్థలులుండేవి. ఒకటి రాజకీయచర్చలకు, మతసాంస్కృతికి నాటకాది ప్రదర్శనలకు. బుద్ధుని నాటికే ఇలాంటి వనేకం వున్నట్లు సాక్ష్యాలున్నాయి.

కాబట్టి రాజనిర్మిత సభాస్థలి కళారంగస్థలం పండితులు కూర్చున్నారు. వారిచుట్టూ వాతావరణం అందంగా అలంకృతమౌతుంది. నేటికీ అంతే వారిప్రక్క కృత్రిమ దీర్ఘికలు అందులో తామర పూలు ఈ రెంటిని సమన్వయిస్తున్నాడు కవి. ఈ మూర్తి దర్శన సౌందర్యముందా పద్యంలో. కవి అకస్మాత్తుగా అక్రమంగా ఒకభావం

నుండి మరొక భావానికిపోడు. ఇక్కడ సభాస్థలి సరస్సుతో పోల్చటానికి పైపద్యంలో వ్యాసుణ్ణి అంభోరుహమిత్రుడనటం,సూరిచేతో రుచిరాబ్జ బోధ సంతుడనటం కారణం. ఈ తార్కికక్రమం వకటి. ఆ పరిపద్వర్ణనలో నేపథ్యయుక్తి - సామాన్యంగా నన్నయగారి కవితలో అంద మైన లక్షణం సర్వేసర్వత్ర కన్పిస్తుంది. వినతా కద్రువ ఘట్టంలో అశ్వాన్ని వర్ణిస్తూ ఫేనపుంజనిభు - (2-20) అనటం ఎంత మనోజ్ఞం. అది సముద్రం ప్రక్క విహరిస్తున్నది. దూరాన్నుండి వాళ్ళు చూస్తు న్నారు. సముద్రంమీద ఫేనమూ వుంది. ప్రక్క అశ్వమూ వుంది. రెంటినీ చూస్తున్నవారికి ఆనురుగు దొబ్బాగుజ్జమూ వకలాగేకాదు- అదేగావుంది. సహజ నేపథ్యంనుండి అలంకారం గ్రహించటం-ప్రకృతికీ-తద్గత వస్తువుకూ సమన్వయం చెప్పటం. ఇదొక అపూర్వవిద్య.

పద్యమంటే ఛందస్సనుకోవటానికి వీల్లేదన్న మొదటి కవి నన్నయ. మరేమిటి?- పద్యానికి బాహ్యదశ- అంతరదశ- రెండుండగా పైది అక్షరయుక్తి. అంతరము అర్థయుక్తి. దాని అనుభవ విశేషం రమ్యత కాగా దీనిది ప్రసన్నత. సరే సారమతిన్ - పద్యం. అందులో అసలు పద్యంలో ఆయువుపట్లు 1. ప్రారంభాంతాలు 2. ప్రాసయతి 3. వాక్యచ్ఛేదం—పాదచ్ఛేదం 4. శబ్దాచిత్రి 5. వీటిమధ్య ఒక సమన్వయం వుండటం.

సారమతితో ప్రారంభమై జగద్ధితంతో పద్యం ముగుస్తున్నది. కారణ కార్యభావం సుస్పష్టమే. మహాకవులు మెచ్చేటట్లుగా వ్రాయ బడటంచేత కావ్యం జగద్ధితమౌతున్నది. (మూలభారతం గురించి చెప్పిన లక్షణాలన్నీ ఇక్కడ కన్వయించుకోవాలి. ఘట్టంలోవున్న ప్రతి పద్యం—భావం—అన్నీ ఒకదానికొకటి పోషకమే. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని - ఇత్యాదులవల్ల జగద్ధితం కల్గుచున్నది. కాబట్టి) ప్రసన్న కథా కవితార్థయుక్తిలో, నారసి-తో మీద పద్యపాదం

తెగిపోయి అరసి రెండవపాదం ప్రారంభ మాతున్నది. లో మీాది దీర్ఘంతీసి చదవాలి. ఎంతవరకు విశ్రాంతి రహితంగా, ఎంత వరకైనా సరే అప్పుడు లో తెంతో వ్యంజితమాతుంది. ప్రకృత అక్షరంలేదు. ఉంటే ముందక్షరాన్ని వెనకది తోస్తుంది పదమని అంటూ, పాదాంతంలో వాడితే ఆబాధలేదు, ఎంతోలోతుకుపోయి చూడాలి. ఎవరు? కవీంద్రులు. ఇంద్రశబ్దం దివ్యమేధాశక్తి కధిష్ఠానదైవం. సమేంద్రా మేధయాస్పృణోతు—అన్న ఛాందోగ్యం చూచుకోవాలి. దివ్యమేధ లౌకిక మేధ రెండు మేధాశక్తులు. అలౌకిక ప్రజ్ఞవున్నవాడు 'లోనారసి' సత్యదర్శనం చేస్తాడు. అంతర్ముఖీనం పేరు లోనారయుట చేసేవాడు ఇంద్రుడు. ఇతరుడుకాడు. వాడని ఎల్లా? సారమతిన్—సారతిరగవేస్తే, రస – తన్మతి – చేత అని అర్థం. ఇలా ప్రసన్న కథాకవితార్థ యుక్తి అలాంటి మహాత్ములకోసం తప్ప అసారమతులకోసంకాదు. నన్నయ కవితలో ప్రత్యక్షరం పరిశోధించదగినదే. సత్యాన్వేషికి. వేలునా-అంతలోతుకు దిగి సత్యదర్శనంచేసే వారేమంటారు. ఈ చిన్న మాట. ఇది నన్నయ మనస్తత్వ గాంభీర్యం. నిత్య సత్య వచను డంతకన్నా మాట్లాడడు. ఆయన వాక్కు— మితమూ— హితమూ— సత్యమూ కలది. అందుకే ఆయన పాత్రలకీ మాటలు ప్రయోగించటం కావ్యంలో ద్రష్టవ్యాంశం. కాక అనుభవభారంతో మాటరాదు. రసానుభవంలో అల్లరి చేయటాలు – మెచ్చుకోవటాలు వుండవు. అది అనుభవైక వేద్యం.

ఆంధ్రకావ్య భారతి ప్రథమావతారం శ్రీ వాణీ గిరిజా-శ్లోకం. నన్నయ వాల్మీకిని గురుపద్య విద్యకు నాద్యుడన్నాడు. వాల్మీకి నోటి నుండి వెలువడిన శ్లోకం ఎంత అర్థగంభీరమో ధ్వన్యాలోకాదులు గుర్తించాయి. ఛందః శిల్పంలో కీ. శే. పాటిబండవారు వివరించారు. నన్నయ్యగారు ఆదికవే. ఆయన నోటి నుండీ శ్లోకమే వచ్చింది. ఇదీ

"మానిషాద" లాంటిదే. ఆ శ్లోకం సరస్వతీ ప్రచోదన చేతను వాల్మీకం. ఇక్కడా 'శ్రీవాణి'యే. వకార ప్రాస అమృతబీజం. సరస్వతి అక్షర స్వరూపిణి. అమృతమూర్తి. శబ్దశక్తికి వినాశంలేదు. కాక నన్నయ్య మనస్సు అమృతాయమాన మైనట్టిది. అది అమృతమూర్తి. ఆయన ముఖపద్మంనుండి తొలిసారిగా ఆంధ్రవాణి ఆవిర్భవిస్తున్నది. తొలిశబ్దం శ్రీవాణీ – లక్ష్మీ అని. శబ్దానికర్థం ప్రస్తుతాంశమైనా–శ్లోక తాత్పర్య దృష్ట్యా శుభావహమైన శారద అని చెప్పవచ్చు.

ఆయన ఈ వాణికి శ్రీకారం చుట్టినవాడు. అతని మనస్సు సువిశాలం కాకపోతే (వ్యాసుడు సువిశాల బుద్ధి) ఆయన కావ్య కన్య కాద్యుడు కాలేడు. అందుకని రాబోయే అనంతకాలం మీద ఏర్పరచు కొన్న బీజప్రాయంగావున్న సమస్త కావ్యజాతానికీ – త్రికాలాల్లో ఆంధ్రజాతికీ ఆయన శుభాశంసనం చెబుతున్నాడు. త్రిమూర్తులుమీకు శ్రేయస్సు నిచ్చుగాక అని. మీరు ఎవరు? మనం. ఆయన కెదురుగా ఉన్న శ్రోతలెవరు. సమస్తాంధ్రజాతీ, తెలుగువాణ్ణి ఉద్దేశించి నిండుమన స్సుతో పలికినమాట. అంత అమృత స్వాంతం కాబట్టే లోనిస్పందన శ్రీవాణి-గా జాలు వారింది. ఇదొక నాందీ పద్యంగా స్ఫురించేటట్లు వ్రాయటం నన్నయగారి శిల్పం. ఇతరులు వ్రాశా మన్నట్లుగానే వ్రాసారు. రాజు నాశీర్వదించినట్లో – ఇతరంగానో వ్రాసారు. ఇక్కడ రాజరాజనరేంద్రుడే–ఉద్దేశిత వ్యక్తి కాడు. అన్నది కవి తానై కాదు. కవిసూత్రధారుడై అన్న మాటతప్ప కవికాదు. అవతారిక అంతా కవి ప్రథమ పురుషలోనే వ్రాసాడు. వ్యక్తిగత నన్నయకాక అవ్యక్తిగత విశ్వజనీనవ్యక్తి – సూత్రధారుడు వ్రాసినమాట. (ఇది విచిత్రమూ కాదు. అబద్ధమూ కాదు. ఆధునికోద్యమం తెలిసినా–ప్రాచీనభారతీయ ఆలంకారిక సిద్ధాంతం కూడా) సంస్కృత నాటకంలో నాంది సూత్ర ధార వాక్యం తప్ప కవివాక్యం కానట్లు ఇదీ అంటే ఇలా మంగళాశంస

నంతోపాటు కావ్యార్థ సూచనావుంది. విశ్వస్థితికి హేతువు దాంపత్యం అదే త్రిమూర్తి ద్వంద్వస్తుతి. ఆ స్థితి స్త్రీపుంస యోగోద్భవం. కనుక ద్వంద్వస్తుతి. కథలో ద్రౌపదీ అవమానం తద్భిన్న దశ. స్థితిరక్షకుడు నారాయణుడు. స్త్రీ అవమానిత కావటం విశ్వస్థితి భగ్నం కావటం. ఈ దుశ్చేష్ట రాక్షసం. దానికి శిక్షకుడు నారాయణుడు. సభాపర్వ ద్వితీయాశ్వాసం – కృష్ణ ప్రాధాన్యం. రక్షణ శిక్షణాదులన్నీ రమణీయాలే. నన్నయ నిత్య సత్య వచనత్వం కూడా పై శ్లోకంలో ఉంది. చిరాయ–త్రిమూర్తులు–పురుషోత్తమాంబుజభవ శ్రీకంథరులు–అన్న మాటలు కవిత్రయాన్ని సంకేతిస్తున్నవి (వ్యంజించటం కాదు) అన్న శ్రీ విశ్వనాథ విమర్శ నిష్కలుషితమైనదే. కొందరంటారు–నన్నయ దాన్ని ఊహిస్తాడా? అని ఇది ప్రశ్న కాదు. ఆశబ్దం అప్రయత్నా పతితమైతే శబ్దశక్త్యా విచిత్రార్థం వస్తుంది. అలాగే శాకుంతల పంచమాంకంలో –

> "స్త్రీణామ శిక్షిత పటుత్వ మమానుషీషు
> సందృశ్యతే, కిముతయాః ప్రతిబోధివత్యః
> ప్రాగంతరిక్ష గమనాత్స్వ మపత్య జాత
> మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి"

స్త్రీ జాతికి ఎవరూ నేర్పకుండానే కార్యసాధన శక్తి స్వభావ సిద్ధం. ఇది పశుపక్ష్యాదుల్లోనే ఉంది. కోకిలలు తమ పిల్లల్ని కాకులచే పెంచబడేట్లు చేసుకోవటం లోకవిదితమే కదా. ఇక మానవుల్లో చెప్పటం దేనికి– ఈ శ్లోకంలో శకుంతలా జన్మరహస్యముంది. ఆమె కూడా పక్షులచేతనే పెంచబడింది కాబట్టి. ఆనింద మేనకకు తాకుతున్నది. (శాకుంతలము యొక్క అభిజ్ఞానత – విశ్వనాథ) అందుకనే వెంటనే సహించక శకుంతల అనార్య! అన్నది. ఆమె కోపాన్ని

తర్వాతి శ్లోకం వర్ణించింది. ఇంత కోపం రావటంలో పై ధ్వన్యర్థం సంభావ్యమే – ఇది తప్పు అంటారు కొందరు. (మా రామదాసయ్యం గారి వ్యాఖ్య) ఆ ధ్వన్యర్థం దుష్యంతునకు తెలియదు కదా అది. లోపొరలో వాడా. వాడికి తెలియదు. వీడికి తెలుసు. శబ్ద ప్రేరణ ప్రతిభాకృతం తప్ప వైయుక్తిక మనః కృతం కాదు. కనుక శబ్దం బయలుదేరిన స్థానంలో వున్న లోపలి అర్థంపైకి శబ్దం తేలే దశకు. పైపొర మనస్సులో అది విస్మారితం కావచ్చు కాని పుట్టిన దశలో లేదనటం దుస్సాధ్యం. అశాస్త్రీయం. కవి అక్కడివాడు. పైపొరలో వాడు కాడు. వీడు దేశకాలబద్ధ వ్యక్తి. విశిష్టుడు, కాబట్టి నన్నయ నోటినుండి వచ్చిన శబ్దానికా శక్తివుంది. పైగా అన్నది సూత్ర ధారుడు. అది నాంది వాక్యం. ఈ నిత్య సత్య వచస్కృత – అమలిన తారకా సముదయంబుల నెన్నను అన్న పద్యంలో భారత భారతీ సముద్రము దరియంగ నీదను అన్న వాక్యంలో కవి సౌజన్యమే అర్థం. కాని నిజంగా ఆయన ఈదలేక పోయాడు. విధాతృనకైనను నేరబోలునే అన్నమాట కవిబ్రహ్మకు యకేదే. అంటే నన్నయ్య తాను మధ్యలోనే ఆగిపోతానన్న స్ఫూర్తి పద్య రచన వేళలో కవి మనస్సులో వుంటుందా? ఎలా వుంటుంది. కాని ఆ స్ఫూర్తి ప్రేతుకున కుండవచ్చు. పతాకాస్థానకాలు ఐదున్నాయి. అందులో ఇలాంటి పద్ధతి వుంది. సీత సముద్రాల కావలున్నా తెచ్చి నీకిస్తాను – ఇది సుగ్రీవవాక్యం. అన్నప్పుడు వానికి తెలియదు కదా. సీత సముద్రాల కావల వున్నదని నిజంగా అంతేకదా. కాబట్టి లౌకిక మనస్సు భావించకుండా లోపల మనస్సు మాత్రమే భావించే అర్థం శబ్దోద్యోతిలో వుండవచ్చు. దానికొక అర్థం తెలిసేట్లుగా శబ్దం పుడుతున్నది. ఎలాగా? కవికి అంటే వ్యక్తి విశిష్టుడైన వాడికి – తెలియకుండానే కవికి తెలుసు. వాడికి పైనున్న వ్యక్తికి తెలియదు. ఇవి సర్వమహా

కవుల అనుభావసారమే. అందుకే కవులు చెప్పగా వింటాం. నేననుకొని ఇలా వ్రాయలేదు. కాని చిత్రం ఈ శబ్దానికింతర్థముందని తర్వాత తెలిసిందని 'కిమిదం వ్యాహృతం మయా' అన్న వాల్మీకి మాట కదే అర్థం. కాబట్టి భారతం సముద్రమనటమూ సత్యమే. విధాత్రనైనను నేరబోలునే - అన్నదీ సత్యమే. అలాగే జరిగింది.

ఇది ఆయన ఆర్ష లక్షణం, ఋషి లక్షణం. తస్య వాచమర్థోనుధావత్ — అన్నమాట. తిక్కన గారన్నట్లు నన్నయ నిజంగా 'మహాత్ముడు'.



# ప్రసన్న కవిత

## శ్రీ వై. మల్లికార్జునరావుగారు

ఏ వాఙ్మయములో నైనను లక్ష్యగ్రంథములు కొన్ని అవత రించిన పిమ్మటనే లక్షణగ్రంథములు వెలువడుచుండును. అయినను రాఁబోవు తరమువారి స్థూలదృష్టికి లక్షణగ్రంథములే ప్రాథమికము లన్నట్లుగ గన్పడుచుండును. కనుకనే భారతమువంటి ప్రాచీన గ్రంథ ములోని ప్రయోగములను గూడ నవీనములగు బాలవ్యాకరణాదులచే సరిపెట్టుకొనుచుందురు. భారత ప్రణేతయగు నన్నయ యెక్కడ? బాలవ్యాకరణకర్త యెక్కడ? ఇది లక్ష్యలక్షణ గ్రంథములలో అనూ చానముగ వచ్చుచున్న సంప్రదాయము. ఈ సంప్రదాయ మొక్క తెనుఁగు నందే కాదు. సంస్కృతమందును గలదు. అమరకోశాది నిఘంటువులనుజూచి రామాయణాది మహాకావ్యములలో నర్థములను సరిపెట్టుకొందురు. నవీనతమములగు నలంకార గ్రంథములనుబట్టి ప్రాచీన కావ్యములందలి అలంకారములను నిర్ణయించుచుందురు. లక్ష్యగ్రంథములను బట్టియే లక్షణగ్రంథము లవతరించిన వగుటంజేసి పై సంప్రదాయమెట్లున్నను నయ్యది విరోధజనకము గాక సామాన్య జన పరిగృహీతము కాఁజొచ్చెను.

లక్షణగ్రంథము లందలి లక్షణము లన్నియు సూత్రప్రాయ ములు. వుదాహరణ ప్రత్యుదాహరణ విస్తృత వ్యాఖ్యానములచే నయ్యవి సుజ్ఞేయము లగుచుండును.

ఇఁకఁ బ్రకృతము. ప్రసన్న కవిత యననేమి? దీనికి లక్షణకారు లేర్పఱిచిన నిర్వచన మెట్టిది? ఈ నిర్వచనమున కాధార మేమి? అను విషయమును బరామర్శింతము.

ప్రసాదగుణ భూయిష్ఠమైనది ప్రసన్నకవిత అని చెప్పవచ్చును. ప్రసాద మన్నది కావ్యముల కుండవలసిన దశవిధగుణములలో నొకటి. ఈ విషయమున రామరాజ భూషణుఁడు ప్రసాదగుణముల నిర్వచించి యున్నాఁడు

"అలరు ప్రసిద్ధంబుల నలఘూక్తి ప్రసాదమయ్యె" నని. ఈ నిర్వచనము సంస్కృతములోని విద్యానాథుని నిర్వచనముకంటె వేఱు గాదు. విద్యానాథుఁడు "ప్రసిద్ధార్థ పదత్వం యత్ ప్రాసాదో నిగద్యతే" అని చెప్పియున్నాఁడు. సంస్కృతమందేమి ? తెనుఁగునందేమి ? ప్రసాదము నిర్వచన మందఱు నొకేవిధముగఁ జెప్పియుండిరి. వీరిట్లు చెప్పుట కాధారము లక్ష్యగ్రంథములు ? కాఁగా నేయే గ్రంథము లను జూచి యిట్లు చెప్పియుండిరి? అని పరిశీలించునప్పుడు నన్నయ ప్రణీతమగు మహాభారతము స్మృతిపథము నవతరించి తీరును.

నన్నయభట్టు తనకవిత్వము ప్రసాదగుణ భూయిష్ఠమై యుండ వలెనని తలంచి, యిట్లు చెప్పియుండెను.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబునన్."

తన కాలములోని కవిశ్రేష్ఠు లెల్లరు తన కవిత్వములోని సార స్యమును విమర్శక దృష్టితోఁ బరిశీలించి మెచ్చుకోవలెనని నన్నయ తలంచియుండెను. ఇంతయ కాదు. సామాన్యజనులు కూడ రచన లోని అక్షరరమ్యత నాదరింపవలెననియు నతఁడు తలంచి యుండెను. దీనిని బట్టి భారత రచన పండిత పామర—ఉభయ రంజకముగ నుండ వలెనని యాతఁడు తలంచెననుట స్పష్టమే కదా! ప్రస్తవములో,

పండిత పామర రంజకమగుట చేతనే భారతరచన కింతటి ప్రాశస్త్య మేర్పడియున్నది. మఱియు నన్నయభట్టు నానారుచిరార్థసూక్తినిధి యగుటయు, మహాభారతము సంహితాన్నమగుటయు, జగద్ధితంబుగ నన్నయభట్టారకుఁ డీయుద్యమమునఁ బ్రవేశించుటయుఁ గూడ భారత ప్రశస్తికిఁ గారణము లనఁదగియున్నవి. ఈ సందర్భమున "మద్భాగ్యో పచయా దయం సముదితస్సర్వోగుణానాం గణః" అని శ్రీహర్షుఁ డన్న మాట జ్ఞప్తికి వచ్చుచున్నది.

ఇఁక, పండిత రంజకతను స్వీయకవిత్వములోఁ బ్రదర్శించి చూపుట సామాన్యకార్యము కాదు. పండితులు సమకాలికుల కవిత్వము నొకపట్టున మెచ్చుకోఁజాలరు. కనుకనే కాళిదాసు "ప్రాయస్సమాన విద్యాః పరస్పరయశః పురోభాగాః" అని చెప్పియున్నాఁడు. "సరి సమానులైన విద్వాంసులు నిరంతరము పరస్పర రంధ్రాన్వేషణ తత్పరులై యుందు"రని పై దాని తాత్పర్యము. పోని పండితుల యామోదము వడయకున్న నేమి? అని యుపేక్షింపరాదు. కాళిదా సంతటి మహాకవి శాకుంతల మంతటి రసవదుత్కృష్ట నాటకరాజమును సృష్టించియు "ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్ బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయంచేతః" అని తన అల్పజ్ఞత నావిష్కరించుకొని యున్నాఁడు. ఎంతటివాఁడైనను తన విజ్ఞానమున సమగ్రప్రత్యయము లేక యుండుట లెస్స. అదియే పండిత లక్షణము. కాఁగా కవిత్వములో రంజకత నొడఁగూర్చునది పాండిత్య మొక్కటే కాదు. పాండిత్యముతోఁ బాటు వినయసంపద కూడ నుండితీరవలెను. ఈ వినయము నైసర్గికము కావలెను గాని కార్యార్థమై యెఱవు తెచ్చుకొన్న వినయ విధేయత లెప్పుడును విశ్వసనీయములుగావు. వినయసంపద సౌశీల్యమునకు సంబంధించినది. అసంఖ్యాకములుగ గ్రం

ధములు తిరుగవేసినంత మాత్రమున నియ్యది పట్టుబడదు. క్రోధా హంకారము రూపుమాపి చిత్తపారిశుద్ధ్యము సంపాదించుకొన్నపుడు మాత్రమే అది యలవడును. ఇట్టి సౌశీల్యము కలవాఁడు గనుకనే నన్నయభట్టు తనకవిత్వము నట్లు పండితరంజకముగ నొనర్పఁగల్గెను. నన్నయభట్టారకుని సౌశీల్యము తడవఁబనిలేదుగదా! అతఁడు కుల బ్రాహ్మణుఁడు. అనురక్తుఁడు, అపర జపహోమ తత్పరుఁడు. విపుల శబ్దశాసనుఁడు. సంహితాభ్యాసుఁడు. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁడు. పాత్రుఁడు. సద్వినుతావదాత చరితుఁడు. ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుల సత్ప్రతిభాభియోగ్యుఁడు. నిత్యసత్య వచనుఁడు. బృహస్పతిని మించిన బుద్ధిశాలి. సుజనుల సౌశీల్యమున కింతకంటె కావలసిన లక్షణము లింకేముండును?

ఏవం విధలక్షణోపేతుఁడయ్యును, "వ్యాసభారతమును దెనుఁగున రచింపు" మని పేరోలగమున రాజనరేంద్రుఁ డాదేశించినపుడు నన్నయభట్టు పలికిన తీరు చూడుఁడు.

"అమలిన తారకాసముదయంబుల నెన్నను, సర్వ వేదశా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను, బుద్ధి
బాహువిక్రమమున దుర్గమార్థజల గౌరవభారతభారతీ సము
ద్రముఁ దఱియంగ నీదను, విధాతృనకైనను నేరఁబోలునే?"

ఇట్లుపల్కియుఁ దాటస్థ్యము వహించి యూరుకొనలేదు."అయినను దేవా! నీయనుమతంబున, విద్వజ్జనంబుల యభిమతమునం, జేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచించెద" నని వినయముగ మనవి చేసికొనినాఁడు. 'నా నేర్చువిధంబున' అనుటంజేసి తాను సర్వాత్మనా అల్పకవియే యతని నిశ్చయ మనుట సుస్పష్టము. నన్నయభట్టారకుని వినయసంపద నావిష్కరించుట కింతకంటె వేఱొక సాక్ష్యము కావ

లెనా? రాజన రేంద్రుని యనుమతి, విద్వజ్జనంబుల యనుగ్రహము. ఈ రెండు మాత్రమే తన భారత రచనోద్యమమునకుఁ గారణములఁట పాండిత్యము గాఁదట.

కనుకనే పాండిత్య ప్రకటనార్థమై మాఱుమూలల బూజుపట్టి యున్న కఠినపదముల నీతఁ డెచ్చటను బ్రయోగించి యుండలేదు. విరళప్రయుక్తములను బ్రయోగించునపుడు ఝుడిత్యర్థస్ఫూర్తి కలుగ మింజేసి రసానుభూతికిఁ బ్రతిబంధక మేర్పడుచుండును. అట్టిచో, కావ్య ప్రయోజనమునకే మూలచ్ఛేదము వాటిల్లును. ఈ యభిప్రాయ మాంధ్రశబ్ద చింతామణిలోఁ గూడ రెండుచోట్ల బ్రతిపాదింపఁబడి యున్నది.

"ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్"

పర్యాప్తో మన్మతేతు సంకేతః —

తరువాతి కాలమున కేవలపాండిత్య ప్రకటనార్థమే బయలు దేరిన వసుచరిత్రాది ప్రౌఢప్రబంధము లన్నియు నీ కారణముచేతనే భారతముకంటె విలక్షణములై యున్నవి. నన్నయభట్టు విరళ ప్రయుక్తములను బ్రయోగింపక, ఝుడిత్యర్థస్ఫూర్తిదాయకమగు పదకదంబమునే నిరర్గళ ధారావాహినియగు శైలీపాటవమునఁ బ్రయోగించి, పండిత రంజకతను సాధింపఁగల్గెను.

ఇఁకఁ బామరు లాదరించునది యక్షరరమ్యత. పామరులు విద్యాగంధము లేనివారగుటంజేసి, పండితులవలె ధారాళముగ సులభముగ కవితాస్రవంతిలోఁ బ్రవేశింపఁజాలరు. లోతువిమర్శనలఁజేసి సారస్యము నాస్వాదింపలేరు. అక్షరగ్రథనమునకుఁ జెందిన రమ్యతను మాత్రమే దర్శింపగలరు. శాస్త్రప్రవేశము లేకున్నను గానవిద్యాధురంధరుల సంగీతగానమును పామరులెంద ఱాస్వాదించుచుండుట లేదు? 'శిశు

ర్వేత్తి పశుర్వేత్తి' అనుదాని పరమార్థమిదియేకదా! వీరికిట్టి యానందమును గల్గించినదేది? అక్షరసన్నివేశాభివ్యంజితమై, ఆరోహణావరోహణ క్రమవిలసితమై యొప్పారెడి నాదమేకదా! ఇట్టినాదమును అక్షరముల కూర్పుపై పొసగి, కవిత్వములోఁ బ్రదర్శించి, తాదృశ కవిత్వముచే పామర రంజకత నాపాదింపఁ జేయుటయు సామాన్య కార్యముకాదు. నన్నయభట్టు పైఁ జెప్పఁబడిన ఉభయ విధప్రజ్ఞలందును సిద్ధహస్తుఁ డగుటంజేసియే యాతని కవిత్వము ప్రసన్నకవిత్వమైనది. ఆతఁడు ప్రమాణ మూర్ధన్యుఁ డైనాఁడు. ఆతని భారతమాంధ్రవాఙ్మయమున నాదికావ్యమై విరాజిల్లినది.

— * —

# భట్టారక హృదయము
# (ప్రసన్న కథ – అర్థయుక్తి)

ఆచార్య సాళ్వ కృష్ణమూర్తి

## 1.0. ప్రాచీన సాహిత్యము.

సాహిత్యము కళ. చర్వాణక్షమమైన అనుభూతిని ప్రసాదించు శక్తి కళల విశిష్ట లక్షణము. భారతీయ సాహిత్య కళలోని రస సిద్ధాంతము (ఆత్మ) స్వరూపోపలబ్ధికైన చిరంతనమార్గము. సాహిత్యము పాఠకులకు అధ్యాత్మిక బలమును చేకూర్చవలెననుట ప్రాక్, ప్రతీచి విమర్శకులకు సమ్మతమైన మాట. అది దాని ప్రథమ ప్రయోజనమని విమర్శక విశ్వాసము. ప్రపంచమునందంతటను ప్రాచీన కాలమున మతము నాశ్రయించుకొనియే కళలు, సాహిత్యము వర్ధిల్లినవనుట చారిత్రక సత్యము. ఏ భాషలోని ప్రాచీన సాహిత్యమునందైనను కవిత్వము (Poetry), మతము (Religion), తత్త్వము (Philosaphy) కలిసియేయుండును. కాలక్రమమున ఆర్థికవ్యవస్థలో వచ్చిన మార్పుల వలన ఇవి దేనికదిగా వేరుపడుచు వచ్చి, నేటికి సాహిత్యమునకు మత తత్త్వశాస్త్రములతో సంబంధము ఉండరాదను స్థితి వచ్చినది. కాని ప్రాచీన సాహిత్యమును అనుశీలించినపుడు దానికి మతముతోను తత్త్వశాస్త్రముతోను కల సంబంధమును మరవరాదనుట గమనింప వలసిన అంశము.

## 1.1. వ్యాసభారతము.

వైదిక వాఙ్మయము తర్వాతి ప్రాచీన భారతీయ సాహిత్యమున శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారతములు జగత్ప్రసిద్ధమైన మహేతిహాసములు. ఒక విధముగా విజ్ఞానసర్వస్వముల వంటి గ్రంథ

ములు. వీనిలో (శ్రీ) మహాభారతము పంచమ వేదమనబడినది. ఆశ్వలాయన గృహ్యాసూత్రము, భారత కర్తకు తర్పణము విధించుచున్నది. దీని వైదికతత్పరతకు ఇంతకంటె నిదర్శనమేమి కావలెను. 'భారతములో ఉన్నదే (లోకమున) ఎచటనైన ఉండును. ఇందు లేనిది ఎందును ఉండదు.'[1] అను భారత ప్రశస్తి అందరు ఎరిగినదే కాని వివరముగా చూచువారు తక్కువ అనుకొందును. భారతము 'సత్యవాక్ప్రబోధము' అని బ్రహ్మదేవుడే చెప్పినట్లు ఉల్లేఖనము. సూతుని సంగ్రహ వాక్యములలో చెప్పవలెనన్నచో – భారతమున ఋగ్యజుస్సామవేదములు, బ్రాహ్మణములు, ఉత్తరమీమాంస, పూర్వమీమాంస, శిక్ష, చికిత్స, దానము, పాశుపతము అనునవి ఉన్నవి.[2] అధస్సూచికలోని ఆకరశ్లోకమున గల న్యాయము నేటి గౌతమ న్యాయము (తర్కశాస్త్రము) కాదు. గౌతమ న్యాయమేర్పడుటకు ముందు కాలమున (పూర్వ) మీమాంసకు న్యాయమను పేరుండెడిది. కాగా భారతమున ఒక పేరగానైనను పూర్వమీమాంస ఉన్నదని అంగీకరింపక తీరదు. పూర్వమీమాంస యాగాది క్రతురూపమైన వైదిక ధర్మమును బోధించును. ఇది ధర్మజిజ్ఞాస చేయగా, ఉత్తర మీమాంస బ్రహ్మజిజ్ఞాస చేసి అధ్యాత్మతత్త్వమును బోధించును. రెండింటికిని వేదమే ప్రమాణము. భారత కథ చెప్పిన సూతుడు బ్రాహ్మణియందు క్షత్రియునకు పుట్టిన సూతుడు కాడనియు, అగ్నికుండ సముద్భవుడని పౌరాణిక సాంప్రదాయమనియు నీలకంఠులు తమ భారతటీకలో చెప్పుట గమనింపదగినది.

## 1.2. వేదము : భారతము : జగద్ధితము.

ఇష్టసిద్ధికి అనిష్టపరిహారమునకు అలౌకికమైన ఉపాయమును బోధించునది వేదము అని వేద భాష్యకర్త సాయణాచార్యుల నిర్వచనము. ఆ అలౌకికోపాయము యజ్ఞయాగాదులు వేదసంహితా

రూపములైన మంత్రములు ప్రయోగ సమవేతార్థ స్మారకములు; బ్రాహ్మణములు యాగాదులకు క్రమమును నిర్దేశించునవి. పూర్వమీమాంస ఈ బ్రాహ్మణములకు ప్రాధాన్యము నిచ్చి యాగాదులను విధించును. భారతమున వైదికమతము, పూర్వమీమాంస ఉన్నవనగా అందు యజ్ఞయాగాది క్రతువులు చెప్పబడినవని అర్థము. భారత శబ్దమునకు 'భాసి+రతమ్' అను భేదమును, వ్యుత్పత్తిని చెప్పవచ్చును. 'భాస్' అనునది పైనున్న సూర్యకాంతిని చెప్పెడు వైదిక శబ్దము. భారతగ్రంథము వైశ్వానరాగ్నిరూపుడైన భాస్కరుని స్మరించుచునే మొదలగుచున్నది. ఆ అగ్నియే యాగాదిక్రతు సాధనముగా వైదిక మతమున ఉపాసింపబడుచున్నది. ఇంక 'గచ్ఛతీతి జగత్' అను వ్యుత్పత్తిని బట్టి జగత్తనగా నిత్యపరిణామశీలమైన సృష్టి అని అర్థము. ఇట్టి లోకమున ఇష్టసిద్ధికి అనిష్టపరిహారమునకు లౌకికమైన ఉపాయములు చాలకపోగా, అలౌకికమైన ఉపాయములు వేదములు, పూర్వమీమాంస బోధించును. నిత్యపరిణామశీలమైన జగత్తులో ఇష్టసిద్ధిని అనిష్టపరిహారమును సాధించుటకు ఒక విధమైన గతి తర్కము (Dialecties) కావలెను. నేడు మనము గతితార్కిక భౌతికవాదము (Dialectical materialism) ను గూర్చి ఎరుగుదుము. యాగాది క్రతు విషయమును ఇట్టిదే అనుకొందును. ఏలయనగా అద్రవ్య ప్రపంచము ((ante-matter state) ఒకటి ఉన్నదని ఆధునిక వైజ్ఞానికులు అంగీకరించినారు. నేటికొక ఏడాది క్రితము అద్రవ్య రేణువు (ante-matter world) ను వైజ్ఞానికులు వేరు (solate) చేసేవారు. యాగాదులలో హోమమునందు హుతమగు ఆజ్యహవిస్సులు అద్రవ్యస్థితికి (ante-mather state) మారుననుకొనుటలో అసామంజస్యము ఉండదనిపించును. ద్రవ్యరూపమైన స్థూల ప్రపంచమును-కరుడుగట్టిన దానిని—మారజూచుటకంటె అద్రవ్యరూపమైన సూక్ష్మప్రపంచమున మార్పు కల్పించినచో స్థూల ప్రపంచమున

మార్పు తెచ్చుట సుకరమగును. ఇట్టి దృష్టి ప్రాచీనులకున్నట్లు నాకనిపించును. ఇది సార్వకాలికమైన వైదికమత విశిష్టత.

## 1.3. యాగాధికారము : లోక సంగ్రహము : భారతము.

వైదిక మతమున అందరకు అన్ని యాగములకు అధికారము లేదు. ఉదాహరణమునకు సత్రయాగము బ్రాహ్మణులకే విహితము. రాజసూయము మూర్ధాభిషిక్తులైన రాజులకే విహితము. క్షత్రియ మాత్రులకు కూడ కాదు. వాజపేయము బ్రాహ్మణ క్షత్రియు లిరువురికిని విహితమే. త్రైవర్ణికుల విషయమే ఇట్లుండగా తదితరుల శ్రేయస్సునకు మార్గమేమి? సర్వజనులకు శ్రేయస్సును సాధించి లోక సంగ్రహము చేయుటకే భారత మవతరించినది. ఆ భారతము శ్రౌతాగ్నులకు యజ్ఞయాగాది క్రతువులకు కథారూపమైన రూపకము. (allegorg) ఆది చదివిన చాలును. యాగాదుల ఫలము లభించును. అధికారము లేనివారేమి, అధికారముండినను యాగాదుల బహుద్రవ్య సాపేక్షకత్వముచేత చేయలేనివారేమి, భారతము చదివి ఆ యాగాదుల ఫలమును పొందవచ్చును. ఇట్లు చెప్పుటకు ఆధారమేమి? 'ఎవడు ఏ ఏ క్రతువును గూర్చి చదువునో ఆయా దానిచేత వాని ఇష్టము నెరవేరును.[1] భారతమునకు ఖిల గ్రంథమైన హరివంశము చివర భారత మును ఒకసారి మొదలు పదిసార్ల వరకు పారాయణము చేయుట వలని ఫలములు ఆయా యాగరూప ఫలములుగా చెప్పబడినవి. వ్యాస భారతముననే ఇట్టి మాటలు అక్కడక్కడ ఉన్నవి. తెలుగులో నన్నయభట్టు కూడ ఇట్టి మాటలు వ్రాసినాడు. వ్యాసభారత స్వరూప ములో ముఖ్యమైనదిది యొకటి అనుట పరమార్థము.

## 1.4. వైదికమత పునర్విజృంభణము : ఆంధ్రమహాభారతావతరణము.

వైదిక మతాచరణలో దాదాపు క్రీ.పూ. 300 ప్రాంతము నాటి

జైమినీయ దర్శనముతో ఆరంభమై క్రీ.శ. 300–600 మధ్య కాలము నాటి భర్తృమిత్రాచార్యుని వరకుగల దశ తొలి విజృంభణదశ అనవచ్చును. ఈ భర్తృమిత్రుడు పూర్వమీమాంసను నిర్వీర్యము చేసి లోకాయత మొనర్చెనని కుమారిలభట్టు చెప్పినాడు.[5] క్రీ.శ. 7వ శతాబ్దము నాటి కుమారిలభట్టు, ప్రభాకర మిశ్రులతో ఆరంభమైన ద్వితీయ విజృంభణ దశ క్రీ.శ. 11వ శతాబ్ది చివరకు పరాకాష్ఠకు వచ్చినట్లు పూర్వమీమాంసా వాఙ్మయము వలన తెలి (యుచున్నది) య గలదు. ఏలనగా కుమారిలుని శ్లోక వార్తిక, తంత్రవార్తిక టుప్టీకలు, ప్రభాకరుని 'బృహతి' అను జైమినీయ దర్శన వ్యాఖ్యాన ముల తర్వాత క్రీ.శ. 1000 ప్రాంతమున దేవస్వామి అనునతడు జైమినీయ దర్శనము మీదను, దానికి సంబంధించిన 'సంకర్ష కాండ' [దేవతాధ్యాయము) మీదను వ్యాఖ్యానములు వ్రాసెను. 'సంకర్ష కాండ' మీద ఇతని వ్యాఖ్యాన మొక్కటే లభ్యము. క్రీ.శ. 1050–1120 మధ్యకాలమున పార్థసారథిమిశ్రులు 'శాస్త్రదీపిక' అను జైమినీయ దర్శన వ్యాఖ్యానమును భాట్టమతానుసారముగాను, భావనాథభట్టు అనునతడు ప్రాభాకర ప్రస్థానానుసారియైన 'నయవివేక' మను వ్యాఖ్యానమును వ్రాసినారు. ఆంధ్ర మహాభారత రచనకు పూనుకున్న నన్నయభట్టు క్రీ.శ. 11వ శతాబ్ది పూర్వార్థమునందున్న వాడని మనమెరుగుదుము. ఈ నేపథ్యమును ఆంధ్రమహాభారతావ తరణమును గమనించుట అవసరము. వైదికమత విజృంభణ లేనిచో తండ్రి తాతలు జైనమతావలంబికులై దానికి ప్రాపకులై ఉండగా రాజనరేంద్రుడు సాక్షాత్తుగా వైదికమతానుయాయి అగుటయు అనిపింపదు. కాగా వైదికమత ద్వితీయ విజృంభణ పరాకాష్ఠ దశలో ఆంధ్రమహాభారతావతరణము జరిగినదని చెప్పవలెను.

## 1.5. నన్నయభట్టు : రాజరాజు.

నన్నయ భట్టారకుడు ఆహితాగ్ని; సోమయాగములలో నొక

దానిని-బహుశః వాజపేయమును, బృహస్పతి సవమును చేసినవాడు. రాజపురోహితుడు. రాజరాజునకు అమాత్యస్థానీయుడైన అర్థధర్మాను శాసకుడు. రాజరాజునకు 'ఆచార్యకరణము' (ఉపనయనము చేయించి బ్రహ్మోపదేశము చేయుట) కూడ చేసిన వాడనిపించును. అధ్వర్యు శాఖ అనబడు కృష్ణయజుర్వేద శాఖకు చెందినవాడు. ఆపస్తంబ సూత్రుడు; ముద్గలగోత్రుడు; యాజ్ఞికుడు.

ఇంక రాజనరేంద్రుని గూర్చి నన్నయ చేసిన సంబోధనలు క్రోడీకరించి విశ్లేషించి చూడగా రాజనరేంద్రునకు పూర్వమీమాంసా పరిచయము, అధీతి బోధాచరణ ప్రచారములలో ఉన్నట్లు తెలియును. కాని ఒక్క విశేషము. రాజనరేంద్రుడు భాట్టమతానుయాయిగాను నన్నయ ప్రాభాకర ప్రస్థానము వాడుగను ఉండిరని నా తలంపు. నన్నయ భారతమునకు వ్యాఖ్యానమును వ్రాయగోరువారు నన్నయ అన్వితాభిధానవాది (ప్రాభాకర మతము) యా, అభిహితాన్వయవాది (భాట్టమతం) యా అనునది నిర్ధారించి ఆ పనికి పూనుకోవలసి ఉండును.

## 1.6. భట్టారకుని భారతావతారిక.

భట్టారకుని అవతారిక అంతయు ప్రక్షిప్తమనుచు ఒక ఏడాదికి పూర్వము, 'భారతి' లో ఒకానొకరు వ్రాసిరి కాని అది అవిచారిత రమణీయము. నన్నయ భారతావతారికలోని మూడు విశేషములు మాత్రము చెప్పెదను. మొదట రాజనరేంద్రుని భారతాంధ్రీకరణేష్టికి యజమానునిగా సంభావించి 'దీక్షణీయేష్టి' లో పంచప్రయాజలు ఉండునట్లు మొదట రాజనరేంద్రుని గూర్చి వ్రాసిన పద్యములలో వాని స్ఫురింపజేయుట. ప్రయాజలనునవి ప్రధానయాగమునకు ముందు చేయు హోమములు. వీనిచే ఋతువులు (వైదికమున ఐదే) ప్రీతము లగుట ఫలము. యజమానునకును ఫలములున్నవి. (అనుయాజలు అనునవి ప్రధాన యాగమున కనంతరము చేయబడు హోమములు).

రెండవ విశేషము అటు తర్వాత అవతారికాభాగమును భారతాంధ్రీకరణమును 'దర్శేష్టి' గా భావించి ఆ క్రమమును మనసులో నుంచుకొని వ్రాయుట. దర్శపౌర్ణమాసేష్టులు అనునవి శుక్ల పాడ్యమి, బహుళ పాడ్యమి నాడు చేయబడు ఇష్టులు. ఇష్టి-అన్నను యాగమే కాని ఒక తెగ. యజ్ఞము చేసినవానికే ఇష్టి చేయుటకు అధికార ముండును. మూడవ విశేషము భారతాంధ్రీకరణ ధర్శేష్టికి రాజ నరేంద్రుడు యజమానుడు కాగా తాను అధ్వర్యుడైనట్లు భావించి మరల పంచప్రయాజలను స్ఫురింపజేయుచు కులకబంధముగా ఐదు పద్యములు వ్రాయుట. అ పంచప్రయాజలలో "ఉత్తమ ప్రయాజ" స్థానమున ఉన్నదే సారమతింగవీంద్రులు ప్రసన్న కథా కవితార్థయుక్తిలో నారసి మేలునాన్' అను పద్యము. భట్టాకర భారత విమర్శ కంతటికిని కీలకమైన పద్యమిది. పూర్తిగా పూర్వమీమాంసా గంధిలమైనది. అది అంతయు వివరించుటకు పది పుటలైనను వ్రాయవలసి ఉండును. క్లిష్టమైన శాస్త్ర విషయము గనుక అర్థయుక్తిని గూర్చి మాత్రమే స్పృశింతును.

## 1.7. అర్థయుక్తి : మీమాంసాన్యాయము.

నన్నయ గారి ప్రసన్న కథాకవితార్థయుక్తిని శిల్పపరముగ ఆవిష్కరించినవారు విశ్వనాథ సత్యనారాయణగారు. అది నేడు కళాశాలలో బోధింపబడు చున్నది. కాని వారు చెప్పినది సాహిత్యమాత్ర పరమైనదనియు, భట్టారకహృదయము వేరనియు నాతలంపు. భట్టారకుని కూర్పులో రెండు పదబంధములున్నవి, **1.** ప్రసన్నకథ. **2.** అర్థయుక్తి. వీనిలో మొదటి దానిలోని ప్రసన్న శబ్దము స్పష్టార్థమునకు కూర్పబడినది. 'మంత్ర గ్రహదాత్ కథాకుల్యా, విద్యాకేదారమాగతా, మోక్షశ్రియః ప్రసూర్మహ్యే, పీయతే కర్మమార్గగైః' అను శ్లోక జ్ఞాపకమునకైనది. ఈ శ్లోకము కూడ భారతములోని పూర్వ

మీమాంసనే లక్షించుచున్నది. కథ సహజముగానే ప్రసన్నము. ప్రసన్న కథ అనుట స్పష్టార్థమే. ఇంక అర్థశబ్దము శబ్దార్థ మాత్ర సూచకమనుట సాధారణాంశము. శాస్త్రములందు అర్థశబ్దము ద్రవ్య, గుణ, కర్మలు మూడింటిని చెప్పును. పూర్వమీమాంసలో 'అర్థ సంగ్రహము' వంటి పేరుగల గ్రంథమున్నది. అది పూర్వమీమాంసనే చెప్పును. యుక్తము న్యాయ్యమను శబ్దములు సమానార్థకములు. మూడులింగములలోను వర్తించును. భట్టారకుడు మీమాంసా న్యాయ మనుటకు 'అర్థయుక్తి' అన్నాడు. 'ప్రసన్నకథా' అను దళమున కథా శబ్దము స్త్రీ లింగశబ్దమైనందున యుక్తమను దాని స్త్రీలింగరూపము గ్రహించి 'అర్థయుక్తిః' అని కూర్చి తత్సమముగా 'అర్థయుక్తి' అన్నాడు. కాగా అర్థయుక్తి అనుదానికి మీమాంసాన్యాయమని హృదయము. అట్లయినచో సత్యనారాయణగారు చెప్పినదేమి కావలెను? రెండును ఉండును. వారు చెప్పినది గౌణమని మాత్రమే మనవి. ఒకచోట రెండు ప్రక్రియలు ప్రాప్తింపగా దేనిని గ్రహింప వలెను! అను ప్రశ్న వచ్చినపుడు మీమాంసలో 'పరిసంఖ్యావిధి' వర్తించును. 'ద్వయోస్సముచ్చిత్యప్రాప్తౌ ఇతర నివృత్తి ఫలకో విధిః పరిసంఖ్యావిధిః' రెండును చేరి వచ్చినపుడు అప్రధానమైన దానిని వదులునట్లు చేసి, ప్రధానమైన దానిని గ్రహించునట్లు చేయునది పరిసంఖ్యా విధి. భట్టారకుని పద్యమున అర్థయుక్తి అను దళమునకు కథార్థమును యోజించుట, మీమాంసాన్యాయము అని రెండు స్ఫురణలు కలుగుచుండగా దేనిని గ్రహింపవలెను? అన్నచో, భట్టారక ప్రయుక్తి నెరిగినవాడు మీమాంసాన్యాయమనే గ్రహింపవలెను. రెండవ దానిని ఊరక గ్రహింప వచ్చును.

## 1.8. భారతము, శ్రౌతరూపకము : మీమాంసా న్యాయములు.

పూర్వమీమాంసలో దాదాపు వెయ్యి న్యాయములున్నవి.

అవే, జైమినీయ న్యాయమాలావిస్తారము వంటి గ్రంథములలో క్రోడీకరింపబడి వివరింపబడినవి. నేటికిని న్యాయస్థానములలో ఈ న్యాయముల ననుసరించియే వాజ్మూలాదులు పరిశీలింపబడుచున్నవి. భట్టారకుడు వ్యాసభారత స్వరూపమును చక్కగ ఎరిగినవాడు గనుకనే 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని' అను పద్యమున ధర్మప్రదర్శనమునకు ప్రాధాన్యము నిచ్చినాడు. 'అథాతో ధర్మజిజ్ఞాసా' అను సూత్రముతో జైమినీయ దర్శనము ఆరంభమగును. మీమాంసా న్యాయములు తనకు చక్కగ తెలియుననుచు తాను 'నానారుచిరార్థ సూక్తినిధి' నన్నాడు. ఇక్కడ రుచిరార్థ సూక్తులనగా కవి చెప్పెడు అర్థాంతరన్యాసములు గావు. పలువిధములైన, రుచిరములైన అర్థ సూక్తులు అనగా మీమాంసా సూక్తులు/న్యాయములు అనియే భట్టారక హృదయము.

ఇంతకును భారత స్వరూపమేమి? ఒక పొరలోనైనను అది శ్రౌతరూపకము. వివరించుటకు వీలులేదు కాన నేను గమనించిన అంశములు క్రోడీకరించెదను. కద్రూవినతల వృత్తాంతము అగ్న్యాధేయ (commissioning of vedic fires) సంబంధించి. విహారన్యాయ మిందున్నది. విహారమనగా శ్రౌతాగ్నులుండు వేదిక. సౌపర్ణాఖ్యాన మంతయు పవమానేష్టుల చిత్రణము. రురు సహస్రపాద జరత్కారు వృత్తాంతములు పునరధేయ చిత్రణము. వహ్న్యనుగమద్వయ నిమిత్తాన్యాయమిందున్నది. జనమేజేయ సర్పయాగము ఆభిచారికమును కాలహీనతాదురిష్టమును చిత్రించును. ఉపరిచరవసు వృత్తాంతము చయనయాగ సంబంధి. ఐంద్రీన్యాయమిందున్నది. దుష్యంతుని కథ. అవాంతర ప్రకరణము, సదంశపతితమను శాస్త్రవిషయ చిత్రణము. ఏకలవ్యుని కథ, నిషాదస్థపతి న్యాయమునకు చిత్రణము. శ్వేతకి అను రాజర్షి వృత్తాంతమున క్రత్వర్థమను శాస్త్రాంశము, వసోర్ధారా

న్యాయము చిత్రింపబడినవి. మందపాలోపాఖ్యానమున ఋణత్రయాపాకరణ నిత్యత్వ, వైశ్వానరన్యాయములు చిత్రితములు. ఖాండవ దహనకథ సంయోగ పృథక్త్వన్యాయమును, ఉభయార్థమను శాస్త్రాంశమును చిత్రించును. మయసభా వృత్తాంతము మీమాంస లోని 'అపూర్వము' నకు చిత్రణము. ధర్మజుని రాజసూయము, సరేసరి.. యాగచిత్రణమే. ఇందలి జరాసంధ వధ రాజసూయభాగమైన వాయవ్యయాగ చిత్రణము. ఇవి అన్నియు సంగ్రహముగ వివరించుటకు వీలుకాని శాస్త్ర విషయములు. అయినను అందరకు తెలిసిన ఏకలవ్యుని కథలో నిషాదస్థపతి న్యాయమెట్లు చిత్రింపబడినదో చూపి ముగింతును.

## 1.9. ఏకలవ్యుని కథ : నిషాదస్థపతి న్యాయము.

ఏకలవ్యుని కథ వ్యాసభారతమున సంభవపర్వములోని 130వ అధ్యాయముననను నన్నయ భారత భాగమున ఆదిపర్వ పంచమాశ్వాసము (232-244) నను ఉన్నది.

వేదము రథకారులకు అగ్న్యాధానమును, నిషాదులకు రౌద్ర యాగాధికారమును అనుగ్రహించు చున్నది. 'వర్షాసు రథకార ఆ దధీత' అను ఆధాన ప్రకరణమందలి వాక్యము రథకారులకు వర్షర్తువునందు అగ్న్యాధానమును విధించు చున్నది. రథకారులు యాజ్ఞవల్క్య వచనము ననుసరించి సంకీర్ణజాతి. జైమినీయన్యాయ మాలా విస్తరమున రథకారాధికరణము (6-1-12) దీనిని వివరించు చున్నది.

నిషాదులకు రౌద్రచరు యాగాధికారము 'వాస్తుమయం రౌద్రం చరుం నిర్వపేత్' అను ప్రకృతి వాక్యము వలన సిద్ధించు చున్నది. దీనిని నిషాద స్థపతి న్యాయమిట్లు వివరించు చున్నది. 'వాస్తు

మయం రౌద్రం చరుం నిర్వపేత్' ఇదిః ప్రకృత్యః శ్రూయతే.' 'ఏతయా నిషాద స్థపతిం యాజయేత్' ఇతి వాస్తు శబ్దః కించిత్ప్రకృతి ద్రవ్య విశేషమాహ ఏతస్యా మిష్టావధికారీ స్థపతి శబ్ద వాచ్యః త్రైవర్ణికః కుతః ? 'నిషాదానా మధిపతిః' ఇతి షష్ఠీ సమాసస్య త్రైవర్ణికే సంభవాత్. తస్యచ అధీత వేదత్వేన విద్యాసంభవాచ్చ. ఇతిచేత్ నైవమ్. 'నిషాదశ్చాసౌస్థపతిశ్చ' ఇతి కర్మధారయ సమాసస్య ముఖ్యత్వాత్. షష్ఠీ సమాసే తు సంకీర్ణ జాతి విశేష వాచినా నిషాదశబ్దేన తత్సంబంధ ఉపలక్ష్యేత. నత్వయం కర్మధారయే దోషోఽస్తి. తత స్తాత్కాలికాచార్యోపదేశాదినా విద్యాం సంపాద్య ధనికో నిషాదో రౌద్రయాగం కుర్యాత్. (జై. న్యా. మా. వి. 6-1-13)

పై వానిలో మొదట చెప్పబడిన పూర్వపక్షము 'నిషాదస్థపతి' అనుదానిని షష్ఠీ తత్పురుషముగా గ్రహిగిచి (నిషాదానాంస్థపతిః) స్థపతి శబ్దవాచ్యుడు త్రైవర్ణికుడనియు వానికి వేదాధ్యయనము వలన విద్య యుండును గనుక రౌద్రియాగమునకు అధికారము కలదనియు చూపగా, అట్లు కాదనుచు రెండవ పేరా 'నిషాదస్థపతి' ని కర్మధారయముగా గ్రహించి ఆ స్థపతికి సంకీర్ణ జాతిత్వము రాకుండ చెప్పను. తాత్కాలికమైన ఆచార్యోపదేశముచేత విద్యను సంపాదించ ధనికుడైన నిషాదుడు రౌద్రియాగము చేయవచ్చునని చెప్పుచున్నది.

ఈ న్యాయమే ఏకలవ్యుని కథలో చిత్రింపబడినది. ఏకలవ్యుడు ఎఱుకురాజు కొడుకని మనము సామాన్యముగ అనుకొంటుము. కాని అతడు రాజకుమారుడనియు నిషాదులలో పెరిగెననియు. హరి వంశము చెప్పుచున్నది ఏకలవ్యుడు సంకీర్ణ జాతివాడు కాదనుట స్పష్టము. ఇంక కథాంశములకు అన్వయము చూపెదను. ఇతని తండ్రి పేరు హిరణ్యధన్వుడు. ఇది వాడు ధనికుడగుటను సూచించును. ధనుస్సు భూమి కాగ్నికి (Terrestrial Fire) ప్రతీక అని 'బృహద్దేవత' చెప్పు

చున్నది. ఏకలవ్యుడను పేరు వాని వాని సకృల్లవనార్హతను సూచించును. నిషాదులకు రౌద్రియాగ మొక్కటియే విహితము. ధనికుడైన నిషాదుని వలన తాత్కాలికాచార్యుడు ఒక్కసారి గురు దక్షిణ గ్రహించుట ఉచితమే. ఏకలవ్యుడు స్థపతి అగుటకు సూచకము గానే అతడు ద్రోణుని రూపు మట్టిబొమ్మగా చేసిపెట్టుకొని ధనుర్విద్యా భ్యాసము—అగ్ని సంబంధమైన వేదవిద్యాభ్యాసమునకు చిహ్నము. ఇంక తనకడకు వచ్చి మొఱుగుచున్న కుక్కను ఏడుబాణములతో కొట్టుటయే రౌద్రియాగ నిర్వాహణము. ఏలన కుక్క రౌద్రిస్వరూపము. (శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చవోనమః). నిషాదునికి అగ్న్యాధానము లేనందున ఈ రౌద్రిచరుయాగము లౌకికాగ్నియందే చేయవలసి ఉండును. ఏకలవ్యుడు కుక్కను బాణములతో కొట్టుట ఆరణ్యక పరిసరములలో జరుగుట లౌకికాగ్నికి ప్రతీక. ద్రోణుడు ఏకలవ్యుని దక్షిణాంగుష్ఠమును గురుదక్షిణగా కోరుట ప్రసిద్ధము. అది లవనమే అయి ఏకలవ్య నామము సార్థకమైనది. చేతి బొటనవ్రేలు బ్రహ్మ సంకేతము కలది. దానిని ద్రోణుడు గురుదక్షిణగా కోరుట బ్రహ్మ పరమైన దక్షిణను కోరుట. ఈ కథలో ఏకలవ్యునికి ద్రోణపరమైన నశిష్యత్వము కాదా చిత్కమనుట స్పష్టము. ఇట్లే కథ నిషాదస్థపతి న్యాయమును చిత్రించుచున్నది.

## 1.10 ముగింపు.

ఇట్లు ఇందు ప్రసన్నమైన కథలో మీమాంసాన్యాయము చిత్రితమైనది. భట్టారక హృదయము వీనిని లోనారసి మనము గ్రహింపవలెననియే కాని అప్రధానమై గౌణమయిన చమత్కార విశేషములని కాదు. సరళముగా నుండు ఒక్క మచ్చు మాత్రము చూపినాను. భట్టారక హృదయము నెరుగగోరు పాఠకులు భారతమున గంభీరమైన శాస్త్రదృష్టితో చదువవలసి ఉండును. అట్టి ఆభిముఖ్యము,

ప్రియత్నము పదిమందిలో కలిగినను నా ఈ వ్యాసము చరితార్థమే అగును. ధీనా మవిత్ర్యావతు.

సూచికలు

1. 'యదిహాస్తి తదన్యత్ర; యన్నేహాస్తి నతత్ క్వచిత్'
2. ఋతో యజాంషి సామాని, వేదా, ధ్యాత్మం తథైవచ న్యాయ, శిక్షా, చికిత్సా చ దానం పాశుపతం తథా'
3. 'ఇష్ట సిద్ధ రనిష్ట పరిహార్థే దలౌకికం ఉపాయం యోఽయతి సవేదః'— ఐత రేయ బ్రాహ్మణవ్యాఖ్య.
4. 'యం యం క్రతుం ఆధీతే తేన తేన అస్య ఇష్టం భవతి'— బ్రాహ్మణవాక్యము.
5. ప్రాయేణ సర్వామీమాంసా హాస్త లోకాయతీకృతో'— కుమారిలభట్టు

—*—

# భారత భారతి–నన్నయార్యుని నాటకీయత.

సూఫ్రి శ్రీ.

"ప్రాంశు పయోద నీల తను భాసితు నుజ్జ్వల దండధారుఁ బిం
గాంశు జటచ్ఛటా భరణు నాగమపుంజ పదార్థ తత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మ కృతాంబర కృత్యు భారతీ
వంశ వివర్థనున్ బ్రదదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్."

మహాభారతమున సభాపర్వము రమ్యమై పండితచేతో నిర్వృతి చేయుచున్నది. అందు మరలఁ దొమ్మిది పర్వములు గలవు. సభా పర్వము, మంత్రపర్వము, జరాసంధ వధ, దిగ్విజయము, రాజ సూయము, అర్ఘ్యాభిహరణము, శిశుపాల వధ, ద్యూతము, అను ద్యూతము.

ఆంధ్ర మహాభారతమున రాజసూయము వరకుఁ బ్రథమా శ్వాసమున వర్ణితమైనది. అర్ఘ్యాభిహరణమునుండి అనుద్యూతము వరకు ద్వితీయా శ్వాసమున వర్ణితమైనది. ఈ రెండా శ్వాసములును రెండు ప్రత్యేక కావ్యములుగాఁ బరిగణింపఁ దగినంతటివి. మొదటి యాశ్వాసము మయుఁడు సభను నిర్మించి ధర్మజున కిచ్చుటతోఁ బ్రారంభమై, క్రమపరిణామము నొంది, తత్సభయందు ధర్మజుడు రాజసూయయాగ దీక్షితుడగుటతో ముగియును. రాజసూయము చేయవలయునన్న సామాన్యులకు సాధ్యము కాదు. సర్వ సర్వం సహా మండలమును శాసించి, పాలింపఁగల సార్వభౌములు మాత్రమే దానికి సమర్థులు. అందువలన ధర్మజుడు బంధుమిత్రాదులతో బాగుగా నాలోచించి, కృష్ణుని ప్రోత్సాహము వలన రాజసూయమున కంగీక రించును. జరాసంధుని వధ వలనఁ, బాండవుల దిగ్విజయము వలన ధర్మజుఁడు రాజసూయ దీక్షాదక్షుడగును. మయుఁడు నిర్మించి యిచ్చినదే రాజసూయమునకు రంగస్థలము.

ఇఁక ద్వితీయాశ్వాసమునఁ గథ కొంచెము వేగము నందు కొనును. అర్ఘ్యమున కర్హునిగా శ్రీకృష్ణు నెన్నుకొని పూజించుటతో నారంభమై, క్రమవికాసము నొంది, అనుద్యూతముతో నంతమగును, అర్ఘ్యాభిహరణము, శిశుపాలవధ– ఈ రెండును గలిసి యొక యేకాంకిక వలె నాటకీయమైన చక్కని చలనము (Dramatic movement) కలిగియుండును. దీనికిఁ బరిణామ స్వరూపముగానే ద్యూతానుద్యూతములు సాగి అరణ్యగమనమునఁ బర్యవసించును.

నన్నయ భట్టారకుఁడు భారత సంహితారచన బంధురుఁడగుచుఁ బ్రసన్న కథా కవితార్థయుక్తిని, నక్షర రమ్యతను, నానా రుచిరార్థ సూక్తి నిధిత్వమును నిల్పుకొనుచు వచ్చెను. వాగను శాసనుని కథా సంహితా రచన దృష్టిని గుర్తించియే ఉభయ కవిమిత్రుఁడు గద్య పద్యములతోఁ బ్రబంధ మండలిని నిర్మింతున నెను. నన్నయ కాని, తిక్కన కాని భారతమును సంస్కృతము నుండి యథాతథముగ ననువదింపవలయుననుకోలేదు. సంస్కృతమున భారత మితిహాసము; తెలుఁగునఁ గావ్యము. నన్నయ "నా నేర్చు విధంబున నికాఁ వ్యంబు రచియించెదనని దొడంగినాఁడు. తిక్కన కూడ "ఇమ్మహాకావ్యంబు" అనియే గురుతించి చేకొనినాఁడు. నన్నయభట్టు "జననుత కృష్ణ ద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత బద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుగున రచి" యించినాఁడు. తిక్కన "ఇమ్మహా కావ్యంబు నర్థంబు సంగతంబు సేయుదు" నన్నాఁడు. దీనిని బట్టి యీ కవు లిర్వురును దమ నేర్పునుబట్టి, వ్యాస నిరూపితార్థ మేర్పడునట్లుగాఁ దెనుఁగున రచియింతుమని తెల్పినట్లే యైనది.

సంస్కృత భారతము మేలిమి బంగారపు ముద్ద. ఆంధ్రభారతము చక్కని హారము. దీని కాకృతి (Design) రచించి, కొంతవరకు నగను జేసి యిచ్చిన మహాశిల్పి నన్నయ. ఆ యాకృతిని జక్కగా

గ్రహించి నగను బూర్తిచేసి ఆంధ్ర శారదా కంఠసీమ నలంకరించిన మహానుభావుడు తిక్కన.

తెనుఁగు కవులు కావ్యదృష్టితో వ్రాసిన వారగుటవలన నేకథ కాకథనే ఆద్యంతములు చక్కగా సమన్వయించుకొనుచు రచన సాగించినారు. దీని కవరోధములుగా నుండు కథలను, వంశ చరిత్రలను, స్తుతులను దొలగించి వేయుటకు సంకోచింపలేదు. కావుననే ఆంధ్ర భారతము విశ్వజనీనమై, ఆంధ్రావళి మోదముఁ బొరయునట్లొనరించినది.

సభాపర్వము ద్వితీయాశ్వాసమున నన్నయభట్టారకుని కవితా వైశిష్ట్యమును గమనింతము.

శిశుపాల వధకు సంబంధించిన కథ డెబ్బదియొక గద్యపద్యములలో నున్నది. ఆ కథా భాగమున నాద్యంతములను నన్నయ సమన్వయించిన విధమిది—"తొల్లి బ్రహ్మాది సురగణ ప్రార్థింతుడయి యఖిల మహీ భారతావతరణార్థంబు నారాయణుండు యదు వంశంబున నుదయించుటయు" నని మొదలిడి "అంత ననంతశయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి" యని ముగించినాఁడు. ఇది కేవలము కృష్ణుఁడవతార పురుషుఁడను విషయమును నిరూపించుటకు మాత్రమేకాక, భవిష్యద్భారత రణమునకు జ్ఞాపిక యగుచున్నది. "అనంతశయనుఁడు" అనుటవలన జయవిజయుల శాపవృత్తాంతమంతయు ధ్వనింపఁజేసినట్లయినది. అందు కొరకే మూలమునఁగల యర్థమును మార్చి యిట్లు పలుకవలసి వచ్చినది.

> "పాండవ స్త్వబ్రవీత్ భ్రాతౄన్, సత్కారేణ మహీపతిమ్
> దమఘోషాత్మజం వీరం, సంస్కారయత మా చిరమ్"

సంస్కృతమున ధర్మరాజే పనికట్టుకొని శిశుపాలునికి సంస్కారము జరుపవలసినదిగాఁ దన తమ్ములకుఁ దెల్పెను. కాని, యిక్కడ ధర్మరాజెవ్వరు ? కేవల యజ్ఞదీక్షితుఁడు. తాను జూచుచు నుండ

వలసినదే కాని యేమి చేయుటకును జాలడు. సర్వభారము కృష్ణునిపైఁ బడినది. అందువలన నతడే సర్వమును నిర్వహింపవలయును కావుననే కృష్ణుఁడా యధికారమును హస్తగత మొనరించుకొనెను. ఇంతవరకు 'లౌకికవిషయము. కాని శిశుపాలుడెవరు? అను ప్రశ్న యుండనే యున్నది. దానికై నన్నయ యొక విశేషణముతో నొక కథనే ధ్వనింపఁ జేసినాడు. "అనంతశయనుఁడు" అనుటతోడనే విష్ణుమూర్తి లక్ష్మీదేవితో నున్నకాలమున సనకసనందనులు దర్శనము గోరుట, జయ విజయులు నివారించుట, శాపవృత్తాంతము మున్నగునదంతయు, క్రమముగా స్మృతిపథమునఁ గదలాడును. ఇది అల్పపదముల ననల్పార్థ రచన.

మొదటి భాగమున నర్ఘ్యమున కర్హుని దెల్పుమనఁగా భీష్ముఁడు ధర్మజునితో నాచార్యుఁడు మున్నగు నారుగురను దెల్పి

"ఏషా మేకైక శో రాజన్ అర్ఘ్యమానీయతామితి
అథ త్వైషాం పరిష్ఠాయ సమర్థా యోపనీయతామ్"

అని మూలమున బల్కెను.

దీనిని బట్టి గుణములయందు వరిష్ఠుఁడు, సమర్థుఁడునైన వాని కగ్రపూజ చేసి మిగిలిన వారిని క్రమశః పూజింపవలయునని యర్థము. కాని నన్నయ భీష్మునిచే నిట్లు పలికించెను.

"వీరిలో,
ప్రీతినెవ్వఁడు సద్గుణంబులఁ బెద్దయట్టి మహాత్ముని
ఖ్యాతుఁ బూజితుఁజేయు మొక్కనిఁ గౌరవాన్వయ వర్ధనా"

దీని వలన నొక ప్రయోజన మున్నది. భీష్ముని వచనమున ధర్మతనయుఁడు కృష్ణున కర్ఘ్యమిచ్చెను. శిశుపాలుఁ డధోక్షజుఁడనునది సాభిప్రాయ విశేషణము. అక్షజములైనవాని నధఃకరించు వాడని యర్థము. ఇఁకముందు జరుగబోవునదదియే. అందువలననే కేవల శబ్ద

సౌందర్యము- కోసమను ప్రాసము వేసినట్లున్నను విశేషణౌచిత్య మును గథ కనుగుణముగా దిద్దుకొన్నాఁడు నన్నయ. దీనిని లోనారసి "మేలు" అనవలసినవారు కవీంద్రులు. మూలమున "శిశుపాల స్తుత్వా పూజాం వాసుదేవే న చక్షమే" అని మాత్రమే యున్నది.

ఈ యాక్షేపమంతయు నొక పెద్ద యుపన్యాసము. దీనియందు శిశుపాలుఁడు తన నేర్పంతయు నుపయోగించి సభ్యులను కలియఁగట్టు కొనుటకు యత్నము చేయుట కనిపించును. అందుండు రాజులు విశిష్టా రాధ్యులు-అర్హ్యులు; మహీదివిజులు పూజ్యులు-ఇట్లనుట వలన సభలో సాముఖ్యమును సంపాదించుకొనుట సులభము. దీని తరువాత ధర్మరాజుపైఁ బ్రశ్నల వర్షముఁ గురిపించుచున్నాఁడు. పూజనీయులైన అరుగురియందును గృష్ణుఁడెవ్వఁడు? ఇది యాతని ప్రశ్నల సారము. ఇంతవరకు భీష్ముని పనుపువలననే ధర్మజుఁడిట్టి యవివేకము నాచరించె నని తెల్పుచు ధర్మజునిఁ గూడ ప్రశంసించుట సాగించెను. రాజులు ధర్మరాజుని గురించి పురుష విశేష విత్తముఁడు, పూజ్యుఁడు- అని భావించి యాగమునకు వచ్చిరఁట! వారి కన్నివిధముల నవజ్ఞ సేయుట పాడియేనా? అని ప్రశ్న. ఇది కేవలము ధర్మజునికి వేసిన ప్రశ్న కాదు. ధర్మరాజక్కడి రాజులందరి నవమానించెనని తెలియఁజెప్పి వారినిఁ గూడఁ దనతోఁ గలుపుకొనుటకుఁ జేసిన యత్నము. అంతే కాదు "ఈ యవనీశ్వర ప్రవరలిందఱు నిన్ను నగంగ నిట్లుగాఁ జేయుదె" అని కూడ నన్నాఁడు. దీనివలన నచ్చటి రాజులు ధర్మరాజున కవమానకరముగా నవ్వవలయునని యాతని సూచన. ఇది వెంటనే కార్యరూపమును దాల్చలేదు. కావునఁ దానే సభా భవనమును వీడి పోయెను, ఉపన్యాస కళకిది చక్కని యుదాహరణము.

కృష్ణుఁడు తగని యర్ఘ్యమును గొనియెనని తెల్పుచు "గోవిందుఁడు" అని యుపయోగించెను. గోవులను రక్షించువాడని,

గొల్లయని శిశుపాలుని భావము. "ధీయుత యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గులాడుచున్" శిశుపాలుఁడు ధర్మజుని సంబోధించుటలో "ధీయుత" అనినాఁడు. నన్నయ దీని నెగ్గులాడుటగానే తెల్పినాఁడు. దీనిని గాకు ప్రధానముగా నర్థము చేసికొనవలయును. అప్పుడు బుద్ధి మంతుఁడను నర్థము కాక బుద్ధిహీనుఁడనియే భాసించును.

"క్లీబే దారక్రియా యాదృ, గంధే వా రూప దర్శనమ్
అరాజ్ఞో రాజవత్ పూజా, తథా త్వే మధుసూదన"

అని మూలమున శిశుపాలుఁడు కృష్ణునే సంబోధించినట్లున్నది. అట్లు చేసిన శిశుపాలునిలో బిగువు సడలిపోయినట్లే! ప్రతిస్పర్థితోఁ దనకుఁదానై మాటలాడఁడు. అందువలననే ఆంధ్ర భారతమున శిశుపాలుఁడు ధర్మజునితోనే పల్కును. ఇది మొదటి మెట్టు. దీనిని దాటిన పిమ్మటఁ గాని శత్రువులు పరస్పర మభిముఖులు కారు. "అరాజ్ఞో రాజవత్ పూజ్యా" అనున దప్పుడు జరిగినదనియే శిశుపాలుని భావము. దానిని మరలఁ జెప్పుట పునరుక్తియే కాని ప్రయోజనము శూన్యము. అందువలన నన్నయ మొదటి రెండు నిదర్శనములకు నడుమ "చెవిటికి మధురగీతియును" అని చేర్చి కృష్ణుని పూజించుట యటువంటిదని ధర్మజునికే చెప్పించినాఁడు.

సభను వీడిపోవుచున్న శిశుపాలునిఁ బ్రియవచనములతో ననునయించుటకు ధర్మజుఁడు వెంట నరిగెను. మూలమున "తతో యుధిష్ఠిరో రాజా శిశుపాల ముపాద్రవత్" అని యున్నది. తెలుఁగులో "శిశుపాలు పిఱుందన చని" అని యనుటవలన ధర్మజుని పాత్రకు మూలమునలేని గాంభీర్యమలవడినది, ఆ గాంభీర్యమాతని సంభాషణము నందు గూడ నిలిచియే యున్నది. ఆరంభమునందే ధర్మజునికి వాడిన విశేషణములలో "ధృతిమంతుఁడు" అనునదొకటి సార్థక్య మీ ఘట్టమున సర్వత్ర కన్పట్టును. మూలమున యుధిష్ఠిరుని మాటలివి—

"నేదం యుక్తం మహీపాల, యాదృశం వైత్వముక్తవాన్
అధర్మశ్చ పరో రాజన్, పారుష్యం చ నోర్థకమ్".
నహి ధర్మం పరం జాతు, నావ బుధ్యేత పార్థివః
భీష్మః శాంతనవస్త్వేనం, మావమం స్థ్వా స్త్వమన్యథా
పశ్య చైతాన్ మహీపాలాం, స్త్వత్తో వృద్ధతరాన్ బహూన్
మృష్యన్తే చార్హణాం కృష్ణే, తద్వత్త్వం క్షన్తు మర్హసి
వేద తత్త్వేన కృష్ణం హి, భీష్మశ్చేదిపతే భృశమ్
నహ్యేనం త్వం తథా వేత్థ యథైనం వేద కౌరవః"

"నీకంటె వృద్ధులయిన రాజు లనేకులున్నారు. వారు సహించిరి. నీవును సహింపుము" అనుటవలన ధర్మరాజు కృష్ణునిఁ దక్కువపఱుచు చున్నట్లే యనిపించును. ఆంధ్రమున నర్థమట్లే యుండియు భావము మారినది. ఇది కేవల మనున యించుటయే కాదు; మందముగా మందలించుట కూడ.

"భూరి గుణోన్నతు లనఁదగు,
వారికి ధీరులకు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహో
దారుణమది విషము కంటె దహనము కంటెన్"

"ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాది సమస్త వాఙ్మయము లందు బ్రశంసితుఁడైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁడని యాత్మ నెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తము కాకిదియేమి దోషమే.

"పరమార్థ ప్రతిభఁ దమో
హరు నచ్యుతు భీష్ముఁడెఱిఁగి నట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్

గురుఁడని సమ_స్త లోకో
త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుత నర్చన నెడ
గర మభినందింప నీకుఁ గాదనఁ దగునే"

శిశుపాలుని యందు ధరణి వల్లభునకుఁ గావలసిన గుణములు లేవని చెప్పినట్లయినది. భీష్మునకు 'పితామహ' శబ్దము నుపయోగించి బ్రహ్మ యంతటి వానిని జేసినాఁడు. అట్టివాఁడు మాత్రమే "బ్రహ్మ యుదయంబున కాస్పదమైన దానిని" గూర్చి తెలిసికోగల్గును. "యుక్తమ కాకిదియేమిదోసమే" యనుట శిశుపాలుని మందలించి యొప్పించుట కాని బతిమాలుట కాదు. కృష్ణుని గొప్పదన మల్పుల కెఱుఁగ శక్యము కాదనుట వలన శిశుపాలుఁ డల్పుడని చెప్పినట్లే యైనది బుద్ధిమంతులు పెద్దలను జూచియైన నేర్చుకొందురు. శిశుపాలుని కదియుఁ జేతకాదు. వృద్ధులయిన రాజు లభినందించుచుండగా నీకుఁ గాదనదగునా ? అనుటలో నీవు నభినందింపక తీరదన్నట్లే యున్నది. కాని, సంస్కృతమునందువలె "క్షన్తు మర్హసి" అన్నట్లు లేదు. దీని వలన ధర్మజుఁడు పైకి బతిమాలుచున్నట్లేయున్నను గొంత తీవ్రత కూడ చూపకపోలేదు.

కాని శిశుపాలుని వంటి వానికది చాలదు. అందువలన భీష్ముడే కలుగజేసికొనెను. ఇచట మరియొక యుపన్యాసము. శిశుపాలుఁడు ముందు పోవుచున్నాఁడు. ధర్మజుఁడు వెంబడి మాటాడుచున్నాఁడు. భీష్ముఁడు లేచి, ధర్మజుని వంకకుఁ దిరిగి పలుకుట ప్రారంభించెను. ఇందు ధర్మజు నుద్దేశించినదే యెక్కువ. అయినను శిశుపాలునితోఁ గాక ధర్మజునితోనే మాటాడుట వలన నా మాటలకు ఒక మహాత్వము సిద్ధించినది. భీష్ముఁడు కూడ ధర్మజుని వైపు తిరిగియున్నను వ్రేలితో శిశుపాలునిఁ జూపుచనే యున్నాఁడు. ఆ పద్యమిది—

"పాలిత దుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీనికేల భూ
పాలక నీకుఁ బట్టువడుపన్ మరి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె రాగ కోప పరిభూత మనస్కున కల్పరాజ్య ల
క్ష్మీ లలనాంధ బుద్ధి కనిమిత్త మహత్పరివాద శీలికిన్"

శిశుపాలునకు బాలునకు గల సామ్యము ననుప్రాసముతోఁ జక్కగాఁ దెలిపినాడు కవి. 'భూపాలక' అను శబ్దములో మొదటి యక్షరమును మొదటి పాదమున వేసి, మిగిలిన మూడక్షరములను రెండవపాదము లోనికిఁ దెచ్చుట వలన నొక దైర్ఘ్యము వచ్చినది. ఇది ధర్మజుని పెద్దతనమును సూచించును. "నీయంతటి వాఁడింత బాలు ననున యించుటయేమి? అనుటవలన ధర్మజునాధిక్యము, శిశుపాలు నల్పత్వము రెండును స్పష్టమగుచున్నవి.

"వీనికిం బోలునే" యనుట వలన భీష్ముఁడు శిశుపాలుని నిర్దే శించుచున్నాడనియే యనుకొనక తప్పదు. నన్నయభట్టు రంగ నిర్దేశమును (Stage Directior) వాచ్యముగాఁ జేయఁడు. చేయ కున్నను చేసినంత స్పష్టముగా నుండును. ఒక్కమారు కాదు- మూఁడు మారులు భీష్ముఁడు శిశుపాలుని వంక వ్రేలెత్తి చూపుచూ ధర్మజునితో ననినాఁడు. సభయంతయు నిదివరకే శిశుపాలుని వంకకుఁ దిరిగినది. శిశుపాలుఁడు రాగ పరిభూత మనస్కుఁడు; అల్పరాజ్యలక్ష్మీలలనాంధ బుద్ధి; మూఁడవది సందర్భమునకుఁ దగిన విశేషణము. అనిమిత్త మహత్పరివాదశీలి. ఈ విధముగా శిశుపాలుని స్వభావమును మూఁడు. ముక్కలలో విశ్లేషించి చూపినాఁడు, భీష్ముఁడు. ఇప్పడు శిశుపాలుని వంకకే తిరిగినాఁడు. అతఁడన్న మొదటి వాక్యమే యిది. "అవినయ బుద్ధివై హరికి నర్ఘ్యమయోగ్యము యంటి నీవు మూర్ఖవు శిశుపాల యింక బలుకన్ వలసెన్." నీవు మూర్ఖుఁడవు. అందువలననే అవినయ బుద్ధితో హరికర్ఘ్యము తగదంటివి. నీకుఁ జెప్పిననే గాని తెలియదు

అందువలననే పలుకవలసి వచ్చినదని భీష్ముఁడు మొదలు పెట్టెను. ఈ మాటలను బలుకుటను గూర్చి కాదు, ష్ముఁడు పలుకుచున్నది. తమ గొప్పతనమును దాము చెప్పుకొనఁదాదు. కాని "సభలోన నున్న యీ యవనిపులెల్ల నాతనియంబరిముక్తులు వానిచేత నాహవజితులుం దదీయశరణార్థులు" అను విషయమును జెప్పవలసినది. మూర్ఖుఁడైన శిశుపాలుఁడు దీనిని తెలిసికొనలేఁడు అందువలన జెప్పక తప్పినది కాదు. అదులకే "ఇంక బలుకన్ వలసెన్" అని భీష్ముఁడు తన వినయమును దెల్పుకొనియే, తప్పనిసరి యగుటవలన గొప్పతనమును జెప్పుకొనుచున్నట్లు పల్కినాఁడు. ఈ విధముగా గృష్ణుని సర్వ మాన్యత్వమును స్థాపించుచు భీష్ముఁ డుపన్యసించుచుండును.

సంస్కృత భారతమున భీష్ముఁడు కృష్ణుని మహత్త్వమును, దైవత్వమును నిరూపించుచు మధుకైటభ వధ, దశావతార వర్ణన, శ్రీకృష్ణ బలరాముల బాలలీలలు, నరకాసుర వధ, బాణాసుర విజయము మున్నగు కథలను విపులముగా వర్ణించును. దీనివలన భగవత్తత్త్వమును నిరూపించుట యగునో లేదోకాని, కథాతంతువు మాత్రము నిశ్చితముగా నుచ్ఛిన్నమగును. దాదాపేడువందలు శ్లోకములు గల భాగమును దొలగించి నన్నపార్యుఁడు కథను బ్రసన్నము గావించినాఁడు.

"ఏవ ముక్త్వా తతో భీష్మో, విరరామ మహాబలః
వ్యాజహా రోత్తరం తత్ర, సహదేవోఽర్థవ ద్వచః"

భీష్ముఁడు చెప్పఁదలఁచినదంతయు వరుసగాఁజెప్పి విశ్రాంతిని గొన్నపిమ్మట సహదేవుఁడర్థవంతమైన వచనమును బలికెనని సంస్కృతమునఁ గలదు. ఇక్కడ సన్నివేశమును బట్టి చలనము (Movement) అవసరము. అట్టియెడ భీష్ముఁడు తన యుపన్యాసమును ముగించిన పిమ్మట సహదేవుఁడు పలికె ననుటకంటె, భీష్ముఁడు పలుకుచుండగనే

సహదేవుఁ డందుకొనెననుట యాదముగా నుండును. భీష్ముని పనుపు వలన ధర్మరాజు కృష్ణుని కర్ఘ్యమిచ్చెను. ఆ యర్ఘ్యమును దెచ్చిన వాఁడు సహదేవుఁడు. కావునఁ దనకును గొంత బాధ్యత కలదు. ధర్మజుని మాటలు ప్రియపూర్వకములయిన సాంత్వనములు. అవి శిశుపాలుని మనసున కెక్కవు. అందువలననే భీష్ముఁడు ధర్మజుని వారించి, తానే శిశుపాలునికిఁ దెలుపఁ బూనుకొనినాఁడు. భీష్మునిలో దీవ్రత యున్నది. కాని, అది పెద్దతనముతోఁ గలిసి యొక క్రమములోసాగినది. ఇది కూడ శిశుపాలుని మనస్సున కెక్కదు. అందువలన సహదేవుఁడు క్రమము కాని వాదము కాని లేని ధోరణిలో సభలో నిల్చినాఁడు. వయస్సునఁ జిన్నవాఁడగుట వలన నాతొందరపాటతనిలో సహజము.

> "ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి; మిచ్చిన దీనికిం దొడం
> బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై
> నిడియెద నంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁ; డట్టిచో
> నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై"

సహదేవుని గురించి యీ సందర్భమునఁ గవి యేమియుఁ జెప్పకుండ సన్నివేశ మధ్యమున నాతని మాటలతోనే ప్రవేశపెట్టుట సభలోని సభ్యులకు వలెనే మనకు నొక వెరగుపాటును గల్పించును. అతని మాటలలో వాదము లన్నింటికి మించిన తీవ్రత, నిరంకుశత్వము నున్నవి. "దీనికిం దొడంబడమని" యన్నచోట నా యక్షర సమావేశము సహదేవుని మాటలలోని వేగమును, దడబాటును పట్టి యిచ్చును. "మస్తకంబుపై నిడియెద" నని వాక్యమును సమాప్తము గావించినాఁడు, సహదేవుఁడు. "ఇడుట" యేమిటో సహదేవుఁడు తన మాటలలోఁ దెల్పలేదు. మాటను దాటిన యుద్రేకము వచ్చి చేష్టా రూపమును దాల్చినది. చేష్టను నన్నయ "తాఁ జరణమెత్తె సభన్" అని తెల్పినాఁడు ఇచ్చట సన్నివేశమున కెంతయో బిగువు కల్గినది.

భీష్ముఁడు మాటాడుచున్నంతసేపు సభలో నక్కడక్కడ వారిలో వారు మాటాడుకొనుచున్నారు కాబోలు! కాని యా విషయ మవ్వా డట్లనిపించలేదు. సహదేవుని యుద్ధృతి చూచునప్పటికి "ఉడిగి సభా సదుల్ పలకకుండిరి తద్దయు భీతచిత్తులై" అనవలసి వచ్చినది. దేని నుడిగిరో చెప్పకుండనే నన్నయభట్టు సభాసదులు పలుక కుండిరని తెల్పినాఁడు. అంతకు ముందొక స్వరూపములేని శబ్దమున్నది. అంత కంటె నిశ్శబ్దతగల సమయము వచ్చినపుడే అంతకుముందు శబ్దమున్న దని గమనింతుము. ఈ యుడుగుట యట్టి శబ్దమునే.

ఉద్రేకము కల్గినవాఁడు మాటలు తక్కువ పల్కును. అంతే గాక కావ్యమున నన్వయము సరిపోయినదో, లేదో అతనికిఁబట్టదు. పైవాక్యమున నదే కన్పించును. సంస్కృత మూలమున సహదేవుఁడ న్నమాటలివి.

> "కేశవం కేశిహంతార, మప్రమేయ పరాక్రమమ్
> పూజ మానం మయాయోవః, కృష్ణం న సహతే నృపాః
> సర్వేషాం బలినాం మూర్ధ్ని, మయేదం నిహితం పదమ్
> ఏవముక్తే మయా సమ్య, గుత్తరం ప్రబ్రవీతు సః
> స ఏవ హి మయా వధ్యో. భవిష్యతి న సంశయః"

అని తెల్పి పూజనీయ వ్యక్తులను సహదేవుఁడు పూజించెనని యున్నది. మొదటిలోనే నన్నయ దీనిని మఱొక విధముగా మార్చుకొనుటవలనఁ బూజాప్రసక్తియే లేకపోయినది.

> తతోఽపతత్ పుష్పవృష్టిః, సహదేవస్య మూర్ధని
> అదృశ్య రూపా వాచశ్చా, ప్యబ్రువన్ సాధు సాధ్వితి"

దీనినంతటినీ నన్నయ భట్టారకుఁడొకటిన్నర పాదములలోని కనువ దించి, మిగిలిన రెండున్నర పాదములను దాను సొంతముగాఁబూ రించెను—

"చెలువుగఁ బుష్ప వృష్టి గురిసెన్ సహదేవుపయిన్ దివంబునన్
వెలయఁగ సాధువాదములు వించె"

ఇంతటితో ననువాదమైనది. ఈ సన్నివేశము సభ్యుల హృదయము లందెట్లు పని చేసెనో తెల్పుట యావశ్యకము. కాక, సభలోఁగలహ భోజనుఁడైన నారదుఁడున్నాఁడు. అతని కింతకంటె మంచియవకాశము లభింపదు. కావున నన్నయ—

"సభా సదు వెల్ల విస్మయా
కులిత మనస్కులైరి తనకుంచెయుఁగృష్ణమృగాజినంబునుం
బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁడాడె వేడుకన్".

అని పద్యమున మిగిలిన భాగమును బూర్తిచేసెను. ఈ యమూలక మైన యంశము వలన భవిష్యద్భారతరణమును జ్ఞప్తికిఁదెచ్చుచు న్నాఁడు నన్నయ. దీనివలన రాజసూయము, తత్సందర్భమున జరిగిన శిశుపాల వధ భారతకథయందు మిక్కిలి ప్రాధాన్యమును వహించు చున్నవి. భారతయుద్ధమునకు బీజమిప్పుడే పడినట్లు, నందువల్లనే కలహా శనుఁడైన నారదుఁడానందముతో నృత్యము చేసినట్లు విశదమగు చున్నది.

ఈ నారదుఁడు నృత్యము సేయుట మఱొకవిధముగాఁగథా గమనమునకుఁదోడ్పడినది. శిశుపాలుని సేనాపతి సునీథుఁడు రోషము నొంది పరుషవచనము లాడుచు స్వపక్షక్షత్రియులనెల్ల నొక్కచోటఁ జేర్చి శిశుపాలుని యనుమతితో యుద్ధమునకు సన్నద్ధుఁడగుట సాగిం చెను. దేవతలు సహదేవుని నభినందించుట కాక, సభలోనే యున్ననా రదుఁ డానందనృత్యముచేయుట సునీథున కురిసిన పుండుపై నుప్పువేయు టయైనది. దాని పరిణామమే సరత యుద్ధసన్నద్ధత.

ఇచ్చట సంస్కృతమున నొక యస్పష్టత యేర్పడినది. సునీథుఁ డును, శిశుపాలుఁడు నొక్కరో యిరువురో స్పష్టముగా లేదు. నన్నయ

దానిని బరిహరించి సునీథుఁడు శిశుపాలుని సేనాపతియని స్పష్టము గావించినాఁడు. సరి. శిశుపాలుని పక్షమున యుద్ధ ప్రయత్నము సాగి నది. ఇదంతయు వచన బద్ధము. పాండవుల పక్షమునను సైన్యసమీ కరణము సాగినది. ఇది పద్యబద్ధము. వచనముకంటెఁ బద్యమునకుఁ బ్రాముఖ్యమెక్కువ. మంచి యుద్ధృతిని జూపవలసి వచ్చినపుడు నన్న పార్యుఁడు చంపకమాల నుపయోగించును. ఇకడఁగూడ నట్లే చేసెను. ధర్మరాజు సకలక్షత్రియ క్షోభమును జూచి భయసంభ్రమాక్రాంత హృదయుఁడై నపుడు భీష్మునితో ననిన మాటలు 'తరలము'లోఁ జె ప్పెను. ఈ పద్యమతని మనఃస్థితికనువగు గమనము కలది.

ఒక్కొక్క రాజు నొక్కొక్క ప్రళయసాగరమువలెనై రి. వారి వలన డాఖమునకు విఘ్నముకాని, ప్రజలకపకారము కాని కలుగ కుండ వారికిఁ జిత్తశాంతి యొనర్ప వలయునని కోరెను. ఇందుఁ దన వారు, పెఱవారు నన్న దిలేకుండ నందఱికిని జిత్తశాంతి యొనర్పవలసి నదని యుధిష్ఠిరుని కోరిక. ఇది పితామహుఁడే చేయగలఁడు. పితామ హుఁడు సృష్టికర్తకదా! ఇచ్చట ననేక సాగరములను నన్నయ రూపించెను. వ్యాసభారతమున—

"అసౌ రోషాత్ ప్రచలితో, మహాన్ నృపతి సాగరః
అత్రయత్ ప్రతిపత్తవ్యం, తన్మే బ్రూహి పితామహ"

అని యున్నది. ఏమిచేయవలయునో చెప్పుమని ధర్మజుఁడు భీష్మున డుగును. కాని, నన్నయ చిత్తశాంతి యొనర్పుమనియే ధర్మజుఁడు పితామహుని గోరునట్లు చేసెను. మొదటినుండియుఁ బితామహుని యుధిష్ఠిరుఁడిచ్చిన గౌరవమే యట్టిది. పూజార్హునకుఁగావలసిన గుణ ములను, వానిని కలిగిన వ్యక్తినిగూడ శాంతవవుడే నిర్ణయించెను. కావున సంక్షోభమును వారించుట కూడ నతఁడే చేయవలయును. భీష్ముఁడు దానికిఁ జక్కని సమాధానము నిచ్చెను—

" నీయజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁడ
జేయ పరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్,,

ఈ పద్యమంతయు నన్నపార్యుని సృష్టి. దైత్యులను జయించిన వాఁడు, జ్ఞానమునకు నెలవైనవాఁడు, యజ్ఞపురుషుఁడు జయింపరాని పరాక్రమము గలవాఁడు. దైత్యాంశ వలన జన్మించిన వారు శిశుపాలాదులు. అట్టివారిని జయించుట శీలముగాఁ గలవాఁడు శ్రీకృష్ణుఁడు. మంచి చెడ్డలను, గర్తవ్యాకర్తవ్యములను గూర్చి విచక్షణ చేయఁ గలవాఁడు. కావునఁ గృష్ణుఁడేది తగునో అదే చేయును, గాని అన్యమాచరింపడు. యజ్ఞపురుషుఁడు కనుక యజ్ఞమునకు భంగము కలుగనీయఁడు. ఆ యుద్దేశముండవచ్చునుగాని సమర్థతయుండవలదా? అన్నచో నతఁడజేయ పరాక్రముఁడు. ఇవన్నియుఁ గావచ్చును. కాని యుధిష్ఠిరుని యాగమన్న నాతని కేల యాసక్తి యుండునన్నచో "చేకొని కావన్" అన్నది సమాధానము. తనకుఁదానుగాఁ గృష్ణుఁడే ఆబాధ్యతను స్వీకరించెను.

ఇందు సర్వశత్రురాజలోకము నలక్ష్యము చేసి భీష్ముఁడు మాటాడుచున్నాఁడు. ఇప్పుడు ప్రత్యక్షముగా రెండు వర్గములేర్పడిపోయినవి. మిత్రపక్షమును, శత్రుపక్షమును దేలిపోయినవి. ఎవరేని మనస్సును గష్ట పెట్టుకొందురను సంకోచములేదు. అందువలనఁ గృష్ణుని మహాత్మ్యమును మాత్రమే కాక రాజుల యల్పత్వమును గూడ భీష్ముఁడు చెప్పుచున్నాడు.

రాజులందఱును కుక్కల వంటివారు. హరి సింహము వంటివాఁడు. కుక్కలు పెక్కులనియు "ఇభకుంభదళనమహితప్రనిష్ఠురనఖముఖుఁడగు హరి మీఁద మొఱఁగియేమి" యుఁ జేయలేవు. కుక్కలు—పెక్కు—

లు—ఈ రెండింటికి వేసిన ప్రాస వలన ననురూపత్వము బాగుగా గోచరించుచున్నది. కుక్క లెన్నియైనను గుక్కలే కాని మఱివేరు కావు. ఇంకఁ గృష్ణునిఁ గూర్చి చెప్పినప్పుడు పెద్ద సంస్కృత సమాసమునే వేసినాఁడు. అదియును వర్గయుక్కులతో, సంయుక్తాక్షరములతోఁ గూడినది. దీనివలనఁగృష్ణుని తేజము తెల్లమగును. పైని చెప్పినదే చాలును. కాని అది యావేశముతోఁగూడి తీవ్రముగా నున్నది. దానికి స్పష్టతను గూర్చుటకో యనునట్లు మరల "కృష్ణు సింహపరాక్రమము నెఱుఁగకున్న వారె యెల్ల వారు" అనుచున్నాఁడు.

ఇవన్నియును శిశుపాలుని చెవులకు శూలములైనవి. అతనికి బాగుగాఁగోపము పెచ్చుమీఱినది. పెదవులు బిగఁ బట్టినాఁడు. "ఇమ్మది వెట్టి" అని మకార ద్విత్వము ప్రాసముగాఁ బద్యము నతని నోటఁ బలికించుట భావానుగుణచ్ఛందో భాషాయోజన సమర్థుఁడైన నన్నయకుఁ దగినది.

శిశుపాలుఁడు "నీ యట్టి దురాత్ములుం గలరె యంత యధీరులె ధారుణీపతుల్" అని భీష్ముని నిందించుటయు, రాజులను ప్రోత్సహించుటయు నొకే వాక్యములోఁ గలిపివచ్చునట్లు చేసెను. శిశుపాలుఁడు రాజకీయతంత్రము నెఱిఁగి క్లిష్టమైన బుద్ధి నలవరచుకొన్నవాఁడు— అతఁడేమి పలికినను గొందఱ సౌముఖ్యమును గూడ సంపాదించుకో వలయునని యెంచుట సర్వత్ర కాననగును. మూలమున శిశుపాలుని సభామర్యాదకు భిన్నముగా నున్నవి—

"యుక్తమేతత్ తృతీయాం, ప్రకృతౌ వర్తతా త్వయా"

అని భీష్ముని నిందించును. తృతీయా ప్రకృతి యనఁగా నపుంసకుఁడని యర్థము. శిశుపాలుఁడు తన దూషణను ప్రారంభమునందు మాత్రమే కాక చివరఁగూడ నెందులకైన మంచిదన్నట్లు —

"క్లీబోఽహి ధర్మోఽస్తి తే భీష్మ, బ్రహ్మచర్య మిదం వృథా
యద్ధారయసి మోహాద్వా, క్లీబత్వా ద్వాన సంశయః"

అని కలిపినాఁడు.

నన్నయ దృష్టిలో శిశుపాలుఁడింత యధముఁడు కాఁడు; అంతే కాదు- ఈ ఘట్టమున శిశుపాలునిలో ద్వైవిధ్యము కనుపట్టును. కృష్ణుని భగ్యంతరమునఁ బొగడును. శాపావసాన సమయము సమీపించుచున్నది. అందువలననే శిశుపాలునిలో నిదివఱకులేని జ్ఞానము భాసించియు భాసింపక భాసించును. ఇదంతయు నన్నయ వాచ్యము చేయలేదు. శిశుపాలుని మాటలను బట్టియే మనకది యర్థమగును –

"నీ నాలుక యొక్కఁడయ్యు
వ్రయ్యవలయు నూఱు వ్రయ్యల గాఁగ న
ట్లయినఁగాని చాల వతనిఁ బొగడ
నెల్ల దాని నేన యెఱుఁగుదు నెందు వాఁ
డర్ఘ్య దానయోగ్యుఁ డయ్యెఁ జెపుమ!"

భీష్ముని కొకే నాలుక యున్నది. కృష్ణుని పరాక్రమముల నెన్న వలయునన్న నొక నాలుక చాలదు. కావున నొక్క నాలుక వంద నాలుకలయినఁ గాని అతనిని బొగడుట సాధ్యముకాదు. పొగడుటకు భీష్ముఁడెఱిఁగినది చాల స్వల్పమని కూడ శిశుపాలుని భావము. అందు వల్లనే "ఎల్లదాని నేన యెఱుఁగుదు"ననుట. శిశుపాలునిలో నీవిధముగ నొక యున్నతిని దీసికొని వచ్చినాఁడు నన్నయ. "నపుంసకుఁడు" అను భావమును మార్చి "నీ యందనపత్యతయను నధర్మమున్నది" అని భీష్ముని నిందించినట్లు వ్రాసెను. అధర్మపరులకు మాత్రమే సంతతి కలుగదు; సంతతి కలుగకుండుట కూఁ బాపమే యను నీతిని బట్టి శిశుపాలుఁడు బ్రహ్మచారియైన భీష్మునకు ననపత్యత్వ దోష మారోపించినట్లు నన్నయ సవరణ. దీనివలన శిశుపాలుని మూర్ఖత్వ

మును బాగుగా బట్టియిచ్చి నట్లయినది. కొంతసేపు శిశుపాలుఁడు భీష్ముని మరల నిందించును. కృష్ణునిఁగూర్చి "నా యెఱుఁగని యదియె జనార్దను బలంబు నత్యున్నతియున్" అనును. అంతకుముందుఁ జెప్పిన "ఎల్లదాని నేన ఎఱుఁగుదు" నను నప్పటి జ్ఞానమే శిశుపాలునికి మరల భాసించినది. అందువలననే బార్హద్రథిని మాఱ్కొనఁజేక "ముకుందుఁడు" అనఁగా ముక్తినొసఁగు వాఁడని యర్థము. కృష్ణుఁడు జరాసంధునితో యుద్ధముచేసి పాఱిపోయెను. కాక, యేమిచేయవల యును. శాపావసానమునకు సమయము రావలయును గదా! రాలేదు కనుకనే పాఱిపోయెను. జరాసంధుఁడు పరమబ్రహ్మణ్యుఁడు. కృష్ణుఁడు బ్రాహ్మణ వేషమున భీమార్జునులఁ దోడుచేసికొని వధియించెను. ఇదియు స్తుతియే. బ్రాహ్మణ్యుఁడైనవానికి బ్రాహ్మణేతరునిచేతఁగాక బ్రాహ్మణుని చేతిలోనే చచ్చుట యొక యోజట. కృష్ణుఁడట్లు జరా సంధునికిఁ దృప్తి ఘటించెనని శిశుపాలుని భావము. రెండాట వెలదులు గలవు. ఈ రెండిటియందు నొకరకమైన క్రమము పాటింపఁబడినది —

"బూతు వొగడినట్లు వొగడెను పొగడంగ
వలయునేని సుగుణవంతులయిన
కర్ణశల్యులాదిగాఁగల వీరులఁ
బొగడు చుండరాదె ప్రొద్దువోక"

కృష్ణునిఁ బొగడుటయేల? నీకంత పొగడవలయుననియే యున్నఁ గర్ణుఁడు, శల్యుఁడు మున్నగు వీరులను బొగడుము. అని చెప్పెను. దీని వలన శిశుపాలునికి వారన్న నిష్టము గావున నట్లనె యనిపించును. కాని అతని భావమది కానేకాదు. తరువాతి పద్యమునఁగాని అది తెలియదు —

"అన్యకీర్తనంబు నన్వనింపయుఁదన్నుఁ
బరగఁ బొగడి కోలుఁ బ్రబ్బికోలు

నాపగా తనూజ యార్యవృత్తములుగా
వనిరి వీని నాద్యులయిన మునులు"

అని యనుటచేఁ బొగడ ట యతనికి సమ్మతము కాదని తేలినది. మఱి, కర్ణశల్యాదుల నేల పొగడు మనుట? వారు పొగడ్తల నాశించువారు. కావున వారినిఁ బొగడినఁ బ్రయోజనమైన నుండును, కృష్ణుఁడు పొగడ్తలను గోరఁడు.

ఇతఁడు శిశుపాలునిలో రెండు స్వభావముల నుంచి మాటాడించి నాఁడు. సభలో నెల్లరుఁ దిట్టుచున్నాఁడనియే తలంచిరి. అట్లు దలఁప వలయుననియే శిశుపాలుని భావము. లేనియెడల శాపము ముగియదు. ఈ విషయమును దెలుపుటకే యింకను నవకాశమిచ్చి నన్నయ తన మాటలుగా "అని రూక్షాక్షర వచనంబుల నాక్షేపించు" అను చున్నాఁడు. రూక్షాక్షరములో. రూక్షవచనములో అన్నఁజాలునే! రూక్షాక్షర వచనములని చెప్పుటయేల? ఇచట వచనములు రూక్షములు కానేకావు. అక్షరములు మాత్రమే రూక్షములు. అట్టి యక్షరములతోఁ గూడిన వచనములనే శిశుపాలుఁడు పలికెను. కావున వినుటకుఁ దీవ్రముగా నున్నను భావము తీవ్రము కాదని తెలుపుటకే నన్నయ యీ సమాసమును వాడెను.

శిశుపాలుని యౌద్ధత్యము భీమునికిఁ గోపముఁ జెప్పించినది. అతఁడు రౌద్రాకారమును ధరించెను —

"ప్రకటిత కోపవేగమునఁ బద్మదళాయత నేత్రముల్ భయా
నక తరలీలఁదాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁ బొల్చెఁద్రికూట తటి త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతక మూర్తికచ్చటన్."

"ఇట్లు నిఖిల క్షత్రియ త్రాస జననంబుగా నలిగి దంత సందష్టదారుణ ముఖుండై శిశుపాల నిర్మూలనాభీల సంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముండిట్లని చెప్పె" —

పై పద్యవచనములందున్న యక్షర సమావేశము భీముని స్వరూపమును దెల్పును. పరుషాక్షరములు, సంయుక్తాక్షరములును గలవు. కాని సుదీర్ఘ సమాసములు లేవు. లేకపోవుటకు గారణము - భీముడు కోపావేశమున నొడలు మఱచిపోలేదు; ఊగులాడుటలేదు. భీష్ముఁడు వారించినంత నాగిపోయెను. ఈతని స్వరూపము నింకొక పది పద్యములు దాఁటిన తరువాత భీష్మునిచేత నన్నయ యనిపించును. భీముఁడు "గంభీర పరాక్రముఁడు." అట్టివానికి సుదీర్ఘ సమాసముల యోజనము నిష్ప్రయోజనము.

ఈ పద్య వచనములందలి భావములను, గొంతవఱకుఁ బదములను గూఁడ గ్రహించి తిక్కన విరాటపర్వమున నొక పద్యమును వ్రాసెను. అదియుఁ జంపకమాలయే. విరటుని సభయందు సైరంధ్రి కీచకునిచేఁ బడిన పాటును జూచిన భీముని వర్ణన. మొదటి రెండుపాదములను జిన్నమాటలతోఁ జెప్పి చివరి రెండు పాదములందు నొకటే సుదీర్ఘ సమాసము వేసినాఁడు కవిబ్రహ్మ.

భీష్ముఁడు భీమునికి శిశుపాల జన్మవృత్తాంతమును దెల్పి కృష్ణుని చేత మాత్రమే శిశుపాలుఁడు నిహతుఁడగునని వెల్లడించెను. అట్లుకాని యెడలఁ దాను బ్రదుకనిచ్చువాఁడును గానని కూడఁ దెల్పుచు "మదీయ చాప నిర్గత చటులోగ్ర మార్గణ నికాయ పయోధి మునుంగక" అన్యులు తప్పించుకొని పోలేరనెను.

భీష్ముఁడు పలుకుచునే యున్నాఁడు. శిశుపాలుఁడు భీష్మ భీములను దాటి జనార్దనున కభిముఖుఁడైనాఁడు. ఇంతవఱకు ధర్మజునితో భీష్మునితో మాటలాడెనేకాని కృష్ణునితో మాటాడలేదు. ఇప్పుడు కృష్ణుని కభిముఖుఁడై నిల్చి మాటాడుచున్నాఁడు. నన్నయ కృష్ణునకు విశేషణము "జనార్దనుఁడు" అని వాడెను. ఇది యెంతో యభిప్రాయముతో వేసినది. జన్మము నర్దించువాఁడు - అనగాఁ బూర్వజన్మ రాహిత్యమును గలగఁజేయువాఁడని యర్థము. జరాసంధునితోఁ బోరిన

వాఁడు ముకుందుఁడు. ఇప్పుడు శిశుపాలుఁడు జనార్దనుని కెదురుగానిలఁ బడినాఁడు. అంతేకాదు. పాండవులతో, భీష్మునితో బాటుగాఁ గృష్ణుని యుద్ధమునకుఁ బిలుచుచున్నాఁడు. కృష్ణుఁడిప్పుడు చక్రధరుఁడు. ఈ తరువాత నతనికిఁ జక్రముతోఁబని గలుగునని తెల్పుటకే నన్నయ "చక్రధరుఁడు" అను విశేషణమును వాడినాఁడు. లేనియెడల మూలమునందు వలెనే కృష్ణుఁడు చక్రమును దలంచుకొనెననియు నది చేతిలోనికి వచ్చినదనియుఁ జెప్పవలసి వచ్చెడిది. ఇంతయేల, ఒక్క విశేషణముతో నది యంతయు సుందర ఘటితమైనది.

ఇంత వరకును గృష్ణుఁడు సాక్షి. ఇపుడు మాత్రమే అతఁడు మాటలాడుట కుపక్రమించెను. అదియు శిశుపాలునితోఁగాదు— రాజచక్రముతో. శిశుపాలుని దోషములను. దానపరాధ శతమును సైచుటయుఁ దెల్పెను. సభలోఁగూడ నిర్నిమిత్తముగా విరోధముఁ బూని అత్యంత శత్రుఁడయ్యెనని తెల్పుచుండగా శిశుపాలుఁడు మరలఁ గృష్ణుని ధిక్కరించుచుఁ బలికెను. అపుడు—

> "అసల శిఖాలి దూల దనుజాంతక చక్రము రాజచక్ర మె
> ల్లను భయమంద మూర్ఖ వికలంబుగ నప్పుడు సేసెఁ జేదినం
> దను తనువున్ బృహద్రుధిర ధారలు బోరనమిాఁది
> కొల్కఁగాన్"

అతని పృథుదేహము వెల్వడు తేజము పరమేశ్వరు దేహముఁజొచ్చినది. విస్మయోత్ఫుల్ల విశాల నేత్రులయి భూపతులెల్లరు జూచుచుండిరి. ఇది మహాత్సంభవము! చక్రమెచ్చటి నుండి వచ్చెనో చెప్పలేదు నన్నయ. దనుజాంతక చక్రము – దనుజుల నంతముచేయు చక్రము; దనుజాంతకుని చక్రము. అర్ఘ్యసమయమునఁగూడ కృష్ణునితోడనే యుండి యుండునా? ఉన్నదనియే యనుకొనవలయును. దానిని తెలుపుటకే యీ సన్నివేశమునకుఁ బూర్వము "చక్రధరుఁడు" అను విశేషణము వాడుట.

"జయ జయ నినాదమున న
వ్యయ నంబుజనాభ భువన వంద్యో నుపేంద్రుం
బ్రియమునఁ బొగడు బొగడు జనంబుల
దయిన మహాధ్వనియుఁ జెలఁగె నతితుములంబై"

మాటలను జాలఁదక్కువగా వెచ్చించుకొను నన్నయభట్టు నాలుగు విశేషణముల నొక్క మాఱుగా వాడినాడు. ఇక్కడ ఒక సొగసున్నది ధ్వనితముగా నున్నది. పొగడు జనులందరు సన్ని గొంతులతో జయనినాదము చేయుచున్నారు. కాని కృష్ణునిలో నొక్కొక్క యంశ మొక్కొక్కనికి నచ్చినది. అందువలన వారా యా యంశములను బేర్కొని జయజయనాద మొనరించుచున్నారు. అవ్యయా! జయ! అంబుజనాభా! జయ! భువనవంద్యా! జయ! ఉపేంద్రా! జయ!— ఇవి అక్కడ జేసిన నినాదములఁట! నిర్వాహణమున నద్భుతము వెల్లి విరిసినది. నాటకీయ రచనమున నిది పరాకోటి నందుచున్నది.

ఈ విధముగా మొదటినుండి చివరివరకుఁ జలత్ సౌందర్య సంపన్నముగాఁ గథను నడిపించినాఁడు నన్నయ. మూలములో నున్న యత్యుక్తులనుమాని, సహజములు, సరళములు, స్వాభావసిద్ధములు నయిన వర్ణనలతోఁ గావ్యమునకుఁ బుష్టిని గూర్చినాఁడు. అలంకార యోజన లేకపోలేదు. కాని, యున్నట్లే యనిపించలేదు. అంతటి ప్రయత్న గోపన మతనిది. తన కావ్యమెల్లను నాటకమువలెనే నడచినది. పాత్రలు వచ్చి తమ సంభాషణలను దామె చెప్పుకొనెను. అవి కూడ సంగ్రహములై, స్వభావ సుందరములై కథాగమనమునకుఁ దోడ్పడెనేకాని వానిత్రోవ నవిపోలేదు. ఒక సన్నివేశమునుండి మరి యొక సన్నివేశమునకు మారునపుడు రంగురంగుల కాంతుల కదలిక వలె నన్నయ యాకర్షించి, క్రొత్త సన్నివేశమునఁ బాఠకుల చిత్తమును హత్తించును. ఇట్లు సర్వతోముఖమైన సౌందర్యమును సంపాదించుకొన్నది ఆంధ్రమహాభారతము నందలి శిశుపాలవధ.

— * —

# "శ్రీవాణీగిరిజాశ్చిరాయ"

విశ్వనాథ సత్యనారాయణ

'శ్రీ వాణీ గిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖా ఙ్గేషు యే
లోకానాం స్థితి మారవహంత్యవిహతాం స్త్రీపుంసయోగో
ద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురైః
భూయాసుః పురుషోత్త మాంబుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే!'

నన్నయ ఆంధ్రభారతము వ్రాయబోతూ మొదట సంస్కృతశ్లోకం వెయ్యడం ఎందు కని పూర్వము ఒకరు చమత్కారముగా వ్రాశారు. ఆంధ్రానికి సంస్కృతం తల్లి. భారతీయుల సర్వ మంత్రాలకూ సంస్కృతము వాక్ఛక్తి. సంస్కృతమైన ఋషి వాక్కు అటువంటి సంస్కృతంలోనే వెలువడుతుంది. నన్నయ ఋషి. 'అవిరళ జపహోమతత్పరుడు, నిత్యసత్యవచనుడు.'

ఈ నిత్యకర్మానుష్ఠానమూ 'ఈ నిత్య సత్యవచనత్వమూ నన్నయకుఋషిత్వము తెచ్చినవి. ఋషిలో బహుగుణాలు భాసిస్తవి. ఆయన మాటను అర్థము అనుసరించడము అందులో ఒకటి దీన్నే. భవభూతి 'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి' అన్నాడు. ఆ అర్థాన్ని ఋషి భావించవలసిన పనిలేదు. వాల్మీకినోట బయలుదేరిన 'మానిషాద'లో రామాయణార్థము మొట్టమొదట ఉద్దిష్టం కాదు. అలాగే ఈ చెప్పబోయే 'శ్రీవాణీ గిరిజా శ్చిరాయ'లో అర్థము కూడా నన్నయ ఉద్దేశము కాకపోవచ్చు, కాని అలా జరగడం ఆశ్చర్య కరమూ, ఆయనకు ఋషిత్వసిద్ధి దాయకమూ !

'పురుషోత్త మాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే భూయాసు.' పూర్వసంస్కృతకవులంతా కావ్యాదిలో మంగళాచరణముతో త్రిమూర్తులను పేర్కొ-లేదు. నన్నయ్యేదీనికి మొదలు. పురుషోత్తముడు నారాయణుడు; అంబుజభవుడు బ్రహ్మ; శ్రీకంధరుడు పరమేశ్వరుడు. నన్నయ నారాయణ శబ్దభవము, తిక్కన కవిబ్రహ్మ, ఎఱ్ఱాప్రెగ్గడ ప్రబంధ పరమేశ్వరుడు. వీరు ముగ్గురూ శ్రేయస్సుకోసం-ఆంధ్ర భాషాశ్రేయస్సు కోసము-అగుదురు గాక ! వీరు వరసగా శ్రీవాణీ గిరిజలను వక్షోముఖాంగాలలో 'చిరాయ దధతః' చిరకాలము ధరించే వారట. ఈ చిరాయ శబ్దబలంచేత తెనుగుభారతము పూర్తి అయ్యే సరికి రెండువందల యేళ్ళుపట్టింది !

శ్రీ అంటే ముక్తి. నన్నయ గీతాశాస్త్రములో కనిపించే పరదైవము, నారాయణునివలె సర్వశక్తిమంతుడై, అపేత వాఙ్మయ దశ నుంచి ఆంధ్రానికిముక్తి కలిగించి, స్థితికి తెచ్చినాడు. స్థితి కలిగిన దాన్ని తిక్కన సృష్టి చేసినాడు. సృష్టిఅయిన తర్వాత స్థితి కలుగుతుంది అనుకోరాదు; స్థితి కలదానికే సృష్టి. ఆసృష్టికి, ఆ ప్రపంచానికీ వాణి అవసరము. ఆ వాణిని-అంటే,బహుళమైన తెనుగు శబ్దజాలాన్ని తిక్కన స్వీకరించి సృష్టి చేసినాడు. 'గిరిజా' గీః అనేకశబ్దానికి సప్తమితో అలుక్ సమాసము. వాక్కులో పుట్టింది అని అర్థము. ఈ వాక్కు ఏవాక్కు? నన్నయ తిక్కనల ఇద్దరివాక్కు. వారిద్దరినీ సమృద్ధిగా సర్వాంకషంగా అనుకరించిన దొర ఎఱ్ఱన.

వీరు ముగ్గురూ శ్రీవాణీ గిరిజలను వక్షోముఖాంగాలలో ధరించారు. వక్షము గౌణార్థంలో హృదయమై, నన్నయ ఆయుస్సు పోసిన వాడు అవుతున్నాడు. ముఖానఅంటే ఒక పర్వప్రారంభంలో, విరాట పర్వాదిలో ధరిస్తున్నాడు, తిక్కన. అంగములో అంటే అవయవంలో, ఒక భాగంలో ఆరణ్యపర్వభాగంలో, ఎఱ్ఱన ధరిస్తున్నాడు. ఈ మహా

ర్థము నన్నయవాక్యములో పుట్టి ఫలించడమువల్ల నన్నయ ఋషి త్వాన్ని సూచిస్తున్నది.

'వక్షోముఖాగ్రేషు' అనేచోట అవయవద్వంద్వానికి బహువచ నము ఉంచడము దోషం అనుకోవచ్చు. ఇక్కడి భిన్నావయవములు ఏకపురుషావయవాలు కావు. సమాసాంత విధులకు అనిత్యత్వము ఉన్నది. అంతేకాకుండా, అనుద్దిష్టమైన భావికాలంలో పరిణామ మాత్ర ప్రతిఫలితార్థాన్ని స్ఫురింపజేసే శ్లేషపర్యవసానము కోసము ఋషివాక్యములోనుంచి బహువచనము బయలుదేరింది. నన్నయ ఋషిత్వానికి ఇది ప్రథమ నిదర్శనము.

—

# సూక్తినిధి నన్నయ

## ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

భారతాంధ్రీకరణకు పూనుకొన్న నన్నపార్యుడు తన కవిత్వానికి మూడు ప్రధాన లక్షణాలను చెప్పుకున్నాడు. ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థ సూక్తి నిధిత్వమూను. వీటిలో మొదటివి రెండూ కవితా గుణాలు కాగా, మూడవది సాక్షాత్తూ నన్నయకే విశేషణంగా ఆ పద్యంలో కనబడుతోంది. (సారమతిం గవీంద్రులు...) అయితే కవికీ కావ్యానికీ అభేదాధ్యవసాయంతో ఈ మూడింటినీ భట్టారకుని కవితాగుణాలుగానే విమర్శకులు అందరూ పరిగణించారు.

వీటిలో ప్రసన్న కథా కలితార్థ యుక్తి కవితార్థయుక్తి అనేపాఠభేదాలతో కొంత విమర్శ జరిగింది. విశ్వనాథ వారు కవితా గుణాన్ని ఆవిష్కరిస్తూ ఒక పుస్తకమే రాశారు. రెండవదయిన అక్షర రమ్యత మీద ఒక సిద్ధాంత గ్రంథం వెలువడింది.

కాగా సూక్తి నిధిత్వాన్ని గురించి ప్రస్తావించిన వారందరూ సూక్తి అంటే ఉపదేశాత్మకమయిన మంచి మాట, సుభాషితము లేక నీతి వాక్యము అనే రూఢితోనే వ్యవహరించారు. 'క్రోధిగాం దపస్వికిఁజన్నె, గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్'- ఇలాంటి నానావిధాలయిన, రుచిరార్థ బోధకాలయిన నీతివాక్యాలు నన్నయ రచనలో కోకొల్లలు కాబట్టి అతడు 'నానారుచిరార్థ సూక్తినిధి' అని నిరూపణం చేస్తూ వచ్చారు. సూక్తి ముక్తావళి, సూక్తి సుధాకరం మొదలయిన చోట్ల ఉన్న సూక్తి పదానికీ, ఈ సూక్తినిధిలోని సూక్తి పదానికీ తేడా లేదనే పరిభావన.

సూక్తి-అలంకారము :

శోభనాచ సా ఉక్తిశ్చ సూక్తిః అనేది దీని వ్యుత్పత్తి. శోభనత్వము అంటే సౌందర్యం. ఉక్తికిసంబంధించిన సౌందర్యం రెండురకాలుగ ఉంటుంది. అంతరము, బహిరము అర్థసౌందర్యం అంతరము కాగా, వర్ణనలేక అక్షర సౌందర్యం బహిరము. ఇటువంటి సౌందర్యంతో కూడిన ఉక్తులను మాత్రమే సూక్తులు అనాలి. సౌందర్యమలంకారః అన్నారు కాబట్టి సూక్తి అనే మాట అలంకార పర్యాయం అవుతోంది. అప్పుడు నన్నయ భట్టారకుడు నానారుచిర-అర్థాలంనిధి అవుతున్నాడు. బహిరమయిన శబ్దసౌందర్యాన్ని అక్షర రమ్యతగా స్పష్టం చెయ్యడం జరగనే జరిగింది. కాబట్టి ఇక్కడ అర్థాలంకార సౌందర్యమే గ్రాహ్యం.

'నా నేర్చు విధంబున నిక్కావ్యంబురచించెద' అంటూ ఇతిహాసానికి కావ్యత్వాన్ని సంభావించిన నన్నయభట్టు నానారుచిరార్థ సూక్తినిధి అనే దళాన్ని తనకి విశేషణంగా చెప్పుకోవడంలో దీనికొక ప్రత్యేక ప్రాధాన్యన్ని అపేక్షించి ఉండవచ్చు. అది తన అర్హతనూ అధికారాన్నీ చాటుకోవడమే కావచ్చు.

కథా కలితార్థయుక్తి :

ఉపదేశంతోకూడిన రసానందమే కావ్యకథాప్రయోజనం కాబట్టి ప్రసన్న కథాకలితార్థయుక్తిఅనేది రస ప్రస్థానానికి పర్యాయం అవుతోంది. శృంగారాది రసాలు పాత్రల ద్వారా కథాశ్రితాలు. పాత్ర చిత్రణ, రసపోషణ ఇత్యాదులన్నీ కథా కథనంతో ముడిపడే ఉంటాయి. ఈరకంగా ఇది చాలా విస్తృతార్థం కలిగిన విశేషణం. ఈ విస్తృతిని విశ్వనాథ వారు ఒక భంగి స్పష్టపరిచారు. కథాకలితార్థ 'యుక్తి' అని యుజ్ ధాతువు నుండి ఏర్పడిన క్తిన్నంత రూపాన్ని ప్రయోగించడం కూడా ఒక విశిష్టత ఉంది. 'విభావాను భావవ్యభిచారి

సంయోగాత్ రసనిష్పత్తిః' అనే భరత సూత్రానికి ఇది జ్ఞాపిక కావచ్చు.

ప్రసన్న మయిన కథ(ల)యందు కలిత మయిన అర్థము అంటే అది తప్పనిసరిగా రసమే. అదే కావ్య పరమార్థం. ఉద్దిష్టమయిన ఉపదేశాన్ని మనఃఫలకాలపై గాఢంగా ముద్రించే శక్తి దానికే ఉంది. కావ్యానికి ఉత్తమత్వాన్ని సంపాదించిపెట్టేదీ అదే. అది విభావ-అనుభావ-సంచారి భావాల సమ్మిళిత స్వరూపం.

"విభానుభావ వ్యభిచారిణా మేకస్యతు రసాంతర సాధారణతయా నితర రస వ్యం జకతానుపపత్తేః సూత్రేమిళితానాముపాదానమ్. ఏవంచ ప్రామాణికే మిళితానాం వ్యంజకత్వే, యత్రక్వచిదేకస్మాదేవా సాధారణాత్ రసోద్భోధః తత్రి ఇతర ద్వయ మాక్షేపమ్, అతో నానైకాంతి కత్వమ్"

(రసగంగాధర. ప్రథమ–131)

ఈ సమ్మిళిత స్వరూపము యొక్క యుక్తి-ప్రసన్న కథా కలితార్థ యుక్తి. అటుపైన దీనిని కవీంద్రులు సారమతితో 'లోనారసి' మేలు అనాలి అని కోరుకున్నాడు. భావించి అనే మాటకు 'లోనారసి' అనేది అచ్చమయిన తెనుగుసేత. అంటే 'సమ్యక్ యోగాత్ భావకత్వవ్యాపారేణ భావనాత్' అనే భట్టనాయక మతానికి ప్రతిఫలంగా దీనిని మనం పరిగణించవచ్చు.

నన్నయ భట్టారకుడు ఏయే ఘట్టాలనూ, ఏయే ఉపాఖ్యానాలనూ రసోల్బణంగా ప్రత్యేక కావ్యాలుగా రూపొందించి జీవంపోశాడో తులనాత్మకంగా చూసి తేలికగా గుర్తించవచ్చు. ఇతడు సంతరించిన మూడు పర్వాలనూ 'మూడు కృతులుగా' తిక్కయజ్వ సంభావించడంలోని ఆంతర్యం ఇదికాకపోదు. ఇతిహాసాన్ని కావ్య మార్గానికి తెచ్చిన

ఈ రసాభ్యుచితరీతిని ఎడమియ్యకుండా అందిపుచ్చుకొని నడిపించిన మహితాత్ముడు ఈ తిక్కన. ఒక్క మాటలో చెప్పాలంటే కవిత్రయం వారి చేతి వారంలో భారతం వడకట్టబడింది.

ఆంధ్ర మహాభారతానికి లభిస్తున్న ప్రతులలో చాలావాటిలో కనిపిస్తున్నదనీ కన్నడ భారతానికీ అనుకూలంగా ఉన్నదనీ, 'కలితార్థ యుక్తి' అనే పాఠాన్ని సంశోధితము ముద్రణం వారు ప్రామాణికంగా స్వీకరించారు. దీనిని ప్రసన్న కథార్థయుక్తి అని శ్రీహనుమదింద్రగంటి రెండుగా విభాగించారు. ఈ విరుపులో తొలిగణుపులో రసస్ఫూర్తి లేకపోలేదు, (సారమతి నన్నయ).

కాబట్టి ప్రసన్న కథా కలితార్థ యుక్తి అనే దళం రసప్రస్థానానికీ, అక్షరరమ్యత అనేది శైలీరామణీయానికీ ప్రతినిధులుకాగా, సూక్తినిధి అనేమాట అలంకార ప్రస్థానానికి ప్రాతినిధ్యం వహిస్తోంది. ఇలా ఆనాటికి కావ్యశాస్త్రంలో ప్రాచుర్యం పొందిన ప్రస్థాన త్రయాన్ని నన్నపార్యుడు తన కవితా గుణాలుగా కవిత్వ ధోరణిలోనే ప్రకటించాడు.

రాజశేఖర సూక్తి :

ఈ సూక్తి పదాన్ని పైని పేర్కొన్న విశేషార్థంలో రాజశేఖరుడు తన విద్ధసాలభంజికా ప్రస్తావనలో ప్రయోగించాడు.

పాతుం శ్రోత్ర రసాయనం, రచయితుం వాచస్సతాం సమ్మతాః,
వ్యుత్పత్తిం పరమామనాప్తు, మవధిం లబ్ధుం రసస్రోతసః!
భోక్తుం స్వాదుఫలంచ జీవిత తరో ర్యద్యస్తితే కౌతుకం
తద్ భ్రాతః ! శృణు రాజశేఖర కవేః సూక్తీః సుధాస్యందినీః ॥

సుభాషితము లేక నీతి వాక్యము అనే అర్థంలో ఇతడు సూక్తిపదాన్ని ప్రయోగించలేదు. "వాచః సతాం సమ్మతాః" అనే మాటలతో ఆ

అర్థాన్ని ప్రథమ పాదంలోనే ముగించాడు. కాబట్టి సూక్తిః అంటే 'సుందరోక్తులను' అనే గ్రహించాలి. సుధాస్యందినీః అనే విశేషణం కూడా దీన్నే బలపరుస్తోంది. పాతుం శ్రోత్ర రసాయనంఅనేమాటలతో శబ్దసౌందర్యం సంగ్రహింపబడుతోంది. కాబట్టి యిక్కడ అంతర మయిన అర్థ సౌందర్యం పరామృష్టమై ఈ సూక్తి పదం సుధాస్యందినీ అనే విశేషణ బలంతో అర్థలంకార లేక ఉక్తిచమత్కార పర్యాయం అవుతోంది.

రామకృష్ణ సూక్తిః:

నన్నయగారి 'సూక్తినిధి' అనే ఈ సమాసం మళ్ళీ పాండురంగ మాహాత్మ్యంలో కనబడుతోంది.

"నను రామకృష్ణ కవిఁగవి
జన సహకారావళీ వసంతోత్సవ సూ
క్తినిధిఁ బిలిపించి యర్థా
సనమునఁ గూర్చుండఁ బనిచి చతురతినవియెన్" (1-22)

కవి జనులు అనే మామిడి తోపునకు వసంతోత్సవ ప్రాయాల యిన సూక్తులకు నిధి అనికదా అర్థం. ఇక్కడ సూక్తులంటే ఉపదేశా త్మకాలయిన నీతి వాక్యాలే, అయిన పక్షంలో అవి అసామాన్యాల యిన కవిజనులకు వసంతోత్సవాలు కాగాలవా ? కావు, కాలేవు. రస నిష్యందులయిన కావ్యాలలో ఉపదేశాలను గవేషించేవారు కవీశులు కాదు. కాబట్టి సూక్తి అంటే సుందరోక్తి అనే ఇక్కడ రామకృష్ణుని భావన. కాగా 'నానా రుచిరార్థ' అనే పద సంపుటిని ప్రాబంధిక శైలిలో మరింత కవితామయంగా ఈ పద్యాన రామ కృష్ణుడు పలికాడు.

సూక్తి సూక్తమ్ :

సూక్తి అన్నమాట ఈనాడు ఇంచుమించు నీతి వాక్యం అనే

అర్థంలో స్థిరపడిపోయింది. త్రికాలాబాధ్యమయిన ఒక సత్యాన్ని చెప్పి లేక ఒక ప్రబోధాన్ని అందించి ఉక్తికి శాశ్వతత్వాన్ని సంతరించడం కూడా ఒక విధంగా శోభనత్వమే. ఈ మార్గాన సూక్తి పదం యోగ రూఢం అవ్వాలి. అయితే శబ్దకల్ప ద్రుమంలోకిగాని, ఆప్టేలోకిగానీ, సూర్యరాయాంధ్ర నిఘంటువులోకిగాని సూక్తిపదం ఎక్కకపోవడం గుర్తింపదగిన విశేషం. శబ్దకల్పద్రుమంలో 'సూక్తకు' ఉంది. సుష్ఠు ఉక్తమ్ అనే యౌగికార్థంలో మంత్రపర్యాయంగా (ఉషస్సూక్తమ్, శ్రీసూక్తమ్) అది రూఢం. సూక్తికూడా ఇల్లాగే యోగరూఢమయిన పక్షంలో ఇది నిఘంటువుకి ఎక్కక పోవడానికి కారణం కనపడదు.

బ్రౌణ్యంలో సూక్తి ఉంది. సు + ఉక్తి అని పదవిభాగం చూపించి **'A good word of Fair or Friendly Speach,** మంచి మాట' అనే అర్థాలను ఇచ్చాడు. దీనికి ఇతడు చూపిన ప్రయోగం వసుచరిత్రలోనిది. "...ద్విజసూక్తిఁ బతిరాక తెలిసి మోమెత్తి రాత్రి వహించు కాశ్మీర తిలక మనఁగ..." (వసు, 4–7). సాయం సంధ్యను వర్ణిస్తున్న సీసపద్యంలో నాల్గవ పాదం ఇది. ఇక్కడ ద్విజ సూక్తిన్ అంటే ఒక అర్థంలో పక్షుల కలకూజితాల వలన అనీ, వేరొక అర్థంలో బ్రాహ్మణుల సంధ్యావందన మంత్రాల వలన అనీ సమ న్వయం. మొదటి అర్థం యౌగికం. రెండవది రూఢం.

వాచస్పత్యంలో సూక్తమ్ దగ్గరే 'క్తిన్ సూక్తిః సుష్ఠుక్తౌ స్త్రీ' అనే వివరణ ఉంది. మోనియర్ విలియమ్స్ **Beautiful verse or stanza** అనే విశేషార్థాన్ని చూపించాడు. కాగా ఇవన్నీ యౌగికార్థాలే తప్ప వీటిలో రూఢిలేదు. ఉన్న రూఢి మంత్ర పర్యా యంగానే కనబడుతోంది.

నీతి వాక్యం అనే అర్థంలో సూక్తి పదాన్ని యోగరూఢంగా అంగీకరించినప్పటికీ నన్నయ ప్రయోగంలో దీని సమన్వయం దుస్సా

ధ్యమే అవుతోంది. ఉక్తికి శోభనతా సంపాదకమయిన శాశ్వతత్వం అర్థైక సాధ్యం కాబట్టి 'రుచిరార్థ సూక్తి' అనేచోట అర్థ పునరుక్తి వేడినిప్పు వంటిది అవుతోంది. కాబట్టే కొందరు విమర్శకులు రుచిరార్థ సూక్తినిధి - సూక్తినిధి అంటూ ప్రత్యేకాన్వయం ప్రవచించారు. సూక్తి నిధిత్వానికి లక్ష్యాలుగా వీరంతా చూపుతున్న నన్నయగారి నీతివాక్యాలలో అధికభాగం వ్యాసభగవానుడివే. అవిపోగా నిధిత్వా నికి చాలినన్ని స్వతంత్ర సుభాషితాలను నన్నయ రచనలో ఏరడం ప్రశ్నైక సాధ్యం.

ఇక్కడ ఇంద్రగంటివారు రుచిరార్థం అంటే ధర్మప్రబోధం అనీ, సూక్తి అంటే స్వానుభవంతో పలికిన లోకోక్తి అనీ సమన్వ యించి మచ్చుకి ఒక పదిహేడు లోకోక్తులను ఉదాహరించారు. కానీ వీటిలో చాలాభాగం వ్యాసుడివే కావడం విశేషం (సారమతి నన్నయ)

అందుచేత ఇక్కడ సూక్తిపదం రూఢార్థకం కాదనీ, పర్యాయ పద వినిమయ సహిష్ణువయిన సమస్త పదమనీ అంగీకరించక తప్పదు.

సూక్తినిధి—చతుర వచోనిధి :

దీని అస్వపద విగ్రహ వాక్యంలో వినబడుతున్న శోభనా(సు) ఉక్తిపదాలకు రెండింటికే పర్యాయ పదాలను అనంతరకవులు యథే చ్ఛగా వినియోగించుకున్నారు. మధుర, చాటు ఇత్యాదులు శోభన పర్యాయాలు కాగా, వచస్, వాక్ ఇత్యాదులు ఉక్తి పర్యాయా లుగా కొత్త సమాసాలను నిర్మించుకున్నారు.

"... సరస మధుర వచో గుంభన..." (నిర్వచన. 1–10) అనేది ఈ మార్గాన రూపొందిన తిక్కనగారి వచో గుంభన, నన్నయ పేర్కొన్న కవితాగుణాలను మూడింటినీ సత్కవీంద్ర మార్గంగా కవి బ్రహ్మ ఈ కందంలో పొందుపరిచాడు.

"... చతురవచోనిధివి..." (మను - 1-15) అనే పెద్దన కూర్పు నిస్సందేహంగా సూక్తి నిధికి పర్యాయ పదాలలో చేసిన విస్తరింపు. నిధి శబ్ద సన్నిధి దీనిని మరింత దృఢపరుస్తోంది.

ఆంధ్రసాహిత్యంలో ఉక్తి వైచిత్రికీ అలంకారాడంబరతకూ వసంతోత్సవ సమయం ప్రబంధయుగమే, దీనికి పురోహితుడయిన శ్రీనాథుడు ఈ కవితా గుణాన్ని ప్రబంధ పరమేశ్వరునిలో స్ఫుటంగా దర్శించాడు. "పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు" (కాశీ. 1-13). ఇక్కడ సూక్తి వైచిత్రిపదంతో శ్రీనాథుడు ఉద్దేశించినది నీతివాక్య ప్రయోగ వైచిత్రిని కాదనడం స్పష్టం. అది అనంతర ప్రబంధాలలో విశ్వరూపాన్ని ప్రదర్శించిన అలంకారిక శైలి.

## సూక్తి - ఉభయ వాక్ప్రౌఢి :

ఇలా నన్నపార్యుడు కంఠోక్తిగా చెప్పుకున్న అక్షర రమ్యత్వాన్నీ, నానారుచిర-అర్థాలంకార నిధిత్వాన్నీ శ్రీనాథుడు ఉభయ వాక్ప్రౌఢిగా క్రోడీకరించాడు. "భావింతు నన్నయభట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్క మాటు" (కాశీ. 1-13). వాక్ప్రౌఢి అంటే పలుకుల గడుసుదనం. ఆప్రౌఢిమ శబ్దవిన్యాస విశేషమయినా కావచ్చు, అర్థవిన్యాస విశేషమైనా కావచ్చు. ఒకటి శబ్దసౌందర్యము, రెండవది అర్థసౌందర్యము. ఈ ఉభయమయిన వాక్ప్రౌఢినీ భట్టారక మార్గంగా - ప్రాధాన్య దృష్టితో-శ్రీనాథుడు ప్రస్తుతించాడు.

ఇటువంటి ప్రౌఢి కవులందరికి అత్యవసరమని "...ఇంపారెడు పల్కులంబడయు, నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ జేరుప నేరగా వలయు..." (నిర్వచన. 1-5) అని తిక్కన కూడా ఉపదేశించాడు.

వాక్ శబ్దాన్ని పద పర్యాయంగా స్వీకరించి సంస్కృత పద ప్రయోగ ప్రౌఢినీ, ఆంధ్ర పద ప్రయోగ ప్రౌఢినీ ఉభయ వాక్ప్రౌఢిగా సమన్వయించి అది నన్నపార్యుని కవితా మార్గంగా శ్రీనాథుడు అనుసరించాడు, అనడం కన్నా పై సమన్వయంలో ఔచిత్యాతిశయం సహృదయులకు తోచకపోదు.

ఇది ఏదీకాదు పొమ్మని సుశబ్దాదుల్లోలాగా సూక్తిలోని 'సు' అనేది నిర్దుష్టతా బోధకమే అనుకున్నప్పటికీ అది నీతివాక్య పర్యాయం కానేరదు. నానావిధాలయిన రుచిరార్థాలకూ నిర్దుష్ట శబ్దాలకూ నిధి అని మాత్రమే అర్థం లభిస్తుంది. కాబట్టి నానారుచిరార్థ సూక్తినిధి అంటే నీతి వాక్యాలకూ లోకోక్తులకూ సుభాషితాలకూ నిధి అని సమన్వయించడం సముచితం కాదని, అది అలంకార ప్రస్థానానికి సంసూచకమని సారాంశం. కాగా నన్నయ రచన నుంచి ఆయా అర్థాలంకారాలనూ వాటి వైచిత్రులనూ ఉద్ధరించి చూపి దీనిని నిర్ధారించవలసిన అవసరం అంతగా లేదని నమ్మిక. నన్నయగారి అలంకారాలపై ఒక సిద్ధాంత గ్రంథం వెలువడనే వెలువడింది.

—[•]—

"... చతురవచోనిధివి..." (మను - 1-15) అనే పెద్దన కూర్పు నిస్సందేహంగా సూక్తి నిధికి పర్యాయ పదాలలో చేసిన విస్తరింపు. నిధి శబ్ద సన్నిధి దీనిని మరింత దృఢపరుస్తోంది.

ఆంధ్రసాహిత్యంలో ఉక్తి వైచిత్రికీ అలంకారాడంబరతకూ వసంతోత్సవ సమయం ప్రబంధయుగమే, దీనికి పురోహితుడయిన శ్రీనాథుడు ఈ కవితా గుణాన్ని ప్రబంధ పరమేశ్వరునిలో స్ఫుటంగా దర్శించాడు. "పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు" (కాశీ. 1-13). ఇక్కడ సూక్తి వైచిత్రిపదంతో శ్రీనాథుడు ఉద్దేశించినది నీతివాక్య ప్రయోగ వైచిత్రిని కాదనడం స్పష్టం. అది అనంతర ప్రబంధాలలో విశ్వరూపాన్ని ప్రదర్శించిన ఆలంకారిక శైలి.

## సూక్తి - ఉభయ వాక్ప్రౌఢి :

ఇలా నన్నపార్యుడు కంఠోక్తిగా చెప్పుకున్న అక్షర రమ్యత్వాన్నీ, నానారుచిర-అర్థాలంకార నిధిత్వాన్నీ శ్రీనాథుడు ఉభయ వాక్ప్రౌఢిగా క్రోడీకరించాడు. "భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్క మాటు" (కాశీ. 1-13). వాక్ప్రౌఢి అంటే పలుకుల గడుసుదనం. ఆ ప్రౌఢిమ శబ్దవిన్యాస విశేషమయినా కావచ్చు, అర్థవిన్యాస విశేషమైనా కావచ్చు. ఒకటి శబ్దసౌందర్యము, రెండవది అర్థసౌందర్యము. ఈ ఉభయమయిన వాక్ప్రౌఢినీ భట్టారక మార్గంగా - ప్రాధాన్య దృష్టితో-శ్రీనాథుడు ప్రస్తుతించాడు.

ఇటువంటి ప్రౌఢి కవులందరికి అత్యవసరమని "...ఇంపారెడు పల్కులంబడయు, నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ జేరుప నేరగా వలయు..." (నిర్వచన. 1-5) అని తిక్కన కూడా ఉపదేశించాడు.

కాని యొక విషయము ముఖ్యముగ గుర్తింపవలసియున్నది భారతము ప్రధానముగ ధర్మబోధక గ్రంథము. వేదములను, స్త్రీశూద్రద్విజబంధువులు చదువరాదు. కావున వారికి వైదికధర్మములను దెల్పుటకై వ్యాసుఁడు భారతమును రచించె నని భాగవతములోఁ గలదు.

"స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా,
ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృతమ్."

కావున భారతము నాంధ్రీకరించువారు ముఖ్యముగ వైదికధర్మ దృష్టితోనే దాని నాంధ్రీకరించుట న్యాయ్యము. అంతియే కాదు, వారి యాంధ్రీకరణము మూలమునుండి భేదించుచున్నదా లేదా యను నంశయముకంటె నది మూలమంత ధర్మబోధకముగా నున్నదా లేదా యనువంశమే ప్రధానమైనది. మూలమునుండి భేదించినను మూలము నకుఁ దీసిపోని ధర్మబోధ యందున్నచో మూలగ్రంథగౌరవమును నిలఁబెట్టినట్లే భావింపనగును. ధార్మికవిషయమునఁ గొఱఁతనొంది యెంత కవితా సౌందర్యమునుగల్గియున్ననుగూడనాభాషాన్తరీకరణము మూలమున కన్యాయము చేసినదేయగును. ఈ దృష్టితోఁజూచినచో నన్నయ యాంధ్రీకరణము మూలమునకు మిక్కిలి గౌరవమును గల్గించునదియే కాని యెంతమాత్రము న్యూనతనుగల్పించునదికాదని తెలియఁగలదు. ఏలన :— నన్నయమూలములో లేని వైదికసౌరభ మును దనగ్రంథములో వెలయింపఁజేసి నాఁడు. ఇందుల కెన్నియో యుదాహరణముల శ్రీకోరాడరామకృష్ణయ్యగారు తమ 'ఆంధ్ర భారత కవితా విమర్శనము'లోఁ గన్పఱిచియున్నారు.

నన్నయకాలమునకుఁ గొంచెము పూర్వమే వైదికమతము పునరుద్ధరింపఁబడినట్లు తెలియుచున్నది. వైదికకర్మకలాపము[illegible]

"... చతురవచోనిధివి..." (మను - 1-15) అనే పెద్దన కూర్పు నిస్సందేహంగా సూక్తి నిధికి పర్యాయ పదాలలో చేసిన విస్తరింపు. నిధి శబ్ద సన్నిధి దీనిని మరింత దృఢపరుస్తోంది.

ఆంధ్రసాహిత్యంలో ఉక్తి వైచిత్రికీ అలంకారాడంబరతకూ వసంతోత్సవ సమయం ప్రబంధయుగమే, దీనికి పురోహితుడయిన శ్రీనాథుడు ఈ కవితా గుణాన్ని ప్రబంధ పరమేశ్వరునిలో స్ఫుటంగా దర్శించాడు. "పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని శేవ సూక్తి వైచిత్రి నొక్కక్క మాటు" (కాశీ. 1-13). ఇక్కడ సూక్తి వైచిత్రిపదంతో శ్రీనాథుడు ఉద్దేశించినది నీతివాక్య ప్రయోగ వైచిత్రిని కాదనడం స్పష్టం. అది అనంతర ప్రబంధాలలో విశ్వరూపాన్ని ప్రదర్శించిన అలంకారిక శైలి.

## సూక్తి - ఉభయ వాక్ప్రౌఢి :

ఇలా నన్నపార్యుడు కంఠోక్తిగా చెప్పుకున్న అక్షర రమ్యత్వాన్నీ, నానారుచిర-అర్థాలంకార నిధిత్వాన్నీ శ్రీనాథుడు ఉభయ వాక్ప్రౌఢిగా క్రోడీకరించాడు. "భాషింతు నన్నయభట్టు మార్గంబున నుభయ వాక్ప్రౌఢి నొక్కక్క మాటు" (కాశీ. 1-13). వాక్ప్రౌఢి అంటే పలుకుల గడుసుదనం. ఆ ప్రౌఢిమ శబ్దవిన్యాస విశేషమయినా కావచ్చు, అర్థవిన్యాస విశేషమైనా కావచ్చు. ఒకటి శబ్దసౌందర్యము, రెండవది అర్థసౌందర్యము. ఈ ఉభయమయిన వాక్ప్రౌఢినీ భట్టారక మార్గంగా - ప్రాధాన్య దృష్టితో-శ్రీనాథుడు ప్రస్తుతించాడు.

ఇటువంటి ప్రౌఢి కవులందరికి అత్యవసరమని "...ఇంపారెడు పల్కులంబడయు, నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాఁ జేరుప నేరగావలయు..." (నిర్వచన. 1-5) అని తిక్కన కూడా ఉపదేశించాడు.

'తనవిద్యపేర్మి నృపనందనఁ బడసెను విప్రుఁ డితనితప్పే'
అని యాజ్ఞక్షత్రియులచే ననిపించినాఁడు.

మూలములోని కొన్ని భావములను వదలిపెట్టుట యు నన్నయ భాగములోఁ జాలచోట్లఁ గాంచనగును. కొన్ని యుపాఖ్యానములు గూడ వదలివేయఁబడినవి. మూలములో లేనిభావములుగూడ నొక్కొ-కచోఁ గాంచనగును. మూలములో నొకచోట నున్న కథ యిట మఱొకచోట నుండుటయుఁ గలదు. మూల గ్రంథములో యయాతి చరిత్రము శకుంతలోపాఖ్యానమునకుఁ బిమ్మట నున్నది. నన్నయ దీనిని వ్యత్యస్తము చేసినాఁడు నన్నయ యిట్టి మార్పులను గావించు టకు రెండు హేతువులను దేర్కొనవచ్చును. నాఁడు నన్నయకు లబ్ధ మైన సంస్కృతభారత ప్రతిలో నివి యిట్లే యుండవచ్చు ననునది యొకటి. ఇట్లు మార్చుటలో నౌచిత్యము గలదని నన్నయ తలఁచి యుండవచ్చు ననునది రెండవది. ఎట్లన: యయాతి చరిత్రము పూర్వము జరిగినది కావున దానిని ముందుగ వ్రాయుటయే సమంజస మని నన్నయ తలంచి యుండవచ్చును.

నన్నయ యీవిధముగ మూలగ్రంథములో మార్పులను గల్గించి వ్రాయుట రాజరాజు కోరిక కనుగుణముగనే యున్నది. ఏలన : ౧. రాజరాజు భారతమును మక్కికిమక్కిగఁ దెనిఁగింపు మని నన్నయను గోరలేదు.

"క. జనమత కృష్ణద్వైపా, యనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీయుక్తి
మెయిన్"

అనియే కోరియున్నాఁడు, ౨. అంతియే కాక మూలములోఁ గొన్నిమార్పులను గావించి రచియించుటయే రాజరాజున కెక్కు డభీ మత మని చెప్పుటకుఁ గూడ వీలున్నది. భారతమునుభాషాన్తరములోఁ

జేపట్టినయే కాక భగ్యంతరముగఁ జెప్పుటగూడ నాతని కభిలషిత మని యీ క్రిందిమాటలవలనఁ దెలియఁ గలదు.

"బహుభాషలబహువిధముల, బహు జనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగువారికి నెవ్వఁడు, బహుయాగంబులఫలంబు పరమార్థముగున్"

ఇట రాజరాజు 'బహువిధముల' భారతమును వినఁగోరుట చేతనే నన్నయ దానిని నూతనవిధముగ వ్రాసి యుండవచ్చును.

గ్రంథవిషయముకథనములోనే కాక గ్రంథము బాహ్యరూప ములోఁ గూడ నన్నయ మార్పును గావించినాఁడు మూల. భారత మించుమించుగఁ బద్యమయముగ నున్నది. నన్నయ దానిని గద్యప పద్యాత్మకముగ రచించినాఁడు. అట్లుచేయుటకుఁ గూడఁ గారణము లేకపోలేదు. నన్నయ భారతము నాంధ్రీకరించు కాలమునకు సంస్కృత భాషలో విరివిగఁ జంపువులు వ్రాయఁబడుచుండెను. రామాయణ చంపువు మున్నగున వీశతాబ్దముననే రచింపఁబడినవి. సంస్కృత వాఙ్మయప్రభావ మెల్లపుడును బరిపరివిధంబుల నాంధ్రవాఙ్మయము పైఁ గన్పట్టుచునే యుండెను. నన్నయ కాలములో సంస్కృత సార స్వత ప్రపంచములోఁ బ్రాముఖ్యమువహించిన చంపూవిధానమే యాతని భారతాంధ్రీకరణమునకు మార్గమైనది.

పద్యము నెట వ్రాయవలెనో గద్య నెచట వాడవలెనో యను విషయమున నన్నయకుఁ గొన్ని నిశ్చిట్లు తాభిప్రాయము లున్న గన్ప ట్టును పరికించి చూడగా నీక్రిందినియమము లాతనికుండెననితోఁచును. ఇవి యపవాదములు లేనినియమములు గాకపోవచ్చును. ౧. అనుకర ణము ముగింపఁబడినపిమ్మట సాధారణముగ వచనము ప్రారంభింపఁ బడును. "అనిన శకుంతలపలుకులు సేకొననొల్లక దుష్యంతుఁడిట్లనియె."

"ఇట్లు దద్దయు దుఃఖించి" అనునవి యుదాహరణములు. ౨. వచన ప్రారంభములో నెత్తికొనఁబడిన యభిప్రాయము ముగిసి నూతనాభిప్రాయము గాని నూతనఘట్టము గాని ప్రారంభము కావలెనన్నచో నది పద్యములోఁ బ్రారంభింపఁబడును. ౩. బహుకాలములో జరిగిన సంగతులను సంగ్రహముగఁ జెప్పివైచుటకు సాధారణముగ వచనము వాడఁబడును. ఉదాహరణము. "అని మహానురాగంబునఁ గొడుకు నెత్తికొని హర్షపులక లెసఁగ నాలింగనంబు సేసి శకుంతలమహాదేవి నతిప్రణయగౌరవంబున సంభావించి యౌవరాజ్యంబునకు భరతు నభిషిక్తుంజేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తన రాజ్యభారంబంతయు భరతుంబూన్చి దుష్యంతుండు దపోవనంబున కరిగిన" ౪. రెండుభిన్నపద్యములలో నున్న రెండుముఖ్యవాక్యములకు సంబంధమును గల్పుటకై 'అంత' 'అట్టి యవసరంబున' మున్నగుచిన్నవచనములు మధ్యమునఁ బ్రవేశపెట్టఁబడును. ౫. పద్యములోని భావములను సంగ్రహముగ వచనములో ననువదించుటయుఁ గొన్నిచోట్లఁ గాంచనగును.

అర్వాచీనకాలమునఁ గొంత తలయెత్తిన సంస్కృతాంధ్రస్పర్థ నన్నయనాఁటికి లేదు. అతఁడు సంస్కృతపదములను విరివిగ వాడుటకు శకింపలేదు. ఒక్కొక తెనుఁగు పదమునకు రెండేసి సంస్కృతపదముల చొప్పున వాడియున్నాఁడు. వైదికధర్మాచారనిబద్ధమనస్కుఁడైన నన్నయ సంస్కృతపక్షపాతి యగుటలో నాశ్చర్యము లేదు. గ్రంథాదిలోఁ బవిత్రమైన దేవతాస్తోత్రము చేయుటకు సంస్కృతము మాత్రమే యర్హమైన భాష యని యాతఁడు దలంచుటలోఁ గూడ వింతలేదు. సంస్కృతపదములనే కాక దీర్ఘ సంస్కృతసమాసములను గూడ నాతఁడు వాడుచుండును; "సంతతసిద్ధామరయక్ష సేవితసముద్యచ్ఛృంగమై" ధవళభూషణ దామాను లేపనామలినాంగి" "నరనాగా

శ్వ" మున్నగు సమాసము లిటీవలి యాంధ్రకవులు వాడిన సమాసములతోఁ బోల్చిచూచినచోఁ జాలఁజిన్నవే కాని సంస్కృత భారతములోని సమాసములతోఁ జాలఁ బెద్దవిగనే కన్పట్టును.

కేవలముఁ గవితాసౌందర్యములో నన్నయ భారత భాగము మూలమునకుఁ దీసిపోవునా యనుప్రశ్న యొండు కలదు. చాల విషయములలో రెండు కవితలు నొకవిధముగనే యుండును ద్రాక్షాపాకములోనే యున్నవి. రెండును గూడ సహజోద్భూతములుగనే కన్పట్టును గాని విశేషప్రయత్నజములుగఁ గన్పట్టవు. మూలములోని మంచి యుపమానములను వర్ణనలను నన్నయ చాలభాగమనువదించియే యున్నాఁడు; కొన్నిచోట్ల మూలాధారములేని పోలికలను వర్ణనలను దెచ్చిపెట్టినాఁడు. ఇందుఁ గొన్ని మిక్కిలి స్తుత్యర్హములుగ నున్నవి. ధృతరాష్ట్రుఁడుజతుగృహదహనవార్త విని'ఆవఁజచినట్లఉచెన్' అని నన్నయ వాడిన యుపమాలంకారమునకు మూలములో నాధారము లేదు. మూలములో సంగ్రహముగ నున్న యంశమును విపులముగను వినసొంపుగను లలితపదములతోను గావ్యకళతోను జెప్పుట చాలచోట్లఁగాంచనగును. మత్స్యయంత్రమును గొట్టిన యర్జునునకు ద్రౌపది పుష్పమాలిక వేయుట మూలములో నిట్లు వర్ణింపఁబడి యున్నది.

"విద్ధంతు లక్ష్యం ప్రసమీక్ష్య కృష్ణా పార్థంచ శక్రప్రతిమం
నిరీక్ష్య
ఆదాయ శుక్లాంబరమాల్యదామ జగామ కుంతీసుత ముత్
స్మయంతీ"

దీనిని నన్నయ యీక్రిందివిధముగ నాంధ్రీకరించి యున్నాఁడు.

"సీ. ధరణీశనందనుల్ దన్నతిప్రీతితోఁ జూచుచునుండంగ సుందరాంగి
తోయజదళనేత్ర ద్రుపదరాజాత్మజ కమనీయగజరాజగమన లీలఁ

జనుదెంచి సురరాజసన్నిభు నభినవయౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ దనచేతిసితపుష్పదామక
మునఁ
బొలఁతి ముదముతోడ, బూజించె నట్టి యుత్సవముఁ జూచి
దానిపైఁ బ్రకపుడు
కౌరవేంద్రుఁ డాదిగాఁగల భూపతు, లెల్ల నలిగి కలయ నేపుఱేఁగి."

మొత్తముపై నెట్లున్నను గొన్ని చోట్ల నన్నయ కవిత్వము మూలములోని కవిత్వముకంటె మిన్నగనే యున్న దని యందఱు నంగీకరించి యున్నారు. ఆంధ్రకవుల చరిత్రములో వీరేశలింగముపంతులుగా రిచ్చిన యీ క్రింది యభిప్రాయము మిక్కిలి సమంజసముగనే యున్నది ? "మూలముతో సరిపోల్పక ప్రత్యేకముగాఁ జూచునప్పుడు మాత్ర మాంధ్రభారతము మనోహరముగా నుండుటకు సందేహము లేదు. కొన్నిచోట్ల మూలమునకంటెను హృద్యతరముగా నుండి రసాతిశయము పుట్టించు ననుటయు నిర్వివాదాంశమే."

ఇట్టి భేదములు మాత్రమే కాక దేశకాలపరిస్థితులను బట్టి వచ్చిన యితర భేదము లనేకములు నన్నయ భారతమునకును వ్యాస భారతమునకును నడుమఁ గలవు. అర్జునుని తీర్థయాత్రావసరమున వేఁగి దేశప్రశంస మూలభారతములో లేకుండుటయు నన్నయ స్వదేశాభిమానముచే నట వేంగీదేశమును ప్రశంసాపూర్వకముగ వర్ణించుటయు సుప్రసిద్ధవిషయము. మఱియు గ్రంథాదిలోఁ దనయేలిక యగురాజరాజున కేగుణములు గలవని నన్నయ చెప్పియున్నాఁడో యాగుణములను గ్రంథములో నాయామహాపురుషులకు నన్నయ బుద్ధిపూర్వకముగ నంటగట్టినట్లు గన్పట్టును. వివాహవిషయమున యయాతి దేవయానిని బ్రత్యాఖ్యానము చేయుచు "సర్వవర్ణాశ్రమధర్మంబులు సంకరంబులు గాకుండ రక్షించుచున్న యేన యిట్టి యధర్మంబున

కొడంబడితినేని జగత్ప్రవృత్తి విపరీతం బగు” నని నన్నయ చెప్పినాఁడు. కాని వ్యాసభారతములో నీయభిప్రాయ మేమియు లేదు. గ్రంథాదిలో నన్నయ రాజరాజును వర్ణించుచు “సమస్తవర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహీనొప్పు సర్వలోకాశ్రయుఁ” డని చెప్పియున్నాఁడు. పైని యయాతిపరముగ వాడఁబడిన పదము లీపదములను దలపించుచున్న వనుటలో సందియము లేదు. నన్నయ కాదర్శధర్మరక్షకుఁడు రాజరాజు. గ్రంథములోని మహాపురుషుల గుణములను బేర్కొనుటలో నీతనిగుణములు వారి కున్నట్లు చెప్పుటయే సర్వోత్తమమార్గమని యాతనియాశయమై యుండవచ్చును.

పురాణములను దెలిగించుటలో యథామూలముగా వ్రాయక మూలకథకు భంగములేకుండ యథేచ్ఛముగా వ్రాయుపద్ధతిని నన్నయయే ప్రారంభించినాఁడు. నన్నయ యాంధ్రీకరణపద్ధతినే యితర పురాణభాషాన్తరీకర్తలు గూడ నవలంబించినారు. ఈపద్ధతి యెంత ప్రశస్తమైన దైనను గేవలయు లోపము లేనిదికాదు. చారిత్రకపరిశోధకులకును ధర్మశాస్త్రవిషయక సందేహములను బాపుకొనఁదలఁచువారికిని నిట్టి భాషాన్తరీకరణము లుపయోగింపఁజాలవు. అట్టివారికి సరియైన భాషాన్తరీకరణములే కావలెను. ఈవిషయమునఁ గృష్ణభారత మొకలోటును దీర్చుచున్నది.

—/—

# నన్నయగారి భారతాంధ్రీకరణము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

భారతము నాంధ్రీకరించుటలో నన్నయగారు వైదిక మతమును సంరక్షించుటకుఁ బ్రయత్నము చేసిరనియు, వైదిక మత రక్షణార్థమే నన్నయగారిచేతఁ దెలుగు భారతము వ్రాయఁబడె ననియు నొక ప్రచారము దేశములో నున్నది. దీనినిఁ జారిత్రకులు ప్రారంభించి నట్లున్నది. విశ్వవిద్యాలయములలో దీనికిఁ బ్రచార మెక్కువగా నున్నది. ఈ విశ్వవిద్యాలయములలోఁ జదివినవారు వ్రాసిన బహు గ్రంథములలోనను, జేసెడి బహూపన్యాసములలోనను ధారాళముగా నీ ప్రశంస చేయుచున్నారు. ఇది నిరాధారమైన మాటగాఁ గన్పించు చున్నది. ఏలయనఁగా నీమాట కాధారమైన విషయము కన్పించదు. నన్నయగారి భారతావతారికలో నీ ప్రశక్తియే లేదు. రాజరాజ నరేంద్రుడు.

ఇవి యేను న్సతతంబు నాకును గరం బిష్టంబులై యుండుఁ బా
యవు, భూదేవ కులాభి తర్పణ మహీయః ప్రీతియు, న్భారత
శ్రవణాసక్తియుఁ, బార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహో
త్సవము. న్సంతత దానశీలతయు, శశ్వత్సాధు సాంగత్యమున్.

మఱి యదియునుంగాక,

హిమకరు దొట్టి పూరు భరతేశ కురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమల సద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్రనాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్.

అని మాత్రమే యడిగెను. గానిఁ మన సనాతన మతము పాడయి

పోవుచున్నది. నీవీ కావ్యమును దెలుఁగు సేసిపెట్టుము. అని యడిగిన జాడ లేదు. మఱియు,

బహు భాషల బహు విధముల
బహు జనములవలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహు యాగమ్ముల ఫలమ్ము పరమార్థముగన్

అన్న విషయమే చెప్పబడెను. ఇట్టి యపప్రథకు శాసనాధారమైనను గానిపించదు: శాసన వేత్తలయిన చారిత్రకులు కూడ నట్టి వున్నట్లు చెప్పుటలేదు. మఱి యీ నిరాధారమైన వాక్యమెందుకుఁ బుట్టినదో తెలియదు. ఈ దేశమున సాహిత్యవిమర్శ యిట్టి నిరాధారములైన బహు విషయములతో నల్లుకొని పోవుచున్నది. అప్రమాణములైన బహు విషయములతో నల్లుకొని పోవుచున్నది. అప్రమాణములైన బహు సిద్ధాంతములు విమర్శరూపమునఁ జెప్పఁబడుచున్నవి. అది భాషకు, సాహిత్య వేత్తలు కాని సామాన్యులయిన సాహిత్యాభిమానులకు నపకారము చేయుచున్నది. నన్నయగారు మత దృష్టితో నీ నీ కావ్యము వ్రాయలేదనుటకు ననేకములైన యుదాహరణములు చూపించ వచ్చును. సభాపర్వములో శిశుపాలవధ సందర్భమున భీష్ముఁడు శ్రీకృష్ణుని యొక్క పరమేశ్వరత్వముఁ జాల సర్గలయందు వర్ణించెను. కృష్ణుఁడు పరమేశ్వరుఁడని, సృష్టికిపూర్వము జలమునకు హేతువని, సర్వయజ్ఞ కర్తయని, వరాహాద్యవతారము లెత్తినవాఁడని మధుకైటభులను సంహరించిన వాడని, బలి నణఁగద్రొక్కిన వాఁడని, మఱి యెన్నియో సంగతులనుఁ జెప్పెను. ఇవి యన్నియు విష్ణుపారమ్య బోధకములైన విషయములు, వీని నన్నింటిని నన్నయగారు వదలి పెట్టెను. హిందూ మతమును రక్షించుటకు నన్నయగారు భారతమును వ్రాసినచో నీ భాగములను వదలిపెట్టరాదు గదా!

మందపాల చరితములో మందపాలుఁడు వైశ్వానరుని నగ్ని ఋక్కులతో స్తోత్రముఁజేసెను. మందపాలుని కుమారులైన స్తంబమిత్రుఁడును, ద్రోణుఁడును. ఋగర్థములతో వహ్నిని స్తోత్రముఁ జేసిరి. ఈ స్తోత్రము లేమియు నన్నయగారి భారతములోలేవు. ఇవి ఋగ్వేదములోని యగ్నిసూక్తములకు వ్యాసమహర్షి వ్రాసిన శ్లోకములు. హిందూమతము వేదముల నాశ్రయించి యున్నది కదా! ఋగర్థములను వదలిపెట్టినవాఁడు హిందూమతమును సంరక్షించుటకు వ్రాసెననుట యెట్లు పొసగును. ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమున దుశ్శాసనుఁడు ద్రౌపది చీర లాఁగఁబోవు చుండఁగా ద్రౌపది శ్రీకృష్ణుని బహు శ్లోకములతోఁ గీర్తించెను.

శ్లో॥ ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః
గోవింద ద్వారకా వాసిన్ కృష్ణ గోపీ జనప్రియ
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ॥
హేఁ నాథ హే రమానాథ ప్రజానాథార్తి నాశన
కౌరవార్ణవ మగ్నాం మా ముద్ధరస్వ జనార్దన॥
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన
ప్రపన్నాం పాహిగోవింద కురుమధ్యేఽవసీదతీం॥
ఇత్యనుస్మృత్య కృష్ణం సాహరిం త్రిభువనేశ్వరం
ప్రారుద ద్దుఃఖితారాజ న్ముఖ మాచ్ఛాద్య భామినీ॥
యాజ్ఞసేన్యా వచ శ్శ్రుత్వా కృష్ణో గహ్వరితోఽభవత్
త్యక్త్వా శయ్యాసనం పద్భ్యాం కృపాళుః కృపయాఽభ్యనాత్॥
కృష్ణంచ విష్ణుంచ హరిం నరంచ త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ
తతస్తు ధర్మోఽంతరితో మహాత్మా సమావృణోద్వైవివిధైస్సువస్త్రైః॥

నన్నయగారీ భాగము నేమియుఁ దెలుగు చేయలేదు. ప్రాతిగామి పిలిచినప్పుడు ద్రౌపది రాకపోవుటచేత దుర్యోధనుఁడు దుశ్శాసనునిఁ బనిపించెను. దుశ్శాసనుఁడామెను జుట్టుపట్టుకొని తీసుకొని వచ్చెను. అప్పుడు ద్రౌపది—

ఇది యుచితమ్ముగాదనక యిక్కురుముఖ్యులు చూచుచుండదు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ జేసెడి సర్వధర్మ సం
విదు లన నున్న యీ భరతవీరుల వంశము నేఁడధర్మ సం
పద నీతి నింద్య మయ్యె నని భామిని కృష్ణఁ దలంచె భీతయై''

ఈ పద్యములోనున్న చివటి వాక్యము తప్ప నన్నయగారు వేఱె ప్రస్తావన చేయలేదు. వ్యాసమహర్షి భారతమునఁగథ గజేంద్ర మోక్షణము వలెఁ గలదు. ఇచటఁ గథకుఁ బ్రాముఖ్యము కలదు. కాని భగవద్భక్తికి ప్రాముఖ్యములేదు. ఈ రీతిగా బహుస్థలముల యందు నన్నయగారు మత విషయములకుఁ బ్రాధాన్య మీయక, కథకే ప్రాధాన్య మిచ్చిరి. ఇట్టి సందర్భములో నన్నయగారు మతమునకుఁ బ్రాధాన్యమిచ్చి భారతమును వ్రాసిరనియు, యజ్ఞ యాగాది ఈ క్రతువులను రక్షించుటకు భారతము వ్రాసిరనియుఁ జెప్పెడి మాట లప్రామాణికములు. నన్నయగారిని జాగ్రత్తగాఁ జదివిచెప్పిన మాటలు కావు. వ్యామోహముచేతఁ బలికిన మాటలు.

నన్నయగారు ప్రధానముగాఁ దాను భారతము నాంధ్రీకరించు నప్పుడు తన కావ్యమునందు మూఁడు గుణములుండెనని చెప్పెను. మొదటిది : కథాకవితార్థయుక్తి. రెండవది : యక్షర రమ్యత మూడవది : నానారుచిరార్థ సూక్తి నిధిత్వము. చివరి రెండు గుణములు సర్వజన విదితములైనవే. మొదటి గుణమే గ్రహించుట కష్టము

దానిని గ్రహించలేకపోవుట యట్లుంచి దుర్వ్యాఖ్యానము చేయుట దుర్మేధా విలసితము.

నన్నయగారు తన కథలు వ్యాసుని కథలకంటె నెక్కువ రమణీయములుగాఁ జేసెను. నన్నయ్య తన్నుఁ గూర్చి తాను 'లోకజ్ఞునుభయ భాషా కావ్య రచనాభి శోభితు'నని వ్రాసికొనినాఁడు. తాను లోకజ్ఞుఁడనని చెప్పుకొనినాఁడు. ఆయన యెంతలోకజ్ఞుఁడో నేను నా వ్రాసిన 'నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి' యన్న గ్రంథమున నిరూపించితిని. ఆయన లోకజ్ఞత్వమును మనము గ్రహించినఁ జాలును. చాలమంది నేఁడు అయన యలౌకికుఁడని వృథా భాషలాడుచున్నారు. ఆయన యలౌకికుఁడు కాఁడు. అలౌకికుఁడు కవియే కాలేఁడు. వ్యవహార విదుఁడు కాని వాఁడు కవియగుట కష్టము. వ్యవహార విదులు కానివారు నన్నయ్యగారిని నిరాకరించవచ్చును. వారిని గుఱించి యెవ్వరు నేమియుఁ జేయలేరు. వారికి 'నమోవాకం ప్రశాస్మహే.'

లోకమునం దందఱును గవులే, 'కవయతీతి కవిః'. కవయతి యనఁగా వర్ణయతి వర్ణించుచున్నాఁడు. కావ్యమంతయు వర్ణనమే. ఒక సన్నివేశమును జెప్పుటయు వర్ణించుటయే. కథను వ్రాయుటయు వర్ణించుటయే. ఈ వర్ణన బహువిధములుగా నుండును. కథారూపమున నుండును. ప్రసంగరూపమున నుండును. వస్తు స్వరూపమున నుండును. కాని యీ వస్తు స్వరూప నిర్ణయరూపమున నున్నది మాత్రమే వర్ణనమని లోకమునందు సామాన్యముగా ననుకోనఁ బడుచున్నది. ఉషఃకాలము, వసంత ఋతువు, అటవి, నదులు, గిరులు, స్త్రీలు, ఒక పురుషునియొక్క రూపము ఇట్టివానిని గుఱించి, చేసిన వర్ణనము మాత్రమే వర్ణనమని, తక్కినవి కావని సామాన్యాభిప్రాయ మేర్పడెను. నిజానికి నీపై చెప్పిన విషయముల వంటి విషయము ను

నేర్పుతో స్వభావోక్తి యుపమోత్ప్రేక్షా రూపకాద్యలంకారము లతో వర్ణించిన కవిని లోకమునందు గొప్పగా భావింతురు. కవి కొంత శక్తిమంతుడైనచో నీ వర్ణనములు రమ్యములుగానే చేయ వచ్చును. ఇంతకంటె నధికమైన శక్తిమంతుఁడు యథార్థమైన వర్ణనము యొక్క స్వరూపముఁ దెలిసినవాఁడు వేఱొకఁడుండును. అతఁడు మహాకవి శబ్దవాచ్యుఁ డతఁడొక్కఁడే యగును. నన్నయగారిట్టి వర్ణనములు చేయును. ఆ వర్ణనము లెట్లుండుననగా లౌకిక దృష్టితోఁ జూసి చేసెడి వర్ణనములుకావు. దాని కాంతర దృష్టి కావలయును. ఈ పద్యము జూడుఁడు. ద్రౌపదినిఁ బార్థుఁడు తన యింటికిఁ దీసికొని వచ్చెను. "మే మొక్క భిక్షఁ దెచ్చితి మని తల్లికి నివేదించిన నెఱుంగక యెప్పటి యట్లకా వగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీ రేవురు నుపయోగింపుఁడని కొడుకుల నియోగించి" ఈ మాటతో ధర్మసందేహ ముద్భవించినది. ఇచట నన్నయగారొక పద్యమును వ్రాసెను.

ఆ లలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండు భూ
పాలకుమార పంచకము పంచశరాహతిఁ బొందె నొక్కతన్
బాలికఁ దొల్లి యేవురికి భార్యనుగా సృజియించి యున్న య
య్యాలరి బ్రహ్మ చెయ్వి పరమార్థముగా కది యేల
యొండగున్"

ఇది యాశ్చర్యకరమైన విషయము. అర్జునుఁడామెను గెలిచి తెచ్చెను. న్యాయముగా నతని కామె భార్య కావలయును. లోకములో నలుగు రన్నదమ్ములున్నచో వారిలో నొకరి కేర్పడిన పెండ్లి కూఁతుమీఁదఁ దక్కిన సోదరులకుఁ గోర్కి కలుగదు. ఇది సృష్టిలోని రహస్యము. ఇది స్వభావము. దీనికి వ్యతిరేకముగా ద్రౌపదియందుఁ బంచపాండవులు పంచశరాహతి బారి కగ్గమైనారనుట విలక్షణమైన రచన. లోకము నెఱింగి దానికంటె విశేషమైన యొక సన్నివేశము

వచ్చినపుడు లోకాతిశాయియైన యీ విషయమును నిరూపించి చెప్పుట ఈ పద్యమునందలి మొదటి చరణములోని యర్థము. వ్యాసమహర్షి వ్రాసినదియే. తక్కిన రెండు చరణములలోననే నన్నయగారి విశేష మున్నది. ఈ యర్థముఁ దెలిసికొని నన్నయగారు వ్రాసిన వ్రాత లోకమున కంటె భిన్నముగానున్న యీ యనుభవమును బ్రహ్మా చెద్దిగా నిరూపించుట నన్నయగారు వ్రాసిరి. ఇది సామాన్య వర్ణనము కంటెఁ బైమెట్టు విషయము. శకుంతలోపాఖ్యానమున.

విపరీత ప్రతిభావ లేమిటికి నుర్వీనాథ యీ పుత్త్ర గా
త్ర పరిష్వంగ సుఖంబుఁ జేకొనుము ముక్తాహార కర్పూర సాం
ద్ర పరాగ ప్రసరంబు చందనము చంద్రజ్యోత్స్నయున్
బుత్త్ర గా
త్ర పరిష్వంగము నట్లు జీవులకు హృద్యంబె కడున్ శీతమే!

సంస్కృత భారతములో

"నవాససాం నరామాణాం నాపాం స్పర్శ స్తథావిధః
శిశో రాలింగ్య మానస్య స్పర్శ స్సూనోర్యథా సుఖః"

అని మాత్రమే కలదు. దానిని నన్నయగారిట్లు తెలుఁగు సేసిరి. మఱియు నిందులో నొక విశేషము కలదు. శకుంతల తన కొడుకునుఁ జూపించుటలో నతని స్పర్శయిట్టిదని చెప్పుటలో నన్నయగారు వేరే యర్థమును నిక్షేపించిరి. తన్నుఁ దుష్యంతుఁడు నిరాకరించఁగా నా బిడ్డయే తన బిడ్డ కాదనఁగా నతనిని నీవు కౌగిలించుకొనుము. పుత్త్ర స్పర్శ యటువంటిది. యితని స్పర్శ నీకట్టిదియైనచో నీ విషయము ఋజువగును గదా! – యన్నట్లు చెప్పినది. ఇది మహావిషయము. సర్వగుణములు రక్త నిష్ఠమైయుండును. ఉత్తములకుఁ బుత్త్రుల యొక్క, భార్యయొక్క స్పర్శ యవిదితమైన విషయమునకు నిరూపక మైన సాక్ష్యము. రక్తగతమైన యీ మహాగుణము నాశ్రయించియే

భవభూతి తన యుత్తర రామచరిత్ర నాటకమును వ్రాసెను. భాసుఁడు తన ప్రతిమానాటకములో దిజ్నాగుఁడు కుందమాలలో రామచంద్రుని యొక్క కుశవులతోడి సమాగమము నీరక్త నిష్ఠమైన గుణము మీఁదనే యాధారపడి వర్ణించిరి. భవభూతి నాటకములో సీతాస్పర్శము వలన రామచంద్రుఁడు మూర్ఛనుండి లేచుట దీనికంటె భిన్నమైన విషయము. ఈ మహావిషయమునే నన్నయగారీ పద్యమునందు వర్ణించిరి.

నన్నయగారు తానొక విషయమును గూఢముగా నాలోచించి కాని వ్రాయరు. ద్రౌపదీ వస్త్రాపహరణ విషయమున భారతమునం దిట్లున్నది.

ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే
తద్రూప మపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః ॥
నానారాగ విరాగాణి వసనా న్యథవై ప్రభో
ప్రాదుర్భవంతి శతశః ధర్మస్య పరిపాలనాత్ ॥
తతో హలాహలా శబ్ద స్తత్రాసీద్ ఘోరనిస్స్వనః
త దద్భుత తమం లోకే వీక్ష్య సర్వే మహీ భృతః॥
శశంసు ర్ద్రౌపదీం తత్ర కుత్సంతో ధృతరాష్ట్ర జం
శశాప తత్ర భీమస్తు రాజమధ్యే బృహత్స్వనః ॥

దీనిని నన్నయగారిట్లు తెనుఁగు సేసిరి.

"ఇది సేయఁ గాదని మది విచారింపక సద్ధర్మితుండు దుశ్శాసనుండు నెట్టన ద్రోపది గట్టిన పుట్టంబు సభలోన విడ్చె నాశంక లేక యుడుగక యొలు వంగబడియు మున్నపనీతమైన తద్వస్త్రంబు నట్టి వలువ లలి తాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచునున్న వస్త్రచయము పర్వతోపమానమైన నొలువంగనోపక యుడిగి లజ్జఁబొంది యుక్కుదక్కి"

ఇట్లు భీమసేనుండు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుండు చేసిన యవమానంబు సూచి, కోపరక్తాంత నయనుండగుచు నంతికాకరంబున దంత సందష్ట దారుణముఖుండయి యెల్లవారును విన నిట్లనియె.''

వివిధములై యనేక వర్ణములు కలిగిన వసనములు పుట్టుచున్నవి. దీనికి హేతువు, ధర్మము పరిపాలింపఁబడుట, సభలోఁబెద్ద ధ్వని కలిగెను. ఈయద్భుతమునుఁ జూచి రాజులందఱు ద్రౌపదినిఁ బొగడిరి దుర్యోధనుయందుఁ గుత్స వహించిరి. భీముఁడు శపథముఁ జేసెను. నన్నయగారు వస్త్రముల యొక్క నానారాగ విరాగత్వము వర్ణించలేదు. అది యనవసరము. జనులలో హాలాహల శబ్దము దయించినది. దానిని నన్నయగారు వదిలిపెట్టిరి. ఇదియొక మహా ఘోరము జరుగుచున్నపుడు జనులు నిస్తబ్ధులై నీరవులై యుండిపోదురు. అందుచేత నన్నయగారు దానిని వదలిపెట్టెను. ఆమెను జూచి సభ్యులుదిత సమ్మోదులయిరి. ప్రశంసించలేదు.

నన్నయగారు భారతకథను జూచిన చూపువేఱు. ఆ దృష్టిలోని విశేషము తెలియుటకుఁ జాల జాగ్రత్తగాఁ జదువవలయును. దుర్యోధను డన్నచో నందఱకు భయము. అతని నెదిరించఁగల వాఁడొక్క విదురుఁడే. తక్కిన యెవ్వరును సభలో మాటాడుటకు వీలులేదు. ఇది రాజసభ' మర్యాద. రాజసభలో నొక మహాఘోరము జరుగుచుండవచ్చును. జనులు తమలోఁ దామెంత గుబ్బిసలాడినను జనులు క్రిక్కురు మనుటకు వీలులేదు. రాజు యొక్క యిష్టమునకు వ్యతిరేకముగా సభలో నెవఁడు తన మనోభావములనుఁ బ్రకటించుటకు సాహసించునో వానిని వెంటనే రాజభటులు నిగ్రహింతురు. ఆమర్యాద తెలిసినన నన్నయ యిట్లు వ్రాసెను.

మఱియు 'దద్రూప మపరం వస్త్రం ప్రాదుర్భవతి' యన్న

మాటనునుడుగక యొలువంగ బడియును' మున్న పనీతమైన తద్వస్త్ర
మ్ము నట్టి వలువ లెలితాంగి జఘన మండలమునఁ బాయక యొప్పు
చున్న."దని నన్నయగారు తెలుఁగుఁజేసిరి. ఈ తెలుఁగు సేఁతలోనున్న
సోగసేమి ? ద్రౌపదికి మాన భంగము చేయవలయునని దుర్యోధనా
దుల యూహ. మానభంగమనఁగానేమి ? ఇచట విచారణ చేయవ
లెను. వస్త్రము ధరించినందువలన శరీరావయవములు కప్పఁబడునని
యనుకొందుము. కప్పఁబడుట యనఁగ నొక వస్తువు యొక్క స్వరూ
పజ్ఞాన మేర్పడకుండ నుండుట. శరీరము యొక్క నగ్నత్వ మనఁగా
శరీరాంశములను భాసించుట. మనకొక వస్తువు కనిపించుచున్న
దనఁగా నా వస్తువుయొక్క యవధిభూతములయిన రేఖలు సువిస్పష్ట
ముగాఁ గనిపించుటయే. ఒక పేటికను జూచితిమి. ఒక ఘటమును
జూచితిమి. మఱి యింకొక వస్తువును జూచితిమి. తద్వస్తువు యొక్క
లోపలి భాగమును జూడలేదు. దాని పై యంచులనుఁ జూచితిమి.
ఈ యంచులు రేఖలు. దృష్టికిఁ గనిపించునది రేఖ. అందుచేతనే చిత్ర
కారుఁడు రేఖలలో మనకు వస్తుదర్శన మీయ గలఁడు. వస్త్రముచేత
శరీరాంచల రేఖలు కప్పఁబడును. అపుడు శరీరము వస్త్రాచ్ఛాదితమైన
దని చెప్పెదము. అంచల రేఖలు విస్పష్టముగా భాసించుచు దాని
పయిన వస్త్రమున్నను వస్తువు వస్తువుగా భాసించును. కొందఱు
పెట్టెలకు మాసిపోకుండఁ బైన గుడ్డలు వేసి కుట్టింతురు. పెట్టెకనిపించు
చునే యుండును. ఆ పెట్టె కనిపించుటలేదు. పెట్టెయని గుర్తు పట్టుటకు
వీలులేదని చెప్పుటకు వీలులేదు. పురుషులు వస్త్రములు ధరించుట ఈ
ప్రయోజనము కొఱకు. శరీరాంచల రేఖలు భాసించకుండ ముడుత
లతోఁ గుచ్చెళ్ళతో, మడతలతో వస్త్రములు ధరించుట పేరు
వస్త్రము ధరించుట. నగ్నత లేకుండ జేయుట. శరీరము నంటుకొని
యున్న వస్త్రము నగ్నత రక్షించదు. అందుచేతఁ బాశ్చాత్యులు
వేయు దుస్తులు నగ్నతను సరిగా రక్షించవు. అది యనాగరకమైన

వేషము. భారతీయులు కుచ్చెళ్ళు పెట్టుకొని కట్టెడు ధోవతి పరమ నాగరికమైన వేషము.

అట్టి కుచ్చెళ్ళు, నట్టిమడతలు, - నేది తొలఁగినను నగ్నత భాసించును. ద్రౌపది ధరించిన చీర యామె యొక్క నగ్నతను రక్షిం చునదిగా నున్నది. దుశ్శాసనుఁడొక చీర తీసిన తరువాత మఱియొక చీర యచట భాసించినచో నది తొలఁగి యిది వచ్చులోన నగ్నత భాసించును. గాలిచేత చీర తొలఁగినప్పుడే వేణీసంహారమున దుర్యోధ నుఁడు భానుమతీ విషయమున నాటకాంగమైన గండము నిక్షేపించు స్థలములో నూరు ప్రస్తావన చేసెను. అది నగ్నత. నగ్నత రేఖా మాత్రమున భాసించినను ద్రౌపదికి పరాభవము జరిగినట్లే. అందుక నియే "మున్నపనీతమైన తద్వస్త్రమ్మునట్టి వలువ" యని చెప్పుట నానారాగ విరాములైన వసనములైనచో నొలిచిన వలువకు మఱల మొలిచిన వలువకు భేదమేర్పడి నగ్నతా భ్రాంతి కలుగ వచ్చును. తద్వస్త్రము నట్టి వలువ యనుటచేత నొకవలువ యొలువఁబడినది లేదు. మఱియొక వలువ, తత్స్థానీయమైనది. మొలిచినట్లు లేదు. నగ్న త లేదు. సరికదా నగ్నతా భ్రాంతికూడ లేదు. ఇది యాశ్చర్యమైన రచన. నన్నయగారీ విషయము నంత పరమ సూక్ష్మముగా విచారించి, యామాటల నచ్చటఁ బొదివెను. పరమేశ్వరానుగ్రహ మున్నచో నింత పరా భద్రమైన స్థితి యేర్పడుటయే. నగ్నతయనఁగా నేమి ? యన్న విషయము బహుముఖములుగా విచారించిన మహామేధావాలి కాని యిట్లు వ్రాయలేఁడు. పాశ్చాత్య దేశములోఁ గొందఱు స్త్రీలు నగ్న నృత్యమును చేయుదురు. వారు నిజముగా నగ్నలు కారు. శరీర వర్ణము వంటి వర్ణము కలిగిన సన్నని బనియను లాపాద మస్త కము తొడిగి కొనెదరట. ఐనను దానికి నగ్న నృత్యమని పేరు. ఎందు చేత? శరీరాంచలరేఖలు సువిస్పష్టముగాఁ గనుపించును. కనుక, అది

నగ్నతయొక్క స్వరూపము. దానినిఁ దెలిపిన నన్నయగారు ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టము నిట్లు రచించినారు. ఇది నిజమైన వర్ణన. ఇట్టి వర్ణన చేయఁగలవాఁడు కవి. వసంతకాలము వచ్చినది; పూవులు పూచినవి; కోకిలలు కూసినవి; చివుళ్ళెత్తఁబడినవి; సన్నని గాలి వీచినది-ఇదియు వర్ణమే. మధురమైన శబ్దములతో నీ మాత్రమైన వర్ణన చేసినవాఁడు గూడ మహాకవి యని చెప్పఁబడుట మహాకవిత్వ మెట్టిదో తెలియక పోవుట.

ఇట్లు బహు స్థలములయందు నన్నయగారు తాను లోకోత్తరములయిన విషయములను మననము చేసే, తన కావ్యము నందు నిక్షేపించినాఁడు.

ఇది స్థూలముగా నన్నయగారు మహాకవి యగుట చెప్పుట యైనది. ఆయన మహాశిల్పికూడను. అట్టి శిల్పము నాన్యతో దర్శనీయము. శిల్పము కథా గతమైయుండును. కథను రచించుటలోఁ గథయొక్క పౌర్వాపర్యములు విచారించి కథయొక్క యాయువు పట్టులు తెలిసికొని యవి సువ్యక్తమగుటకుఁ గొన్ని మెలఁకువలుపయోగించుట శిల్పమని చెప్పవచ్చును. దానికిఁగూడ రెండుదాహరణములు చూపించెదను. శకుంతలోపాఖ్యానమున్నది. ఇది భారతములోని కథ. ఈ కథను గవికుల గురువైన కాళిదాసు తీసికొని, దాని కవధిభూతమైన మెఱుఁగులు చేసి వదలిపెట్టెను. ఆ కథను మఱి యెవ్వఁడును ముట్టికొనుటకు వీలులేదు. అట్టికథను భారతము తెలుఁగులోఁ జేయుట కారంభించిన నన్నయగారు వ్రాయక తప్పదు. యథామూలముగ వ్రాసినచో దోషమేమిలేదు. కాని కథలు మార్చి మెఱుఁగులు చూపవలెనన్న దృష్టితో వ్రాసెడు కవికిఁ గష్టమగును. నన్నయగారు వ్యాసుఁడు వ్రాసిన కథల కన్నింటికి మెఱుఁగులు దిద్దినవాఁడు ఇంక మెఱుఁగులు దిద్దుటకు వీలులేదన్నట్లు కాళిదాసు వ్రాసిన శకుంతల

కథలో మెఱుఁగులు దిద్దవలసి వచ్చినది. ఇందులో రెండు మెఱుఁగులు చేసెను. మొదటిది; శకుంతలా పాత్రపోషణము కాళిదాసు. తన మహాధ్వని మయమైన కావ్యములో రసదృష్టితో వెళ్ళినాఁడు. కనుక శకుంతలా పాత్రమును, రసదృష్టితోఁదీర్చినాఁడు. కాని పాత్ర సృష్టితోఁ దీర్చలేదు. నన్నయగారికది వీలిచ్చినది. ఆయన శకుంతలనుఁ జిత్రముగా దీర్చినాడు. నన్నయగారు స్త్రీ పాత్రలను సృష్టించుటలో నందె వేసినచేయి. ఇక్కడ నది ప్రస్తుతము కాదు. కథను నడపుటలో నాయన చూపిన శిల్పమును గదా చెప్పవలయును. దుష్యంతుఁడు కణ్వాశ్రమమునకు బోయెను. శకుంతలను జూచెను. ఆమెయందతని మనస్సు తగుల్కొన్నది. ఆమె బ్రాహ్మణకన్యయని యనుమానము. అంతట సత్పురుషుఁడైన దుష్యంత మహారాజునకుఁదనకు వివాహమైనగాని స్త్రీయందు మనస్సు లగించదు. ఇది సత్పురుష లక్షణము. సత్పురుషుని యొక్క మనస్సు ధర్మేతర విషయము నందుఁ బ్రవర్తించదు. ధర్మేతరమైన యూహయే యతనికి రాదు. అందుకనియే కాళిదాసు యొక్క దుష్యంతుఁడు తనకుఁగలిగిన సందేహమునుఁ దన యంతఃకరణ ప్రవృత్తి యొక్క సాక్ష్యము వలనఁదానే దొలఁగించుకొనెను." అసంశయం క్షత్రపరిగ్రహక్షమాయదేతదస్యా మభిలాషి మే మనః సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" తాను సత్పురుషుఁడగుటచేఁ దన యంతఃకరణ ప్రవృత్తి తప్పుదారులను బోదుకనుకఁ దన మనస్సు శకుంతల మీఁదఁ దగులు కొన్నది. కనుక నామె తప్పకుండ క్షత్ర పరిగ్రహయోగ్య యని నిర్ణయించుకొనెను. దీనిని నన్నయగారు—

"ఇది మునికన్యయేని మఱి యేలొకొ యీ లలితాంగియందు నా హృదయము తద్దయుం దవిలె నిప్పలు కెంతయు నమ్మనేజనమ్మెద" నని మాత్రము వ్రాసి వదలి పెట్టిరి. కాళిదాసువలె హేతువు చెప్పలేదు. కాళిదాసు చెప్పిన హేతువిచ్చుట ననుమీయమాన మగుచు

న్నది. ధ్వనితమగుచున్నది. తాను కాళిదాసు తరువాత వ్రాసిన నాఁడు కావున నన్నయగారీ విశేషము నిందు జేసెను కాళిదాసు ననుసరించెను కాని నూతన కవితాగుణ సంధానము చేసెను.

నన్నయగారి శిల్పమిదికాదు. ఈ రీతిగా శకుంతలనుఁ జూచి దుష్యంతుడు సందేహ పడినాఁడు. ఆమె క్షత్ర పరిగ్రహయోగ్యయని నిర్ణయింపఁబడిన తరువాతఁ గదా కథ సాగును. కనుక నిదియొక క్లిష్ట ఘట్టము. కథయారంభించి యొక ధర్మ సందేహము వచ్చి, కథా ప్రస్తారము నిలిచిపోయినది. ఆ సందేహము నివర్తింపఁబడిన తరువాతఁ గాని మఱలఁ గథ యందుకొనదు. ఇది రసప్రవాహము కట్ట నిలిచి పోయిన ఘట్టము. దీనిచేతఁ బాఠకుని బుద్ధి రసమునుండి మఱలును. ధర్మవిషయమునఁ బ్రవర్తించును. మఱల రసము నందుకొను వేళకు బుద్ధి పరిత్రస్తమయి పోవును. పాఠకుని బుద్ధియందుఁ గలుగు నీ మార్పును సరిదిద్దుకొనుట మహాకవి తన శిల్పముచేతఁ జేయ వలయును. శకుంతల తన జన్మ వృత్తాంతమును జెప్పెను. ఈ సందియము నివృతమైనది. ఇప్పుడు శకుంతలను జూచినవేళ దుష్యంతునకుఁ గలిగిన కోరిక నందిపుచ్చుకొని కథ నడువలయును. కవి యా కోరికకును సేతు బంధము కట్టవలయును. వంతెన కట్టుట యనఁగా గాలువకు రెండు వైపుల రెండు పెద్ద స్తంభములను నిర్మింప వలయును. ఆ రెండు స్తంభములు సమానమయినవి. ఒకటే రీతిగ నుండును. నిర్మాణ పద్ధతి యందధిక సామ్యముండును. ఈ శకుంతలా జన్మవృత్తాంత కథా ప్రవాహమునకు రెండు సమానములయిన స్తంభములను ననఁగా బద్యములను వ్రాయుట యొక మహాశిల్పి లక్షణము.

ఇది మునికన్యయేని మఱి యేలొకో యీ లలితాంగి యందునా
హృదయము తద్దయుం దగిలె నిప్పలు కింకను నమ్మనేఱ న

య్యెద విజితేంద్రియుండనఁగ నమ్మునిఁ బాయక విందు
సంచుఁ దా
నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్ ॥

ఇది మునినాథ కన్యయని యెంతయు నిస్పృహ వృత్తినున్న నా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిఁగించిన న్మదన బాణ పరంపర కిప్పుడుండ నా
స్పదమయి సంచలించె నళిపాత వికంపిత పంకజాకృతిన్॥

ఇవి రెండును రెండు మహాస్తంభములు. అవాంతర కథా ప్రవాహసేతు నిబంధకములు. ఇది యొక మహాశిల్ప లక్షణము. కథలో నున్న యీ ఘట్టము యొక్క సువిస్పష్టమైన విభాగము తెలిసినఁగాని యిట్టి నిర్మాణము కవిచేయలేఁడు. ఇది మహాకవియే చేయఁగలఁడు. ఇట్లు చేసినవాఁడే మహాకవి.

మఱి యింకొక మహాశిల్ప విషయమును జూపించెదను. పాండవులను జూదమాడుటకు విదురుఁడు పిలిచికొని వచ్చెను. పాండవులు వచ్చిరి. వారును, వీరును దగ్గఱి చుట్టములు, మనసులలో వైరమున్నను, పై పరామరికలకు లోపముండదుగదా. ఈ పరామర్శలు జరిగెను. ఇక్కడ నుండి కౌరవ పాండవులు జూదమాడుట, ద్రౌపదీ వస్త్రాపహరణము, ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరములిచ్చుట- యీ మొదలయిన కథలు జరుగును. ఈ కథలోని ప్రధాన విషయము ద్రౌపది యొక్క పరాభవము. రాజు లెంతమంది జూదమాడరాదు. ఓడిపోరాదు. ఈ జూదములోనున్న విశేషము ద్రౌపదీ పరాభవము. ఇట్టికథ యెందును జరుగలేదు, జరుగదు. కనుక నీ కథలో ద్రౌపది ప్రధాన పాత్ర వహించును. ఒక్క పరాభవము పొందుటచేతనేగాదు పాండవులకుఁ దిరిగి రాజ్యప్రాప్తి కలుగుటకు ఆమెయే హేతువు. ఇంత కును దుర్యోధనాదుల కోపమంతయు ద్రౌపదిమీాద నున్నది. ఆమె

యైదుగురి భార్య యగుట నామె యందుఁ బరులకు వాంఛ కలుగుట హేతువైనది. ఆమె సర్వజన సామాన్య కావలయును, గాని పాండవులకు భార్యయేమి? అందులోఁ బతివ్రతయేమి? మహారాణి యేమి? ఇవి యన్నియుఁ బైకి జెప్పని దుర్యోధనాదుల మనసులలోని యూహలు. మాత్సర్యము చమత్కారమైనది. ఈ మాత్సర్యము ద్రౌపదీ విషయమునఁ గౌరవులకే కాదు; కౌరవుల భార్యలకుఁ గూడఁ గలదు.

ఈ సర్వ విషయములచేతఁ బాండవ కౌరవ ద్యూత కథా సౌధ మూలస్తంభము ద్రౌపది. ఇది నన్నయ్యగారు చేసిన నిర్ణయము. అందుచేత నీ కథ యొక్క యాద్యంతములందు నన్నయ్యగారు ద్రౌపదిని నిక్షేపించిరి. గాంధారి కోడండ్రు

అఖిల లావణ్య పుంజంబు నబ్జభవుఁడు
మెలఁతగా దీనియందు నిర్మించె నొక్క-
కాని నాఁడిట్టి కాంతి యే కాంతలందు
నేల లేదని సామర్ష హృదయలైరి ॥

ఆమె యొక్క లావణ్యమును జూచి కౌరవుల భార్యలు చుప్పనాతి తనమును బొందిరి. నన్నయ్యగారు వాడిన శబ్దము లావణ్యము, సౌందర్యము కాదు. లావణ్యశబ్దమునకు సౌందర్యమని సామాన్యముగా నర్థము చెప్పినను నిజమైన యర్థమది కాదు. లవణముయొక్క భావము లావణ్యము. రాతి ఉప్పు పగులగొట్టినచో, బలకలు పలకలుగా నుండును. ఒక ద్రవ్యము పలకలు పలకలుగా నున్నపుడు, నది స్నిగ్ధమైన వస్తువైనపుడు దానిమీద సూర్యకిరణ ప్రసారము జరిగి యది తళతళలాడును. ఆమెఱుపు లావణ్యము, స్త్రీయొక్క శరీరచ్ఛాయయు, స్నిగ్ధత్వమును, బోషణచేత వచ్చిన సౌకుమార్యమును, నైగనిగ్యమును – నివి యన్నియు లావణ్య మనిపించుకొనును. అట్టి లావణ్యము

ద్రౌపదీ శరీరమందు కౌరవుల భార్యలు మాత్సర్యము వహించుటకు నంతగా నుండెను. అందుచేతవారు మత్సరము పడిరి. వారందఱు నా రాత్రి తమ భర్తలందఱితో నామెయొక్క యీ భోగవైశిష్ట్యమును గూర్చి చెప్పి యుందురు. వారందఱకు ద్రౌపది యన్నచో జుష్పనాతితనము బలిసినది. మఱునాఁడు జరుగఁబోవు నధర్మమునకు సందఱును హర్షించిరి. ఇంత ప్రయోజనకారిగా నన్నయగారీ పద్యము నిచట నిక్షేపించిరి. ఒక్క ద్యూతకథా మూల స్తంభమగుటయే కాదు. అట్టి మూల స్తంభమగుటకుఁ బ్రధాన కారణమయిన ద్రౌపది యందలి లక్షణములు, నా లక్షణములు వారి మాత్సర్యమునకు హేతువులు, నా మాత్సర్యము ద్రౌపది పరాభవము హర్షించుటకు హేతువులు. ఈ రీతిగా నన్నయగారు ద్యూతకథా మహాభవన మూల స్తంభమయిన ద్రౌపదినిఁ దొట్టదొలుత స్థాపించి, తరువాత ద్యూతకథలోనికి వెళ్ళిరి. మఱియు నీ ద్యూత కథావసానము ద్రౌపది ఆమెకు ధృతరాష్ట్రుడిచ్చిన వరములచేతనే యీవిచిత్రద్యూతకథల మహావైపరీత్యము మఱియొక త్రోవ పట్టినది. ఆ వరము లీయకున్నచో భారతకథ యేమియయ్యెడిది? పాండవులు బ్రతికినన్నాళ్ళు కౌరవదాసులుగా నుండిపోదురా! ఉండిపోయెడివారు. భారతకథయే లేదు. పాండవులు దాసులై యుండి కౌరవులతో యుద్ధము చేయుదురా! ఇది యొక చిత్రమైన సమస్య. ఆ సమస్య సమాధానములేని సమస్య. ద్రౌపదిచేతఁ బరిష్కరించ బడినది. ఈ రీతిగా ద్రౌపది భారతకథలో నున్న యనేకములయిన కథా ప్రవాహ భంజకములయిన ఘట్టములలోఁ గథ సాగించిన యొక సహకారిణి. ఈ ఘట్టమునందు ద్రౌపది యొక్క ప్రాధాన్యమిట్టిది. దానినిఁ దెలిసికొని నన్నయగారు రచన చేసిరి. మహాకవి తాను వ్రాసెడి కథయొక్క స్వరూపము తెలిసికొని వ్రాయును. ఆ కథాగత సమస్యలనుఁ బరిష్కరించును. ఆ పరిష్కరించిన వైఖరి

ఘట్టములుగాఁ గనిపించును. ఆ ఘట్టములు మనకు సువ్యక్తములుగా నుండును. వానియొక్క సువ్యక్తత చేతనే పాఠకులకు మహాకవిచేసిన కథానిర్ణయము తెలియును. అవి సువ్యక్త మగుటకుఁ గవి నిరూపించిన విషయములు శిల్ప తీర్థములు.

ఈ కథావసానమునందు మఱల నన్నయగారిట్లు వ్రాసెను.

తరలము : తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రుల దైన భీ
కర పరస్పర కోప వేగము గన్నఁ జూచి విపత్తి సా
గర నిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశ కీర్తుల ధీరులం
బురుష సింహములన్ నిజేశులఁబూని దద్దయుఁబ్రీతితోన్॥

ఈ రెండు పద్యములచేత ద్యూత కథ యంతయు నెట్లు ద్రౌపది మీఁద నాధారపడి యున్నదో, భారతకథా ప్రవాహములో నిది యెటువంటి ఘట్టమో నన్నయగారు నిరూపించిరి. ఈ రెండును నన్నయగారి మహాశిల్పమున కుదాహరణములు. మఱియు నన్నయ్య గారు తన తెలుఁగు సేఁతలో ననంతములయిన సౌందర్యములు చేయుదురు. ఆంధ్రభాష కుజ్జీవన హేతువులయిన కొంత రచన చేయుదురు.

ఆహుతం చాగ్ని హోత్రం తే సూర్యశ్చాస్తంగతః ప్రభో
అగోపాశ్చాగతా గావః కచస్త్వాత నదృశ్యతే॥

ఇందులోఁ 'సూర్యశ్చాస్తంగతః' అన్నమాటను దీసికొని 'వాడిమయూఖముల్ గలుగువాఁడపరాంబుధిఁ గ్రుంకె'నని తెలుఁగు సేయఁబడెను. సూర్యునకు 'వాఁడి మయూఖముల్గలువాఁడు' అని తెలుఁగుసేత తరువాత వచ్చిన సర్వాంధ్ర కవులకు భావముచేఁత, తెలుఁగు భాషలో మెలఁకువతనముచేతఁ దెలుగు భాషయొక్క వ్యాకరణ విషయ మొకదానిని బోధించుటచేతఁ, బద్య మెత్తుగడలోని సొగసుచేత నాచార్యకముగా నున్నది. తరువాత నెందరో కవులిట్టి కూర్పులు కూర్చిరి. కాని యుపదేష్ట నన్నయగారు! వాడిమయూ

ఖముల్’ అన్న సమాసము లాక్షణికులచేత నుదాహరణముగాఁ జేకొనబడినది. ఇట్టి వెన్నియో నన్నయగారి యందుఁగలవు. తక్కిన కవులకు భాష స్వాధీనమగుటకుఁ గారణము నన్నయ్యగారు భాష స్వాధీనపడుటకు వేసిపోయిన రహదారులు. అట్టి వేలకొలఁదిఁ మార్గములలో నిది యొక్కటి.

వ్యాసుఁడు ప్రధానముగాఁ గథనుఁ జెప్పికొనుచుఁ బోవుచు. భారతము విష్ణు పారమ్య బోధకమయిన గ్రంథము. శ్రీకృష్ణుని యొక్క పరమేశ్వరత్వ స్థాపనము వీలయిన చోటులనెల్లఁ జేయఁబడు చుండును. నన్నయ్యగారు భారతకథమీఁద ప్రధానముగా దృష్టికల వాఁడు. అందుకనియే ‘కథాకవితార్థయుక్తిలో నారసి మేలునా’ నని వ్రాసినాఁడు. భారతకథలోనున్న రమణీయత్వ మాయనకుఁ బ్రధానము. ఆ కథలోని రహస్యము లెత్తి చూపించుట యాయనకుఁ బ్రధానము. అందుచేత మూల కథలో నున్న యద్భుతత్వము విష్ణు మాహాత్మ్యము. పువ్వుల వానలు కురియుట మొదలయిన వానినిఁ బరిహరించును. రాజసూయయాగ సందర్భమున భీష్ముడు కృష్ణుని యొక్క పరమేశ్వరత్వమును మిక్కిలిగా నుపన్యసించిన యనంతరమున సహదేవునకుఁ గోపమువచ్చి యీ క్రింది రీతిగా ననెను.

కేశవం కేశి హంతార మప్రమేయ పరాక్రమం
పూజ్యమానం మయా యోనః కృష్ణం న సహతే నృపః॥
సర్వేషాం బలినా మూర్ధ్ని మయేదం నిహితం పదం
ఏవ ముక్తే మయా సమ్య గుత్తరం ప్రబ్రవీతునః॥
మానినాం బలినాం రాజ్ఞాం మధ్యే వై దర్శితే పదే
తతోఽపత త్పుష్ప వృష్టి సహదేవస్య మూర్ధని॥

మానుల యొక్కయు, బలవంతులయిన రాజులయొక్కయు నడుమ సహదేవుఁడు తన పాదమునెత్తి చూపించఁగా సహదేవుని శిరస్సుమీఁద బుష్పవృష్టి కురిసెను. దీని నన్నయగారిట్లు దెనిఁగించిరి.

ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన దీనికే మొడం
బడమని దుర్జనత్వమునఁ బల్కెడి వీరుల మస్తకంబుపై
నిడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభ న్సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదు ల్పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై॥

తెలుఁగు సేఁతలోఁ బుష్పవృష్టి ప్రసక్తియే లేదు. సభలోనున్న వారందఱు భయఁపడి, పలుకకుండ నూరకుండిరని వ్రాయఁబడెను. సహదేవుఁడు పాండవులలో నందఱికంటెఁ జిన్నవాఁడు. అన్నగారల కతఁడన్నచో ముద్దు. పట్టరానంత ప్రేమ. అతని మీఁద నీఁగ వ్రాల నీయరు. ఒకవేళ నెవఁడయిన భీమార్జునుల చేతుల నెదిరించి బ్రతికిపోవచ్చునేమోగాని సహదేవు నేమైన జేసినచో భీమార్జునులలో వాని మృతి తథ్యము. ఈ భ్రాతృ వాత్సల్యము, నీలోక స్వభావము దీనియందు ధ్వనితమగుచున్నది. పాండవుల పరాక్రమము దీనియందలి మహాధ్వని కనుక నన్నయగారి కథాంశముల మీఁద నున్నంత సృష్టిమతము మీఁద, వేదములమీఁద, దేవతల మహత్త్వముమీఁద లేదు. ఈ పద్యము నందు మఱియొక విశేషమున్నది. నన్నయగారు రసభావ వేత్త, ఈ సహదేవుని కోపము శిశుపాలవధ కథలో నున్న యొక చిన్న యవాంతర విషయము. ఈ కోపమును పెంచి వ్రాయవచ్చును. వ్రాసినచోఁ బ్రధాన కథకు మొప్పము జరుగును. కవితాను ప్రవేశ పెట్టు నవాంతర రసములు కథ నడుమగల చిన్నిచిన్ని సన్నివేశములు ప్రధాన కథా భంగకారులు కాకుండఁ జూచుకొనవలయును. సహదేవుని కోప మీ పద్యమునందు మొదటి మూఁడు చరణములందే కలదు. ఆ మూఁడు చరణములందు రౌద్రరసము భాసించినను సభికులు పొందిన భయమునకు నీ రౌద్ర రసమంగమై చెడిపోవుచున్నది. రౌద్రరసమునకు వ్యక్తిత్వము లేదు. సభలో నున్నవారి భయమున కది యంగమగుటచేత దాని యాయుర్దాయము స్వల్పము. ఈ సహ

దేవుని రౌద్రము పాండవుల పరాక్రమాతిశయమునకు దోహదమగు చున్నది. కాని స్వయం వ్యక్తిని సంపాదించుకొనుటలేదు. మఱియు నిచ్చట శ్రీకృష్ణుని పరమేశ్వరత్వము కంటెఁ బాండవుల పరాక్రమాతిశయమే ప్రధానమయినదిగా నేర్పడుచున్నది. ఇది రస దృష్టితోఁ జేసెడు కథారచన. నన్నయ సర్వరచనయందు నీ మహాలక్షణము భాసిచుచుండును. ఇది యంశతః చూడఁ దగినది.

నేఁటి కాలమునఁ జాలమంది నన్నయగారియందు దోషము చూపించుచున్నారు. ఈ దోషములు చూపింపఁబోవుట యెందులకో తెలియదు. ఇందుచేత మఱి యితర కవులు గొప్పవారనుటకో, కొన్ని దురభిమానములు పురస్కరించుకొనియో తెలియదు. సారస్వత శ్రీకి కవితారసానుభవము ననేకావరణములు దాటినచోఁ బొందఁ దగినది. ఈ యభిమానాదులు ఆవరణములు. వీనిని దాఁటిన గాని రసానందము లేదు. ఎవఁ డావరణము చుట్టు తిరుగుచుండునో నాఁడు లోనికిఁ బ్రవేశించుట జరుగదు గదా. ఒకప్పుడొక మిత్రునితో నీ క్రింది పద్యమును గూర్చి కొంత చర్చ జరిగినది. ఆమిత్రుఁడు గొప్ప పండితుఁడు; భావుకుఁడు. ఆయిన యన్నచో నాకుఁ జాల గౌరవము. గౌరవమే కాదు బంధువు వంటి వాఁడు. కాని యాయనకు నన్నయగారి రచన యెక్కువ నచ్చదు. దానికెవరేమి చేయఁగలుగుదురు. ఒక దృష్టితోఁ జూచిన నొకకవి యాధిక్యము తెలియఁగలదు. ఒక కవి యాధిక్యము తెలిసికొనుటకుఁ గావలసిన దృష్టి యొకనికిఁ బరమేశ్వరుఁడు ప్రసాదించక పోయినచో నదియేమి యౌషధమో సూదులతో నెక్కించుటకు? ఆ పద్యమిది—

అవిరళ సూర్య మండల సహస్ర సమ ప్రభమై ధనంజయ
ప్రవరు కరమ్మునన్ వెలుఁగు పాశుపతాస్త్రముఁ జూచి
దైత్యదా

నవ సుర యక్ష రాక్షస గణమ్ము భయమ్ము నందె నం
దవనియు దిర్దిరం దిరిగె నబ్ధి శిలోచ్చయ సంచయంబుతోన్ ॥

ధనంజయ ప్రవరుఁడు. ధనంజయుఁడనఁగా నర్జునుఁడు. ఈ పేరు మీఁద శ్రేష్ఠ వాచకము వేయుట తప్పని యా మిత్రుఁడనెను. అదిసరికాదు. ధనుంజయశబ్దమునకు రెండర్థములు కలవు. అగ్నిహోత్రుఁడు నర్జునుఁడునని. ఈ యిద్దఱిలోనే శ్రేష్ఠుఁడని యిక్కడ నర్థము. అర్జునుని ధనంజయ ప్రవరుఁడనుటలో మఱియు నెంతో యర్థ సంపత్తి కలదు. ఇద్దఱును గాండివధారులు. గాండివము పితృహోత్రుని చేతిలో కంటె నర్జునుని చేతిలోనుండి యధిక వైశిష్ట్యమును సంపాదించుకొన్నది. ఆ అగ్నిహోత్రుఁడే తన వ్యాధి నివారణము కొఱకుఁ ఖాండవవన దహనము కొఱకు నర్జును నాశ్రయించెను. అగ్నిహోత్రుఁడు పాశుపతాస్త్రమెఱుఁగఁడు. ఈ రీతిగా నతఁడు ధనంజయ ప్రవరుఁడు.

కరమ్మున న్వెలుఁగు పాశుపతాస్త్రము. అస్త్రమనఁగా మంత్రము. అది చేతిలోఁ బ్రకాశించుటయేమి? లోకములో 'వాని చేతిలో నా విద్య యున్నది. యందుము ఆ విద్యవానికి వశమైన దని లక్షణార్థము. ఈ యర్థములోఁ దెలుఁగు జాతి వాడుకొను నట్లు రమణీయార్థ ప్రతిపాదకముగా నన్నయగారు దీనిని వాడిరి.

"దైత్య దానవ సుర యక్ష రాక్షస గణమ్ము కరమ్ము భయమ్ము నొందె" ఇచ్చట గణమ్ము కరమ్ము భయమ్ము నన్నయు కారసహిత ద్విత్వమకార సంఘటిత వృత్త్యనుప్రాసముచేత భీత్యతిశయము వ్యజ్యమాన మగుచున్నది. ఇది రచనా శిల్పములోని రహస్యము. దీనినిఁ జాలమంది చూడలేరు. ఏదో పద్యము ఎరిగిన దనుకొందుము.

అందవనియు దిర్దిరం దిరిగె? ఆ మిత్రుఁడు – ఇచ్చట నున్న 'అందు' అన్నమాట కర్థము లేదనెను. ఇట్లే నన్నయ యన్వయములేని మాటలువేయు ననెను. నేను కాదని చెప్పితిని.

నన్నయగారి రచన తెలుఁగు వారు మాటాడుకొను నట్లుండును. ఆ మాటలలోని గడుసుఁదన మంతయు బాదుగఁ బట్టియుండును.

లోకములో మన మిట్లందుము. 'వానికింత పలుకుబడియున్నది. వాఁడు తనినిఁ బోయి యాశ్రయించును. ఇతనిచేతఁ బని చేయించుకొనగలఁడు. వాని కెంత కుమ్మక్కు కలదు. ఇంత మద్దత్తు కలదు ఈ విషయములో మనము వాని నేమియుఁ జేయలేము' ఈ విషయములో ననఁగా నీ పరిస్థితుల యందు – అని యర్థము. ఇక్కడ 'నందు' అన్న మాటయే దత్తర్థకము.

ఒక కవి యొక్క కవిత చదువుటకు సానుభూతి కావలయును. రెండవది బహు విషయములను సంయోజన పఱచుకొనవలయును. 'తాను వలచినదియే రంభ. తాను మునిఁగినదియే గంగ' కావలయును.

నన్నయ్యగారు అచ్చముగాఁ దెలుఁగు వారు మాటాడుకొను నట్లే వ్రాయును. అందులో రచనా శిల్పమును బాదువును శకుని దుర్యోధనునితోఁ జెప్పుచున్నాఁడు.

సీ॥ "నాగా రథాశ్వ సన్నాహ మొనర్పక యొద్దణంబులు తీర్పకుభయ సైన్య
విరుల కరముల వివిధాయుధమ్ముల నన్యోన్య సంఘట్ట నారవంబు
లెసఁగంగ సంగ్రామ మేర్పడజేయక యక్షముల్ సోలిచి నేనక్రమమునఁ
బ్రతిపక్షతతుల సంపదలు జయించి నీకిచ్చెద వగవంగ నేల;"

ఈ పద్యములోని రచన యొక విలక్షణమైనది. అంత కష్ట మెందుకు ?

ఈ పని సులబముగాఁ జేసి పెట్టెదను, అని లోకమునం దెవడయి నను జెప్పునపుడు ఆ కష్టమును విస్తరించి చెప్పుటలో అందులో నున్న మెలికలు తెలియఁ జేయుచు, దానిలోనున్న వైదర్భ్యము స్ఫుటపడు

నట్లు చెప్పుదురు. ఇచ్చట నా వైదగ్ధ్యము రెండు సైన్యములలోని వీరులు చేతులలోని యనేకాయుధము లొక దానిలో నొకటి కొట్టు కొనుట చేతఁ గలిగెడు ధ్వనులు విజృంభింపఁగా యుద్ధము లేకుండ నని చెప్పుట మిక్కిలిలోక సహజము; ఆ యుద్ధములో జరిగెడి మహా ఘోర విషయము లేమియుఁ జెప్ప లేదు. అపరిధానమైన కత్తుల రాపి ళ్ళవలనఁ కలిగెడి ధ్వని మాత్రమే చెప్పెను. ఇదియొక చమత్కార మైన రచన. నన్నయ్యగార నేక విధములయిన రచలు చేయును. తరు వాత వచ్చిన సర్వార్థ మహా కవులకు నాయన పెట్టిన భిక్షయే. అందుకనియే యాంధ్రభాషలో నాధునిక యుగమునఁ కవికుల గురువు లయిన (శ్రీ) తిరుపతి వేంకటేశ్వరులు—

"నన్నయకవి పెట్టినాఁడు కదా తిక్కనాది కవుల కాది భిక్ష"

అని వ్రాసినారు. ఈ యాదభిక్ష యెట్టిదియో చూతము. నన్నయగారిలోనొక విలక్షణమైన రచన యున్నది. ఆ రచనా పద్ధతినిఁ దీసికొని తిక్కన్నగారు దానినిఁ బెంచికొని యొక ప్రత్యేక శైలిగా వృద్ధి పొందించుకొన్నారు. తిక్కన గారి శైలి నన్నయగారి నుండి గ్రహించినదే, ననయ్యగారా శైలినిఁ గొన్ని కొన్ని చోట్ల నుపయో గించుచు వచ్చిరి. సామాన్యముగా ధర్మములు చెప్పునప్పుడు పొడిపొడి మాటలతో నన్నయగారు వ్రాయుదురు.

కం॥ ధీరమతి యుతుల తోడ వి
చారము సేయునది మును విచారిత పూర్వ
ప్రారబ్ధమైన కావ్యము
పారము బొందును విఘాత పద దూరంబై

క॥ జనపాలుఁడు మృదు కర్మం
బున నైనను క్రూర కర్మమున నైనను నే
ర్పున నుద్ధరించునది ద
న్నన పాయత బొంది చేయునది ధర్మమ్మల్

కం॥ తఱియగు నంతకు రిపుఁదన
యుఱకటఁ బెట్టుకొని యుండునది తఱి యగుడున్
చెఱచునది ఱాతి మీఁదను
వఱలగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్

ఉ॥ ఇమ్మహిం నీవుఁ బాండవులు నెప్పటియట్లు పరస్పరానురా
గమ్మున నేలుచున్కి యిది కార్యము పాండవలక్ష్మి నీ కస
హ్యమ్మన నేల వంచనఁ బరార్థ పరిగ్రహ బుద్ధిఁ జేసి పా
పమ్మగుఁ బాపకారులకుఁ బొయు నవశ్యము సర్వధర్మముల్.

ఆ. వె॥ అల్పుఁడయ్యు మనుజుఁడతి పరాక్రమమున
పేర్మిఁదర తరంబ పెరుగుచున్న
వాఁడు క్రమాని మొదలి వల్మీకమా క్రమానిఁ
జెఱచునట్లు గడఁగి చెఱచుఁ బగఱ.

కం॥ వన గతులని వారలపై
చని భంగము పొందిరాఁగ సమకట్టెడు నీ
తనయుఁడు గావున నీ వా
తని వారింపు మది యనుచితంబని నెమ్మిన్

కం॥ విను నీవును గురుఁడును శాం
తనవుఁడు విదురుండు నుండి తగు నయధర్మం
బున నీ యుపేక్ష నసయం
బునుఁ బాండవ విగ్రహంబు బుట్టుట లగ్గే.

ఇట్టి పద్యములు నన్నయగారిలో వందలు కలవు. ఇది యొక శైలి. ఈ శైలిని నన్నయ కొన్ని భావములు చెప్పుటకు నుపయోగించెను. దీనిని దీసికొని తిక్కన్నగారు సర్వదా యది తన కవితాముద్ర చేసికొన్నాఁడు. ఇంతే భేదము.

నన్నయ్యగారు రసమును శబ్దసంయోజన శక్తినుండి కలిగింతురు. విస్తరించి భావములను చెప్పుటచేతఁ జేయరు. ఇది యొక చమత్కారమయిన విలక్షణమయిన మార్గము.

"హా మహారాజ మహా మహీరక్షణ
దక్ష దక్షిణ బాహుదండ దండి
తారాతి నిషధ రాజాగ్రణి నన్నిట్లు
పేత దయుండవై విడిచి చనఁగఁదగునె"

అని దమయంతి దలపోసిన వలపోఁతయు-

సీ॥ ఇభ రాజ గమన నీ వెందుల కరిగిత
త్యురు కుచాభోగ యెందున్న దాన
వబల యెవ్వరి చేత నడవులలోఁ బట్టు
వడి తశనా పేక్షఁ బఱచుచున్న
యుగ్రమృగంబుల యుదరంబులో నున్న దానవే॥

మొదలయిన నలుని దుఃఖము సంబోధనలచేత భాసించుచున్నది. "హా! మహారాజా మహా మహీ రక్షణ" మొదలయిన పిలుపుల చేతనే శోక రసము వెల్లివిరియుచున్నది. 'ఇభరాజగమన' 'అత్యురుకుచాభోగ' ఈ రెండు సంబోధనల చేత శృంగార శోకరసము పెనఁగొని పరమ రమణీయమయిన యాహ్లాదమును గలిగించుచున్నవి. ఆఁకలి కొఱకు పరిగెత్తెడి యుగ్రమృగముల యుదరమ్ము లో నున్నదానవా? అని రచనయందోజోగుణము సంధానము సేయుటచేత నీ యోజోగుణము దుఃఖరసమునకు నంగముగా స్వీకరింపఁబడి కావ్య గుణము రస స్ఫూర్తి కొఱకు నుపయోగించిన మహాశిల్పము వ్యక్తమగుచున్నది. ఏకవి యందు వృత్తులు, రీతులు, గుణములు, అలంకారములు సర్వము రసాభిముఖముగాఁ బ్రసరించునో యతఁడొక్కఁడే మహాకవి శబ్ద వాచ్యుఁడు వృత్తి రీతి గుణాలంకారాదులు రసమునందుఁ గలసిపోవుట యెట్లు తెలియు ననఁగా మఱల నాలోచించి నపుడవి భాసించి కథ చదువుచున్నప్పుడు వాని స్థితి మనకు గోచరించని దెప్పుడో యప్పుడు. కొందఱు కవుల యొక్క రచనలో రసము భాసించుచున్నను తద్ర సావభాసము నందుఁగూడ వారి శైలియొక్క, వృత్తియొక్క, రీతి యొక్క ప్రాధాన్యము బుద్ధిని వదిలిపెట్టదు. ఏలకులు, మిరియాలు,

కుంకుమపువ్వు మొదలయిన వస్తువులతో మిశ్రితమైన పానకము త్రాగిన నపుడు దానిలోని తీపిదనము కన్నొక్క రుచిచేత నధిక సేవ్యమాన మయినట్లుగానే శ్లేష వ్యక్తికత్వాది గుణసామగ్రీ విశిష్టతం కల కవి యొక్క రచన యందలి రసాభివ్యక్తి తద్విశిష్ట గుణసహితముగా నుండును. అచ్చమయిన మధురసంపు పట్టి మాధుర్యమే భాసించును. నన్నయ్యగారి రచన యిట్టిది. సర్వదా రసభావముతో శోభించును గాని యీ యలంకార మెంత చక్కఁగా వాడినాఁడు. ఎక్కడ నెంత గొప్ప భావము చెప్పినాఁడు. ఇట్టి భావములేవావు. నన్నయగారి రచన రసభావములను కరిగించి పోసినరచన. ఇట్టి రచన మఱియొక చోటఁ గనిపించనే కనిపించదు.

ఒక్కొక్కచోట నాయన చేసెడు చమత్కారములు సూహాతీతములు. రాక్షసులు దేవతలతో యుద్ధము చేసిరి. అమృతమునందు విగ్రహీతులై వారు దేవతల మీఁదకు యుద్ధమునకు బయలుదేరిరి. ఈ భావమును సీస పద్యముతో మొదలిడెను. ఆ సీస పద్యము నందు ప్రాసయును సమకూర్చెను. ఆ సమకూర్చఁబడిన ప్రాసముచేత రాక్షసుల కోప మంతయు వ్యజ్యమాన మగుచున్నది.

"అంత దేవాహితు లమృతమ్ము గానక
 యొంతయు నలిగి బలింద్రుఁ గూడి
మంతనం బుండి య మర్త్యుల తోడి పొ
 త్తింతియు చాలు నింకేల యనుచు
సంతన కట్టి యుత్సాహ సమేతులై
 యంతంబులేని రథాశ్వములను
దంతుల నమిత పదాతుల నొడఁ గూర్చి
 యంతకాకారులై యార్చిరి."

ఈ సీస పద్యపు నాల్గు చరణముల పూర్వ పరార్థముల యందు నిక్షేపించిన యనుస్వార పూర్వక తకార ప్రాసముచేత నిచటి రాక్షసుల కోపము, యుద్ధ ప్రయత్నము నేమి విచిత్రముగా స్ఫూర్తికలుగుచు

న్నది. ఇది తెలిసి చేసిన రచన. శిల్ప స్వరూప మెఱిఁగిన రచన. నన్నయ్యగారు కవితాగుణములు చెప్పుటకు శక్తి చాలదన వచ్చును. గ్రహించుటకుఁ దొలుత శక్తి యుండినచోఁ జాలును.

"కలి దమయంతిఁ బాపసమకట్టు సతిం బతి బాయ నోపఁడా
లలన సుదీర్ఘ సౌహృద బలంబున నిట్టుల రెంటఁజేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగత కారియైన యు
య్యెలయును బోలె నూరడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చి
తాత్ముఁడై.

ఇచ్చట విమోహ శబ్దము రెండర్థముల యందు వాడఁబడినది. 'వి' యను నుప సర్గకు విగత విశిష్టార్థములు రెండునూ కలవు. విమోహర జ్జులన్' విగత మోహములయిన రజ్జువులు. విశిష్ట మోహము లయిన రజ్జువులు. విగత మోహములు నలుని పంపింపఁ జోచును. ఇట్లు రెండ ర్థములలో నీ శబ్దము ప్రయోగింపబడినది. ఇట్టి చమత్కారములు నన్నయ్యగారి యందెన్నియో గలవు.

నన్నయ్యగారు భారతములోని కథకు వాఖ్యానము చేయును. భాష్యము వ్రాయును. కథలోని క్లిష్టార్థములు విడివరచి చెప్పును. అసంగతములుగా గనిపించువానికి సంగతత్వము కనిపించును. దీని కొక చిన్న యుదాహరణము, ధృతరాష్ట్రునకుఁ బెండ్లి కావలయును అతఁడు గ్రుడ్డివాఁడు. రాజైనను దొందరగా నెవరును బిల్ల నివ్వరు. అట్టి వానికి వివాహము కొన్ని ప్రత్యేక పరిస్థితుల యందే జరుగును. అట్టి పరిస్థితులు వ్యాసుని భారతమునందు లేవు. ఈ క్రింద నన్నయ్య గారి తెలుఁగు సేఁతలు సంస్కృత భారతము నందలి గాంధారీ వివాహ కథా భూత శ్లోకములను, నుదహరింపఁ బడుచున్నవి. వానినిఁ బట్టి నన్నయ్యగారి తెలుఁగుసేఁత యర్థము చేసికొనవచ్చును. ఈ పెండ్లి యగుటకుఁ గారణము గాంధారి తండ్రియైన సుబలుఁడు. తన కూఁతును ధృతరాష్ట్రుని కిత్తునని నిశ్చయించుకొనుటకు నాయన చాల యుద్ధ

తుండు. అతని మాట కెదురులేదు. బంధువులతనికి భయపడుదురు. అతఁడన్న మాట కాదను వాఁడులేఁడు. ఆయన యిట్టివాఁడుగా నన్నయ్యగారు సృష్టించి గాంధారీ వివాహ పరిష్కారమును జేసెను. ఆయన యిట్టివాఁడని ధ్వనిత మగుచున్నది, గానివాచ్యముగ లేదు.

"ఈ కులము వివర్ధింపఁగ నాకభిమత మేను వింటి నలినేక్షణగా
నేక శత సుతులఁ బడయఁగ నా కన్యక వరము వడసె నంటి
హరుచేతన్॥

కావున ధృతరాష్ట్రునికి గాంధారిని వివాహంబు సేయుదము. గాంధార పతి మనతోడి సంబంధమునకుం దగునని నిశ్చయించి సుబలు వానికిఁ దగు ముదుసళ్ళం బంచిన సుబలుండును సుముఖుండై కురుకుల విస్తార కుండయిన ధృతరాష్ట్రుండు యిక్కన్యకు నర్హుండు గావున నా రాజునకు గాంధారి నిచ్చితి ననిన బంధు జనంబులెల్లఁ దమలో నిట్లనిరి.

అంగములలోన మే లుత్తమాంగ మందు
నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టి కన్నుల లేవను టెంత గాక
యుత్తముఁడు గాఁడె సద్గుణ యుక్తి నతఁడు॥

అనిన వారి పలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకు బితృవచన దత్తఁ గాఁ దన్ను నిశ్చయించి నాకుఁ బతి యమ్మహీపతియ కాని యొరులు నొల్లనని పరమ పతివ్రత పరపురుష సందర్శనంబు పరిహరించి తన పతి కనుగుణంబుగా నేత్ర పట్టంబు గట్టుకొని యుండె.

అథ శుశ్రావ విప్రేభ్యో గాంధారీం సుబలాత్మజాం
ఆరాధ్యవరదం దేవం భగనేత్ర హరం హరమ్॥
గాంధారీ కిల పుత్రాణాం శతం లేభే వరం శుభా
ఇతి శుశ్రావ తత్త్వేన భీష్మః కురు పితామహః॥

తతో గాంధార రాజస్య ప్రేషయామాస భారత
అచక్షురితి తత్రా ఽఽ సీత్ సుబలస్య విచారణా॥
కులం ఖ్యాతించ వృత్తంచ బుద్ధ్యాతు ప్రసమీక్ష్య సః
దదౌ తాం ధృతరాష్ట్రాయ గాంధారీం ధర్మచారిణీమ్॥
గాంధారీ త్వథ శుశ్రావ ధృతరాష్ట్ర మచక్షుషమ్
ఆత్మానం దిత్సితం చాస్మై పిత్రా మాత్రాచ భారత॥
తతస్సా పట మాదాయ కృత్వా బహుగుణాం తదా
బబంధ నేత్రే స్వే రాజన్ పతివ్రత పరాయణా॥
నాభ్యసూయాం పతి మహ మిత్యేవం కృతనిశ్చయా॥

ఆయన తన కూతుఁరు నిచ్చితి ననెను. బంధువులు తమలో నట్లనుకొనిరి. అది గాంధారి వినునట్లను కొనిరి, ఆమె తండ్రి యెంత చెప్పిన నంత, ఆమె చేత నెదుగు తిరిగింపించవలెననివారి యుద్దేశ్యము. మూఁడు మాటలలో నీకథ యంతియుఁ బరిష్కారము చేయఁబడినది. సుబలుని మొక్క గృహయావిషయముల యందలి యోద్ధత్యము ఒకటి, యిచ్చితిననుటలో రెండవది, బంధువులు తమలో నిట్లనుకొని రనుటలో సువ్యక్తమైనది. ఆయన కథలన్నియు నిట్లే వస్తుధ్వని ప్రాధాన్యము కలవిగా నుండును జాగ్రత్తగా విచారించినచో లోకము సువ్యక్త మగును. ఆయ యంతటి లోకజ్ఞుఁడు. తాను లోకజ్ఞుఁడనని తనకుఁ దెలియును. 'లోకజ్ఞ నుభయ భాషాకావ్య రచనా భిశోభితు' నని చెప్పికొన్నాడు

అన్ని సాహిత్యములలో మొట్ట మొదటనే మహాకవులు పుట్టు దురు. మఱల నంతటి కవి భాషలోఁ బుట్టఁడు. చదురుగా నొక రిద్ద రున్నచో నుండవచ్చును. సంస్కృతములో వాల్మీకియుఁ దెనుఁగు నన్నయ్యగారును నట్టివారు. తరువాత నే కవులును వారిని మించలేదు. తరువాతి సర్వకవులకు వారు పెట్టినదియే బిక్ష.

———

# నన్నయ్య : తెలుగు భారతం : అనువాదంకాదు : పునస్సృష్టి

— దాశరధి —

"తింటే గారెలు తినాలి—వింటే భారతం వినాలి"

అనే సామెత ప్రచారంలో ఉంది. సామెతలు వినడానికి బాగానే వుంటాయి. కాని శాస్త్రలోతుగా వెళ్ళి చూస్తే వీనిలో ఉపమానాలు వింతగా కనపడతాయి. గారెల రుచికీ భారతం రుచికీ పోలిక ఏమిటి? గారెలు రుచిగా వుండేమాట నిజమే. కాని భారతం రుచికీ గారెల పోలిక చాలదు. లోకోక్తిని కాదనడం దేనికి? ఉండనిద్దాం.

భారతం అనగానే వ్యాసమహర్షి జ్ఞాపకం వస్తాడు.

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్

వ్యాస మహాభారత రచన చేసాడు. అష్టాదశ పురాణాలూ ఆయనే కదా వ్రాసింది. పూర్వం పుస్తకం పెట్టుకుని చదువుకునే పీటను వ్యాసపీఠం అనేవారు. ఇప్పుడూ కొందరు భక్తిగా వ్యాసపీఠం మీద పుస్తకం పెట్టుకుని—అధ్యాత్మిక గ్రంథాలు పెట్టుకుని చదువుతూ వుంటారు.

ఇక తెలుగులో Essay వ్యాసమే అయింది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే వ్యాసుడు ఎలా వ్యాపించిపోయాడో తెలపడానికి.

వ్యాసం అంటే Diameter of a circle కూడా.

ఇక వ్యాస మహర్షి రచించిన మహాభారతాన్ని తెలుగులోకి అవతరింపజేసిన ఆదికవి నన్నయ్యగారు.

నెట్టుకొని కొలుతు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌముని, కవితా

పట్టాభిషిక్తు, భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠ గాథ ప్రతిభున్.

అని శ్రీనాథ మహాకవి నన్నయగారిని గురించి అద్భుతంగా చెప్పాడు.

తిక్కనగారు :—

ఆదరణీయ సార వివిధార్థ గతి స్ఫురణంబుగల్గి య
ష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ, అం
దాది దొడంగి మూడు కృతులాంధ్ర కవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముడు నన్నయభట్టు దక్షతన్

మారన :—

సార కథాసుధారస మజస్రము నాగళ పూరితంబుగా
నారగ గ్రోలుచున్ జనులు హర్ష రసాంబుధి దేలునట్లుగా
భారత సంహితన్ మును త్రి పర్వము లెవ్వఁడొనర్చె నట్టి వి
ద్యా రమణీయు,నాంధ్రకవితా రమణీయు నన్నయభట్టు గొల్చెదన్
(మార్కండేయ పురాణం)

మధునాపంతులవారు :—

గంటము పట్టులో నొక యఖండ భవిష్యముతోచి, పల్కు వా
ల్గంటికి నాటపట్టు దొరకన్ కవితా దయితుండు భావనా
ఘంటలు ఠంగు ఠంగు మనగా జయముం దెనిగింపబూనె, వె
న్నంటె పురాజను సుకృతమైన సరస్వతి తొందరింపగన్
(ఆంధ్ర పురాణము)

దాశరథి :—

తెలుగు జాహ్నవీ జల హిమాచల బిలమ్ము
తెనుగు పారిజాత సుమ నందన వనమ్ము
ఆంధ్ర భారతావతరణావహన తలము
ఆది కవి నన్న పార్యుని అమృతగళము.

దేవ భాష తెచ్చి దేశభాషను చేర్చి
క్రొత్త అందములను కూర్చినాడు
తెలుగునకు గట్టి బలమును కలిపెడి
వెలుగు మేడ నొకటి నిలిపినాడు.

కన్నడ భాషలో "నన" యనగా సుందరుడట. మంగళపూడి శాసనమునందు "నన్ని నారాయభట్టు" అను పదమున్నదట. అందుకే నేమో కొందరు నన్నయను నన్నియ అంటున్నారు.

కొందరు నన్నయను కన్నడుడని, కొందరు ఆయనను తమిళుడని రుజువు చేయడానికి విఫల ప్రయత్నం చేసారు. అతడు నూటికి నూరుపాళ్ళు తెలుగువాడు.

ఆదికవిగా తెలుగు వాల్మీకిగా పేరు పొందిన నన్నయగారు చేసిన ఘనకార్యం ఏమిటి? అని అడిగేవారు ఈనాడు లేకపోలేదు. దానికి సమాధానంగా పద్యం ఒకటి–నేను రచించింది–మనవిచేస్తాను.

ప్రజలభాషన్ పురాణమ్ము వ్రాయుటన్న
తిరుగుబాటుగా భావించు తరుణమందు
తెలుగులో భారతము వ్రాయగల్గినట్టి
నన్నయ మహాకవిన్ సదా సన్నుతింతు
ప్రజలే భాషను మాటలాడెదరొ తద్భాషన్ పురాణావళుల్
సృజియింపం గలమన్న గుండె బలమిచ్చెన్ నన్నపార్యుండు, కో
ట్ల జనుల్ పల్కెడు పల్కులందే కవితల్ కల్పించుటే సత్కవి
ప్రజ కర్తవ్య మటన్న సత్యమును చెప్పం జాలె ధీమంతుడై

ప్రజల భాషలో వ్రాయడం సజీవ రచనకు నిదర్శనమని నన్నయ ఆనాడే చాటి చెప్పాడు. కనుక నన్నయ ప్రథమంగా తెలుగులో రెండున్నర పర్వాల భారతం రచించడం ఒక తిరుగుబాటే అనడంలో సందేహంలేదు.

(106)

ఇకపోతే - ఇంతకీ ఈ భారతానికీ ఈ కాలంలో ఔచిత్యం (Relevance) ఏమిటి అని అడిగేవారూ లేకపోరు. 'భారతానికి' 'భారతం'లో ఔచితి లేకపోతే మరెక్కడ వుంటుంది. భారతమే భారతదేశం. ఇన్నివేలేండ్లు బ్రతికిన భారతం మానవ మనస్తత్వం మారనంత కాలం బ్రతుకుతుంది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన ఆంధ్ర మహాభారత శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలకు పీఠిక వ్రాస్తూ ఆచార్య డా॥ జి. యస్. రెడ్డిగారు అన్నమాటలు ఇక్కడ ఉదహరిస్తే దీనికి సమాధానం లభిస్తుంది.

"ఐతిహాసిక యుగానికీ, ఆధునిక యుగానికీ మానవ ప్రకృతిలో భేదంలేదు."

"ఆనాటి రాగద్వేషాలు, కోపతాపాలు, చెలిమి చుట్టరికాలు, ఉపకారాపకారబుద్ధులు, న్యాయాన్యాయాలు, అధికారకాంక్ష, ఆశ్రిత జనప్రీతి, వర్గవిచక్షణ, స్తోత్ర ప్రియత్వం, ఇత్యాది లక్షణాలెన్నో ఈనాటి ప్రకృతిలోనూ ఉన్నాయి. కన్నబిడ్డల మీద మమకారంతో న్యాయాన్ని చూడలేని ధృతరాష్ట్రులు, తీరని అధికారదాహంతో తపించే దుర్యోధనులు, మాత్సర్యావేశ పరులైన ద్రోణులు, అబలల్ని బలాత్కరించే కీచకులు ఈనాడూ మనకు ఎవరిలోనో ఒక రూపంలో కనిపిస్తూనే వుంటారు."

"మానవ ప్రకృతీ అందలి వైవిధ్యం మానవ జీవితానికి ఏర్పడే వైయుక్తిక, సామాజికాది సంఘర్షణత్రయం సార్వ కాలికమూ అయినట్టిది."

"మానవ ప్రకృతి మానవ ప్రకృతిగా నిలిచి ఉన్నంతకాలం మహాభారతం మానవ సాహిత్య ప్రపంచంలో మేరువుగా నిలిచి వుంటుంది, మణిపూసగా ప్రకాశిస్తూ వుంటుంది."

అందుకని భారతం, భారతంతో ముడిపడివుంది. 'విశ్వవిఖ్యాతి నందిన మహాభారతమునకు జన్మభూమి యగుటచే — మనదేశమునకు

భారతదేశమను నామమేర్పడుటకు కారణము’ అన్నారు సుప్రసిద్ధ విమర్శకులు డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు.

యశోధర్మస్తతో జయః అని భారతం నిరూపిస్తున్నది.

నన్నయభట్టారకులు మహాభారతాన్ని చంద్రునితో పోల్చి చెప్పిన పద్యం చిత్తగించండి —

“ఆ నారాయణ పాండవేయగుణ మాహాత్మ్యముల కీర్తిసంజ
తానందం బొనరించుచున్, జనుల కర్థాంశు ప్రకాశంబుతో
మానై సాత్యవతేయధీ వనధి జన్మ శ్రీ మహాభారతా
ఖ్యానాఖ్యామృతసూతి యొప్పె నఖిలాఘధ్వాంత విధ్వంసియై”

మహాభారతాన్ని నన్నయగారు పారిజాతమనీ అన్నారు —

“అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహా వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీ సురప్రార్థ్యమై”

మహాభారతంలో వున్నదే అంతటా వుంది. అందులో లేనిది ఎక్కడా లేదు.

యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్

నన్నయది తర్జుమా కాదు.

ఒక భాషలోని వార్తను ఇంకో భాషలోకి యథాతథంగా దిగుమతి చేయడం తర్జుమా. మహాకవులు అనువదిస్తున్నప్పుడు జీర్ణించుకుని పునస్సృష్టి చేస్తారు. వ్యాసమహర్షి మూలానికి న్యాయం చేస్తూ, అవసరమైనచోట్ల, వీలైనచోట్ల కవిత్రయంవారు మెరుగులుదిద్దారు. వీరిలో మొదటివాడు నన్నయ కదా!

తెలుగు భారత రచన నాటికి నన్నయాదులపై కాళిదాసాది సంస్కృత మహాకవుల ప్రభావమున్నది. వారి రచనల్లోని సౌకుమార్యము తెలుగులోకి ప్రవేశించింది.

మూల భారతం గహనారణ్యం తెలుగు భారతం చక్కని ఆరామం. ఇదీ తేడా !

సారమతిన్ కవీంద్రులు ప్రసన్న కథాకవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షర రమ్యత నాదరింప నా
నా రుచిరార్థసూక్తి నిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్.

ఇది నన్నయగారే తన రచనా రీతిని అనువాద పద్ధతిని గూర్చి చెప్పుకున్నారు. ఇది స్వోత్కర్ష కాదు. తన తీరును చెప్పడం మాత్రమే.

సారమతి అన్నమాటలోనే గంభీరార్థం వుంది. నిస్సారమతితో కవితను ఆస్వాదించడం సాధ్యపడదు. సారవంతమైన మనస్సు కావాలి, అది వున్నప్పుడు కవి రచనలోని సొగసు తెలుస్తుంది.

సారమతిఅనే మాటను నన్నయ ఆది సభాపర్వాలలో ఎన్నెన్ని చోట్ల వాడిందీ శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు వివరంగా తమ గ్రంథం "సారమతి నన్నయ"లో వ్రాసారు.

"సారమతి యనునది ఒక మధురమైన రాగము. త్యాగరాజు ఆ రాగములో మోక్షముకలదా ? అను కీర్తనము వ్రాసెను. దాని యర్థములో చల్లని అనుభూతిలో నన్నయగారి కవిత యంతయు మనసులో పరిమళించి నట్లుండును." (పుట 3)

నన్నయగారి రచనలో నాకు నచ్చిన కథలు కొన్నివున్నాయి. నిజానికి అవి అందరికీ నచ్చుతాయి.

మొదటిది కచదేవయాని, విశ్వకవి రవీంద్రుడే మురిసిపోయి దీన్ని నాటకంగా రచించాడు. అయితే అవి వ్యాసమహర్షి రచనతో ప్రోత్సహించబడి గురుదేవులు వ్రాశారు.

నన్నయగారు ఈ కథను చెప్పినతీరు అద్భుతంగా వుంది.

"గురుని, గురు తనూజ గొలిచి యయ్యిరువురి నెమ్మివడసె తనదు నేర్పు పేర్మి"

ఇద్దరి మెప్పు వడయటం సామాన్యంకాదు.

"వాడి మయూఖముల్ గలుగువాడపరాంబుధి గ్రుంకె.. "

అన్న గొప్ప పద్యం ఈ ఉపాఖ్యానంలోదే. సంస్కృత శబ్దానికి తెలుగుమాట విశేషణంగా వాడడం "వాడి మయూఖముల్" నన్నయగారే మొదలు పెట్టారు. తెలుగు భాషలోని వ్యాకరణ విషయం ఒకటి బోధించబడింది. ఎత్తుగడలోని సొగసు తరువాతి కవులకు మార్గదర్శకం.

" ఉదరభిదాముఖము న
భ్యుదయముతో నిర్గమించె భృగుసుతుడు కచుం
డుదయాద్రి ధరీముఖమున
మదితుండగు పూర్ణ హిమమయూఖుడ వోలెన్ "

కావ్యత్వం శోభించే పద్యమిది. అయితే దీనిలో ధర్మం వుంది. శుక్రుడి కడుపు చీల్చుకొని కచుడు బయటికి వచ్చాడు. సంజీవినీవిద్య తెలిసిపోయింది తన పబ్బం గడిచిందని పారిపోలేదు. ఆ విద్యతో శుక్రుణ్ణి బ్రతికించాడు కచుడు.

విగతజీవుడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుడై వెలుంగె
దనుజ మంత్రి యుచ్చారణ దక్షుచేత
నభిహితంబగు శబ్దంబునట్ల పోలె

ఉచ్చారణ దక్షుచేత నభిహితంబగు శబ్దంతో పోల్చడం యెంతో మనోహరంగా వుంది.

దేవయాని సామాన్య కన్యలా వ్యవహరిస్తుంది. కచుణ్ణి ప్రేమిస్తుంది. దేవయానులు చాలామంది నేడు కనిపిస్తారు.

కాని కచుడు అసామాన్య యువకుడిలా ప్రవర్తిస్తాడు.

దేవయాని ఉవాచ :—

"నీవును బ్రహ్మచారివి, వినీతుడ, నేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ। వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది —"

మనకు వివాహము అయిపోయింది అంటుంది. కచుడు అందుకు అంగీకరించడు.

కచ ఉవాచ :—

"— లోక నింద్యమగు నర్థము నీ నాకునకు దెచ్చుటుచితమె?
నాకు సహోదరివి నీవు నా చిత్తమునన్
"గురులకు శిష్యులు పుత్త్రిలు
పరమార్థమ లోక ధర్మ పథమిది. దీనిని బరికింపక యీపలుకులు
తరుణీ! గురుపుత్త్రి! నీకు తగునే పలుకన్"
ఇలా అనే యువకులు ఈనాడు అరుదు.

తరువాత నాకు నచ్చిన కథ యయాతిది. దేవయాని బావిలో పడ్డప్పుడు ఎలావుందో నన్నయ్యగారు ఒక తేటగీతంలో ఇలాచెప్పారు.

"వరుణదేవుతోడ కరమల్గి జల నివా
సంబు విడిచి భూస్థలంబు వలని
కరుగు దేరనున్న వరుణేంద్రు దేవియ
పోని దాని దేవయాని గనియె"

యయాతి చూచిన దేవయాని అలావుంది. అలాటి దేవయానిని యయాతి బావిలోనుంచి బయటికి తీయడం కూడా యెంతో సొగసుగా చెప్పారు నన్నయ్యగారు.

"జలధి విలోల వీచి విలసత్ కలకాంచి సమంచితావనీ
తల వహనక్షమంబయిన దక్షిణ హస్తమునందదున్నమ
ద్గళదురు ఘర్మ వారి కణ క్రమ కరాబ్జము వట్టి నూతిలో
వెలువడ గోమలిం దిగిచె విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్"

దేవయాని వింత మనస్తత్వాన్ని నన్నయ్యగారు చిత్రీకరించిన తీరులో ఒక ప్రత్యేకత వుంది.

"—వివాహము నీకు నాకు మున్
భావజ శక్తినైనయది" అని కచుడితో అన్నది దేవయాని.

ఇప్పుడు యయాతితో ఏమంటున్నదో వినండి.

"నిగ్రహమేది నన్ను తరణీప్రభ కేశము వెల్వరించు నా
నుగ్రమయూఖ సాక్ష్యముగ నున్నతి పీణవారికేళి ఘా
పాగ్రణి నాదు దక్షిణ కరాగ్రము పట్టితి గాన మున్న పా
ణిగ్రహణమ్ము సేసితి—"

"సూర్యుడుసాక్షిగా నీ కుడిచేతితో నాకుడిచేతిని పట్టుకున్నావు. పాణిగ్రహణం చేశావు" అంటుంది.

భావశక్తితో వివాహము అయిందని కచునితో అంది.

సూర్యుడి సాక్షిగా పాణిగ్రహణం అయిందని యయాతితో అంది. ఇక ఈమెను మించింది శర్మిష్ఠ.

"నీలగళోపమాన కమనీయ గుణోన్నతి చెప్పజాలు న
న్నేలిన దేవయానికి నరేశ్వర! భర్తవు గాన నాకునుం
బోలగ భర్త వీవ—"

"నన్నేలిన దేవయానికి నీవు భర్తవు గనుక నాకూ భర్తవే" అంటుంది శర్మిష్ఠ యయాతితో.

దేవయాని కచుడికి శాపం ఇస్తుంది.

దేవయాని తండ్రి శుక్రుడు యయాతికి శాప మిస్తాడు.

దేవయాని ప్రణయకోపంతో శాపం ఇచ్చింది. శుక్రుడు ఋషి. అతను కోపించడం నచ్చని నన్నయ్య చెప్పిన రెండు పద్యాలు ఉదహరిస్తున్నాను.

"అనుపమ నియమాన్వితులై
యనూన దక్షిణల గ్రతుసహస్రంబులు సే
సిన వారికంటె నక్రో
ధనుడ గరం బధికుడండ్రు తత్త్వవిధిజ్ఞుల్"

"అలిగిన నలుగక, యొగ్గులు
పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబుల్

పలుకక బన్నము వడి యెడ
దలపక యున్న తడచూవె ధర్మజ్ఞుడిలన్"
(ఆదిపర్వం - ద్వితీయాశ్వాసం)

తరువాత నాకూ, అందరికీ నచ్చేకథ శకుంతల కథ. కణ్వాశ్రమాన్ని నన్నయగారు ఇలా వర్ణించారు.

"అమరపతి ఖాండవమునకు
రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమా
నముగా దీనిని భూ భా
గమునను రచియించె నొక్కొ కమలజుడు దయన్"

శకుంతలను చూస్తాడు దుష్యంతుడు. ప్రణయం. వివాహమాడతానంటాడు. రకరకాల వివాహాలను గూర్చి చెబుతాడు. తొందరగా శకుంతలా సౌందర్యాన్ని అనుభవించాలి మరి.

శకుంతల అంటుంది :-

"కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ జనకులు నను దెం
తురు, వారు వచ్చి నీ
కిచ్చెదరేని పాణిగ్రహణము చేయుమునన్నన్"

అంతదాకా వేచివుండే ఓపిక లేదు దుష్యంతుడికి. అందుకని

"తనకు మరి తానే చుట్టంబు, తాన తనకు
గతియు తన్నిచ్చుచో తాన కర్త యనగ
వనజనేత్ర! గాంధర్వ వివాహ మతి ర
హస్యమును నమంత్రకమునునగుచునొప్పు"

ఈ గాంధర్వ వివాహాన్నే "లౌమేరెజ్" అనవచ్చునేమో! మంత్రాల గొడవ లేదు. రహస్యంగా పెళ్ళిచేసుకోవడం. ఇప్పుడు గాంధర్వవివాహాలే యెక్కువ. యేనాడో శకుంతలా దుష్యంతులు చేసిన పని ఈనాడు యువతీ యువకులు చేస్తున్నారు.

నన్నయ్యగారి ప్రసన్నకథ, కవిత, అర్థయుక్తి కవీంద్రులకు

నచ్చితే ఇతరులకు అక్షర రమ్యత నచ్చుతుందట. నన్నయ నానా రుచిరార్థ సూక్తినిధి. ఇవన్నీ ఇలా ప్రండగా ఆయన భారతరచన జగద్ధితం కోసం చేశాడు. అది ముఖ్యం. ఏ కవి యయినా తన రచన జగత్కల్యాణంకోసం చేయాలి.

ధర్మశాస్త్రం, వేదాంతం, నీతి శాస్త్రం, మహాకావ్యం, సర్వ లక్షణ సంగ్రహం, ఇతిహాసం, బహుపురాణ సముచ్చయం, అయిన భారతాన్ని తెలుగులోకి అవతరింపజేసిన నన్నయ వ్రాసిన ప్రతి పద్యం హృద్యాన వాద్యంగా వుంటుంది.

తెలుగులో మహాకావ్యరచన గావించిన మొదటి కవి నన్నయ భట్టారకుడను సత్యం నిర్వివాదాస్పదమైనది" అన్నారు. శ్రీదేవులపల్లి రామానుజరావుగారు తమ "మార్గదర్శి నన్నయభట్టు" అన్న గ్రంథంలో ఇంకా ఇలా అన్నారు—"తెలుగు భారతం— తమిళ, కన్నడ భారతాలకన్నా ఆదర్శంలోను, ఆకృతిలోను విశాలమైనదని స్పష్ట మగుచున్నది" ఇది యథార్థం. "తెలుగులో తప్ప మరేభాషలో ఇంత సమగ్రంగా భారతం రాలే" దని బహుభాషావేత్త డాక్టర్ ప్రభాకర్ మాచ్వే ఒక సభలో ప్రసంగిస్తూ అన్నారు.

"ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి" అన్నారు విశ్వనాథవారు.

"నన్నయకవి పెట్టినాడు కదా తిక్కనాది కవుల కాదిభిక్ష" అన్నారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు.

తెలుగులో మహాకావ్యాలు వ్రాయవచ్చునని, ప్రయోగించి చూపి, తరువాతి వారికి గుండె దిటవు కల్పించిన నన్నయభట్టోపాధ్యాయుడు తెలుగుజాతికి ప్రాతఃస్మరణీయుడు.

"బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థమగున్"



—/—

# భట్టారకుని భారతానువాదము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీవాణీగిరిజల ననవరతము వక్షోముఖాంగములఁ దాల్చిన హరిహర బ్రహ్మలకుఁ గైమోడ్పు లిడి యాంధ్ర కవిత్వ విశారదుఁడు మహితాత్ముఁడు నన్నయభట్టారకుఁడు తనబుద్ధి బాహువిక్రమమున భారత భారతీసముద్రముఁ దఱియంగ నీఁద సమకట్టి అందాదిఁ దొడఁగి మూఁడుకృతు లతిదక్షతతో నొనర్చినాఁడు. కవిబ్రహ్మయగు తిక్కన మఖిచే బహుమతులఁ బడసినాఁ డిట్టికృతినిర్మితికి కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు, భారతఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభఁ బాటించి యీతనికి కవితాసార్వభౌమతఁ బట్టాభిషేక మొనరించినాఁడు. ఆంధ్ర కవి మూర్ధన్యులందఱు నాఁడు మొదలు నేఁటివఱకుఁ బద్యము వ్రాయఁ గలమునో గంటమునో చేఁబూనినచో భట్టారకున కంజలింపక మానరు. వాగనుశాసనుఁడు నాదికవియునగు నామహనీయుని యాంధ్రానువాదసరణి యెట్టు లనలుకొలలుసాఁగినదో పాఠకుల కెఱిఁగించుటకై యీ వ్యాసము వ్రాయదొరకొంటిని.

ఈతని కవితావిన్యాసమున ఛందోవ్యాకరణ నియమములను బాటించుటలో విశిష్టత యేర్పడి యుండుటచే వాగనుశాసకత్వ మీ కవికి సార్థకమేగాని యొండుగాదు. కేవల మైతిహాసిక దృష్టితోడనే గాక యీతని కైత రసపరిపుష్టిని భావపరిశుద్ధతను బాటించినది. యథాతథానువాదముగాక ప్రబంధధోరణి పట్టుపడినది. గాఢమయిన ప్రతిభ కలిగియుండుట చేతనే భారతఘట్టముల నుల్లంఘింపఁ గలిగినాఁడు. అవిరళజపహోమతత్పరుఁడు గనుకనే భారతభారతీ శుభగభస్తిచయంబుల నాంధ్రావని వ్యాపింపఁజేయఁ గలిగినాఁడు. వ్యాసభగవానుఁడు భారతకవితలోఁ జొనిపినఘట్టముల నర్థముచేసికొనునప్పుడు గణపతి

యంతటి ప్రాయసగాఁడు సైతము గంటము త్రిప్పుకొనఁగాఁ గొంత తట వాఁగవలసి వచ్చినది. అట్టి సంస్కృతకవితా నష్టము చేసికొన వలయునన్న భట్టారకుని నాఁటికి నేఁటి కున్నన్ని వ్యాఖ్యానములు లభించునవకాశము లేదు. సర్వసమర్థము పూర్వోత్తరపక్ష పరిష్కారాత్మ మునగు నీలకంఠీయమువంటి వ్యాఖ్యాన మానాఁటికి వెలువడినదైనను లేదు. నరునకు నారాయణునట్టులు నారాయణభట్టు సహాయము మాత్రము లభించినది. అట్టి తరుణమునందును మహాభారతేతిహాస మును భట్టారకుఁడు రసవత్తర ప్రబంధమునుగా రచియింపఁ గలిగినాఁ డన్న, నింతకంటె మహత్తరము స్తుతిపాత్రమునగు విషయము వేఱొండుగలుగునా? విమల గోదావరీతీర భూమినివాసము. ధార్మికుఁ డైన రాజరాజనరేంద్రుని ప్రేరణము, ఆశయము లభించినది గావున ధర్మానుబంధియగు భారతసంహిత యాంధ్రుల మహాభాగ్యమునఁ దెలుఁగున నవతరించినది. ధన్యుఁడు భట్టారకుఁడు.

నన్నయ వృత్తరచనమాత్రము కమ్మచ్చునఁబట్టినట్లు తీఁగ సాఁగుచు నడచినది. చిన్నచిన్న యమకములతోఁ జెవులకుఁ జవులు పుట్టించునదిగ భాసిల్లినది. కందము లందముగఁ జేరినవి. ఆటవెలఁదులు నాట్యభంగిమలు నెఱపినవి. ప్రాచీనకవితా పరిపాటి విడనాడక యక్కరలు తరువోజలుకూడ నెడనెడఁ బొడచూపినవి. సీసములు మాత్రము వచనముల కీడుజోడయియున్నవి. వానిలో వృత్తము లందలి పొంకము గానరాదు. వానినడకమాత్ర మడుగడుగున నెగుడు దిగుడుగనే యున్నది. లక్షణపరిశుద్ధికిమాత్రము వాని కవియే సాటి. భట్టారకుఁడు పాటించిన నియమము లేగద నాఁటినేఁటికి లాక్షణికుల కందఱకుఁ బథప్రదర్శకములు. వచనరచన యసదృశ కావుననే వచన రచనలో నూతన సృష్టిని గావించిన చిన్నయసూరి యీతని వచనముల నెక్కుడుగ ననుకరించినాఁడు. నన్నయరచనలోని వృత్తముల నొండురెం డుదాహరించెద.

మేనక యింద్రునియాజ్ఞ నొఁదలఁదాల్చి విశ్వామిత్రుని తపో భంగమునకై మందమలయానిలము తోడురాఁగ వనమునఁ బ్రవే శించు, నంత —

క. చల్లని దక్షిణమారుత, మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాథ
మ్మిల్లకుసుమాంగరాగస, ముల్లసనసుగంధి యగుచు మునివరు
మీఁదన్.

చ. అనిమిషకాంతయున్ నవలతాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవిలాసగతిం జనుదెంచి ముందటం
గనియె మునీశ్వరప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతినం
జననమహాతపశ్చరణ సంయతచిత్తు నిరస్తచిత్తజన్.
(భార. ఆది. 4, 40, 41)

ధేనువు లింటికివచ్చినవానితోడవ కచుండు రాకయున్న దేవయాని దన మనంబున మలమల మఱుంగుచుం బోయి తండ్రి కిట్లనియె.

ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిటవచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిగ వేల్వఁగా బడియెఁ బ్రొద్దునుబోయెఁ గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నొందెనో !
భార. ఆది. 3. ౧౧౨.

కరుణరస భావభరితమై కడుహృద్యమైన దీపద్యము. వృత్త ములన్నియు భావానుగుణముగనే నడచినవి.

రాజరాజనరేంద్రుని ప్రాపున సనాతనవైదికధర్మ పునరుద్ధరణ మునకై భారతసంహిత నాంధ్రమునకుఁ గొనితెచ్చిన భట్టారకునిదృష్టి ప్రధానముగ ధర్మబోధనమునకై ములుసూపినవి. అట్టితఱి శకుంతలో పాఖ్యానమున చాలశ్లోకముల కనువాద మీతనికవితలోఁ గాన వచ్చుటలేదు. దుష్యంతుఁడు శకుంతలను నిరాకరించినపుడు సభలో

నామె వాకొనిన వాక్యములనియు ధర్మసంబద్ధములై యున్నవి. అంతే యగాదు. ఆ ప్రసంగములన్నియు స్త్రీజాతి గౌరవమును, పతివ్రతల పాతివ్రత్యతేజోమహిమములను, విపులముగను నిస్పష్టముగను నుగ్గడించునవియై యున్నవి. సంస్కృత భారతప్రతులన్నిటియందును నీయధ్యాయములలో విపులముగ వర్ణింపఁబడిన యీ ధర్మము లనువాదమునఁ జాలవఱకు సంక్షిప్తములైనవి. దాక్షిణాత్య ప్రతులలో నీ భాగము మఱికొంత యధికముగనే యున్నది. ఇట్లు సంక్షేపపఱచుటకుఁ గారణమేమో మన మూహింపఁజాలము. ధర్మశాస్త్ర బోధకములగు నీ యంశముల కనువాదము చేయకుండుట మాత్రము కొఱఁత యనిపించుచున్నది. ఉదాహరణమునకై కొన్నిశ్లోకముల నిటఁజూపెదను.

నేను నీ భార్యను, ఈతఁడు నీపుత్రుఁడు. నన్ను నీవు కణ్వాశ్రమమున గాంధర్వవిధిని బెండ్లియాడితివని శకుంతల తెలుపఁగా దుష్యంతుఁ డిట్లు సమాధానము చెప్పెను.

శ్లో. ధర్మకామార్థసంబంధం నస్మరామి త్వయాసహ,
గచ్ఛవా తిష్ఠవా కామం యద్వాపీచ్ఛసి తత్కురు.

నీతోడ నాకు ధర్మార్థ కామములలో దేనికొఱకైననుగాని సంబంధముండినట్లు జ్ఞాపకములేదు. కావున నీవు పోయినను సరియే, ఉండినను సరియే. నీ యిచ్ఛవచ్చినట్లు చేయుము.

అనినంతనే క్రోధామర్షములు పెచ్చురేఁగఁగఁ గన్నులెఱ్ఱనై కటాక్షములచే దహించునదియై వెడచూపున రాజుం జూచెను.

ఆకారం గూహమానా సా మన్యునాభిసమీరితా,
తపసా సంభృతం తేజో ధారయామాసవై తదా.

కోపోద్రిక్తయై వికృతమైన యాకృతిని గప్పుకొనుచు పుట్టుక చేతను పుట్టినదాదిగను సంపాదించిన తేజమును దాల్చెను. బ్రహ్మ

మానస పుత్రికయగు మేనకకుఁ దపోరాశియైన విశ్వామిత్రునివలన జనించుటచేతను, కణ్వాశ్రమమునఁ బెరుగుటచేత, గాంధర్వవివాహమైనది మొదలుగ నహర్నిశము మానసమున దుష్యంతు నెడఁబాయకుండుటచేతను నామెకు తపస్సంభృతతేజ మేర్పడినది. క్రోధ ముద్భవించినంతనే నిగూఢమైన యా తేజము పైకెగసి వచ్చి యామె ముఖమం దుద్భాసించెను. మహర్షులకు సైతము కోప ముప్పతిల్లినంతనే నిగూఢమైనతేజ ముద్భాసించుచుండెననుట పురాణప్రసిద్ధము. అట్టి తేజోవతి గనుకనే—

యది మే యాచమానాయా వచనం న కరిష్యసి,
దుష్యన్త శతధా మూర్ధా తత స్తేఽద్య ఫలిష్యతి.

దీనురాలనై యాచించునాపలుకును నెఱవేర్పకుండెదవేని ఓదుష్యన్తా నీశిర మిప్పుడే నూఱుప్రక్కలు కాఁగలదు అనెను.

పతివ్రతలకు శాపానుగ్రహసామర్థ్య మేర్పడియుండు ననుట నిర్వివాదము. సభలోఁ బదిమందియెదుటఁ దన్నవమానముచేసిన భర్తనుగూర్చి కోపోద్రిక్తయై యిట్లనినదనిన ననౌచిత్యము స్ఫురింపనేరదు. ఈ యంశ మనువాదమున విడువఁదగినదిగాఁ గానరాదు. ఆ ప్రసంగముననే స్త్రీకిఁ గల పూజ్యత నిట్లుగ్గడించినది—

ఆత్మాత్మనైవ జనితః పుత్ర ఇత్యుచ్యతే బుధైః,
తస్మా ద్భార్యాం నరః పశ్యేన్మాతృవత్పుత్రమాతరమ్.

తనచే భార్యయందుఁ బుట్టించుకొనఁబడిన తానే పుత్రుఁడని విద్వాంసులచేఁ దెలుపఁ బడుచున్నాఁడు కావునఁ బుత్రరూపుఁడైన తన్నుఁ గన్నతల్లి యగుభార్యను, తన్నుఁగనిన తల్లినిబోలెఁ జూడవలయును. ఇది పురుషులకందఱకు నెఱుఁగఁదగినది, స్త్రీజాతికంతకును గౌరవము నాపాదించునదియునగు ధర్మవిశేషము. వివాహితలైన స్త్రీలను నికృష్టముగ దాసీలనుబోలెఁ గాంచువా రీవిషయము నెఱ్ఁగింపవలసినవారలై యుండెను.

ఆత్మనో జన్మనః క్షేత్రం పుణ్యం రామాస్సనాతనం,
ఋషీణామపి కాశక్తిః స్రష్టుం రామామృతే ప్రజాః.

స్త్రీలనాదిసిద్ధమైన యాత్మోత్పత్తి క్షేత్రములు, ఓజోత్పత్తి క్షేత్రము లట్లో పుత్రరూపమునఁ దా నుద్భవించుటకు స్త్రీలు సత్రి వారే. స్త్రీ లేనిదే సంతానముఁ గనుటకు ఋషులకు నైనను శక్తి యెక్కడిది!

ఇఁకఁ బుత్రునిగూర్చి యామె దెలిసిన ధర్మవిశేషములు,వానిఁ బోషింపవలసిన యావశ్యకతయు నవశ్యముగఁ దెలియఁదగినవి.

పరిపత్య యదా సూను ర్ధరణీరేణుగుంఠితః,
పితురాశ్లిష్యతేఽఙ్గాని కిమి నాస్త్యధికం తతః.

నేలమీఁదఁ బొరలి బూడిదచరచిన మేనితోఁ బుత్రుఁడు వచ్చి పడి కౌఁగిలించుకొను నప్పుడు తండ్రికిఁగలుగు నానందముకంటె నధిక మైన సంతోషవిషయ మే ముండును. ఈ యభిప్రాయమును కాళిదాసు తన శాకుంతలమునందును విడువక యీ క్రింది శ్లోకమునఁ జక్కఁగఁ జిత్రించినాఁడు.

ఆలక్ష్యదంతముకులా ననిమిత్తహాసై,
రవ్యక్తవర్ణ రమణీయవచః ప్రవృత్తీన్
అంకాశ్రయప్రణయిన స్తనయాన్వహన్తో,
ధన్యాస్తదంగరజసా మలినీభవన్తి.

కారణము లేనినగవులతో మాటిమాటికి మొగ్గలవంటి దంతములను గానఁజేయువారును, స్పష్టముగాని వర్ణములుగల ముద్దుపలుకుల గులకరించువారును, ఒడిలోఁబడుట కుత్సుకులునగుపుత్రుల నెత్తుకొని ధన్యాత్ములైనవారే వారియొడలి బూడిద నముకొనఁ జాలెదరు.

ఈ ప్రసంగముననే హృదయమున గ్రుచ్చుకొనుమాట వెలువడిన దామెనోట.

అండాని బిభ్రతిస్వాని సత్యజన్తి పిపీలికాః,
నభరేథాః కథం నుత్వం ధర్మజ్ఞః సన్స్వమాత్మజమ్.

అల్పజంతువులగు చీమలుసైతము తాము కనినగ్రుడ్డులను నోటఁ గఱచికొని జాగ్రతతోఁ బెంచునుగదా ! సమస్తధర్మముల నెఱిఁగిన నీవు నీ కుద్భవించిన యీ పుత్త్రు నేలభరింపవో యెఱుఁగరాకున్నది ? పుత్త్రులను తప్పక భరింపవలయుననుటలో నీ యుక్తి సహృదయుల హృదయములను దల్లడఁబడఁజేయక మానదు.

దుష్యంతుఁ డెన్నివిధములఁ దనవివాహసత్యతనుగూర్చి తెలిపినను వినక, శకుంతల పలుకులను నమ్మక పొమ్మనినవు డామె తన యుత్కృష్టత నిట్లుగ్గడించినది.

రాజ న్సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి
ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి నపశ్యసి
మేనకా త్రిదశేష్వేవ త్రిదశాశ్చాను మేనకామ్
మమైవో ద్రిచ్యతే జన్మ దుష్యన్తతవజన్మతః
క్షితావట సిరాజం స్త్వమన్తరిక్షేచరామ్యహమ్
ఆవయోరన్తరం పశ్య మేరుసర్షపయోరివ
మహేన్ద్రస్య కుబేరస్య యమస్య వరుణస్యచ
భవనా న్యాశు సంయామి ప్రభావం పశ్యమేఽనఘ
సత్యశ్చాపి ప్రవాదోఽయం యం ప్రవక్ష్యామితేఽనఘ,
నిదర్శనార్థం న ద్వేషాత్ తచ్ఛ్రుత్వాక్షన్తు మర్హసి.

రాజా ! ఇతరులరంధ్రముల నావగింజలంతలను లెక్కించుచున్నావు. నీ వొనర్చినవి బిల్వఫలము లంతటివైనను లెక్కింపకుంటివి. మేనక దేవతలలో వన్నెకెక్కినది. మేనక ననుసరించియే దేవతలు పెద్దగఁ గొనియాడఁబడుచున్నారు. కావున నీపుట్టుకకంటె నా పుట్టుకయే గొప్పది. నీవు భూమియందు మాత్రమే సంచరించెదవు. నే

నాకసమున సంచరించెదను. కావున మనయుద్ధమునకు అపరంజకు మేరు పర్వతమునకును గలయంతర మున్నది. నేను దేవేంద్రుడు కుబేరుడు వరుణుడు యముడు మున్నగువారి భవనములకు దలచిన వెంటనే పోయెదను. నా ప్రభావము చూడుము. నీకు నేజెప్పినదంతయు సత్యమేగాని యొండుగాదు. నీకు దార్కాణమునకై చెప్పచుంటిని. నన్ను క్షమింపుము.

పై విషయమంతయు శకుంతలకుంగల సామర్థ్యమును వ్యక్తము చేయుచున్నది, ఇట్టి శక్తిగలదిగనుకనే ధార్మికభాషణము నంతవిశిష్ట ముగం జేయంగలిగినది. ఈరీతి సమాధాన మామెయొక ధార్ష్ట్యమును వ్యక్తముసేయునదియేయైనను ఇతిహాసమున బాధించునది గానేరదు. కావుననే.

సుసంరబ్ధోఽపి రామాణాం నకుర్యా దప్రియం వరః,
రతిం ప్రీతించ ధర్మంచ తాస్వాయత్తమవేక్ష్యహి.

పురుషుడు స్త్రీ తనకెంత కోపము గలిగించినను నామె మనస్సు నొచ్చునట్టిపని చేయరాదు. తృప్తి ప్రీతి ధర్మము వారలయధీనము కావున వారు వ్యతిరేకించిన నవన్నియుం జెడును.

త్వాముతేఽపి చ దుష్యన్త శైలరాజావతంసకాం,
చతురంతా మిమాముర్వీం పుత్రో మే పాలయిష్యతి.

ఓ దుష్యన్తా! ఈ నా పుత్రుడు, నీ వాదరించి పోషింప కున్నను పర్వతరాజభూషితమై చతుస్సముద్ర ముద్రితమైన యీ భూవలయమును బాలింపంగలడు. అనియు ననినది.

స్త్రీలకుంగల పాతివ్రత్యపటిమ నుగ్గడించుచు, స్త్రీజాతి కత్యంత గౌరవాపాదకములు సన్మార్గ ప్రదర్శకములునగు నీ ధార్మిక వచనములు నన్నయభట్టారకునినోట వెలువడియుండినచో నెంత సమంజసముగ నుండెడివో? ధర్మబోధైకతత్పరుడగు నామహాసీయుం స యంశము నేల యనువదింపకుండెనో విమర్శకు లరిసెదరుగాక.

మఱియొక్క ఘట్టమునఁ గూడఁ బ్రవేశింతము. ధృతరాష్ట్రుని యాదేశమునఁ బాండవులు వారణావతమునకుఁ బోవునపుడు, వారి వెంటనంటి సాఁగఁబంపుచు "విదురుఁ డొరులు వినియు నెఱుంగరాని వచనంబుల బహుప్రకారచనరచనా విశారదుండైన యుధిష్ఠిరున కెల్ల కార్యంబులు గఱపెను." భట్టారకానువాదమున నా కార్యము లేవియో యెట్లో యెఱుగఁబడుట లేదు. అంతటఁ గుంతి ధర్మరాజును డాయవచ్చి యిట్లనియె—

గీ. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగఁ
గాని యట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి
నట్ల చేయుదు నంటి నీ వతనిమతము
సెప్పనగునేని యెఱుగంగఁ జెప్పుమయ్య.
(భార. ఆది. ౬ — ౧౭౭.)

వ. అనిన నగుచు ధర్మతనయుండు విదురువచనంబుల యభిప్రాయంబులు దల్లి కిట్లని చెప్పె.

ఆ. వె. ఎల్ల కార్యగతులు నెఱుఁగుదు రయినను
నెఱుఁగఁ జెప్పవలయు నెఱిఁగినంత
పనియు లేక మిమ్ముఁ బొపిన కురురాజు
హితుఁడపోలె మీఁద నెగ్గు సేయు.

వ. కావున మీర లేమఱక విషాగ్నులవలన నప్రమాదులరై బుద్ధిగలిగి యుండునది; యని కఱపి మఱియు దుర్యోధను చేసెడు దుష్క్రియ లిమ్మెగా నెఱింగి వానికిం బ్రతీకారము సెప్పి పుత్తెంచె ననియె, (భార. ఆది. ౬. ౧౭౬. ౧౭౩.)

విదురుఁడు, ధర్మరాజునకు మాత్రమే యెఱుఁగఁబడి, దగ్గర నున్న భీమాదులకు సైతమెఱుఁగకయుండెడి తెఱఁగున వారణావతమునకు ధృతరాష్ట్రుఁ డంపువిధమును, అక్కడి లాక్షాగృహనిర్మాణమును

దానివలనఁ గలుగనున్న యనర్థమును, దాని నుత్తరించు నుపాయములు మున్నగువానిని మ్లేచ్ఛభాషలో నుపన్యసించెను. ఆ శ్లోకము లీ క్రిందివి.

ఆలోహం నిశితం శస్త్రం శరీరపరికర్తనమ్
యో వేత్తిన తు తం ఘ్నన్తి ప్రతిఘాతవిదం ద్విషః.

లోకనిర్మితముగానిది తీక్ష్ణమైనది శరీరమును ఛేదించునదియునగు శస్త్రము నెవఁడెఱుఁగునో, శత్రువుచేయుదానికి బదులుగఁ జేయనెఱుఁగు నాతని నెవరును బాధింపఁజాలరు. ఇది సామాన్యముగ స్ఫురించునర్థము. ఇఁక మ్లేచ్ఛభాషావశమున వర్ణలోపము వర్ణాధిక్యము వర్ణవికారము మున్నగునవి యేర్పడుటచేఁ దెలినయర్థము తననిజస్వరూపమును గప్పిపుచ్చి యితరులకు హానిని గలుగఁజేయునదియు, అగ్నిసమూహము నెగయఁ జేయుద్రవ్యములతోఁ గూడినదియు, నగు నాగృహము రాత్రియందు మిమ్ములను గాల్చుటకు నిర్మింపఁబడినది. శత్రు వేర్పఱిచిన యీ హింసాపద్ధతిని దెలిసిన మిమ్ముల నాతఁడేమియుఁ జేయఁజాలఁడు.

కక్షఘ్నః శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలేశయః
న దహేదితిచాత్మానం యో రక్షతి సజీవతి.

పెద్దపొదలో కలుగునందున్న పాము చలిని వేడిని దూరము సేయుచు పొదతగులఁ బడినను నది చావదు. ఈరీతి నెఱిఁగ యెవఁడు తన్నుఁ దా రక్షించుకొనునో యాతఁడు జీవించును.

రెండవయర్థము— పార్శ్వమునఁ జరించువాఁడు పురోచనుఁడే ఆ యింటికి నిప్పు ముట్టించుట కేర్పడినవాఁడు. ప్రబలమైనశత్రు వేర్పడియున్నపుడు ప్రత్యక్షముగఁ బ్రతీకారము చేయరాదు. బిలములో పలఁ (సొరంగమున) బ్రవేశించినచోఁ బైన నిప్పంటుకొనినను తగులఁ

బెట్టఁబడక మిమ్ములను మీరు రక్షించుకొనఁగలరు. ఈరీతిగ మెలకువ గలిగియున్నపుడే జీవింతురు.

నాచక్షుర్వేత్తిపంథానం నాచక్షుర్విందతేదిశః
నాధృతిర్బుద్ధి మాప్నోతి బుధ్యస్వైవం ప్రబోధితః

కన్నులులేనివాఁడు మార్గము నెఱుఁగలేఁడు. సరిగాఁ జూడని వాఁడు దిక్కులని నెఱుఁగఁజాలఁడు. ధైర్యములేనివాఁడు సరిగ నాలోచింపలేఁడు. మేలుకనినవాఁడవై యిట్లెఱుఁగుము.

వివేకములేకున్న నాపత్సమయమున బయిటకుఁ బోవుటకు మార్గము తెలియదు. దిక్కులు గానరావు. ధైర్యములేకున్న సంపదయు చేఁబడదు. కావున నతివివేకముతో నప్రమత్తులరై యుండుఁడు.

అనాప్తైర్దత్తమాదత్తే నరశ్శస్త్ర మలోహమ్
శ్వావిచ్ఛరణ మాసాద్య ప్రముచ్యేత హుతాశనాత్.

మనుజుఁడు శత్రువులు నిర్మాణముచేసిన లోహరహితశస్త్రము యొక్క వాతఁబడును. ఏదుపంది నివసించెడిచోటువంటి చోటుకు (రెండువైపుల ముఖముగలిగిన బొరియను) ఆశ్రయించినచో శత్రు ప్రయోగమునుండి విడువఁబడును.

అనాప్తులయిన శత్రువులు అగ్నిని రగుల్కొల్పు ద్రవ్యములతో నిండిన గృహమును తయారుచేసియున్నారు. దానినప్పుడు మీరు స్వీకరింపవలయును. ఏదుపంది బొరియవంటి యుభయముతో ముఖమయిన సొరంగము నేర్పఱచుకొని, యందుండి యగ్నిప్రమాదము వలనఁ దప్పించుకొనవలయును.

చరన్మార్గాన్విజానాతి నక్షత్రైర్విందతేదిశః
ఆత్మనాచాత్మనః పంచపీడయ న్నానుపీడ్యతే.

ఎల్లపుడు తిరుగుచుండినచో మార్గములు తెలియును. నక్షత్రములనుబట్టి దిక్కులను దెలిసికొనవచ్చును. తన పంచేంద్రియములను

వశమునందుంచుకొనినచో నితరులచేఁ బీడింపఁబడఁడు. పగలంతయు నడవులందుఁ దిరిగి ఏమార్గ మెక్కడికిఁబోవునో యెఱుఁగవలయును. బిలములోఁ బ్రవేశించిన మీరంధకారమున నక్షత్రములనుఁబట్టి దిక్కుల నెఱుఁగవలయును. ఇంద్రియ నిగ్రహముగలిగి ధైర్యమువహించినచో శత్రువులు మిమ్మేమియుఁ జేయఁజాలరు. తిరిగి మీరాజ్యము మీకు లభించును.

ఏవము క్తః ప్రత్యువాచ కుంతీపుత్రో యుధిష్ఠిరః
విదురం విదుషాం శ్రేష్ఠం జ్ఞాత మిత్యేవ పాండవః

ఈరీతిగ విద్వాంసులలో శ్రేష్ఠుఁడయిన విదురుఁడు తెలిపినంతనే ధర్మరాజతనితో "తెలిసె" ననెను.

ఇంతటి యర్థవిశేషము గలిగి భావికార్యార్థమును సూచించు విషయమును వ్యాస భట్టారకుఁ డతినిగూఢముగ నెఱిఁగింప, నీలకంఠాదివ్యాఖ్యాతృమహోదయు లీయర్థమును దేటతెల్లముసేయ, భారత ఘట్టోల్లంఘనపటిష్ఠగాఢ ప్రతిభుఁడగు నన్నయభట్టారకుఁడు అనువదింపక వదలినాఁడు. శ్లేషప్రచురము మ్లేచ్ఛ వాగ్గుంభితమునగు నీఘట్టము తెనుఁగునకు దెచ్చుట యతిదుర్ఘటము కాని వచనరూపమునఁ గొంత వఱకైన నెఱిఁగించుట యత్యావశ్యకము. ఏమందురా? కొంతకాల మేఁగినపిమ్మట సొరంగమును ద్రవ్వుటకై విదురుఁ డంపినఖనకుఁడు, ధర్మరాజు తన్నుఁ గుర్తించి విశ్వసించుట కాన వాలుగ —

"కించిచ్ఛ విదురే ణోక్తో మ్లేచ్ఛవాచాసి పాండవ
త్వయాచ తత్తథేత్యుక్తమేత ద్విశ్వాసకారణమ్."

అని దెలిపినాఁడు. (ధర్మరాజా! విదురుఁడు నీకు మ్లేచ్ఛ భాషతోఁ గొంతవిషయమును దెలిపినాఁడు. ఆ విషయమున నీవును అట్లే యని సమాధాన మిచ్చియుంటివి. కావున నిది నన్ను విశ్వసించి నమ్ముటకుఁ దార్కాణము.)

ఈ విషయమునుగూడ ననువాదమున స్పష్టముసేయక సూచనామాత్రసారముగ నిట్లు తెలిసినాఁడు. "ఆట హాస్తిపురంబున విదురుండు దుర్యోధను దుర్మంత్రంబంతయు నిమ్ముగా నెఱింగి కడువిశ్వాసి నొక్కఖనకు నతికుశలుం బాండవులపాలికిం బుత్తెంచినవాఁడును వచ్చి రహస్యంబునఁ బాండవులఁ గనిఁ తన్ను నమ్మునట్లుగా సాభిజ్ఞాన వచనంబు లెఱింగించె." వెనుక నా శ్లోకముల కనువాదము లేకునికి నిచట నింతమాత్రమే తెలుపవలసివచ్చెను. ఇంతయగాదు. "అటఁ బాండవులును భాగీరథి లంఘించి" యని ఒక యధ్యాయమునందలి విషయ మర్ధవాక్యముతో ముగింపవలసివచ్చెను. ఈ యధ్యాయమునందును పై శ్లోకముల పరామర్శము గలదు.

ఏతస్మిన్నేవకాలేతు యథా సంప్రత్యయం కవిః
విదురః ప్రేషయామాస తద్వనం పురుషం శుచిమ్.
నగత్వాతు యథోద్దేశం పాండవాన్దదృశేవనే
జనవ్యాసహ కౌరవ్య మాపయాతాన్నదీజలమ్.
విదితం తన్మహాబుద్ధే ర్విదురస్య మహాత్మనః
తత స్తస్యాపి చారేణ చేష్టితం పాపచేతనః.
తతః ప్రవాసితో విద్వా న్విదురేణ వర స్తదా
పార్థానాం దర్శయామాస మనోమారుతగామినమ్.
సర్వవాతసహాంనావం య న్త యుక్తాం పతాకినీమ్
శివే భాగీరథీతీరే నరైర్విస్రంభిభిః కృతాన్.
తతః పునరథోవాచ జ్ఞాపకం పూర్వచోదితం
యుధిష్ఠిరవిబోధేచం సంజ్ఞార్థం వచనం కవేః.
కక్షఘ్న శ్శిశిరఘ్నశ్చ మహాకక్షే బిలౌకసః
నహన్తీత్యేవ మాత్మానం యోరక్షతి సజీవతి.
తేన మాం ప్రేషితం విద్ధి విశ్వస్తం ంజ్ఞయానయా.

పాండవులు సారంగమునంతను గడచి గంగానది యొడ్డునకుఁ జేరినసమయమునందే ఊహాపోహాకుశలుఁ డగువిదురుఁడు, ఆనవాలుతోఁ గూడఁగఁ బరిశుద్ధుఁడగు నొక పురుషుని పాండవులుచేరు వసమున కంపెను. ఆ పురుషుఁడును విదురుఁడు తెలిపినయడవిలో వారినిఁ గనెను. వారును దల్లితోఁగూడి యాసమయమున గంగాజలములందలి లోఁతును దెలిసికొనుచుండిరి. పాపమును జేయ సమకట్టిన దుర్యోధనుని చారుఁ డగుపురోచనుఁడు చేయనెంచిన దౌష్ట్యము విదురుఁ డెఱిఁగియుండుటచే నాచారునిఁ బంపెను. విదురునిచేఁ బ్రవాసితుఁడైన యానరుఁడు మనోవాయువేగములు గలదియు, జండాలతోఁ గూడినదియు, వలయు సాధనములతోఁ గూడినదియునగు నావను బాండవులకుఁ జూపించెను. ఆ నావయుఁ బవిత్రమైన భాగీరథీజలమున విశ్వాసపాత్రులైన మనుజులచే నమర్పఁబడియుండెను. తరువాత నా పురుషుఁడు పూర్వమం దెఱిఁగింపఁబడినది. జ్ఞాపకమున్నైన విదురుని వాక్యమును ధర్మరాజునకు గుర్తుతెచ్చుట కిట్లనెను. ధర్మరాజా! నేఁ జెప్పునది వినుము. "కక్షఘ్నశ్చ" ఇత్యాదిశ్లోకముల నీ కెవ్వఁడు చెప్పెనో నన్నాతఁడు పంపినట్లు తెలిసికొనుము. ఈ యానవాలుచే నన్ను విశ్వసింపఁ దగినవానిఁగా నెఱుఁగుము.

శ్లోకరూపమయిన యీ యానవాలు ధర్మరాజునకు విదురునకుఁగాక యొరులకుఁ దెలియదు కావున ధర్మరాజున కాపురుషుని నమ్మి యా నావపై నెక్కి ప్రచ్ఛన్నముగ గంగానది దాఁటుట యేర్పడినది.

ఇట్టి యంశము లింకను నెన్నియో సంస్కృత భారతమున నున్నవి భట్టారకుని యనువాదమునఁ బ్రవేశింపలేదు. ప్రధానయంశములు లేకుండుట కొఱఁత యనక తప్పదు. నాఁటి యా మహనీయుల

యాశయము లేమయియుండునో యీనాఁడు మన మూహించుటయు కడునశక్యము. ఏమయినను భారతమును నాంధ్రమున నవతరింపఁజేసిన యీ మహనీయుల కవితావైభవ మద్వితీయము.

ఆంధ్రభారత పాఠకులకు సాంజలి బంధముగ నొక్క విజ్ఞప్తి. మహనీయులార ! నన్నయభట్టారకుని భారతమును బఠించుతఱి వ్యాస భట్టారకుని భారతమును గూడ జోడించి చదివి, సంపూర్ణమైన విజ్ఞాన మునంది కృతార్థులగుదురు గాక.



# భారతాంధ్రీకరణము-నన్నయ

ఆచార్య శలాక రఘునాథశర్మ

కవిత్రయం వారి భారతాన్ని అనువాదం, ఆంధ్రీకరణం అని వ్యవహరించటం సముచితం కాదు. తెలుగులో భారతావిర్భావానికి ప్రేరకుడైన రాజరాజనరేంద్రుడు మహాభావుకుడు. అతనికి వేదవ్యాస భారతం నిలువెల్లా అణువణువునా పట్టుకొన్నది. అంటే అతడు తన కోసం భారతం తెలుగులో రావాలని అనుకోలేదు. తెలుగు జాతికి దానిని శాశ్వత ధనంగా చేయాలన్న తపనతో ఆ మహితాత్ముడు భారత రచనకు ప్రేరకుడైనాడు. ఆయన నన్నయ్యగారితో—

"జననుత కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్"

అన్నమాట పరమసుకుమార హృదయుడైన నన్నయ్యగారి ప్రాణాన్ని పట్టి పల్లార్చింది. రాజుల హృదయాలు మహా గంభీరంగా ఉంటాయి. వారి మాటలు గోరంతలుగా ఉన్నా అందులో అర్థాలు కొండంతలుగా ఉంటాయి. భావగ్రాహి అయిన నన్నయకు భారతం తెలుగులో రచించటం కత్తి మీద సాము అయింది. పై పద్యం ఆయన మానస వీథిలో అనుక్షణం అప్రమత్తతను హెచ్చరించే కశా స్వరూపంగా రూపొందింది. అయితే ఈ మెలకువ రాజ్య నిర్వహణలోని ధార్మికతనే వ్యంజిస్తుంది గాని భీతిని కాదు. మహాకావ్యరచనకు సర్వసాధనాలు సమగ్రంగా ఉన్నా నన్నయ రచన తుదిముట్టకపోవటానికి ఈ ధర్మభీతే కారణమని నా ఊహ. ఇంతకూ ప్రధానంగా చెప్పవచ్చినదేమంటే నన్నయది పునారచన అనాలి గాని అనువాదం.

ఆంధ్రీకరణం అనిగాదు. ఈ మాత్రానికే అయితే అవిరళ జప హోమ తత్పరుడూ, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడూ, లోకజ్ఞుడూ అయిన భట్టారకుడు కావాలా? అతనికి భారత ఘోరరణంలో నరునకు నారాయణునిలాగా వాఙ్మయ దురంధరుడైన నారాయణభట్టు తోడై నిర్వహించాలా? భట్టారకుడు భారత పీఠికలో చెప్పిన అనేక విషయాలను మనం జాగ్రత్తగా పరిశీలిస్తే వ్యాసభగవానుడంటే, శ్రీ మహాభారతమంటే ఆయన గుండెలో ఉన్న గురుభావనకు అవధులు లేవనిపిస్తుంది. అట్టి కృష్ణద్వైపాయనుడేమి చెప్పాడో దానిని చిలక-పలుకుల్లా చెప్పటం కాదు. తన రాజు అభిలషించింది, మహాభారత బద్ధ నిరూపితార్థం ఏర్పడే విధంగా చెప్పాలి. అందులోనూ శ్రీ వ్యాసుడిది ఆర్ష వాణి. దానిని తెనుగున రచించాలి. దానికి అధిక ధీయుక్తి కావాలి. నిజంగా ఇది అసిధారావ్రతం.

నన్నయ విపుల శబ్ద శాసనుడు. శబ్దశాసనమంటే ఈ సన్ని వేశాన్ని బట్టి సముచిత శబ్ద ప్రయోగరక్షక అని భావించాలి. అతి సమర్థుడైన ప్రభువనిన పాల్యవర్గం భక్తి శ్రద్ధలతో విధేయులై ఉన్నట్లుగా అతనికి సర్వశబ్దాలు తమ్ము తాము సర్వాత్మనా అర్పణ చేసుకున్నవని తాత్పర్యం. పాండవ భార్యలలో ఒక్క ద్రౌపదినే పత్నిగా వ్యవహరించటం మొదలైనవి. ఇందుకు దృష్టాంతాలు. తెలుగు కవులలో శబ్దశక్తిని సమగ్రంగా ఎఱిగినవారిలో నన్నయకి సర్వోత్తమ స్థానం.

అవధులు లేని ప్రతిభా వ్యుత్పత్తులు, అమోఘమైన రాజాజ్ఞ, అపారమైన శబ్దశక్తి-ఈ మూడింటి సంపదతో నన్నయ భట్టారకుడు తెనుగున రచించిన ఆంధ్రమహాభారతం ప్రమాణంలో చిన్నదైనా ప్రాభవంలో చాలా మిన్నగా ప్రకాశిస్తూన్నది.

నన్నయ రచనలో అపార మధురత్వ, ఆలోచనామృతత్వ లక్షణాలు రెండూ చక్కని పాకంలో మేళవించి ఉన్నాయి. ఆయన

రచనలోని అక్షరరమ్యత ప్రతి పాఠకుడు చవి చూడగలడే. ఒకసారి ఆ రుచి మరిగిన వానికి దానికి వదలి ఉండలేని స్థితి కలుగుతుందనడానికి సందేహించనవసరం లేదు.

ఇక ఆలోచనామృతత్వ లక్షణాన్ని నిరూపించడానికి మూడు మెతుకులు పట్టి చూపుతాను.

కలహమున నిట్లు సురవీ
రుల నెల్లర నోర్చి యొక్కరుఁడ యమృతముఁ జే
క్కొని కొని యాస్వాదింపక
యలోలుఁడగు వానిఁజూచి హరి యిట్లనియెన్.

ఇది ఆదిపర్వంలోని గరుత్మదుపాఖ్యానంలోని పద్యం.

గరుత్మంతునికి విష్ణువు సాక్షాత్కరించి వరం కోరుకొమ్మన్నాడు. గరుత్మంతుడు విష్ణు దర్శనము అపేక్షించాడా? అపేక్షించినంతమాత్రాన అందరికీ ప్రత్యక్ష మవుతున్నాడా? ఎంత తపస్సు? ఎన్ని పరీక్షలు? పరిస్థితి యిట్లుండగా హరి గరునికి అయాచితంగా ఏల సాక్షాత్కరించాడు. ఎందుకు వరమిస్తున్నాడు? - ఆలోచించి పాఠకునకు ఇక్కడ ఇన్ని ప్రశ్నలు పుట్టే అవకాశం ఉన్నది. ఉత్తమ కవి ఉత్తమ పాఠకునకు పుట్టే ఉత్తమ ప్రశ్నల నన్నింటినీ ముందే ఉద్భావించి ఉచితమైన రీతిలో సమాధానాలు స్ఫురించే విధంగా రచన సాగిస్తాడు. పై ప్రశ్నలన్నింటికీ ఈ చిన్న పద్యం చక్కని సమాధానాలు చెబుతుంది. ఎందరో ఋషులు ఎన్నో విధాల తపించి కూడా కైవల్యం విడనాడ లేకపోయారు. కాని గరుత్మంతుడు అలోలుడై నిలువగలిగాడు. అల్ప విషయాలలో అలోలతను కొందరు ప్రదర్శింపవచ్చు. ప్రకృత విషయం అట్టిది గాదు. దేవతలు దేవాదిదేవుని శక్తియుక్తుల సాయంతో అపురూపంగా సాధించి భద్రపరచుకొన్న పదార్థం అమృతం. పైగా వారు రాక్షసులను వంచించి అమృతాన్ని చేజిక్కించుకొన్నారు.

గరుడుడు కలహంలో సురవీరుల నందరినీ ఒక్కడై ఓడించి దానిని స్వాయత్తం చేసుకొన్నాడు. ఆ విధంగా దాని మీద సర్వాధికారాలు పొంది కూడా అంత మహా పదార్థాన్ని ఆస్వాదింపలేదంటే అతని ఎడద విషయాభిముఖంగా ఎంత పటిష్ఠమైన వైరాగ్యం పొందిందో ఊహించాలి. ఇతర వ్యక్తులకు పరమ దుస్సాధ్యమైన ఆ అలోలత్వం ఇతనికి గుణసిద్ధమై కూర్చుంది. అంటే అతని గుండె నారాయణుడు ఆ అలోలత్వం ఇతనికి గుణసిద్ధమై కూర్చుంది. అంటే అతని గుండె నారాయణుడు నివసించటానికి సర్వాంగీణంగా సిద్ధంగా ఉన్న గుడి అయిందని తాత్పర్యం. కలహమున, ఇట్లు - సుర-వీరుల, ఎల్లరన్, ఒక్కరుం, ఓర్చి' అనే ఒక్కొక్క పదం సర్వదేవతా సముదాయం కంటె గరుత్మంతుడు అధిరోహించిన మహోన్నత శిఖరాల మహిమను వక్కాణిస్తున్నాయి. పై చూపుకు ఇందులో ఏముందిలే అనుకోదగిన ఈ పద్యంలో ఇంత గాంభీర్యం ఉంది. ఆ గాంభీర్యం అంతు చిక్కితే ఆనంద వీథీ విహారం. చిక్కకపోతే అదొక వార్తగా భావించే అజ్ఞాన వీథీ విహారం.

యయాతి "అతిశయ రూప లావణ్య విభ్రమ గుణసుందరియైన శర్మిష్ఠ నెఱుంగ వేడి" దేవయానిని చూచి అందర కులగోత్ర నామంబు లడిగాడట. దేవయాని అసాధ్యురాలు. అఖండ ప్రజ్ఞానిధి. శర్మిష్ఠ వాదాడి నూతిలోనికి తోస్తే యయాతి వచ్చి ఎందుకు నూతిలో ఉన్నావని అడిగినపుడు "ప్రమాదవశంబున నిన్నూతం బడినదాన" నని దేవయానికి కాక ఇంక ఎవరికైనా చెప్పటం సాధ్యమా? మరొక వ్యక్తి అయితే గుండెలో ఉన్న కసినంతా వెళ్ళగక్కి ఉండేది. దేవయాని శర్మిష్ఠను గూర్చి యిక్కడ పల్లెత్తు మాట అనలేదు. అంటే తన భవిష్యత్తుకు ముప్పు వస్తుందని ఆమె సుదూరంగా ఆలోచించింది. కసినంతా వెళ్ళగక్కటానికి మాత్రమే కాక శర్మిష్ఠా

యయాతుల ఉభయ నిష్ఠ అనురాగ స్రవంతికి, తన ప్రయోజనం దృష్టితో, అడ్డుకట్ట వేయటానికి కూడా పనికి వచ్చేవిధంగా

నన్ను మున్న యెఱుంగు, దిన్నాతి నాకు
దాసి; వృష పర్వుఁడను మహాదానవేంద్రు
కన్య నాయొద్ద నెప్పుఁడు కదలకుండు
ననఘ; మఱి దీని శర్మిష్ఠ యండ్రు జనులు.

అని బదులు పలికింది. రాజేమడిగాడు! తానేమి చెప్పింది? ఇందులో అందరి సంగతి ఏది? కులమేది? గోత్రమేది? ప్రశ్నకు సమాధానం చెప్పినట్లు? చెప్పనట్లా? వాతలు పెడుతున్నది యయాతికా? శర్మిష్ఠకా? "నన్ను మున్న యెఱుంగుదు" అనటంలో శర్మిష్ఠ కుదు గారిపోవాలి. 'ఇన్నాతి నాకు దాసి' అనటంచేత రాజు స్త్రీయు రాలు ఇద్దరూ దెబ్బతినాలి. "వృషపర్వుడను మహాదానవేంద్ర కన్య" అనటం వలన మహారాక్షస చక్రవర్తి బిడ్డను దాసిగా చేసుకొన్న నన్ను గూర్చి ఆలోచించవేం? అన్న పోటు రాజు హృదయానికి తగలాలి. "నాయొద్ద నెప్పుడు గదలకుండ" అనే మాటలో ఏమరించి తీసుకొని పోవచ్చు ననుకుంటావేమో? ఆ పప్పులేం ఉడకవు అనే తర్జన స్ఫురించాలి. 'అనను' అధిక్షేపణ. అహాహా! ఎంత పుణ్యాత్మురాలవయ్యా! అన్నట్లు మఱి దీని శర్మిష్ఠ యండ్రుజనులు"- అని అతి కష్టం మీద పేరు చెప్పింది. ఆ చెప్పటంలో ఎంత వాడితనం; మఱి అనే పదం చెప్పటానికి ఇష్టంలేనితనాన్ని ఎంతచక్కగా వ్యంజిస్తున్నది. "జనులు అండ్రు" అంటేఉద్దేశం ఏమిటి? తల్లిదండ్రులు ఆ పేరు పెట్టలేదని తాత్పర్యము కాదు. ఆమెను పిలయినంత ఆకర్షింపజేసుకోవాలి. పాత పొగకు కొన్ని పుడకలువేసి ఉపశమనం పొందాలి. ఈ చిన్న పద్యంలో కథ మొత్తంలో పరచుకొని ఉన్న దేవయానీ ప్రవృత్తికి సంబంధించిన ఆంతర్యాన్ని ఎంతగా కుదించి నిక్షేపించాడో భావించినపుడు నన్నయ లోతులు మనకు స్ఫురిస్తాయి. ఆయన స్వయంగా చెప్పనే చెప్పాడు

కదా. కవీంద్రులు సారమతితో లోనారసి మేలనవలసిన గాంభీర్యం తన కవిత్వంలో ఉందని.

నాకు నన్నయ భారతంలో ప్రియాతి ప్రియమైన ఘట్టం ఒకటున్నది. పూర్వం ఒకటి రెండుచోట్ల దానిని గురించి ప్రస్తావించి ఉన్నా. ఈ రసవత్సభలో ఆ ప్రస్తావన చేయకుండా ఉండలేను. శంతను మహారాజు సత్యవతిని కామించాడు. దాశరాజును అడిగాడు. అతడు మహారాజును మన్నిస్తూనే అసాధ్యమైన వరం అడిగాడు వీలులేదు. ఇవ్వకపోతే అభీష్టం నెరవేరదు. ఈ గుంజాటనతో రాజ కార్యాలు మానివేసి శంతనుడు చింతాక్రాంతుడై ఏకాంతవాసం చేస్తున్నాడు.

నేడో రేపో రాజ్యభారం, గృహస్థధర్మం స్వీకరించవలసిన స్థితితో ఉన్న దేవవ్రతుడు పరిస్థితులన్నీ సాకల్యంగా ఆకళింపు చేసుకొని తండ్రి దగ్గరకు వచ్చి నెరపవలసిన మర్యాదలన్నీ మనఃపూర్వకంగా నెరపి ఇలా ప్రశ్నించాడు.

"భవదభిరక్షితక్షితికి బాధ యొనర్పఁగ నోపునట్టి శా
త్రవ నివహంబు లేదు, వసుధా ప్రజకెల్ల ననంత సంతతో
త్సవములు, రాజులెల్ల ననిశంబు విధేయుల నీకు, నిట్లు మా
నవ వృషభేంద్ర! మేలుకొ మనః పరితాపముఁ బొంది యుండఁగన్"

పద్యము చంపకమాల. అంటే పద్యము తండ్రిపై భక్తితో కుసుమార్చన చేయుటనికే వినియుక్తమయినట్లున్నది! కాని ఈ రెండును రాజులందు విపరీతము" అన్నట్లు పైకి సువాసనలు గుబాళిస్తూనే లోపల మర్మఘాతము చేసేవాడి కత్తిలా ఉంది. పాలకుడు ఎందుకు ఎప్పుడు ఎలా ఏడవాలో వ్యంగ్యంగా ఎత్తిచూపినట్లయింది. ఉత్తమ క్షత్రియుడు పాలక ధర్మంలో ఉన్నవాడు స్వార్థాన్ని సర్వవిధాలా ప్రక్కన పెట్టి ప్రజా సౌఖ్యాన్ని మాత్రమే అపేక్షించాలయ్యా!

లే! లే! ఈ ఏడుపేమిటి? అని కశాఘాతంతో లేపి తట్టుకున్నట్లున్నది ఈ పద్యం. అందులో అడిగేవాడు కొడుకు. వయసు వచ్చినవాడు. తానై పూనుకొని పెండ్లి చేసి, రాజ్యమిచ్చి ఉపలాలించవలసిన స్థితిలో ఉన్నవాడు. తానో వయసు మళ్ళినవాడు. సంతానవంతుడు. వాన ప్రస్థానానికి పోవలసిన దశలో ఉన్నవాడు. ఏమని చెప్పాలి? ఎలా చెప్పాలి. ఒరే అబ్బి అక్కడ ఒక అందగత్తెను చూచానురా! మనసు పడ్డాను. వాళ్ళేవో నియమాలు పెట్టారు. ఎలాగా అని ఆలోచిస్తున్నాను. పెళ్ళి చేసుకుంటానురా. అని సిగ్గువిడిచి కొడుకుతో చెప్పాలి. మానాభి మానాలు ఉన్నవాడెవడూ ఇలా చెప్పలేడు. పితృభక్తితో ఆయన దుఃఖ మేమిటో తెలుసుకొని ఏ త్యాగమైనాచేసి దృఢనిశ్చయంతో ఉన్న కొడుకు చేతులు కట్టుకొని నిలబడి ఉన్నాడు. ఏదో సమాధానం చెబితే కాని కదిలే సూచనలు కనబడటంలేదు. శంతనుడి గుండె ఎంత ఇరకా టంలోపడి ఎలా గిలగిలా కొట్టుకొంటున్నదో మనం గ్రహించాలే తప్ప అది మాటలలో చెప్పతగినది కాదు. ఈ స్థితినంతా నన్నయ భట్టారకుడు ఒక వాక్యభాగంలో స్ఫురింప చేస్తున్నాడు. "అని విని పెద్దయుం బ్రొద్దు చింతించి" కథా నిర్మాణంలో ఈ మాట ఆయువుపట్టు. దీని మీద దృష్టి కేంద్రీకరించి చూస్తే కథారహస్యమంతా చక్కగా సాక్షాత్కరిస్తుంది. పెద్దయుం బ్రొద్దు చింతించి అతికష్టం మీద చెప్పిన సమాధానాన్ని నన్నయ మూడు కంద పద్యాలలో ఒక చిన్న వచన భాగంలో నిబంధించాడు. అవ్యవస్థితమైన మనస్సు ఔచిత్యాన్ని ఔగాములను అవాచ్యాలను పట్టించుకోరు కాబోలు. శంతను డెంతమాట అన్నాడో చూడండి.

"వినవయ్యా ఏకపుత్రుండు
ననపత్యుండు నొక్క రూపయని ధర్మవులన్
విని నీకు తోడు పుత్రుల
ననఘా! పడయంగ నిష్టమైనది నాకున్."

"జన వినుత యగ్ని హోత్రం
బును సంతానమును వేదములు నెడ తెగఁగా
జన నుత్తమ వంశజులకు
ననిరి, మహాధర్మ నిపుణులైన మునీంద్రుల్"

"నీ వస్త్ర శస్త్ర విద్యా
కోవిదుఁడవు రణములందుఁ గ్రూరుఁడ వరి వి
ద్రావణ సాహసి కుండవు
కావున నీ యునికి నమ్మఁగా నోప నెడన్"

కావున బహు పుత్రార్థంబు యత్నంబు సేయవలయు, వివాహ మయ్యెద' నన్నాడు. ధర్మ ప్రసంగం తెచ్చిన కొడుకును ధర్మప్రసంగం తోనే ఎదుర్కొన్నాడు. అసలే మన్మథ మార్గణాలు తూట్లుతూట్లుగా కొట్టిన గుండెకు కొడుకు చూపిన ఆక్షేపణ దుస్సహమైంది. అట్టి గుండెలో నుండి వచ్చే మాటలధోరణి ఎలా ఉంటుందనటానికి ఇంత కంటె పదునైన ఉదాహరణలు చూపటం సాధ్యం కాదు.

నన్నయ భట్టారకుని రచనలోని గాంభీర్యం ఎంతటిదో మాట కున్న నైశిత్యం ఏ స్థాయికి చెందిందో, ఒకటి రెండు సూడిమాటలు ఆయా వ్యక్తుల స్వరూప స్వభావాలనన్నింటినీ ఎలా సాక్షాత్కరింప జేస్తాయో వివరించటానికి స్థాలీ పులాక న్యాయంగా ఈ మూడు ఘట్టాలు ఎన్నుకొన్నాను.

రసహృదయ కాసారాలలో విశృంఖల విహారం చెయ్యటానికి అవకాశం కల్పించిన విజయవాటికా భువనవిజయ సాహితీ సంస్థవారి సౌజన్యాన్ని హృదయంలో పదిలపరచుకుంటాను.

ఇతి శ [illegible]

